भोक्ता भोजयिता जेता जितारिर्जितमानसः ।
अक्षरः कारणं क्रुद्धसमरः शारदप्लवः ॥१२७॥

आज्ञापकेच्छो गम्भीरः कविर्दुःस्वप्ननाशकः ।
पञ्चब्रह्मसमुत्पत्तिः क्षेत्रज्ञः क्षेत्रपालकः ॥१२८॥

व्योमकेशो भीमवेषो गौरीपतिरनामयः ।
भवाब्धितरणोपायो भगवान् भक्तवत्सलः ॥१२९॥



वरो वरिष्ठो नेदिष्ठः प्रियः प्रियदवः सुधीः ।
यन्ता यविष्ठः क्षोदिष्ठः स्थविष्ठो यमशासकः॥१३०॥

हिरण्यगर्भो हेमांगो हेमरूपो हिरण्यदः ।
ब्रह्मज्योतिरनावेक्ष्यश्चामुण्डाजनको रविः ॥१३१॥

मोक्षार्थिजनसंसेव्यो मोक्षदो मोक्षनायकः ।
महाश्मशाननिलयो वेदाश्वो भूरथः स्थिरः ॥१३२॥

मृगव्याधो चर्मधामा प्रच्छन्नः स्फटिकप्रभः ।
सर्वज्ञः परमार्थात्मा ब्रह्मानन्दाश्रयो विभुः ॥१३३॥

महेश्वरो महादेवः परब्रह्म सदाशिवः ॥१३४॥

**। श्री परब्रह्म सदाशिव ॐ नम इति ।**

---

# రుద్రపఞ్చముఖధ్యానమ్

మం. **తత్పురుషాయ విద్మహే మహాదేవాయ ధీమహి । తన్నో రుద్రః ప్రచోదయాత్ ॥**

(తై.ఆ. 10 ప్ర. 43-44 అను.)

తత్పురుషాయ = తత్పురుషం = తూర్పు దిశయందుండు శివపరమాత్మని; విద్మహే = (గురువులనుండియు సంప్రదాయమువలనను) తెలిసికొందుము; మహాదేవాయ = (అట్టి) మహాదేవుని; ధీమహి = ధ్యానింతుము; తత్ = ఆహేతువువలననే; రుద్రః = ఆ ఈ మహాదేవరుద్రుడు; నః = మమ్ములను; ప్రచోదయాత్ = (తన్ను తెలిసికొనుట - ధ్యానించుట మొదలగువాని విషయమున) ప్రేరేపించుగాక!

శ్లో॥ సంపర్తాగ్నితటిత్ప్రదీప్తకనక - ప్రస్పర్థితేజోమయం
గమ్భీరధ్వనిమిశ్రితోగ్రదహన - ప్రోద్భాసితామ్రాధరమ్ ।
అర్ధేన్దుద్యుతిలోలపిఙ్గలజటా - భారప్రబద్ధోరగం
వన్దే సిద్ధసురాసురేన్ద్రనమితం - పూర్వం ముఖం శూలినః ॥

**ఓం అం - కం ఖం గం ఘం ఙం - ఆం ఓం - ఓం నమో భగవతే రుద్రాయ; ఓం నం; పూర్వముఖాయ నమః ॥1॥**






ఋగ్వేదం 4-58-3

## చత్వారి శృంగాః

**చత్వారి శృంగా త్రయో అస్య పాదా**
**ద్వే శీర్షే సప్త హస్తాసో అస్య ।**
**త్రిధా బద్ధో వృషభో రోరవీతి**
**మహో దేవో మర్త్యాగ్ం ఆ వివేశ ॥**

ఈ మంత్రములోఁ బరమేశ్వరుఁడు వృషభ (ఆఁబోతు) రూపముగా వర్ణింపఁబడినాఁడు.

అస్య = ఆ వృషభమునకు; చత్వారి = నాలుగు; శృంగాః = కొమ్ములు (గలవు); త్రయః = మూఁడు; పాదాః = పాదములు (కాళ్ళు) (గలవు); ద్వే = రెండు; శీర్షే = తలలు (గలవు); అస్య = దానికి; సప్త = ఏడు; హస్తాసః = చేతులు (గలవు) ఆ వృషభము; త్రిధా = మూఁడు విధములుగా; బద్ధః = బంధింపఁబడినదై; రోరవీతి = పెద్దగా మాటిమాటికి ఱంకెలు వేయుచున్నది. మహః = తేజఃస్వరూపుఁడైన; దేవః = ఆ దేవుఁడు; మర్త్యాన్ = మనుష్యులను; ఆవివేశ = ఆవేశించెను. అని దీని ప్రతిపదార్థము.

దీనిలోఁ బరమేశ్వర స్వరూపము వర్ణింపఁబడినది. ఈ మంత్రము నకు వివిధ శాస్త్రకారు లనేకవిధములుగా నర్థము చెప్పి తమ తమ శాస్త్రముల కన్వయించుకొనిరి.

దీనికి **సాయణభాష్యము –**

యద్యపి సూక్తస్యాగ్నిసూర్యాదిపంచదేవతాకత్వాత్ పంచధాయమ్ మంత్రో వ్యాఖ్యేయః; తథాపి నిరుక్తాద్యుక్తనీత్యా యజ్ఞాత్మకాగ్నేః సూర్యస్య చ ప్రకాశకత్వేన తత్పరతయా వ్యాఖ్యాయతే। అస్య యజ్ఞాత్మకస్యాగ్నేః చత్వారి శృంగా చత్వారో వేదాః శృంగస్థానీయాః। యద్యప్యాపస్తంబేన యజ్ఞం వ్యాఖ్యాస్యామః స త్రిభి ర్వేదై ర్విధీయతే (పరిభాషా-1-3) ఇత్యుక్తం తథాప్యాథర్వణస్య ఇతరానపేక్షయైవ ఏకాగ్ని సాధ్యానాం కృత్స్నకర్మణా మభిధాయకత్వాత్ తదపేక్షయా చత్వారి శృంగేత్యుక్తమ్। త్రయో అస్య పాదాః సవనాని త్రీణ్యస్య పాదాః। ప్రవృత్తిసాధనత్వాత్ పాదా ఇత్యుచ్యంతే। ద్వే శీర్షే బ్రహ్మౌదనమ్ ప్రవర్గ్యశ్చ ఇష్టిసోమప్రాధాన్యేనేదముక్తమ్। సప్త హస్తాసః సప్త ఛందాంసి హస్తా అనుష్ఠానస్య ముఖ్యసాధనమ్। ఛందాంస్యపి దేవతాప్రీణనస్య ముఖ్యసాధనమితి హస్తవ్యవహారః। త్రిధా బద్ధః – మంత్రకల్పబ్రాహ్మణైః త్రిప్రకారమ్ బద్ధః। బంధనమస్య తన్నిష్పాద్యత్వమ్। వృషభః ఫలానాం వర్షితా రోరవీతి భృశం శబ్దాయతే। ఋగ్యజుస్సామోక్తైః శస్త్రయాగస్తుతిరూపైః హోత్రాద్యుత్పాదితైః ధ్వనిభిః అసౌ రౌతి ఏవమ్ మహో దేవో మర్త్యానావివేశ మర్త్యైః యజమానైః నిష్పాద్యత్వాత్ ప్రవేశ ఉపచర్యతే। అత్ర యాస్క శ్చత్వారి శృంగేతి వేదా వా ఏత ఉక్తాః (నిరు-13-7) ఇత్యాదినా నిరవోచత్ తదత్రానుసంధేయమ్ అథ సూర్యపక్షే వ్యాఖ్యాయతే। అస్యాదిత్యస్య చత్వారి శృంగాణి చతస్రో దిశః ఏతాః శ్రయణార్థత్వాత్ శృంగాణీ-త్యుపచర్యంతే। త్రయో అస్య పాదాః। త్రయో వేదాః పాదస్థానీయా భవంతి। గమనసాధనత్వాత్। తథాహి ఋగ్భిః పూర్వాహ్ణే దివి దేవ ఈయత ఇత్యుపక్రమ్య **'వేదైరశూన్యస్త్రిభిరేతి సూర్యః'** (తై.బ్ర.3-12-9-1) ఇతి హి వేదత్రయేణ గతిరామ్నాతా ద్వే శీర్షే అహశ్చ రాత్రిశ్చేతి ద్వే శిరసీ సప్త హస్తాసో అస్య। సప్తరశ్మయః షడ్విలక్షణా ఋతవః ఏకః సాధారణ ఇతి వా సప్తహస్తా భవంతి। త్రిధా బద్ధః త్రిషు స్థానేషు క్షిత్యాదిషు అగ్న్యాద్యాత్మకత్వేన సంబద్ధః। గ్రీష్మ – వర్షా – హేమంతాఖ్యైః త్రిభిః త్రేధా బద్ధో వా। వృషభో వర్షితా రోరవీతి శబ్దం కరోతి వృష్ట్యాదిద్వారా స మహో మహాన్ దేవో మర్త్యాన్ ఆవివేశ తన్నియంతృతయా।

**సూర్య ఆత్మా జగతస్తస్థుషశ్చ** (ఋ.వే. 1-115-1) ఇతి హి శ్రుతమ్। ఏవం త్వబాది పక్షేఽపి యోజ్యమ్। శాబ్దికాస్తు శబ్దబ్రహ్మపరతయా చత్వారి శృంగేతి చత్వారి పదజాతాని నామాఖ్యాతే చోపసర్గనిపాతాశ్చేత్యాదినా వ్యాచక్షతే అపరే త్వపరథా। తత్ సర్వమత్ర ద్రష్టవ్యమ్॥

ఇక్కడ సాయణాచార్యులు పంచదేవతల పరముగా నీ మంత్రమునకు 5 అర్థములున్న వని చెప్పి (1) అగ్నిపరముగా (2) సూర్యపరముగా రెండర్థములు చెప్పినారు.

**అగ్నిపర మగు నర్థము :**

యజ్ఞాత్మకుఁడగు నగ్నికి 4 వేదములు 4 కొమ్ములు; 3 సవనములు 3 పాదములు; (1) బ్రహ్మౌదనము (2) ప్రవర్గ్యము 2 తలలు; 7 ఛందస్సులు 7 హస్తములు; (1) మంత్రము (2) కల్పము (3) బ్రాహ్మణము నను మూఁడింటిచే బద్ధుఁడైనాఁడు, యజమానులకు ఫలములు వర్షించుటచే నగ్నిదేవుఁడే వృషభుఁడు. యాస్కమహర్షి నిరుక్తములో **యజ్ఞపరముగా** నీ యర్థమునే చెప్పినాఁడు.

**సూర్యపర మగు నర్థము :**

సూర్యునకు 4 దిక్కులు 4 కొమ్ములు; 3 వేదములు - ఋగ్యజుస్సామములు 3 పాదములు; (1) పగలు (2) రాత్రి రెండు తలలు; సప్త కిరణములు 7 చేతులు; 6 ఋతువులలో 6 కిరణములు 6 విధములుగా నుండును. ఏడవ కిరణ మన్ని ఋతువులందు నొకే విధముగా నుండును. (1) గ్రీష్మఋతువు (2) వర్షఋతువు (3) హేమంత ఋతువు అను మూఁడింటిచే బద్ధుఁడైనాఁడు. వర్షములు కురియుటకు సూర్యుఁడే హేతు వగుటచే సూర్యభగవానుఁడే వృషభుఁడు.

**వ్యాకరణపర మగు నర్థము :**

పతంజలిమహర్షి వ్యాకరణమహాభాష్యములో నీ మంత్రమునకే వ్యాకరణపరముగా నర్థము చెప్పినాఁడు.

చత్వారి శృంగాణి - పదజాతాని, నామాఖ్యాతోపసర్గనిపాతశ్చ। త్రయో అస్య పాదాః - త్రయః కాలాః, భూతభవిష్యద్వర్తమానాః। ద్వే శీర్షే - ద్వౌ శబ్దాత్మనౌ నిత్యః కార్యశ్చ। సప్త హస్తాసో అస్య- సప్త విభక్తయః। త్రిధా బద్ధః త్రిషు స్థానేషు బద్ధః - ఉరసి, కంఠే శిరసీతి వృషభో వర్షణాత్। రోరవీతి - శబ్దం కరోతి కుత ఏతత్? రౌతిః శబ్దకర్మాన్ మహో దేవో మర్త్యాం ఆవివేశేతి మహాన్ దేవః శబ్దః మర్త్యాః - మరణధర్మాణో మనుష్యాః। తానావివేశ మహతా దేవేన నః సామ్యం యథా స్యాదిత్యధ్యేయం వ్యాకరణమ్॥

శబ్దబ్రహ్మమే మహాదేవుఁడు. పదజాతములు = పరా - పశ్యంతీ - మధ్యమా - వైఖరీ రూపములు. ఈ శబ్దదేవునకు - (1) నామము (2) అఖ్యాతము (3) ఉపసర్గము (4) నిపాతము ననునవి 4 కొమ్ములు. (1) భూతము (2) భవిష్యత్తు (3) వర్తమానము నను 3 కాలములు 3 పాదములు. (1) నిత్యశబ్దము (2) కార్యశబ్దము రెండు తలలు. 7 విభక్తులు 7 చేతులు. (1) ఉరఃస్థానము (2) కంఠస్థానము (3) శిరఃస్థానము ఈ మూఁడింటిచే బద్ధుఁడైనాఁడు. ఈ మూఁడు స్థానముల నుండియే శబ్దము పుట్టుచున్నది. జ్ఞాన పూర్వకమగు కర్మానుష్ఠానముచే ఫలమును వర్షించుటచే శబ్దమే వృషభము. శబ్దజ్ఞానము వ్యాకరణశాస్త్రాధీనము.

**యజ్ఞపరమగు నర్థము :**

భట్టభాస్కరుఁడీ మంత్రమున కిట్లర్థము చెప్పినాఁడు. యజ్ఞపురుషునకు (1) అధ్వర్యుఁడు

(2) హోత (3) ఉద్గాత (4) బ్రహ్మ - 4 కొమ్ములు. (1) గార్హపత్యము (2) ఆహవనీయము (3) అన్వాహార్యపచనము - 3 పాదములు. (1) ప్రాయణీయము (2) ఉదయనీయుము (లేక) యజమానుఁడు, సోమిదమ్మ 2 తలలు. గాయత్రి మొదలగు 7 ఛందస్సులు 7 హస్తములు. యజ్ఞపురుషుఁడే సకలఫలముల నిచ్చుటచే వృషభుఁడైనాఁడు. యజ్ఞముల ద్వారా యతఁడే జీవులలోఁ బ్రవేశించుచున్నాఁడు.

**వేదాంతపరమగు నర్థము :**

ఈ మంత్రమే తైత్తిరీయారణ్యకములో మహానారాయణోపనిషత్తులోఁ గలదు. ఇక్కడ శ్రీ విమలానంద స్వామి వ్యాఖ్య -

ప్రణవస్య అకారోకారమకారనాదరూపాణి చత్వారి శృంగాణి సంతి. ప్రణవరూపస్యాస్య బ్రహ్మణః విశ్వ తైజస ప్రాజ్ఞ రూపాః త్రయః పాదా ఇవ ప్రాప్తిస్థానాని భవంతి। అస్య శీర్ష స్థానీయే చిదచిద్రూపే ద్వే శక్తీ స్తః। పునశ్చాస్య హస్తస్థానీయాః సప్తలోకాః సంతి। ఏవం త్రిప్రకారేణ అకారోకారమకారేషు విశ్వతైజసప్రాజ్ఞేషు విరాట్ - హిరణ్యగర్భ - అవ్యాకృతేషు చ సంబద్ధః ప్రణవరూపే వృషభః మహః తేజోరూపమ్ బ్రహ్మతత్త్వం రోరవీతి అతిశయేన ప్రతిపాదయతి అర్థాత్ చైతన్యాత్మస్వరూపో దేవః సర్వప్రాణిదేహాన్ ప్రవిశ్య సత్తాస్ఫూర్తిదానేన సర్వాన్ ధారయతి॥

ప్రణవము ఓంకారమే వృషభము. (1) అకారము (2) ఉకారము (3) మకారము (4) నాదము 4 కొమ్ములు. (1) విశ్వ (2) తైజస (3) ప్రాజ్ఞ రూపములు 3 పాదములు. (1) చిత్తు (2) అచిత్తు - అను రెండు శక్తులు 2 తలలు. 7 లోకములు 7 చేతులు. (1) విరాట్టు (2) హిరణ్యగర్భుఁడు (3) అవ్యాకృతుఁడు నను మువ్వురచే బద్ధుఁడు. ఇట్టి ప్రణవ స్వరూపుఁడగు వృషభుఁడు బ్రహ్మతత్త్వము నతిశయముగాఁ బ్రతిపాదించుచున్నాఁడు. చైతన్యాత్మస్వరూపుఁ డగు నీ వృషభదేవుఁడు సర్వప్రాణుల దేహము లందుఁ బ్రవేశించి సత్తాస్ఫూర్తి నిచ్చి సర్వజీవులను ధరించుచున్నాఁడు. ✦

---

# రుద్రపఞ్చముఖధ్యానమ్

మం. **అఘోరేభ్యోఽథ ఘోరేభ్యో ఘోర ఘోర తరేభ్యః ।**
**సర్వతః శర్వ! సర్వేభ్యో నమస్తే అస్తు రుద్రరూపేభ్యః ॥** (తై.ఆ. 10 ప్ర. 43-44 అను.)

శర్వ = పరమేశ్వరా!; అఘోరేభ్యః = (సత్త్వగుణప్రధానములగుచు) ఘోరములు కానివియు, శాన్తములును; అథ = మరియు; ఘోరేభ్యః = (రజోగుణప్రధానములగుచు) ఉగ్రములును, భయంకరములును; ఘోర-ఘోరతరేభ్యః = (తమోగుణ ప్రధానములగుచు) ఘోరములగు వానికంటెను మిగుల భయంకరములును అగు; తే = నీ; సర్వేభ్యః = సమస్తములగు; రుద్ర-రూపేభ్యః = రుద్రనామక పరమేశ్వరరూపములకొరకు; సర్వతః = అన్ని దేశములందును అన్ని కాలములందును; నమః = నమస్కారము; అస్తు = అగునుగాక!

శ్లో॥ కాలాభ్రభ్రమరాఞ్జనద్యుతినిభం - వ్యావృత్తపింగేక్షణం ।
కర్ణోద్భాసితభోగిమస్తకమణి - ప్రోద్భిన్నదంష్ట్రాఙ్కురమ్ ।
సర్పప్రోతకపాలశుక్తిశకల - వ్యాకీర్ణసంచారగం ।
వన్దే దక్షిణ మీశ్వరస్య కుటిల - భ్రూభఙ్గరౌద్రం ముఖమ్ ॥ 2

**ఓం ఇం; చం ఛం జం ఝం ఞం - ఈం ఓం; ఓం నమో భగవతే రుద్రాయ; ఓం మం; దక్షిణముఖాయ నమః ॥2॥**

## వేదమంత్రం

– వ్యాఖ్య : రామోరా



**చత్వారి వాక్పరిమితా పదాని**
**తాని విదుర్బ్రాహ్మణా యే మనీషిణః ।**
**గుహా త్రీణి నిహితా నేంగయన్తి**
**తురీయం వాచో మనుష్యా వదన్తి ॥**

**పదవిభాగము :** చత్వారి, వాక్పరిమితా, పదాని, తాని, విదుః, బ్రహ్మణాః, యే, మనీషిణః, గుహా, త్రీణి, నిహితా, న, ఇంగయన్తి, తురీయమ్, వాచః, మనుష్యాః, వదన్తి ।

**అన్వయము :** వాక్పరిమితా పదాని చత్వారి యే బ్రాహ్మణాః మనీషిణః (తే) తాని విదుః । మనుష్యాః గుహా నిహితా త్రీణి న ఇంగయన్తి (తే) తురీయం వాచః వదన్తి ।

**మహాభాష్యమ్ :** 'చత్వారి వాక్పరిమితా పదాని' చత్వారి పదజాతాని – నామాఖ్యాతోపసర్గ – నిపాతాశ్చ । 'తాని విదుర్బ్రాహ్మణా యే మనీషిణః' – మనస ఈషిణః – మనీషిణః । 'గుహా త్రీణి నిహితా నేంగయన్తి' గుహాయాం త్రీణి నిహితాని నేంగయన్తి – న చేష్టన్తే, న నిమిషన్తీత్యర్థః । 'తురీయం వాచో మనుష్యా వదన్తి ।' తురీయం వా ఏతద్వాచో యన్మనుష్యేషు వర్తతే, చతుర్థమిత్యర్థః । చత్వారి ॥

**ప్రతిపదార్థము :**

(1) వాక్పరిమితా = వాక్కుయొక్క భేదములగు; పదాని = పదములు (శబ్దములు); చత్వారి = నాలుగు (నామాఖ్యాతోపసర్గనిపాతములు / పరాపశ్యన్తీమధ్యమావైఖరులు); యే = ఎవరు; బ్రాహ్మణాః మనీషిణః = వైయాకరుణులు కలరో; తే = వారు; తాని = ఆ నాలుగు భేదములను; విదుః = సంపూర్ణముగా తెలియగలరు;

(2) మనుష్యాః = వ్యాకరణజ్ఞానములేని సామాన్య మానవులు; గుహా = హృదయ / అజ్ఞానమందు; నిహితా = ఉంచబడిన; త్రీణి = మూడింటిని (వాగ్భేదములను) న+ఇంగయన్తి = తెలియజాలరు; (తే = వారు); తురీయమ్ = నాల్గవ భేదమైన; వాచః = వాక్కును (వైఖరిని మాత్రము); వదన్తి = పలుకుదురు.

**తాత్పర్యము :** వైయాకరుణులు మాత్రమే నాల్గు విధములగు శబ్దభేదములను సంపూర్ణముగా గ్రహించగలరు. ఇతరులు మాత్రము నాలుగవ భేదమైన వైఖరిని మాత్రమే గ్రహించ సమర్థులగుదురు. మరిన్ని వివరములకు 'మహాభాష్యము' చూడదగును.

**సాయణభాష్యము :** వాక్ వాచః కృత్స్నాయాః పదాని చత్వారి పరిమితా పరిమితాని। లోకే యా వాగస్తి సా చతుర్విధా విభక్తేత్యర్థః। తాని పదాని బ్రాహ్మణాః వేదవిదః మనీషిణః మనస ఈషిణో మేధావినః విదుః జానన్తి। తేషాం మధ్యే త్రీణి గుహా గుహాయాం నిహితా స్థాపితాని నేంగయన్తి న చేష్టన్తే న ప్రకాశన్తే ఇత్యర్థః। వాచః తురీయం పదం మనుష్యాః అజ్ఞాస్తత్‌జ్ఞాశ్చ వదన్తి వ్యక్తముచ్చారయన్తి వ్యవహారన్తి। కాని తాని చత్వారి ఇత్యత్ర బహవః స్వస్వమతానురోధేన బహుధా వర్ణయన్తి। సర్వవైదికవాగ్జాలస్య సంగ్రహరూపాః భూరాదయః తిస్రో వ్యాహృతయః ప్రాణవ ఏక ఇతి వేదత్రయసారత్వాత్ తాసాం వ్యాహృతీనామేవ సారసంగ్రహభూతత్వాత్ అకారాద్యాత్మకస్య ప్రణవస్యేతి సప్రణవాసు వ్యాహృతిషు సర్వా వాక్ పరిమితేతి కేచన వేదవాదినో వదన్తి। అపరే వ్యాకరణమతానుసారిణే నామాఖ్యాతోపసర్గ నిపాతభేదేన। **క్రియాప్రధానమాఖ్యాతమ్**। **ద్రవ్యప్రధానం నామ**। ప్రాగుపసృజ్యతే ఆఖ్యాత **పదస్యేత్యుపసర్గః** ప్రాదిః। ఉచ్చావచేష్వర్థేషు **నిపతనాన్నిపాతః** అపి తు చ ఇత్యాదిః। ఏతేష్వేవ సర్వా వాక్ పరిమితేత్యఖణ్డాయాః కృత్స్నాయా వాచశ్చతుర్ధా వ్యాకృతత్వాత్। 'వాగ్వై పరాచ్యవ్యాకృతావదత్ తామింద్రో మధ్యతోఽవక్రమ్య వ్యాకరోత్తస్మాదియం వ్యాకృతా వాగుద్యతే' (తై.సం. 6.4.7.3) ఇతి శ్రుతేః। అన్యే తు యాజ్ఞికాః మంత్రాః కల్పో బ్రాహ్మణం చతుర్థీ లౌకికీతి। యాజ్ఞికైః సమాఖ్యాతేఽనుష్ఠేయార్థప్రకాశకో వేదభాగో మన్త్రాః। మన్త్ర విధానప్రతిపాదకో వేదభాగః 'ఇతి మంత్రాః కల్పోఽత ఊర్ధ్వమ్' (తై.ఆ. 1.31.2) ఇత్యాదినోక్తః **కల్పః**। మంత్రతాత్పర్యార్థప్రకాశకో వేదభాగో **బ్రాహ్మణమ్**। భోగవిషయా గామానయ ఇత్యాదిరూపా వ్యావహారికీ। ఏష్వేవ సర్వా వాక్ నియమితేతి యాజ్ఞికాః। ఋగ్యజుఃసామాని చతుర్థీ వ్యావహారికేతి నైరుక్తాః। సర్పాణాం వాగ్వయసాం క్షుద్రసరీసృపస్య చ చతుర్థీ వ్యావహారికీత్యైతిహాసికాః। పశుషు తూణవేషు మృగేష్వాత్మని చేత్యాత్మవాదినః। అపరే మాతృకాః ప్రకారాన్తరేణ ప్రతిపాదయన్తి। పరాపశ్యన్తీ మధ్యమా వైఖరీతి చత్వారీతి। ఏకైవ నాదాత్మికా వాక్ మూలాధారాదుదితా సతీ పరేత్యుచ్యతే। నాదస్య చ సూక్ష్మత్వేన దుర్నిరూపత్వాత్ సైవ హృదయగామినీ పశ్యన్తీత్యుచ్యతే యోగిభిః ద్రష్టుం శక్యత్వాత్। సైవ బుద్ధిం గతా వివక్షాం ప్రాప్తా మధ్యమేత్యుచ్యతే। మధ్యే హృదయాఖ్యే ఉదీయమానత్వాత్ మధ్యమాయాః। అథ యథా సైవ వక్త్రే స్థితా తాల్వోష్ఠాదివ్యాపారేణ బహిర్నిర్గచ్ఛతి తదా వైఖరీత్యుచ్యతే। ఏవం చత్వారి వాచః పదాని పరిమితాని। మనీషిణో మనసః స్వామినః స్వాధీనమనస్కా బ్రాహ్మణాః రవాఖ్యస్య శబ్దబ్రహ్మణోఽధిగన్తారో యోగినః పరాది చత్వారి పదాని విదుః జానన్తి। తేషు మధ్యే త్రీణి పరాదీని గుహా నిహితాని హృదయాన్తః వర్తిత్వాత్। తురీయం తు పదం వైఖరీసంజ్ఞకం మనుష్యాః సర్వే వదన్తి। వ్యాకరణప్రసిద్ధనామాఖ్యాతాది పక్షే మనీషిణో బ్రాహ్మణాః ప్రకృతి ప్రత్యయాది విభాగజ్ఞా వాగ్యోగవిదస్తాని పదాని జానన్తి। అవాగ్యోగవిదః పామరో వాచో వాఙ్మయస్య తురీయం చతుర్థం భాగం వదన్తి వ్యవహరన్తి అర్థప్రకాశనాయ ప్రయుంజతే। అయం మంత్రో నిరుక్తే వ్యాఖ్యాతః సోఽత్రాప్యనుసంధేయః అథాపి బ్రహ్మణం భవతి। సా వై వాక్ సృష్టా చతుర్ధా వ్యభవదేష్వేవ లోకేషు త్రీణి పశుషు తురీయమ్। యా పృథివ్యాం సాగ్నౌ సా రథంతరే। యాన్తరిక్షే సా వాయౌ సా వామదేవ్యే। యా దివి సాదిత్యే సా బృహతి సా స్తనయిత్నావథ పశుషు తతో యా గతత్యరిచ్యత బ్రాహ్మణేష్వదధుః। తస్మాత్ బ్రాహ్మణా ఉభయీం వాచం వదన్తి యా చ దేవానాం యా చ మనుష్యాణామ్' (నిరు. 13.9) ఇతి.

✦




శ్రీః

# కుణ్డలినీసహస్రనామస్తోత్రమ్

## శ్రీరుద్రయామలాంతర్గతమ్ - శ్రీ ఆనన్దభైరవ్యువాచ

శ్లో॥ అథ కాన్త! ప్రవక్ష్యామి కుణ్డలీచేతనాదికమ్ ।
సహస్రనామసకలం కుణ్డలిన్యాః ప్రియం సుఖమ్ ॥ 1

శ్లో॥ అష్టోత్తరం మహాపుణ్యం సాక్షాత్ సిద్ధిప్రదాయకమ్ ।
తవ ప్రేమవశేనైవ కథయామి శృణుష్వ తత్ ॥ 2

శ్లో॥ వినా యజనయోగేన వినా ధ్యానేన యత్ఫలమ్ ।
తత్ఫలం లభతే సద్యో విద్యాయాః సుకృపా భవేత్ ॥ 3

శ్లో॥ యా విద్యా భువనేశానీ త్రైలోక్యపరిపూజితా ।
సా దేవీ కుణ్డలీ మాతా త్రైలోక్యం పాతి సర్వదా ॥ 4

శ్లో॥ తస్యా నామ సహస్రాణి అష్టోత్తరశతాని చ ।
శ్రవణాత్ పఠనాన్మన్త్రీ మహాభక్తో భవేదిహ ॥ 5

శ్లో॥ ఐహికే స భవేత్ నాథ! జీవన్ముక్తో మహాబలీ ॥ 6

వినియోగః - అస్య శ్రీమహాకుణ్డలీసాష్టోత్తరసహస్రనామస్తోత్రస్య బ్రహ్మర్షిః, జగతీచ్ఛన్దః, భగవతీ శ్రీమహాకుణ్డలీదేవతా, సర్వయోగసమృద్ధిసిద్ధ్యర్థే పాఠే వినియోగః ।

అష్టోత్తరశతనామసహస్రమ్ (1108)

| | | | |
|---|---|---|---|
| శ్లో॥ | కులేశ్వరీ కులానందా – కులీనా కులకుణ్డలీ । | (4) | |
| | శ్రీమన్మహాకుణ్డలీ చ – కులకన్యా కులప్రియా ॥ | (3) | 1 |
| శ్లో॥ | కులక్షేత్రస్థితా కౌలీ – కులీనార్థప్రకాశినీ । | (3) | |
| | కులాఖ్యా కులమార్గస్థా – కులశాస్త్రార్థపాతినీ ॥ | (3) | 2 |
| శ్లో॥ | కులజ్ఞా కులయోగ్యా చ – కులపుష్పప్రకాశినీ । | (3) | |
| | కులీనా చ కులాధ్యక్షా – కులచందనలేపితా ॥ | (3) | 3 |
| శ్లో॥ | కులగర్భాసనా కుల్లా – కులచ్ఛాత్రా కులాత్మజా । | | |
| | కులీనా నాగలలితా – కుణ్డలీ కులపణ్డితా ॥ | | 4 |
| శ్లో॥ | కులద్రవ్యప్రియా కౌలా – కలికన్యా కులాన్తరా । | | |
| | కులకాలీ కులామోదా – కులశబ్దోత్సవాకులా ॥ | | 5 |
| శ్లో॥ | కులరూపా కులోద్భూతా – కులకుణ్డలివాసినీ । | (3) | |
| | కులాభిన్నా కులోత్పన్నా – కులాచారవినోదినీ ॥ | (3) | 6 |
| శ్లో॥ | కులవృక్షసముద్భూతా – కులమాలా కులప్రభా । | (3) | |
| | కులజ్ఞా కులమధ్యస్థా – కులకఙ్కణశోభితా ॥ | (3) | 7 |
| శ్లో॥ | కులోత్తరా కౌలపూజా – కులాలాపా కులక్రియా । | (4) | |
| | కులభేదా కులప్రాణా – కులదేవీ కులస్తుతిః ॥ | (5) | 8 |
| శ్లో॥ | కౌలికా కాలికా కాల్యా – కలిభిన్నా కలాకలా । | (5) | |
| | కలికల్మషహన్త్రీ చ – కలిదోషవినాశినీ ॥ | (2) | 9 |
| శ్లో॥ | కఙ్కాలీ కేవలానన్దా – కాలజ్ఞా కాలధారిణీ । | (4) | |
| | కౌతుకీ కౌముదీ కేకా – కాకా కాకలయాన్తరా ॥ | (5) | 10 |
| శ్లో॥ | కోమలాఙ్గీ కరాలాస్యా కన్దపూజ్యా చ కోమలా । | (4) | |
| | కైశోరీ కాకపుచ్ఛస్థా – కమ్బలాసనవాసినీ ॥ | (3) | 11 |
| శ్లో॥ | కైకేయీపూజితా కోలా – కోలపుత్రీ కపిధ్వజా । | (4) | |
| | కమలా కమలాక్షీ చ – కమ్బలాశ్వతరప్రియా ॥ | (3) | 12 |
| శ్లో॥ | కలికాభఙ్గదోషస్థా – కాలజ్ఞా కాలకుణ్డలీ । | (3) | |
| | కావ్యదా కవితా వాణీ – కాలసందర్భభేదినీ ॥ | (4) | 13 |
| శ్లో॥ | కుమారీ కరుణాకారా – కురుసైన్యవినాశినీ । | (3) | |
| | కాన్తా కులగతా కామా – కామినీ కామనాశినీ ॥ | (5) | 14 |
| శ్లో॥ | కామోద్భవా కామకన్యా – కేవలా కాలఘాతినీ । | (4) | |
| | కైలాసశిఖరారూఢా – కైలాసపతిసేవితా ॥ | (2) | 15 |
| శ్లో॥ | కైలాసనాథనమితా – కేయూరహారమణ్డితా । | (2) | |
| | కన్దర్పా కఠినానన్దా – కులగా కీచకృత్యహా ॥ | (4) | 16 |

శ్లో॥ కమలాస్యా కఠోరా చ – కీటరూపా కటిస్థితా । (4)
కందేశ్వరీ కందరరూపా – కౌలికా కందవాసినీ ॥ (4) 17

శ్లో॥ కటకస్థా కామబీజా – కృచ్ఛ్రాకృచ్ఛ్రగుణోదయా ।
కృచ్ఛ్రానన్దా కృచ్ఛ్రాపూజ్యా – కృచ్ఛ్రహా కృచ్ఛ్రరక్షికా ॥ 18

శ్లో॥ కారణాంగీ కృచ్ఛ్రవర్ణా – కీలితా కోకిలస్వరా ।
కాంచీపీఠస్థితా కాంచీ – కామరూపనివాసినీ ॥ 19

శ్లో॥ కూటస్థా కూటభక్షా చ – కాలకూటవినాశినీ । (3)
కామాఖ్యా కమలా కామ్యా – కామరాజతనూద్భవా ॥ (4) 20

శ్లో॥ కామరూపధరా కమ్రా – కమనీయా కవిప్రియా । (4)
కంజాననా కంజహస్తా – కంజపత్రాయతేక్షణా ॥ (3) 21

శ్లో॥ కాకినీ కామరూపస్థా – కామరూపప్రకాశినీ । (3)
కోలావిధ్వంసినీ కంకా – కలంకార్కకలంకినీ ॥ (3) 22

శ్లో॥ మహాకులనదీ కర్ణా కర్ణకాణ్డవిమోహినీ । (3)
కాణ్డస్థా కాణ్డకరుణా – కర్మకస్థా కుటుంబినీ ॥ (4) 23

శ్లో॥ కమలాభా భవా (కల్పా) కల్లా – కరుణా కరుణామయీ । (5)
కరుణేశీ కరాకర్త్రీ – కర్తృహస్తా కలోదయా ॥ (4) 24

శ్లో॥ కారుణ్యసాగరోద్భూతా – కారుణ్యసింధువాసినీ । (2)
కార్తికేశీ కార్తికస్థా – కార్తికప్రాణపాలినీ ॥ (3) 25

శ్లో॥ కరుణానిధిపూజ్యా చ – కరణీయా క్రియా కలా । (4)
కల్పస్థా కల్పనిలయా – కల్పానీతా చ కల్పితా ॥ (4) 26

శ్లో॥ కులయా కులవిజ్ఞానా – కర్షిణీ కాలరాత్రికా । (4)
కైవల్యదా కోకరస్థా – కలమంజీరరంజినీ ॥ (3) 27

శ్లో॥ కలయన్తీ కాలజిహ్వా – కింకరాసనకారిణీ । (3)
కుముదా కుశలానన్దా – కౌశల్యాకాశవాసినీ ॥ (3) 28

శ్లో॥ కసాపహాసహన్త్రీ చ – కైవల్యగుణసంభవా । (2)
ఏకాకినీ అర్కరూపా – కువలా కర్కటస్థితా ॥ (3) 29

శ్లో॥ కర్కోటకా కోష్ఠరూపా – కూటవహ్నికరస్థితా । (3)
కూజన్తీమధురధ్వానం – కామయన్తీసులక్షణమ్ ॥ 30

శ్లో॥ కేతకీ కుసుమానందా – కేతకీపుణ్యమణ్డితా । (3)
కర్పూరపూరరుచిరా – కర్పూరభక్షణప్రియా ॥ (2) 31

శ్లో॥ కపాలపాత్రహస్తా చ – కపాలచంద్రధారిణీ । (2)
కామధేనుస్వరూపా చ – కామధేనుః క్రియాన్వితా ॥ (3) 32

| | | | |
|---|---|---|---|
| శ్లో॥ | కశ్యపీ కాశ్యపా కున్తీ – కేశాన్తా కేశమోహినీ । | (5) | |
| | కాలకర్త్రీ కూపకర్త్రీ – కులపా కామచారిణీ ॥ | (4) | 33 |
| శ్లో॥ | కుంకుమాభా కజ్జలస్థా – కమితా కోపఘాతినీ । | (4) | |
| | కేలిస్థా కేలికలితా – కోపనా కర్పటస్థితా ॥ | (4) | 34 |
| శ్లో॥ | కలాతీతా కాలవిద్యా – కాలాత్మపురుషోద్భవా । | (3) | |
| | కష్టస్థా కష్టకుష్ఠస్థా – కుష్ఠహా కష్టహా కుశా ॥ | (5) | 5 |
| శ్లో॥ | కలికా స్ఫుటకర్త్రీ చ – కామ్బోజా కామలా కులా । | (5) | |
| | కుశలాఖ్యా కాకకుష్ఠా – కర్మస్థా కూర్మమధ్యగా ॥ | (4) | 36 |
| శ్లో॥ | కుండలాకారచక్రస్థా – కుండగోలోద్భవా కఫా । | (3) | |
| | కపిత్థాగ్రవసాకాశా – కపిత్థరోధకారిణీ ॥ | (2) | 37 |
| శ్లో॥ | కాహొూడీ కాహడా కాడా – కంకలా భాషకారిణీ । | (5) | |
| | కనకా కనకాభా చ – కనకాద్రినివాసినీ ॥ | (3) | 38 |
| శ్లో॥ | కార్పాసయజ్ఞసూత్రస్థా – కూటబ్రహ్మార్థసాధినీ । | (2) | |
| | కలంజభక్షిణీ క్రూరా – క్రోధపుంజా కపిస్థితా ॥ | (4) | 39 |
| శ్లో॥ | కపాలీ సాధనరతా – కనిష్ఠాకాశవాసినీ । | (3) | |
| | కుంజరేశీ కుంజరస్థా – కుంజరా కుంజరాగతిః ॥ | (4) | 40 |
| శ్లో॥ | కుంజస్థా కుంజరమణీ – కుంజమందిరవాసినీ । | (3) | |
| | కుపితా కోపశూన్యా చ – కోపాకోపవివర్జితా ॥ | (3) | 41 |
| శ్లో॥ | కపింజలస్థా కాపింజా – కపింజలతరూద్భవా । | (3) | |
| | కున్తీప్రేమకథావిష్టా – కున్తీమానసపూజితా ॥ | (2) | 42 |
| శ్లో॥ | కున్తలా కున్తహస్తా చ – కులకున్తలలోహినీ । | (3) | |
| | కాన్తాంఘ్రిసేవికా – కాన్తకుశలా కోశలావతీ ॥ | (3) | 43 |
| శ్లో॥ | కేశిహన్త్రీ కకుత్స్థా చ – కకుత్స్థవనవాసినీ । | (3) | |
| | కైలాసశిఖరానన్దా – కైలాసగిరిపూజితా ॥ | (2) | 44 |
| శ్లో॥ | కీలాలనిర్మలాకారా – కీలాలముగ్ధకారిణీ । | (2) | |
| | కుతుకా కుట్టహీ కుట్టా – కూటనా మోదకారిణీ ॥ | (5) | 45 |
| శ్లో॥ | క్రౌంకారీ క్రౌంకరీ కాశీ – కుహుశబ్దస్థా కిరాతనీ । | (5) | |
| | కూజన్తీ సర్వవచనం – కారయన్తీ కృతాకృతమ్ ॥ | | 46 |
| శ్లో॥ | కృపానిధిస్వరూపా చ – కృపాసాగరవాసినీ । | (2) | |
| | కేవలానందనిరతా – కేవలానందకారిణీ ॥ | (3) | 47 |
| శ్లో॥ | కృమిలా కృమిదోషఘ్నీ – కృపా కపటకుట్టితా । | (4) | |
| | కృశాంగీ క్రమభంగస్థా – కింకరస్థా కటస్థితా ॥ | (9) | 48 |

| | | | |
|---|---|---|---|
| శ్లో॥ | కామరూపా కాన్తరతా – కామరూపస్య సిద్ధిదా । | (3) | |
| | కామరూపపీఠదేవీ – కామరూపాంకుజా కుజా ॥ | (3) | 49 |
| శ్లో॥ | కామరూపా కామవిద్యా – కామరూపాదికాలికా । | (3) | |
| | కామరూపకలా కామ్యా – కామరూపకులేశ్వరీ ॥ | (3) | 50 |
| శ్లో॥ | కామరూపజనానన్దా – కామరూపకుశాగ్రధీః । | (2) | |
| | కామరూపకరాకాశా – కామరూపతరుస్థితా ॥ | (2) | 51 |
| శ్లో॥ | కామాత్మజా కామకలా – కామరూపవిహారిణీ । | (3) | |
| | కామశాస్త్రార్థమధ్యస్థా – కామరూపక్రియాకలా ॥ | (2) | 52 |
| శ్లో॥ | కామరూపమహాకాలీ – కామరూపయశోమయీ । | (2) | |
| | కామరూపరమానందా – కామరూపాదికామినీ ॥ | (2) | 53 |
| శ్లో॥ | కులమూలా కామరూపపద్మమధ్యనివాసినీ । | (2) | |
| | కృతాంజలిప్రియా కృత్యా – కృత్యాదేవీస్థితా కటా ॥ | (4) | 54 |
| శ్లో॥ | కటకా కాటకా కోటికటిఘంటవినోదినీ । | (3) | |
| | కటిస్థూలతరా కాష్ఠా – కాత్యాయనసుసిద్ధిదా ॥ | (3) | 55 |
| శ్లో॥ | కాత్యాయనీ కాచలస్థా – కామచంద్రాననా కథా । | (4) | |
| | కాశ్మీరదేశనిరతా – కాశ్మీరీ కృషికర్మజా ॥ | (3) | 56 |
| శ్లో॥ | కృషికర్మస్థితా కౌర్మా – కూర్మపృష్ఠనివాసినీ । | (3) | |
| | కాలఘంటా నాదరతా – కలమంజీరమోహినీ ॥ | (3) | 57 |
| శ్లో॥ | కలయన్తీశత్రువర్గాన్ – క్రోధయన్తీగుణాగుణమ్ । | (2) | |
| | కామయన్తీసర్వకామమ్ – కాశయన్తీజగత్త్రయమ్ ॥ | (2) | 58 |
| శ్లో॥ | కౌలకన్యా కాలకన్యా – కౌలకాలకులేశ్వరీ । | (3) | |
| | కౌలమందిరసంస్థా చ – కులధర్మవిడంబినీ ॥ | (2) | 59 |
| శ్లో॥ | కులధర్మరతాకారా – కులధర్మవినాశినీ । | (2) | |
| | కులధర్మపణ్డితా చ – కులధర్మసమృద్ధిదా ॥ | (2) | 60 |
| శ్లో॥ | కౌలభోగమోక్షదా చ – కౌలభోగేన్ద్రయోగినీ । | (2) | |
| | కౌలకర్మా నవకులా – శ్వేతచమ్పకమాలినీ ॥ | (3) | 61 |
| శ్లో॥ | కులపుష్పమాల్యాకాన్తా – కులపుష్పభవోద్భవా । | (2) | |
| | కౌలకోలహలకరా – కౌలకర్మప్రియా పరా ॥ | (3) | 62 |
| శ్లో॥ | కాశీస్థితా కాశకన్యా – కాశీ చక్షుప్రియా కుథా । | (5) | |
| | కాష్ఠాసనప్రియా కాకా – కాకపక్షకపాలికా ॥ | (3) | 63 |
| శ్లో॥ | కపాలరసభోజ్యా చ – కపాలనవమాలినీ । | (2) | |
| | కపాలస్థా చ కాపాలీ – కపాలసిద్ధిదాయినీ ॥ | (3) | 64 |

శ్లో॥ కపాలా కులకర్త్రీ చ – కపాలశిఖరస్థితా । (3)
కథనా కృపణశ్రీదా – కృపీ కృపణసేవితా ॥ (4) 65

శ్లో॥ కర్మహన్త్రీ కర్మగతా – కర్మాకర్మవివర్జితా । (3)
కర్మసిద్ధిరతా కామీ – కర్మజ్ఞాననివాసినీ ॥ (3) 66

శ్లో॥ కర్మధర్మసుశీలా చ – కర్మధర్మవశంకరీ । (2)
కనకాబ్జసునిర్మాణమహాసింహాసనస్థితా ॥ (1) 67

శ్లో॥ కనకగ్రన్థిమాల్యాఢ్యా – కనకగ్రన్థిభేదినీ । (2)
కనకోద్భవకన్యా చ – కనకామ్భోజవాసినీ ॥ (2) 68

శ్లో॥ కాలకూటాదికూటస్థా – కటిశబ్దాన్తరస్థితా । (2)
కంకపక్షినాదముఖా – కామధేనూద్భవా కలా ॥ (3) 69

శ్లో॥ కంకణాభా ధరా కర్ద్దా – కర్దమా కర్దమస్థితా । (5)
కర్దమస్థజలాచ్ఛన్నా – కర్దమస్థజనప్రియా ॥ (2) 70

శ్లో॥ కమఠస్థా కార్ముకస్థా – క్రమస్థా కంసనాశినీ । (4)
కంసప్రియా కంసహన్త్రీ – కంసజ్ఞానకరాలినీ ॥ (3) 71

శ్లో॥ కాంచనాభా కాంచనదా – కామదా క్రమదా కదా । (5)
కాన్తిభిన్నా కాన్తిచిన్తా – కమలాసనవాసినీ ॥ (3) 72

శ్లో॥ కమలాసనసిద్ధిస్థా – కమలాసనదేవతా । (2)
కుత్సితా కుత్సితరతా – కుత్సా శాపవివర్జితా ॥ (4) 73

శ్లో॥ కుపుత్రరక్షికా కుల్లా – కుపుత్రమానసాపహా । (3)
కుజరక్షకరీ కౌజీ – కుబ్జాఖ్యా కుబ్జవిగ్రహా ॥ (4) 74

శ్లో॥ కునఖీ కూపదిక్షుస్థా – కుకరీ కుఘునీ కుదా । (5)
కుప్రియా కోకిలానందా – కోకిలా కామదాయినీ ॥ (4) 75

శ్లో॥ కుకామినా కుబుద్ధిస్థా – కూర్పవాహనమోహినీ । (3)
కులకా కులలోకస్థా – కుశాసనసుసిద్ధిదా । (3) 76

శ్లో॥ కౌశికీ దేవతా కస్యా – కన్నాదనాదసుప్రియా । (4)
కుసౌష్ఠవా కుమిత్రస్థా – కుమిత్రశత్రుఘాతినీ ॥ (3) 77

శ్లో॥ కుజ్ఞాననికరా కుస్థా – కుజిస్థా కర్జదాయినీ । (4)
కకర్జా కర్జకారిణీ – కర్జబద్ధవిమోహినీ ॥ (3) 78

శ్లో॥ కర్జశోధనకర్త్రీ చ – కాలాస్త్రధారిణీ సదా । (2)
కుగతిః కాలసుగతిః – కలిబుద్ధివినాశినీ ॥ (3) 79

శ్లో॥ కలికాలఫలోత్పన్నా – కలిపావనకారిణీ । (2)
కలిపాపహరా కాలీ – కలిసిద్ధిసుసూక్ష్మదా ॥ (3) 80

| | | | |
|---|---|---|---|
| శ్లో॥ | కాలిదాసవాక్యగతా – కాలిదాససుసిద్ధిదా । | (2) | |
| | కలిశిక్షా కాలశిక్షా – కన్దశిక్షాపరాయణా ॥ | (3) | 81 |
| శ్లో॥ | కమనీయభావరతా – కమనీయసుభక్తిదా । | (2) | |
| | కరకాజనరూపా చ – కక్షావాదకరా కరా ॥ | (3) | 82 |
| శ్లో॥ | కంచువర్ణా కాకవర్ణా – క్రోష్టురూపా కషామలా । | (4) | |
| | క్రోష్ట్రనాదరతా కీతా – కాతరా కాతరప్రియా ॥ | (4) | 83 |
| శ్లో॥ | కాతరస్థా కాతరాజ్ఞా – కాతరానన్దకారిణీ । | (3) | |
| | కాశమర్దతరూద్భూతా – కాశమర్దవిభక్షిణీ ॥ | (2) | 84 |
| శ్లో॥ | కష్టహానిః కష్టదాత్రీ – కష్టలోకవిరక్తిదా । | (3) | |
| | కాయాగతా కాయసిద్ధిః – కాయానందప్రకాశినీ ॥ | (3) | 85 |
| శ్లో॥ | కాయగన్ధహరా కుమ్భా – కాయకుమ్భా కఠోరిణీ । | (4) | |
| | కఠోరతరుసంస్థా చ – కఠోరలోకనాశినీ ॥ | (2) | 86 |
| శ్లో॥ | కుమార్గస్థాపితా కుప్రా – కార్పాసతరుసమ్భవా । | (3) | |
| | కార్పాసవృక్షసూత్రస్థా – కువర్గస్థా కరోత్తరా ॥ | (3) | 87 |
| శ్లో॥ | కర్ణాటకర్ణసమ్భూతా – కార్ణాటీ కర్ణపూజితా । | (3) | |
| | కర్ణాస్త్రరక్షికా కర్ణా – కర్ణహా కర్ణకుణ్డలా ॥ | (4) | 88 |
| శ్లో॥ | కున్తలాదేశనమితా – కుటుంబా కుమ్భకారికా । | (3) | |
| | కర్ణాసరాసనా కృష్టా – కృష్ణహస్తాంబుజార్జితా ॥ | (3) | 89 |
| శ్లో॥ | కృష్ణాంగీ కృష్ణదేహస్థా – కుదేశస్థా కుమంగలా । | (4) | |
| | క్రూరకర్మస్థితా కోరా కిరాతకులకామినీ ॥ | (3) | 90 |
| శ్లో॥ | కాలవారిప్రియా కామా – కావ్యవాక్యప్రియా క్రుధా । | (4) | |
| | కుంజలతా కౌముదీ చ – కుజ్యోత్స్నా కలనప్రియా ॥ | (4) | 91 |
| శ్లో॥ | కలనా సర్వభూతానాం – కపిత్థవనవాసినీ । | (2) | |
| | కటునిమ్బస్థితా కాఖ్యా – కవర్గాఖ్యా కవర్గికా ॥ | (4) | 92 |
| శ్లో॥ | కిరాతచ్ఛేదినీ కార్యా – కార్యకార్యవివర్జితా । | (3) | |
| | కాత్యాయనాదికల్పస్థా – కాత్యాయనసుఖోదయా ॥ | (2) | 93 |
| శ్లో॥ | కుక్షేత్రస్థా కులావిఘ్నా – కరణాదిప్రవేశినీ । | (3) | |
| | కాంకాలీ కింకలా కాలా – కీలితా సర్వకామినీ ॥ | (5) | 94 |
| శ్లో॥ | కీలితాపేక్షితా కూటా – కూటకుంకుమచర్చితా । | (3) | |
| | కుంకుమాగన్ధనిలయా – కుటుంబభవనస్థితా ॥ | (2) | 95 |
| శ్లో॥ | కుకృపా కారణానందా – కవితారసమోహినీ । | (3) | |
| | కావ్యశాస్త్రానందరతా – కావ్యపూజ్యా కవీశ్వరీ ॥ | (3) | 96 |

| | | | |
|---|---|---|---|
| శ్లో॥ | కటకాదిహస్తిరథహయదుందుభిశబ్దినీ । | (1) | |
| | కితవా క్రూరధూర్తస్థా - కేకాశబ్దనివాసినీ ॥ | (3) | 97 |
| శ్లో॥ | కేంకేవలామ్బితా కేతా కేతకీపుష్పమోహినీ । | (3) | |
| | క్లైం కైవల్యగుణోద్వాస్యా - కైవల్యధనదాయినీ ॥ | (2) | 98 |
| శ్లో॥ | కరీ ధనీంద్రజననీ - కాక్షతాక్షకలంకినీ । | (3) | |
| | కుడువాన్తా కాన్తిశాన్తా - కాంక్షా పారమహంస్యగా ॥ | (4) | 99 |
| శ్లో॥ | కర్త్రీ చిత్తా కాన్తవిత్తా - కృషణా కృషిభోజినీ । | (5) | |
| | కుంకుమాశక్తహృదయా - కేయూరహారమాలినీ ॥ | (2) | 100 |
| శ్లో॥ | కీశ్వరీ కేశవా కుమ్భా - కైశోరజనపూజితా । | (4) | |
| | కాలికామధ్యనిరతా - కోకిలస్వరగామినీ ॥ | (2) | 101 |
| శ్లో॥ | కురదేహహరా కుమ్బా - కుడుమ్బా కురభేదినీ । | (4) | |
| | కుణ్డలీశ్వరసంవాదా - కుణ్డలీశ్వరమధ్యగా ॥ | (2) | 102 |
| శ్లో॥ | కాలసూక్ష్మా కాలయజ్ఞా - కాలహారకారీ కహా । | (4) | |
| | కహాలస్థా కలహస్థా - కలహా కలహాంకరీ ॥ | (4) | 103 |
| శ్లో॥ | కురంగీ శ్రీకురంగస్థా - కోరంగీ కుణ్డలాపహా । | (4) | |
| | కులలక్ష్మీః (కుకలంకీ) కృష్ణబుద్ధిః - కృష్ణా ధ్యాననివాసినీ ॥ (4) | | 104 |
| శ్లో॥ | కుతవా కాష్ఠవలతా - కృతార్థకారణీ కుసీ । | (4) | |
| | కనకస్థా కస్వరస్థా - కలికా దోషభంగజా ॥ | (4) | 105 |
| శ్లో॥ | కుసుమాకారకమలా - కుసుమస్రగ్విభూషణా । | (2) | |
| | కింజల్కా కైతవార్కశా - కమనీయజాలోదయా ॥ | (3) | 106 |
| శ్లో॥ | కకారకూటసర్వాంగీ - కకారామ్బరమాలినీ । | (2) | |
| | కాలభేదకరా కాటా - కర్పవాసా కకుత్థలా ॥ | (4) | 107 |
| శ్లో॥ | కువాసా కబరీ కర్వా - కూసవీ కురుపాలినీ । | (5) | |
| | కురుపృష్ఠా కురుశ్రేష్ఠా - కురూణాం జ్ఞాననాశినీ ॥ | (3) | 108 |
| శ్లో॥ | కుతూహలరతా కాన్తా - కువ్యాప్తా కష్టబంధనా । | (4) | |
| | కషాయణతరుస్థా చ - కషాయణరసోద్భవా ॥ | (2) | 109 |
| శ్లో॥ | కవి(తి)విద్యా కుష్టదాత్రీ - కుష్ఠిశోకవిసర్జనీ । | (3) | |
| | కాష్ఠాసనగతా కార్యాశ్రయాకా శ్రయకౌలికా ॥ | (3) | 110 |
| శ్లో॥ | కాలికా కాలిసంత్రస్తా - కౌలికధ్యానవాసినీ । | (3) | |
| | కప్తస్థా కప్తజననీ - కప్తచ్ఛన్నా కలిధ్వజా ॥ | (4) | 111 |
| శ్లో॥ | కేశవా కేశవానందా - కేశ్యాదిదానవాపహా । | (3) | |
| | కేశవాంగజకన్యా చ - కోశవాంగజమోహినీ ॥ | (2) | 112 |

| | | | |
|---|---|---|---|
| శ్లో॥ | కిశోరార్చనయోగ్యా చ – కిశోరదేవదేవతా । | (2) | |
| | కాంతశ్రీకరణీ కుత్యా – కపటాప్రియఘాతినీ ॥ | (3) | 113 |
| శ్లో॥ | కుకామజనితా కౌంచా – కౌంచస్థా కౌంచవాసినీ । | (4) | |
| | కూపస్థా కూపబుద్ధిస్థా – కూపమాలా మనోరమా ॥ | (4) | 114 |
| శ్లో॥ | కులపుష్పాశ్రయా కాన్తిః – క్రమదాక్రమదాక్రమా । | (5) | |
| | కువిక్రమా కుక్రమస్థా – కుణ్డలీకుణ్డదేవతా ॥ | (3) | 115 |
| శ్లో॥ | కౌండిల్యనగరోద్భూతా – కౌండిల్యగోత్రపూజితా । | (2) | |
| | కపిరాజస్థితా కాపీ – కపిబుద్ధిబలోదయా ॥ | (3) | 116 |
| శ్లో॥ | కపిధ్యానపరా ముఖ్యా – కువ్యవస్థా కుసాక్షిదా । | (4) | |
| | కుమధ్యస్థా కుకల్పా చ – కులపంక్తిప్రకాశినీ ॥ | (3) | 117 |
| శ్లో॥ | కులభ్రమరదేహస్థా – కులభ్రమరనాదినీ । | (2) | |
| | కులాసంగా కులాక్షీ చ – కులమత్తా కులానిలా ॥ | (4) | 118 |
| శ్లో॥ | కలిచిహ్నా కాలచిహ్నా – కంఠచిహ్నా కవీంద్రజా । | (4) | |
| | కరీంద్రా కమలేశశ్రీః – కోటికందర్పదర్పహా ॥ | (3) | 119 |
| శ్లో॥ | కోటితేజోమయీ కోట్యా – కోటీరపద్మమాలినీ । | (3) | |
| | కోటీరమోహినీ కోటిః – కోటికోటివిధూద్భవా ॥ | (3) | 120 |
| శ్లో॥ | కోటిసూర్యసమానాస్యా – కోటికాలానలోపమా । | (2) | |
| | కోటీరహారలలితా – కోటిపర్వతధారిణీ ॥ | (2) | 121 |
| శ్లో॥ | కుచయుగ్మమోహనస్థా – కుచమాయాతురా కుచా । | (3) | |
| | కుచయౌవనసమ్మోహా – కుచమర్దనసౌఖ్యదా ॥ | (2) | 122 |
| శ్లో॥ | కాచస్థా కాచదేహా చ – కాచపూరనివాసినీ । | (3) | |
| | కాచగ్రస్థా కాచవర్ణా – కీచకప్రాణనాశినీ ॥ | (3) | 123 |
| శ్లో॥ | కమలాలోచనప్రేమా – కోమలాక్షీ మనుప్రియా । | (3) | |
| | కమలాక్షీ కమలజా – కమలాస్యా కరాలజా ॥ | (4) | 124 |
| శ్లో॥ | కమలాంఘ్రిద్వయా కామ్యా – కరాఖ్యా కరమాలినీ । | (4) | |
| | కరపద్మధరా కన్దా – కందబుద్ధిప్రదాయినీ ॥ | (3) | 125 |
| శ్లో॥ | కమలోద్భవపుత్రీ చ – కమలా పుత్రకామినీ । | (3) | |
| | కిరన్తీ కిరణచ్ఛన్నా – కిరణప్రాణవాసినీ ॥ | (3) | 126 |
| శ్లో॥ | కావ్యప్రదా కావ్యచిత్తా – కావ్యసారప్రకాశినీ । | (3) | |
| | కాలామ్బా కల్పజననీ – కల్పభేదాసనస్థితా ॥ | (3) | 127 |
| శ్లో॥ | కాలేచ్ఛా కాలసారస్థా – కాలమారణఘాతినీ । | (3) | |
| | కిరణక్రమదీపస్థా – కర్మస్థా క్రమదీపికా ॥ | (3) | 128 |

శ్లో॥ కాలలక్ష్మీః కాలచణ్డా – కులచండేశ్వరప్రియా । (3)
కాకినీశక్తిదేహస్థా – కితవా కింతకారిణీ ॥ (3) 129

శ్లో॥ కరంచా కంచుకా క్రౌంచా – కాకచంచుపుటస్థితా । (4)
కాకాఖ్యా కాకశబ్దస్థా – కాలాగ్నిదహనార్థికా ॥ (3) 130

శ్లో॥ కుచక్షనిలయా కుత్రా – కుపుత్రా క్రతురక్షికా । (4)
కనకప్రతిభాకారా – కరబన్ధాకృతిస్థితా ॥ (2) 131

శ్లో॥ కృతిరూపా కృతిప్రాణా – కృతిక్రోధనివారిణీ । (3)
కుక్షిరక్షాకరా కుక్షా – కుక్షిబ్రహ్మాండధారిణీ ॥ (3) 132

శ్లో॥ కుక్షిదేవస్థితా కుక్షిః – క్రియాదక్షా క్రియాతురా । (4)
క్రియానిష్ఠా క్రియానందా – క్రతుకర్మా క్రియాప్రియా ॥ (4) 133

శ్లో॥ కుశలాసవాసంశక్తా – కుశారిప్రాణవల్లభా । (2)
కుశారివృక్షమదిరా – కాశీరాజవశోద్యమా ॥ (2) 134

శ్లో॥ కాశీరాజగృహస్థా చ – కర్ణభ్రాతృగృహస్థితా । (2)
కర్ణాభరణభూషాఢ్యా – కణ్ఠభూషా చ కంఠికా ॥ (3) 135

శ్లో॥ కణ్ఠస్థానగతా కణ్ఠా – కణ్ఠపద్మనివాసినీ । (3)
కణ్ఠప్రకాశకారిణీ – కణ్ఠమాణిక్యమాలినీ ॥ (2) 136

శ్లో॥ కంఠపద్మసిద్ధికరీ – కణ్ఠాకాశనివాసినీ । (2)
కంఠపద్మసాకినీస్థా – కణ్ఠషోడశపత్రికా ॥ (2) 137

శ్లో॥ కృష్ణాజినధరా విద్యా – కృష్ణాజినసువాససీ । (3)
కుతకస్థా కుఖేలస్థా – కుణ్డవాలంకృతాకృతా ॥ (3) 138

శ్లో॥ కలగీతా కాలధ్వజా – కలభంగపరాయణా । (3)
కాలీచంద్రా కలా కావ్యా – కుచస్థా కుచలప్రదా ॥ (5) 139

శ్లో॥ కుచౌరఘాతినీ కచ్ఛా – కచ్ఛాదస్థా కజాతనా । (4)
కంజాఛదముఖీ కంజా కంజతుండా కజీవనీ ॥ 140

శ్లో॥ కామరాజీవవాద్యస్థా – కియద్హుంకారనాదినీ । (2)
కణాదయజ్ఞసూత్రస్థా – కీలాలయజ్ఞసంజ్ఞకా ॥ (2) 141

శ్లో॥ కటిహాసా కపాటస్థా – కటధూమనివాసినీ । (3)
కటినాదఘోరరతా – కుట్టలా పాటలిప్రియా ॥ (3) 142

శ్లో॥ కామచారాబ్జనేత్రా చ – కామచోద్గారసంక్రమా । (2)
కాష్ఠపర్వతసందాహా – కుష్టాకష్టనివారిణీ ॥ (2) 143

శ్లో॥ కహోడమంత్రసిద్ధస్థా – కాహలా డిండిమప్రియా । (3)
కులడిండిమవాద్యస్థా – కామడామరసిద్ధిదా ॥ (2) 144

| | | | |
|---|---|---|---|
| శ్లో॥ | కులతామరమధ్యస్థా – కులకేకానినాదినీ । | (2) | |
| | కోజాగరఢోలనాదా – కాస్యవీరరణస్థితా ॥ | (2) | 145 |
| శ్లో॥ | కాలాదికరణచ్ఛిద్రా – కరుణానిధివత్సలా । | (2) | |
| | క్రతుశ్రీదా కృతార్థశ్రీః – కాలతారా కులోత్తరా ॥ | (4) | 146 |
| శ్లో॥ | కథాపూజ్యా కథానందా – కథనా కథనప్రియా । | (4) | |
| | కార్థచిన్తా కార్థవిద్యా – కామమిథ్యాపవాదినీ ॥ | (3) | 147 |
| శ్లో॥ | కదంబపుష్పసంకాశా – కదంబపుష్పమాలినీ । | (2) | |
| | కాదంబరీ పానతుష్టా – కాయదమ్భా కదోద్యమా ॥ | (4) | 148 |
| శ్లో॥ | కుంకులేపత్రమధ్యస్థా – కులాధారా ధరప్రియా । | (3) | |
| | కులదేవశరీరార్ధా – కలధామా కులాధరా ॥ | (3) | 149 |
| శ్లో॥ | కామరాగా భూషణాఢ్యా – కామినీరగుణప్రియా । | (3) | |
| | కులీనా నాగహస్తా చ – కులీననాగవాహినీ ॥ | (3) | 150 |
| శ్లో॥ | కామపూరస్థితా కోపా – కపాలీ బందనోద్భవా । | (4) | |
| | కారాగారజనాపాల్యా – కారాగారప్రపాలినీ ॥ | (2) | 151 |
| శ్లో॥ | క్రియాశక్తిః కాలపంక్తిః – కార్ణపంక్తిః కఫోదయా । | (4) | |
| | కామపుల్లారవిందస్థా – కామరూపఫలాఫలా ॥ | (2) | 152 |
| శ్లో॥ | కాయఫలా కాయఫేణా – కాన్తా నాడీఫలీశ్వరా । | (4) | |
| | కామఫేరుగతా గౌరీ – కాయవాణీ కువీరగా ॥ | (4) | 153 |
| శ్లో॥ | కబరీమణిబంధస్థా – కావేరీతీర్థసంగమా । | (2) | |
| | కామభీతిహరా కాన్తా – కామవాకుభ్రమాతురా ॥ | (3) | 154 |
| శ్లో॥ | కవిభావహరా భామా – కమనీయభయాపహా । | (3) | |
| | కామగర్భదేవమాతా – కామకల్పలతామరా ॥ | (2) | 155 |
| శ్లో॥ | కమఠప్రియమాంసాదా – కమఠా కామఠప్రియా । | (3) | |
| | కిమాకారా కిమాధారా – కుంభకారమనస్థితా ॥ | (3) | 156 |
| శ్లో॥ | కామ్యయజ్ఞస్థితా చండా – కామయజ్ఞోపవీతికా । | (3) | |
| | కామయజ్ఞసిద్ధికరీ – కామమైథునయామినీ ॥ | (2) | 157 |
| శ్లో॥ | కామాఖ్యా యమలాశస్థా – కాలయామా కుయోగినీ । | (4) | |
| | కురుయాగహతాయోగ్యా – కురుమాంసవిభక్షిణీ ॥ | (2) | 158 |
| శ్లో॥ | కురురక్తప్రియాకరీ – కింకరప్రియకారిణీ । | (2) | |
| | కర్త్రీశ్వరీ కారణాత్మా – కవిభక్షా కవిప్రియా ॥ | (4) | 159 |
| శ్లో॥ | కవిశత్రుప్రష్ఠలగ్నా – కైలాసోపవనస్థితా । | (2) | |
| | కలిత్రిధా త్రిసిద్ధిస్థా – కలిత్రిదినసిద్ధిదా ॥ | (3) | 160 |

| | | | |
|---|---|---|---|
| శ్లో॥ | కలంకరహితా కాలీ – కలికల్మషకామదా । | (3) | |
| | కులపుష్పరంగసూత్రమణిగ్రంథిసుశోభనా ॥ | (1) | 161 |
| శ్లో॥ | కంబోజవంగదేశస్థా – కులవాసుకిరక్షికా । | (2) | |
| | కులశాస్త్రక్రియా శాన్తిః – కులశాన్తిః కులేశ్వరీ ॥ | (4) | 162 |
| శ్లో॥ | కుశలప్రతిభా కాశీ – కులషట్చక్రభేదినీ । | (3) | |
| | కులషట్పద్మమధ్యస్థా – కులషట్పద్మదీపినీ ॥ | (2) | 163 |
| శ్లో॥ | కృష్ణమార్జారకోలస్థా – కృష్ణమార్జారషష్ఠికా । | (2) | |
| | కులమార్జారకుపితా – కులమార్జారషోడశీ ॥ | (2) | 164 |
| శ్లో॥ | కాలాంతకవలోత్పన్నా – కపిలాంతకఘాతినీ । | (2) | |
| | కలహాసా కాలహశ్రీః – కలహార్థా కలామలా ॥ | (4) | 165 |
| శ్లో॥ | కక్షపక్షరక్షా చ – కుక్షేత్రపక్షసంక్షయా । | (2) | |
| | కాక్షరక్షాసాక్షిణీ చ – మహామోక్షప్రతిష్ఠితా ॥ | (2) | 166 |
| శ్లో॥ | అర్కకోటిశతచ్ఛాయా – అన్వీక్షికికరార్చితా । | (2) | |
| | కావేరీతీరభూమిస్థా – ఆగ్నేయార్కాస్త్రధారిణీ ॥ | (2) | 167 |

**కవచమ్** శ్లో॥ ఐం క్లీం శ్రీం కామకమలా – పాతు కైలాసరక్షిణీ ।
మమ శ్రీం ఈం బీజరూపా – పాతు కాలీ శిరఃస్థలమ్ ॥ 168

శ్లో॥ ఉరుస్థలాబ్జం సకలం – తమోల్కా పాతు కాలికా ।
ఉడుమ్బన్యర్కరమణీ – ఉష్ట్రోగ్రా కులమాతృకా ॥ 169

శ్లో॥ కృతాపేక్షా కృతిమతీ – కుంకారీ కింలిపిస్థితా ।
కుందీర్ఘస్వరా కప్తా చ– కేం కైలాసకరార్చికా ॥ 170

శ్లో॥ కైశోరీ కైం కరీ కైం కేం బీజాఖ్యా నేత్రయుగ్మకమ్ ।
కోమా మతంగయజితా – కౌశల్యాదికుమారికా ॥ 171

శ్లో॥ పాతు మే కర్ణయుగ్మం తు – క్రౌం క్రౌం జీవకరాలినీ ।
గణ్డయుగ్మం సదా పాతు – కుణ్డలీ స్వంకవాసినీ ॥ 172

శ్లో॥ అర్కకోటిశతాభాసా – అక్షరాక్షరమాలినీ ।
ఆశుతోషకరీ హస్తా – కులదేవీ నిరంజనా ॥ 173

శ్లో॥ పాతు మే కులపుష్పాఢ్యా – పృష్ఠదేశం సుకృత్తమా ।
కుమారీ కామనాపూర్ణా – పార్శ్వదేశం సదావతు ॥ 174

శ్లో॥ దేవీ కామాఖ్యకా దేవీ – పాతు ప్రత్యంగిరా కటిమ్ ।
కటిస్థదేవతా పాతు – లింగమూలం సదా మమ ॥ 175

శ్లో॥ గుహ్యదేశం కాకినీ మే – లింగాధః కులసింహికా ।
కులనాగేశ్వరీ పాతు – నితమ్బదేశముత్తమమ్ ॥ 176

శ్లో॥ కంకాలమాలినీ దేవీ – మే పాతు చోరుమూలకమ్ ।
జంఘాయుగ్మం సదాపాతు – కీర్తిః చక్రాపహారిణీ ॥ 177

శ్లో॥ పాదయుగ్మం పాకసంస్థా – పాకశాసనరక్షికా ।
కులాలచక్రభ్రమరా – పాతు పాదాంగులీర్మమ ॥ 178

శ్లో॥ నఖాగ్రాణి దశవిధా – తథా హస్తద్వయస్య చ ।
వింశరూపా కాలనాక్షా – సర్వదా పరిరక్షతు ॥ 179

శ్లో॥ కులచ్ఛత్రాధారరూపా – కులమండలగోపితా ।
కులకుండలినీ మాతా – కులపండితమణ్డితా ॥ 180

శ్లో॥ కాకాననా కాకతుండీ – కాకాయుః ప్రఖరార్కజా ।
కాకజ్వరా కాకజిహ్వా – కపిక్రోధాసనస్థితా ॥ 181

శ్లో॥ కపిధ్వజా కపిక్రోశా – కపిబాలా కపిస్వరా ।
కాలకాంచీ వింశతిస్థా – సదా వింశనఖాగ్రహమ్ ॥ 182

శ్లో॥ పాతు దేవీ కాలరూపా – కలికాలఫాలాలయా ।
వాతే వా పర్వతే వాపి – శూన్యాగారే చతుష్పథే ॥ 183

శ్లో॥ కులేంద్రసమయాచారా – కులాచారజనప్రియా ।
కులపర్వతసంస్థా చ – కులకైలాసవాసినీ ॥ 184

శ్లో॥ మహాదావానలే పాతు – కుమార్గే కుత్సితగ్రహే ।
రాజ్ఞోఽప్రియే రాజవశ్యే – మహాశత్రువినాశనే ॥ 185

శ్లో॥ కలికాలమహాలక్ష్మీః – క్రియాలక్ష్మీః కులామ్బరా ।
కలీంద్రకీలితా కీలా – కీలాలస్వర్గవాసినీ ॥ 186

శ్లో॥ దశదిక్షు సదా పాతు – ఇంద్రాదిదశలోకపా ।
నవచ్ఛిన్నే సదా పాతు – సూర్యాదికనవగ్రహా ॥ 187

శ్లో॥ పాతు మాం కులమాంసాఢ్యా – కులపద్మనివాసినీ ।
కులద్రవ్యప్రియా మధ్యా – షోడశీ భువనేశ్వరీ ॥ 188

శ్లో॥ విద్యావాదే వివాదే చ – మత్తకాలే మహాభయే ।
దుర్భిక్షాదిభయే చైవ – వ్యాధిసంకరపీడితే ॥ 189

శ్లో॥ సర్వత్ర సర్వదేశే చ – కులరూపా సదాఽవతు ।
ఇత్యేతత్ కథితం నాథ! మాతుః ప్రసాదహేతునా ॥ 190

శ్లో॥ **అష్టోత్తరశతం నామ – సహస్రం** కుణ్డలీప్రియమ్ ।
కులకుణ్డలినీదేవ్యాః – సర్వమన్త్రసుసిద్ధయే ॥ 191

**ఫలశ్రుతి**

శ్లో॥ సర్వదేవమనూనాం చ చైతన్యాయ సుసిద్ధయే ।
అణిమాద్యష్టసిద్ధ్యర్థం సాధకానాం హితాయ చ ॥ 192

శ్లో॥ బ్రాహ్మణాయ ప్రదాతవ్యం – కులద్రవ్యపరాయ చ ।
అకులీనేఽ బ్రహ్మణే చ – న దేయః కుణ్డలీస్తవః ॥ 193

శ్లో॥ ప్రవృత్తే కుణ్డలీచక్రే – సర్వే వర్ణా ద్విజాతయః ।
నివృత్తే భైరవీచక్రే – సర్వే వర్ణాః పృథక్ పృథక్ ॥ 194

శ్లో॥ కులీనాయ ప్రదాతవ్యం – సాధకాయ విశేషతః ।
దానాదేవ హి సిద్ధిః – స్యాన్మమాజ్ఞాబలహేతునా ॥ 195

శ్లో॥ మమ క్రియాయాం యః తిష్ఠేత్ – స మే పుత్త్రో న సంశయః ।
స ఆయాతి మమ పదం జీవన్ముక్తః స మానవః ॥ 196

శ్లో॥ ఆసవేన సమాంసేన – కులవహ్నౌ మహానిశి ।
నామ ప్రత్యేకముచ్చార్య – జుహుయాత్ కార్యసిద్ధయే ॥ 197

శ్లో॥ పంచాచారరతే భూత్వా – ఊర్ధ్వరేతా భవేత్ యతిః ।
సంవత్సరాత్ మమ స్థానే – ఆయాతి నాత్ర సంశయః ॥ 198

శ్లో॥ ఐహికే కార్యసిద్ధిః స్యాత్ – దేహికే సర్వసిద్ధిదః ।
వశీ భూత్వా త్రిమార్గస్థః – స్వర్గభూతలవాసినః ॥ 199

శ్లో॥ అస్య భృత్యాః ప్రభవన్తి – ఇంద్రాదిలోకపాలకాః ।
స ఏవ యోగీ పరమో – యస్యార్థేఽయం సునిశ్చలః ॥ 200

శ్లో॥ యో లోకః ప్రజపత్యేవం – స శివో న చ మానుషః ।
స సమాధిగతో నిత్యో – ధ్యానస్థో యోగివల్లభః ॥ 201

శ్లో॥ చతుర్వ్యూహగతో దేవః – సహసా నాత్ర సంశయః ।
యః ప్రధారయతే భక్త్యా – కణ్ఠే వా మస్తకే భుజే ॥ 202

శ్లో॥ స భవేత్ కాలికాపుత్త్రో – విద్యానాథః స్వయంభువి ।
ధనేశః పుత్రవాన్ యోగీ – యతీశః సర్వగో భవేత్ ॥ 203

**శ్లో॥ వామా వామకరే ధృత్వా సర్వసిద్ధీశ్వరో భవేత్ । 204**

**శ్లో॥ యది పఠతి మనుష్యో మానుషీ వా మహత్మా**
**సకలధనజనేశీ పుత్రిణీ జీవవత్సా ।**
**కులపతిరిహ లోకే స్వర్గమోక్షైకహేతుః**
**స భవతి భవనాథో యోగినీవల్లభేశః ॥ 205**

**శ్లో॥ పఠతి య ఇహ నిత్యం భక్తిభావేన మర్త్యో**
**హరణమపి కరోతి ప్రాణవిప్రాణయోగః ।**
**స్తవనపఠనపుణ్యం కోటిజన్మాఘనాశం**
**కథితుమపి న శక్తోఽహం మహామాంసభక్షా ॥ 206**

॥ ఇతి శ్రీరుద్రయామలే మహాకులకుణ్డలినీ అష్టోత్తరసహస్రనామస్తవ కవచమ్ ॥

– ఓం నమశ్శివాయ – శివాయనమ ఓం –

శ్రీః



# అర్ధనారీశ్వరమ్

- చింతలపూడి వెంకటేశ్వర్లు



**వాగర్థావివ సంపృక్తౌ వాగర్థప్రతిపత్తయే ।**
**జగతః పితరౌ వందే పార్వతీపరమేశ్వరౌ ॥**

మాట, అర్థం రెండూ ఏవిధంగా విభజింపరానివో అలా కలిసి ఉన్న ఈ ప్రపంచ తలిదండ్రులైన పార్వతీపరమేశ్వరులను అర్థవంతమైన మాటలకోసం ప్రార్థిస్తున్నాను అని అర్థం. అంటే ఆ దంపతులు విడదీయటానికి వీలు లేనంతగా కలిసిపోయారన్నమాట. ఒకవేళ విడిపోతే వాగర్థాలలాగే వీరికీ అస్తిత్వం ఉండదా అంటే ఉండదనే చెప్పాలి. కాని ఉంటుంది. శివుడు స్థాణువు. అంటే జీవంలేని పదార్థం. పార్వతి ఒక శక్తి. అంటే రూపంలేని పదార్థం. అవి రూపారూపాల్లో విడివిడిగా అస్తిత్వం ఉన్నవే. కలిసినప్పుడు మాత్రమే రూపం ప్రాణం ఉన్న ఒక జీవపదార్థం అవుతుంది.

**శివః శక్త్యాయుక్తో యది భవతి శక్తః ప్రభవితుమ్ ।**
**నచేదేవం దేవో న ఖలు కుశలః స్పందితుమపి ॥**

ఇది సాక్షాత్ శంకరాంశగా భావించుకుంటున్న ఆదిశంకరభగవత్పాద విరచిత సౌందర్యలహరిలోని మొదటి శ్లోకం. 'భగవతీ! ఈశ్వరుడు కూడ శక్తితో కూడినప్పుడే జగముల సృష్టించగలడు. ఆమె లేనిచో గరికపోచను కూడా కదపలేడు.' అని అర్థం. అంటే శక్తి అనేది లేకపోతే స్థాణువనేది ఏపనీ చేయలేదుకదా!

కొండలు, పర్వతాలు, నదులు, శిలలు, మొక్కలు, చెట్లు ఇలా కదలని వాటిని స్థావరాలు అంటారు. ఇవన్నీ శివస్వరూపం అంటుంది శివపురాణం. అందుకు ఇవన్నీ స్థావర లింగాలు. మనం మొక్కలకు నీరుపోస్తే అది కూడా శివార్చనగా భావించి అనుగ్రహం ప్రసాదిస్తాడు పరమశివుడు. అట్లాగే ప్రకృతి వనరులను విచ్చలవిడిగా దోచుకోవడం స్థావర లింగరూపంలో ఉన్న శివునికి అపచారం చేసినట్లే అవుతుంది.

యోగసంప్రదాయంలో శివుడు యోగులకు యోగి, సృష్టిలో ఆదియోగి. శివుని ద్వారానే లోకానికి యోగ, ధ్యానాది విద్యలు పరిచయమయ్యాయి అంటారు. యోగి అంటే కదలకుండా కూర్చోవడం. కదలికని స్థంభించడమే యోగం. ఈ విధంగా కూడా శివుడు అచలుడే. అంటే స్థాణువే.

జనకునకు యాజ్ఞవల్క్యుడు చెప్పిన ప్రళయవిజ్ఞానం ప్రకారం సృష్టిని, లయాన్ని ప్రకృతి కల్పిస్తుంది. ఒక రోజులో పగలు పది కల్పాలు, రాత్రి ఒక కల్పం ఉంటాయి. పగలు సృష్టి జరుగుతుంది. రాత్రి లయం జరుగుతుంది. రాత్రి కాగానే అవ్యక్తమైన ప్రకృతి అహంకారపూరితుడైన పురుషుని ప్రబోధిస్తుంది. ఆ పురుషుడు 12 రూపాలు ధరించి సర్వభూతాలను లయం చేస్తాడు. ఆ తరువాత భూమి అంతా జలమయం అవుతుంది. ఆ జలాన్ని కాలాగ్ని ఆవిరి చేస్తుంది. కాలాగ్నిని వాయువు తుదముట్టిస్తుంది. వాయువు ఆకాశంలో లయమవుతుంది. ఆకాశం మనసులో కలిసిపోతుంది. ఆ

మనసును అహంకారపూరితుడైన పురుషుడు కబళిస్తాడు. ఆ అహంకారం అవ్యక్తమైన ప్రకృతిలో లీనమవుతుంది. ఇలా రాత్రి జరుగుతుంది. తరువాత పగలు రాగానే పునఃసృష్టి జరుగుతుంది. దీనినిబట్టి ఈ ప్రకృతి మొత్తం ఒకనాటికి కనిపించకుండా పోయి తిరిగి మెలమెల్లగా మళ్ళీ వ్యక్తమవుతుంది. ఈ ప్రక్రియ నిరంతరం.

నేటి శాస్త్రీయ విజ్ఞానం ప్రకారం కూడా ద్రవ్యరాశిలోని రేణువులు దగ్గరపడుతున్నకొద్దీ గురుత్వాకర్షణ పెరిగి ద్రవ్యరాశి మరింత వేగంగా దగ్గర పడుతూ ఉంటుంది. చివరికి మొత్తం ద్రవ్యరాశి మన సూర్యుడిలాంటి సాంద్రమైన వస్తువుగా మారిపోతుంది. ఆ సంఘటన శక్తే కాంతిశక్తిగా మారి సూర్యుణ్ణి ప్రజ్వలింప చేస్తుంది. ఇది మన సూర్యుడు, మిగిలిన నక్షత్రాల ఉత్పత్తికి కారణంగా శాస్త్రజ్ఞులు భావించారు.

ఈ రేణువులంటే ఏమిటి? వేదాలలోకి వెడితే కణాదుని సిద్ధాంతం కొంతవరకు అర్థం చెబుతుంది. కణాదుని వైశేషికం వైదికాలైన ఆరు సిద్ధాంతాల్లో ఒకటి. చారిత్రకంగా తర్కానికి, న్యాయానికి దగ్గరగా నిలిచే సిద్ధాంతం ఇది. ఇందులో నేల, నీరు, నిప్పు, గాలి అనే నాలుగు పదార్థాలు పరమాణు నిర్మితాలే. దీని ప్రకారం త్రసరేణువు అన్నిటికంటే చిన్నది. ఇది కిటికీలోంచి వచ్చే సూర్యకిరణాల్లో కదులుతూ కనిపించే ధూళిరేణువు. దీనిని త్రయాణువు అంటారు. దీనిని మూడు భాగాలు చేస్తే వచ్చే ఒక్కొక్క భాగం ద్వయాణువు. ద్వయాణువును రెండు భాగాలు చేస్తే వచ్చేది పరమాణువు. వీటిని నిర్మించలేము. నాశనం చేయలేము. ప్రతి పరమాణువుకు ప్రత్యేక అస్తిత్వం ఉంటుంది. నేటి శాస్త్ర పాటవం రీత్యా పరమాణువుకు ఇంకా చిన్న రూపం వచ్చిందనుకోండి. ఇక ఏవిధంగానూ విభజించడానికి వీలులేని దానికి పరమాణువు అని పేరు. ఆ పరమాణువుకు కూడా ఉపపరమాణువులు ఉంటాయట.

పరమాణువు జీవపదార్థమా? అజీవపదార్థమా? అజీవ పదార్థము అనుకుంటే జైనధర్మంలోకి ఒకసారి తొంగి చూడాలి. అందులో అజీవపదార్థాలు అయిదు రకాలు. ఒకటి ధర్మాస్తికాయ. ఇక్కడ ధర్మ అంటే మతపరమైనది కాదు. కదలికకు మాధ్యమం. ఆస్తికాయ అంటే వస్తువుల మధ్య ఖాళీలు లేక ప్రాంతాల సమూహం. ధర్మాస్తికాయ అంటే ఈ విశ్వంలో పదార్థాలు కదిలే మాధ్యమం. ఇది లేకపోతే ప్రాణులు కదలలేవు. రెండు అధర్మాస్తికాయ. ఇది విశ్రాంతి మాధ్యమం. ఇది లేకపోతే ప్రాణులు విశ్రాంతి లేకుండా కదులుతూనే ఉంటాయి. మూడు ఆకాశాస్తికాయ. ఇది మళ్ళీ లోకాకాశ, అలోకాకాశ అని రెండు రకాలు. ప్రాణం, పరమాణువు, అణుసమూహాలు ఉండేది లోకాకాశం. ఇది లేనిది అలోకాకాశం. నాలుగోది పుద్గలాస్తికాయ. కలయిక, విభజన అనే ప్రక్రియలలో నిరంతరం పరిణామశీలం పరమాణుశరీరం. ఈ విశ్వంలోని పదార్థమంతా పుద్గలం. జైనంలో ఆత్మకంటిన కర్మధాతువులు కూడా పుద్గలమే. ఇందులో ఇంక విభజించ లేనిది పరమాణువు. చివరిది కాల. ఇది కాలానికి చెందినది. భూత, భవిష్యత్తు, వర్తమానాలు దీని రూపాలు. ఇది అనంతం. జైనంలో ఇదికూడా అజీవపదార్థమే.

మొత్తంమీద అజీవపదార్థమే స్థాణువు. దీనినే శాస్త్రజ్ఞులు సృష్టించలేని, నాశనం చేయలేని పదార్థంగా భావిస్తారు. ఇదే పరమాణువు. విస్ఫోటం జరిగినపుడు కూడా ఇందులోని ఎలక్ట్రానులు, ప్రోటానులు స్థానచలనం పొందుతాయి తప్ప నాశనం కావు. ఈ పరమాణవుల సమ్మేళనమే పదార్థం.

అందుకనే మూల పదార్థాన్ని మార్పు చేయగలమే తప్ప నాశనం చేయలేము, తయారుచేయలేము అంటారు. ఇందులో జీవం ప్రవేశించటమే ఈనాటికీ అంతుపట్టని ఏకైక సమస్య.

**పూర్ణమదః పూర్ణమిదమ్ పూర్ణాత్ పూర్ణముదచ్యతే ।**
**పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే ॥**

అది నిండుగా ఉంది. ఇది కూడా నిండుగా ఉంది. ఆ నిండుకు ఈ నిండు కలిపినా నిండుగానే ఉంటుంది. ఒక నిండు తీసేసినా అది నిండుగానే ఉంటుంది. ఇది వేదవచనం. పరమతత్త్వానికి నిర్వచనం. మహేశ రూపానికి నిరూపణం. అంటే పరమేశ్వరుని రూపం స్థాణువు అంటే పరమాణువు అన్నమాట. ఆ పరమాణువులోనికి శక్తి ప్రవేశిస్తే అది జీవాణువు. పరమాణువుకు స్వయం చలనత్వం లేదు. జీవాణువుకు ఉంది.

ఈ రహస్యాన్నే మన పూర్వులు శివశక్తుల సమ్మేళనంగా భావించారు. అవిభక్తమైన జంటగా పేర్కొన్నారు. అర్ధనారీశ్వరుని చేశారు. ఈ జీవప్రపంచానికి ఆదిదంపతులుగా భావించారు. సృష్టి నిర్మాణానికి కారకులుగా భావించారు. పరమాణువు జీవాణువుగా మారే ప్రక్రియను మాత్రం నిర్వచించలేదు. ఒకవేళ వేదంలో ఎక్కడైనా ఉందేమో పండితులు చెప్పాలి. మన శాస్త్రజ్ఞులు మాత్రం ఈ విషయాన్ని ఇంకా పరిశోధిస్తూనే ఉన్నారు. జైగోట్ తయారైంది అంటారేతప్ప అది ఏవిధంగా జరిగిందో చెప్పలేకపోతున్నారు. నేటికీ పరిష్కారం లభించని సమస్య ఈ సమ్మేళనం. ✦

---

# రుద్రపఞ్చముఖధ్యానమ్

మం. **సద్యోజాతం ప్రపద్యామి సద్యోజాతాయ వై నమో నమః ।**
**భవే భవే నాతిభవే భవస్వ మామ్ । భవోద్భవాయ నమః ॥**

(తై.ఆ. 10 ప్ర.43–44 అను)

సద్యోజాతమ్ = సద్యోజాతము అను నామము కలదియు మహాదేవసంబంధియు అగు ఏ పశ్చిమముఖము కలదో – అట్టి ముఖమే తన రూపముగా కల మహాదేవపరమేశ్వరుని; ప్రపద్యామి = ఆశ్రయించుచున్నాను; సద్యోజాతాయ–వై = అట్టి సద్యోజాతనామక మహాదేవమూర్తికొరకే; నమః = (నేచేయు) నమస్కారము; అస్తు = అగుగాక!; (హే సద్యోజాత = ఓ సద్యోజాతమహాదేవా!); మామ్ = నన్ను; భవే–భవే = నా ప్రతియొక జన్మమునందును; న–భజస్వ = ఆశ్రయించకుమా; అతిభవే = (పునర్) జన్మమును అతిలంఘించు విషయమున; మామ్ = నన్ను; భజస్వ = ఆశ్రయించుమా; ప్రేరేపించుమా!; భవ–ఉద్–భవాయ = భవనము (సంసారము) నుండి ఉద్భావమును (దానికి అతీతుడై యుండుటను) కలిగించు (సంసారమునుండి ఉద్ధరించు) సద్యోజాతునికొరకు; నమః = నమస్కారము.

శ్లో॥ ప్రాలేయాచలచన్ద్రకున్దధవలం – గోక్షీరఫేనప్రభం
భస్మాభ్యక్త మనఙ్గదేహదహన – జ్వాలావలీలోచనమ్ ।
బ్రహ్మేన్ద్రాదిమరుద్గణై స్తుతిపరై – రభ్యర్చితం యోగిభి –
ర్వన్దేఽహం సకలం కళఙ్కరహితం – స్థాణో ర్ముఖం పశ్చిమమ్ ॥ 3

**ఓం ఉం; టం ఠం డం ఢం ణం; ఊం ఓం – ఓం నమో భగవతే రుద్రాయ – ఓం శిం; పశ్చిమముఖాయ నమః ॥3॥**



శ్రీః

# శివతాండవ స్తోత్రమ్

(శ్రీ దశకంఠరావణ విరచితమ్)

శ్లో॥ జటాటవీగలజ్జలప్రవాహపావితస్థలే
గలేవలంబ్య లంబితాం భుజంగతుంగమాలికామ్ ।
డమడ్డమడ్డమడ్డమన్నినాదవడ్డమర్వయం
చకార చండతాండవం తనోతు నశ్శివశ్శివమ్ ॥ 1

శ్లో॥ జటాకటాహసంభ్రమభ్రమన్నిలింపనిర్ఝరీ-
విలోలవీచివల్లరీవిరాజమానమూర్ధని ।
ధగద్ధగద్ధగజ్జ్వలల్లలాటపట్టపావకే
కిశోరచంద్రశేఖరే రతిః ప్రతిక్షణం మమ ॥ 2

శ్లో॥ ధరాధరేంద్రనందినీవిలాసబంధుబంధుర-
స్ఫురద్దిగంతసంతతిప్రమోదమానమానసే ।
కృపాకటాక్షధోరణీనిరుద్ధదుర్ధరాపది
క్వచిద్దిగంబరే మనో వినోదమేతు వస్తుని ॥ 3

శ్లో॥ జటాభుజంగపింగళస్ఫురత్ఫణామణిప్రభా-
కదంబకుంకుమద్రవప్రలిప్తదిగ్వధూముఖే ।
మదాంధసింధురస్ఫురత్త్వగుత్తరీయమేదురే
మనో వినోదమద్భుతం బిభర్తు భూతభర్తరి ॥ 4

శ్లో॥ సహస్రలోచనప్రభృత్యశేషలేఖశేఖర-
ప్రసూనధూళిధోరణీవిధూసరాంఘ్రిపీఠభూః ।
భుజంగరాజమాలయా నిబద్ధజాటజూటకః
శ్రియై చిరాయ జాయతాం చకోరబంధుశేఖరః ॥ 5

శ్లో॥ లలాటచత్వరజ్వలద్ధనంజయస్ఫులింగభా-
నిపీతపంచసాయకం నమన్నిలింపనాయకమ్ ।
సుధామయూఖలేఖయా విరాజమానశేఖరం
మహాకపాలి సంపదే శిరో జటాలమస్తు నః ॥ 6

శ్లో॥ కరాళభాలపట్టికాధగద్ధగద్ధగజ్జ్వల-
ద్ధనంజయాహుతీకృతప్రచండపంచసాయకే ।
ధరాధరేంద్రనందినీకుచాగ్రచిత్రపత్రక-
ప్రకల్పనైకశిల్పిని త్రిలోచనే రతిర్మమ ॥ 7

శ్లో॥ నవీనమేఘమండలీనిరుద్ధదుర్ధరస్ఫురత్-
కుహూనిశీథినీతమః ప్రబంధబద్ధకంధరః ।
నిలింపనిర్ఝరీధరస్తనోతు కృత్తిసింధురః
కలానిధానబంధురశ్శ్రియం జగద్ధురంధరః ॥ 8

శ్లో॥ ప్రఫుల్లనీలపంకజప్రపంచకాలిమప్రభా-
వలంబికంఠకందలీరుచిప్రబద్ధకంధరమ్ ।
స్మరచ్ఛిదం పురచ్ఛిదం భవచ్ఛిదం మఖచ్ఛిదం
గజచ్ఛిదంధకచ్ఛిదం తమంతకచ్ఛిదం భజే ॥ 9

శ్లో॥ అఖర్వసర్వమంగలాకలాకదంబమంజరీ-
రసప్రవాహమాధురీవిజృంభణామధువ్రతమ్ ।
స్మరాంతకం పురాంతకం భవాంతకం మఖాంతకం
గజాంతకాంధకాంతకం తమంతకాంతకం భజే ॥ 10

శ్లో॥ జయత్వదభ్రవిభ్రమభ్రమద్భుజంగమశ్వసద్-
వినిర్గమక్రమస్ఫురత్కరాలభాలహవ్యవాట్ ।
ధిమిద్ధిమిద్ధిమిద్ధ్వనన్ మృదంగతుంగమంగల-
ధ్వనిక్రమప్రవర్తితప్రచండతాండవశ్శివః ॥ 11

శ్లో॥ దృషద్విచిత్రతల్పయోర్భుజంగమౌక్తికస్రజోః
గరిష్ఠరత్నలోష్ఠయోః సుహృద్విపక్షపక్షయోః ।
తృణారవిందచక్షుషోః ప్రజామహీమహేంద్రయోః
సమప్రవృత్తికః కదా సదాశివం భజామ్యహమ్ ॥ 12

శ్లో॥ కదా నిలింపనిర్ఝరీనికుంజకోటరే వసన్
విముక్తదుర్మతిస్సదా శిరస్థమంజలిం వహన్ ।
విలోలలోలలోచనో లలామభాలలగ్నకః
శివేతి మంత్రముచ్చరన్ కదా సుఖీ భవామ్యహమ్ ॥ 13

శ్లో॥ ఇమం హి నిత్యమేవముక్తముక్తమోత్తమం స్తవం
పఠన్ స్మరన్ బ్రువన్నరో విశుద్ధిమేతి సంతతమ్ ।
హరే గురౌ సుభక్తిమాశు యాతి నాన్యథా గతిం
విమోహనం హి దేహినాం సుశంకరస్య చింతనమ్ ॥ 14

శ్లో॥ పూజావసానసమయే దశవక్త్రగీతం
యశ్శంభుపూజనపరం పఠతి ప్రదోషే ।
తస్య స్థిరాం రథగజేంద్రతురంగయుక్తాం
లక్ష్మీం సదైవ సుముఖీం ప్రదదాతి శంభుః ॥ 15

✦ శివార్పణమస్తు ✦

శ్రీః

శ్రీమతేరామానుజాయ నమః

# "స శ్రియే చ అమృతాయ చ"

శ్రీ మోహనరావుగారికి నమస్కారములు. అక్టోబరు నెల "ఆత్మజ్యోతి"లో శ్రీ మల్లాది హనుమంతరావుగారి అమరకోశ పరిచయం బాగున్నది. గ్రంథస్వరూప పరిచయంతో బాటు, సంస్కృతభాషను అధ్యయనం చేయాలనుకొనేవారికి అమరనిఘంటువు ఎంతో ఉపకారకమని, అవశ్యం పఠనీయమని సూచించారు.

ఆ **గ్రంథరాజం** లోకానికి అందించిన ఐతిహ్యాన్ని వివరించడం ముదావహం. శ్రీ శంకరుల చరిత్రలో మండనమిశ్రుల విషయంలో కూడా ఇలాంటి ఇతివృత్తమే ఇంచుమించుగా వినిపిస్తున్నది. అమరసింహుని కాలనిర్ణయం విషయంలో విమర్శకుల క్రీ॥శ॥ మొదటి శతాబ్దం మొదలుకొని క్రీ॥శ॥ 7వ శతాబ్దం వఱకు పలువిధాలుగా అభిప్రాయ పడుతున్నారు. ఏదేమైనా, అవి యేవీ ఈ గ్రంథకర్తకు శంకరులతో సమకాలికతను సాధింపలేకపోతున్నవి. "యస్య జ్ఞానదయాసిన్ధోః" – మంగళ శ్లోక సంగ్రహ వివరణం ఆకట్టుకొన్నది. శ్రీ మల్లాదివారికి ధన్యవాదాలు. వారి వ్యాసాన్ని చూచి "చాపలాయ ప్రచోదితః" అన్నట్లు సోత్సాహంగా వ్రాస్తున్న అనుస్పందనమే ఇది.

విజ్ఞులు అమరనిఘంటువును అత్యుత్తమ ప్రమాణంగా సంభావించారు. అందునా, తెలుగువారు ఈ నిఘంటువు విషయంలో చూపిన ప్రామాణ్యబుద్ధి అనుపమానమైనది. **"అమరం నెమఱువేస్తే కావ్యాలెందుకు..."** అన్న లోకోక్తియే అందుకు తార్కాణం. ఏ భాషకు చెందిన గ్రంథముయొక్క వైభవాన్ని అయినా, ఆ భాషలోనే ప్రశంసాపూర్వకంగా తెలియజేయడం సహజమే. కాని భాషాంతరాలవారు అన్యభాషకు సంబంధించిన సాంకేతిక గ్రంథ వైశిష్ట్యాన్ని తమ భాషలోని జాతీయాల ద్వారా కొనియాడడం విశేషం. దీన్నిబట్టి కూడా ఆంధ్రుల హృదయంలో అమరంపై ఆదరం అపారమని తెలుస్తోంది.

అమరకోశానికి యాభైకి మించి వ్యాఖ్యానాలున్నాయి. ఆ వ్యాఖ్యాబాహుళ్యమే ఈ నిఘంటువుయొక్క ప్రమాణికతను, సర్వాతిశయమైన వైలక్షణ్యాన్ని, పాఠక జనాదరాన్ని స్పష్టం చేస్తోంది.

ఈ నామలింగానుశాసనానికి ప్రసిద్ధమైన వ్యాఖ్యలలో భానుజిదీక్షిత కర్తృకమైన "సుధా" వ్యాఖ్యను ప్రముఖంగా పేర్కొనవచ్చు. ఈ వ్యాఖ్యాకారుడు వైయాకరణ సిద్ధాన్త కౌముదీకర్తయైన భట్టోజిదీక్షితులవారి ఆత్మీయుడు, శిష్యుడు అని మంగళశ్లోక, వ్యాఖ్యాంత గద్యలను బట్టి తెలుస్తోంది. ఈ వ్యాఖ్య – అమరం లోని ''స్వః'' ఇత్యాది నైఘంటుక శబ్దాలన్నిటిని ధాతుజములను క్రియాపదములనుండి సిద్ధించినవి గా నిరూపిస్తూ వ్యాకరణ పరంగా ప్రామాణికతను ప్రదర్శిస్తూ అర్థవిరణం చేస్తుంది.

సుధావ్యాఖ్యారంభంలో ఇంకొక విశేషాన్ని మనం చూడవచ్చు. మంగళాచరణ శ్లోకాన్ని ఈ వ్యాఖ్యాత అద్భుతమైన రీతిలో గురుపరంగా సమగ్రంగాను సరళవిపులంగాను వివరిస్తారు. ఆ వ్యాఖ్యావిశేషాలను తెలిసికొని ఆనందించుదాం –

**"యస్య జ్ఞానదయాసిన్ధోరగాధస్యానఘా గుణాః ।**
**సేవ్యతామక్షయో ధీరాస్సశ్రియై చామృతాయ చ॥"**

ఈ శ్లోకంలో "ధీరాః" అను పదాన్ని వ్యాకరణబలంతో ఆచార్య పరమైనదిగా సమన్వయించి, విశేష్యముగా నిలిపి, ఆచార్యసేవాభాగ్యము కలుగవలెనని గ్రంథకర్త మంగళాచరణం చేస్తున్నట్లు వ్యాఖ్యాత వైదిక ప్రమాణ ప్రదర్శన పురస్సరంగా వ్యాఖ్యానిస్తారు.

**"జ్ఞానదయాసిన్ధోః అగాధస్య, యస్య అనఘాః గుణాః (సన్తి) సః అక్షయః ధీరాః శ్రియే చ అమృతాయ చ (భవద్భిః / మయా) సేవ్యతామ్"**– అని అన్వయక్రమము.

**ప్రతిపదార్థము :** జ్ఞానదయాసిన్ధోః = జ్ఞానము కరుణలకు సముద్రమువలె తరగని నిధియైనవాడు, అగాధస్య = గంభీరమైనవాడును అయిన, యస్య = ఏ ఆచార్యునికి, అనఘాః = పాపనివర్తకములైన, గుణాః = గుణములు కలవో, సః = అట్టి, అక్షయః = భగవానుని యందు నిలిపిన హృదయముగల, ధీరాః = జ్ఞానప్రదాత (ఆచార్యుడు), శ్రియే చ = సంపద కొఱకు, అమృతాయ చ = మోక్షము కొఱకును, సేవ్యతామ్ = సేవింప బడుగాక!

**తాత్పర్యము :** ఆచార్యుడు జ్ఞానదయాసాగరుడు, గంభీరహృదయుడు. ఆయన సత్య దయాద్యనేక కళ్యాణ గుణ సంపన్నుడు. ఆయన తన హృదయమున శ్రీమన్నారాయణుని నివాసముగా చేసికొనినవాడు. అట్టి జ్ఞానప్రదాతను అనగా గురువర్యుని ఇహలోక సుఖములను పొందుటకును మఱియు శాశ్వతానందానుభవరూపమైన మోక్షము కొఱకును నేను సేవింతును.

**వివరణము : జ్ఞానదయాసిన్ధోః :** తెలిసికొనుటకు సాధనమైనది కనుక "జ్ఞానము" అనగా "శాస్త్రము". "దయ" అనగా ప్రతిఫలమును ఆశించకుండగనే పరుల దుఃఖాన్ని పోగొట్టాలనే తలంపు. నిరతిశయములైన ఈ రెండింటితో పరిపూర్ణుడై సముద్రము వలె నుండువాడు. ఇచట **"శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్"** అని ఆచార్యుడు వైదిక జ్ఞాన సంపన్నుడై యుండవలెనని చెప్పిన శ్రుతివాక్యము "జ్ఞానసింధు" అనుట ద్వారా స్మరింపజేయుబడుచున్నది. కేవలం జ్ఞానవంతుడైనంత మాత్రమున ప్రయోజనము లేదని. ఆచార్యుడు "దయాసింధు"వని చెప్పుట "దయాలో రసమర్థస్య దుఃఖాయైవ దయాలుతా" అన్నట్లు జ్ఞానములేని దయ దుఃఖహేతువగు నని జ్ఞానదయాపరిపూర్ణత్వం సూచింపబడింది.

**అగాధస్య :** గంభీరుడు. అనగా ఆచార్యుడు ఇంద్రియ విషయములకు వశ్యుడు కాడని భావము. లేక అగమనగా పర్వతము, వృక్షము అని అర్థము. వానిని పొందువాడు పరమాత్మ. ఆయనను చిత్తమునందు ఎల్లప్పుడు ధరించువాడు అగాధః.

**గుణాః :** కళ్యాణ గుణములు.

> "సత్యం, శౌచం, దయా, క్షాన్తి, స్త్యాగ, స్సన్తోష, ఆర్జవమ్ ।
> శమో, దమ, స్తప, స్సామ్యం, తితిక్షో, పరతి, శ్రుతమ్ ॥
> జ్ఞానం, విరక్తి, రైశ్వర్యం, శౌర్యం, తేజో, బలం, స్మృతిః ।
> స్వాతన్త్ర్యం, కౌశలం, కాన్తి, ర్ధైర్యం, మార్దవమేవ చ ॥

– ఇట్లనేక సద్గుణములు ఆచార్యునకు భూషణములు.

**అనఘాః :** సద్గురుని గుణములు అనఘములు అనగా పాపనివర్తకములు. తననాశ్రయించిన శిష్యుల సమస్తదోషములను తొలగించి వారికి చక్కని జ్ఞానమును ప్రసాదించునవి అని భావము. ఈ పదమును ఇట్లు గుణములకు విశేషణముగా మాత్రమే గాక, సంబోధన విభక్త్యంతముగా కూడా అన్వయింపవచ్చును.

ఈ పక్షమున "భవద్భిః" అను పదమును ఆధ్యాహృతము చేసి" ఓ పాపరహితులారా! మీచే ఆచార్యుడు సేవింపబడుగాక!" అని చెప్పవచ్చు.

**అక్షయః :** అకారశబ్దవాచ్యుడు శ్రీమన్నారాయణుడు. క్షయమనగా జ్ఞానము, నివాసము అని అర్థములు. ఆచార్యుడు సర్వేశ్వరసంబంధమైన జ్ఞానము కలవాడు, అతని యందుండు వాడు అని భావము. దీనివలన "బ్రహ్మనిష్ఠమ్" అను ఉపనిషద్వాక్యము అనూదితమైనది.

ఇచట ఇంకొక యోజన–క్షయ మనగా హింస. అక్షయుడనగా పరహింసాపహారకు డని తాత్పర్యం. "యస్మాన్నోద్విజతే లోకః" అని కదా గీతావచనము.

**ధీరాః :** ధియం రాతి (దదాతి) అను వ్యుత్పత్తిని బట్టి జ్ఞానమును ప్రసాదించు గురువు "ధీరాః" (ఆకారాన్తప్రథమైక వచనం – "విశ్వాపాః" వలె). ఇదియే ఇచట విశేష్యము. **"తద్విజ్ఞానార్థం స గురుమేవాభిగచ్ఛేత్"** అను శ్రుత్యర్థము ఇచట ప్రస్ఫుట మగుచున్నది. జ్ఞానార్థులు జ్ఞానప్రదుడైన ఆచార్యునే కదా సేవింపవలసినది.

**శ్రియే చ అమృతాయ చ :** గురుసేవాఫలమిది. మొదటిది ఐహిక సుఖానుభవము. రెండవది పారమార్థిక సుఖానుభవము. రెండును ఆచార్యాధీనములే. ఇచట రెండు చకారములును ఫలద్వయముయొక్క ప్రాధాన్యమును సూచించుచున్నవి.

**సేవ్యతామ్ :** గురుసేవాపరాయణులైన అనఘులనుద్దేశించి మీచే ఆచార్యుడు సేవింపబడుగాక. అని ఆశంసా పూర్వక మంగళాచరణము. లేక, నాచే ఆచార్యుడు సేవింపబడుగాక యని ప్రార్థనారూపమైన మంగళాచరణము.

గురుసేవామాహాత్మ్యము బ్రహ్మవైవర్తాది పురాణములలో విపులముగ చెప్పబడినది. శ్రీమద్భాగవతమున కూడ "యథాऽహం జ్ఞానదో గురుః" అని, "తుష్యేయం సర్వభూతాత్మా గురుశుశ్రూషయా యథా" – అనియు ప్రసిద్ధము.

ఈ రీతిగా ఆచార్యుని అనుపమానవైభవాన్ని, సేవాఫలాన్ని, ప్రాప్యతను ఈ శ్లోకరత్నమున మనకందించిన వ్యాఖ్యాతృశిరోమణికి మనమెంతయు కృతజ్ఞులము కావలసి యున్నది. ఈ శ్లోక వ్యాఖ్యలోని వారి అభిప్రాయసారము తదీయవచనములలోనే –

"ఏవం లక్ష్మీవాన్, కళ్యాణగుణః, శాస్త్రసమ్పన్నో, దయాపూర్ణో, విషయానాకృష్టో, విష్ణుభక్తో, విష్ణుసాక్షాత్కారవాన్, జ్ఞానదో గురుః సమ్పత్ప్రాప్త్యర్థం మోక్షప్రాప్త్యర్థం చ నిష్పాపైరధికారిభిః మయా వా సేవ్యతామ్".

ఇట్లు, నమస్సులతో

**డా॥ కందాళ లక్ష్మీనారాయణ**

# ఓం నమో నారాయణాయ




# శ్రీ లక్ష్మీ సహస్రనామ స్తోత్రమ్

హరిః ఓమ్ :

నామ్నాం సాష్టసహస్రం చ బ్రూహి గార్గ్య మహామతే ।
మహాలక్ష్మ్యా మహాదేవ్యా భుక్తిముక్త్యర్థసిద్ధయే ॥

గార్గ్య ఉవాచ :

సనత్కుమారమాసీనం ద్వాదశాదిత్యసన్నిభమ్ ।
అపృచ్ఛన్యోగినో భక్త్యా యోగినామర్థసిద్ధయే ॥

సర్వలౌకికకర్మభ్యో విముక్తానాం హితాయ వై ।
భుక్తిముక్తిప్రదం జప్య మనుబ్రూహి దయానిధే ॥

సనత్కుమార భగవన్సర్వజ్ఞోఽసి విశేషతః ।
ఆస్తిక్యసిద్ధయే నృణాం క్షిప్రధర్మార్థసాధనమ్ ॥

ఖిద్యంతి మానవాస్సర్వే ధనాభావేన కేవలమ్ ।
సిద్ధ్యంతి ధనినోఽన్యస్య నైవ ధర్మార్థకామనాః ॥

దారిద్ర్యధ్వంసినీ నామ కేన విద్యా ప్రకీర్తితా ।
కేన వా బ్రహ్మవిద్యాఽప్తిః కేన మృత్యువినాశినీ ॥

సర్వాసాం సారభూతైకా విద్యానాం కేన కీర్తితా ।
ప్రత్యక్షం సిద్ధిదా బ్రహ్మన్ తామాచక్ష్వ దయానిధే ॥

సనత్కుమార ఉవాచ :

సాధు పృష్టం మహాభాగాస్సర్వలోకహితైషిణః ।
మహతామేష ధర్మశ్చ నాన్యేషామితి మే మతిః ।

బ్రహ్మ విష్ణు మహాదేవ మహేంద్రాది మహాత్మభిః ।
సంప్రోక్తం కథయామ్యద్య లక్ష్మీనామసహస్రకమ్ ॥

యస్యోచ్చారణమాత్రేణ దారిద్ర్యాన్ముచ్యతే నరః ।
కిం పునస్తజ్జపాజ్జాపీ సర్వేష్టార్థానవాప్నుయాత్ ॥

అస్య శ్రీ లక్ష్మీ దివ్యసహస్రనామస్తోత్ర మహామంత్రస్య । ఆనందకర్దమ చిక్లీ-తేందిరాసుతాదయో మహాత్మానో మహర్షయః । అనుష్టుప్ఛందః । విష్ణుమాయా శక్తిః । మహాలక్ష్మీః పరాదేవతా । శ్రీమహాలక్ష్మీ ప్రసాదసిద్ధిద్వారా సర్వేష్టార్థసిద్ధ్యర్థే జపే వినియోగః। శ్రామిత్యాది షడంగన్యాసః ॥

ధ్యానమ్ :

పద్మనాభప్రియాం దేవీం పద్మాక్షీం పద్మవాసినీమ్ ।
పద్మవక్త్రాం పద్మహస్తాం వందే పద్మామహర్నిశమ్ ॥

పూర్ణేందుబింబవదనాం రత్నాభరణభూషితామ్ ।
వరదాభయహస్తాఢ్యాం ధ్యాయేచ్చంద్రసహోదరీమ్ ॥

ఇచ్ఛారూపాం భగవతస్సచ్చిదానందరూపిణీమ్ ।
సర్వజ్ఞాం సర్వజననీం విష్ణువక్షస్థలాలయామ్ ।
దయాళుమనిశం ధ్యాయేత్సుఖసిద్ధిస్వరూపిణీమ్ ॥

యథోపదేశం జపిత్వా యథాక్రమం దేవ్యై సమర్ప్య ।
తతశ్శాంభవీముద్రయా లక్ష్యమనుసంధాయ । నామ సహస్రం జపేత్ ॥

హరిః ఓమ్ :

నిత్యాగతాఽనంతనిత్యా నందినీ జనరంజనీ ।
నిత్యప్రకాశినీ చైవ స్వప్రకాశస్వరూపిణీ ॥

మహాలక్ష్మీర్మహాకాళీ మహాకన్యా సరస్వతీ ।
భోగవైభవసంధాత్రీ భక్తానుగ్రహకారిణీ ॥

ఈశావాస్యా మహామాయా మహాదేవీ మహేశ్వరీ ।
హృల్లేఖా పరమా శక్తిర్మాతృకా బీజరూపిణీ ॥

నిత్యానందా నిత్యబోధాఽనాదినీ జనమోదినీ ।
సత్యప్రత్యయనీ చైవ స్వప్రకాశాత్మరూపిణీ ॥

త్రిపురా భైరవీ విద్యా హంసా వాగీశ్వరీ శివా ।
వాగ్దేవీ చ మహారాత్రిః కాళరాత్రిస్త్రిలోచనా ॥ 5

భద్రకాళీ కరాళీ చ మహాకాళీ తిలోత్తమా ।
కాళీ కరాలవక్త్రాంతా కామాక్షీ కామదా శుభా ॥

చండికా చండరూపేశా చాముండా చక్రధారిణీ ।
త్రైలోక్యజననీ దేవీ త్రైలోక్యవిజయోత్తమా ॥

సిద్ధలక్ష్మీః క్రియాలక్ష్మీర్మోక్షలక్ష్మీః ప్రసాదినీ ।
ఉమా భగవతీ దుర్గా చాంద్రీ దాక్షాయణీ శిఖా ॥

ప్రత్యంగిరా ధరావేలా లోకమాతా హరిప్రియా ।
పార్వతీ పరమాదేవీ బ్రహ్మవిద్యాప్రదాయినీ ॥

అరూపా బహురూపా చ విరూపా విశ్వరూపిణీ ।
పంచభూతాత్మికా వాణీ పంచభూతాత్మికా పరా ॥ 10

కాళికా పంచికా వాగ్మీ హవిః ప్రత్యధిదేవతా ।
దేవమాతా సురేశానా వేదగర్భాఽంబికా ధృతిః ॥

సంఖ్యా జాతిః క్రియా శక్తిః ప్రకృతిర్మోహినీ మహీ ।
యజ్ఞవిద్యా మహావిద్యా గుహ్యవిద్యావిభావరీ ॥

జ్యోతిష్మతీ మహామాతా సర్వమంత్రఫలప్రదా ।
దారిద్ర్యధ్వంసినీ దేవీ హృదయగ్రంథిభేదినీ ॥

సహస్రాదిత్యసంకాశా చంద్రికా చంద్రరూపిణీ ।
గాయత్రీ సోమసంభూతిస్సావిత్రీ ప్రణవాత్మికా ॥

శాంకరీ వైష్ణవీ బ్రాహ్మీ సర్వదేవనమస్కృతా ।
సేవ్యదుర్గా కుబేరాక్షీ కరవీరనివాసినీ ॥

జయా చ విజయా చైవ జయంతీ చాఽపరాజితా ।
కుబ్జికా కాళికా శాస్త్రీ వీణాపుస్తకధారిణీ ॥

సర్వజ్ఞశక్తిశ్శ్రీశక్తిర్బ్రహ్మవిష్ణుశివాత్మికా ।
ఇడా పింగళికామధ్యామృణాళీతంతురూపిణీ ॥

యజ్ఞేశానీ ప్రథా దీక్షా దక్షిణా సర్వమోహినీ ।
అష్టాంగయోగినీ దేవీ నిర్బీజధ్యానగోచరా ॥

సర్వతీర్థస్థితా శుద్ధా సర్వపర్వతవాసినీ ।
వేదశాస్త్రప్రమా దేవీ షడంగదిపదక్రమా ॥

శివా ధాత్రీ శుభానందా యజ్ఞకర్మస్వరూపిణీ ।
వ్రతినీ మేనకాదేవీ బ్రహ్మాణీ బ్రహ్మచారిణీ ॥

ఏకాక్షరపరా తారా భవబంధవినాశినీ ।
విశ్వంభరా ధరాధారా నిరాధారాఽధికస్వరా ॥

రాకాకుహూరమావాస్యా పూర్ణిమాఽనుమతీద్యుతిః ।
సినీవాలీ శివావశ్యా వైశ్వదేవీ పిశంగిలా ॥

పిప్పలా చ విశాలాక్షీ రక్షోఘ్నీ వృష్టికారిణీ ।
దుష్టవిద్రావిణీ దేవీ సర్వోపద్రవనాశినీ ॥

శారదా శరసంధానా సర్వశస్త్రస్వరూపిణీ ।
యుద్ధమధ్యస్థితా దేవీ సర్వభూతప్రభంజనీ ॥

అయుద్ధా యుద్ధరూపా చ శాంతా శాంతిస్వరూపిణీ ।
గంగా సరస్వతీ వేణీ యమునా నర్మదాపగా ॥ 25

సముద్రవసనావాసా బ్రహ్మాండశ్రేణిమేఖలా ।
పంచవక్త్రా దశభుజా శుద్ధస్ఫటికసన్నిభా ॥

రక్తా కృష్ణా సితా పీతా సర్వవర్ణా నిరీశ్వరీ ।
కాళికా చక్రికా దేవీ సత్యా తు వటుకా స్థితా ॥

తరుణీ వారుణీ నారీ జ్యేష్ఠాదేవీ సురేశ్వరీ ।
విశ్వంభరా ధరా కర్త్రీ గళార్గళవిభంజనీ ॥
సంధ్యా రాత్రిర్దివా జ్యోత్స్నా కలా కాష్ఠా నిమేషికా ।
ఉర్వీ కాత్యాయనీ శుభ్రా సంసారార్ణవతారిణీ ॥

కపిలా కీలికాఽశోకా మల్లికా నవమాలికా ।
దేవికా నందికా శాంతా భంజికా భయభంజికా ॥

కౌశికీ వైదికీ దేవీ సౌరీ రూపాధికాఽతిభా ।
దిగ్వస్త్రా నవవస్త్రా చ కన్యకా కమలోద్భవా ॥

శ్రీస్సౌమ్యలక్షణాఽతీతా దుర్గా సూత్రప్రబోధికా ।
శ్రద్ధా మేధా కృతిః ప్రజ్ఞా ధారణా కాంతిరేవ చ ॥

శ్రుతి స్స్మృతిర్ధృతిర్ధన్యా భూతిరిష్టిర్మనీషిణీ ।
విరక్తిర్వ్యాపినీ మాయా సర్వమాయాప్రభంజనీ ॥

మాహేంద్రీ మంత్రిణీ సింహీ చేంద్రజాలస్వరూపిణీ ।
అవస్థాత్రయనిర్ముక్తా గుణత్రయవివర్జితా ॥

ఈషణత్రయనిర్ముక్తా సర్వరోగవివర్జితా ।
యోగిధ్యానాంతగమ్యా చ యోగధ్యానపరాయణా । । 35

త్రయీ శిఖా విశేషజ్ఞా వేదాంతజ్ఞానరూపిణీ ।
భారతీ కమలా భాషా పద్మా పద్మవతీ కృతిః ॥

గౌతమీ గోమతీ గౌరీ ఈశానా హంసవాహినీ ।
నారాయణీ ప్రభాధారా జాహ్నవీ శంకరాత్మజా ॥

చిత్రఘంటా సునందా శ్రీర్మానవీ మనుసంభవా ।
స్తంభినీ క్షోభిణీ మారీ భ్రామిణీ శత్రుమారిణీ ॥

మోహినీ ద్వేషిణీ వీరా అఘోరా రుద్రరూపిణీ ।
రుద్రైకాదశినీ పుణ్యా కల్యాణీ లాభకారిణీ ॥

దేవదుర్గా మహాదూతా స్వప్నదుర్గాఽష్టభైరవీ ।
సూర్యచంద్రాగ్నిరూపా చ గ్రహనక్షత్రరూపిణీ ॥

బిందునాదకళాతీతా బిందునాదకళాత్మికా ।
దశవాయుజయాకారా కలాషోడశసంయుతా ॥
కాశ్యపీ కమలా దేవీ నాదచక్రనివాసినీ ।
మృడాధారా స్థిరా గుహ్యా దేవికా చక్రరూపిణీ ॥

అవిద్యా శార్వరీ భుంజా జంభాసురనిబర్హిణీ ।
శ్రీకాయా శ్రీకలా శుభ్రా కర్మనిర్మూలకారిణీ ॥

ఆదిలక్ష్మీర్గుణాధారా పంచబ్రహ్మాత్మికా పరా ।
శ్రుతిర్బ్రహ్మముఖావాసా సర్వసంపత్తిరూపిణీ ॥

మృతసంజీవినీ మైత్రీ కామినీ కామవర్జితా ।
నిర్వాణమార్గదా దేవీ హంసినీ కాలికా క్షమా ॥ 45

సపర్యా గుణినీ భిన్నా నిర్గుణా ఖండితా శుభా ।
స్వామినీ వేదినీ శక్యా శాంబరీ చక్రధారిణీ ॥

దండినీ ముండినీ వ్యాఘ్రీ శిఖినీ సోమసంహతిః ।
చింతామణిశ్చిదానందా పంచబాణప్రబోధినీ ॥

బాణశ్రేణిస్సహస్రాక్షీ సహస్రభుజపాదుకా ।
సంధ్యా బలిస్త్రిసంధ్యాఖ్యా బ్రహ్మాండమణిభూషణా ॥

వాసవీ వారుణీ సేనా కులికా మంత్రరంజనీ ।
జితప్రాణస్వరూపా చ కాంతా కామ్యవరప్రదా ॥

మంత్రబ్రాహ్మణవిద్యార్థా నాదరూపా హవిష్మతీ ।
అథర్వణీ శ్రుతిశ్శూన్యా కల్పనావర్జితా సతీ ॥

సత్తా జాతిః ప్రమాఽమేయా ప్రమితిః ప్రాణదా గతిః ।
అవర్ణా పంచవర్ణా చ సర్వదా భువనేశ్వరీ ॥

త్రైలోక్యమోహినీ విద్యా సర్వభర్త్రీ క్షరాక్షరా ।
హిరణ్యవర్ణా హరిణీ సర్వోపద్రవనాశినీ ॥

కైవల్యపదవీరేఖా సూర్యమండలసంస్థితా ।
సోమమండలమధ్యస్థా వహ్నిమండలసంస్థితా ॥

వాయుమండలమధ్యస్థా వ్యోమమండలసంస్థితా ।
చక్రికా చక్రమధ్యస్థా చక్రమార్గప్రవర్తినీ ॥

కోకిలా కులచక్రేశా పక్షతిః పంక్తిపావనీ ।
సర్వసిద్ధాంతమార్గస్థా షడ్వర్ణా వరవర్జితా ॥

శతరుద్రహరా హంత్రీ సర్వసంహారకారిణీ ।
పురుషా పౌరుషీ తుష్టిస్సర్వతంత్రప్రసూతికా ॥

అర్ధనారీశ్వరీ దేవీ సర్వవిద్యాప్రదాయినీ ।
భార్గవీ యాజుషీ విద్యా సర్వోపనిషదాస్థితా ॥

వ్యోమకేశాఽఖిలప్రాణా పంచకోశవిలక్షణా ।
పంచకోశాత్మికా ప్రత్యక్పంచబ్రహ్మాత్మికా శివా ॥

జగజ్జరాజనిత్రీ చ పంచకర్మప్రసూతికా ।
వాగ్దేవ్యాభరణాకారా సర్వకామ్యస్థితా స్థితిః ॥

అష్టాదశచతుష్షష్టిపీఠికా విద్యయాయుతా ।
కాళికాకర్షణశ్యామా యక్షిణీ కిన్నరేశ్వరీ ॥ 60

కేతకీ మల్లికాఽశోకా వారాహీ ధరణీ ధ్రువా ।
నారసింహీ మహోగ్రాస్యా భక్తానామార్తినాశినీ ॥

అంతర్బలా స్థిరా లక్ష్మీర్జరామరణనాశినీ ।
శ్రీరంజితా మహాకాయా సోమసూర్యాగ్నిలోచనా ॥

అదితిర్దేవమాతా చ అష్టపుత్రాఽష్టయోగినీ ।
అష్టప్రకృతిరష్టాష్టవిభ్రాజద్వికృతాకృతిః ॥

దుర్భిక్షధ్వంసినీ దేవీ సీతా సత్యా చ రుక్మిణీ ।
ఖ్యాతిజా భార్గవీ దేవీ దేవయోనిస్తపస్వినీ ॥

శాకంభరీ మహాశోణా గరుడోపరిసంస్థితా ।
సింహగా వ్యాఘ్రగా దేవీ వాయుగా చ మహాద్రిగా ॥

అకారాదిక్షకారాంతా సర్వవిద్యాధిదేవతా ।
మంత్రవ్యాఖ్యాననిపుణా జ్యోతిశ్శాస్త్రైకలోచనా ॥

ఇడాపింగళికామధ్యసుషుమ్నాగ్రంథిభేదినీ ।
కాలచక్రాశ్రయోపేతా కాలచక్రస్వరూపిణీ ॥
వైశారదీ మతిశ్శ్రేష్ఠా వరిష్ఠా సర్వదీపికా ।
వైనాయకీ వరారోహా శ్రోణివేలా బహిర్వళిః ॥

జంభినీ జృంభిణీ జృంభకారిణీ గణకారికా ।
శరణీ చక్రికాఽనంతా సర్వవ్యాధిచికిత్సకీ ॥

దేవకీ దేవసంకాశా వారిధిః కరుణాకరా ।
శర్వరీ సర్వసంపన్నా సర్వపాపప్రభంజనీ ॥

ఏకమాత్రా ద్విమాత్రా చ త్రిమాత్రా చ తథా పరా ।
అర్ధమాత్రా పరా సూక్ష్మా సూక్ష్మార్థార్థపరాఽపరా ॥

ఏకవీరా విశేషాఖ్యా షష్ఠీ దేవీ మనస్వినీ ।
నైష్కర్మ్యా నిష్కళా లోకా జ్ఞానకర్మాధికా గుణా ॥

సబంధ్వానందసందోహా వ్యోమాకారాఽనిరూపితా ।
గద్యపద్యాత్మికా వాణీ సర్వాలంకారసంయుతా ॥

సాధుబంధపదన్యాసా సర్వౌకా ఘటికావళిః ।
షట్కర్మా కర్కశాకారా సర్వకర్మవివర్జితా ॥

ఆదిత్యవర్ణా చాపర్ణా కామినీ వరరూపిణీ ।
బ్రహ్మాణీ బ్రహ్మసంతానా వేదవాగీశ్వరీ శివా ॥ 75

పురాణన్యాయమీమాంసాధర్మశాస్త్రాగమాశ్రుతా ।
సద్యోవేదవతీ సర్వాహంసీ విద్యాధిదేవతా ॥

విశ్వేశ్వరీ జగద్ధాత్రీ విశ్వనిర్మాణకారిణీ ।
వైదికీ వేదరూపా చ కాళికా కాలరూపిణీ ॥

నారాయణీ మహాదేవీ సర్వతత్త్వప్రవర్తినీ ।
హిరణ్యవర్ణరూపా చ హిరణ్యపదసంభవా ॥

కైవల్యపదవీ పుణ్యా కైవల్యజ్ఞానలక్షితా ।
బ్రహ్మసంపత్తిరూపా చ బ్రహ్మసంపత్తికారిణీ ॥

వారుణీ వారుణారాధ్యా సర్వకర్మప్రవర్తినీ ।
ఏకాక్షరపరాఽఽయుక్తా సర్వదారిద్ర్యభంజినీ ॥ 80
పాశాంకుశాన్వితాదివ్యా వీణా వ్యాఖ్యాక్షసూత్రభృత్ ।
ఏకమూర్తిస్త్రయీమూర్తిర్మధుకైటభభంజినీ ॥

సాంఖ్యా సాంఖ్యవతీ జ్వాలా జ్వలంతీ కామరూపిణీ ।
జాగ్రతీ సర్వసంపత్తిస్సుషుప్తా స్వేష్టదాయినీ ॥

కపాలినీ మహాదంష్ట్రా భ్రుకుటీ కుటిలాననా ।
సర్వావాసా సువాసా చ బృహత్యృష్టిశ్చ శక్వరీ ॥

ఛందోగణప్రతిష్ఠా చ కల్మాషీ కరుణాత్మికా ।
చక్షుష్మతీ మహాఘోషా ఖడ్గచర్మధరాశనిః ॥

శిల్పవైచిత్ర్యవిద్యోతా సర్వతోభద్రవాసినీ ।
అచింత్యలక్షణాకారా సూత్రభాష్యనిబంధనా ॥

సర్వవేదార్థసంపత్తిస్సర్వశాస్త్రార్థమాతృకా ।
అకారాదిక్షకారాంతమాత్రా వర్ణకృతస్థలా ॥

సర్వలక్ష్మీస్సదానందా సారవిద్యా సదాశివా ।
సర్వజ్ఞా సర్వశక్తిశ్చ ఖేచరీరూపగోచ్ఛ్రితా ॥

అణిమాదిగుణోపేతా పరాకాష్ఠా పరాగతిః ।
హంసయుక్తవిమానస్థా హంసారూఢా శశిప్రభా ॥

భవానీ వాసనాసక్తిరాకృతిస్తాఽఖిలాఖిలా ।
తంత్రహేతుర్విచిత్రాంగీ వ్యోమగంగా వినోదినీ ॥

వర్షా చ వార్షికా చైవ ఋగ్యజుస్సామరూపిణీ ।
మహానదీ నదీపుణ్యాఽగణ్యపుణ్యగుణక్రియా ॥ 90

సమాధిగతలభ్యార్థా శ్రోతవ్యా స్వప్రియాఘృణా ।
నామాక్షరపరా దేవీ ఉపసర్గనఖాంచితా ॥

నిపాతోరుద్వయీ జంఘా మాతృకా మంత్రరూపిణీ ।
ఆసీనా చ శయానా చ తిష్ఠంతీ ధావనాధికా ॥

లక్ష్యలక్షణయోగాఢ్యా తాద్రూప్యగణనాకృతిః ।
ఏకరూపా నైకరూపా సేందురూపా సదాకృతిః ॥
సమాసతద్ధితాకారా విభక్తివచనాత్మికా ।
స్వాహాకారా స్వధాకారా శ్రీపత్యర్థాంగనందినీ ॥

గంభీరా గహనాగుహ్యా యోనిలింగార్ధధారిణీ ।
శేషవాసుకిసంసేవ్యా చపలా వరవర్ణినీ ॥

కారుణ్యాకారసంపత్తిః కీలకృన్మంత్రకీలికా ।
శక్తిబీజాత్మికా సర్వమంత్రేష్టా క్షయకామనా ॥

ఆగ్నేయా పార్థివా ఆప్యా వాయవ్యా వ్యోమకేతనా ।
సత్యజ్ఞానాత్మికా నందా బ్రాహ్మీ బ్రహ్మసనాతనీ ॥

అవిద్యావాసనా మాయా ప్రకృతిస్సర్వమోహినీ ।
శక్తిర్ధారణశక్తిశ్చ చిదచిచ్ఛక్తియోగినీ ॥

వక్త్రారుణా మహామాయా మరీచిర్మదమర్దినీ ।
విరాట్ స్వాహా స్వధా శుద్ధా నిరుపాస్తిస్సుభక్తిగా ॥

నిరూపితాద్వయీ విద్యా నిత్యానిత్యస్వరూపిణీ ।
వైరాజమార్గసంచారా సర్వసత్పథదర్శినీ ॥

జాలంధరీ మృడానీ చ భవానీ భవభంజనీ ।
త్రైకాలికజ్ఞానతంతుస్త్రికాలజ్ఞానదాయినీ ॥

నాదాతీతా స్మృతిః ప్రజ్ఞా ధాత్రీరూపా త్రిపుష్కరా ।
పరాజితా విధానాజ్ఞా విశేషితగుణాత్మికా ॥

హిరణ్యకేశినీ హేమబ్రహ్మసూత్రవిచక్షణా ।
అసంఖ్యేయపరార్ధాంతస్వరవ్యంజనవైఖరీ ॥

మధుజిహ్వా మధుమతీ మధుమాసోదయా మధుః ।
మాధవీ చ మహాభాగా మేఘగంభీరనిస్వనా ॥

బ్రహ్మవిష్ణుమహేశాదిజ్ఞాతవ్యార్థవిశేషగా ।
నాభౌవహ్నిశిఖాకారా లలాటే చంద్రసన్నిభా ॥

భ్రూమధ్యే భాస్కరాకారా సర్వతారాకృతిర్హృది ।
కృతికాదిభరణ్యంతనక్షత్రేష్ట్యర్చితోదయా ॥
గ్రహవిద్యాత్మికా జ్యోతిర్జ్యోతిర్విన్మతిజీవికా ।
బ్రహ్మాండగర్భిణీ బాలా సప్తావరణదేవతా ॥

వైరాజోత్తమసామ్రాజ్యా కుమారకుశలోదయా ।
బగళా భ్రమరాంబా చ శివదూతీ శివాత్మికా ॥

మేరువింధ్యాదిసంస్థానా కాశ్మీరపురవాసినీ ।
యోగనిద్రా మహానిద్రా వినిద్రా రాక్షసాశ్రితా ॥

సువర్ణదా మహాగంగా పంచాఖ్యా పంచసంహతిః ।
సుప్రజాతా సువీర్యా చ సుపోషా సుపతిశ్శివా ॥

సుగృహా రక్తబీజాంతా హతకందర్పజీవికా ।
సముద్రవ్యోమమధ్యస్థా సమబిందుసమాశ్రయా ॥

సౌభాగ్యరసజీవాతుస్సారాసారవివేకదృక్ ।
త్రివల్యాదిసుపుష్టాంగా భారతీ భారతీ శ్రితా ॥

నాదబ్రహ్మమయీ విద్యా జ్ఞానబ్రహ్మమయీ పరా ।
బ్రహ్మనాడీ నిరుక్తిశ్చ బ్రహ్మకైవల్యసాధనా ॥

కాలికేయమహోదారవీర్యవిక్రమరూపిణీ ।
బడబాగ్నిశిఖావక్త్రా మహాకబలతర్పణా ॥

మహాభూతా మహాదర్పా మహాసారా మహాక్రతుః ।
పంచభూతా మహాగ్రాసా పంచభూతాధిదేవతా ॥

సర్వప్రమాణా సంపత్తిస్సర్వరోగప్రతిక్రియా ।
బ్రహ్మాండాంతర్బహిర్వ్యాప్తా విష్ణువక్షోవిభూషణీ ॥

శాంకరీ విధివక్త్రస్థా ప్రవరావరహేతుకీ ।
హేమమాలా శిఖామాలా త్రిశిఖా పంచలోచనా ॥

సర్వాగమసదాచారా మర్యాదా యాతుభంజనీ ।
పుణ్యశ్లోకప్రబంధాఢ్యా సర్వాంతర్యామిరూపిణీ ॥

సామగానసమారాధ్యా శ్రోత్రకర్ణరసాయనా ।
జీవలోకైకజీవాతుర్భద్రోదారవిలోకనా ॥
తటిత్కోటిలసత్కాంతిస్తరుణీ హరిసుందరీ ।
మీననేత్రా చ సేంద్రాక్షీ విశాలాక్షీ సుమంగళా ॥

సర్వమంగళసంపన్నా సాక్షాన్మంగళదేవతా ।
దేహహృద్దీపికా దీప్తిర్జిహ్మపాపప్రణాశినీ ॥

అర్ధచంద్రోల్లసద్దంష్ట్రా యజ్ఞవాటవిలాసినీ ।
మహాదుర్గా మహోత్సాహా మహాదేవబలోదయా ॥

ఢాకినీడ్యా శాకినీడ్యా సాకినీడ్యా సమస్తజుట్ ।
నిరంకుశా నాకివంద్యా షడాధారాధిదేవతా ॥

భువనజ్ఞాననిశ్రేణిః భువనాకారవల్లరీ ।
శాశ్వతీ శాశ్వతాకారా లోకానుగ్రహకారిణీ ॥

సారసీ మానసీ హంసీ హంసలోకప్రదాయినీ ।
చిన్ముద్రాలంకృతకరా కోటిసూర్యసమప్రభా ॥

సుఖప్రాణిశిరోరేఖా సదదృష్టప్రదాయినీ ।
సర్వసాంకర్యదోషఘ్నీ గ్రహోపద్రవనాశినీ ॥

క్షుద్రజంతుభయఘ్నీ చ విషరోగాదిభంజనీ ।
సదాశాంతా సదాశుద్ధా గృహచ్ఛిద్రనివారిణీ ॥

కలిదోషప్రశమనీ కోలాహలపురస్థితా ।
గౌరీ లాక్షణికీ ముఖ్యా జఘన్యాకృతివర్జితా ॥

మాయావిద్యామూలాభూతా వాసవీ విష్ణుచేతనా ।
వాదినీ వసురూపా చ వసురత్నపరిచ్ఛదా ॥

ఛాందసీ చంద్రహృదయా మంత్రస్వచ్ఛందభైరవీ ।
వనమాలా వైజయంతీ పంచదివ్యాయుధాత్మికా ॥

పీతాంబరమయీ చంచత్కౌస్తుభా హరికామినీ ।
నిత్యా తథ్యా రమా రామా రమణీ మృత్యుభంజనీ ॥

జ్యేష్ఠా కాష్ఠా ధనిష్ఠాంతా శరాంగీ నిర్గుణప్రియా ।
మైత్రేయా మిత్రవిందా చ శేష్యశేషకళాశయా ॥
వారాణసీ వాసలభ్యా సార్యావర్తజనస్తుతా ।
జగదుత్పత్తిసంస్థానసంహారత్రయకారణా ॥

త్వమంబా విష్ణుసర్వస్వా నమస్తేఽస్తు మహేశ్వరి ।
నమస్తే సర్వలోకానాం జనన్యై పుణ్యమూర్తయే ॥

సిద్ధలక్ష్మీర్మహాకాళీ మహాలక్ష్మి నమోఽస్తు తే ।
సద్యోజాతాదిపంచాగ్నిరూపా పంచకపంచకా ॥

యంత్రలక్ష్మీర్భవత్యాదిరాద్యాద్యే తే నమో నమః ।
సృష్ట్యాదికారణాకారవితతే దోషవర్జితే ॥

జగల్లక్ష్మీర్జగన్మాతర్విష్ణుపత్ని నమోఽస్తు తే ।
నవకోటిమహాశక్తిసముపాస్యపదాంబుజే ॥

కనత్సౌవర్ణరత్నాఢ్యసర్వాభరణభూషితే ।
అనంతనిత్యమహిషి ప్రపంచేశ్వరనాయకి ॥

అత్యుచ్ఛ్రితపదాంతస్థే పరమవ్యోమనాయకి ।
నాకపృష్ఠగతారాధ్యే విష్ణులోకవిలాసిని ॥

వైకుంఠరాజమహిషి శ్రీరంగనగరాశ్రితే ।
రంగనాయకి భూపుత్రి కృష్ణే వరదవల్లభే ॥

కోటిబ్రహ్మాదిసంసేవ్యే కోటిరుద్రాదికీర్తితే ।
మాతులుంగమయం ఖేటం సౌవర్ణచషకం తథా ॥

పద్మద్వయం పూర్ణకుంభం కీరం చ వరదాభయే ।
పాశమంకుశకం శంఖం చక్రం శూలం కృపాణికామ్ ॥

ధనుర్బాణౌ చాక్షమాలాం చిన్ముద్రామపి బిభ్రతీ ।
అష్టాదశభుజే లక్ష్మి మహాష్టాదశపీఠగే ॥

భూమినీళాదిసంసేవ్యే స్వామిచిత్తానువర్తిని ।
పద్మే పద్మాలయే పద్మపూర్ణకుంభాభిషేచితే ॥

ఇందిరేందిందిరాభాక్షి క్షీరసాగరకన్యకే ।
భార్గవీ త్వం స్వతంత్రేచ్ఛా వశీకృతజగత్పతిః ॥
మంగలాం మంగలానాం త్వం దేవతానాం చ దేవతా ।
త్వముత్తమోత్తమానాం చ త్వం శ్రేయః పరమామృతమ్ ॥

ధనధాన్యాభివృద్ధిశ్చ సార్వభౌమసుఖోచ్ఛ్రయా ।
ఆందోలికాదిసౌభాగ్యం మత్తేభాదిమహోదయః ॥

పుత్రపౌత్రాభివృద్ధిశ్చ విద్యాభోగబలాదికమ్ ।
ఆయురారోగ్యసంపత్తిరష్టైశ్వర్యం త్వమేవ హి ॥

పరమేశవిభూతిశ్చ సూక్ష్మాత్సూక్ష్మతరా గతిః ।
సదయాపాంగసందత్తబ్రహ్మేంద్రాదిపదస్థితిః ॥

అవ్యాహతమహాభాగ్యా త్వమేవాక్షోభ్యవిక్రమా ।
సమన్వయశ్చ వేదానామవిరోధస్త్వమేవ హి ॥

నిశ్శ్రేయసపదప్రాప్తిసాధనం ఫలమేవ చ ।
శ్రీమంత్రరాజరాజ్ఞీ చ శ్రీవిద్యా క్షేమకారిణీ ॥

శ్రీంబీజజపసంతుష్టా ఐం హ్రీం శ్రీం బీజపాలికా ।
ప్రపత్తిమార్గసులభా విష్ణుప్రథమకింకరీ ॥

క్లీంకారార్థసవిత్రీ చ సౌమంగల్యాధిదేవతా ।
శ్రీ షోడశాక్షరీవిద్యా శ్రీయంత్రపురవాసినీ ॥

సర్వమంగలమాంగల్యే శివే సర్వార్థసాధికే ।
శరణ్యే త్ర్యంబకే దేవి నారాయణి నమోఽస్తు తే ॥ 154

పునః పునర్నమస్తేఽస్తు సాష్టాంగమయుతం పునః ॥ 155

సనత్కుమార ఉవాచ :

ఏవం స్తుతా మహాలక్ష్మీర్బ్రహ్మరుద్రాదిభిస్సురైః ।
నమద్భిరార్తైర్దీనైశ్చ నిస్సత్త్వైర్భోగవర్జితైః ॥

జ్యేష్ఠాజుష్టైశ్చ నిశ్శ్రీకైస్సంసారాత్స్వపరాయణైః ।
విష్ణుపత్నీ దదౌ తేషాం దర్శనం దృష్టితర్పణమ్ ॥

శరత్పూర్ణేందుకోట్యాభధవళాపాంగవీక్షణైః ।
సర్వాంత్సత్త్వసమావిష్టాంశ్చక్రే హృష్టా వరం దదౌ ॥

మహాలక్ష్మీరువాచ :

నామ్నాం సాష్టసహస్రం మే ప్రమాదాద్వాపి యస్సకృత్ ।
కీర్తయేత్తత్కులే సత్యం వసామ్యాచంద్రతారకమ్ ॥

కిం పునర్నియమాజ్జప్తుర్మదేకశరణస్య చ ।
మాతృవత్సానుకంపాఽహం పోషకీ స్యామహర్నిశమ్ ॥

మన్నామస్మరతాం లోకే దుర్లభం నాస్తి చింతితమ్ ।
మత్ప్రసాదేన సర్వేఽపి స్వస్వేష్టార్థమవాప్స్యథ ॥

లుప్తవైష్ణవధర్మస్య మద్వ్రతేష్వవకీర్ణినః ।
భక్తిప్రపత్తిహీనస్య వంధ్యో నామ్నాం జపోపి మే ॥

తస్మాదవశ్యం తైర్దోషైర్విహీనః పాపవర్జితః ।
జపేత్సాష్టసహస్రం మే నామ్నాం ప్రత్యహమాదరాత్ ॥

సాక్షాదలక్ష్మీపుత్రోఽపి దుర్భాగ్యోఽప్యలసోఽపి వా ।
అప్రయత్నోఽపి మూఢోఽపి వికలః పతితోఽపి చ ॥

అవశాత్ప్రాప్నుయాద్భాగ్యం మత్ప్రసాదేన కేవలమ్ ।
స్పృహేయమచిరాద్దేవాః వరదానాయ జాపినః ॥

దదామి సర్వమిష్టార్థం లక్ష్మీతి స్మరతాం ధ్రువమ్ ।

సనత్కుమార ఉవాచ :

ఇత్యుక్త్వాఽన్తర్దధే లక్ష్మీః వైష్ణవీ భగవత్కలా ॥

ఇష్టాపూర్తం చ సుకృతం భాగధేయం చ చింతితమ్ ।
స్వం స్వం స్థానం చ భోగం చ విజయం లేభిరే సురాః ॥

తదేతత్ప్రవదామ్యద్య లక్ష్మీనామసహస్రకమ్ ।
యోగినః పఠత క్షిప్రం చింతితార్థానవాప్స్యథ ॥

గార్గ్య ఉవాచ :

సనత్కుమార యోగీంద్ర ఇత్యుక్త్వా స దయానిధిః ।
అనుగృహ్య యయౌ క్షిప్రం తాంశ్చ ద్వాదశయోగినః ॥

తస్మాదేతద్రహస్యం చ గోప్యం జప్యం ప్రయత్నతః ।
అష్టమ్యాం చ చతుర్దశ్యాం నవమ్యాం భృగువాసరే ॥

పౌర్ణమాస్యా మమాయాం చ పర్వకాలే విశేషతః ।
జపేద్వా నిత్యకార్యేషు సర్వాన్కామానవాప్నుయాత్ ॥

ఇతి శ్రీ స్కాందపురాణే సనత్కుమారసంహితాయాం
లక్ష్మీసహస్రనామమంత్రస్తోత్రం సంపూర్ణమ్ ॥ ✦

---

# రుద్రపఞ్చముఖధ్యానమ్

మం. వామదేవాయ నమో-జ్యేష్ఠాయ నమో-రుద్రాయ నమః-కాలాయ
నమః-కలవికరణాయ నమో-బలవికరణాయ నమో-బలప్రమథనాయ
నమ-స్సర్వభూతదమనాయ నమో-మనోన్మనాయ నమః ॥

(తై.ఆ. 10 ప్ర. 43-44 అను.)

వామదేవాయ = వామదేవనామము కల ఉత్తరవక్త్రము తన రూపముగా కల పరమేశ్వరుని కొరకు; నమః = నమస్కారము; జ్యేష్ఠాయ = జ్యేష్ఠునికొరకు; నమః = నమస్కారము; రుద్రాయ = రుద్రునికొరకు; నమః = నమస్కారము; కాలాయ = కాలుని కొరకు; నమః = నమస్కారము; కలవికరణాయ = కలవికరణునికొరకు; నమః = నమస్కారము; బలప్రమథనాయ = బలప్రమథనుని కొరకు; నమః = నమస్కారము; సర్వభూతదమనాయ = సర్వభూతదమనునికొరకు; నమః = నమస్కారము; మనోన్మనాయ = మనోన్మనునికొరకు; నమః = నమస్కారము.

శ్లో॥ గౌరం కుఙ్కుమపంకిలం సుతిలకం - వ్యాపాణ్డుగణ్డస్థలం
భ్రూవిక్షేపకటాక్షవీక్షణలస - త్సంసక్తకర్ణోత్పలమ్ ।
స్నిగ్ధం బిమ్బఫలాధరప్రహసితం - నీలాలకాలంకృతం
వన్దే పూర్ణశశాఙ్కమణ్డలనిభం - వక్త్రం హరస్యోత్తరమ్ ॥ 4

**ఓం ఏం; తం థం దం ధం నం - ఐం ఓం; ఓం నమో భగవతే రుద్రాయ; ఓం వాం;
ఉత్తరముఖాయ నమః ॥4॥**

# జయదస్తోత్రము
# కుండలినీస్తవః



– వ్యాఖ్యాత – చింతగుంట సుబ్బారావు, చీరాల.

శ్లో॥ జన్మోద్ధారనిరక్షిణీహతరుణీ! వేదాదిబీజాదిమా!
నిత్యం చేతసి భావ్యతే భువి కదా సద్వాక్యసంచారిణీ ।
మాం పాతు ప్రియదా సవిపదం సంహారయిత్రి ధరే!
ధాత్రి త్వం స్వయమాదిదేవవనితా దీనాతిదీనం పశుమ్ ॥ 1

**ప్రతిపదార్థం :** జన్మ = జన్మమును, జన్మము నుండి, ఉద్ధార = ఉద్ధరించు, నిరక్షిణీ = నిర్విశేషముగా రక్షించునట్టి, హ = శివునియొక్క, తరుణీ = ఇల్లాలా!, వేద + ఆది = వేదమునకు ప్రారంభమైన, బీజ = బీజాక్షరమునకు లేక బీజనాదమునకు, ఆది = మొదటిదానవైన, మా = మంగళదేవతా!, మాతృస్వరూపా!, సద్ + వాక్య = మంచి వాక్యమును, సంచారిణీ = ప్రసరింపజేయుదానా!, భువి = భూమిపై, నిత్యం = ప్రతిదినము, చేతసి = మనస్సులో, కదా = ఎప్పుడు, భావ్యతే = భావించబడునో, స్మరించబడునో, ప్రియదా = ప్రియముల నిచ్చు ఆ తల్లి, సంహారయిత్రి = సంహారశక్తియై, పాతు = రక్షించును గాక!, ధరే = సర్వధారణశక్తీ! ధాత్రి = భూదేవీ!, స్వయమ్ = స్వయముగా, ఆదిదేవ = మొదటి దైవముయొక్క, వనితా = ఇల్లాలా!, త్వమ్ = నీవు, దీన + అతిదీనమ్ = ఎంతయో దీనుడనైన, సవిపదమ్ = విపత్తుతో కూడియున్న, పశుం = జీవుని, మాం = నన్ను, పాతు = రక్షింతువుగాక!

**తాత్పర్యం :** ఓ మాతృస్వరూపిణీ! మంగళదేవతా! శ్రీదేవీ! నీవు నా జన్మమును నిశ్శేషముగా ఉద్ధరించుదానవు, నన్ను ఈ పశుత్వమునుండి ఉద్ధరించుదానవు. నీవు శివకామినివి. వేదాలకు మూలమంత్రమైనదానవు. సర్వమును ధరించు శక్తిస్వరూపిణివైన భూదేవతవు. నీవు స్వయముగా ఆదిదేవుని ఇల్లాలవు. మంచి వాక్యమును లోకములో సదా ప్రచారము చేయు నాదస్వరూపిణివి. నిన్ను నా మనస్సులో నింపి నిత్యము ఎప్పుడు సంభావింపగలనో కదా!. తల్లీ! నేను విపత్తుతో కూడియున్న దీనుడనగు జీవుడను. నీవు ప్రియముగూర్చు వాత్సల్యము గలదానవు. నన్ను కాపాడుము!.

ఈ శ్లోకంలో కుండలినీమాత సర్వకర్త్రిగను, సర్వధాత్రిగను, సర్వహన్త్రిగను త్రిమూర్త్యాత్మకమై దర్శనమిస్తూన్నది. కర్మజ్ఞానములు రెంటికిన్నీ ప్రథమ జ్ఞానము నిచ్చిన వేదమునకాదిబీజమైన ఓంకారి. నాదాకృతితో సద్వాక్యమును ప్రచోదనము చేయు సరస్వతీరూపధారిణి. ధారణశక్తితో ధరిత్రియైన సర్వాధారభూదేవి. ఆమెయే భైరవి. మోక్షప్రదాత్రి.

శ్లో॥ రక్తాభామృతచంద్రికాలిపిమయీ! సర్పాకృతిర్నిద్రితా!
జాగ్రత్కూర్మసమాశ్రితా! భగవతీ త్వం మాం సమాలోకయ ।
మాంసోద్గంధకుగంధదోషజడితం వేదాదికార్యాన్వితం
స్వల్పాన్యామలచంద్రకోటికిరణైర్నిత్యం శరీరం కురు ॥ 2

**ప్రతిపదార్థం :** అమృతచంద్రికా = అమృతమను వెన్నెలతో, లిపిమయీ = పూత పూయబడిన, రక్త = ఎఱ్ఱని, ఆభా = కాంతిగల, సర్ప+ఆకృతిః = సర్పమువంటి ఆకారముగల, నిద్రితా = నిద్రించినది, జాగ్రత్ = మేల్కొనియుండి, కూర్మ = కూర్మరూపముచే, సమాశ్రితా = ఆశ్రయింపబడుదానా, (లేక, కూర్మ = కూర్మమను వాయువుచే, సమాశ్రితా = ఆశ్రయింపబడినదానా), భగవతీ = భగవతీ!, మాంస

+ ఉద్ + గంధ = మాంసమునుండి వ్యాపించు, కుగంధ = దుర్వాసనయను, దోష = దోషముచే, జడితమ్ = జడమై పోయిన, (లేక, మాంస + ఉద్గంధ = మాంసముయొక్క సుగంధము, కుగంధ = దుర్గంధములచే, దోషజడితం) శరీరమ్ = శరీరముగల, మామ్ = నన్ను, సమాలోకయ = చక్కగా చూడుము: వేదాది కార్యాన్వితమ్ = వేదిక కార్యనిరతునిగా, స్వల్ప = కొంచెమో, అన్య = గొప్పయో అయిన, అమల = స్వచ్ఛమైన, చంద్ర = చంద్రునియొక్క, కోటికిరణైః = లెక్కలేనన్ని కిరణములతో, నిత్యమ్ = నిత్యునిగా, కురు = చేయుము.

**తాత్పర్యం :** అమృతమయమైన ఎఱ్ఱని కాంతిగలదానా! సర్పము బోలిన ఆకారము గలదానా! నిద్రితా! జాగ్రదవస్థలో కూర్మాకారము గలదానా! భగవతీ! మాంసపు గంధము, తదితర దుర్గంధములవలన జడమైపోయిన శరీరముగలవాడనైన నన్ను చక్కని దృష్టితో చూడుము. నిర్మలమైన కోటి వెన్నెలకాంతులతో నన్ను వేదవిహితమైన కార్యములకు తగినవానినగా, నిత్యునిగా (ప్రతిదినము) చేయుము.

మూలాధారంలో మూడున్నర చుట్టలు చుట్టుకొనియున్న సర్పము ఆకారముతో కుండలినీ శక్తి నిద్రించి యుండునని చెప్పుట పరిపాటి. **నిద్రితా. జాగ్రత్ కూర్మసమాశ్రితా** = నిద్రలేనప్పుడు జాగ్రదవస్థలో కూర్మాకారము నాశ్రయించు దానా! అనుట సరి.

**భగము** అంటే, **ఉత్పత్తిం చ వినాశం చ భూతానామాగతిం గతిం। వేత్తి విద్యామవిద్యాం చ స వాచ్యో భగవానితి ॥** అన్న ప్రమాణాన్నిబట్టి, 1. ఉత్పత్తి, 2. వినాశనము, 3. భూతముల జననము, 4. మరణము, 5. విద్య, 6. అవిద్య, అను ఈ ఆరింటిని తెలిసినవాడు భగవంతుడు. ఈ ఆరున్నూ భగము అనబడునవి. ఈ లక్షణాలు ఆరున్నూ కలిగిన శక్తిరూపిణి భగవతి.

**శ్లో॥ సిద్ధార్థీ నిజదోషవిత్ స్థలగతిర్వ్యాజీయతే విద్యయా**
**కుండల్యాకులమార్గముక్తనగరీమాయాకుమార్గః శ్రియా ।**
**యద్యేవం భజతి ప్రభాతసమయే మధ్యాహ్నకాలేఽథవా**
**నిత్యం యః కులకుండలీజపపదాంభోజం స సిద్ధో భవేత్ ॥** 3

**ప్రతిపదార్థం :** సిద్ధ + అర్థీ = సిద్ధిని కోరువాడు, (కోరినది పొందినవాడు), నిజ = తనయొక్క, దోషవిత్ = దోషములను తెలిసినవాడు, స్థలగతిః = లౌకికమైన నడవడిక గలవాడు, కులమార్గముక్త = కులమార్గముచే విడువబడిన, నగరీమాయా = లౌకికమాయయొక్క, కుమార్గః = అపమార్గమున నడచువాడు, యః = ఎవడు, నిత్యమ్ = దినదినము, ప్రభాతసమయే = సూర్యోదయవేళ, అథవా = లేక, మధ్యాహ్నకాలే = మధ్యాహ్నవేళలో, ఏవమ్ = ఈ విధముగా, కులకుండలీజప = కులకుండలినీజపము, పదాంభోజమ్ = ఆ దేవత పాదపద్మమును, యది భజతి = భజించినట్లయిన, సః = అతడు, కుండల్యా = కుండలినీ అనబడు, శ్రియా విద్యయా = శ్రీవిద్యచేత, వ్యాజీయతే = బ్రతికించబడును, సిద్ధః = సిద్ధుడు, భవేత్ = అగును.

**తాత్పర్యం :** సిద్ధిని కోరువాడు, తన దోషమెఱిగినవాడు, లౌకికుడు, కులమార్గమును విడిచి, లౌకికమార్గమున నడచువాడు, అపమార్గమున బోవువాడు, ఇట్టివాడెవడైన నిత్యము ప్రభాతవేళ లేక మధ్యాహ్నవేళ, ఈ విధముగా కులకుండలిని జపించి, ఆ దేవి పాదపద్మాన్ని భజించినచో ఆతడు కుండలినీ అనబడు శ్రీవిద్యచే బ్రతికించబడి, సిద్ధుడగును.

**కులమార్గము** అంటే శ్రీదేవిని చేర్చు మార్గము.

**నగరీమాయా** అంటే ప్రాపంచికమైన సాంసారిక మాయ.

**కులకుండలీ :** పృథ్వీతత్త్వము లీనమగు చోటు కులము. ఈ కులమున మూడున్నర చుట్టలు గల సర్పాకార శక్తి పేరు కులకుండలీ. కులకుండలీదేవత శ్రీదేవి. ఆ దేవిని మంత్రాత్మికగా జపించటం కులకుండలీ జపం.

**శ్లో॥ వాయ్వాకాశచతుర్దలేఽతివిమలే! వాంఛాఫలోన్మూలకే!**
**నిత్యం సంప్రతి నిత్యదేహఘటితా! సంకేతితాభావితా! ।**
**విద్యాకుండలమానినీ! స్వజననీ! మాయాక్రియా! భావ్యతే**
**యైస్తైః సిద్ధకులోద్భవైః ప్రణతిభిః సత్స్తోత్రకైః శంభుభిః ॥ 4**

**ప్రతిపదార్థం :** వాయ్వాకాశ = వాయువు, ఆకాశము రూపము గల, చతుః = నాలుగు, దలే = దళములుగల, అతి = మిక్కిలి, విమలే = స్వచ్ఛమైనదానా!, వాంఛాఫలోన్మూలకే = కోరికలు, వాని ఫలములు, అను వానిని పెకలించివేయుదానా!, నిత్యమ్ = అనుదినము, నిత్య = నిత్యమైన, దేహ = శరీరమున, ఘటితా = నెలకొన్నదానా!, సంప్రతి = వెంటనే, సంకేతితా = గుర్తుంచబడినదిగా, విద్యాకుండల మానినీ = కుండలినీ విద్యాదేవతా!, స్వజననీ = నా తల్లీ!, మాయాక్రియా = అవాస్తవమైన క్రియలు, కార్యములు గలదానా!, మాయ యనియు, క్రియాశక్తి యనియు తలచబడుదానా!, (ఇట్లని) యైః సిద్ధకులోద్భవైః = యే సిద్ధకులమున బుట్టినవారి చేత, భావ్యతే = భావించబడుచున్నదో, తైః = వారిచే, ప్రణతిభిః = నమస్కారములతో, శంభుభిః = శుభదమైన, సత్స్తోత్రకైః = మంచి స్తుతులచే, భావితా = భావింప బడుదానా!.

**తాత్పర్యం :** మూలాధారమను పేరుగల నాలుగు దళముల పద్మముననుండు, వాయురాకాశరూపములుగల శుద్ధదేవతా! కోరికలను, వాని ఫలభోగమును కూకటివ్రేళ్ళతో పెళ్లగించివేయుదానా! నిత్యము అందరి దేహములందుండుదానా! వెంటనే గుర్తించబడినదానా! ఓ కుండలినీవిద్యాదేవతా! నా తల్లీ! మాయ అనియు క్రియా అనియు నామాంతరములు గలదానా! (లేక, మాయ యనదగు కార్యము గలదానా!), ఈ విధముగా సిద్ధకులమున జన్మించిన వారిచే యెవరెవరిచే భావించబడుచున్నదో, వారిచే నమస్కారములతోనూ శుభప్రదములైన మంచి స్తోత్రములతోను భావించబడుచున్నావు.

వాయువు, ఆకాశము నిర్మలమైనవి. శ్రీదేవి నివాసమైన చతుర్దళ పద్మము మూలాధారము కూడ నిర్మలమే. **సంకేతితా** = బీజాక్షరములచే సంకేతింపబడునది.

**శ్లో॥ ధాతాశంకరమోహినీ త్రిభువనచ్ఛాయాపటోద్గామినీ**
**సంసారాదిమహాసుఖప్రహరిణీ తత్రస్థితా యోగినీ ।**
**సర్వగ్రంథివిభేదినీ స్వభుజగా సూక్ష్మాతిసూక్ష్మా పరా**
**బ్రహ్మజ్ఞానవినోదినీ కులకుటీ వ్యాఘాతినీ భావ్యతే ॥ 5**

**ప్రతిపదార్థం :** ధాతా = బ్రహ్మను, శంకర = శివుని, మోహినీ = మోహింపజేయునది, త్రిభువన = మూడు భువనముల, ఛాయాపట = వాతావరణమునకు, ఉద్ + గామినీ = పైగా వెడలునది, సంసారాది = సంసారసుఖము మొదలుగాగల, మహాసుఖ = గొప్ప సుఖములను, ప్రహరిణీ = తరిమికొట్టునది, తత్ర = మూలాధారమున, స్థితా = నెలకొన్నది!, యోగినీ = యోగిని!, సర్వ = అన్ని, గ్రంథి = గ్రంథులను, విభేదినీ = ఛేదించునది, స్వ = తనయొక్క, భుజ = భుజములపై, గా = నడచునది, (స్వ = స్వయముగా, భుజగా = సర్పరూపము గలది), సూక్ష్మాతిసూక్ష్మా = అమితసూక్ష్మరూపి, పరా = పరదేవత, బ్రహ్మ = బ్రహ్మమును గూర్చిన, జ్ఞాన = జ్ఞానమునందు, వినోదినీ = ఆనందించునది,

కులకుటీ = కులస్థానమున వసించునది, వ్యాఘాతినీ = నశింపజేయునది, భావ్యతే = ధ్యానింపబడుచున్నది.

**తాత్పర్యం :** బ్రహ్మను, శంకరునిగూడ మోహింపజేయునది, త్రిభువనములపైన సంచరించునది, సంసారము మొదలగు మహాసుఖములను పోగొట్టునది, మూలాధారమున నుండునది, యోగిని, అన్ని ముడులను విడదీయునది, సర్పాకారము గలది, పరమసూక్ష్మరూపముగల పరాదేవత, బ్రహ్మజ్ఞానానందము గలది, కులమునందుండునది, విధ్వంసకశక్తియైన ఆ శ్రీదేవి ధ్యానింపబడుచున్నది.

**తత్ర,** అక్కడ, అంటే, మూలాధారంలో అని భావం. **గ్రంథి, ధియం స్వకాశ విమర్శశక్తిం గ్రసతి మాయా రూపేణ ఆచ్ఛాద్య ఇతి గ్రంథిః,** అను వ్యుత్పత్తిని బట్టి, వివేకాన్ని హరించివేసే మాయారూపమున నుండే ముడి. ఇవి బ్రహ్మగ్రంథి, విష్ణుగ్రంథి, రుద్రగ్రంథి, అని మూడు. ఈ ముడులు త్రెంచటం అంటే అహంకారం, భేదబుద్ధి నశించటం అని అర్థం.

**కులము** అంటే పృథ్వీతత్త్వం ముగిసే స్థానం. శ్రీదేవి ఈ స్థానంలో ఉంటుంది కనుక ఆమె కులకుటి.

**వ్యాఘాతినీ,** నాశకర్త్రి, అనటం ఎందుకంటే, ఆమె కరుణయే మానవునికి గ్రంథిత్రయభేదనం చేసే శక్తినిచ్చి బ్రహ్మజ్ఞానార్జనకు నాంది పలుకగలదు. ఈ సందర్భంలో శ్లో. 20 లోని **మృత్యుస్వరూపిణీమ్** అన్న దాని వివరణను స్మరించుకొనటం సముచితం.

**శ్లో॥ వందే శ్రీకులకుండలీత్రివలిభిః సాంగైః స్వయంభూం ప్రియం**
**ప్రావేష్ట్యాంబరమారచిత్తచపలా బాలాబలానిష్కలా ।**
**యా దేవీ పరిభాతి వేదవదనా సంభావినీ తాపినీ**
**ఇష్టానాం శిరసి స్వయంభువనితాం సంభావయామి క్రియామ్ ॥ 6**

**ప్రతిపదార్థం :** యా దేవీ = ఏ దేవి, స్వయంభూమ్ = స్వయంభువైన, ప్రియమ్ = ప్రియుని, శ్రీకులకుండలీ = మూలాధారమునగల కుండలినీశక్తి యొక్క రూపమున, త్రివలిభిః = మూడు చుట్లచే, సాంగైః = అంగములన్నిటితో, ప్రావేష్ట్య = పెనవేసికొన్న, అంబర = వస్త్రమై, మారచిత్త = మన్మథబుద్ధివలన, చపలా = చపలమైనదై, బాలా = బాలయై, అబలా = అబలయై, నిష్కలా = నిష్కలయై, వేదవదనా = వేదముఖియై, సంభావినీ = సౌందర్యవతియై, తాపినీ = తపింపజేయునదియై, పరిభాతి = ప్రకాశించుచున్నదో, (తాం = అట్టి), క్రియాం = క్రియారూపిణియైన, సృష్టిశక్తిరూపిణి యైన, ఇష్టానామ్ = భక్తులయొక్క, శిరసి = శిరస్సుపై, స్వయంభు = స్వయముగా వెలయువాని యొక్క, వనితాం = ఇల్లాలిని, సంభావయామి = ధ్యానించుచున్నాను, వందే = నమస్కరించుచున్నాను.

**తాత్పర్యం :** ఏ శ్రీదేవి క్రియాశక్తియై భక్తుల శిరస్సుపై స్వయముగా వెలయు శివుని లేక భైరవుని ఇల్లాలో ఆమెను గౌరవించి నమస్కరించుచున్నాను. ఆ దేవి స్వయంభూలింగమైన తన ప్రియుని తన అంగములన్నిటితో ముమ్మారు చుట్టుకొని, పెనవేసికొన్న వస్త్రమై కామచాంచల్యముగల బాలా రూపిణి, నిరవయవి. ఆమెకు వేదములే ముఖము లేక ఆమె ముఖమునుండియే వేదములు శ్రుతులైనవి. ఆమె సౌందర్యవతి. తపింపజేయునది.

**బాలాబలా** అన్నదానిని, **బాలా+అబలా** అని పదవిభాగముజేసి సవర్ణదీర్ఘముగ పరిగణింపవచ్చును. లేక, **బాలా చ బలా** అని ద్వంద్వముగ పరిగణింప వచ్చును. ఇట్లయిన, ఆమె

అబలకాదు, సబల యగును. స్త్రీరూప అన్న అర్థమున అబల సరి. శక్తి కనుక **బలా** అన్ననూ సరియే.

**కల** (లేక కళ) అంటే భాగము అని అర్థము. కనుక **నిష్కలా** అంటే అవిభక్తము అని అర్థము. కళ అంటే వ్యక్తసంకేతము అని సాంకేతికార్థం. ఈ వ్యక్తత వ్యష్టి కావచ్చు, సమష్టి కావచ్చు. ప్రధానకళలు అయిదుగా చెప్పబడినవి : 1. శాంత్యతీతము, అను ఆకాశశక్తి, 2. శాంతి అను వాయుశక్తి, 3. విద్యా అను తేజశ్శక్తి, 4. ప్రతిష్ఠా అను ఆపశ్శక్తి, 5. నివృతి అను పృథ్వీశక్తి. ఇవన్నీ నాదమునుండి పుట్టినవే. ఇవి పంచభూతశక్తుల వ్యక్తరూపమున కళలైనవి. ఇవన్నీ వికసనములేని దశలో నాదమున్నది కదా, అది నిష్కలము. ఈ నాదశక్తియే **వేదవదనా** అన్నది.

**శ్లో॥ వాణీ కోటిమృదంగనాదమదనానిశ్రేణికోటిధ్వనిః**
**ప్రాణేశీ రసరాశమూలకమలోల్లాసైకపూర్ణాననా ।**
**ఆషాఢోద్భవమేఘవాజనియుతధ్వాన్తాననా స్థాయినీ**
**మాతా సా పరిపాతు సూక్ష్మపథగా మాం యోగినాం శంకరీ ॥ 7**

**ప్రతిపదార్థం :** సూక్ష్మపథగా = సూక్ష్మమార్గమున సంచరించునట్టిది, యోగినామ్ = యోగులకు, శంకరీ = శుభమును కలిగించునట్టిది, స్థాయినీ = సర్వదా, సర్వత్ర ఉనికి గలిగినది, కోటిమృదంగనాదమదనా = కోటి మృదంగముల నాదముతో ఆనందింపజేయునట్టి, నిశ్రేణి = నిచ్చెనయొక్క, కోటి = పై అంచుననుండు, ధ్వనిః (అనగా, సర్వోత్తమమైన ధ్వని) = ధ్వనియైన, వాణీ = వాక్కుగలిగినది, ప్రాణ + ఈశీ > ప్రాణేశీ = ప్రాణములకు ఈశ్వరీ యైనది, రస = రసము, రాశ = రాశము, మూల = మూలము అయిన, కమల = పద్మము వంటి, ఉల్లాస + ఏక = ఆనంద మాత్రముచే, పూర్ణ = నిండిన, ఆననా = ముఖముగలది, ఆషాఢ = ఆషాఢమాసమున, ఉద్భవ = పుట్టిన, మేఘవాజ = మబ్బుగమియొక్క, నియుత = పదివేల కోట్లను పోలిన, ధ్వాన్త = నల్లని, ఆననా = ముఖముగలదియైన, సా మాతా = ఆ తల్లి, మామ్ = నన్ను, పరిపాతు = పరిరక్షించుగాక!

**తాత్పర్యం :** సూక్ష్మమార్గంలో సంచరించునది, యోగులకు శుభముగూర్చునది, సర్వదా సర్వత్ర ఉన్నది, అత్యుత్తమమైన కోటి మృదంగముల నాదముతో ఆనందింపజేయు ధ్వనితోడి వాక్కు గలది, ప్రాణములకు ఈశ్వరియైనది, రసము రాశము మూలము అయిన ఆనందముతో నిండిన పద్మముఖి, ఆషాఢ మాసపు పదివేలకోట్ల మబ్బుగుంపులకు సరియైన నల్లని ముఖము గలది, అట్టి ఆ తల్లి నన్ను పరిరక్షించును గాక!

**కోటి** శబ్దానికి సంఖ్యాపరమైన అర్థంతో పాటు వేరే అర్థాలున్నాయి. వానిలో సర్వోత్తమము అన్న అర్థం ఒకటి, అంచు అన్నది మరియొకటి. **నిశ్రేణి** అంటే నిచ్చెన. కనుక **నిశ్రేణికోటి** అన్నప్పుడు నిచ్చెనపై అంచు, అనగా సర్వోత్తమ అన్న అర్థం యేర్పడుతుంది. ఈ సర్వోత్తమ ధ్వనియే ఆ శ్రీదేవి వాణి, అనగా నాదరూపి.

ప్రాణాధారము, మూలాధారము ఆ తల్లియే కనుక **ప్రాణేశీ.** ఈ ఆధారము కమలము రూపంలో మూలాధారమై జీవులలో ఉండేది. దీని అనుభవరూపము **రసము, రాశము** అని రెండు విధాలు. రసము అంటే, **రస్యతే ఇతి రసః** అన్న వ్యుత్పత్తిని బట్టి, ఇది ఆస్వాదింపబడునది, ఆనందరూపము, ఇది పరమాత్మరూపము. **రాశము** అన్నది **రాసము** అనుదాని రూపాంతరము. కాగా రాశము రస సంబంధి. అంటే, రసోత్పత్తికి ఆధారమైనదేదో అది. రసానుభవమునకు, రసోత్పత్తికి కూడ మూలమైన జీవశక్తి **మూలము** అన్నదానికి అర్థం. ఈ శక్తి కమలరూపమైన ఆధారపద్మం లేక చక్రంలో ఆత్మానందసమాధిలో ఉంటుంది కనుక **ఉల్లాసైకపూర్ణాననా.**

ఈమె కాలస్వరూపిణి కాళి కనుక కారుమబ్బులగుంపులు దట్టంగా పట్టిన కారునలుపు ఆమె రంగు.

**పరిపాతు** అనటంలో ఐహిక, ఆముష్మికములు రెండిట ఆ తల్లి రక్షణావశ్యకత ధ్వనిస్తుంది.

**గమనిక :** 4వ పాదంలో, అన్వయసౌలభ్యం కోసం, సూక్ష్మపథగా అనిన్నీ, శంకరీ అనిన్నీ మార్చటం జరిగింది. మన్నించ ప్రార్థన.

**శ్లో॥ త్వామాశ్రిత్య నరా వ్రజన్తి సహసా వైకుంఠకైలాసయో –**
**రానందైకవిలాసినీం శశిశతానందాననాం కారణామ్ ।**
**మాతః శ్రీకులకుండలీ ప్రియకరే! కాలీ! కులోద్దీపనే!**
**తత్‌స్థానం ప్రణమామి భద్రవనితే మాముద్ధర త్వం పశుమ్ ॥ 8**

**ప్రతిపదార్థం :** ఆనంద + ఏక = ఆనందమొక్కటే, విలాసినీమ్ = విలాసముగా గలదానిని, శశిశత = నూర్గురు చంద్రుల, ఆనంద + ఆననామ్ = ఆనందముతో వెలుగు ముఖముగలదానిని, కారణామ్ = జగత్తునకు కారణమగుదానిని, త్వామ్ = నిన్ను, ఆశ్రిత్య = ఆశ్రయించి, నరాః = మానవులు, సహసా = వెంటనే, వైకుంఠకైలాసయోః = వైకుంఠమునకు, కైలాసమునకు, వ్రజన్తి = వెళ్ళుచున్నారు, శ్రీకుల కుండలీమాతః = శ్రీకులకుండలినీమాతా!, ప్రియకరే = ప్రియము చేయుదానా!, కుల + ఉద్దీపనే = కులమును వెలుగొందజేయుదానా!, భద్రవనితే కాలీ = భద్రకాళీ!, తత్‌స్థానం = నీయొక్క స్థానమును, ప్రణమామి = నమస్కరించుచున్నాను, త్వమ్ = నీవు, పశుం మామ్ = పశువునైన, జీవినైన నన్ను, ఉద్ధర = ఉద్ధరించుము.

**తాత్పర్యం :** ఆనందమొక్కటే విలాసమైనది, నూర్గురు చంద్రుల తేజస్సుతో ఆనందముగా వెలుగొందు ముఖము గలది, సృష్టికి ఆదికారణమైనదానిని, నిన్ను ఆశ్రయించి మానవులు వెంటనే వైకుంఠకైలాసములను చేరుచున్నారు. శ్రీదేవీ! కుండలినీదేవతా! మాకు ప్రియముజేయు తల్లీ! భద్రకాళీ! కులమునుద్దీపింపజేయుదానా! నీ మూలస్థానమును నమస్కరించుచున్నాను. పశువునైన నన్నుద్ధరింపుము.

**వైకుంఠకైలాసయోః వ్రజన్తి,** వైకుంఠకైలాసములకు పోవుచున్నారు, అంటే విష్ణుని ఆరాధ్యునిగా భావించి కుండలినీ దేవతనుపాసించినవారు వైకుంఠానికి పోగా, శివునారాధించువారు కైలాసానికి పోతారని భావం. అంటే, **శైవ వైష్ణవులిద్దరికీ కుండలినీ ఉపాస్యమని ఉద్దేశం.**

విలాసము గలది విలాసిని. విలాసం అంటే మిగత అర్థాలతోబాటు సౌందర్యమని కూడా అర్థం. శ్రీదేవి విషయంలో ఆనందసౌందర్యాలు అభేదమని చెప్పటానికే **ఏక**శబ్దప్రయోగం.

ప్రకృతి కార్యకారణరూపమైనది. బాహ్య పదార్థప్రకృతి కార్యము కాగా దీనికి కారణము అంతశ్శక్తి. కనుక కుండలినీదేవత సమస్తసృష్టికి మొదటి కారణము.

**శ్లో॥ కుండలీశక్తిమార్గస్థం స్తోత్రాష్టకమహాఫలమ్ ।**
**యః పఠేత్ ప్రాతరుత్థాయ స యోగీ భవతి ధ్రువమ్ ॥ 9**

**ప్రతిపదార్థం :** కుండలీశక్తిమార్గస్థమ్ = కుండలినీశక్తి ఉపాసనామార్గములోనిదైన, స్తోత్రాష్టకమహాఫలమ్ = గొప్ప ఫలమునిచ్చు స్తోత్రమైన ఈ అష్టకమును, ప్రాతః = ప్రాతఃకాలమున, ఉత్థాయ = నిద్రమేల్కొని, యః = ఎవడు, పఠేత్ = పఠించునో, సః = అతడు, ధ్రువమ్ = నిశ్చయముగా, యోగీ = యోగి, భవతి = అగుచున్నాడు.

**తాత్పర్యం :** కుండలినీ శక్తి నుపాసించే విధానంలో మహాఫలము నివ్వగల ఈ స్తోత్రరూపమున గల అష్టకాన్ని ఎవరు ప్రాతఃకాలమున నిద్రలేచి పఠించునో, ఆతడు యోగి అగును. ఇది నిశ్చయము.

ఇదిన్నీ తర్వాతి శ్లోకమున్నూ ఫలశ్రుతి రూపమైనది.

ఈ కుండలినీ స్తోత్రాన్ని అష్టకం, అంటే, ఎనిమిది శ్లోకాల సమాహారం అనటం వలన శ్లో. 29 నుండి 36 వరకు గల 8 శ్లోకాలు కుండలినీ అష్టకం అవుతుంది.

**శ్లో॥ క్షణాదేవ హి పాఠేన కవినాథో భవేదిహ ।**
**పఠేత్ శ్రీకుండలో యోగో బ్రహ్మలీనో భవేత్ మహాన్ ॥ 10**

**ప్రతిపదార్థం :** క్షణాత్ + ఏవ = క్షణమాత్రమైన, పాఠేన హి = పఠనముతోనే, ఇహ = ఈ లోకంలో, కవినాథః = కవులలో శ్రేష్ఠుడు, భవేత్ = అగును. శ్రీకుండలః = శ్రీకుండలినీ ఉపాసనతో కూడిన, మహాన్ = గొప్ప, యోగః = యోగముగలవాడు (యోగి), పఠేత్ (యది) = పఠించినచో, (సః = ఆతడు), బ్రహ్మలీనః = బ్రహ్మమున లీనము, భవేత్ = అగును.

**తాత్పర్యం :** ఒక్క క్షణకాలము మాత్రమే పఠించిన వాడైనను కవిరాజు కాగలడు. శ్రీచక్రోపాసకుడైన మహాయోగి పఠించినట్లయిన, ఆతడు బ్రహ్మము నందు లీనమగును.

లౌకిక ప్రయోజనం ఆశించకున్నా సిద్ధిస్తుందని ఈ శ్లోక పూర్వార్ధభావం. లాంఛనమాత్రంగా పఠించినవానికైన వాక్శుద్ధి కలుగుతుందన్నది తాత్పర్యం. కాగా, పఠించిన వ్యక్తి కుండలినీ ఉపాసకుడైన యోగి అయితే, బ్రహ్మములో లీనమైపోతాడు, అంటే, జన్మరాహిత్యాన్నీ, బ్రహ్మానందాన్నీ శాశ్వతంగా పొందుతాడని తాత్పర్యం. మహాయోగిగా పరిణతి చెందినవానికి బ్రహ్మభావం తప్ప మిగిలి ఉన్నదేమీ ఉండదు కనుక ఈ పరమస్థితిని పొందగలడని భావం. ✦

---

# రుద్రపఞ్చముఖధ్యానమ్

మం. **ఈశానస్సర్వవిద్యానామీశ్వరః సర్వభూతానాం బ్రహ్మాధిపతిర్బ్రహ్మణోఽధిపతిర్బ్రహ్మా శివో మే అస్తు సదాశివోమ్ ॥** (తై.ఆ.10 ప్ర.43-44 అను.)

సర్వ-విద్యానామ్ = సకలవిద్యలకును; వేదశాస్త్రములకును; చతుష్షష్టి కళలకును; ఈశానః = నియామకుడును; సర్వ-భూతానామ్ = సకల భూతములకును; ఈశ్వరః = నియామకుడును; బ్రహ్మ-అధి-పతిః = వేదమునకు మిక్కిలిగా రక్షకుడును; బ్రహ్మణః = హిరణ్యగర్భునకును; అధి-పతిః = విశేషరూపమున రక్షకుడును; అగు; బ్రహ్మ = వృద్ధినందిన బృహద్రూపముకల; ఈ ఊర్ధ్వముఖ మహాదేవుడు; మే = నాకు; నా విషయమున; శివః = శుభకరుడుగా; అస్తు = అగుగాక!; సదాశివః = ఆ సదాశివుడే; ఓం = నేనుగా అగుదునుగాక! (నాయం దనుగ్రహమంతుడు అగుగాక!)

శ్లో॥ వ్యక్తావ్యక్తగుణేతరం సువిమలం - షట్త్రింశతత్త్వాత్మకం
తస్మాదుత్తరతత్త్వమక్షరమితి - ధ్యేయం సదా యోగిభిః ।
వన్దే తామసవర్జితం త్రిణయనం - సూక్ష్మాతిసూక్ష్మాత్పరం
శాన్తం పఞ్చమమీశ్వరస్య వదనం - ఖవ్యాపితేజోమయమ్ ॥ 5

**ఓం ఓం; పం ఫం బం భం మం; ఔం ఓం; ఓం నమో భగవతే రుద్రాయ ఓం యం; ఊర్ధ్వముఖాయ నమః ॥5॥**

# गङ्गा स्तोत्रम्



देवि सुरेश्वरि भगवति गङ्गे त्रिभुवनतारिणि तरलतरङ्गे ।
शङ्करमौलिविहारिणि विमले मम मतिरास्तां तव पदकमले ॥ ॥१॥

దేవి సురేశ్వరి భగవతి గంగే త్రిభువనతారిణి తరలతరంగే ।
శంకరమౌళివిహారిణి విమలే మమ మతిరాస్తాం తవ పదకమలే ॥ 1

भागीरथि सुखदायिनि मातस्तव जलमहिमा निगमे ख्यातः ।
नाहं जाने तव महिमानं पाहि कृपामयि मामज्ञानम् ॥ ॥२॥

భాగీరథి సుఖదాయిని మాతః తవ జలమహిమా నిగమే ఖ్యాతః ।
నాహం జానే తవ మహిమానం పాహి కృపామయి మామజ్ఞానమ్ ॥ 2

हरिपदपाद्यतरङ्गिणि गङ्गे हिमविधुमुक्ताधवलतरङ्गे ।
दूरीकुरु मम दुष्कृतिभारं कुरु कृपया भवसागरपारम् ॥ ॥३॥

హరిపదపాద్యతరంగిణి గంగే హిమవిధుముక్తాధవళతరంగే ।
దూరీకురు మమ దుష్కృతిభారం కురు కృపయా భవసాగరపారమ్ ॥ 3

तव जलममलं येन निपीतं परमपदं खलु तेन गृहीतम् ।
मातर्गङ्गे त्वयि यो भक्तः किल तं द्रष्टुं न यमः शक्तः ॥ ॥४॥

తవ జలమమలం యేన నిపీతం పరమపదం ఖలు తేన గృహీతమ్ ।
మాతర్గంగే త్వయి యో భక్తః కిల తం ద్రష్టుం న యమః శక్తః ॥ 4

पतितोद्धारिणि जाह्नवि गङ्गे खण्डितगिरिवरमण्डितभङ्गे ।
भीष्मजननि हे मुनिवरकन्ये पतितनिवारिणि त्रिभुवनधन्ये ॥ ॥५॥

పతితోద్ధారిణి జాహ్నవి గంగే ఖండితగిరివరమండితభంగే ।
భీష్మజనని హే మునివరకన్యే పతితనివారిణి త్రిభువనధన్యే ॥ 5

कल्पलतामिव फलदां लोके प्रणमति यस्त्वां न पतति शोके ।
पारावारविहारिणि गङ्गे विमुखयुवतिकृततरलापाङ्गे ॥ ॥६॥

కల్పలతామివ ఫలదాం లోకే ప్రణమతి యస్త్వాం న పతతి శోకే ।
పారావారవిహారిణి గంగే విముఖయువతికృతతరళాపాంగే ॥ 6

तव चेन्मातः स्रोतःस्नातः पुनरपि जठरे सोऽपि न जातः ।
नरकनिवारिणि जाह्नवि गङ्गे कलुषविनाशिनि महिमोत्तुङ्गे ॥ ॥७॥

తవ చేన్మాతః స్రోతఃస్నాతః పునరపి జఠరే సోఽపి న జాతః ।
నరకనివారిణి జాహ్నవి గంగే కలుషవినాశిని మహిమోత్తుంగే ॥ 7

पुनरसदङ्गे पुण्यतरङ्गे जय जय जाह्नवि करुणापाङ्गे ।
इन्द्रमुकुटमणिराजितचरणे सुखदे शुभदे भृत्यशरण्ये ॥ ॥८॥

పునరసదంగే పుణ్యతరంగే జయ జయ జాహ్నవి కరుణాపాంగే ।
ఇంద్రముకుటమణిరాజితచరణే సుఖదే శుభదే భృత్యశరణ్యే ॥ 8

रोगं शोकं तापं पापं हर मे भगवति कुमतिकलापम् ।
त्रिभुवनसारे वसुधाहारे त्वमसि गतिर्मम खलु संसारे ॥ ॥९॥

రోగం శోకం తాపం పాపం హర మే భగవతి కుమతికలాపమ్ ।
త్రిభువనసారే వసుధాహారే త్వమసి గతిర్మమ ఖలు సంసారే ॥ 9

अलकानन्दे परमानन्दे कुरु करुणामयि कातरवन्द्ये ।
तव तटनिकटे यस्य निवासः खलु वैकुण्ठे तस्य निवासः ॥ ॥१०॥

అలకానందే పరమానన్దే కురు కరుణామయి కాతరవంద్యే ।
తవ తటనికటే యస్య నివాసః ఖలు వైకుంఠే తస్య నివాసః ॥ 10

वरमिह नीरे कमठो मीनः किं वा तीरे शरटः क्षीणः ।
अथवा श्वपचो मलिनो दीनस्तव न हि दूरे नृपतिकुलीनः ॥ ॥११॥

వరమిహ నీరే కమఠో మీనః కిం వా తీరే శరటః క్షీణః ।
అథవా శ్వపచో మలినో దీనస్తవ న హి దూరే నృపతికులీనః ॥ 11

भो भुवनेश्वरि पुण्ये धन्ये देवि द्रवमयि मुनिवरकन्ये ।
गङ्गास्तवमिदममलं नित्यं पठति नरोयः स जयति सत्यम् ॥ ॥१२॥

భో భువనేశ్వరి పుణ్యే ధన్యే దేవి ద్రవమయి మునివరకన్యే ।
గంగాస్తవమిదమమలం నిత్యం పఠతి నరో యః స జయతి సత్యమ్ ॥ 12

येषां हृदये गङ्गाभक्तिस्तेषां भवति सदा सुखमुक्तिः ।
मधुराकान्तापज्झटिकाभिः परमानन्दकलितललिताभिः ॥ ॥१३॥



యేషాం హృదయే గంగాభక్తిః తేషాం భవతి సదా సుఖముక్తిః ।
మధురాకాన్తాపజ్ఝటికాభిః పరమానందకలితలలితాభిః ॥ 13

गङ्गास्तोत्रमिदं भवसारं वाञ्छितफलदं विमलं सारम् ।
शङ्करसेवकशङ्कररचितं पठति सुखी स्तव इति च समाप्तः ॥ ॥१४॥

గంగాస్తోత్రమిదం భవసారం వాంచితఫలదం విమలం సారమ్ ।
శంకరసేవకశంకరరచితం పఠతి సుఖీ స్తవ ఇతి చ సమాప్తః ॥ 14

ఇతి శ్రీమచ్ఛంకరాచార్యవిరచితగంగాస్తోత్రం సంపూర్ణమ్. ✦



# శ్రీ జగన్నాథాష్టకము

– శ్రీ ఆదిశంకరాచార్యవిరచితమ్

శ్లో॥ కదాచిత్కాళిందీ – తటవిపినసంగీతకపరో
ముదా గోపీనారీ – వదనకమలాస్వాదమధుపః ।
రమాశంభుబ్రహ్మా – ఽమరపతిగణేశార్చితపదో
జగన్నాథః స్వామీ – నయనపథగామీ భవతు మే ॥ 1

శ్లో॥ భుజే సవ్యే వేణుం – శిరసి శిఖిపింఛం కటితటే
దుకూలం నేత్రాన్తే – సహచర కటాక్షం విదధతే ।
సదా శ్రీమద్బృందా – వనవసతిలీలాపరిచయో
జగన్నాథః స్వామీ – నయనపథగామీ భవతు మే ॥ 2

శ్లో॥ మహాంభోధేస్తీరే – కనకరుచిరే నీలశిఖరే
వసన్ప్రాసాదాంత – స్సహజబలభద్రేణ బలినా ।
సుభద్రామధ్యస్థ – స్సకలసురసేవాఽవసరదో
జగన్నాథః స్వామీ – నయనపథగామీ భవతు మే ॥ 3

శ్లో॥ కథాపారావార – స్సజలజలదశ్రేణిరుచిరో
రమావాణీసౌమ – స్స్ఫురదమలపద్మోద్భవముఖైః ।
సురేంద్రైరారాధ్యః – శ్రుతిగణశిఖాగీతచరితో
జగన్నాథః స్వామీ – నయనపథగామీ భవతు మే ॥ 4

శ్లో॥ రథారూఢో గచ్ఛ – న్పథి మిళితభూదేవపటలైః
స్తుతిప్రాదుర్భావం – ప్రతిపదముపాకర్ణ్య సదయః ।
దయాసిన్ధుర్భాను – స్సకలజగతాం సింధుసుతయా
జగన్నాథః స్వామీ – నయనపథగామీ భవతు మే ॥ 5

శ్లో॥ పరబ్రహ్మాపీడః – కువలయదళోత్ఫుల్లనయనో
నివాసీ నీలాద్రౌ – నిహితచరణోఽనంతశిరసి ।
రసానందో రాధా – సరసవపురాలింగనసుఖో
జగన్నాథః స్వామీ – నయనపథగామీ భవతు మే ॥ 6

శ్లో॥ న వై ప్రార్థ్యం రాజ్యం – న చ కనకతాం భోగవిభవం
న యాచేఽ హం రమ్యాం – నిఖిలజనకామ్యాం వరవధూమ్ ॥
సదా కాలే కాలే – ప్రమథపతినా గీతచరితో
జగన్నాథః స్వామీ – నయనపథగామీ భవతు మే ॥ 7

శ్లో॥ హర త్వం సంసారం – ద్రుతతరమసారం సురపతే
హర త్వం పాపానాం – వితతిమపరాం యాదవపతే ।
అహో దీనానాథం – నిహితమచలం నిశ్చితపదం
జగన్నాథః స్వామీ – నయనపథగామీ భవతు మే ॥ 8 ✦

# చండీకవచము

– వారాహపురాణాంతర్గతం

ఓమ్ నమశ్చండికాయై – మార్కండేయ ఉవాచ :

యద్గుహ్యం పరమం లోకే, సర్వరక్షాకరం నృణామ్ ।
యన్న కస్యచిదాఖ్యాతం, తన్మే బ్రూహి పితామహ ॥ 1

బ్రహ్మోవాచ :

అస్తి గుహ్యతమం విప్ర సర్వభూతోపకారకమ్ ।
దేవ్యాస్తు కవచం పుణ్యం, తత్ శ్రుణుష్వ మహామునే! ॥ 2

ప్రథమం శైలపుత్రీతి, ద్వితీయం బ్రహ్మచారిణీ ।
తృతీయం చంద్రఘంటేతి, కూష్మాండేతి చతుర్థకమ్ ॥ 3

పంచమం స్కందమాతేతి, షష్ఠం కాత్యాయనీతి చ ।
సప్తమం కాళరాత్రిశ్చ మహాగౌరీతి చాష్టమమ్ ॥ 4

నవమం సిద్ధిదా ప్రోక్తా, నవదుర్గాః ప్రకీర్తితాః ।
ఉక్తాన్యేతాని నామాని, బ్రహ్మణైవ మహాత్మనా ॥ 5

అగ్నినా దహ్యమానస్తు, శత్రుమధ్యగతా రణే ।
విషమే దుర్గమే చైవ, భయార్తాః శరణం గతాః ॥ 6

న తేషాం జాయతే కించి, దశుభం రణసంకటే ।
నాపదం తస్య పశ్యామి, శోకదుఃఖభయం నహి ॥ 7

యైస్తు భక్త్యా స్తుతా నూనం, తేషాం సిద్ధిః ప్రజాయతే ।
ప్రేతసంస్థా తు చాముండా, వారాహీ మహిషాసనా ॥ 8

ఐంద్రీ గజసమారూఢా, వైష్ణవీ గరుడాసనా ।
మహేశ్వరీ వృషారూఢా, కౌమారీ శిఖివాహనా ॥ 9

బ్రాహ్మీ హంససమారూఢా, సర్వాభరణభూషితా ।
నానాభరణశోభాఢ్యా, నానారత్నోపశోభితాః ॥ 10

దృశ్యంతే రథమారూఢా, దేవ్యః క్రోధసమాకులాః ।
శంఖం చక్రం గదాం శక్తిం, హలం చ ముసలాయుధమ్ ॥ 11

ఖేటకం తోమరం చైవ, పరశుం పాశమేవ చ ।
కుంతాయుధం త్రిశూలం చ, శార్‌ఙ్గాయుధమనుత్తమమ్ ॥ 12

దైత్యానాం దేహనాశాయ, భక్తానామభయాయ చ ।
ధారయంత్యాయుధానీత్థం, దేవానాం చ హితాయ వై ॥ 13

మహాబలే! మహోత్సాహే! మహాభయవినాశిని! ।
త్రాహి మాం దేవి దుష్ప్రేక్ష్యే, శత్రూణాం భయవర్ధని ॥ 14

ప్రాచ్యాం రక్షతు మామైంద్రీ, ఆగ్నేయ్యామగ్నిదేవతా ।
దక్షిణేఽవతు వారాహీ, నైరృత్యాం ఖడ్గధారిణీ ॥ 15

ప్రతీచ్యాం వారుణీ రక్షేద్, వాయవ్యాం మృగవాహినీ ।
ఉదీచ్యాం రక్ష కౌబేరీ, ఈశాన్యాం శూలధారిణీ ॥ 16

ఊర్ధ్వం బ్రహ్మాణీ మే రక్షేద్, అధస్తాద్ వైష్ణవీ తథా ।
ఏవం దశదిశో రక్షేద్, చాముండా శవవాహనా ॥ 17

జయా మే చాగ్రతః పాతు, విజయా పాతు పృష్ఠతః ।
అజితా వామపార్శ్వే తు, దక్షిణే చాపరాజితా ॥ 18

శిఖామ్మే ద్యోతినీ రక్షేద్, ఉమా మూర్ధ్నివ్యవస్థితా ।
మాలాధరీ లలాటే చ, భ్రువౌ రక్షేద్యశస్వినీ ॥ 19

త్రిణేత్రా చ భ్రువోర్మధ్యే, శ్రోత్రయోః ద్వారవాసినీ ।
కపోలౌ కాళికా రక్షేత్, కర్ణమూలే చ శాంకరీ ॥ 20

నాసికాయాం సుగంధా చ, ఉత్తరోష్ఠే తు చర్చికా ।
అధరే చామృతకలా, జిహ్వాయాం తు సరస్వతీ ॥ 21

దంతాన్ రక్షతు కౌమారీ, కంఠమధ్యే తు చండికా ।
ఘంటికాం చిత్రఘంటా చ, మహామాయా చ తాలుకే ॥ 22

కామాఖ్యాం చిబుకం రక్షేద్, వాచం మే సర్వమంగళా ।
గ్రీవాయాం భద్రకాళీ చ, పృష్ఠవంశే ధనుర్ధరీ ॥ 23

నీలగ్రీవా బహిఃకంఠే, నలికాం నలకూబరీ ।
ఖడ్గధారిణ్యుభౌ స్కంధౌ, బాహూ మే వజ్రధారిణీ ॥ 24

హస్తయోర్దండినీ రక్షేత్, అంబికా చాంగులీస్తథా ।
నఖాన్ శూలేశ్వరీ రక్షేత్, కుక్షౌ రక్షేన్నరేశ్వరీ ॥ 25

స్తనౌ రక్షేన్మహాలక్ష్మీః, మనశ్శోకవినాశినీ ।
హృదయే లలితాదేవీ, ఉదరే శూలధారిణీ ॥ 26

నాభౌ చ కామినీ రక్షేత్, గుదం గుహ్యేశ్వరీ తథా ।
కట్యాం భగవతీ పాతు, నితంబే బిందుమాలినీ ॥ 27

భూతనాథా తథా మేఢ్రం, ఊరూ మహిషవాహినీ ।
జంఘే మహాబలా ప్రోక్తా జానునీ వింధ్యవాసినీ ॥ 28

గుల్ఫయోర్నారసింహీ చ పాదపృష్ఠేఽమితౌజసీ ।
పాదాంగులీః శ్రీధరీ చ పాదౌ పాతాళవాసినీ ॥ 29

కరాళినీ పాదనఖాన్ కేశాంశ్చైవోర్ధ్వకేశినీ ।
రోమకూపాని కౌమారీ, త్వచం వాగీశ్వరీ తథా ॥ 30

రక్తమజ్జావసామాంసాన్యస్థిమేదాంసి పార్వతీ ।
అంత్రాణి కాళరాత్రిశ్చ, పిత్తం చ ముకుటేశ్వరీ ॥ 31

పద్మావతీ పద్మకోశే, కఫే చూడామణిస్తథా ।
జ్వాలాముఖీ నఖజ్వాలాం, అభేద్యా సర్వసంధిషు ॥ 32

శుక్రం బ్రహ్మాణీ మే రక్షేత్, ఛాయాం ఛత్రేశ్వరీ తథా ।
అహంకారం మనోబుద్ధిం, రక్షేన్మే ధర్మధారిణీ ॥ 33

ప్రాణాపానౌ తథా వ్యానం, సమానోదానమేవ చ ।
వజ్రహస్తా చ మే రక్షేత్, ప్రాణాన్ కల్యాణశోభనా ॥ 34

రసే రూపే చ గంధే చ శబ్దే స్పర్శే చ యోగినీ ।
సత్త్వం రజస్తమశ్చైవ రక్షేన్నారాయణీ తథా ॥ 35

ఆయుర్మే రక్ష వారాహీ, ధర్మం రక్షతు వైష్ణవీ ।
యశః కీర్తిం చ లక్ష్మీం చ, సదా రక్షంతు మాతరః ॥ 36

గోత్రమింద్రాణీ మే రక్షేత్, పశూన్మే రక్ష చండికా ।
పుత్రాన్ రక్షేన్మహాలక్ష్మీః, భార్యాం రక్షతు భైరవీ ॥ 37

మార్గం క్షేమకరీ రక్షేత్, విజయా సర్వతః స్థితా ।
రక్షాహీనం తు యత్స్థానం, వర్జితం కవచేన తు ॥ 38

తత్సర్వం రక్ష మే దేవీ, జయంతీ పాపనాశినీ ।
పదమేకం న గచ్ఛేత్తు, యదీచ్ఛేత్ శుభమాత్మనః ॥ 39

కవచేనావృతో నిత్యం, యత్ర యత్రాధిగచ్ఛతి ।
తత్ర తత్రార్థలాభశ్చ, విజయస్సార్వకాలికః ॥ 40
యం యం కామయతే కామం, తం తం ప్రాప్నోతి నిశ్చితమ్ ।
పరమైశ్వర్యమతులం, ప్రాప్స్యతే భూతలే పుమాన్ ॥ 41

నిర్భయో జాయతే మర్త్యః, సంగ్రామేష్వపరాజితః ।
త్రైలోక్యే తు భవేత్పూజ్యః, కవచేనావృతః పుమాన్ ॥ 42

ఇదం తు దేవ్యాః కవచం, దేవానామపి దుర్లభమ్ ।
యః పఠేత్ ప్రయతో నిత్యం, త్రిసంధ్యం శ్రద్ధయాన్వితః ॥ 43

దైవీకలా భవేత్తస్య, త్రైలోక్యేఽప్యపరాజితః ।
జీవేత్ వర్షశతం సాగ్రమపమృత్యువివర్జితః ॥ 44

నశ్యంతి వ్యాధయః సర్వే, లూతావిస్ఫోటకాదయః ।
స్థావరం జంగమం చాపి, కృత్రిమం చాపి యద్విషమ్ ॥ 45

అభిచారాణీ సర్వాణి, మంత్రయంత్రాణి భూతలే ।
భూచరాః ఖేచరాశ్చైవ, జలజాశ్చోపదేశికాః ॥ 46

సహజాః కుశలామలాః, శాకినీ ఢాకినీ తథా ।
అంతరిక్షచరాఘోరా, యక్షిణ్యశ్చ మహాబలాః ॥ 47

గ్రహభూతపిశాచాశ్చ, యక్షగంధర్వరాక్షసాః ।
బ్రహ్మరాక్షసభేతాళాః, కూష్మాండా భైరవాదయః ॥ 48

నశ్యంతి దర్శనాత్తస్య, కవచే హృదిసంస్థితే ।
మానోన్నతి ర్భవేద్రాజ్ఞః, తేజోవృద్ధికరం పరమ్ ॥ 49

యశసా వర్ధతే సోఽపి, కీర్తిమాంశ్చైవ జాయతే ।
జపేత్ సప్తశతీం చండీం, కృత్వా తు కవచం పురా ॥ 50

యావద్భూమండలం ధత్తే, సశైలవనకాననమ్ ।
తావత్తిష్ఠతి మేదిన్యాం, సంతతిః పుత్రపౌత్రకీ ॥
దేహాన్తే పరమం స్థానం, యత్ సురైరపి దుర్లభమ్ ।
ప్రాప్నోతి పురుషోన్నిత్యం, మహామాయాప్రసాదతః ॥
ఇతి దేవ్యాః కవచమ్.

---

# శాంతి మంత్రం

ఓం భద్రం కర్ణేభిః శృణుయామ దేవాః । భద్రం పశ్యేమాక్షభిర్యజత్రాః ।
స్థిరైరంగైస్తుష్టువాగ్ంసస్తనూభిః । వ్యశేమ దేవహితం యదాయుః ॥
స్వస్తి న ఇన్ద్రో వృద్ధశ్రవాః । స్వస్తి నః పూషా విశ్వవేదాః ।
స్వస్తి నస్తార్క్ష్యో అరిష్టనేమిః । స్వస్తి నో బృహస్పతిర్దధాతు ॥
ఓం శాంతిః శాంతిః శాంతిః ॥

దేవాః = దేవతలారా (పూజ్యపాదులారా); కర్ణేభిః = (గురుశిష్యులు) చెవులతో; భద్రమ్ = శుభప్రదమైన దానిని (అంటే శాస్త్రవచనాల వంటివి); శృణయామ = విందాము గాక; యజత్రాః = యజ్ఞకర్మలలో కోవిదులమైన (మేము); అక్షభిః = కళ్లతో; భద్రం = శుభప్రదమైన దానిని (యజ్ఞం పూజ ఇత్యాదులు); పశ్యేమ = చూద్దాము గాక; స్థిరైః = పటువైన; అంగైః = అవయవాలతో; తనూభిః = శరీరాలతో (కూడివున్న మేం); తుష్టువాంసః = (మీ స్తుతులను) గానం చేస్తూ; దేవహితమ్ = దైవనియమితమైన; ఆయుః = జీవన పరిమితి (ఆయుష్కాలం); వ్యశేమ = సంపూర్ణంగా పొందెదం గాక; వృద్ధశ్రవాః = ప్రాచీనగురువర్యులచే శాస్త్రాలందు వర్ణింపబడిన వాడు (అయిన); ఇంద్రః = దేవేంద్రుడు; నః = మాకు; స్వస్తి = (మా స్వాధ్యాయంలో నేర్చిన దాన్ని అభ్యసించడంలో) అభ్యుదయాన్ని; దధాతు = ఒసగు గాక; విశ్వవేదాః = సర్వజ్ఞుడైన; పూషా = పూషుడు (సూర్యుడు); నః స్వస్తి దధాతు = మాకు అభ్యుదయం ఒసగుగాక; అరిష్టనేమిః = అరిష్టాలను హరించే; తార్క్ష్యమ్ = దివ్యవిహంగం (గరుడుడు); నః స్వస్తి దధాతు = మాకు అభ్యుదయం ఒసగుగాక; బృహస్పతిః = బృహస్పతి; నః స్వస్తి దధాతు = మాకు అభ్యుదయం ఒసగుగాక!

# పెద్దనగారు చెప్పిన ఉత్పలమాలిక

*డా॥ తాడేపల్లి పతంజలి, పటాన్ చెరువు.*

ఒకనాడు రాయలు భువనవిజయంలో బంగారు పళ్లెంలో గండపెండేరాన్ని తెప్పించాడు. సంస్కృతములోనూ, తెలుగులోనూ సమానంగా కవిత్వం చెప్పగలిగే వారు ఉంటే వచ్చి తీసుకోమని చెప్పాడు. సభలో ఉన్న ఎనిమిది కవులు మాట్లాడలేదు. "ముద్దుగా నేను గండపెండేరాన్ని ఇస్తానంటే ఒక్కరు కూడా వచ్చి తీసుకోరేమిటి?" అన్నాడు రాయలు. అప్పుడు పెద్దనగారు "పెద్దన బోలు పండితులు పృథ్విని లేరని నీవెఱుంగవే? పెద్దన కీదలంచినను బేరిమి నాకిడు కృష్ణరాణ్ణృపా!" అంటూ ఒక ఉత్పలమాలిక చెప్పాడు. పెద్దనగారు చెప్పిన ఆ ఉత్పలమాలిక మరియూ దాని అర్థతాత్పర్యాలు వరుసగా తెలుసుకుందాం.

**పూఁత మెఱుంగులుం బసరుపూఁప బెడంగులుఁజూపునట్టివా**
**కైతలు? జగ్గు నిగ్గు నెనగావలెఁ గమ్మనఁ గమ్మనవ్వలెన్**
**రాతిరియున్ బవల్ మఱపురాని హొయల్ చెలి యారజంపు ని**
**ద్దా తరితీపులో యనఁగఁ దారసిలన్వలె లోఁ దలంచినన్**
**బాఁతిగఁ బై కొనన్ వలెను బైదలి కుత్తుకలోని పల్లటీ**
**కూఁతలనన్వలెన్ సొగసుకోర్కులు రావలె నాలకించినన్**
**జేతికొలందిఁ గౌగిటను జేర్చిన కన్నియ చిన్ని పొన్ని మే**
**ల్మూఁతల చన్ను దోయివలె ముచ్చటగావలెఁ బట్టిచూచినన్**
**దాతొడనున్న మిన్నులమిటారపు ముద్దులగుమ్మ కమ్మనౌ**
**వాతెఱదొండపండువలె వాచవిగావలెఁ బంటనూదినన్**
**గాతలఁదమ్మిచూలిదొర కైవసపుం జవరాలి సిబ్బెపు**
**న్మే తెలి యబ్బురంపు జిగి నిబ్బర పుబ్బగు గబ్బిగుబ్బపొం**
**బూఁతల నున్న కాయ సరిపోఁడిమి కిన్నెర మెట్లబంతి సం**
**గాతపు సన్నతంతి బయకారపుఁగన్నడ గౌళపంతుకా**
**సాతత తానతానలపసన్ దివుటాడెడు గోటమీటు బల్**
**మ్రోతలునుంబలెన్ హరువు మొల్లముగావలె నచ్చతెన్గు లీ**
**రీతిగ సంస్కృతంబు పచరించెడు పట్టున భారతీవధూ**
**టీ తపనీయగర్భనికటీ భవ దాననపర్వసాహితీ**
**భౌతిక నాటకప్రకర భారత భారత సమ్మతప్రభా**
**శీతనగాత్మజా గిరిశశేఖర శీతమయూఖరేఖికా**
**పాతసుధాప్రపూర్ణ బహుభంగఘుమంఘుమఘుంఘుమార్భటీ**
**జాతక తాళయుగ్మ లయసంగతి చుంచు విపంచికా మృదం**
**గాతత తేహితత్తహిత హోధితధంధణుధాణుధింధిమి**
**వ్రాతలయానుకూల పదవారకుహూద్వహ హోరికింకిణీ**
**నూతనఘల్ఘలా చరణనూపుర ఝూళఝుళీ మరందసం**
**ఘూతవియద్ధునీ చకచకద్వికచోత్పలసారసంగ్రహో**

**యాత కుమారగంధవహహారి సుగంధ విలాసయుక్తమై**
**చేతము చల్లఁజేయవలె జిల్లన జల్లవలెన్ మనోహర**
**ద్యోతకగోస్తనీఫలమధుద్రవ గోఘృతపాయసప్రసా**
**రాతిరసప్రసారరుచిరప్రసరంబుగ సారె సారెకున్ ।**

**అర్థ తాత్పర్యాలు :**

**పూఁత మెఱుంగులుం బసరుపూఁప బెడంగులుఁజూపునట్టివా**
**కైతలు? జగ్గు నిగ్గు నెనగావలెఁ గమ్మనఁ గమ్మనన్వలెన్** (1–2)

**అర్థము :** పూత మెఱుంగులుం = వట్టి తళుకులు, పసరుపూఁప = లేతమొగ్గ, బెడంగులు = అందాలు, జగ్గు = తళతళ, నిగ్గు = ఉత్కృష్ట కాంతి, ఎన = సమానము.

**తాత్పర్యము :** వట్టి తళుకులు, లేఁతమొగ్గల అందాలు చూపునట్టివా కవితలు? తళతళలతో, ఉత్కృష్ట కాంతులతో కవితలలో పదాలు, భావాలు సమానము కావాలి. ఆ కవితలు వింటుంటే ఏదో తెలియని కమ్మని పరిమళము హృదయములోకి వ్యాపించాలి.

**రాతిరియున్ బవల్ మఱపురాని హొొయల్ చెలి యారజంపు ని**
**ద్దా తరితీపులో యనఁగఁ దారసిలన్వలె లోఁ దలంచినన్** (3–4)

**అర్థము :** హొొయలు = విలాసము, ఆరజము = అవ్యక్తమధుర ధ్వని (విలాసము), నిద్దా = నునుపుగల, స్నేహముగల, తరితీపు = అపేక్ష, తారసిలన్ వలెన్ = సమీపించవలెను.

**తాత్పర్యము :** లోలోపల తలచుకొని మురిసిపోయే స్థాయిలో ఆ కవితలు ఉండాలి. విలాసాలతో, అవ్యక్త మధుర ధ్వనులతో స్నేహాపేక్షలతో ఉన్న ప్రేయసి చేష్టలు, మనస్సుకు ఎంత దగ్గరగా వచ్చి రాత్రింబవళ్లు తలచుకొని మురిసిపోతుంటామో, మంచి కవితలు మనస్సుకు అంత దగ్గరగా రావాలి. లోలోపల తలచుకొని మురిసిపోవాలి.

**బాఁతిగఁ బై కొనన్ వలెను బైదలి కుత్తుకలోని పల్లటీ**
**కూఁతలనన్వలెన్ సొగసుకోర్కులు రావలె నాలకించినన్** (5–6)

**అర్థము :** బాఁతిగ = ప్రేమగా, బైకొనన్ వలెను = కౌగిలించుకోవాలి, పైదలి = స్త్రీ, కుత్తుకలోని = గొంతులోని, పల్లటీకూఁతల = పావురాల కూతలు, సొగసు = అందము (దేనిని చూస్తే సొగయుదురో – అంటే పరవశిస్తారో అది సొగసు), ఆలకించిన = వింటే.

**తాత్పర్యము :** నచ్చిన అందగత్తె గొంతులోనుంచి వచ్చే పావురాల కూతలవలె (ఆమె మాట్లాడే మాటలు నచ్చిన వాడికి పావురాల కూతలవలె మధురంగా ఉంటాయని భావము) ఉత్తమ కవితలు ప్రేమగా ఆలింగనము చేసుకోవాలి. మంచి కవితలు వింటుంటే అందమైన కోర్కెలు పుట్టాలి.

**చేతికొలందిఁ గౌగిటను జేర్చిన కన్నియ చిన్ని పొన్ని మే**
**ల్మాఁతల చన్ను దోయివలె ముచ్చటగావలెఁ బట్టిచూచినన్** (7–8)

**అర్థము :** కొలది = 1. పరిమితి, శక్యము, పరిణామము కలది, 2. సమానమైనది; చిన్ని = మనోజ్ఞమయిన, చిన్నదయిన

**తాత్పర్యము :** తెలుగు కవితలు మనస్సుకు పట్టాలి. ప్రేమతో బిగి కౌగిలిలో చేర్చిన ప్రేయసి అందమయిన యౌవనసంపద శరీరానికి కలిగించే స్పర్శాసుఖము, మనస్సుకు పట్టినంత హాయిని తెలుగు కవిత కలిగించాలి. మనస్సును వీడిపోకుండా తెలుగు కవిత పట్టుకొని ఉండాలి.

> **డాతొడనున్న మిన్నులమిటారపు ముద్దులగుమ్మ కమ్మనౌ**
> **వాతెఱదొండపండువలె వాచవిగావలెఁ బంటనూదినన్** (9–10)

**అర్థము :** డొతొడనున్న = ఎడమ తొడపై నున్న, మిన్నుల మిటారి = విలాసవతి, వాతెఱ = పెదవి (నోటికి తెరయని వ్యుత్పత్తి), వాచవి = నోటికి రుచి

**తాత్పర్యము :** తన వామాంకము మీద కూర్చున్న విలాసవతిని మునిపంట నొక్కినప్పుడు ఆమె దొండపండు వంటి పెదవులనుండి బయటికి వచ్చు అమృత ధారలా తెలుగు కవిత్వము చదివేటప్పుడు ఆ కవితా రసము ఆనందాన్ని కలిగించాలి.

> **గాతలఁదమ్మిచూలిదొర కైవసపుం జవరాలి సిబ్బెపు**
> **న్మే తెలి యబ్బురంపు జిగి నిబ్బర పుబ్బగు గబ్బిగుబ్బపొం**
> **బూఁతల నున్న కాయ సరిపోఁడిమి** (11–13)

**అర్థము :** తమ్మిచూలి = బ్రహ్మ, (తమ్మియందు పుట్టినవాడు), కైవసము = అధీనము, వశము; జవరాలు = జవ్వని + ఆలు = యౌవనస్త్రీ, సిబ్బెము = స్వచ్ఛము, పొం = బంగారము

**తాత్పర్యము :** బ్రహ్మగారి ఇల్లాలయిన సరస్వతీ దేవి స్వచ్ఛమైన దేహకాంతికి సమానముగా తెలుగు కవిత్వము ఉండాలి. సంభ్రమము కలిగించాలి. ఆమె యొక్క కఠినమైన యౌవన సంపద రాపిడిచే బ్రహ్మగారి చేతులయందు కలిగిన కాయలా కవిత్వము శోభించాలి.

ఆ కాయ బంగారపు పూతలా ఉన్నదని కవిగారి చమత్కారము. ఇక్కడ కాయ అంటే కఠిన వస్తువును తాకుటచే చేతలయందు కాచే కాయ. దీనినే కిణము అంటారు.

> **కిన్నెర మెట్లబంతి సం / గాతపు సన్నతంతి బయకారపుఁగన్నడ గౌళపంతుకా**
> **సాతత తానతానలపసన్ దివుటాడెడు గోటమీటు బల్/మ్రోతలునుంబలెన్**
> **హరువు మొల్లముగావలె నచ్చతెన్గు లీ రీతిగ,** (13–16)

**అర్థము :** కిన్నెర = వీణావిశేషము, మెట్టు = స్థాయి, సంగాతము = స్నేహము, బయకారము (బయలు + కారము) = యౌవనమునందు బయలుపడు శృంగారచేష్ట, సాతత = బాగా వ్యాపించిన, తాన = తంతువు, పస = మృదుత్వము, తివుట = కోరిక, హరువు = అందము, మొల్లము = అధికము

**తాత్పర్యము :** వీణ వాయించేటపుడు కుడిచేత్తో మీటుతూ, ఎడమచేతి వేళ్లతో మెట్టుమీద అదిమిపట్టి స్వరాలు పలికిస్తుంటారు. కిన్నర వీణ గోటితో మీటేటప్పుడు వచ్చే అందమైన అనేకరకాలైన మోతల్లా అచ్చ తెలుగు కవితల్లో అందాలు అధికంగా పలకాలి అని కిన్నర వీణ మోతలకి, అచ్చ తెలుగు కవితల్లోని ధ్వనులకి పెద్దనగారు ఈ పంక్తుల్లో పోలిక చెప్పారు.

కన్నడ, గౌళ, పంతు మొదలయిన రాగాల స్వరాలను కిన్నర వీణ మీద పలికించే సమయంలో యవ్వన శృంగార చేష్టలు ఆ వీణా నాదాలతో పాటు వ్యాపిస్తుంటాయని, ఆ వీణా ధ్వనులు అచ్చ తెలుగు కవితల్లోని ధ్వనులు కావాలని ఆ కిన్నర వీణా నాదాలకు ఇంకో మెట్టుగా భావాన్ని పలికించారు పెద్దన.

***ఇక్కడితో అచ్చతెలుగు కవిత్వంలో రసము, ధ్వని మొదలైనవి ఎలా ఉండాలో పెద్దన పూర్తి చేసారు.***

**సంస్కృతంబు పచరించెడు పట్టున భారతీవధూ**
**టీ తపనీయగర్భనికటీ భవ దాననపర్వసాహితీ**
**భౌతిక నాటకప్రకర భారత భారత సమ్మతప్రభా**

**అర్థము :** పచరించెడు పట్టున = వ్యాపింపచేయు సందర్భములో, భారతీవధూటీ = సరస్వతీదేవి, తపనీయ = బంగారు, గర్భ నికటీ భవత్ = గర్భ నిర్బంధము నుండి పుట్టినదై, ఆనన పర్వ = ముఖానికి ఆనందమును కలిగించు వాగ్విభవముతో, భౌతిక = ముత్యాల కాంతి వంటి కాంతితో వెలుగొందే, నాటక ప్రకర = నాటక సమూహాలతో, భారత = భరతముని నాట్య శాస్త్రము సమ్మతించిన రూపకాలతో

**తాత్పర్యము :** సరస్వతీదేవి బంగారు గర్భములో పుట్టి ముఖానికి ఆనందము కలిగించు వైభవముతో ముత్యాల కాంతి వంటి కాంతితో వెలుగొందే నాటక సమూహాల కాంతితో, ప్రకాశించే ఆసక్తి కలిగించే భరతముని నాట్య శాస్త్రము సమ్మతించిన రూపక లక్షణాలు సమ్మతించేటట్లుగా సంస్కృత కవిత్వం ఉ ండాలి.

**వివరణ :** సరస్వతీదేవి బంగారు గర్భములో పుట్టటమంటే సంస్కృత కవిత్వం ఉదాత్తంగా ఉండాలని భావము.

కవి చక్కటి కవిత్వం చదువుతున్నప్పుడు వింటున్న సహృదయముల ముఖాలు ఆనందంతో వెలుగొందుతాయి. దీనినే ముఖానికి ఆనందము కలిగించు వైభవము అంటున్నారు పెద్దన.

“జానక్యాః కమలామలాంజలి పుటే... ముక్తాః తా శుభదా భవంతు భవతం శ్రీరామ వైవాహికాః” అనే శ్లోకంలో ముత్యాల కాంతి తెలుగు వారందరికి పరిచయమే. సీతమ్మ చేతులు కెంపు వర్ణంలో ఎఱ్ఱ తామర పూలలాగా ఉంటాయి. ఆ ముత్యాల తలంబ్రాలను సీతమ్మ తన చేతిలో తీసుకున్నప్పుడు అవి పద్మరాగాలయ్యాయి. రాముని నల్లని కురులపై మల్లెపూలలాగా కనిపించాయి ఆ ముత్యాలు. తలపై నుండి కిందకు జారిన ఆ ముత్యాలు రాముని రంగులో కలిసిపోయి ఇంద్రనీలమణులు అయ్యాయి.

ఆ ముత్యాల తలంబ్రాలు మనందరికీ శుభాలను కలుగజేయుగాక అని ఆకాంక్షిస్తున్నారు. ఇటువంటి భావాలతో ఉండే కావ్య నాటక సమూహాలలోని ముత్యాలకాంతి సంస్కృత కవిత్వంలో ఉండాలని కవి ఆకాంక్ష.

పెద్దనగారు ఈ పాదాలలో భారత, భారత అని రెండు సార్లు వాడారు. మొదటి భారత పదానికి ప్రకాశించే ఆసక్తి అని అర్థం. (భా = ప్రకాశము, రత = ఆసక్తి) రెండవ భారత పదము భరతుని నాట్య శాస్త్రానికి సంబంధించినది. 1. నాటకము, 2. ప్రకరణము, 3. భాణము, 4. ప్రహసనము, 5. డిమము, 6. వ్యాయోగము, 7. సమవాకారము, 8. వీథి, 9. అంకము, 10. ఈహా మృగము అను పది రకాల రూపకాలు భరతుని నాట్యశాస్త్రము అంగీకరించినవి. వాటిలోని లక్షణాలనే ముత్యాల సౌందర్య కాంతి సంస్కృత కవిత్వంలో ఉండాలని కవి కోరిక.

**శీతనగాత్మజా గిరిశశేఖర శీత మయూఖరేఖికా**
**పాతసుధాప్రపూర్ణ,**

**తాత్పర్యము :** హిమవంతుని కుమార్తె అయిన పార్వతీఅమ్మవారితో కలిసిన పరమశివుని సిగమీద ఉన్న చంద్రకళ నుంచి కిందికి జారే అమృతపు వానలా సంస్కృత కవిత్వము పరిపూర్ణంగా శోభించాలి. (అంటే సంస్కృత కవిత్వం అమృతంలా ఉండాలని భావం.)

హిమాలయము అనటానికి అద్రిరాజము, ఉదగద్రి, కొండఱేడు, కోడెకొండ, గట్టులరేడు, ధరణము, నగాధిరాజము, పర్వతపతి – ఇలాంటి పదాలు ఎన్నెన్నో ఉన్నాయి. కాని కవి కావాలనే శీత నగము అనే పదము వాడాడు. చల్లదనంతో పోలికగల ఈ పద్యంలో శీతనగము అని ప్రయోగించిన పెద్దన నిజంగా పెద్దనే.

**బహుభంగఘుమంఘుమఘుంఘుమార్భటీ**
**జాతక తాళయుగ్మ లయసంగతి చుంచు విపంచికా మృదం**
**గాతత తేహితత్తహిత హోధితధంధణుధాణుధింధిమి**
**వ్రాతలయానుకూల పదవారకుహూధ్వహ హారికింకిణీ**
**నూతనఘల్లలా చరణనూపుర ఝూళఝుళీ మరందసం**
**ఘాతవియద్ధునీ చకచకద్వికచోత్పలసారసంగ్రహా**
**యాత కుమారగంధవహహారి సుగంధ విలాసయుక్తమై**
**చేతము చల్లఁజేయవలె జిల్లన జల్లవలెన్ మనోహర** (27–28)

రౌద్రభీభత్స రసములలో కావ్య రచనకు ఉపయోగపడు ఒక వృత్తిని ఆరభటి అంటారు. ఇది ప్రౌఢంగా ఉంటుంది. సంస్కృత కవిత్వము అనేకరకాలైన ఘుమంఘుమఘుంఘుమల ప్రౌఢిమ నుండి బయట పడు లయ తాళముల మేలికూర్పుతో ఉండాలని పెద్దన చెబుతున్నారు.

ఆ ప్రౌఢిమ “ఘుమంఘుమఘుంఘుమ” గా ఉంటుందని చెప్పటంలో ఒక చమత్కారముంది. “ఘుమంఘుమఘుంఘుమ” సంస్కృత కవిత్వములో ప్రౌఢ శైలి ఎలా ఉంటుందో చెప్పకుండా చెబుతోంది. ఆ శైలిలోని పదాలు వింటున్న వారికి హృదయంలోకి పరిమళం వ్యాపించాలని కవి వాక్కు. కృష్ణశాస్త్రి గారు పదాలకు రంగు, రుచి, వాసన ఉంటాయని పెద్దనగారి ఈ పంక్తి చూసి అన్నారేమో! ఏమో!

వీణెలోనగువాని మ్రోతలతో, తేహితత్తహిత హోధితధంధణుధాణుధింధిమి మొదలయిన మృదంగ ధ్వనులు కలిసిన సమూహములకు అనుకూలంగా ఉండే కోకిలల శ్రావ్యమైన మధుర ధ్వనులతో, గమకితములైన (అధికములైన) మనోహరములయిన చిఱుమువ్వల సవ్వడులు సంస్కృతకవిత్వము కలిగి ఉండాలి. (మువ్వ అంటే మూడు గీరలవంటి సందులుగల పెద్దగజ్జె. చిరు మువ్వ అంటే చిన్న గజ్జె.)

కొత్తవైన కాలి అందెలు ఘల్లు ఘల్లుమని మోగుతుంటే ఆ చప్పుళ్లు మరందపు రుచిలా చక్కగా ప్రకాశిస్తాయి. అటువంటి మరందపు రుచి కలిగిన నల్ల కలువల పూల యొక్క ప్రేమ సంకేతములైన పుప్పొడితో కలిసి, బూడిద రంగును పొంది, అతిశయించిన మలయ మారుతపు పిల్లగాలుల అందమయిన సువాసనలను విలాసములు పుట్టిస్తూ సంస్కృత కవిత్వము మనస్సులో పోలికలేని ఆనందాన్ని కలిగించాలి.

**ద్యోతకగోస్తనీఫలమధుద్రవ గోఘృతపాయసప్రసా**
**రాతిరసప్రసారరుచిరప్రసరంబుగ సారె సారెకున్।** (27–28)

హృదయాన్ని మురిపించే ద్రాక్షాఫలము (గోస్తని), తేనె, ఆవునెయ్యి పాయసములతో కలగలిపిన గొప్పదయిన అతిరసమను పదార్థమునుండి వచ్చే ఆనంద ప్రసారంలా మాటి మాటికీ సంస్కృత కవిత్వము మైమరిపించాలి.

**విశేషాలు :** కావ్యాంగాలు రసం, అలంకారం, ధ్వని, గుణము మొదలయినవి. వీటిని పెద్దనగారు సంస్కృత కవిత్వ లక్షణాలలో తనదయిన శైలిలో పేర్కొన్నారు.

**ముగింపు :** మాలికలు వ్రాసిన వారు ఎంతో మంది ఉన్నారు. కాని మాలిక అని చెబితే ప్రథమ తాంబూలము పెద్దనగారి ఈ ఉత్పల మాలికకే.

పెద్దనగారు ఈ మాలికలో వాడిన పదాల వెనుక అంతులేని ఆలోచనా సాగరాలు ఉన్నాయి. పూలని, వెన్నెలని, కాంతిని, రుచులను ప్రేమించగలిగేవాళ్లు మాత్రమే ఈ ఉత్పల మాలికను ఆస్వాదించగలరు. ఈ ఉత్పలమాలికను చదవటానికి కావాలిసిన అర్హత ఇదే. ✦

---

# శాంతి మంత్రం

**ఓం శం నో మిత్రః శం వరుణః । శం నో భవత్వర్యమా । శం న ఇంద్రో బృహస్పతిః ।**
**శం నో విష్ణురురుక్రమః । నమో బ్రహ్మణే । నమస్తే వాయో । త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి ।**
**త్వామేవ ప్రత్యక్షం బ్రహ్మ వదిష్యామి । ఋతం వదిష్యామి । సత్యం వదిష్యామి ।**
**తన్మామవతు । తద్వక్తారమవతు । అవతు మామ్ । అవతు వక్తారమ్ ॥**
**ఓం శాంతిః శాంతిః శాంతిః ॥**

మిత్రః = మిత్రుడు (ప్రాణానికి, పగటికి అభిమాని దేవత); నః = మాకు; శమ్ = మేలు చేయుగాక; వరుణః = వరుణుడు (అపానవృత్తికి (ప్రాణంలో ఒక అంశం) రాత్రికి అభిమాని దేవత); శమ్ = మేలు ఒనర్చుగాక; అర్యమా = అర్యముడు (కన్నులకు, సూర్యమండలమునకు అభిమాని దేవత); నః = మాకు; శం భవతు = మేలు చేయుగాక; ఇంద్రః = ఇంద్రుడు (చేతులకు, బలానికి అభిమాని దేవత); బృహస్పతిః = బృహస్పతి (వాక్కుకు, బుద్ధికి అభిమాని దేవత); నః = మాకు; శమ్ = మేలు చేయుగాక; ఉరుక్రమః = విశాలమైన పాదములుగల; విష్ణుః = విష్ణువు (పాదాలకు అభిమాని దేవత); నః = మాకు; శమ్ = మేలు చేయుగాక; బ్రహ్మణే = బ్రహ్మమునకు; నమో = నమస్కారము; వాయో = వాయుదేవుడా; తే = నీకు; నమః = నమస్కారము; త్వం ఏవ = నీవే; ప్రత్యక్షమ్ = ప్రత్యక్షమైన; బ్రహ్మ అసి = బ్రహ్మము అగుచున్నావు; త్వాం ఏవ = నిన్నే; ప్రత్యక్షం బ్రహ్మ = ప్రత్యక్షమైన బ్రహ్మవు అని; వదిష్యామి = ఉద్ఘాటిస్తున్నాను; ఋతమ్ = (నీవే) ఋతము (ఋతం, సత్యం అన్నవి రెండూ సత్యం అనే దానిని సూచించే పదాలు. ఋతం అన్నది వ్యావహారిక సత్యం; సత్యం అన్నది పారమార్థిక సత్యం. ఉదాహరణకు: సూర్యుడు తూర్పున ఉదయించడం, పశ్చిమాన అస్తమించడం మనం నిత్యం చూసే సత్యం, వ్యావహారిక సత్యం. కానీ సూర్యుడు ఉదయించడమో, అస్తమించడమో లేదన్నది పారమార్థిక సత్యం. అట్లే ప్రపంచమూ, దాని కదలికలూ యావత్తు సత్యమే; ఇది వ్యావహారిక సత్యం. భగవంతుడు నేపథ్యంలో ఉంటూ దాన్ని నడిపిస్తున్నాడన్నది పారమార్థిక సత్యం.); వదిష్యామి = చెప్పుచున్నాడు; సత్యమ్ = (నీవే) సత్యం అనీ; వదిష్యామి = చెప్పుచున్నాను; తత్ = (వాయురూప) బ్రహ్మం; మాం = (శిష్యుడనైన) నన్ను; అవతు = రక్షించుగాక; తత్ = ఆయన; వక్తారమ్ = ఆచార్యుని; అవతు = రక్షించు గాక; మామ్ = నన్ను; అవతు = రక్షించుగాక; వక్తారమ్ = ఆచార్యుని; అవతు = రక్షించుగాక.



# अर्गलास्तोत्रम्

## जयन्ती मङ्गला काली

जय त्वं देवि चामुण्डे जय भूतापहारिणि ।
जय सर्वगते देवि कालरात्रि नमोऽस्तु ते ॥१॥

जयन्ती मङ्गला काली भद्रकाली कपालिनी ।
दुर्गा शिवा क्षमा धात्री स्वाहा स्वधा नमोऽस्तु ते ॥२॥

मधुकैटभविध्वंसि विधातृवरदे नमः ।
रूपं देहि जयं देहि यशो देहि द्विषो जहि ॥ ॥३॥

महिषासुरनिर्नाशि भक्तानां सुखदे नमः ।
रूपं देहि जयं देहि यशो देहि द्विषो जहि ॥ ॥४॥

धूम्रनेत्रवधे देवि धर्मकामार्थदायिनि ।
रूपं देहि जयं देहि यशो देहि द्विषो जहि ॥ ॥५॥

रक्तबीजवधे देवि चण्डमुण्डविनाशिनि ।
रूपं देहि जयं देहि यशो देहि द्विषो जहि ॥ ॥६॥

निशुम्भशुम्भनिर्नाशि त्रैलोक्यशुभदे नमः ।
रूपं देहि जयं देहि यशो देहि द्विषो जहि ॥ ॥७॥

वन्दिताङ्घ्रियुगे देवि सर्वसौभाग्यदायिनि ।
रूपं देहि जयं देहि यशो देहि द्विषो जहि ॥ ॥८॥

अचिन्त्यरूपचरिते सर्वशत्रविनाशिनि ।
रूपं देहि जयं देहि यशो देहि द्विषो जहि ॥ ॥९॥

नतेभ्यः सर्वदा भक्त्या चापर्णे दुरितापहे ।
रूपं देहि जयं देहि यशो देहि द्विषो जहि ॥ ॥१०॥

स्तुवद्भयो भक्तिपूर्वं त्वां चण्डिके व्याधिनाशिनि ।
रूपं देहि जयं देहि यशो देहि द्विषो जहि ॥ ॥११॥

चण्डिके सततं युद्धे जयन्ति पापनाशिनि ।
रूपं देहि जयं देहि यशो देहि द्विषो जहि ॥ ॥१२॥

देहि सौभाग्यमारोग्यं देहि देवि परं सुखम् ।
रूपं देहि जयं देहि यशो देहि द्विषो जहि ।। ।।१३।।

विधेहि देवि कल्याणं विधेहि विपुलां श्रियम् ।
रूपं देहि जयं देहि यशो देहि द्विषो जहि ।। ।।१४।।

विधेहि द्विषतां नाशं विधेहि बलमुच्चकैः ।
रूपं देहि जयं देहि यशो देहि द्विषो जहि ।। ।।१५।।

सुरासुरशिरोरत्ननिघृष्टचरणेऽम्बिके ।
रूपं देहि जयं देहि यशो देहि द्विषो जहि ।। ।।१६।।

विद्यावन्तं यशस्वन्तं लक्ष्मीवन्तञ्च मां कुरु ।
रूपं देहि जयं देहि यशो देहि द्विषो जहि ।। ।।१७।।

देवि प्रचण्डदोर्दण्डदैत्यदर्पनिषूदिनि ।
रूपं देहि जयं देहि यशो देहि द्विषो जहि ।। ।।१८।।

प्रचण्डदैत्यदर्पघ्ने चण्डिके प्रणताय मे ।
रूपं देहि जयं देहि यशो देहि द्विषो जहि ।। ।।१९।।

चतुर्भुजे चतुर्वक्त्रसंस्तुते परमेश्वरि ।
रूपं देहि जयं देहि यशो देहि द्विषो जहि ।। ।।२०।।

कृष्णेन संस्तुते देवि शश्वद्भक्त्या सदाम्बिके ।
रूपं देहि जयं देहि यशो देहि द्विषो जहि ।। ।।२१।।

हिमाचलसुतानाथसंस्तुते परमेश्वरि ।
रूपं देहि जयं देहि यशो देहि द्विषो जहि ।। ।।२२।।

इन्द्राणीपतिसद्भावपूजिते परमेश्वरि ।
रूपं देहि जयं देहि यशो देहि द्विषो जहि ।। ।।२३।।

देवि भक्तजनोद्दामदत्तानन्दोदयेऽम्बिके ।
रूपं देहि जयं देहि यशो देहि द्विषो जहि ।। ।।२४।।

भार्या मनोरमां देहि मनोवृत्तानुसारिणीम् ।
रूपं देहि जयं देहि यशो देहि द्विषो जहि ।। ।।२५।।

तारिणि दुर्गसंसारसागरस्याचलोद्भवे ।
रूपं देहि जयं देहि यशो देहि द्विषो जहि ।। ।।२६।।

इदं स्तोत्रं पठित्वा तु महास्तोत्रपठेन्नरः ।
रूपं देहि जयं देहि यशो देहि द्विषो जहि ।। ।।२७।।

# కమలాకుచ చూచుక....

## అర్థ విశేషాలు

- డా॥ తాడేపల్లి పతంజలి, పటాన్ చెరువు

శ్రీ వేంకటేశ్వర స్తోత్రంలో (శ్రీ వేంకటేశ్వర సుప్రభాతంలో కాదు) ఉన్న **"కమలాకుచ చూచుక ....** అనే శ్లోకం లోకంలో చాలా ప్రసిద్ధమయినది. చాలామంది ఇందులోని మొదటి రెండు పంక్తుల తాత్పర్యాన్ని చెప్పి, ఇటువంటి పచ్చి శృంగారమున్న శ్లోకం చదువుతున్న దైవభక్తులను వెక్కిరించారు. దైవభక్తులైన శ్లోకార్థం తెలిసిన వారు మనస్సులో దేవుడికి ఇలాంటి శృంగార వర్ణన ఏమిటని సంశయం పీకుతున్నా, చెంపలు వేసుకొని భక్తితో చదువుతున్నారు. ఈ నేపథ్యంలో ఈ శ్లోక అర్థ తాత్పర్య విశేషాల "ఆత్మీయ" ఆవిష్కరణము చేసే ప్రయత్నము ఈ చిఱు వ్యాసం.




**శ్లో॥ కమలాకుచచూచుకకుంకుమతో**
**నియతారుణితాతులనీలతనో! ॥**
**కమలాయతలోచన! లోకపతే!**
**విజయీభవ వేంకటశైలపతే! ॥**

**ప్రతిపదార్థము :** కమలా = లక్ష్మీదేవి యొక్క, కుచ = చన్నుల, చూచుక = మొనలపై ఉన్న, కుంకుమతః = కుంకుమతో, నియత = నియమము కలిగిన, నిత్యమైన, అరుణిత = ఎఱుపురంగు గలదిగా జేయఁబడిన, అతుల నీలతనో! = సాటిలేని నల్లని రంగు కలిగిన శరీరము కలవాడా!, కమలాయతలోచన! = కమలములోని మెత్తందనాన్ని, అందాన్ని గుర్తుకు తెస్తూ చెవులవరకు వ్యాపించిన విశాలమైన కన్నులు కలవాడా!, లోకపతే! = లోకానికి ప్రభువా!, వేంకటశైలపతే! = వేంకట పర్వతానికి ప్రభువా!, విజయీభవ = నీకు విజయము కలుగు గాక!

**తాత్పర్యము :** శ్రీమహాలక్ష్మి యొక్క చనుమొనలపై గల కుంకుమతో ఎల్లప్పుడూ ఎఱ్ఱగా ఉండే అందమైన నల్లని దేహం కలవాడా! తామర రేకుల వలె విశాలములైన కన్నులు కలవాడా! లోకాలకు ప్రభూ! వేంకటేశ్వరా! నీకు విజయమగుగాక!

**విశేషాలు :**

**1) వ్యుత్పత్తులు :** కమలా = కమలము చేతియందు కలిగినది కాబట్టి అమ్మకి లక్ష్మీదేవికి కమలా అని పేరు. కుచ = నాయకుని గోళ్ళచే గిచ్చబడునది (కుచ్యతే కామినా నఖైః కుచౌ). చూచుక = బాలుని చేత పానము చేయబడుచూ **చూచూ** అని పలుక బడునది కనుక చను మొనకు చూచుకము అని పేరు వచ్చింది. కుంకుమమ్ = ఎండినప్పుడు కుమ్మని పలుకునది కుంకుమము.

**2) తోటక వృత్తము :** ఈ శ్లోకము తోటక వృత్తములో ఉంది. తోటక వృత్తము వినడానికి చాలా

బాగుంటుంది. పాదానికి 12 అక్షరాలు, నాలుగు స-గణాలు. సంస్కృతంలో దీనికి యతి లేదు. తెలుగులో తొమ్మిదవ అక్షరము యతి. ఆదిశంకరుల శిష్యులలో తోటకుడు మొదట చదువు రానివాడు. తరువాత గురువుగారి దయతో

"విదితాఖిల శాస్త్ర సుధా జలధే – మహితోపనిషత్ కథితార్థ నిధే
హృదయేకలయే విమలం చరణం – భవ శంకర దేశిక మే శరణమ్"

(అన్ని శాస్త్రముల అమృత సముద్రమును తెలిసికొన్నవాడా! ఉపనిషత్తులు చెప్పి అర్థమునకు నిధి లాంటి వాడా! నీ నిర్మలములైన పాదాలను నా హృదయము చూస్తోంది, శంకరాచార్యులే నా జీవితానికి శరణం) అని తోటక వృత్తములో గానం చేస్తూ తన జీవితంలో మార్పును సాధించాడు. మార్పుకు కారణమైన తోటక వృత్తములో **"కమలాకుచ చూచుక కుంకుమతో"** శ్లోకం ఉంది. ఇది మొట్టమొదట మనం గమనించాలి. భక్తితో ఈ స్తోత్రము చదివినవారి జీవితములో కూడా మార్పు వస్తుంది.

**3) గుడ్డుపై ఉన్న పెంకు :** దేవుళ్లకు సంబంధించిన పూర్వకాలపు శృంగార సాహిత్యము కోడిగుడ్డుపై ఉన్న పెంకులాంటిది. గట్టిగానే తగులుతుంది. అబ్బా! ఇక్కడ కూడానా... దేవుడి భక్తి కూడా శృంగారమేనా... అనిపిస్తుంది. తల్లి పొదిగిన తర్వాత ఆ పెంకు పగిలి నూతనావిష్కరణము బయటికి వస్తుంది. అలాగే గురువు చెప్పిన తర్వాత అందులోని అంతరార్థం తెలుస్తుంది. ఈ స్తోత్రము దాటిన తర్వాత వచ్చే ప్రపత్తిలో 'మాతుస్తనా వివశిశోరమృతాయ మానౌ' అని ఒక పాదం వస్తుంది. "బిడ్డకు మొట్టమొదటిసారిగా తెలిసి అమ్మ చన్నుల వలె అమృత సమానములుగా ఉన్న నీ పాదములను నే శరణు పొందుతున్నాను" అని ఈ పాదానికి అర్థం. ఇక్కడ కూడా స్తనముల ప్రసక్తి వచ్చింది కదా! ఇది కూడా శృంగారమే అని భావించే వారికి నమో నమః. ఈ పంక్తిలో పాదాలను స్తనాలతో పోల్చాడు కవి. అమ్మ చన్ను – ఆస్వాదిస్తున్న బిడ్డకు అమృత జీవితాన్ని అనుగ్రహిస్తుంది. స్వామి పాదం – ఆ పాదాలను మానసంలో తలచి తలచి పరవశించే భక్తుని హృదయాన్ని ఆనందంతో నింపి అతని జీవితాన్ని అమృతమయం చేస్తుంది. ఈ అర్థ వాతావరణంలోనే "కమలాకుచ చూచుక" అంతరార్థం తెలుసుకోవాలి.

**4) ఇది కామాన్ని మోక్షం వైపు మళ్లించే వర్ణన :** సృష్టిలో అత్యంత ప్రాధాన్యం కలిగిన రంగు ఎఱుపు. సూర్యుడి వస్త్రాలు, రథం, ధ్వజం, పతాకం అన్నీ ఎఱుపురంగువే. ధైర్యానికి, చెడును పోగొట్టే శక్తికి, ప్రేరణాభావనకు, దృఢమైన నిర్ణయాత్మక వైఖరికి ఈ ఎఱుపు రంగు ప్రతీక. కాషాయము ఎఱుపు నుంచి ఏర్పడినదే. కాషాయ రంగు పవిత్ర జీవనానికి గుర్తు.... కాషాయం, భగవంతునితో బంధానికి త్యాగాలకు గుర్తు. ఇటువంటి కాషాయ జనని అయిన ఎఱుపు రంగు ఈ శ్లోకంలో నలుపు రంగుతో కలుస్తోంది. కాల తత్త్వానికి నల్లని కాళీమాత సూచన. అలాగే నల్లని వేంకటేశుడు కూడా. దృశ్య ప్రపంచాన్ని సృష్టించి, సృష్టికర్తగా నిలిచి, కల్పాంత సమయంలో, ఈ సర్వ ప్రపంచాన్ని తనలో లీనము చేసుకొనే దైవశక్తి వేంకటేశునిగా మన మాంస నేత్రాలకు నలుపురంగులో కనబడుతున్నాడు. మన స్తోత్రంలో ఇబ్బంది ఎక్కడ వస్తోందంటే వేంకటేశుని, అమ్మ లక్ష్మీదేవిని మనలా చూడటం వల్ల మానవీకరణం చేయటం వల్ల. అవయవ దృష్టిని దాటి అంతరాత్మ దృష్టికి ప్రయాణం చేయాలి. ఎఱుపు, నలుపుతో కలిసి ఎఱుపుగా మారిందంటే – ధైర్యాన్ని, చెడును పోగొట్టే శక్తిని, ప్రేరణాభావనను, దృఢమైన మోక్ష సాధన గల నిర్ణయాత్మక వైఖరిని పెంచుకోమనే సందేశం ఇందులో ఉంది.

**5) జగన్మాత వాత్సల్యము :** నీ స్తన్య పానం చేస్తున్న వినాయకుడు నీ వక్షోజాలను చూసి, తన ఏనుగు శిరస్సు అక్కడికి వచ్చిందేమోనని అనుమానంతో, తన ఏనుగు శిరస్సును, తన తొండంతో తడిమి చూసుకొంటున్నాడు. వినాయకుని సందేహానికి మీరిద్దరూ (పార్వతీ పరమేశ్వరులు) నవ్వుకుంటున్నారు. నీ స్తనాలను గణపతి, కుమారస్వామి, ఇద్దరు ఒకేసారి పానం చేస్తున్నారు. "పుత్రవాత్సల్యము జాలువారుతున్న ఆ స్తనద్వయం, మా దుఃఖాన్ని పోగొట్టుగాక." అని శంకర భగవత్పాదులు సౌందర్యలహరిలో అన్నారు. (సమందేవీ) ఇక్కడ వర్ణన జగన్మాత వాత్సల్యానికి ప్రతీక. మన చూపు ఇలా ఉంటే ప్రాచీన సాహిత్యంలో దైవ వర్ణనలలోని శృంగార వర్ణనలకు ఇబ్బంది పడం.

6) శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామివారు యాదగిరి లక్ష్మీనరసింహ స్వామికి సంబంధించిన, **కమలాకుచ చూచుక....** పంథాలో సాగిన శ్లోకాన్ని ఇలా వ్యాఖ్యానించారు. **"కమలాకుచ కస్తూరి కర్దమాంకిత వక్షసే యాదవాద్రి నివాసాయ సంపత్ పుత్రాది మంగళమ్"** అని మంగళం పాడుతుంటే ఆయనని ఏమని వర్ణిస్తున్నాం. అమ్మ తన వక్షస్థలానికి కుంకుమ పాత్రములను రచించుకున్నది, ఆయన ఆలింగితుడై దేహమంతా పూసుకున్నాడు, ఓహో అలాంటి స్వామీ నీకు మంగళం. ఏమిటండీ ఈ వర్ణన అనిపిస్తుంది. ఇదంతా తప్పు అని అనేవారు కొందరున్నారు. కానీ ఈ వర్ణనలు చెప్పేది జగత్ కారణమైన పరమాత్మను మరియు జగన్మాత అయిన అమ్మను. వారిరువురు శృంగారమే లేకపోతే నీకు జన్మ అనేది ఉందా! లోకంలో అమ్మ అందానికి నాన్న వశమైనప్పుడే కదా నీకు ఒక జన్మ అనేది లభించింది, కర్మ భారం తొలగించుకోవడానికి ఒక అవకాశం ఏర్పడింది. అలాంటి అందాన్ని స్మరించని బ్రతుకూ ఒక బ్రతుకేనా! అయితే ఆ అమ్మ అందం నీవు ఉపాసించ దగినది కానీ అనుభవించ దగినది కాదు. ఆ అందం నీకు జీవితాన్ని ఇచ్చేది ఉపజీవ్యం అంటారు. నాన్నకు అదే అందం భోగ్యం. నీకు ఉండాల్సిన జ్ఞానం ఇది. ఇప్పుడు ఈ జ్ఞానంతో ఆ సౌందర్యాన్ని దర్శించు అప్పుడు తప్పులేదు. ఉపనిషత్తులు ఈ విషయాన్ని మనకు తెలిపాయి."

దైవ శృంగార వర్ణనలలో బాహ్యదృష్టిలో పవిత్రత ఎలా అలవర్చుకోవాలో జీయర్ స్వామివారు చెప్పారు. నేను అంతర్దృష్టి మార్గం చెప్పాను. **"సర్వదేవనమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి"** లా ఏ స్థాయివారు ఆ దృష్టిని అలవర్చుకొని "కమలా...." శ్లోకంలో భక్తికి పెద్ద పీట వేద్దాం.

"చీకటి అంటే ఏమిటమ్మా"
"ఏమీ కనిపించక పోవటం చీకటి."
"అయితే, నాకు ఏమీ కనిపించట్లేదు చూడు" కిట్టమూర్తి కళ్ళు మూసుకొని చెప్పాడు. నవ్వుతున్న అమ్మ యశోదమ్మ బాలకృష్ణునికి ఆడుకోవటానికి అనుమతి ఇచ్చింది.

ఆ నల్లనయ్య చిఱు దరహాసాలు ఆయన శృంగార వర్ణనలలో మనకు ఎప్పుడూ జ్ఞానోదయం కలిగించు గాక! స్వస్తి. 

**హరేరామ హరేరామ రామ రామ హరే హరే ।**
**హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే ॥**



# ఏమిసేతురా లింగా ఏమిసేతురా...

- డా॥ తాడేపల్లి పతంజలి, పటాన్ చెరువు

ప్రపంచంలో ఎంగిలి కాని పదమేది? అని రామకృష్ణ పరమహంసను అడిగారు ఒకరు. "బ్రహ్మము" అని పరమహంస చమత్కారంగా జవాబిచ్చారు. ఎందుకంటే బ్రహ్మము గురించి నోటితో వివరించటం ఎంతటి వారికయినా అసాధ్యము. నోటితో వివరించబడిన ఏ పదమైనా ఎంగిలవుతుంది. బ్రహ్మ పదార్థ వివరణ అసాధ్యము కాబట్టి అది ఎంగిలి కాదని ఇక్కడ భావము.

అటువంటి ఎంగిలి కాని శివ బ్రహ్మమునకు, ఎంగిలి పెడుతున్నానని, క్షమించమని ఈ తత్త్వంలో భక్తుడు (తత్త్వ రచయిత ఎవరో తెలియదు) స్వామిని వేడుకొంటున్నాడు.

**ఏమిసేతురా లింగా ఏమిసేతురా**

**అర్థాలు :** ఏమి = 1. ఏది, 2. సందర్భముల ననుసరించి కౌతుకము, క్రోధము, అనాదరము, ఆశ్చర్యము మొదలైన అర్థాలను ఏమి పదం స్ఫురింపచేస్తుంది. సేతును = చేయుదును? లింగా = ఓ జంగమయ్య, శివా!

**తాత్పర్యము :** ఓ శివా! ఈ సందర్భంలో నేను ఏమి చేయాలో నాకు తెలియటం లేదు. (ఏ సందర్భాలో చరణాలలో వస్తాయి).

**విశేషాలు :** 1) లింగ్యతే జ్ఞాయతే అనేనేతి లింగం. దేని చేత ఎరుగబడుతుందో అది లింగము. 2) సకల చరాచర ప్రపంచం ప్రలయంలో ఎక్కడ గర్భితమై ఉండి, సృష్టికాలంలో ఎక్కడి నుంచి బయటకు వస్తుందో అది లింగం. (బసవేశ్వర గీతామృతం). 3) చేతును, సేతును. ఇది మాండలిక భాష. ఉదా : ఓలమ్మ నేనేం సేతును, కొంప మునిగిపోనాది.

**చరణం1: గంగ ఉదకము తెచ్చి నీకు - లింగపూజలు సేదమంటే**
**గంగనున్న చేప కప్ప - ఎంగిలంటున్నాది లింగా**
**మహానుభావా! మహదేవశంభో! - మా లింగ మూర్తి ॥ఏమిసేతురా॥**

**అర్థాలు :** గంగ = 1) గంగానది, 2) నీరు. (ఈ యర్థము తెలుగున మాత్రమే కలదు) పంచ గంగలు : కావేరి, తుంగభద్ర, కృష్ణవేణి, గౌతమి, భాగీరథి, ఆకాశగంగ మందాకిని, పాతాళగంగ భోగవతి. మహానుభావా! = గొప్ప ప్రభావము కలిగిన వాడు (అను భావము = ప్రభావము). మహదేవశంభో! = శ్రేష్ఠుడైన దేవుడు, శివుడు (మహాదేవ శబ్దానికి కూడా ఇదే అర్థము చెప్పుకోవచ్చు.). (శంభువు = శమ్మంటే సుఖం. అది శివుని వల్ల కలుగుతుంది కనుక ఆయన శంభువు...)

**తాత్పర్యము :** గంగతో నీకు లింగపూజలు చేద్దామని మొదలుపెట్టాను. నీటిని తాగి ఎంగిలి చేసిన చేప, కప్ప గంగ నీరు ఎంగిలని, శివునికి అభిషేక పూజ చేయటానికి పనికి రావని అంటున్నాయి. ఓ మహానుభావా! శివా! ఎంగిలినీటితో నీకు పూజ ఎలా చేయమంటావు!?

**విశేషాలు :** 1) మహారాష్ట్రలో **మహానుభావ పంథ** అని ఒక సంప్రదాయం ఉంది. పంథ పురుషులను "మహానుభావులు" అనీ, స్త్రీలను "మహానుభావి" అనే అంటారు.

2) నోటికి తగులుటచే అపవిత్రమైనది తినగా మిగిలినది, అనుభవించి విడిచినది ఎంగిలి. మనము తినే ఆహారమును భగవంతునికి పెట్టే విధానాన్ని నైవేద్యము అని అంటారు. స్వామి తిన్న తరువాత ఆయన ఎంగిలి మనకు ప్రసాదము అవుతుంది. అదే మనము ముందు తిని ఆయనకు పెడితే ఆ

పదార్థము ఎంగిలి అవుతుంది. అలా చేయకూడదు.

3) దేవుళ్లని ఎంగిలి తిన్నావని కవులు ఆక్షేపించటం మన ప్రాచీన సాహిత్యంలో ప్రసిద్ధము.

**"నీకున్ మాంసము వాంఛయేని కఱవా, నీ చేత లేదుండcగా,**
**జోకైనట్టి కుఠారముండ, ననలజ్యోతుండ, నీరుండcగా,**
**బాకంబొప్ప ఘటించి, చేతి పునుకన్ భక్షింప కా బోయచేం**
**జేకొం టెంగిలి మాంస మిట్లు దగునా శ్రీ కాళహస్తీశ్వరా!"**

అని ధూర్జటి శివుడు ఎంగిలి మాంసము తిన్నట్లుగా వర్ణించాడు.

4) **"భిల్లాంగనాదంతపీడిత ఫలభుక్తిహేయంబు దోcచలే దింత నీకు శ్రీకాకుళ ఆంధ్ర దేవా!"** శబరి ప్రేమతో ఎంగిలి చేసిచ్చిన పండ్లను మిక్కిలి ఇష్టంతో నీవు తిన్నావని ఆంధ్రనాయ శతక కర్త ఆక్షేపించాడు.

5) అయితే కన్నప్ప శివుడికి మాంసాన్ని అర్పించాడనీ, శబరి రాముడికి ఎంగిలి పండ్లను మనం అలా చేయకూడదు. మన స్థాయి తెలుసుకోవాలి. 1. సమర్థ ప్రేమ (భక్తుడు కేవలం భగవంతుడి ప్రీతిని మాత్రమే కోరుకొనే స్థితి) 2. సమంజస ప్రేమ (భగవంతునికి ఇష్టమైనది చేస్తూ, భక్తుడు తన సుఖాన్ని కూడా కోరుకొనే స్థితి) 3. సాధారణ ప్రేమ (భక్తుడు కేవలం తన సుఖాన్ని మాత్రమే కోరుకొనే స్థితి) అని దేవుని పట్ల మూడు రకాల ప్రేమలు ఉంటాయని రామకృష్ణులు అన్నారు. ఎంగిలి పెట్టిన కన్నప్ప, శివుని బాధను చూసి తన కన్ను పెకిలించి ఇచ్చాడు. మనం అలా చేయలేము. కనుక 'సమర్థప్రేమ' లేని మనలాంటి సామాన్య భక్తుడు శివునికి ఎలా ఎంగిలి పూజ చేయాలని ఈ తత్త్వంలో భక్తుడు బాధ పడుతున్నాడు.

**చరణం2: అక్షయావుల పాడి తెచ్చి – అరిపితము చేదమంటే... ఓహో!**
**అక్షయావుల లేగదూడ – ఎంగిలంటున్నాది లింగా**
**మహానుభావా! మహదేవశంభో! – మా లింగ మూర్తి ॥ఏమి సేతురా॥**

**అర్థాలు :** అక్షయము = తరుగులేని, అరిపితము = ఈయబడినది, లేగదూడ = పాలుత్రాగు దూడ.

**తాత్పర్యము :** ఓ శివా! నశింపని ఆవుపాలు తెచ్చి నీకు పూజగా ఇద్దామంటే – ఈ నశింపని ఆవుల యొక్క పాలు త్రాగు దూడలు – నేను తెచ్చే పాలను తాము తాగిన ఎంగిలంటున్నాయి. ఓ మహానుభావా! శివా! ఎంగిలి పాలతో నీకు పూజ ఎలా చేయమంటావు!?

**విశేషాలు :** 1) ఆవు మన సంస్కృతిలో చాలా పవిత్రమైనది.

2) అక్షయావులు అనే సమాసము వ్యాకరణ పరంగా దోషం కావచ్చు కాని, అర్థపరంగా గొప్పది.

3) అక్షయావులంటే నాశనము లేని ఆవులు అని అర్థం వస్తుంది. మనం గోమాతను ఎంత పూజించినా వాటి జీవితానికి కూడా ఒక ముగింపు ఉంటుంది కదా!, అలాంటప్పుడు నాశనము లేని ఆవులు ఏమిటి? దీనికి జవాబు అక్షయ తృతీయ గురించి తెలుసుకొన్న తర్వాత వస్తుంది.

4) వైశాఖ శుద్ధ తృతీయ నాడు కృతయుగం, కార్తిక శుక్ల నవమి నాడు త్రేతాయుగం భాద్రపద బహుళ త్రయోదశినాడు ద్వాపర యుగం, మాఘ బహుళ అమావాస్యనాడు కలియుగం ప్రారంభమైనదని గ్రంథాలలో ఉంది. ఇందులో 'వైశాఖ శుద్ధ తృతీయను అక్షయ తృతీయ పండుగగా జరుపుకొంటాం. జీవితంలో అన్నింటినీ అక్షయం చేసే రోజు కనుక 'అక్షయ తృతీయ'.

5) బతికినంతకాలం మానవుల జీవితాలను సంతోషంతో నింపి దుఃఖ నాశనం చేసేవి కనుక ఆ ఆవులు "అక్షయావులు"

6) తల్లిపాల వలె సులభంగా జీర్ణం అయ్యే శక్తి ఆవు పాలల్లో ఉంది. ఆవుపాలు సంపూర్ణాహారము అంటారు. క్రొవ్వు ఉండదు. ఆ అక్షయావుల పాలతో స్వామిని సేవిద్దా మనుకొన్నాడు భక్తుడు. ఆ ఆవుల లేగదూడలు మేము ఆ అమ్మ దగ్గర పాలు తాగాము. ఆ తరువాత మా అమ్మ పొదుగులనుండి పాలను నువ్వు పిండావు. ఆ పాలు మా నోటితో ఎంగిలి చేసినవే కదా! వాటిని శివునికి నైవేద్యముగా ఎలా ఇస్తావని లేగదూడలు తనను ప్రశ్నిస్తున్నాయని భక్తుడు అంటున్నాడు.

**చరణం3: తుమ్మిపూవులు తెచ్చి – నీకు తుష్టగా పూజ్జేద్దమంటే – ఓహో!**
**కొమ్మకొమ్మకు కోటి తుమ్మెద – ఎంగిలంటున్నాది లింగా**
**మహానుభావా! మహదేవశంభో! – మా లింగమూర్తి ॥ఏమి సేతురా॥**

**తాత్పర్యము :** ఓ శివా! నీకు ఇష్టమయిన తుమ్మి పువ్వులు తెచ్చి నీకు పూజను చేద్దామనుకొన్నాను. కాని, తుమ్మి పువ్వుల మీద వాలి వాటిని ఎంగిలి చేసిన తుమ్మెదలు– ఆ పూలు ఎంగిలివి కదా! శివుడికి నైవేద్యము ఎలా పెడతావని వెక్కిరిస్తున్నాయి.

**విశేషాలు :**1) **"పుష్పమూలే వసేద్బ్రహ్మా మధ్యే చ కేశవః**
**పుష్పాగ్రే చ మహాదేవః సర్వదేవాః స్థితా దలే"**

పుష్పం మొదట్లో బ్రహ్మా, పుష్పమధ్యమంలో కేశవుడు, పుష్పపు కొనలో మహాదేవుడు ఉంటారు. పుష్ప దళాలలో అందరు దేవతలుంటారని ప్రసిద్ధి. అందుకే పూలతో సేవ విశిష్టమయినది.

2) **చైత్రమాసంలో** శివుని దర్భ పూలతో పూజిస్తే బంగారం పెరుగుతుంది. **వైశాఖమాసంలో** తెల్లని మందారాలతో పూజిస్తే అశ్వమేధఫలం దక్కుతుంది. **జ్యేష్ఠ మాసంలో** పెరుగుతో అభిషేకిస్తూ తామరపువ్వులతో పూజిస్తే పరమగతి కలుగుతుంది. **ఆషాఢమాసంలో** తొడిమలతో కూడిన పుష్పాలతో పూజిస్తే పరమపదం వస్తుంది. **శ్రావణమాసంలో** గన్నేరుపూలతో పూజిస్తే వేయి ఆవులు దానం చేసిన ఫలితం వస్తుంది. **భాద్రపద మాసంలో** ఉత్తరేణి పూలతో పూజిస్తే పుణ్యపదము లభిస్తుంది. **ఆశ్వయుజమాసంలో** జిల్లేడుపూలతో పూజిస్తే దివ్యపదాన్ని చేరుకొంటారు. **కార్తికమాసంలో** జాజిపూలతో పూజిస్తే శివపదాన్ని దర్శిస్తారు. **మార్గశిర మాసంలో** పొగడపూలతో పూజిస్తే, మూడు లోకాలను దాటి తామున్న చోటికే తిరిగి వస్తారు. **పుష్యమాసంలో** ఉమ్మెత్త పూలతో పూజిస్తే పరమపదాన్ని పొందుతారు. **మాఘమాసంలో** బిల్వదళాలతో పూజిస్తే పరమపదము పొందుతారు. **ఫాల్గునమాసంలో** తుమ్మిపూలతో పూజిస్తే ఇంద్ర సింహాసనంలో సగభాగం దక్కుతుంది. ఈ తత్త్వంలో తుమ్మి పూలను రచయిత పేర్కొన్నాడు.

3) 'ఏమి సేతురా లింగా' అనే ఈ తత్త్వ భావాన్ని వేటూరి సుందరరామ్మూర్తి గారు 'జననీ జన్మభూమి' చలనచిత్రంలో ఒక ప్రేయసీ ప్రియులు పాడిన పాటగా మలిచారు. "తుమ్మి పువ్వులకి తూనీగల ఎంగిలి", "గంగ నీళ్ళకి చేప కప్పల ఎంగిలి" చెప్పి చివర్లో "నన్నే నీకొగ్గేసి కన్నూ మూదామంటే కన్నోళ్ళ మురిపాల ముద్దలెంగిలి సేసే" అంటూ ముక్తాయించారు. ముఖే ముఖే సరస్వతీ!

ఈ తత్త్వం ద్వారా రచయిత ఏమి చెబుతున్నాడు?

ఈ తత్త్వంలో రచయిత నీరు, పాలు, పూలతో పూజ చేద్దామంటే అవి ఎంగిలయ్యాయని ఒక అమాయకమైన, నివేదనా భావంతో పాటు, శుద్ధమైన మనస్సు ముఖ్యమని భక్తులకు సందేశమిస్తున్నాడు. గంగనీరు, ఆవుపాలు, తుమ్మి పూలు వంటివి లేకున్నా నిర్మలమైన మనస్సు అర్పిస్తే ఆ శివుడు సంతోషపడతాడని సందేశము. ఈ సందేశాన్ని పాటించి నిర్మల మనస్కులమవుదాం. ✦

# దశరథావనీశ విమలతర తపఃఫలావతార

## పింగళి సూరన కళాపూర్ణోదయంలోని తురగవల్గన రగడ - అర్థ తాత్పర్య విశేషాలు

- డా॥ తాడేపల్లి పతంజలి, పటాన్ చెరువు

**తురం త్వరితం గచ్ఛతీతి తురగః**

వేగముగా పోవునది కాబట్టి గుఱ్ఱాన్ని తురగము అన్నారు. గుఱ్ఱపు నడకలో భేదము వల్గనము. వేగముగా విడువబడి మీదికి కాళ్ళు కదలించుట వల్గనము. ఈ తురగ వల్గనాన్ని చందస్సులో ఒక భేదమైన రగడకి కలిపి తురగవల్గన రగడ అని పేరు పెట్టారు. ఈ గుఱ్ఱపు వేగము, కాళ్ల కదలిక చప్పుడు వినగలిగేవారికి తురగవల్గనరగడలో వినబడుతుంది.

**తురగవల్గనరగడ లక్షణాలు :** ఈ తురగ వల్గన రగడలో ప్రతి పాదంలో 16 నుండి 24 అక్షరములు ఉంటాయి. ప్రతి పాదములో ఎనిమిది 3 మాత్రల గణములుంటాయి. ప్రాస నియమం ఉంది. అంత్యప్రాస నియమం ఉంది. ప్రాస యతి నియమం కూడా ఉంది. ప్రతి పాదములో 5వ గణము యొక్క మొదటి అక్షరము యతి స్థానము.

తెలుగుజాతి అదృష్టం కొద్దీ పింగళి సూరన అనే మహాకవి తన కళాపూర్ణోదయములో రామకథని వర్ణిస్తూ ఈ తురగవల్గన రగడ వ్రాసాడు. (రెండవ ఆశ్వాసములో 159వ పద్యము). మొత్తం ఇరువది ఎనిమిది పంక్తులు.

**సందర్భము :** మణికంథరుడు అనే వాడితో నారదుడు తీర్థయాత్రలు చేయమని చెబుతాడు. ఆ మణికంథరుడు రకరకాల తీర్థప్రదేశాలు తిరుగుతూ రామేశ్వరం దగ్గరగా ఉన్న దర్భశయనం వెళ్ళాడు. రావణునిపై యుద్ధానికి వెళ్ళే ముందు దర్భల మీద మూడు రోజులు రాముడు పడుకొని సముద్రుణ్ణి ప్రార్థించిన స్థలం పేరు **"దర్భశయనం"**. ఇక్కడ మణికంథరుడు రాముణ్ణి తురగవల్గనరగడలో ఇలా ప్రార్థిస్తాడు.

**1. దశరథావనీశవిమలతరతపఃఫలావతార!**
**2. నిశితశరలఘుప్రయోగ! నిహతతాటకావిహార!**
**3. కపటపటుసుబాహుదళన! ఘటితగాధిసూనుయాగ!**
**4. అపరిమేయగౌతమాంగనాఘదమనపదపరాగ!**
**5. కోమలేక్షుదళనసదృశఘోరశంభుచాపభంగ!**
**6. భూమిజావివాహవిభవపూర్ణసమ్మదాంతరంగ!**
**7. పరశురామగర్వపవన పాప! పీనబాహునాగ!**
**8. గురువచోఽనుపాల! నాతికుతుకవిధుతరాజ్యభోగ!**
**9. పాదభజనవితరణాతిఫలితగుహసమస్తపుణ్య!**
**10. పాదుకాప్రదానవిహితభరతసౌహృదానుగుణ్య!**
**11. ఘనవిరాధమదవినాశ! కలితబహువిపన్నిరాస!**
**12. వినుతపదనివేశపూత! వివిధమౌనికులనివాస!**

**13. తతనిశాచరీవిరూపతాకృత! ప్రియావినోద!**
**14. అతులబలఖరాదిదనుజహననజనితవిబుధమోద!**
**15. హరిణరూపధారిదారుణాసురాసుహరణబాణ!**
**16. పరమఘోరబాహుబలకబంధమర్దనప్రవీణ!**
**17. అమలశబరికాఫలోపహారరుచిఘనాభిముఖ్య!**
**18. సమదవాలిదర్పదమన! సఫలితార్కతనయసఖ్య!**
**19. శరణవరణపరపరానుజప్రదీపితప్రసాద!**
**20. అరుణితాక్షికోణవిరచితాంబురాశిగర్వసాద!**
**21. పర్వతౌఘరచితసేతుబంధసుతరసింధుకాండ!**
**22. గర్వపంక్తికంఠకంఠఖండనప్రచండకాండ!**
**23. సకలదివిజనుతచరిత్ర! సాధుభవలతాలవిత్ర!**
**24. సకరుణాతరంగనేత్ర! జానకీమనోజ్ఞగాత్ర!**
**25. యతిజపార్హ్వపుణ్యనామ! యతివితీర్ణభక్తకామ!**
**26. సతతసితయశోఽభిరామ! సర్వలోకపూర్ణధామ!**
**27. అహిత విదళ నాతి రౌద్ర! యార్త పాలనా వినిద్ర!**
**28. మహితనిఖిలగుణసముద్ర! మమ్ము బ్రోవు రామభద్ర!**

ఈ ఇరవై ఎనిమిది పంక్తులలో రామాయణాన్ని సంగ్రహంగా పింగళి సూరన చెప్పాడు. దీని అర్థ తాత్పర్య విశేషాలు కొన్ని పంక్తులలో గమనిద్దాం.

## అర్థ తాత్పర్య విశేషాలు

**దశరథావనీశవిమలతరతపఃఫలావతార!**

సూర్య వంశానికి చెందిన అజుని కొడుకు దశరథ మహారాజు. ఆ మహారాజుయొక్క (= అవనీశ) స్వచ్ఛమైన తపస్సుకు ఫలముగా అవతారమెత్తినవాడా! ఓ రామా!

**విశేషాలు :** దశరథ అంటే పది రథాలు కలవాడు. ఈ పది రథాలూ మన పంచ జ్ఞానేంద్రియాలను, పంచ కర్మేంద్రియాలను సూచిస్తాయి. దశరథుడు సంతానం కోసం తపించిపోయాడు. పుత్రకామేష్టి చేసాడు. అవని అంటే ప్రజలను రక్షించేది. లేదా రాజులచేత రక్షింపబడేది. ఒకరోజు లోపల, లేదా బాగా తక్కువ రోజులపాటు నడిచే అగ్ని ఉపాసనను **"హోమము"** లేదా **"హననము"** అంటారు. ఎక్కడెక్కడ **"జుహుయాత్"** అన్న పదం వేదములో విధించబడిన కర్మల వివరణలో వస్తుంటుందో అవన్నీ హోమాలు. వాటన్నిటిలో మంత్రం చివర **'స్వాహా'** పదము ఉంటుంది. ఇక్కడ ఒకే అగ్ని ఉంటుంది. అలా కాకుండా మూడు అగ్నులతో, రెండు లేక మూడు వేదములతో చేసి అగ్ని ఉపాసనలను **"యజ్ఞము"** లేక **"యాగము"** అంటారు. ఈ యజ్ఞములలోని మంత్రాల చివర **"వషట్"** అను పదము వస్తుంటుంది. దశరథుడు చేసిన యాగాన్ని సూరన్న "తపస్సు" అన్నాడు.

పన్నెండు రకాల తపస్సులలో (1. ఉపవాసము, 2. అరకడుపుగ భుజించుట, 3. వృత్తి పరిసంఖ్యానము (భిక్షకై గృహముల నేర్పఱచుకొనుట), 4. రస పరిత్యాగము (షడ్రసములను లేక 1, 2 రసములను వదలుట), 5. వివిక్త శయ్యాసనము (ఏకాంత స్థానమున పడుకొనుట, ఉండుట), 6.

కాయక్లేశము, 7. ప్రాయశ్చిత్తము, 8. వినయము (రత్నత్రయము, దానిని ధరించువారిపై వినయమును చూపుట), 9. వైయావృత్తము (గురుముని పాదసేవ), 10. స్వాధ్యాయము, 11. వ్యుత్సర్గము (శరీరముపై కల మమతను తక్కువ చేసికొనుట), 12. ధ్యానము చేయుట. వీటిలో కొన్ని యాగ సమయాల్లో పాటిస్తారు.

"తప సంతాపే" అను ధాత్వర్థమును అనుసరించి పుత్రులకోసం తపించి పోయేవాడు అనే అర్థంలో కూడా "తప" పదము సార్థకము. ఆ తపస్సుకు ఫలితముగా రాముడు పుట్టాడు.

**నిశిత శర లఘు ప్రయోగ! నిహత తాటకా విహార!**

చాలా వాడియైన, సానబెట్టబడిన బాణాల ప్రయోగము తక్కువ కలవాడా! చంపబడిన తాటకా విహారము కలవాడా! ఓ రామా!

**కపట పటు సుబాహు దళన! ఘటిత గాధిసూను యాగ!**

మాయావి అయిన నేర్పరి అయిన సుబాహువును ఖండించినవాడా! (చంపినవాడా) గాధి కుమారుడయిన విశ్వామిత్రుని యాగము సంపూర్తి కావటానికి సహకరించినవాడా!

**విశేషాలు :**

సుబాహువు – వీడు తాటకయొక్క కొడుకు. మారీచుని తమ్ముడు. వీడు రామునిచే విశ్వామిత్రుని యాగకాలములో చంపబడ్డాడు.

గాధి – కుశాంబుని కొడుకు. విశ్వామిత్రునికి తండ్రి

**అపరిమేయ గౌతమాంగనాఘ దమన పద పరాగ!**

కొలుచుటకు శక్యముకాని ఇంతయని యేర్పఱచుటకు శక్యముకాని గౌతముని భార్య అహల్య పాపాన్ని పాదములందలి దుమ్ముతో నశింపచేసినవాడా!

**విశేషము :**

వాల్మీకి రామాయణంలో అహల్య కథ – ఒకరోజు గౌతముడు ఆశ్రమంలో లేని సమయంలో ఇంద్రుడు, గౌతముని వేషంలో ఆశ్రమానికి వచ్చాడు. "ఓ సుందరీ! నీతో సంగమించాలనుకుంటున్నాను, కామాతురులు ఋతుకాలం దాకా ఆగరు" అన్నాడు ఇంద్రుడు. గౌతముని వేషంలో వచ్చినవాడు ఇంద్రుడని అహల్య తన తపశ్శక్తితో గుర్తించింది. "ఏమీ! దేవతల రాజయిన ఇంద్రుడే ఇలా పలుకుతున్నాడు" అని ఆశ్చర్యపోయింది. అనేక విధాలుగా ఆలోచించి, చివరగా "దేవేంద్రా! నా దాంపత్య జీవనంలో నేను సంతుష్టురాలిని. నీవు వెళ్ళిపో. అలా చేస్తే అది నీకూ నాకూ గౌరవం" అని చెప్పింది. అది విన్న దేవేంద్రుడు నవ్వుతూ, "నీ రీతికి నేను చాలా సంతోషించాను, వచ్చినట్లే వెళుతున్నాను" అని బయటికి వెళ్ళాడు. ఈ లోగా గౌతముడు వచ్చాడు. తన రూపంలో ఉన్న దేవేంద్రుని చూసి "దుర్మార్గుడా! నా రూపం ధరించి వచ్చి, అనుచితంగా ప్రవర్తించావు కనుక వృషణాలు లేకుండా పోతావ"ని శపించాడు.

ఆ తరువాత అహల్యను "వేలకొద్ది సంవత్సరాలు అన్నపానాలు లేక, వాయుభక్షణతో, దుమ్ములోపడి ఉండి, ఎవరికి కనపడకుందువుగాక" అని శపించాడు."శ్రీరాముడు ఈ ఆశ్రమాన్ని దర్శించినపుడు ఆయనకు అతిథి మర్యాదలు చేసి, నీవు పునీతవై నన్ను చేరతావని చెప్పి తపస్సుకై ఆయన హిమాలయాలకు వెళ్ళిపోయాడు. (బాలకాండ 48వ సర్గ – 18 నుండి 33 శ్లోకాలు)

(గీతా ప్రెస్ వారు ప్రచురించిన వాల్మీకి మూల రామాయణంలో అహల్య ఇంద్రునితో సంగమించినట్లు చెప్పే శ్లోకాలు లేవు.)

వృషణాలు నేల రాలినప్పుడు ఇంద్రుడు దేవతల వద్దకుపోయి ఇలా అంటారు. కుర్వతా తపసో విఘ్నం గౌతమస్య మహాత్మనః క్రోధముత్పాద్య హి మయా సురకార్యమ్ ఇదం కృతమ్ (49–02) గౌతమునికి కోపం తెప్పించి ఆయన తపశ్శక్తిని వృధా చేసి దేవతల కార్యం నెరవేర్చాను అంటాడు.

మిగిలిన రామాయణాల్లో, పురాణాల్లో అహల్య కథ

దుష్టే త్వం తిష్ఠ దుర్వృతే శిలయాఽఽశ్రమే మమ
నిరాహారా దివారాత్రం తపః పరమమాస్థితా ॥ అ.రా. బాల. 5

అని అధ్యాత్మరామాయణం లో అహల్య రాయిగా మారినట్లు చెప్పబడింది. ఇలాగే ఆనంద రామాయణములో అహల్యకు శిలా రూపమైన శాపమే కన్పిస్తుంది. తులసీదాసు కూడ అహల్యను శిలారూపంగానే దర్శించారు. **బ్రహ్మపురాణంలో** – గౌతముడు ఎండిపోయిన నదివి కమ్మంటాడు.

శ్లో॥ తామప్యాహమునిః కోపాత్ త్వం చ శుష్కనదీ భవ ।
నదీభూత్వా పునారూపం ప్రాప్య్ససే ప్రియ కృన్మమ ॥

అస్థి చర్మ సమావిష్టా నిర్మాంసా నఖవర్జితా.... చిరం స్థాస్యసి ప.పురా.సృ.158–43

పద్మపురాణంలో – ఎముకలు చర్మముతోను మిగిలి మాంసము గోళ్లు లేనిదానివై నలుగురు చూచుచుండగా చిరకాల ముండవలసినదిగా గౌతముడు శాపం ఇచ్చినట్లు కనిపిస్తుంది. ఇలా చాలా శ్లోక ఉదాహరణలు వస్తున్నాయి. ఒక్క విశ్వనాథ వారి అందమైన కల్పవృక్ష పద్యంతో ఈ పరిశీలన ఆపుతాను.

"ప్రభు మేని పైగాలి పై వచ్చినంతనే పాషాణమొకటికి స్పర్శ వచ్చె
ప్రభుకాలి సవ్వడి ప్రాంతమైనంతనే శిలకొక్కదానికి చెవులు గలిగె
ప్రభు మేని నెత్తావి పరిమళించినతోన యశ్మంబు ఘ్రూణింద్రియంబుఁ జెందె
ప్రభు నీలరత్న తోరణమంజులాంగంబు గనవిచ్చి ఱాతికిఁ గనులు గలిగె"

– రాముని శరీరం నుంచి వీచిన గాలి సోకినంతనే పాషాణానికి స్పర్శ అంటూ అహల్య శిల అయిందన్న విషయాన్ని విశ్వనాథ సమర్థించారు. ఇక్కడ పింగళి సూరన, రాముని పాదధూళితో అహల్యకు శాప మోచనమయిందన్నారు. శిలా ప్రసక్తి తీసుకురాలేదు.

**కోమలేక్షు దళన సదృశఘోర శంభు చాప భంగ!**

కోమలమైన చెఱకు గడను ఖండించినట్లుగా, భయంకరమయిన శివ ధనుస్సును విరిచినవాడా! సీత స్వయంవరంలో అందరు అనుకున్నట్టు రాముడు శివధనుస్సు విరచలేదు. అది విరిగింది. నారి సంధించి, ఆకర్ణాంతము లాగాడు. అప్పుడు ఆ ధనుస్సు తనంతట తానే విరిగింది. అది ఎంత భయంకరమయినదంటే అయిదు వేల మంది ఎనిమిది చక్రాల బండి మీద అతికష్టంగా లాగుకొని వచ్చింది. దానిని రాముడు చాల తేలికగా విరిచాడు.

**భూమిజా వివాహ విభవ పూర్ణ సమ్మ దాంతరంగ!**

సీతను వివాహము చేసుకొన్న తర్వాత వైభవముతో నిండిన సంపూర్ణమైన ఆనందము

అంతరంగములో కలిగినవాడా! అప్పటిదాకా రాముడు. సీతను (శ్రీని) వివాహము చేసుకొన్న తర్వాత శ్రీ ని పొంది శ్రీరాముడు అయ్యాడు. ఇదే విషయాన్ని చెబుతూ సూరన విభవము అన్నాడు.

**పరశురామ గర్వ పవన పాప! పీన బాహు నాగ!**

రామా! పరశురాముని గర్వమనే గాలిని పీల్చిన పామువంటివాడా! బలిసిన (బలిష్ఠమయిన) ఏనుగు తొండములవంటి చేతులు కలవాడా!

**విశేషము :**

"నీకు శక్తి ఉంటే ఈ వైష్ణవ ధనుస్సులో బాణాన్ని సంధించు. అప్పుడు నాతో ద్వంద్వ యుద్ధము చేయటానికి నిన్ను అనుమతిస్తాను" ఇవి పరశురాముని గర్వపు మాటలు (బాలకాండము 75వ సర్గ – 29వ శ్లో.)

ఈ గర్వపు మాటలను "గాలి మాటలు" అని సూరన చెప్పదలుచుకొన్నాడు. అందుకే "గర్వ పవన (గర్వమనే గాలి) అన్నాడు. ఈ గర్వమనే గాలిని రాముడనే పాము మింగేసింది.

పాపరాయడు, పాపఱేడు అని ఆదిశేషునికి పర్యాయ పదాలు. ఇక్కడ "పాప" అని మాత్రమే సూరన ప్రయోగించాడు. లక్ష్యార్థంలో "పాప" శబ్దానికి ఆదిశేషుడని అర్థం చెప్పుకోవాలి. మన ఆధునికులలో కొందరు ఇప్పటికీ ఒకరి గర్వాన్ని ఇంకొకడు తీసేస్తే "గాలి తీసాడు" అంటాడు. ఈ నుడికారాన్ని సూరన నాటి కావ్యభాషలో ప్రయోగించాడు.

**గురువచోఽనుపాల! నాతి కుతుక విధుత రాజ్యభోగ!**

గురువుల మాటను పాటించినవాడా! ఎక్కువ ఆసక్తి లేకుండా, తండ్రి మాటను పాటించి రాజ్య భోగములను విడిచినవాడా!

**పాద భజన వితరణాతిఫలిత గుహ సమస్త పుణ్య!**

తన పాదములను కొలిచిన భాగ్యఫలితంగా గుహునికి కౌగిలిని అనుగ్రహించి సమస్త పుణ్యములు కలుగచేసిన రామా!

రాముని చూసిన గుహుడు తాను రాముని సేవకుడినని చెబుతాడు. (02.59.38) తన పాద సేవా భాగ్య ఫలితముగా గుహుని రామునకు ప్రియ స్నేహితునిగా ఆదికవి చెప్పాడు. "తత్ర రాజా గుహో నామ రామస్యాత్మసమస్సఖా" రాముని చూసి బాధపడ్డ గుహుడు, శ్రీరామునకు కాపలా కాస్తూ, తెల్లవారేవరకు లక్ష్మణునకు తోడుగా ఉండిపోయాడు. శ్రీరామ పాదులకు (శ్రేష్ఠులకు) గుహుడు చేసిన మొదటి సేవ ఇది.

జటాధారణ కొరకు మఱ్ఱిపాలను తెప్పించి గుహుడే స్వయంగా రాముని కందించాడు. ఇది గుహుని రెండవ సేవ. గుహుడు సుమంత్రునితో కలసి ఇవతలే ఉండి రాముడెక్కిన పడవను నడపవలసిందిగా బంధువులను చెప్పాడు. ఆత్మసఖుడైన గుహుడు రాముని ఆవలి ఒడ్డుకు చేర్చలేదు. సహకరించాడు. పని చేయకపోయినా చేయించటం కూడా సేవ. అందుకే గుహుడు రామునకు చేసిన మూడవ సేవగా దీనిని భావించాలి. గుహుడు "పడవ నడపడం, కాళ్లు కడగటం" అనేవి వాల్మీకంలో లేవు. రాముడు గుహుడిని గాఢంగా కౌగిలించుకున్నాడు. ఇంతకంటె అదృష్టం, పుణ్యం ఇంకేమి ఉంటాయి! అందుకే సూరన్న సమస్త పుణ్యాలు పొందినవానిగా గుహుని వర్ణించాడు.

**పాదుకా ప్రదాన విహిత భరత సౌహృదానుగుణ్య!**

పాదుకలను ఇచ్చుటలో విధింపబడిన భరతుని యొక్క స్నేహానికి అర్హమైనవాడా! భరతుని మాట కాదనలేక పాదుకలపై తన పాదముద్రలుంచాడు రాముడు. నిజానికి ఉత్త కాళ్ళతో రాముడు అడవికి వచ్చాడు. ఈ బంగారు పాదుకలు అయోధ్య నుండి తెచ్చినట్లుగా పెద్దలు చెబుతారు. ఆ బంగారు పాదుకలపై రాముడు భరతుని కోరికపై తన పాదాలు ఉంచాడు. ఇక్కడ భరతుని స్నేహాన్ని రాముడు మన్నించాడని చెబుతూ భరత "సౌహృదానుగుణ్య" అని సూరన్న అన్నాడు.

**ఘన విరాధ మద వినాశ! కలిత బహు విపన్నిరాస!**

గొప్పవాడయిన విరాధుడనువాని మదమును బాగా నాశనము చేసినవాడా! తెలియఁబడిన అనేక ఋషుల ఆపదలను ఖండించినవాడా! విరాధుడు అంటే ప్రేమ లేనివాడు. క్రూరుడు. ఋషులు "మమ్మల్ని అనేక మంది రాక్షసులు బాధపెడుతున్నారు. నువ్వు మమ్మల్ని ఆ రాక్షసులనుంచి రక్షించాలి" అని రాముని కోరారు. రాముడు వాళ్ళ ప్రార్థనలని అంగీకరించాడు.

ఆ తరువాత లోపలికి వెళ్ళిపోయిన కళ్ళతో, భయంకరమైన పొట్టతో, పర్వతమంత రూపంతో, పెద్ద చేతులతో, అప్పుడే చంపిన పెద్దపులి తోలుని తన ఒంటికి చుట్టుకొన్న విరాధుడు రామ లక్ష్మణులకు కనిపించాడు. వాడు భుజానికి ధరించిన ఆ శూలానికి 4 సింహాలు, 4 పెద్ద పులులు, 2 తోడేళ్ళు, 10 జింకలతో పాటు ఒక ఏనుగు తల గుచ్చి ఉన్నాయట. అందుకే సూరన్న "ఘన విరాధు"డన్నాడు. యుద్ధంలో చివరికి రాముడు విరాధుడిని ఒక గోతిలో వేసి, మట్టితో పూడ్చేసి చంపుతాడు. వాడు చనిపోవటం వల్ల ఋషుల ఆపదలు పోయాయి కనుక "బహు విప న్నిరాస" అని రామునికి మరొక విశేషణము సూరన్న జోడించాడు.

**వినుత పద నివేశ పూత! వివిధ మౌని కుల నివాస!**

స్తుతింపబడిన వేదపదచ్ఛేదము ఇల్లుగా కలవాడా! అనేకమంది ముని సమూహముల హృదయములు నివాసములుగా కలవాడా!

**తత నిశాచరీ విరూపతా కృత! ప్రియా వినోద!**

విరివియైన వ్యాపించిన శూర్పణఖ అను రాక్షసికి వంకర రూపము కల్పించినవాడా! సీత అను ప్రియురాలితో వినోదించినవాడా!

**అతుల బల ఖరాది దనుజ హనన జనిత విబుధ మోద!**

సాటిలేని బలము కలిగిన ఖరుడు మొదలైన రాక్షసులను చంపుటచే పుట్టిన పండిత (ముని) సంతోషము కలవాడా!

**హరిణ రూపధారి దారుణాసురాసు హరణ బాణ!**

లేడి రూపము ధరించిన మారీచుడు అను భయంకర రాక్షసుని ప్రాణములను బాణముతో గ్రహించినవాడా!

**పరమ ఘోర బాహుబల కబంధ మర్దన ప్రవీణ!**

విపరీతమైన, భయంకరమైన బాహుబలము కలిగిన కబంధుడను రాక్షసుని మర్దించుటలో నేర్పు కలవాడా!

**అమల శబరికా ఫలోపహార రుచి ఘనాభిముఖ్య!**

స్వచ్ఛమైన శబరి పెట్టిన ఫలముల కానుకల రుచితో గొప్ప సమక్షము కలవాడా! శబరి ఎంగిలి పళ్ళు శ్రీరామునికి పెట్టింది అనే అంశం ప్రచారంలో ఉన్నది కానీ, వాల్మీకి రామాయణంలో లేదు. వారికి అర్ఘ్యము, పాద్యము మొదలైనటువంటి అతిథికి ఇవ్వవలసిన సమస్త సంభారములు ఇచ్చింది.

**సమద వాలి దర్ప దమన! సఫలితార్క తనయ సఖ్య!**

మదము కలిగిన వాలి దర్పమును అణచినవాడా! ఫలించిన సూర్య తనయుడైన సుగ్రీవుని స్నేహము కలవాడా!

**శరణ వరణ పర పరానుజ ప్రదీపిత ప్రసాద!**

రక్షణము వరించిన శత్రుసోదరుడైన విభీషణునిచే బాగా ప్రకాశింపబడిన అనుగ్రహము కలవాడా!

**అరుణితాక్షి కోణ విరచితాంబురాశి గర్వ సాద!**

ఎఱుపురంగు గలదిగాఁ జేయఁబడిన కంటిచివరలచే రచింపబడిన సముద్రపు గర్వ శరణము కలవాడా!

**పర్వతౌఘ రచిత సేతు బంధ సుతర సింధు కాండ!**

పర్వత సమూహములచే రచింపబడిన వంతెనచే దాటిన సముద్ర జలములు కలవాడా! రామాయణ కాలంలో రాముడి ఆజ్ఞ మేరకు వానరులు భారత ఉపఖండం కొన ప్రాంతమైన రామేశ్వరం నుంచి శ్రీలంక వరకు నిర్మించిన వంతెన సేతుబంధనము. 'నాసా' ఉపగ్రహాలు తీసిన ఛాయాచిత్రాలు ప్రపంచవ్యాప్తంగా ప్రచారమయి, సంచలనం కలిగించాయి.

**గర్వ పంక్తికంఠ కంఠ ఖండన ప్రచండ కాండ!**

గర్వము కలిగిన రావణుని కంఠములను ఖండించి, ఇతరులకు సాధ్యము కాని ప్రయత్న సమూహము కలవాడా!

**సకల దివిజ నుత చరిత్ర! సాధు భవ లతా లవిత్ర!**

సమస్త దేవతలచే పొగడబడిన చరిత్ర కలవాడా! సాధువుల యొక్క సంసార బంధములను తీగలకు కొడవలివంటివాడా!

**సకరుణా తరంగ నేత్ర! జానకీ మనోజ్ఞ గాత్ర!**

దయతో కదులు నేత్రములు కలవాడా! జానకీదేవి మెచ్చిన మనోహరమైన శరీర సౌందర్యము కలవాడా!

**యతి జపార్హ పుణ్య నామ! యతి వితీర్ణ భక్త కామ!**

సంన్యాసుల జపమునకు తగిన పుణ్యమైన నామము కలవాడా! యతులచే ఇయ్యబడిన భక్తుల కోర్కెలు కలవాడా! (యతుల రూపంలో రాముడు భక్తులను అనుగ్రహిస్తున్నాడని భావం)

**సతత సిత యశోఽభిరామ! సర్వలోక పూర్ణ ధామ!**

అంతటా నిండిన తెల్లని కీర్తిచే అందమైనవాడా! అన్ని లోకములు నిలయముగా కలవాడా!

**అహిత విదళ నాతి రౌద్ర! యార్త పాలనా వినిద్ర!**

శత్రువులను బాగా ఖండించుటలో ఎక్కువ భయంకరమైనవాడా! దుఃఖముతో నున్నవారిని పాలించుటలో హెచ్చరికతో ఉన్నవాడా! (రాముడు భక్తులను రక్షించుటలో అప్రమత్తుడని భావము)

**మహిత నిఖిల గుణ సముద్ర! మమ్ము బ్రోవు రామభద్ర!**

గొప్పవైన, సమస్త సుగుణములకు సముద్రము వంటివాడా! ఓ **రామచంద్రా! మమ్ములను రక్షించు.**

విశ్వనాథ వారి **"రాముడు"** మనకి పది రకాలుగా కనిపిస్తాడు.

1. ఆనందమయుడు, 2. ఆనందమూర్తి, 3. అవతారమూర్తి, 4. బాలరాముడు, 5. కోదండరాముడు, 6. అయోధ్యారాముడు, 7. దశరథరాముడు, 8. జానకీరాముడు, 9. రఘురాముడు, 10. ఆత్మారాముడు.

1. శుద్ధ బ్రహ్మ స్వరూపుడైన రాముడు **ఆనందమయుడు.**
2. విష్ణువుగా **ఆనందమూర్తి**
3. భౌతిక జగత్తులో జన్మనెత్తిన **అవతారమూర్తి**
4. తాటకవధ, అహల్యాశాపవిమోచనమూ చేసినవాడు **బాలరాముడు.**
5. శివధనుస్సు విఱిచి విష్ణుధనుస్సుని చేపట్టినవాడు **కోదండరాముడు.**
6. సీతని వివాహమాడి, అయోధ్యప్రజలందరికీ ప్రీతిపాత్రుడైనవాడు **అయోధ్యారాముడు.**
7. తండ్రి ఆజ్ఞని పాటించినవాడు **దశరథరాముడు.**
8. రావణ సంహారం చేసి సీతను చేపట్టినవాడు **జానకీరాముడు.**
9. రఘువంశ గౌరవం పెరిగేలా రాజ్యం చేసినవాడు **రఘురాముడు.**
10. ఆత్మలో నిలిచినవాడు **ఆత్మారాముడు.**

పింగళి సూరన గారి తురగవల్గనరగడలో కూడా ఈ పదిమంది రాములు వరుసగా లేకపోయినా వివిధ విశేషణలలో ఉన్నారు. దశరథరామునితో సూరన్న మొదలుపెట్టాడు. ఆనంద ఆత్మ వైపు ప్రయాణించేటట్లు చేయటమే రామావతార లక్ష్యం. రామ వర్ణన చేపట్టిన ఏ సుకవి వర్ణన అయినా ఈ మార్గాన్ని విడువదు. అందుకు సూరన్న గారి తురగవల్గనరగడ కూడా మినహాయింపు కాదు. ✦



# శ్రీ ద్వాదశార్యా సూర్యస్తుతి

- వ్యాఖ్యాత - మేళ్ళచెర్వు వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి, తెనాలి.



**పరిచయము :** స్కాందపురాణములోని కథ ఇది. శ్రీకృష్ణశాపము వలన ఆయన పుత్త్రుడయిన సాంబునకు కుష్ఠురోగం వచ్చినది. "ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్" అన్న ప్రకారము సాంబుడు సూర్యుని ఉపాసింపదలచినాడు. అపుడు ఈ "12" ఆర్యావృత్తములతో తయారయిన స్తోత్రం సాంబుని ఎదుట ఆకాశమునుండి పడినదట. దీనిని పఠించి సాంబుడు తన వ్యాధిని పోగొట్టుకొనెనట. దీనియందలి శ్లోకములలో భావములు సూర్యసూక్తము, ఆదిత్యహృదయము మొ॥ వానిలోని భావములను సంగ్రహించికొని ఉన్నవి అని పండితాశయము. ఇందలి "12" శ్లోకములు ద్వాదశాదిత్యులకు సూచన కావచ్చును.

**ద్వాదశాదిత్యులనగా :** 1. ఇంద్రుడు, 2. ధాత, 3. పర్జన్యుడు, 4. త్వష్ట, 5. పూష, 6. అర్యముడు, 7. భాగుడు, 8. వివస్వంతుడు, 9. విష్ణువు, 10. అంశుమంతుడు, 11. వరుణుడు, 12. మిత్రుడు.

**ద్వాదశ సూర్యకళలు :** 1. తపిని, 2. తాపిని, 3. ధూమ్ర, 4. మరీచి, 5. జ్వాలిని, 6. రుచికల, 7. సుషుమ్న, 8. భోగద, 9. విశ్వకల, 10. బోధిని, 11. ధారుణి, 12. క్షమ.

**సూర్యకిరణములు** - 7 - సప్త, అవే ఆయన గుఱ్ఱములు. 1. సుషుమ్న, 2. హరికేశ, 3. విశ్వకర్మ, 4. విశ్వశ్రవ, 5. సంపద్వసు, 6. ఆర్యావసు, 7. స్వరాట్.

ఈ శ్లోకములలో ఈ ఆదిత్య, కళా, కిరణములు సూక్ష్మముగా సూచింప బడినట్లున్నది. ఇటువంటి సూర్యుని స్తోత్రమును చేసి యీ ప్రత్యక్ష భగవానుని కిరణరూప అనుగ్రహములను పొంది పాఠకులు సర్వసంతోషములను పొందెదరుగాక అని **"ఆత్మజ్యోతి"** వాంఛ.

**శ్లో॥ ఉద్యన్నద్య వివస్వానారోహన్నుత్తరాం దివం దేవః ।**
**హృద్రోగం మమ సూర్యో హరిమాణం చాశు నాశయతు ॥** 1

**ప్రతిపదార్థము :** అద్య = నేడు, ఉద్యన్ =ఉదయించుచున్న, వివస్వాన్ = వివస్వంతుడు అను, దేవః = దేవుడు అయిన, సూర్యః = సూర్యుడు, ఉత్తరామ్ = ఉత్తరపుది అయిన, దివమ్ = ఆకాశమును, ఆరోహన్ = ఎక్కుచు, మమ = నాయొక్క, హృత్ = హృదయము యొక్క, రోగమ్ = రోగమును, హరిమాణం చ = పచ్చదనమును (రోగంవల్ల రక్తహీనత వల్ల వచ్చే పచ్చదనాలను / పైత్యరోగమును గూడ), ఆశు = శీఘ్రముగా, నాశయతు= పోగొట్టునుగాక!

**తాత్పర్యము : 'వివస్వంతుడు'** అను నామాంతరముగల తేజశ్శాలి అయిన సూర్యదేవుడు నేడు ఉదయించుచున్నాడు. ఆయన ఉత్తరాకాశమును ఆక్రమించుచు నా హృద్రోగమును, పైత్యజన్యములయిన ఇతర రోగములను నశింపజేయునుగాక. (ఇందులో మాదిరికొక రోగం పేరు చెప్పబడినది. కనుక అట్టిరోగములన్నియు అని 'లక్షణ'తో అర్థం చెప్పవలెను.)

**శ్లో॥ నిమిషార్థే నైకేన ద్వే చ శతే ద్వే సహస్రే ద్వే ।**
**క్రమమాణ! యోజనానాం నమోఽస్తు తే నళినీనాథాయ ॥ 2**

**ప్రతిపదార్థము :** ఏకేన = ఒక, నిమిషార్థేన = రెప్పపాటువేయు కాలములో సగములోనే (సుమారుగా సెకను), యోజనానామ్ = ఆమడలయొక్క, ద్వేశతే ద్వేసహస్రే ద్వేచ = 2వేల 2వందల 2ను, క్రమమాణ! = నడచువాడా! సూర్యదేవా!, నళినీ = తామరపూలకు, నాథాయ = ప్రభువగు, తే = నీకు, నమః = నమస్కారము, అస్తు = అగుగాక!

**తాత్పర్యము :** (సూర్యవేగమునకు ఒక శ్లోకం ఉన్నది. ఆ శ్లోకసారాంశం ఈ శ్లోకం. ఈ శ్లోకాన్ని పండితులు ఇప్పటి కొలతలతో సెకనుకు '3' లక్షల కిలోమీటర్లు సూర్యకిరణ కాంతి అని చెప్పారు) అఱ ఱెప్పపాటు కాలములో 2వేల 2వందల 2యోజనముల వేగంతో నడచే, పద్మప్రియుడయిన సూర్యనారాయణా, నీకు నమస్కారము.

**శ్లో॥ కర్మజ్ఞానఖదశకం మనశ్చ జీవ ఇతి విశ్వసర్గాయ ।**
**ద్వాదశధా యో విచరతి స ద్వాదశమూర్తిరస్తు మోదాయ ॥ 3**

**ప్రతిపదార్థము :** విశ్వసర్గాయ = ప్రపంచసృష్టి కొఱకు, కర్మజ్ఞానఖదశకమ్ = కర్మేంద్రియ జ్ఞానేంద్రియములను 10 రూపములుగా, మనః = మనస్సుగాను, జీవ ఇతి చ = జీవుడుగాను, ద్వాదశధా = 12 విధాలుగా, యః = ఎవడు, విచరతి = సంచరించు చున్నాడో, సః = ఆ, ద్వాదశమూర్తిః = ద్వాదశాత్మ అయిన సూర్యుడు, మోదాయ = మన సంతోషము కొఱకు అస్తు = అగుగాక.

**తాత్పర్యము :** సూర్యకాంతి యే జీవరూపంగా ఇంద్రియరూపంగా పంచభూతరూపంగా ఆవిర్భవించిందో అది 12 రకాల సూర్యులు 12 రకాల ఆయన కళలు మన కర్మ, జ్ఞాన, మనో, జీవ మూర్తులకు కారణము. మన బుద్ధి ప్రవృత్తులకు ఆయనే కారణము. అట్టి ద్వాదశాత్మ అయిన దివాకరునకు నమస్కారము.

**శ్లో॥ సామర్త్వం యజురసి త్వమాగమస్త్వం వషట్కారః ।**
**త్వం విశ్వం త్వం హంసః త్వం భానో! పరమహంసశ్చ ॥ 4**

**ప్రతిపదార్థము :** భానో! = సూర్యదేవా! త్వమ్ = నీవు, సామ = సామవేదరూపుడవు, త్వమ్ = నీవు,

ఋక్ = ఋగ్వేదరూపుడవు, త్వమ్ = నీవు, యజుః = యజుర్వేదరూపుడవు, అసి = అగుచున్నావు, త్వమ్ = నీవు, ఆగమః = ఆగమస్వరూపుడవు, త్వమ్ = నీవు, వషట్కారః = వషట్కారస్వరూపుడవు, త్వమ్ = నీవు, విశ్వమ్ = విశ్వరూపుడవు, త్వమ్ = నీవు, హంసః = హంసరూపుడవు, పరమహంసశ్చ = పరమహంసరూపుడవు గూడా, అసి = అగుచున్నావు.

**తాత్పర్యము :** (ఛాందోగ్య బృహదారణ్యాదులలోని విషయాలు ఇవి) సూర్యదేవా! నీవు వేదత్రయ స్వరూపుడవు. ఆగమస్వరూపుడవు, వషట్కారస్వరూపుడవు, విశ్వరూపుడవు, హంసస్వరూపుడవు, పరమహంసస్వరూపుడవు.

**శ్లో॥ శివరూపాత్ జ్ఞానమహం త్వత్తో ముక్తిం జనార్దనాకారాత్ ।**
**శిఖిరూపాదైశ్వర్యం త్వత్తశ్చారోగ్యమిచ్ఛామి ॥ 5**

**ప్రతిపదార్థము :** అహమ్ = నేను, శివరూపాత్ = శివస్వరూపమయిన, త్వత్తః = నీనుండి, జ్ఞానమ్ = జ్ఞానమును, జనార్దనాకారాత్ = విష్ణురూపమయిన నీనుండి, ముక్తిమ్ = మోక్షమును, శిఖిరూపాత్ = అగ్నిరూపుడవయిన నీనుండి, ఐశ్వర్యమ్ = ఐశ్వర్యమును, త్వత్తః = సూర్యుడవయిన నీనుండి, ఆరోగ్యం చ = ఆరోగ్యమును, ఇచ్ఛామి = కోరుచున్నాను.

**తాత్పర్యము :** ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్ శ్రియమిచ్ఛేత్ హుతాశనాత్ ।
జ్ఞానం మహేశ్వరాదిచ్ఛేత్ మోక్షమిచ్ఛేత్ జనార్దనాత్ ॥

అన్న శ్లోకంలోని అర్థమే ఇది. అయితే ఆయా దేవతల రూపంలో సూర్యుడే ఉన్నాడన్నది ఇందులోని ఆత్మభావన.

"అసావాదిత్యో బ్రహ్మేతి" అన్నట్లు, ఆదిత్యదేవా! శివరూపుడవయిన నీనుండి జ్ఞానమును, విష్ణురూపుడవయిన నీనుండి మోక్షమును, అగ్నిరూపుడవయిన నీనుండి ఐశ్వర్యమును, అసలయిన ప్రత్యక్ష సూర్యరూపుడవయిన నీనుండి ఆరోగ్యమును కోరుచున్నాను.

సూర్యుడే ఉదయసమయంలో బ్రహ్మగాను, మధ్యాహ్నసమయంలో విష్ణువుగాను, సాయం సమయంలో శివుడుగాను భావింపదగినవాడు. సంధ్యావందనం, ఇతర ఉపనిషత్తుల ద్వారా ఈ అర్థం అవగతం. సూర్యుడు అంతరిక్షంలో ఉన్న 'అగ్ని' అని ఋక్కులు, నిరుక్తం మొ॥ చెప్పుచున్నవి. అగ్ని ఐశ్వర్యకారకుడని అగ్నిసూక్తము నుండి గ్రహింపదగిన విషయం. వ్యక్తికి కావలసినవన్నియు సూర్యునివలన లభిస్తాయి కనుక సూర్యుడే ప్రత్యక్ష భగవద్రూపమని నిర్ధారణ.

**శ్లో॥ త్వచి దోషా దృశిదోషా హృదిదోషా యేఽఖిలేంద్రియజదోషాః ।**
**తాన్ పూషా హతదోషః కించిద్దోషాగ్నినా దహతు ॥ 6**

**ప్రతిపదార్థము :** హతదోషః = దోషనాశకుడయిన, పూషా = పూష అనబడు పేరుగల సూర్యుడు, త్వచి = చర్మమునందు, దోషాః = దోషములు, దృశి = నేత్రములందు, దోషాః = దోషములు, హృది = హృదయమునందు, దోషాః = దోషములు, అఖిలేంద్రియజదోషాః = కర్మేంద్రియ జ్ఞానేంద్రియములందు పుట్టిన దోషములు, యే = ఏవిగలవో, తాన్ = ఆ దోషములను, కించిత్ = కొద్దిపాటి, దోషాగ్నినా = దోషాగ్నితో, దహతు = దహించుగాక!

**తాత్పర్యము :** చర్మ, నేత్ర, హృదయ దోషములను, అవేగాక ఇతర ఇంద్రియసంబంధము లయిన సమస్త దోషములను 'పూష' అనబడు సూర్యుడు – తాను నిర్దోషుడుగనుక – ఆ దోషకణములను దహించునుగాక.

భక్తునిపై దయవలన భక్తుని బాధించు దోషములమీద సూర్యునికి రోషం వచ్చునని, ఆ రోషం వచ్చీ రాకముందే సర్వదోషములు నిర్మూలమగునని కవి భావము.

ఇందులో దోషములు అంటే రోగములేకాక సమస్తపాపములుగూడా అని అర్థం చేసికొనాలి.

"మనసావాచాహస్తాభ్యాం, పద్భ్యాముదరేణ...." ఇత్యాది మంత్రార్థసారం ఈ శ్లోకం. పైగా జ్యోతిస్తంత్రరీత్యా, సూర్యనమస్కారాదుల వలన సమస్త రోగములు పోవుట ప్రసిద్ధమే. సింహార్యోధిపతి సూర్యుడు హృదయరోగ హర్త. భగవన్నేత్రమై వెలుగునిచ్చు ఈ గ్రహం నేత్రరోగహర్త – ఇత్యాదులు ఊహింపదగును. మయూరుడు, సాంబుడు మొ॥ వారు సూర్యస్తుతితో కుష్ఠ రోగనివారణ చేసికొనిరి కనుక చర్మరోగ నివారణకర్త యీ వికర్తనుడే.

**శ్లో॥ ధర్మార్థకామమోక్షప్రతిరోధానుగ్రతాపవేగకరాన్ ।**
**బందీకృతేంద్రియగణాన్ గదాన్ విఖండయతు చండాంశుః ॥ 7**

**ప్రతిపదార్థము :** చండాంశుః = తీక్ష్ణ కిరణుడయిన సూర్యుడు, ధర్మ = ధర్మమునకు, అర్థ = అర్థమునకు, కామ = కోరికలకు, మోక్ష = మోక్షమునకు, ప్రతిరోధాన్ = ఆటంకము కలిగించునవియు, ఉగ్ర = భయంకరమయిన, తాపవేగ = సంతాపవేగమును, కరాన్ = కలిగించునవియు, బందీకృత = బందీలుగా చేయబడిన, ఇంద్రియగణాన్ = ఇంద్రియ సమూహములుగల, గదాన్ = రోగములను, విఖండయతు = ఖండించివేయును గాక!

**తాత్పర్యము :** ధర్మ, అర్థ, కామ, మోక్షములనెడు 4 పురుషార్థములను ఆటంకపఱచుచు, మాకు తీవ్రమయిన సంసారసంతాపములను కలిగించుచు, మా ఇంద్రియములను బందీలుగా చేసి మమ్ములను ఆడించు ఘోర వ్యాధులను / కామ క్రోధాది దోషములను తీవ్రరశ్మి అయిన మార్తాండుడు నిర్మూలించుగాక!

**శ్లో॥ యేన వినేదం తిమిరం జగదేత్య గ్రసతి చరమచరమఖిలమ్ ।**
**ధృతబోధం నళినీభర్తారం, హర్తారమాపదామీడే ॥ 8**

**ప్రతిపదార్థము :** యేన వినా = ఎవరు లేనిచో, ఇదమ్ = ఈ, తిమిరమ్ = చీకటి / అజ్ఞానము, జగత్ = ప్రపంచమును, ఏత్య = పొంది, చరమ్ = కదిలేదానిని, అచరమ్ = కదలనిదానిని, అఖిలమ్ = సమస్తమును, గ్రసతి = మ్రింగునో, తమ్ = అట్టివాడును, ధృతబోధమ్ = జ్ఞానమును / మెలకువను గలిగినవాడును, ఆపదామ్ = ఆపదలయొక్క, హర్తారమ్ = హరించువాడును అగు, నళినీభర్తారమ్ = తామరతీగకు ప్రభువగు సూర్యుని, ఈడే = స్తుతించుచున్నాను.

**తాత్పర్యము :** సూర్యుడు లేకపోతే చీకటి / అజ్ఞానము ఈ చరాచర ప్రపంచం మొత్తాన్ని ఆక్రమించగలదు. సర్వజీవులకు "బోధ" (జ్ఞానము / మెలకువ) కలిగించు ఈ పద్మినీపతి అయిన సూర్యుడు మన ఆపదలను హరించును. ఆయనకు నమస్కారము.

(తామరతీగ అంటే ఆధ్యాత్మికంగా 7 పద్మాలకు నివాసమయిన సుషుమ్నా నాడి అని అర్థం. దాని వికాసం జ్ఞానదాయకం)

**శ్లో॥ యస్య సహస్రాభీశోరభీశులేశో హిమాంశుబింబగతః ।**
**భాసయతి నక్తమఖిలం భేదయతు విపద్గణానరుణః ॥ 9**

**ప్రతిపదార్థము :** యస్య = ఏ, సహస్రాభీశోః = సహస్రకిరణుడయిన సూర్యునియొక్క, అభీశులేశః = రవ్వంత కిరణము, హిమాంశుబింబ = చంద్రబింబమును, గతః = చేరినదై, అఖిలమ్ = సమస్తమయిన, నక్తమ్ = రాత్రిని (రాత్రి అంతయు) భాసయతి = వెలిగించునో, అరుణః = ఆ సూర్యుడు, విపద్గణాన్ = ఆపదల గుంపులను, భేదయతు = చీల్చివేయునుగాక!

**తాత్పర్యము :** సూర్యకాంతి రాత్రిపూట అగ్నికి, చంద్రునికి, ఓషధులకు వెళ్తుందని శాస్త్రం. వాస్తవంగూడా అదే. సహస్రకిరణుడయిన సూర్యుని కిరణరేణువు చంద్రబింబంమీద పడి రాత్రి అంత ఈ ప్రపంచానికి చల్లని వెన్నెలనిస్తూ వెలుగులు విరబూస్తున్నది. అట్టి అరుణభగవానుడు మన ఆపదలను చీల్చి చెండాడునుగాక!

**శ్లో॥ తిమిరమివ నేత్రతిమిరం పటలమివాశేషరోగపటలం నః ।**
**కాశమివాధినికాయం కాలపితా రోగయుక్తతాం హరతాత్ ॥ 10**

**ప్రతిపదార్థము :** తిమిరమివ = చీకటిని చీల్చినట్లు, నః = మా, మనయొక్క, నేత్రతిమిరమ్ = కంటికి వచ్చిన “తిమిరం” అను రోగమును, పటలమివ = పటలమను కంటిరోగమును హరించినట్లు, నః = మా / మన యొక్క, అశేషరోగపటలమ్ = సమస్త రోగ సముదాయమును, కాశమివ = రెల్లును మాడ్చినట్లు, అధినికాయమ్ = మానసిక సంతాప సమూహమును, రోగయుక్తతామ్ = అన్ని రకముల రోగయోగమును, కాలపితా = కాలజనకుడైన సూర్యుడు, హరతాత్ = హరించునుగాక.

**తాత్పర్యము :** (మనకు సూర్యచంద్రులవలన కాలవిభాగం వస్తున్నది. అందుకు సూర్యుడే అన్ని కాలవిభాగాలకు కారణం. ఆయన జ్యోతిషరీత్యా లగ్నకారకుడు. సహజషష్ఠి కారకుడయిన బుధుని మాడుస్తూ ఉంటాడు). కాలకారకుడయిన సూర్యుడు తిమిరమును చీల్చినట్లు మన కంటి తిమిరవ్యాధిని, పటలమును చీల్చినట్లు రోగపటలమును ఱెల్లును (వేసవిలో ఱెల్లు మాడిపోతుంది) మాడ్చినట్లు మానసిక రోగముల సమూహమును హరించునుగాక!

**శ్లో॥ వాతాశ్మరీగదార్శస్ త్వగ్దోషమహోదరప్రమేహాంశ్చ ।**
**గ్రహణీభగందరాఖ్యా మహతీస్త్వం మే రుజో హంసి ॥ 11**

**ప్రతిపదార్థము :** త్వమ్ = (ఓ సూర్యదేవా!) నీవు, మే = నాయొక్క, వాత = వాతరోగము, అశ్మరీ = మూత్రములో రాళ్లుపడే, గద = రోగము, అర్శస్ = మొలలు, త్వగ్దోష = చర్మవ్యాధి, మహోదర = పెద్దపొట్ట / జలోదరం, ప్రమేహాంశ్చ = ప్రమేహరోగము, గ్రహణీ = రక్తవిరేచనాలు, భగందరాఖ్యాః = భగందరము అను పేర్లుగల, మహతీః = గొప్ప, రుజః = రోగములను, హంసి = పోగొట్టుచున్నావు.

**తాత్పర్యము :** సూర్యదేవా! నీవు నాకు గల వాత, అశ్మరీ మొ॥ రకరకాల రోగాలను నిర్మూలించుచున్నావు.

**శ్లో॥ త్వం మాతా త్వం శరణం త్వం ధాతా త్వం ధనం త్వమాచార్యః ।**
**త్వం త్రాతా త్వం హర్తా విపదామర్క! ప్రసీద మమ భానో! ॥ 12**

**ప్రతిపదార్థము :** అర్క! = అర్కదేవా!, భానో! = భానుదేవా!–సూర్యా!, త్వమ్ = నీవు, మాతా =

తం(డివి, త్వమ్ = నీవు, శరణమ్ = శరణ్యుడవు, త్వమ్ = నీవు, ధాతా = సృష్టికర్తవు / పోషకుడవు, త్వమ్ = నీవే, ధనమ్ = ధనరూపుడవు (ఆరోగ్యమే మహాభాగ్యం కదా), త్వమ్ = నీవు, ఆచార్యః = గురువువు (బుద్ధులను (పేరేపణ చేస్తాడు), త్వమ్ = నీవు, (తాతా = రక్షకుడవు, త్వమ్ = నీవు, విపదామ్ = ఆపదలయొక్క, హర్తా = నివారకుడవు. మమ = నాకు, (ప్రసీద = అను(గహింపుము.

**తాత్పర్యము :** "అర్క" దేవా! నీవే తల్లివి. నీవే శరణు. నీవే పోషకుడవు, నీవే ధనం, నీవే గురువు, నీవే రక్షణ, నీవే సంకట నివారకుడవు. తం(డీ! నన్ను అను(గహింపుము.

**శ్లో॥ ఇత్యార్యా ద్వాదశకం సాంబస్య పురో నభస్థ్సలాత్పతితమ్ ।**
**పఠతాం భాగ్యసమృద్ధిః సమస్తరోగక్షయశ్చ స్యాత్ ॥ 13**

**(ప్రతిపదార్థము :** ఇతి = పైన చెప్పిన (ప్రకారముగా ఉన్న, ఆర్యాద్వాదశకమ్ = 12 ఆర్యావృత్తముల స్తో(తము, నభాస్థ్సలాత్ = ఆకాశస్థలమునుండి, సాంబస్య = సాంబునియొక్క, పురః = ఎదుట, పతితమ్ = పడినది. పఠతామ్ = దీనిని చదివినవారికి, భాగ్యసమృద్ధిః = భాగ్యసంపద, సమస్తరోగక్షయశ్చ = సమస్త సంకట పరిహారము, స్యాత్ = అగును.

**తాత్పర్యము :** ఈ 12 ఆర్యా శ్లోకములతో ఉన్న "ద్వాదశార్యా సూర్యస్తుతి" ఒకనాడు సాంబుని ఎదుట ఆకాశమునుండి పడినది. ఇది చదివినవారికి భాగ్యము, ఆరోగ్యము సమకూడును. ✦

---

# శాంతి మంత్రం

**ఓం యశ్ఛందసామృషభో విశ్వరూపః । ఛందోభ్యోధ్యమృతాథ్సంబభూవ ।**
**స మేంద్రో మేధయా స్పృణోతు । అమృతస్య దేవ! ధారణో భూయాసమ్ ।**
**శరీరం మే విచర్షణమ్ । జిహ్వా మే మధు మత్తమా । కర్ణాభ్యాం భూరివి(శువమ్ ।**
**(బహ్మణః కోశోఽసి మేధయా విహితః । (శుతం మే గోపాయ ॥**
**ఓం శాంతిః శాంతిః శాంతిః ॥**

యః = ఏ నాదం; ఛందసా = వేదాల; ఋషభాః = అతి(శేష్ఠమైన భాగమో; విశ్వరూపః = సమస్తంగా ఉంటూవున్నదో; అమృతాత్ = మరణం లేని; ఛందోభ్యయః = వేదాలనుండి; అధిసంబభూవ = ఉద్భవించిందో; స ఇం(దః = ఆ ఓంకారం; మే = నన్ను; మేధయా = మేధస్సుతో; స్పృణోతు = చేర్పించనీ; దేవ = దేవా; అమృతస్య = మరణంలేని పర(బహ్మను గూర్చిన జ్ఞానాన్ని; ధారణః = పొందిన వానిగా; భూయాసమ్ = అవుదునుగాక; మే = నాయొక్క; శరీరమ్ = శరీరము; విచర్షణమ్ = ఆరోగ్యవంతంగా ఉండనీ; మే = నా యొక్క; జిహ్వా = నాలుక; మధుమత్తమా = అతితియ్యని వాటిని పలుకనీ; కర్ణాభ్యామ్ = చెవులద్వారా; భూరివి(శువమ్ = అనేక మంచి విషయాలనే ఆలకించనీ; మేధయా = తెలివితో; పిహితః = మరుగు పరచబడి ఉన్నావు; (బహ్మణః = భగవంతుని; కోశః అసి = (ప్రాప్తిస్థానం నువ్వే; మే = నేను; (శుతమ్ = విన్నదానిని; గోపాయ = కాపాడు.





# పాణిమంత్రము - మహానారాయణోపనిషత్

ఓం నిధనపతయే నమః
ఓం నిధనపతాంతికాయ నమః
ఓం ఊర్ధ్వాయ నమః
ఓం ఊర్ధ్వలింగాయ నమః
ఓం హిరణ్యాయ నమః
ఓం హిరణ్యలింగాయ నమః
ఓం సువర్ణాయ నమః
ఓం సువర్ణలింగాయ నమః
ఓం దివ్యాయ నమః
ఓం దివ్యలింగాయ నమః
ఓం భవాయ నమః
ఓం భవలింగాయ నమః
ఓం శర్వాయ నమః
ఓం శర్వలింగాయ నమః
ఓం శివాయ నమః
ఓం శివలింగాయ నమః
ఓం జ్వలాయ నమః
ఓం జ్వలలింగాయ నమః
ఓం ఆత్మాయ నమః
ఓం ఆత్మలింగాయ నమః
ఓం పరమాయ నమః
ఓం పరమలింగాయ నమః

**ఏతత్సోమస్య సూర్యస్య సర్వలింగగ్గ్ స్థాపయతి పాణిమంత్రం పవిత్రమ్ ॥**



# లోకంబులు లోకేశులు

– డా. తాడేపల్లి పతంజలి

యోగవాసిష్ఠం ఉత్పత్తిప్రకరణం లో ఇలా చెప్పారు: "యత్నో యత్నేన కర్తవ్యో మోక్షార్థం యుక్తి పూర్వకమ్, యత్నయుక్తివిహీనస్య గోష్పదం దుస్తరం భవేత్" మోక్షము కొరకు యుక్తిపూర్వక ప్రయత్నములు చేయాలి. ప్రయత్నము, యుక్తిలేని వారికి గోవుపాదమంత స్థలముకూడా దాటడానికి అసాధ్యము."

పోతనగారి "లోకంబులు....." పద్యం చదువుతుంటే నాకు ఈ యోగవాసిష్ఠం గుర్తుకు వచ్చింది. గజేంద్రుని ప్రార్థనలో ప్రయత్నము కనిపిస్తుంది. గజేంద్రుడు విష్ణువుని కాపాడమని మొరపెట్టుకొనే సందర్భంలోని ఈ పద్య విశేషాలు కొన్నింటిని చూద్దాం.

**లోకంబులు లోకేశులు**
**లోకస్థులుఁ దెగినఁ దుది నలోకం బగు పెం**
**జీకటి కవ్వల నెవ్వం**
**డే కాకృతి వెలుఁగు నతని నే సేవింతున్.** (8–75–క.)

**సాధారణమైన ప్రతిపదార్థం ఇది**

లోకేశులున్ = లోకాలను పరిపాలించే వారు; లోకస్థులు = లోకాలలో ఉండు వారు; తెగిన = నశించిన తరువాత; తుదిన్ = చివర; అలోకంబున్ అగు = కనబడనిదగు; పెంజీకటికిన్ = గాఢాంధకారానికి; అవ్వలన్ = అవతల; ఎవ్వండు = ఎవడు; ఏక = ఒకే; ఆకృతిన్ = ఆకారముతో; వెలుగున్ = ప్రకాశిస్తుంటాడో; అతనిన్ = అతనిని; ఏన్ = నేను; సేవింతున్ = కొలుస్తుంటాను.

లోకాలు, లోకాలను పరిపాలించేవారు, లోకాలలో ఉండేవారు అందరు నశించిన తరువాత; ఆ కారు చీకట్లకు ఆవతల ఒకే రూపంతో వెలిగే ఆ దేవుణ్ణి నేను సేవిస్తాను.

దీనిలోపల ఉన్న విశేషార్థము ఇది.

లోకాలు మూడు. మెలకువ, కల, నిద్ర. లోకేశులు = పై ఆధారమైన చైతన్య పరిధులు మూడు. 1విశ్వుడు, 2.తైజసుడు , 3.ప్రాజ్ఞుడు.

**1.విశ్వుడు :** జాగ్రదావస్థలో అజ్ఞానంతో ఉండే జీవుడు నేను కాని శరీరాన్ని నాది నేను అనే భావాన్ని కలిగిస్తాడు. నావి కాని బాహ్యపదార్థాలను నావి అనే భావాలను కలిగిస్తాడు.

**2.తైజసుడు :** స్వప్నావస్థలో ప్రకాశించే తాను కాని శరీరమందు తాననే అహంకార భావాన్ని , తనవి కాని స్వప్నపదార్థాలందు నావి అనే మమకార భావాన్ని కల్గించేది తైజసుడు.

**3.ప్రాజ్ఞుడు :** సుషుప్తిలో ప్రాజ్ఞుడు జీవునకు అజ్ఞానంచేత కలిగే తాను, తనవి అనే భావాలు కలుగకుండా చేస్తాడు.

లోకస్థులు = మూడు– లోకాలను అనుభవించే ఇంద్రియాలు, అంతఃకరణము, అహంకారం. తెగినతుది = అంటే ఇవేవీ అందుకోలేని; అలోకంబగు పెంజీకటికవ్వల = కనబడని శూన్యావస్థను కూడా మించి; ఎవ్వండు = ఎవడైతే ఉన్నాడో; ఏకాకృతి వెలుగు = నిశ్చల మయిన స్థితిలో, ఈ మూడు లోకాలలో వ్యాపించిన ఏకాక ృతిలో వెలుగు.. అంటే.. కనిపిస్తాడో అటువంటి పరమాత్ముడైన శ్రీమహావిష్ణుమూర్తిని, నే సేవింతున్ = నేను ప్రార్థిస్తాను!

బ్రహ్మ మొదలయిన వారు కూడ సృష్టి పరిణామక్రియలో అంతమైపోతారు. ఆ వెనుక నున్నది గాఢాంధకారము. అది మాయతో కూడిన మూల ప్రకృతి. ఆ మూల ప్రకృతికి వెనుకగా ఒకే ఒక వెలుగు తాను వెలుగు చుండును. అట్టి జ్యోతిస్వరూపుడైన దేవుని నేను సేవింతును అన్నాడు గజేంద్రుడు. భగవంతునికి పుట్టుక, పాపం, రూపము, కర్మ, పేరు, గుణాలు ఉండవు.

అతడు ఈ లోకాలను స ృష్టిస్తాడు, నశింపచేస్తాడు. ఇదంతా తన మాయ. ఆ వెలుగు, మాటలకూ అందని పరిశుద్ధుడు, శాంతస్వరూపుడు, ఆనందానికి మూలభూతుడు, మోక్షాధిపతి అయిన ఆ ఈశ్వరుని నేను ప్రార్థిస్తున్నాను.

ఈ పద్యంలొ ఏకేశ్వరోపాసన ఉన్నదని పెద్దల భావన. ✦

---

# శాంతి మంత్రం

**ఓం వాఙ్మే మనసి ప్రతిష్ఠితా మనో మే వాచి ప్రతిష్ఠిత మావిరావీర్మ ఏధి ।**
**వేదస్య మ ఆణీస్థః । శ్రుతం మే మా ప్రహాసీరనేనా ధీతేనాహోరాత్రాన్ సందధామ్యమృతం వదిష్యామి ।**
**సత్యం వదిష్యామి । తన్మామవతు । తద్వక్తారమవత్వవతు । మామవతు వక్తారమవతు వక్తారమ్ ॥**
**ఓం శాంతిః శాంతిః శాంతిః ॥**

మే = నా; వాక్ = వాక్కు; మనసి = మనస్సులో; ప్రతిష్ఠితా = ప్రతిష్ఠితం అగుగాక; మే మనః = నా మనస్సు; వాచి = వాక్కుతో; ప్రతిష్ఠితమ్ = ప్రతిష్ఠితం అగుగాక; ఆవిః = ప్రకాశమానమైన పరమాత్మా; మే = నాలో; ఆవిః ఏధి = ప్రకాశించుగాక; మే = నాకు; వేదస్య = వేదాల యథార్థాన్ని; ఆణీస్థః = తీసుకొస్తారుగాక; మే శ్రుతమ్ = నేను విన్నవి; మా ప్రహాసీః = నన్ను వీడకుండా ఉండుగాక; అనేక అధీతేన = నేర్చుకొన్న వాటిని; అహః రాత్రాన్ = రాత్రింబవళ్లు; సందధామి = అనుసంధానం చేస్తాముగాక; ఋతం వదిష్యామి = నేను వ్యావహారిక సత్యాన్ని పలుకుతానుగాక; సత్యం వదిష్యామి = నేను పారమార్థిక సత్యాన్ని పలుకుతానుగాక; తత్ = ఆ భగవంతుడు; మామ్ = నన్ను; అవతు = కాపాడుగాక; తత్ = ఆ భగవంతుడు; వక్తారం = గురువును; అవతు = కాపాడుగాక; అవతు మామ్ = నన్ను కాపాడుగాక; అవతు వక్తారమ్ = గురువును కాపాడుగాక.



## శ్రీ హనుమద్భుజంగ ప్రయాత స్తోత్రమ్

శ్లో॥ స్ఫురద్విద్యుల్లాసవాలాగ్రఘంటా–
ఝణత్కారనాదప్రవృద్ధాట్టహాసమ్ ।
భజే వాయుసూనుం భజే రామదూతం
భజే వజ్రదేహం భజే భక్తబంధమ్ ॥ 1

శ్లో॥ ప్రసన్నానురాగప్రభాకాంచనాంగం
జగద్గీతశౌర్యం తుషారాద్రిధైర్యమ్ ।
తృణీభూతహేతిం రణోద్యద్విభూతిం
భజే వాయుపుత్రం పవిత్రాత్పవిత్రమ్ ॥ 2

శ్లో॥ భజే హేమరంభావనే నిత్యవాసం
భజే బాలభానుప్రభాచారుహాసమ్ ।
భజే చంద్రికాకుందమందారభాసం
భజే సంతతం రామభూపాలదాసమ్ ॥ 3

శ్లో॥ భజే లక్ష్మణప్రాణరక్షాసుదక్షం
భజే తోషితానేకగీర్వాణపక్షమ్ ।
భజే ఘోరసంగ్రామసీమాహతాక్షం
భజే రామనామాని సంప్రాప్యదక్షమ్ ॥ 4

శ్లో॥ మృగాధీశనాధం క్షితిక్షిప్తపాదం
ఘనక్రాంతజంఘం కటిస్థోడుసంఘమ్ ।
అజాండస్థకేశం భుజాశ్లేషితాశం
జయశ్రీసమేతం భజే రామదూతమ్ ॥ 5

శ్లో॥ చలద్వాలఘాతం భ్రమచ్చక్రవాలం
కఠోరాట్టహాసప్రభిన్నాబ్ధికాండమ్ ।
మహాసింహనాదద్విశీర్ణత్రిలోకం
భజే చాంజనేయం ప్రభుం వజ్రకాయమ్ ॥ 6

శ్లో॥ రణే భీషణే మేఘనాథే సనాథే
సరోషం సమారోప్య సౌమిత్రిమంసే ।
ఘనానాం ఖగానాం సురాణాం చ మార్గే
నటంతం జ్వలంతం హనూమంతమీడే ॥ 7

శ్లో॥ నఖధ్వస్తజంభారిదంభోళిఘాతం
భుజాగ్రేణనిర్ధూతకాలాగ్రదండమ్ ।
పదాఘాతభీతాహిజాతాఽధివాసం
రణక్షోణిదక్షం భజే పింగళాక్షమ్ ॥ 8

శ్లో॥ మహాభూతపీడాం మహోత్పాతపీడాం
మహావ్యాధిపీడాం మహాధిప్రపీడామ్ ।
హరత్యాశు తే పాదపద్మానురక్తిః
నమస్తే కపిశ్రేష్ఠ రామప్రియాయ ॥ 9

శ్లో॥ సుధాసింధుముల్లంఘ్యసాంద్రే నిశీథే
సురాంతః ప్రగుప్తాం సుధామోషధీం తామ్ ।
రణాద్రోణశైలేయసారేణనేత్రా
వినా కిం త్వయా కస్సమర్థః కపీంద్రః ॥ 10

శ్లో॥ సముద్రే తరంగాది రౌద్రం వినిద్రో
విలంఘ్యోడుసంఘం స్తుతామర్త్యసంఘః ।
నిరాతంకమావిశ్య లంకాం విశంకో
భావానేవ సీతావియోగాపహారిన్ ॥ 11

శ్లో॥ రమానాథనామా క్షమానాథనామా
హ్యశోకో నశోకాం విహాయాప్రహృష్యన్ ।
వనం తద్ఘనం జీవనం దానవానాం
విపాట్య ప్రహృష్యన్ హనూమాన్స్త్వమేవ ॥ 12

శ్లో॥ జనే హారయన్ భీతిపీడాం శరీరే
నిరూఢం రణారూఢ గాఢప్రతాప ।
భవత్పాదభక్తిం భవద్భక్తిరక్తిం
కురు త్వం హనూమాన్ ప్రభో యే మే దయాళో ॥ 13

శ్లో॥ నమస్తే మహాసత్త్వవాహాయ తుభ్యం
నమస్తే మహాకాలకాలాయ తుభ్యమ్ ।
నమస్తే మహామర్త్యకాయాయ తుభ్యం
నమస్తే సదా స్వామికార్యాయ తుభ్యమ్ ॥ 14

ఈ స్తోత్రరాజమును భక్తులు నిత్యమొక పర్యాయము మండలదీక్షచే పఠించిన మాత్రమున సర్వాభీష్టసిద్ధులు కలుగును.



# బుసబుసల్, గుసగుసల్, రుసరుసల్

*– డా. తాడేపల్లి పతంజలి*



**మెడనాగయ్యకు నొక్కటే బుసబుసల్, మేనన్ సగంబైన యా**
**బిడతో నీ కికనెప్పుడున్ గుసగుసల్, వీక్షించి మీచంద మె**
**క్కడ లేనంతగ నెత్తిపై రుసరుసల్ గంగమ్మకున్, నీచెవిన్**
**బడుటేలాగునొ మామొఱల్ తెలియదప్పా! మాకు, మృత్యుంజయా!**



*(మాధవపెద్ది బుచ్చి సుందర రామ శాస్త్రి మృత్యుంజయ శతకము 05 వ పద్యము)*

మృత్యువును జయించినవాడు మృత్యుంజయుడు. పరమశివుడు మృత్యుంజయుడు. **“త్ర్యంబకం యజామహే సుగంధిం పుష్టివర్ధనం ఉర్వారుక మివ బంధనాత్ మృత్యోర్ముక్షీయ మామృతాత్”** మృత్యువు నుంచి రక్షణ కల్పించమని సంస్కృతంలో పరమ ప్రసిద్ధమైన మృత్యుంజయ మహామంత్రం జపించేవారు లక్షలాది మంది ఉన్నారు. మృత్యువు అంటే భౌతికంగా చనిపోవటం మాత్రమేకాదు. ఆధ్యాత్మికపరంగా ఎటువంటి కదలిక లేకపోవటం కూడా మృత్యువుతో సమానం. ఒక భక్తి లేదు. ఒక ప్రకృత్యారాధన లేదు. దేనిపైనా ఆసక్తి లేదు. ప్రతిదీ అనుమానం. బెంగ. అదే మృత్యు సదృశం. దీనిని జయించాలంటే మృత్యుంజయునితో ఆత్మీయ సంభాషణ జరపాలి. వేడుకోవాలి. అలా పుట్టినదే ఈ మృత్యుంజయ శతకం.

“ఓ శివా! తండ్రీ! నీ మెడలో ఉన్న నాగుపాము బుసబుసలు కొడుతుంది. నీ శరీరంలో సగమైన పార్వతీదేవితో నువ్వెప్పుడు గుసగుసలాడుతుంటావు. మీ ఇద్దరి గుసగుసలు చూసి నీ నెత్తిపైన ఉన్న గంగమ్మకు రుసరుసలు. ఈ బుసబుసలు, గుసగుసలు, రుసరుసల మధ్య నా ప్రార్థన నీ చెవిన ఎలా వెయ్యాలో నాకు తెలియటంలేదయ్యా”.

చమత్కారం ఈ పద్యంలో ప్రాణం. నా ప్రార్థన నీ చెవిన ఎలా వెయ్యాలో నాకు తెలియటంలేదు అనే వాక్యంలో – “ఇన్ని ధ్వనుల మధ్య ఉన్నవాడివి – కాస్త – నా వేడికోలు ధ్వని కూడా వినవయ్యా!” అనే ధ్వని ఉంది. గంట కొడితే వచ్చే చెవులు భరించలేని టంకార ధ్వనికంటే దాని ఝంకార ప్రతిధ్వని ఆహ్లాదం కలిగిస్తుంది. ధ్వని – వాచ్య,లక్షణార్థాలకంటే చమత్కారాన్ని కలిగించి ఆనందాన్నిస్తుంది . ఈపద్యంలో ఆధ్వని ఉంది.

ఎప్పుడో ఒకప్పుడు అందరం మృత్యుకౌగిలి పొందవలసిన వాళ్లమే, మృత్యుంజయ మంత్రమును చదివినంత మాత్రాన, “మృత్యుంజయా!” అని సంబోధించినంత మాత్రమున మృత్యువును జయించి చిరంజీవులం కాలేము కాదా! అని కొందరికి సందేహం వస్తుంది. ఈ జన్మలోనే ముక్తిని పొందడం మృత్యుంజయత్వం. ముక్తిని పొందితే చావును జయించినట్లే కదా! పండిన దోసకాయ తొడిమ నుండి ఎలా అలవోకగా విడివడుతుందో, శివానుగ్రహము వలన కలిగే జ్ఞానముతో – ఈ జన్మ ప్రాపంచికతలనుండి విడివడి ముక్తిని పొందుతుంది. ఆ అందుకే జ్ఞానము పొందటానికే మృత్యుంజయ మంత్రోపాసన ఎంతగా ఉపకరిస్తుందో అంతగా. ఈ మాధవపెద్దివారి మృత్యుంజయ శతక రచన కూడా సహాయపడుతుంది.

మాధవపెద్ది బుచ్చి సుందరరామశాస్త్రి గారు 1895 సం.లో గుంటూరు జిల్లా

బ్రాహ్మణకోడూరు గ్రామమున జన్మించారు. 1950 ఫిబ్రవరి 6 న మరణించారు. రూపానికి వామనమూర్తియైనా, సాహిత్యంలో భావ విశ్వరూపం చూపించిన కవి బుచ్చి సుందరరామశాస్త్రి .

ఒకసారి గూడూరి వియ్యన్న గారింట్లో మాధవపెద్ది బుచ్చి సుందరరామశాస్త్రి గారు, వేదుల సత్యనారాయణ శాస్త్రి గారు, కాటూరి వెంకటేశ్వరరావు గారు, దేవులపల్లి కృష్ణశాస్త్రి గారు, రాచకొండ నరసింహమూర్తిగారు, విశ్వనాథ సత్యనారాయణ గారు మాట్లాడుకుంటున్నారు.

ప్రసంగవశాత్తూ "నా పుస్తకాలు అంకితం పుచ్చుకున్న వాడెవడూ సవ్యంగా బతికి బట్ట కట్టలేదు." అంటూ విశ్వనాథ తన పుస్తకాలు అంకితం తీసుకొన్నవారికి ఎవరెవరికి ఎంతెంత కష్టాలు వచ్చినదీ చెప్పడం ప్రారంభించారు. దీనిని పద్యంలో ఒక్కొక్కరు ఒక్కొక్క పాదంగా చెప్పండని విశ్వనాథ తన కవి మిత్రులను కోరారు. "పండు వంటి గృహస్థు పైడిపాట్యగ్రహా/రికుడు నీ కృతిచె దరిద్రుడయ్యె" బెల్లంకొండ రామదాసు గారు దరిద్రుడయ్యాడన్న విషయాన్ని చెబుతూ మాధవపెద్ది బుచ్చిసుందరరామశాస్త్రి గారు ధైర్యంగా విశ్వనాథ కోరిన పద్యాన్ని ప్రారంభించారట. ఈ విషయ ప్రస్తావన ఎందుకంటే రచనలో వారి తడుముకోని ధైర్యగుణప్రస్తావనకు.

తెనాలిలో ఒక సబ్ ఇనస్పెక్టర్ గారింట్లో పెళ్లి వచ్చింది. అది ఆయన కుమారుని వివాహం. పెళ్లి కుమార్తెది గుంటూరు. ఇన్స్పెక్టర్ గారు లగ్నానికి నాలుగు రోజులు ముందుగా బుచ్చి సుందరరామశాస్త్రిగారిని కలుసుకొని శుభలేఖ ఇచ్చి "తమరు తప్పకుండా కల్యాణానికి దయచేసి వధూవరులను ఆశీర్వదించాలి" అన్నారు. శాస్త్రిగారు "ఆహా, మీ ఇంట్లో పెళ్ళికి రాకుండా వుంటానా? తప్పకుండా వస్తానన్నారు" ఇన్స్పెక్టర్ గారు ఎంతో సంతోషించి పదిహేను రూపాయలు చేతిలో పెట్టి "ఏమి అనుకోకండి. మీరు బస్సుల్లో రాలేరు. రైల్ లో ఫస్ట్ క్లాసులో రండి" అన్నారు.

శాస్త్రిగారు "మీరు డబ్బివ్వాలా! అలాగే వస్తాను, తప్పకుండా వస్తాను" అన్నారు. ఇన్స్పెక్టర్ గారు బలవంతంగా శాస్త్రిగారి గుప్పెట మూసి వెళ్లిపోయారు. పెళ్లి రోజు శాస్త్రి గారికి జ్ఞాపకమే లేదు. పదిహేను రూపాయలు పులుసు లో పడిపోయాయి. రెండురోజుల తరువాత ఒకనాటి పొద్దున్న శాస్త్రిగారు కాఫీహోటల్కి వెడుతున్నారు. కొంచెందూరం వెళ్ళేసరికి ఇన్స్పెక్టర్గారు ఎదురుగా సైకిల్ మీద రావడం చూసారు శాస్త్రిగారు. తప్పుకోవడానికి సందులుగూడా లేవు. గత్యంతరం లేక శాస్త్రిగారు తలవంచుకొని నడిచారు. "సబిన్స్పెక్టర్ ఏదో పనివుండి పొద్దున్నేబయలు దేరాడు, ఆగుతాడా?" అనుకొన్నారు. అంతగా చూస్తే సలాం కొట్టి ముందుకు సాగిపోదాం అనుకొన్నారు. కాని ఇన్స్పెక్టర్ గారు దగ్గరగా వచ్చి సైకిల్ దిగారు.

"శాస్త్రి గారూ నమస్కారం 'అన్నారు. శాస్త్రి గారికి కొంచెం వణుకు పుట్టింది. మాటల్లో నత్తి కూడా వచ్చింది. అలాగే ధైర్యం చేసి "ఆరోజు నాకు హఠాత్తుగా జ్వరంవచ్చింది. హండ్రెడ్ దాటింది. అందువల్ల రాలేకపోయాను. మీరు సొమ్ము కూడా ఇచ్చారు" అని జేబులో చెయ్యి పెట్టారు.

ఇన్స్పెక్టర్ గారు శాస్త్రిగారి చెయ్యి గభాలునగుంజి "బాగుంది మీరు చేసేపని! జ్వరం వచ్చి రాలేకపోయారు. దానికేమి చేస్తాం? అందుకని డబ్బు వాపసు చేస్తారా? ఉంచండి, ఉంచండి" అన్నారు. "అదేమీ బాగుంటుంది? వచ్చి పద్యాలుచదవకపోగా డబ్బు కూడా తీసుకోనా?" అని శాస్త్రిగారు జేబులోకి చెయ్యి పోనిచ్చారు. ఇనస్పెక్టర్గారు చేయి మళ్లీ ఇవతలకు లాగి "మీరు ఒకపని చేయండి. పెళ్ళికూతురూ, పెళ్ళికొడుకు ఇక్కడే వున్నారు. ఇవాళ మధ్యాన్నం మా ఇంటికి భోజనానికి రండి.

వధూవరులను దీవించండి. ఎంతో సంతోషిస్తాం. అన్నారు శాస్త్రిగారు. "దానికేం తప్పకుండా వస్తా! ఇవాళ జ్వరం లేదు" అన్నారు. "పదకొండు గంటలకు కానిస్టేబుల్ మీఇంటికి జట్కా తెస్తాడు" అని ఆయన వెళ్లిపోయారు.

శాస్త్రి గారి గుండెలు కొంచెం కుదుటబడ్డాయి. నిజానికి ఆయన జేబులో రూపాయికి కొంచెం తక్కువగా చిల్లరడబ్బులు మాత్రమే వున్నాయి. ఇన్స్పెక్టర్ గారు చెయ్యి గుంజకపోతే ఏమయ్యేదోనని శాస్త్రిగారు తనలో నవ్వుకొన్నారు. కానిస్టేబుల్ కూడా వస్తానన్నాడు కనక పదకొండుగంటలకు ఇంటి దగ్గరే వున్నారు. జట్కాలో ఎక్కి వారింటికి వెళ్ళారు. సుష్టుగా భోంచేసి వధూవరుల్ని ఆశువుగా ఆశీర్వదించారు. గొంతెత్తి వారు పద్యాలు పాడడంతో ఇన్స్పెక్టర్ గారికి ఆనందబాష్పాలు కురిశాయి. నూతన వస్త్రాలు పెడదామనుకొన్న వారు మనసు మార్చుకొని అర్ధనూటపదహార్లిచ్చి మళ్లి జట్కాలో ఇంటికి పంపించారు.

ఈ వృత్తాంతమంతా చక్కటి కథ లాగా చెప్పి "బాకీ తీరింది బహుమతి లభించింది" అన్నారు శాస్త్రి గారు. "కల్యాణానికి వెడితే పదిమందిలో ఒక్కణ్ణి అయ్యేవాణ్ణి. ఇంతఘనత దక్కేదికాదు" అన్నారాయన అరచేతితో పొట్ట సవరించుకొంటూ.

మాధవపెద్దివారు ఇంతటి హాస్యచతురులు. కాని వారి మృత్యుంజయ శతకాన్ని చదివిన తర్వాత కాటూరి వేంకటేశ్వరరావు గారు వారిని "సంస్కార వృద్ధు"డంటూ పరవశించి ఇలా వ్రాసారు.

బుచ్చన్నా!

ఎంతపనిచేసావు! చిరంజీవి నమశ్శివాయ కోరికపై 'ఒక లంబోదరుడైన పుత్రకుడు' అంటూ ఆషామాషీగా ఆరంభించినదెల్లా – అగాధతలాలనూ, ఉన్నతశిఖరాలనూ అంటి, అష్టోత్తరశతంచేసి, చివరకు 'ఏరో వెన్నెలచీకటుల్ గలసినట్లీ పర్వతాగ్రాన నున్నారే!' అంటూ మమ్మెక్కడికి తీసుకెళ్లి వదిలావంటేనూ! నీ హాస్యతరంగాల అడుగున, ఇంతటి సంస్కారపరిణతీ, ఇంతటి శాంతరసగర్భమూ వున్నదనుకోలేదు. పంచవటితోనే తలమున్కలై, శబరితో కాలు నిలువద్రొక్కుకోలేకపోతున్న మాకు ఈ మృత్యుంజయముతో 'నావంబోలి ప్రయాణమైనది మహానంద ప్రవాహమ్ములో భావంబెచ్చటికో!' మా బుచ్చయ్య ఇంతటి సంస్కారవృద్ధుడైనా, నువ్వు చెప్పినట్లు 'పెద్దంజేయ మనస్కరింపదు నిన్ను.' మా యీ చనవును మన్నించవూ? 'ఆ ధావళ్యంతో కన్నులు పగిలిపోతూ' కూడా 'బాబుగారూ' అంటూ నవ్వుతూ ఎదురువచ్చే నిన్నెప్పుడు కౌగిలించుకుంటానా అని యెదురుచూచే మచిలీపట్టణం మిత్రుడు, కాటూరి వేంకటేశ్వరరావు. 10–1–46,

కాటూరి వారు పరవశించిన మృత్యుంజయ శతక పద్య పూర్తి పాఠాలను భావాలతో మనం కూడా తెలుసుకొని ధన్యులమవుదాం.

**పెద్దంజేయ మనస్కరింపదు నినున్, బిడ్డన్ వలెన్ జూచుచున్**
**ముద్దున్ జేయుచు ముచ్చటాడుకొనుచు న్మూపందు నన్మోయుచున్**
**సుద్దుల్ సెప్పుచుఁ జెప్పిన న్వినుచు నిన్ జొక్కించుచుం జొక్కుచున్**
**బ్రొద్దుల్ పుచ్చుటలున్నఁజాలు నితరంబున్ గోర, మృత్యుంజయా!** **14**

ఓ శివా! నిన్ను పెద్దను చేయటానికి నా మనస్సు ఇష్టపడదు. బిడ్డలాగా చూచుకోవాలనిపిస్తోందని వాత్సల్య భక్తిని ప్రకటించారు.

**ఒక లంబోదరుఁడైన పుత్రకుఁడు మున్నున్నట్టిదే నీకుఁ జా**
**లక కాఁబోలును సృష్టిఁజేసితివి యీ లంబోదరుంగూడఁ, దీ**
**గకుఁ గాయల్ బరువౌన కాని, కుడుముల్ గల్పించి యవ్వాని కే**
**లొకొ యివ్వానికి నొక్కమైని యిడుముల్ మొల్పింతు, మృత్యుంజయా! 19**

దీర్ఘమైన పొట్టకలిగిన లంబోదరుడు (వినాయకుడు) ఒకడు నీకు కొడుకుగా చాలలేదా? ఈ మాధవపెద్ది అనే ఇంకో లంబోదరుని కూడా సృష్టి చేసావు. తీగకు కాయలు బరువులు కాదు కాని, ఆ లంబోదరునికి (వినాయకునికి) కుడుములు ఇచ్చావు. ఈ లంబోదరునికి ఇడుములు (దరిద్రాలు, కష్టాలు) ఇచ్చావు. ఎందుకయ్యా!

**నావంబోలి ప్రయాణమైనది మహానందప్రవాహమ్ములో**
**భావం బెచ్చటికో, కను ల్పగిలిపోవంజొచ్చు ధావళ్యమే!**
**లావణ్యం బతిగణ్యమే! యెటులు కైలాసమ్మొకో బొందినే!**
**కైవల్యంబొకొ జీవముండఁగనె! నిక్కమ్మొక్కొ, మృత్యుంజయా! 107**

"శివా! నా కవితా భావము మహానంద ప్రవాహములో నావ లాగా ఎక్కడికో ప్రయాణము మొదలుపెట్టింది. కళ్లు పగిలిపోయేటంత తెల్లదనము. ఆ సౌందర్యము లెక్కలకు అందనిది. బొందితో కైలాసాన్ని నేను చూస్తున్నానా స్వామీ! జీవించి ఉండగానే ముక్తి లభిస్తోందా? నిజమేనా?"

**ఏరో వెన్నెల చీఁకటు ల్గలసిన ట్లీపర్వతాగ్రాన ను**
**న్నారే! యొక్కరిలోన నింకొకరు లీనంబౌచు నున్నట్టులున్**
**వేరౌచున్నటు కానుపించెదరె! కానీ, వారికే వారు ప**
**ట్టీరే! యాదిపురాణదంపతులు కారే వారు! మృత్యుంజయా! 108**

ఎవరు వారు? వెన్నెల చీకటి కలసినట్లు (శివుడు తెలుపు. పార్వతి నలుపు) ఈ పర్వతము చివర ఉన్నారు?! ఒకరిలో ఇంకొకరు లీనమవుతున్నట్లు, వేరు పడుతున్నట్లు రెండు రకాలుగా కనబడుతున్నారు. భక్తులకు – వారికి వారే – అనుగ్రహించి కావలసిన స్థానాన్ని – అవకాశాన్ని (పట్టు) అనుగ్రహిస్తారు కదా! ఆదిదంపతులైన పార్వతీపరమేశ్వరులు కదా వారు!

**చూడంజూడ మహాశ్మశానమనిపించున్ నాకు నీ లోక, మిం**
**దేడన్ గాలిడబోవ నేరిపయినో యే వేయుచున్నట్టులే**
**లో దక్కయ్యెడిగాని నీ మహిమ యాలోనే నివారించి, నీ**
**క్రీడారంగమటన్న మాట స్మృతికిం గీలించు మృత్యుంజయా!"**

మహాద్భుతమైన ధారతో, చదవగానే ఒంటిని ఒకవిధమైన జలదరింపుకు గురిచేసే పద్యం ఇది. అబ్బూరి వరదరాజేశ్వరరావు గారు ఈ పద్య నేపథ్యాన్ని ఇలా వివరించారు. ('కవన కుతూహలం')

ఒక సాయంత్రం అబ్బూరి, సుందరరామశాస్త్రిగారూ తెనాలిలో కాలవ పక్కనుంచి నడిచి వెళ్తున్నారట. సుందరరామశాస్త్రిగారు కాళ్ళకి చెప్పులు గూడా లేవు. నడుస్తుండగా దారిలో

సుందరరామశాస్త్రి గారి పాదం కాలువ ఒడ్డున ఉన్న రెండు, మూడు బొమికల మీద పడబోతుండగా అబ్బూరి, చూసి, ఆపారు. అప్పుడు సుందరరామశాస్త్రిగారు అబ్బూరి వారి భుజం మీద చేయి వేసారు. చూపులను ఆకాశంవైపు తిప్పి

> **"చూడంజూడ మహాశ్మశానమనిపించున్ నాకు నీ లోక, మిం**
> **దేడన్ గాలిడబోవ నేరిపయినో యే వేయుచున్నట్టులే**
> **లో దక్కయ్యెడిగాని నీ మహిమ యాలోనే నివారించి, నీ**
> **క్రీడారంగమటన్న మాట స్మృతికిం గీలించు మృత్యుంజయా!"**

పద్యం అందుకొన్నారు. శాస్త్రిగారి ఆలాపనలో ఈ పద్యం వింటుంటే 'కాళ్ళు వణికినై, భయం వేసింది' అని వ్రాసారు వరదరాజేశ్వరరావుగారు.

ఓ శివా! నాకు చూడగా చూడగా ఈ లోకము మహాశ్మశానమనిపిస్తోంది. ఎక్కడ కాలు వేయబోగా, ఎవరి మీదనో కాలు వేసిన భ్రాంతి కలుగుతోంది. అంతలోనే నీ మహిమ – ఇది నీ క్రీడారంగమనే మాటను మనస్సుకు కలిగిస్తోంది. "కుడి చనుబాలు ద్రావు పసికూనను దాని యనంగు తల్లి తా/ నెడమకు ద్రిప్పి చన్గుడువనిచ్చెడు నంతటిలోన బిడ్డయె/వ్వడవున బోరు పెట్టు బ్రతిప్రాణియు నట్టులె యీ ప్రపంచమున్/ విడి పరమేగునా నడుమ వేదన పాలగుగాదె ప్రేయసీ!" అని మాధవపెద్ది గారన్నారు." (నీడలూ జాడలూ, పేజీ 18.) ఆ పరిణతి పొందిన మనస్సు ఇలా వారిచే అనిపించింది.

మృత్యుంజయ శతకములోని భావతాదాత్మ్యము రాను రాను – అక్షరాలను దాటి అంతరంగంలోని కాంతులను పలకరిస్తుంది.

శివునికి, జీవునికి మధ్య ఉన్న కనబడని తెరలను తొలగిస్తుంది. ఒక రచన సాధించే ప్రయోజనం ఇంతకంటె ఏముంటుంది? ✦

---

# శాంతి మంత్రం

**ఓం ఆప్యాయన్తు మామాంగాని వాక్ ప్రాణశ్చక్షుః శ్రోత్రమథో బలమింద్రియాణి చ సర్వాణి ।**
**సర్వం బ్రహ్మోపనిషదం మాఽహం బ్రహ్మనిరాకుర్యాం మా మా బ్రహ్మ నిరాకరోదనిరాకరణ**
**మస్త్వనిరాకరణం మేఽస్తు । తదాత్మని నిరతే య ఉపనిషత్సు ధర్మాస్తే మయి సన్తు తే మయి సన్తు ॥**
**ఓం శాంతిః శాంతిః శాంతిః ॥**

మమ = నాయొక్క; అంగాని = అవయవాలు; ఆప్యాయన్తు = బలోపేతములగుగాక; అథో = ఇంకా; వాక్ = వాక్కు; ప్రాణః = ప్రాణం; చక్షుః = కన్ను; శ్రోత్రమ్ = చెవి; బలమ్ = శక్తి; సర్వాణి = అన్ని; ఇంద్రియాణి = ఇంద్రియాలు; చ = కూడ; ఔపనిషదమ్ = ఉపనిషత్తులలో చెప్పబడిన; బ్రహ్మ = భగవంతుడు; సర్వమ్ = యావత్తు; అహమ్ = నేను; బ్రహ్మ = బ్రహ్మన్ని; మా నిరాకుర్యామ్ = నిరాకరింపకుందును గాక; అనిరాకరణమ్ = నిరాకరించకుండడం; మే = నా పట్ల; అస్తు = ఉండుగాక; ఉపనిషత్సు = ఉపనిషత్తులలో; యే = ఏవి; ధర్మాః = ఉత్తమగుణాలు; (సన్తి = ఉన్నవో) తే = అవి అన్నీ; తదాత్మని విరతే = ఆ ఆత్మలో శ్రద్ధగల; మయ = నా యందు; సన్తు = ఉండుగాక.



# శ్రీఛిన్నమస్తాస్తోత్రమ్

శ్రీగణేశాయ నమః

ఆనన్దయిత్రి పరమేశ్వరి వేదగర్భే - మాతః పురన్దరపురాన్తరలబ్ధనేత్రే ।
లక్ష్మీమశేషజగతాం పరిభావయన్తః - సన్తో భజన్తి భవతీం ధనదేశలబ్ధ్యై ॥ 1

లజ్జానుగాం విమలవిద్రుమకాన్తికాన్తాం - కాన్తానురాగరసికాః పరమేశ్వరి త్వామ్ ।
యే భావయన్తి మనసా మనుజాస్త ఏతే - సీమన్తినీభిరనిశం పరిభావ్యమానాః ॥ 2

మాయామయీం నిఖిలపాతకకోటికూటవిద్రావిణీం
భృశమసంశయినో భజన్తి ।
త్వాం పద్మసున్దరతనుం తరుణారుణాస్యాం
పాశాఙ్కుశాభయవరాద్యకరాం వరాస్త్రైః ॥ 3



తే తర్కకర్కశధియః శ్రుతిశాస్త్రశిల్పైశ్ఛన్దోఽ -
భిశోభితముఖాః సకలాగమజ్ఞాః ।
సర్వజ్ఞలబ్ధవిభవాః కుముదేన్దువర్ణాం
యే వాగ్భవే చ భవతీం పరిభావయన్తి ॥ 4

వజ్రపణున్నహృదయా సమయద్రుహస్తే
వైరోచనే మదనమన్దిరగాస్యమాతః ।
మాయాద్వయానుగతవిగ్రహభూషితాఽసి
దివ్యాస్త్రవహ్నివనితానుగతాఽసి ధన్యే ॥ 5

వృత్తత్రయాష్టదలవహ్నిపురఃసరస్య - మార్తణ్డమణ్డలగతాం పరిభావయన్తి ।
యే వహ్నికూటసదృశీం మణిపూరకాన్తస్తే - కాలకణ్టకవిడమ్బనచఞ్చవః స్యుః ॥ 6

కాలాగరుభ్రమరచన్దనకుణ్డగోల- ఖణ్డైరనఙ్గమదనోద్భవమాదనీభిః ।
సిన్దూరకుఙ్కుమపటీరహిమైర్విధాయ - సన్మణ్డలం తదుపరీహ యజేన్మృడానీమ్ ॥ 7

చఞ్చత్తడిన్మిహిరకోటికరాం విచేలా- ముద్యత్కబన్ధరుధిరాం ద్విభుజాం త్రినేత్రామ్ ।
వామే వికీర్ణకచశీర్షకరే పరే తామీడే - పరం పరమకర్త్రికయా సమేతామ్ ॥ 8

కామేశ్వరాఙ్గనిలయాం కలయా - సుధాంశోర్విభ్రాజమానహృదయామపరే స్మరన్తి ।
సుప్తాహిరాజసదృశీం పరమేశ్వరస్థాం - త్వామాద్రిరాజతనయే చ సమానమానాః ॥ 9

లిఙ్గత్రయోపరిగతామపి వహ్నిచక్ర- పీఠానుగాం సరసిజాసనసన్నివిష్టామ్ ।
సుప్తాం ప్రబోధ్య భవతీం మనుజా - గురూక్తహూఙ్కారవాయువశిభిర్మనసా భజన్తి ॥ 10

శుభ్రాసి శాన్తికకథాసు తథైవ పీతా - స్తమ్భేరిపోరథ చ శుభ్రతరాసి మాతః ।
ఉచ్చాటనేఽప్యసితకర్మసుకర్మణి త్వం - సంసేవ్యసే స్ఫటికకాన్తిరనన్తచారే ॥ 11

త్వాముత్పలైర్మధుయుతైర్మధునోపనీతైర్గవ్యైః
పయోవిలులితైః శతమేవ కుణ్డే ।
సాజ్యైశ్చ తోషయతి యః పురుషస్త్రిసన్ధ్యం
షణ్మాసతో భవతి శక్రసమో హి భూమౌ ॥ 12

జాగ్రత్స్వపన్నపి శివే తవ మన్త్రరాజమేవం - విచిన్తయతి యో మనసా విధిజ్ఞః ।
సంసారసాగరసమృద్ధరణే వహిత్రం చిత్రం - న భూతజననేఽపి జగత్సు పుంసః ॥ 13

ఇయం విద్యా వన్ద్యా హరిహరవిరిఞ్చిప్రభృతిభిః
పురారాతేరన్తః పురమిదమగమ్యం పశుజనైః ।
సుధామన్దానన్దైః పశుపతిసమానవ్యసనిభిః
సుధాసేవ్యైః సద్భిర్గురుచరణసంసారచతురైః ॥ 14

కుణ్డే వా మణ్డలే వా శుచిరథ మనునా భావయత్యేవ మన్త్రీ
సంస్థాప్యోచ్చైర్జుహోతి ప్రసవసుఫలదైః పద్మపాలాశకానామ్ ।
హైమం క్షీరైస్తిలైర్వాం సమధుకకుసుమైర్మాలతీబన్ధుజాతీశ్వేతైరబ్ధం
సకానామపి వరసమిధా సమ్పదే సర్వసిద్ధ్యై ॥ 15

అన్ధః సాజ్యం సమాంసం దధియుతమథవా యోఽన్వహం యామినీనాం
మధ్యే దేవ్యై దదాతి ప్రభవతి గృహగా శ్రీరముష్యావఖణ్డా ।
ఆజ్యం మాంసం సరక్తం తిలయుతమథవా తణ్డులం పాయసం వా హుత్వా
మాంసం త్రిసన్ధ్యం స భవతి మనుజో భూతిభిర్భూతనాథః ॥ 16

ఇదం దేవ్యాః స్తోత్రం పఠతి మనుజో యస్త్రిసమయం
శుచిర్భూత్వా విశ్వే భవతి ధనదో వాసవసమః ।
వశా భూపాః కాన్తా నిఖిలరిపుహన్తుః సురగణా
భవన్త్యుచ్చైర్వాచో యదిహ నను మాసైస్త్రిభిరపి ॥ 17

ఇతి శ్రీశఙ్కరాచార్యవిరచితః ప్రచణ్డచణ్డికాస్తవరాజః సమాప్తః ॥ ✦

---

# శాంతి మంత్రం

ఓం సహ నావవతు । సహ నౌ భునక్తు । సహ వీర్యం కరవావహై ।
తేజస్వినావధీతమస్తు మా విద్విషావహై ॥
ఓం శాంతిః శాంతిః శాంతిః శాంతిః ॥

సహనా = మనల నిద్దరినీ; అవతు = రక్షించుగాక!; సహనౌ = మన ఇద్దరినీ; భునక్తు = పోషించుగాక; సహ = కలసి; వీర్యమ్ = మిక్కిలి ఉద్యమంతో; కరవావహై = పరిశ్రమిస్తాముగాక; అధీతమ్ = స్వాధ్యాయం; నౌ = మనకు; తేజస్వి = తేజోవంతం; అస్తు = అగుగాక; మా విద్విషావహై = ద్వేషించుకొనకుందాం గాక!



# శ్రీ శివకవచ స్తోత్రమ్



ఓం అస్య శ్రీశివకవచస్తోత్రమహామంత్రస్య – ఋషభయోగీశ్వర ఋషిః అనుష్టుప్ఛందః – శ్రీసదాశివరుద్రో దేవతా – శ్రీం హ్రీం క్లీం బీజం – హ్రీం శక్తిః – రం కీలకం – శ్రీసదాశివప్రీత్యర్థే శివకవచస్తోత్రజపే వినియోగః –

**అథ న్యాసః**

ఓం నమో భగవతే జ్వలజ్జ్వాలామాలినే ఓం – ఓం – రం –
సర్వశక్తిధామ్నే – ఈశానాత్మనే **అంగుష్ఠాభ్యాం** నమః.
ఓం నమో భగవతే జ్వలజ్జ్వాలామాలినే ఓం – నం – రిం –
నిత్యతృప్తిశక్తిధామ్నే – తత్పురుషాత్మనే **తర్జనీభ్యాం** నమః.
ఓం నమో భగవతే జ్వలజ్జ్వాలామాలినే ఓం – మం – రుం –
అనాదిశక్తిధామ్నే – అఘోరాత్మనే **మధ్యమాభ్యాం** నమః
ఓం నమో భగవతే జ్వలజ్జ్వాలామాలినే ఓం – శిం – రైం –
స్వతంత్రశక్తిధామ్నే – వామదేవాత్మనే **అనామికాభ్యాం** నమః.
ఓం నమో భగవతే జ్వలజ్జ్వాలామాలినే ఓం – వాం – రౌం –
అలుప్తశక్తిధామ్నే – సద్యోజాతాత్మనే **కనిష్ఠికాభ్యాం** నమః
ఓం నమో భగవతే! జ్వలజ్జ్వాలామాలినే ఓం – యం – రః –
అనంతశక్తిధామ్నే – సర్వాత్మనే **కరతలకరపృష్ఠాభ్యాం** నమః.

ఓం నమో భగవతే జ్వలజ్జ్వాలామాలినే ఓం – ఓం – రం –
సర్వశక్తిధామ్నే – ఈశానాత్మనే **హృదయాయ** నమః.
ఓం నమో భగవతే జ్వలజ్జ్వాలామాలినే ఓం – నం – రిం –
నిత్యతృప్తిశక్తిధామ్నే – తత్పురుషాత్మనే **శిరసే స్వాహా.**
ఓం నమో భగవతే జ్వలజ్జ్వాలామాలినే ఓం – మం – రుం –
అనాదిశక్తిధామ్నే – అఘోరాత్మనే **శిఖాయై వషట్.**

ఓం నమో భగవతే జ్వలజ్జ్వాలామాలినే ఓం - శిం - రైం -
స్వతంత్రశక్తిధామ్నే - వామదేవాత్మనే **కవచాయ హుమ్.**
ఓం నమో భగవతే జ్వలజ్జ్వాలామాలినే ఓం - వాం - రౌం -
అలుప్తశక్తిధామ్నే - సద్యోజాతాత్మనే **నేత్రత్రయాయ వౌషట్.**
ఓం నమో భగవతే జ్వలజ్జ్వాలామాలినే ఓం - యం - రః -
అనంతశక్తిధామ్నే - సర్వాత్మనే అస్త్రాయ ఫట్.
ఓంభూర్భువస్సువరోమితి దిగ్బంధః.

**అథ ధ్యానమ్**

**మూ.** **వజ్రదంష్ట్రం త్రినయనం కాలకంఠమరిందమమ్ ।**
**సహస్రకరమత్యుగ్రం వందే శంభుముమాపతిమ్ ॥** 1

అథాపరం సర్వపురాణగుహ్యం నిశ్శేషపాపౌఘహరం పవిత్రమ్ ।
జయప్రదం సర్వవిపత్ప్రమోచనం వక్ష్యామి శైవం కవచం హితాయ తే ॥ 2

**ఋషభ ఉవాచ :**

నమస్కృత్య మహాదేవం విశ్వవ్యాపినమీశ్వరమ్ ।
వక్ష్యే శివమయం వర్మ సర్వరక్షాకరం నృణామ్ ॥ 3

శుచౌ దేశే సమాసీనో యథావత్కల్పితాసనః ।
జితేంద్రియో జితప్రాణశ్చింతయేచ్ఛివమవ్యయమ్ ॥ 4

హృత్పుండరీకాంతరసన్నివిష్టం స్వతేజసా వ్యాప్తనభోవకాశమ్ ।
అతీంద్రియం సూక్ష్మమనంతమాద్యం ధ్యాయేత్పరానందమయం మహేశమ్ ॥ 5

ధ్యానావధూతాఖిలకర్మబంధశ్చిరం చిదానందనిమగ్నచేతాః ।
షడక్షరన్యాససమాహితాత్మా శైవేన కుర్యాత్కవచేన రక్షామ్ ॥ 6

మాం పాతు దేవోఽఖిలదేవతాత్మా సంసారకూపే పతితం గభీరే ।
తన్నామ దివ్యం వరమంత్రమూలం ధునోతు మే సర్వమఘం హృదిస్థమ్ ॥ 7

సర్వత్ర మాం రక్షతు విశ్వమూర్తిః జ్యోతిర్మయానందఘనశ్చిదాత్మా ।
అణోరణీయానురుశక్తిరేకస్స ఈశ్వరః పాతు భయాదశేషాత్ ॥ 8

యో భూస్వరూపేణ బిభర్తి విశ్వం పాయాత్స భూమేర్గిరిశోఽష్టమూర్తిః ।
యోఽపాం స్వరూపేణ నృణాం కరోతి సంజీవనం సోఽవతు మాం జలేభ్యః ॥ 9

కల్పావసానే భువనాని దగ్ధ్వా సర్వాణి యో నృత్యతి భూరిలీలః ।
స కాలరుద్రోఽవతు మాం దవాగ్నేర్వాత్యాదిభీతేరఖిలాచ్చ తాపాత్ ॥ 10

ప్రదీప్తవిద్యుత్కనకావభాసో విద్యావరాభీతికుఠారపాణిః ।
చతుర్ముఖస్తత్పురుషస్త్రినేత్రః ప్రాచ్యాం స్థితో రక్షతు మామజస్రమ్ ॥ 11

కుఠారఖేటాంకుశపాశశూలకపాలఢక్కాఽక్షగుణాన్ దధానః ।
చతుర్ముఖో నీలరుచిస్త్రినేత్రః పాయాదఘోరో దిశి దక్షిణస్యామ్ ॥ 12

కుందేందుశంఖస్ఫటికావభాసో వేదాక్షమాలావరదాభయాంకః ।
త్ర్యక్షశ్చతుర్వక్త్ర ఉరుప్రభావస్సద్యోఽధిజాతోఽవతు మాం ప్రతీచ్యామ్ ॥ 13

వరాక్షమాలాభయటంకహస్తస్సరోజకింజల్కసమానవర్ణః ।
త్రిలోచనశ్చారుచతుర్ముఖో మాం పాయాదుదీచ్యాం దిశి వామదేవః ॥ 14

వేదాభయేష్టాంకుశపాశటంకకపాలఢక్కాక్షకశూలపాణిః ।
సితద్యుతిః పంచముఖోఽవతాన్మామీశాన ఊర్ధ్వం పరమప్రకాశః ॥ 15

మూర్ధానమవ్యాన్మమ చంద్రమౌళిః భాలం మమావ్యాదథ భాలనేత్రః ।
నేత్రే మమావ్యాద్భగనేత్రహారీ నాసాం సదా రక్షతు విశ్వనాథః ॥ 16

పాయాచ్ఛ్రుతీ మే శ్రుతిగీతకీర్తిః కపోలమవ్యాత్సతతం కపాలీ ।
వక్త్రం సదా రక్షతు పంచవక్త్రో జిహ్వాం సదా రక్షతు వేదజిహ్వః ॥ 17

కంఠం గిరీశోఽవతు నీలకంఠః పాణిద్వయం పాతు పినాకపాణిః ।
దోర్మూలమవ్యాన్మమ ధర్మబాహుర్వక్షస్థలం దక్షమఖాంతకోఽవ్యాత్ ॥ 18

మమోదరం పాతు గిరీంద్రధన్వా మధ్యం మమావ్యాన్మదనాంతకారీ ।
హేరంబతాతో మమ పాతు నాభిం పాయాత్కటీ ధూర్జటిరీశ్వరో మే ॥ 19

ఊరుద్వయం పాతు కుబేరమిత్రో జానుద్వయం మే జగదీశ్వరోఽవ్యాత్ ।
జంఘాయుగం పుంగవకేతురవ్యాత్పాదౌ మమావ్యాత్సురవంద్యపాదః ॥ 20

మహేశ్వరః పాతు దినాదియామే మాం మధ్యయామేఽవతు వామదేవః ।
త్రిలోచనః పాతు తృతీయయామే వృషధ్వజః పాతు దినాంత్యయామే ॥ 21

పాయాన్నిశాదౌ శశిశేఖరో మాం గంగాధరో రక్షతు మాం నిశీథే ।
గౌరీపతిః పాతు నిశావసానే మృత్యుంజయో రక్షతు సర్వకాలమ్ ॥ 22

అంతఃస్థితం రక్షతు శంకరో మాం స్థాణుస్సదా పాతు బహిఃస్థితం మామ్ ।
తదంతరే పాతు పతిః పశూనాం సదా శివో రక్షతు మాం సమంతాత్ ॥ 23

తిష్ఠంతమవ్యాద్భువనైకనాథః పాయాద్వ్రజంతం ప్రమథాధినాథః ।
వేదాంతవేద్యోఽవతు మాం నిషణ్ణం మామవ్యయః పాతు శివశ్శయానమ్ ॥ 24

మార్గేషు మాం రక్షతు నీలకంఠః శైలాది దుర్గేషు పురత్రయారిః ।
అరణ్యవాసాదిమహాప్రవాసే పాయాన్మృగవ్యాధ ఉదారశక్తిః ॥ 25

కల్పాంతకాలోగ్రపటుప్రకోపః స్ఫుటాట్టహాసోచ్చలితాండకోశః ।
ఘోరారిసేనార్ణవదుర్నివారమహాభయాద్రక్షతు వీరభద్రః ॥ 26

పత్త్యశ్వమాతంగఘటావరూథసహస్రలక్షాయుతకోటిభీషణమ్ ।
అక్షౌహిణీనాం శతమాతతాయినాం ఛింద్యాన్మృడో ఘోరకుఠారధారయా ॥ 27

నిహంతు దస్యూన్ప్రళయానలార్చిర్జ్వలత్రిశూలం త్రిపురాంతకస్య ।
శార్దూలసింహర్క్షవృకాదిహింస్రాన్ సంత్రాసయత్వీశధనుఃపినాకమ్ ॥ 28

దుస్స్వప్న దుశ్శకున దుర్గతి దౌర్మనస్య దుర్భిక్ష దుర్వ్యసన దుస్సహ దుర్యశాంసి ।
ఉత్పాతతాపవిషభీతిమసద్గ్రహార్తివ్యాధీంశ్చ నాశయతు మే జగతామధీశః. 29

ఓన్నమో భగవతే సదాశివాయ సకలతత్త్వాత్మకాయ సకలతత్త్వవిదూరాయ సకలలోకైకకర్త్రే సకలలోకైకభర్త్రే సకలలోకైకహర్త్రే సకలలోకైకగురవే సకలలోకైకసాక్షిణే సకలనిగమగుహ్యాయ సకలవరప్రదాయ సకలదురితార్తిభఞ్జనాయ సకలజగదభయంకరాయ సకలలోకైకశఙ్కరాయ శశాఙ్కశేఖరాయ శాశ్వతనిజావాసాయ నిర్గుణాయ నిరుపమాయ నీరూపాయ నిరాభాసాయ నిరామయాయ నిష్ప్రపఞ్చాయ నిష్కలఙ్కాయ నిర్ద్వన్ద్వాయ నిస్సంగాయ నిర్మలాయ నిర్గమాయ నిత్యరూపవిభవాయ నిరుపమవిభవాయ నిరాధారాయ నిత్యశుద్ధబుద్ధపరిపూర్ణసచ్చిదానన్దాద్వయాయ పరమశాన్తప్రకాశతేజోరూపాయ జయ జయ మహారుద్ర మహారౌద్ర భద్రావతార దుఃఖదావదారణ మహాభైరవ కాలభైరవ కల్పాన్తభైరవ కపాలమాలాధర ఖట్వాఙ్గఖడ్గచర్మపాశాఙ్కుశ డమరుశూలచాపబాణగదాశక్తిభిండిపాలతోమర ముసలముద్గరపట్టిశపరశుపరిఘభుశుండీశతఘ్నీచక్రాద్యాయుధభీషణకర సహస్రముఖ దంష్ట్రాకరాల వికటాట్టహాసవిస్ఫారితబ్రహ్మమణ్డల నాగేన్ద్రకుండల నాగేన్ద్రహార నాగేన్ద్రవలయ నాగేన్ద్రచర్మధర మృత్యుంజయ త్ర్యమ్బక త్రిపురాన్తక విరూపాక్ష విశ్వేశ్వర విశ్వరూప వృషభవాహన విషభూషణ విశ్వతోముఖ సర్వతో రక్షరక్ష మాం జ్వలజ్వల మహామృత్యు భయమపమృత్యుభయం నాశయ నాశయ రోగభయముత్సాదయోత్సాదయ విషసర్పభయం శమయశమయ చోరభయం మారయమారయ మమ శత్రూనుచ్చాటయోచ్చాటయ శూలేన విదారయవిదారయ కుఠారేణ భిన్ధిభిన్ధి ఖడ్గేన ఛిన్ధిఛిన్ధి ఖట్వాంగేన విపోథయవిపోథయ ముసలేన నిష్పేషయనిష్పేషయ బాణైః సంతాడయసంతాడయ రక్షాంసి భీషయభీషయ భూతాని విద్రావయవిద్రావయ కూష్మాణ్డబేతాలమారీగణబ్రహ్మరాక్షసాన్ సంత్రాసయ సంత్రాసయ మమాభయం కురుకురు విత్రస్తం మామాశ్వాసయాశ్వాసయ నరక భయాన్మాముద్ధారయోద్ధారయ సంజీవయసంజీవయ క్షుత్తృడ్భ్యాం మామాప్యాయ యాప్యాయయ దుఃఖాతురం మామానన్దయానన్దయ శివకవచేన మామాచ్ఛాదయాచ్ఛాదయ త్ర్యమ్బక సదాశివ నమస్తే నమస్తే నమస్తే ॥

ఓం భూర్భువస్సువరోమితి దిగ్విమోకః.

**ఋషభ ఉవాచ :**

ఇత్యేతత్కవచం శైవం వరదం వ్యాహృతం మయా ।
సర్వబాధాప్రశమనం రహస్యం సర్వదేహినామ్ ॥ 30

**ఫలశ్రుతిః :**

యస్సదా ధారయేన్మర్త్యః శైవం కవచముత్తమమ్ ।
న తస్య జాయతే క్వాపి భయం శంభోరనుగ్రహాత్ ॥ 31

క్షీణాయుః మృత్యుమాపన్నో మహారోగహతోఽపి వా ।
సద్యస్సుఖమవాప్నోతి దీర్ఘమాయుశ్చ విందతి ॥ 32

సర్వదారిద్ర్యశమనం సౌమంగల్యవివర్ధనమ్ ।
యో ధత్తే కవచం శైవం స దేవైరపి పూజ్యతే ॥ 33

మహాపాతకసంఘాతైర్ముచ్యతే చోపపాతకైః ।
దేహాంతే ముక్తిమాప్నోతి శివవర్మానుభావతః ॥ 34

త్వమపి శ్రద్ధయా వత్స శైవం కవచముత్తమమ్ ।
ధారయస్వ మయా దత్తం సద్యశ్శ్రేయో హ్యవాప్స్యసి ॥ 35

**సూత ఉవాచ :**

ఇత్యుక్త్వా ఋషభో యోగీ తస్మై పార్థివసూనవే ।
దదౌ శంఖం మహారావం ఖడ్గం చారినిషూదనమ్ ॥ 36

పునశ్చ భస్మ సంమంత్ర్య తదంగం పరితోఽస్పృశత్ ।
గజానాం షట్ సహస్రస్య ద్విగుణస్య బలం దదౌ ॥ 37

భస్మప్రభావాత్సంప్రాప్య బలైశ్వర్యధృతిస్మృతీః ।
స రాజపుత్రశ్శుశుభే శరదర్క ఇవ శ్రియా ॥ 38

తమాహ ప్రాంజలిం భూయస్స యోగీ నృపనందనమ్ ।
ఏష ఖడ్గో మయా దత్తస్తపోమంత్రానుభావితః ॥ 39

శితధారమిమం ఖడ్గం యస్మై దర్శయసి స్ఫుటమ్ ।
స సద్యో మ్రియతే శత్రుస్సాక్షాన్మృత్యురపి స్వయమ్ ॥ 40

అస్య శంఖస్య నిర్హ్రాదం యే శృణ్వంతి తవాహితాః ।
తే మూర్ఛితాః పతిష్యంతి న్యస్తశస్త్రా విచేతనాః ॥ 41

ఖడ్గశంఖావిమౌ దివ్యౌ పరసైన్యవినాశినౌ ।
ఆత్మసైన్యస్వపక్షాణాం శౌర్యతేజోవివర్ధనౌ ॥ 42

ఏతయోశ్చ ప్రభావేణ శైవేన కవచేన చ ।
ద్విషట్ సహస్రనాగానాం బలేన మహతాపి చ ॥ 43

భస్మధారణసామర్థ్యాచ్ఛత్రుసైన్యం విజేష్యసి ।
ప్రాప్య సింహాసనం పైత్ర్యం గోప్తాసి పృథివీమిమామ్ ॥ 44

ఇతి భద్రాయుషం సమ్యగనుశాస్య సమాతృకమ్ ।
తాభ్యాం సంపూజితస్సోఽథ యోగీ స్వైరగతిర్యయౌ ॥ 45

ఇతి శ్రీ స్కందపురాణే బ్రహ్మోత్తరఖండే
శ్రీ శివకవచస్తోత్రప్రభావవర్ణనం నామ ద్వాదశోఽధ్యాయః.

ఓం తత్సత్



శ్రీరంగకవి రచించిన

# త్రిపురాంబిక " చూర్ణిక"

అర్థ విశేషాలు - డా॥ తాడేపల్లి పతంజలి



శ్రీమత్కదంబతరు విడంబిత లస దంబురుహచర ద్వలమాన మానసౌక గరుత్ప్లవమాన ప్లవమాన భాసమాన కంకేళీ వనకేళీ సంజాత శ్రమబిందు కందళిత ముఖారవిందే! సంతతానందే!

సర్వ సర్వంసహాఖర్వ ధూర్వహ దుర్వార దర్వీకర గర్వ నిర్వాపణ చణ దోర్వల్లీ సమారోపిత మౌర్వీ నిర్భర నిర్ఘోష నిర్భిద్యమాన పూర్వామర గుర్వీణ్యుదర దరీ కుదుంగే! శౌర్యానుషంగే!

శుంభ దంభా మఖారంభ సమయ సముజ్జృంభిత దిక్కుంభి ప్రకటకట స్రవద్దానాసవ పానోదిత గానాధిక నానా మధుపానీకకులీనాంచిత వినీల పతత్ర ప్రభా భాసమానాసమానాలకాభిరామే! మరకతశ్యామే!

రంగదభంగ రణరంగ కళాభిషంగ చండముండాసురప్రకాండ ఖండ నోద్దం డాఖండల వేదండ తుండాయమాన భుజాదండ మండిత మండలాగ్ర రోచిః ప్రకీర్ణ బ్రహ్మాండ కరండే! చాముండే!

యుగవిగమావసర సముద్భూత ప్రవాత సంఘాత జీమూత మధ్య ధగద్ధగాయమాన సౌదామనీ ద్యుతి వినిర్మితి కోమల సంహనన విశేషే! అపహృతదోషే!

అసమసమయ వికసిత కుసుమ కిసలయ మసృణ ఘుసృణ విసరణ చరణాలంకరణ నిపుణ నూపుర కుహూరావ లయయుత కలకంఠ కంఠకలరవానుకూల పంచమస్వర గ్రామానుకరణ విపంచికా వల్లరీ నినాదామోదిత సకల దిశావకాశే! సుప్రకాశే!

తారాకర తారాధిప తారాద్రి సమీరాశన క్షీరాబ్ధి పటీరాంబుజ హీరాబ్జ సుధాధారా నిభ గౌరద్యుతి విద్యోతమాన యశోవిశాలే! శ్రీబాలే!

**చిదగ్నికుండికార్ణవ సంజాత భువనమోహినీ గేహినీ సమస్త కుల కౌలీ నిగర్భ రహస్యాతిరహస్య పరాపరరహస్య యోగినీ శ్రీమత్కౌమారగిరీంద్ర సౌవర్ణప్రాకార మధ్య విటంక విన్యస్త నిస్తుల ప్రశస్త మణిగణ వ్యాకీర్ణ మండపాభ్యంతర వితర్దికారంగ వలభికాయంత్ర పాంచాలికాయమాన ప్రమథగణసేవిత శ్రీ త్రిపురాంతకేశ్వరోత్సంగనివాసే! విశదహాసే!**

**సకల సుకవి వర్ణిత మృదుమధుర కవితా రచనాధురీణ భారతులాన్వయాంభోధి తుహినకర రంగయాభిధా నాంగ నాదె మాంబికా గర్భశుక్తి మౌక్తికాయమాన శ్రీరంగకవి విరచిత గద్యపద్యానుమోద మానసాంభోజే! నత సురసమాజే!**

**శ్రీత్రిపురాంబికాభిధే! యావతీర్ణజగదంబే! అధరజితబింబే! పులిననితంబే! శ్రీశ్రీ త్రిపురాంబే! సదా మాం పాహి, మాం పాహి.**

త్రిపురాంతకంలో కదంబవన పీఠేశ్వరిగా వెలసిన బాలా త్రిపుర సుందరిపై ఒక చూర్ణికను పందొమ్మిదవ శతాబ్దానికి చెందిన భారతుల పేరయ్య శాస్త్రి రచించారు. ఈయనకు శ్రీరంగకవి అని ఇంకోపేరు. కర్నూలు మండలంలోని అన్నసముద్ర గ్రామవాసి. కాలం పందొమ్మిదవ శతాబ్దం.

**చూర్ణిక లక్షణాలు :** లక్షణశిరోమణి మతమున వచనరచన అయిదురకాలు. గద్య, బిరుదుగద్య, చూర్ణిక, వచనము, విన్నపము. వీటిలో చూర్ణికలను కృష్ణమాచార్యుడు రచియించినట్లుగా చెప్పి తాళ్లపాక అన్నమాచార్యులవారు తమ సంకీర్తనలక్షణములో చూర్ణిక లక్షణాలు ఈ పద్యంలో చెప్పారు.

*ధర కృష్ణాచార్యాదిక - పరికల్పితపదము తాళబంధచ్ఛందో*
*విరహితమై చూర్ణాఖ్యం - బరగును నిర్యుక్తనామభాసితమగుచున్,*

చూర్ణిక ఛందస్సు లేనిది. నిర్యుక్తము అని ఇంకొక పేరు దీనికి ఉంది అని అన్నమయ్య వివరణ. పొత్తపి వేంకటరమణకవి లక్షణశిరోమణిలో చూర్ణిక లేకవచన ద్వివచన బహువచన సందర్భంబులుగ విభక్త్యానుశాసనిక సమాసాదిత కల్పనానల్పజల్పితంబై వెలయును అన్నాడు. ఏకవచన ద్వివచన బహువచన సందర్భాలతో, మనోహరమైన కల్పనలతో, విభక్తులను అనుశాసించుటకు తగినట్లుగ చూర్ణిక ఉంటుందన్నాడు.

ఇక చూర్ణికకు ప్రముఖ నిఘంటువులు ఇచ్చిన అర్థాలు ఇవి :

- 1. గద్యభేదము; 2. గ్రంథభేదము. (శబ్దరత్నాకరము బహుజనపల్లి సీతారామాచార్యులు 1912)
- A sort of harmonious prose, not divided into prosodial feet, but with the unbroken sentence running on continously. (బ్రౌణ్య తెలుగు-ఇంగ్లీష్ నిఘంటువు 1903)
- a kind of easy prose (శంకరనారాయణ తెలుగు-ఇంగ్లీష్ నిఘంటువు 1953)
- **'చూర్ణిక'** అంటే తేలిక పదాలతో కూర్చిన రచన అనే అర్థం కొంతమంది చెప్పారు. మల్లాది రామకృష్ణ శాస్త్రి గారయితే చూర్ణిక పదం బాగా నచ్చి ఒక చక్కటి కథ కూడా వ్రాసారు.

'మానాన్న చూశావ్. బయట పరమ సాధువు. ఇంట ఫాలాక్షుడు... ఎవరి మీదా కోపం

కాదు. ఎందుకో ఒకందుకని కాదు. ఎప్పుడు ఒకటే ధుమధుమ... అలా అని పెళ్లాన్ని వేపుక తినేవాడా... అక్కడ పిల్లి... నా మీద మాత్రం ఒంటికాలి మీద లేచేవాడు...' అంటూ తమాషాగా చమత్కారంగా చూర్ణికలోని ఒక పాత్ర చెబుతుంది.

ఈ నేపథ్యంలో మనం ఇప్పుడు శ్రీ దీపాల పిచ్చయ్య శాస్త్రిగారు తమ **చాటుపద్యరత్నాకరములో** ఉదహరించిన **బాలా త్రిపురసుందరి** ఉపాస్యదేవతగా కల శ్రీరంగ కవి చూర్ణికను అర్థ తాత్పర్య విశేషాలతో తెలుసుకొనే ప్రయత్నం చేద్దాం.

**శ్రీమత్కదంబతరు విడంబిత లస దంబురుహచర ద్వలమాన మానసౌక గరుత్పవమాన ప్లవమాన భాసమాన కంకేళీ వనకేళీ సంజాత శ్రమబిందు కందళిత ముఖారవిందే! సంతతానందే!**

**అర్థం :** శ్రీమత్ = సంపద గలిగిన, ఒప్పిదము గలిగిన; కదంబతరు = కడిమి చెట్టును; విడంబిత = అనుకరించు; లసత్ = ప్రకాశమానమైన; అంబురుహ = నల్లటి పద్మములందు; చరత్ = విహారము చేస్తూ; వలమాన = అటు ఇటూ తిరుగుచున్న; మానసౌక = హంస యొక్క; గరుత్ = ఱెక్క; పవమాన = వాయువులో; ప్లవమాన = తెప్పగా; భాసమాన = ప్రకాశించుచున్న; కంకేళీ = అశోకము; వనకేళీ = అడవిలో తిరుగుటచేత; సంజాత = పుట్టిన; శ్రమబిందు = శ్రమతో పుట్టిన చెమట బిందువులచే; కందళిత = చిగురించుచున్న, మొగ్గతొడుగుతున్న; ముఖారవిందే! = ముఖపద్మము కలదానా; **సంతతానందే!** = ఎప్పుడూ ఆనందము గొలుపుదానా! **ఆనందస్వరూపిణీ.**

**తాత్పర్యం :** సంపద గలిగిన కడిమి చెట్టును అనుకరించు ప్రకాశమానమైన నల్లటి పద్మములందు విహారము చేస్తూ అటు ఇటూ తిరుగుచున్న హంస యొక్క ఱెక్కవాయువులో తెప్పగా ప్రకాశించుచున్న అశోకములున్న అడవిలో తిరుగుట చేత పుట్టిన శ్రమతో కలిగిన చెమట బిందువులచే చిగురించుచున్న, మొగ్గతొడుగుతున్న ముఖపద్మము కలదానా! ఎప్పుడూ ఆనందము గొలుపుదానా! ఆనందస్వరూపిణీ! ఓ త్రిపురసుందరీ దేవీ! నీకు నమస్సులు.

**విశేషాలు :** పరమాత్ముడు కృష్ణావతారంలో స్నానం చేస్తున్న ఆడవారి వస్త్రాలను దొంగిలించి, సమీపంలోని కడిమిచెట్టు నెక్కి కూర్చున్నాడట. ఆ సమయంలో తాను చెట్టుగా జన్మించి నందుకు తనకు కలిగిన సంతాపాన్ని ఆ కడిమి చెట్టు పోగొట్టుకొని సంతోషాన్ని పొందిందని పోతన గారి వర్ణన. (భాగవతం. దశ. 818ప.)

"రాసే హరిమిహ విహిత విలాసం" అను ఒక అష్ట పదిలో జయదేవుడు విశద కదంబ తలే మిళితం కలి కలుష భయం శమయంతం/ మామపి కిమపి తరంగదనంగ దృశా మనసా రమయంతం" అన్నాడు. "సఖీ! కదంబ వృక్ష నీడలో చేరిన వాడు, కలియుగపాతకాలను పోగొట్టేవాడు, మన్మథ కామ దృష్టితో నన్ను సంతోష పెట్టేవాని యొక్క అందంగా ఆ పెదవిమీద ప్రకాశించే స్వామి మందహాసాన్ని నా మనస్సు ఈ పొదరింటిలో స్మరిస్తోంది" అని వ్రాసాడు. శ్రీకృష్ణునికి కదంబ వృక్షమంటే అంత ప్రేమ.

కదమ్బవనచారిణీం మునికదమ్బకాదమ్బినీం
నితమ్బజితభూధరాం సురనితమ్బినీసేవితామ్ ।
నవామ్బురుహలోచనామభినవామ్బుదశ్యామలాం
త్రిలోచనకుటుమ్బినీం త్రిపురసున్దరీమాశ్రయే ॥

అను ప్రసిద్ధమైన శ్లోకం కూడా అమ్మని కడిమి చెట్లయందు నివసించుదానిగా మొట్టమొదటి వర్ణన చేసింది. (కడిమి చెట్ల వనములో నివసించునదీ, మునిసముదాయమను కదంబవృక్షములను ఆనందింప చేయు మేఘమాలయైనదీ, పర్వతముల కంటే ఎత్తైన నితంబము కలదీ, దేవతాస్త్రీలచే సేవింపబడునదీ, తామరలవంటి కన్నులు కలదీ, తొలకరిమబ్బులా నల్లనైనదీ, మూడు కన్నులు కల పరమేశ్వరుని ఇల్లాలు అగు త్రిపురసుందరిని ఆశ్రయించుచున్నాను.)

త్రిపురాంతక స్థలపురాణాన్ని వివరించే బోర్డులో కూడా అమ్మ కదంబవన మధ్యంలో త్రిపురాంతక పీఠేశ్వరిగా వెలసినట్లు వ్రాయబడిఉంది. అందుకనే రంగకవి కూడా అమ్మవారి స్తోత్రాన్ని కడిమి చెట్టుతో ప్రారంభించాడు.

**సర్వ సర్వంసహాఖర్వ ధూర్వహ దుర్వార దర్వీకర గర్వ నిర్వాపణ చణ దోర్వల్లీ సమారోపిత మౌర్వీ నిర్భర నిర్ఘోష నిర్భిద్యమాన పూర్వామర గుర్విణ్యుదర దరీ కుడుంగే! శౌర్యానుషంగే!**

**అర్థం :** సర్వ = సమస్తమయిన; సర్వంసహా = భూమి; అఖర్వ = విస్తారమైన, గొప్పదైన; ధూర్వహ = భారము వహించు; దుర్వార = వారింపనలవికాని; దర్వీకర = ఆదిశేషుడను పాము యొక్క; గర్వ = గర్వమును; నిర్వాపణ = వధించు (పోగొట్టి); చణ = నేర్పు కలిగిన; దోర్వల్లీ = బాహువులనెడి తీగలయందు; సమారోపిత = అధిరోహించిన; మౌర్వీ = అల్లెత్రాటి యొక్క; నిర్భర = భరింపశక్యముకాని, అధికమయిన; గాఢమయిన; నిర్ఘోష = ధ్వని, నిర్భిద్యమాన = చీల్చుట; బయటఁబెట్టుట; పూర్వామర = తూర్పు, పడమరల దిక్కులనెడి; గుర్విణ్యుదర = చూలాలి ఉదరములనెడి; దరీ = గుహలలో విలసిల్లు; కుడుంగే = పొదరిల్లులాంటిదానా!; **శౌర్యానుషంగే!** = పరాక్రమముయొక్క చేరిక కలదానా!

**తాత్పర్యము :** సమస్తమయిన భూమి విస్తారమైన, గొప్పదైన భారము వహించు ఆదిశేషుడను పాము యొక్క గర్వమును పోగొట్టి, నేర్పు కలిగిన బాహువులనెడి తీగలయందు అధిరోహించిన అల్లెత్రాటి యొక్క అధికమయిన ధ్వని చేత బయటఁబెట్టుట; తూర్పు, పడమరల దిక్కులనెడి చూలాలి ఉదరములనెడి గుహలలోని పొదరిల్లుకలదానా! పరాక్రమముయొక్క చేరిక కలదానా! నీకు నమస్సులు.

**విశేషాలు :** ఈ భూమిని తానే మోస్తున్నానని ఆదిశేషునికి ఒక రకమైన గర్వముంది. నువ్వు అల్లెత్రాడు అలా సంధించావో లేదో, ఆ బ్రహ్మాండమయిన ధ్వని చేత దిక్కులన్నీ బ్రద్దలయ్యాయి. ఆదిశేషునికి తన సామర్థ్యమేపాటిదో తెలిసివచ్చిందని భావం.

**శుంభ దంభా మఖారంభ సమయ సముజ్జృంభిత దిక్కుంభి ప్రకటకట స్రవద్దానాసవ పానోదిత గానాధిక నానా మధుపానీకకులీనాంచిత వినీల పతత్ర ప్రభా భాసమానాసమానాలకాభిరామే! మరకతశ్యామే!**

**అర్థం :** శుంభ = శుంభుడను రాక్షసునియొక్క; దంభా మఖారంభ = కపటపుయజ్ఞములో ఆరంభించిన; సమయ = శపథము చేత; సముజ్జృంభిత = బాగా అతిశయించిన; దిక్కుంభి = దిక్కులనెడి ఏనుగులయొక్క; ప్రకట = ప్రసిద్ధమయిన; కట = చెక్కిళ్లనుండి; స్రవత్ = స్రవించు; దాన + ఆసవ = మదమను పక్వముచేయని చెఱుకురసముతో చేసిన మద్యమును; పాన + ఉదిత = త్రాగుట చేత పుట్టిన; గాన + అధిక = గానములచేత అధికమయిన; నానా = వివిధమైన; మధుప + అనీక = తుమ్మెదల సమూహముతో; మధుకులీన + అంచిత = ఆడుతుమ్మెదల సమూహముతో; వినీల = బాగా నల్లని;

పతత్ర = రెక్క; ప్రభా భాసమాన = బాగా ప్రకాశించే; అసమాన = సాటిలేని; అలకాభిరామే = అలకా + అభిరామే = ముంగురుల చేత మనోజ్ఞమైన దానా!; **మరకతశ్యామే!** = ఆకుపచ్చ నీలము అనిపించే నీలము కలగలిపిన మరకతమణి శరీరకాంతికలదానా!

**తాత్పర్యము :** శుంభుడను రాక్షసునియొక్క కపటపుయజ్ఞములో ఆరంభించిన శపథము చేత బాగా అతిశయించిన దిక్కులనెడి ఏనుగులయొక్క ప్రసిద్ధమయిన చెక్కిళ్లనుండి స్రవించుమదమను పక్వముచేయని చెఱుకురసముతో చేసిన మద్యమును త్రాగుటచేత పుట్టిన గానములచేత అధికమయిన ఉత్సాహము కలిగిన వివిధమైన; తుమ్మెదల నల్లని రెక్కలవలె బాగా ప్రకాశించే సాటిలేని ముంగురుల చేత మనోజ్ఞమైన దానా! ఆకుపచ్చ నీలము అనిపించే నీలము కలగలిపిన మరకతమణి శరీరకాంతికలదానా!

**విశేషాలు :** త్రిపురసుందరీదేవి ముంగురులు తుమ్మెద రెక్కలవలె నల్లగా ఉన్నాయని చెప్పుట కొరకు శుంభుడను వాడు చేసిన గర్వ యజ్ఞ ప్రసక్తి తెచ్చి భావసౌందర్యాన్ని కవి పెంచాడు. అమ్మ శుంభుని చంపి వాడి గర్వాన్ని పోగొట్టిందనే విషయం వివిధరీతులలో కవి చెప్పాడు.

హిరణ్యకశిపు వంశములో పుట్టిన సుందోపసుందుల కొడుకులు శుంభ నిశుంభులు. వీరు పుష్కర క్షేత్రమున బ్రహ్మనుగూర్చి ఉగ్రతపము చేసి ఇంద్రాదిసురలను పరిభవించు శక్తిని పొందారు. వీరు గౌరీకాయకోశమునుండి పుట్టిన కౌశికీదేవిచే చంపబడిరి.

**మరకతశ్యామ**లను దశ విద్యలలో (1. కాళి, 2. తార, 3. ఛిన్నమస్త, 4. శ్రీ, 5. భువనేశ్వరి, 6. భైరవి, 7. బగల, 8. ధూమ, 9. త్రిపురసుందరి, 10. మాతంగి.) మాతంగి అను ఒక దేవతగా చెబుతారు. విష్ణువుకు పది అవతారములు ఉన్నట్లే ఆ పరదేవతకు కూడా పది విద్యలు, పది దేవతలు కలరు. ఒక్కో దేవతను ఒక్కో రూపములో, ఒక్కో మంత్రముతో ఆరాధిస్తారు. ఈమె శ్యామల వర్ణముతో కూడి వుంటుంది. ఈమె త్రిపుర సుందరికి మంత్రిణి. ఈమెనే **మరకతశ్యామల** అని సంస్కృతమునందు, పచ్చైయమ్మన్ అని తమిళములోను పిలుస్తారు.

మతంగుని కొమార్తె అగుటచే మాతంగి అను పేరు అమ్మవారికి వచ్చింది. మతంగ మహర్షి కడిమి చెట్ల మధ్య, అడవిలో ధ్యానం చేస్తుండగా ఈ దేవత సాక్షాత్కరించింది. నూరు సంవత్సరాలు ఆ మహర్షి తపస్సు చేస్తే కాళీ దేవి శ్యామలయై సాక్షాత్కరించింది. కాళీ తీవ్రరూపమైతే, శ్యామలను కోమల రూపంగా చెబుతారు. మాతంగికి మరో పేరు శ్యామల.

ఈమెను ఆరాధించే కాళిదాసు మహాకవి అయినాడు. మాతా మరకతశ్యామా మాతంగీ *మధుశ్యాలినీ, కుర్యాత్ కటాక్షం కళ్యాణీ కదంబవనవాసినీ.* అని ఆయన చెప్పిన శ్లోకం ప్రసిద్ధమయినది.

ఆమె మధుశాలిని కూడా. అందుకే శ్రీరంగ కవి కూడా అమ్మని వర్ణిస్తూ ఈ పాదాలలో ఆసవ ప్రసక్తి తెచ్చాడు.

మధువు సుఖానికి సంకేతంగా ఒక సంస్కృతన్యాయంలో (మధు పశ్యసి దుర్బుద్ధే ప్రపాతం కిం న పశ్యసి) చెప్పబడింది.

మూఢుఁడా! తేనెనే చూచుచున్నావుగాని, పతనమును మాత్రము గమనించుట లేదు. ఒకఁడు చెట్టు చివరకొమ్మలో నున్న తేనెను సంపాదింపవలయునను పేరాసతో ప్రాకుచుండెనేగాని, అచటికొమ్మ విఱిగి తాను పడుటను మాత్రము గమినించుట లేదఁట. అట్లే– తుచ్ఛకామసుఖ మనుభవించు నిచ్ఛచే చేయరాని పనులలో నడుగిడుటయేగాని మూఢులు దానివలన సంభవించు నరకమును మాత్రము గుర్తించరు.

**రంగదభంగ రణరంగ కళాభిషంగ చండముండాసురప్రకాండ ఖండ నోద్దం డాఖండల వేదండ తుండాయమాన భుజాదండ మండిత మండలాగ్ర రోచిః ప్రకీర్ణ బ్రహ్మాండ కరండే! చాముండే!**

**అర్థం :** రంగత్ = ప్రకాశించే; అభంగ = భంగము లేని; రణరంగ = యుద్ధరంగ; కళ + అభిషంగ = కళను చేరిన; చండముండాసురప్రకాండ = చండముండులను; అసుర = రాక్షసులను; ప్రకాండ = చెట్టు బోదెలను (శ్రేష్ఠుడు); ఖండన = ఖండించుట యందు; ఉద్దండ + అఖండల = ఇంద్రునియొక్క; వేదండ = ఐరావతమును; తుండాయమాన = తొండమును లాగి సాగదీయుటలో; భుజాదండ = భుజదండముతో; మండిత = అలంకరింపబడిన; మండలాగ్ర = కత్తి యొక్క; రోచిః = వెలుగులో; ప్రకీర్ణ = వ్యాపించిన; బ్రహ్మాండ = బ్రహ్మాండమను; కరండే = భరణి కలదానా!; **చాముండే** = చాముండాదేవీ!

**తాత్పర్యము :** చాముండాదేవీ! యుద్ధరంగ కళలో ఆరితేరిన శుంభనిశుంభుల సేవకులయిన చండముండులను రాక్షసుల చెట్టు బోదెలను నువ్వు ఖండించే సమయములో ఇంద్రునియొక్క ఐరావతము ఉత్సాహంతో తొండమును లాగి సాగదీసింది. నీ భుజదండమును అలంకరించిన నీ కత్తి యొక్క వెలుగులో ఈ బ్రహ్మాండమంతా వ్యాపించి ఒక భరణి అయినది.

**యుగవిగమావసర సముద్భూత ప్రవాత సంఘాత జీమూత మధ్య ధగద్ధగాయమాన సౌదామనీ ద్యుతి వినిర్మితి కోమల సంహనన విశేషే! అపహృతదోషే!**

**అర్థం :** యుగ = యుగ; విగమ + అవసర = నాశన సమయములో; సముద్భూత = పుట్టిన; ప్రవాత = ప్రచండ మారుత; సంఘాత = గట్టి దెబ్బ, సమూహము; జీమూత మధ్య = మబ్బుల మధ్య; ధగద్ధగాయమాన = ధగద్ధగాయమానముగా వెలుగు; సౌదామనీ = మెరుపుల; ద్యుతి = కాంతితో; వినిర్మితి = చక్కగా నిర్మింపబడిన; కోమల సంహనన విశేషే! = కోమలమైన శరీర విశేషము కలదానా!; **అపహృతదోషే!** = పోగొట్టబడిన దోషములు కలదానా!

**తాత్పర్యము :** యుగాంతములో వచ్చే ప్రళయసమయములో ప్రచండ మారుతముల తాకిడి చేత మబ్బుల మధ్య ధగద్ధగాయమానముగా వెలుగు మెరుపుల కాంతితో చక్కగా నిర్మింపబడిన కోమలమైన శరీర విశేషము కలదానా! పోగొట్టబడిన దోషములు కలదానా!

**విశేషము :** శ్రీరంగ కవి గారి ఈ భావన చాలా కొత్తగా ఉంది. ప్రళయ కాలములోని మెరుపుల కాంతి అనూహ్యం. అటువంటి మెరుపుల కాంతితో త్రిపురసుందరీదేవి శరీరము నిర్మింపబడిందట. మళ్లీ ఆ శరీరము కోమలమయినదట. జయహో.

**అసమసమయ వికసిత కుసుమ కిసలయ మసృణ ఘుసృణ విసరణ చరణాలంకరణ నిపుణ నూపుర కుహూరావ లయయుత కలకంఠ కంఠకలరవానుకూల పంచమస్వర గ్రామానుకరణ విపంచికా వల్లరీ నినాదామోదిత సకల దిశావకాశే! సుప్రకాశే!**

**అర్థం :** అసమ = సమయము కాని; సమయ = సమయములో; (శ్రీవిద్యలోని సమయాచారము కూడా ఇక్కడ సూచ్యం. అమ్మ సమయాచారతత్పరా కదా!) వికసిత = వికసించిన; కుసుమ = పువ్వు యొక్క; కిసలయ = చిగురు; మసృణ = చిక్కని, నున్నని; ఘుసృణ = కుంకుమపువ్వు; విసరణ = వ్యాపించిన; చరణాలంకరణ = పాదములను అలంకరించిన; నిపుణ = నేర్పు కలిగిన; నూపుర = అందె; కుహూరావ = కోకిల ధ్వనుల; లయ యుత = లయతో కూడిన; కలకంఠ = కోకిలల; కంఠ కలరవానుకూల = పావురముల ధ్వనులకు అనుకూలముగా; పంచమస్వర = పంచమస్వరమును; గ్రామానుకరణ = షడ్జాదిస్వరమును అనుకరించు; విపంచికా = వీణ; వల్లరీ = తీగ; నినాదామోదిత = నినాదమును ఆమోదించిన; సకల దిశావకాశే! = అన్ని దిశల వకాశము కలదానా!; **సుప్రకాశే!** = చక్కటి ప్రకాశము కలదానా!

**తాత్పర్యం :** బాగా ప్రకాశము కలిగిన అమ్మ పాదాలు ఎర్రగా ఉన్నాయి. ఆ అమ్మవారి పాదాలను అలంకరించిన నేర్పు కలిగిన అందెల కోకిలలు, పావురాలు ధ్వనులు నేర్చుకోవటానికి అనుకూలంగా సహకరిస్తున్నాయి. వీణల నినాదాన్ని ఫర్వాలేదులే అని ఆ నూపుర ధ్వనులు మెచ్చుకొంటున్నాయట.

**విశేషాలు :** అమ్మవారి కాలి అందెల చప్పుడు మనోహరంగా కవి వర్ణించాడు. కోకిలల పంచమస్వరము, వీణల షడ్జాది స్వరము అమ్మ వారి అందెల మోతలో ఉన్నదని భావం.

**తారాకర తారాధిప తారాద్రి సమీరాశన క్షీరాబ్ధి పటీరాంబుజ హీరాబ్జ సుధాధారా నిభ గౌరద్యుతి విద్యోతమాన యశోవిశాలే! శ్రీబాలే!**

**అర్థం :** తారాకర = నక్షత్రముల సమూహము; తారాధిప = చంద్రుడు; తారాద్రి = హేమకూటపర్వతం; సమీరాశన = ఆదిశేషుడు; క్షీరాబ్ధి = పాలసముద్రము; పటీర + అంబుజ = చందనము, పద్మము; హీర = వజ్రము, అబ్జ = పద్మము; సుధా = అమృతము, ధారా = కత్తి అంచుతో; నిభ = సమానమైన; గౌరద్యుతి = తెల్లని కాంతితో; విద్యోతమాన = ప్రకాశించుచున్న; యశోవిశాలే! = విస్తారమైన కీర్తి కలదానా!; **శ్రీబాలే!** = శ్రీ బాలాంబికా! నమస్కారము.

**తాత్పర్యం :** కీర్తి తెల్లగా ఉన్నదనే కవి సమయాన్ని శ్రీరంగకవి ఈ పంక్తులలో కవి పాటించాడు. నక్షత్రముల సమూహము వలె, చంద్రుడు, పాలసముద్రము, చందనము, వజ్రము, అమృతము, కత్తి అంచుతో సమానమైన తెల్లని కాంతితో ప్రకాశించుచున్న విస్తారమైన కీర్తి కలదానా, శ్రీబాలాంబికా! నమస్కారము.

**చిదగ్నికుండికార్ణవ సంజాత భువనమోహినీ గేహినీ సమస్త కుల కౌలీ నిగర్భ రహస్యాతిరహస్య పరాపరరహస్య యోగినీ శ్రీమత్కౌమారగిరీంద్ర సౌవర్ణప్రాకార మధ్య విటంక విన్యస్త నిస్తుల ప్రశస్త మణిగణ వ్యాకీర్ణ మండపాభ్యంతర వితర్దికారంగ వలభికాయంత్ర పాంచాలికాయమాన ప్రమథగణసేవిత శ్రీ త్రిపురాంతకేశ్వరోత్సంగనివాసే! విశదహాసే!**

**అర్థం :** చిదగ్నికుండికార్ణవ సంజాత = బ్రహ్మ తేజస్సుకు ఒక ఆకారమైన చిత్ అను అగ్నికుండం నుండి పుట్టిన ("చిత్" అంటే జ్ఞానం. ప్రతిపదార్థం వెనుక ఆ పదార్థానికి సంబంధించిన తత్త్వాన్ని జ్ఞానమంటారు. తత్త్వం లేకుండా పదార్థం వుండదు. వృక్షం లోని వృక్షత్వమే దానియొక్క జ్ఞానము. ఇదే చిత్ అని పిలువబడుతుంది.); భువనమోహినీ = భువనములను మోహింపచేయు; గేహినీ = ఇల్లాలు;

సమస్త = సమస్తమైన, కుల = కులమార్గమును అనుసరించే వారు, కౌలీ = కౌలమును అనుసరించే వారిని (కులమంటే వ్యష్టి కుండలినిని సమష్టిచైతన్యం అయిన పరమశివునితో అనుసంధానించే మార్గం. దీనినే 'కౌలమార్గం' అని కూడా అంటుంటారు కౌలముఅంటే భోగము, యోగము కలిపి ఆచరించే మార్గం); నిగర్భ రహస్యాతిరహస్య పరాపరరహస్య యోగినీ = అనేక రహస్యములు కలిగిన యోగినులు కలది; శ్రీమత్కౌమారగిరీంద్ర = శోభావంతమైన కౌమారగిరిపర్వత శ్రేష్ఠము యొక్క; సౌవర్ణ = ప్రాకార మధ్య; బంగారు ప్రాకారముల మధ్య ఉన్న; విటంక = ఇంటి ముంజూరునందలి గువ్వగూడులో; విన్యస్త = ఉంచబడిన; నిస్తుల = సాటిలేని; ప్రశస్త = ప్రశస్తమైన; మణిగణ = మణి సమూహములతో; వ్యాకీర్ణ = చెదిరిన; మండపాభ్యంతర = మండపములోపలి; వితర్దికా = అరుగు; రంగ = నాట్యస్థానములోని; వలభికాయంత్ర = చంద్రశాల యంత్రములతో; పాంచాలికాయమాన = బొమ్మలుగ చేయబడిన; ప్రమథగణసేవిత = ప్రమథగణములచే సేవింపబడు; శ్రీత్రిపురాంతకేశ్వర = త్రిపురాంతకుడైన పరమశివుని యొక్క; ఉత్సంగ నివాసే = తొడపై నివాసము కలదానా!; **విశదహాసే!** = స్పష్టమయిన నవ్వు కలదానా!

**తాత్పర్యము :** అమ్మవారు బ్రహ్మ తేజస్సుకు ఒక ఆకారమైన చిత్ అను అగ్నికుండం నుండి పుట్టినది. భువనములను మోహింపచేయు ఇల్లాలు; అనేక రహస్యములు కలిగిన యోగులు, యోగినులు ధ్యానించే ఉదాత్త. ఆమె శివుని అంకముపై కూర్చొని, చక్కగా నవ్వుతోంది.

**విశేషాలు :** అమ్మ శివుని అంకముపై కూర్చొని శ్రీరంగ కవికి మానసిక దర్శనము ఇచ్చింది కాబోలు. ఆ ఆనందాన్ని కవి మనతో పంచుకొన్నాడు. త్రిపురాంతకుడు వెలసిన కొండ కుమారగిరి. కుమారస్వామి ఈ కొండపైన తారకాసురుని సంహరించారని ఒక కథనం. అందుకే ఈ కొండను ఈ పంక్తులలో శ్రీరంగకవి కౌమారగిరి అన్నాడు.

**సకల సుకవి వర్ణిత మృదుమధుర కవితా రచనాధురీణ భారతులాన్వయాంభోధి తుహినకర రంగయాభిధా నాంగ నాదె మాంబికా గర్భశుక్తి మౌక్తికాయమాన శ్రీరంగకవి విరచిత గద్యపద్యానుమోద మానసాంభోజే! నత సురసమాజే!**

**అర్థం :** సకల సుకవి వర్ణిత = సమస్త సుకవులచే వర్ణించబడిన; మృదుమధుర కవితా రచనాధురీణ = మృదుమధురమైన కవితా రచన చేయుటలో నేర్పరి యయిన; భారతులాన్వయాంభోధి = భారతుల వంశమనెడి సముద్రమునకు; తుహినకర = చంద్రునివంటి వాడయిన; రంగయాభిధాన = రంగయ అను పేరు కలిగినవాని; అంగన = స్త్రీ అయిన (భార్య ఆయిన); ఆదెమాంబికా = ఆదెమ అను తల్లియొక్క; గర్భశుక్తి మౌక్తికాయమాన = గర్భమనెడి ముత్యపు చిప్పలో ముత్యములా ప్రభవించిన; శ్రీరంగకవి విరచిత = శ్రీరంగ కవి అను నేను రచించిన; గద్యపద్యఅనుమోద = గద్య పద్యలచే సంతోషింపబడిన; మానసాంభోజే! = మనస్సను పద్మము కలదానా!; **నత సురసమాజే!** = నమస్కరించిన దేవతా సమూహము కలదానా!

**తాత్పర్యం :** సమస్త సుకవులచే వర్ణించబడిన మృదుమధురమైన కవితా రచన చేయుటలో నేర్పరియయిన భారతుల వంశమనెడి సముద్రమునకు చంద్రునివంటి వాడయిన రంగయ అను పేరు కలిగిన వాని భార్య అయిన ఆదెమ అను గర్భమనెడి ముత్యపు చిప్పలో ముత్యములా ప్రభవించిన శ్రీరంగకవి అను

శ్లో॥ ఉత్తమః పురుషోఽన్యోఽస్తి యుష్మచ్ఛేషవిశేషితః ।
త్వం మహాపురుషస్త్వేకో నిశ్శేషపురుషాశ్రయః ॥ (3-14)

పురుషోత్తముఁడు శ్రీమహావిష్ణువు. **'వైష్ణవ్యాస్తు స్మృతో విష్ణుః'** - అని యాగమము.

శ్లో॥ ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః ।
యో లోకత్రయమావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః ॥ (భ.గీ. 15-17)

అని శ్రీమద్భగవద్గీత.

ఆ మహావిష్ణువు కూడా నీకు శేషుఁడే. సమస్త పురుషులకు నాశ్రయుఁడ వగు నీవుమాత్రమే శివా! మహాపురుషుఁడవు. ఇది యొక అర్థము. యుష్మద్యుపపతే మధ్యమః (1-4-105) అస్మద్యుత్తమః (1-4-107) శేషే ప్రథమః (1-4-108) అను పాణినీయసూత్రముల ననుసరించి అస్మదర్థములో నున్న యుత్తమపురుషము యుష్మచ్ఛేషములగు ప్రథమ - మధ్యమ పురుషములచే విశేషింపఁబడుచున్నది. 'స భజతి', త్వం భజసి', 'అహం భజామి' యను మూఁడు పురుషములు 'వయం భజామః' అను దానిలోఁ గతించుచున్నవి. శివుఁడు ప్రథమ - మధ్యమ - ఉత్తమ పురుష వచనముల కతీతుఁడు అందువల్లనే మహాపురుషుఁడైనాఁడు.

ఇట్లే 14వ యధ్యాయమగు జయస్తోత్రములోని శ్లోకము లన్నియు జయశబ్దముతో నారంభమగుచున్నవి.

శ్లో॥ జయ త్రైలోక్యనాథైకలాంఛనాలికలోచన! ।
జయ పేతార్తలోకార్తికాలకూటాంకకంధర! ॥ (14-3)

ఇట్టి గూఢరహస్యముల గల శివస్తోత్రావళికి వ్యాఖ్యానము రచించిన మహాపండితుఁడు

**క్షేమరాజు (12శ.) :** ఇతఁడు శ్రీమదభినవగుప్తపాదాచార్యుల శిష్యశిరోమణి. ప్రత్యభిజ్ఞా దర్శనమును దన కృతులచే సుసంపన్నము చేసిన శైవాచార్యుఁడు. ఇతఁడు రచించిన కృతులు - 1. ప్రత్యభిజ్ఞాహృదయము, 2. పరాప్రవేశిక, 3. బోధవిలాసము - ఈ మూఁడును స్వతంత్రగ్రంథములు. 4. శివసూత్ర - విమర్శిని, 5. స్పందసందోహము, 6. స్పందనిర్ణయము, 7. స్తవచింతామణి - వివృతి, 8. విజ్ఞానభైరవ - ఉద్యోతము, 9. స్వచ్ఛందతంత్ర - ఉద్యోతము, 10. నేత్రతంత్ర - ఉద్యోతము, 11. శివస్తోత్రావళీ - వ్యాఖ్య, 12. సాంబపంచాశికా - వ్యాఖ్య ఈ తొమ్మిది వ్యాఖ్యాన గ్రంథములు. నిజముగా క్షేమరాజవ్యాఖ్య లేనిచో శివస్తోత్రావళి సులభముగా నర్థముకాదు. ఈ స్తోత్రనాయకుఁడగు సదాశివుఁడు సర్వులకు సర్వమంగళములు ప్రసాదించుఁగాక!

శ్లో॥ శంభో! శర్వ! శశాంకశేఖర! శివ! త్ర్యక్షాక్షమాలాధర!
శ్రీమన్నుగ్రకపాలలాంఛన! లసద్భీమత్రిశూలాయుధ! ।
కారుణాంబునిధే! త్రిలోకరచనాశీలోగ్రశక్త్యాత్మక!
శ్రీకంఠాశు వినాశయాశుభభరానాధత్స్వ సిద్ధిమ్ పరామ్ ॥ (11-11)

శ్రీమత్పరమేశ్వరార్పణమస్తు



శ్రీ వాశిష్ఠగణపతేః కృతిః ।

# ఇంద్రసహస్రనామస్తోత్రమ్

ఇన్ద్రో దేవతమోఽ**నీలః సుపర్ణః**, పూర్ణబన్ధురః ।
విశ్వస్య దమితా, విశ్వస్యేశానో, విశ్వచర్షణిః ॥ 1

విశ్వానిచక్రిర్విశ్వస్మాదుత్తరో, విశ్వభూ, ర్బృహన్ ।
చేకితానో, **వర్తమానః స్వధయాఽచక్రయా**, పరః ॥ 2

విశ్వానరో విశ్వరూపో విశ్వాయుర్విశ్వతస్పృథుః ।
విశ్వకర్మా విశ్వదేవో **విశ్వతోధీ**,రనిష్కృతః ॥ 3

త్రిషుజాతస్తిగ్మశృఙ్గో దేవో బ్రధ్నోఽరుషశ్చరన్ ।
రుచానః పరమో విద్వాన్, అరుచోరోచయన్నజః ॥ 4

జ్యేష్ఠో జనానాం వృషభో జ్యోతిర్జ్యేష్ఠం సహో మహి ।
**అభిక్రతూనాం దమితా ధర్తా విశ్వస్య కర్మణః** ॥ 5

ధర్తా ధనానం, ధాతౄణాం ధాతా, ధీరో, ధియేషితః ।
యజ్ఞస్య సాధనో యజ్ఞో యజ్ఞవాహో అపామజః ॥ 6

యజ్ఞం జుషాణో యజతో యుక్తగ్రావ్ణోఽవితేషిరః ।
సువజ్రశ్చ్యవనో యోద్ధా యశసో యజ్ఞియో యహుః ॥ 7

అవయాతా దుర్మతీనాం హన్తా పాపస్య రక్షసః ।
కృశస్య చోదితా కృత్నుః కృతబ్రహ్మా ధృతవ్రతః ॥ 8

ధృష్ణవోజా అవితాధీనాం ధనానాం సఞ్జిదచ్యుతః ।
విహన్తా తమసస్త్వష్టా తనూపాస్తరుతాతురః ॥ 9

త్వేషనృమ్ణస్త్వేషసన్దృక్ తురాషాడపరాజితః ।
తుగ్ర్యావృధోదస్మతమః తువికూర్మితమస్తుజః ॥ 10

వృషప్రభర్మా విశ్వాని విద్వానాదర్దిరస్తవాః ।
మన్ద్రో మతీనాం వృషభో మరుత్వాన్మరుతామృషిః ॥ 11

మహోహస్తీ గణపతిర్ధియం జిన్వో బృహస్పతిః ।
మాహినో మఘవా మన్దీ మర్కోఽర్కో మేధిరో మహాన్ ॥ 12

**ఇతి ప్రథమం నామశతకమ్ ।**

ప్రతిరూపః పరోమాత్రః పురురూపః పురుష్టుతః ।
పురుహూతః పురః స్థాతాః పురుమాయః పురన్దరః ॥ 13

**ఇతి ద్వితీయశతకప్రథమాష్టకేన సహాష్టోత్తరం నామశతకమ్**

పురుప్రశస్తః పురుకృత్ పురాం దర్తా పురూతమః ।
పురుగూర్తః పృత్సుజేతా పురువర్పాః ప్రవేపనీ ॥ 14

పప్రిః ప్రచేతాః పరిభూః పనీయానప్రతిష్కుతః ।
ప్రవృద్ధః ప్రవయాః పాతా పూషణ్వానన్తరా భరః ॥ 15

పురుశాకః పాఞ్చజన్యః పురుభోజాః పురూవసుః ।
పిశఙ్గరాతిః పపురిః పురోయోధః పృథుజ్రయా ॥ 16

ప్రరిక్వా ప్రదివః పూర్వ్యః పురోభూః పూర్వజా ఋషిః ।
ప్రణేతా ప్రమతిః పన్యః పూర్వయావా ప్రభూవసుః ॥ 17

ప్రయజ్యుః పావకః పూషా పదవీః పథికృత్పతిః ।
పురుత్మా పలితోహేతా ప్రహేతా ప్రావితా పితా ॥ 18

పురునృమ్ణః పర్వతేష్ఠాః ప్రాచామన్యుః పురోహితః ।
పురాంభిన్దురనాధృష్యః పురాజాః పప్రథిన్తమః ॥ 19

పృతనాషాడ్ బాహుశర్ధీ బృహద్రేణురనిష్టృతః ।
అభిభూతిరయోపాష్టిః బృహద్రేరపిధానవాన్ ॥ 20

బ్రహ్మప్రియో బ్రహ్మజూతో బ్రహ్మవాహో అరఙ్గమః ।
బోధిన్మనా అవక్రక్షీ బృహద్భానురమిత్రహా ॥ 21

భూరికర్మా భరేకృత్నుర్భద్రకృద్ భార్వరోభృమిః ।
భరేషు హవ్యో భూర్యోజాః పురోహా ప్రాశుషాట్ ప్రషాట్ ॥ 22

ప్రభఙ్గీమహిషో భీమో భూర్యాసుతిరశస్తిహా ।
ప్రసక్షీ విశ్పతిర్వీరః పరస్పాః శవసస్పతిః ॥ 23

**ఇతి ద్వితీయం నామశతకమ్ ।**

పురుదత్రః పితృతమః పురుక్షుర్భూరిగుః పణిః ।
ప్రత్వాక్షాణః పురాం దర్మాపనస్యురభిమాతిహా ॥ 24

పృథివ్యా వృషభః ప్రత్నః ప్రమన్దీ ప్రథమః పృథుః ।
త్యః సముద్రవ్యచాః పాయుః ప్రకేతశ్చర్షణీసహః ॥ 25

కారుధాయాః కవివృధః కనీనః క్రతుమాన్క్రతుః ।
క్షపాంవస్తా కవితమో గిర్వాహాః కీరిచోదనః ॥ 26

క్షపావాన్కౌశికః కారీ రాజాక్షమ్యస్య గోపతిః ।
గౌర్గోర్దురో దురోఽశ్వస్య యవస్యదుర ఆదురిః ॥ 27

చన్ద్రబుధ్నశ్చర్షణిప్రాశ్చకృత్యశ్చోదయన్మతిః ।
చన్ద్రభానుశ్చిత్రతమశ్చమ్రీషశ్చక్రమాసజః ॥ 28

తువిశుష్మస్తువిద్యుమ్నస్తువిజాతస్తువీమఘః ।
తువికూర్మిస్తువిమ్రక్షస్తువిశగ్మస్తువిప్రతిః ॥ 29

తువినృమ్ణస్తువిగ్రీవస్తువిరాధాస్తువిక్రతుః ।
తువిమాత్రస్తువిగ్రాభస్తువిదేష్ణస్తువిష్వణిః ॥ 30

తూతుజిస్తవసస్తక్వస్తువిగ్రిస్తుర్వణిస్త్రుదః ।
రథేష్ఠస్తరణిస్తుమ్రస్త్విషీమానపచ్యుతః ॥ 31

తోదస్తరుత్రస్తవిషీ ముషాణస్తవిషస్తురా ।
తితిర్వా తతురిస్త్రాతా భూర్ణిస్తూర్ణిస్తవస్తరః ॥ 32

యజ్ఞవృద్ధో యజ్ఞియానాం ప్రథమో యజ్వనో వృధః ।
అమిత్రఖాదోऽనిమిషో విషుణోऽసున్వన్తోऽజురః ॥ 33

అక్షితోతిరదాభ్యోऽర్యః శిప్రిణీవానగోరుధః ।
అశ్రుత్కర్ణోऽన్తరిక్షప్రా అమితౌజా అరిష్టుతః ॥ 34

**ఇతి తృతీయం నామశతకమ్ ।**

అదృష్ట ఏకరాదూర్ధ్వ ఊర్ధ్వసానః సనాద్యువా ।
స్థిరః సూర్యః స్వభూత్యోజాః సత్యరాధాః సనశ్రుతః ॥ 35

ప్రకల్పః సత్వానాం కేతురచ్యుతచ్యుదురువ్యచాః ।
శవసీ స్వపతిః స్వోజాః శచీవానవిదీధయుః ॥ 36

సత్యశుష్మః సత్యసత్వా సూనుః సత్యస్య సోమపాః ।
దస్యోర్హన్తా దివో ధర్తా రాజా దివ్యస్య చేతనః ॥ 37

ఋగ్మియోऽర్వా రోచమానో రభోదా ఋతపా ఋతః ।
ఋజీషీ రణకృద్రేవా నృత్వియో రధ్రచోదనః ॥ 38

ఋష్వోరాయోऽవనీరాజా రయిస్థానో రదావసుః ।
ఋభుక్షా అనిమానోऽశ్వః సహమానః సముద్రియః ॥ 39

ఋణకాతిర్గిర్వణస్యుః కీజః ఖిద్వాఖజంకరః ।
ఋజీషో వసువిద్వేన్యో వాజేషు దధృషః కవిః ॥ 40

విరప్శీ వీలితో విప్రో విశ్వవేదా ఋతావృధః ।
ఋతయుగ్ధర్మకృద్ధేనుర్ధనజిద్ధామవర్మవాట్ ॥ 41

ఋతేజాః సక్షణిః సోమ్యః సంసృష్టిజిదృభుష్ఠిరః ।
ఋతయుః సబలః సహ్యూర్వజ్రవాహో ఋచీషమః ॥ 42

ఋగ్మీదధృష్వాన్నృష్వోజాః సుగోపాః స్వయశస్తరః ।
స్వభిష్టిసుమ్నః సేహానః సునీతిః సుకృతః శుచిః ॥ 43

ఋణయాః సహసః సూనుః సుదానుః సగణో వసుః ।
స్తోమ్యః సమద్వా సత్రాహా స్తోమవాహా ఋతీషహః ॥ 44

**ఇతి చతుర్థం నామశతకమ్ ।**

శవిష్ఠః శవసః పుత్రః శతమన్యుః శతక్రతుః ।
శక్రః శిక్షానరః శుష్మీ శ్రుత్కర్ణః శ్రవయత్సఖా ॥ 45

శతమూతిః శర్ధనీతిః శతనీథః శతామఘః ।
శ్లోకీ శివతమః శ్రుత్యం నామబిభ్రదనానతః ॥ 46

శూరః శిప్రీ సహస్రోతిః శుభ్రః శృఙ్గవృషోనపాత్ ।
శాసః శాకీ శ్రవస్కామః శవసావానహంసనః ॥ 47

సురూపకృత్నురీశానః శూశువానః శచీపతిః ।
సతీనసత్వా సనితా శక్తీవానమితక్రతుః ॥ 48

సహస్రచేతాః సుమనాః శ్రుత్యః శుద్ధః శ్రుతామఘః ।
సత్రాదావా సోమపావా సుక్రతుః శృశ్రుషు శ్రితః ॥ 49

చోదప్రవృద్ధో విశ్వస్య జగతః ప్రాణతస్పతిః ।
చౌత్నః సుప్రకరస్నోనా చకమానః సదావృధః ॥ 50

స్వభిష్టిః సత్పతిః సత్యశ్చారుర్వీరతమశ్చతీ ।
చిత్రశ్చికిత్వానాజ్ఞాతా ప్రతిమానం సతః సతః ॥ 51

స్థాతా సచేతాః సదివః సుదంసాః సుశ్రవస్తమః ।
సహోదాః సుశ్రుతః సమ్రాట్సుపారః సున్వతః సఖా ॥ 52

బ్రహ్మవాహస్తమో బ్రహ్మో విష్ణుర్వస్వఃపతిర్హరిః ।
రణాయ సంస్కృతో రుద్రో రణితేశానకృచ్ఛివః ॥ 53

విప్రజూతో విప్రతమో యహ్వో వజ్రీ హిరణ్యయః ।
వప్రో వీరతరోవాయుర్మాతరిశ్వా మరుత్సఖా ॥ 54

గూర్తశ్రవా విశ్వగూర్తో వన్దనశ్రుద్విచక్షణః ।
వృష్ణిర్వసుపతిర్వాజీ వృషభో వాజినీ వసుః ॥ 55

**ఇతి పఞ్చమం నామశతకమ్ ।**

విగ్రో విభీషణో వహ్నిర్వృద్ధాయుర్విశ్రుతో వృషా ।
వ్రజభృద్వృత్రహా వృద్ధో విశ్వవారో వృతఞ్చయః ॥ 56

వృషజూతిర్వృషరథో వృషభాన్నో వృషక్రతుః ।
వృషకర్మా వృషమణాః సుదక్షః సున్వతో వృధః ॥ 57

అద్రోఘవాగసురహా వేధాః సత్రాకరోఽజరః ॥
అపారః సుహవోఽభీరురభిభఙ్గోఽఙ్గిరస్తమః ॥ 58

అమర్త్యః స్వాయుధోఽశత్రురప్రతీతోఽభిమాతిషాట్ ।
అమత్రీ సూనురర్చత్ర్యః స్మద్దిష్టిరభయఙ్కరః ॥ 59

అభినేతా స్వర్హరాధాః సప్తరశ్మిరభిష్టికృత్ ।
అనర్వాస్వర్జిదిష్కర్తా స్తోతౄణామవితోపరః ॥ 60

అజాతశత్రుః సేనానీరుభయావ్యభయఙ్కరః ।
ఉరుగాయః సత్యయోనిః సహస్వానుర్వరాపతిః ॥ 61

ఉగ్రో గోపా ఉగ్రబాహురుగ్రధన్వోక్థవర్ధనః ।
గాథశ్రవా గిరాం రాజా గమ్భీరో గిర్వణస్తమః ॥ 62

వజ్రహస్తచర్షణీనాం వృషభో వజ్రదక్షిణః ।
సోమకామః సోమపతిః సోమవృద్ధః సుదక్షిణః ॥ 63

సుబ్రహ్మా స్థవిరః సూరః సహిష్టః సప్రథాః సరాట్ ।
హరిశ్మశారుర్హరివాన్హరీణాం పతిరస్తృతః ॥ 64

హిరణ్యబాహురుర్జ్యోతిర్హరికేశో హిరీమశః ।
హరిశిప్రో హర్యమాణో హరిజాతో హరిమ్భరః ॥ 65

హిరణ్యవర్ణో హర్యశ్వో హరివర్పా హరిప్రియః ।
హనిష్ఠో హర్యక్ష్వో హవ్యో హరిష్ఠా హరియోజనః ॥ 66

**ఇతి షష్ఠం నామశతకమ్ ।**

సత్వాసుశిప్రః సుక్షత్రః సువీరః సుతపా ఋషిః ।
గాథాన్యో గోత్రభిద్గ్రామం వహమానో గవేషణః ॥ 67

జిష్ణుస్తస్థుష ఈశాన ఈశానో జగతో నృతుః ।
నర్యాణి విద్వాన్నృపతిః నేతానృమ్ణస్య తూతుజిః ॥ 68

నిమేఘమానో నర్యాపాః సిన్ధూనాం పతిరుత్తరః ।
నర్యో నియుత్వాన్నిచితో నక్షద్దాభోనహుష్టరః ॥ 69

నవ్యో నిధాతా నృమణాః సధ్రీచీనః సుతరేణః ।
నృతమానో నదనుమాన్నవీయాన్నృతమోనృజిత్ ॥ 70

విచయిష్ఠో వజ్రబాహుర్వృత్రఖాదోవలం రుజః ।
జాతూభర్మా జ్యేష్ఠతమో జనభక్షో జనంసహః ॥ 71

విశ్వాషాడ్వంసగోవస్యాన్నిష్పాదశనిమాన్నృషాట్ ।
పూర్భిత్పురాషాడభిషాట్ జగతస్తస్థుషస్పతిః ॥ 72

సంవృక్సమత్సుసన్ధాతా సుసం దృక్సవితాఽరుణః ।
స్వర్యః స్వరోచిః సుత్రామా స్తుష్యేయ్యః సనజాః స్వరిః ॥ 73

కృణ్వన్నకేతవే కేతుం పేశః కృణ్వన్నపేశసే ।
వజ్రేణ హత్వీ మహినో మరుత్స్తోత్రో మరుద్గణః ॥ 74

మహావీరో మహావ్రాతో మహాయ్యః ప్రమతిర్మహీ ।
మాతా మఘోనాం మంహిష్ఠో మన్యుమీర్మన్యుమత్తమః ॥ 75

మేషో మహీవృన్మన్దానో మాహినావాన్మహామతిః ।
మ్రక్షోమృలీకో మంహిష్ఠో మ్రక్షకృత్వా మహామహః ॥ 76

మదచ్యున్మర్డితామద్వా మదానాం పతిరాతపః ।
సుశస్తిః స్వస్తిదాః స్వర్దృగ్రాధానామాకరః పతిః ॥ 77

**ఇతి సప్తమం నామశతకమ్ ।**

ఇషుహస్త ఇషాం దాతా వసుదాతా విదద్వసుః ।
విభూతిర్వ్యానాశిర్వేనో వరీయాన్ విశ్వజిద్విభుః ॥ 78

నృచక్షాః సహురిః స్వర్విత్సుయజ్ఞః సుష్టుతః స్వయుః ।
ఆపిః పృథివ్యా జనితా సూర్యస్య జనితా శ్రుతః ॥ 79

స్పడ్విహాయాః స్మత్పురన్ధిర్వృషపర్వా వృషన్తమః ।
సాధారణః సుఖరథః స్వశ్వః సత్రాజిదద్భుతః ॥ 80

జ్యేష్ఠరాజో జీరదానుర్జగ్మిర్విత్వక్షణో వశీ ।
విధాతా విశ్వమా ఆశుర్మాయీ వృద్ధమహావృధః ॥ 81

వరేణ్యో విశ్వతూర్వాతస్యేశానో ద్యార్విచర్షణిః ।
సతీనమన్యుర్గోదత్రః సద్యోజాతోవిభఞ్జనుః ॥ 82

వితన్తసాయ్యో వాజానాం విభక్తా వస్వ ఆకరః ।
వీరకో వీరయుర్వజ్రం బభ్రివీరేణ్య ఆఘృణిః ॥ 83

వాజినేయో వాజనిర్వాజానాం పతిరాజికృత్ ।
వాస్తోష్పతిర్వర్పణీతిర్విశాం రాజా వపోదరః ॥ 84

విభూతద్యుమ్న ఆచక్రిరాదారీ దోధతో వధః ।
ఆఖణ్డలో దస్మవర్చాః సర్వసేనో విమోచనః ॥ 85

వజ్రస్య భర్తా వార్యాణాం పతిర్గోజిద్గవాం పతిః ।
విశ్వవ్యచాః సఞ్చకానః సుహార్దో జనితా దివః ॥ 86

సమన్తునామా పురుధ ప్రతికో బృహతః పతిః ।
దీధ్యానో దామనో దాతా దీర్ఘశ్రవస ఋభ్వసః ॥ 87

దంసనావాన్దివః సంమ్రాడ్దేవజూతో దివావసుః ।
దశమో దేవతా దక్షో దుధ్రోద్యుమ్నీ ద్యుమన్తమః ॥ 88

ఇత్యష్టమం నామశతకమ్ ।

మంహిష్ఠరాతురిత్థాధీర్దీద్యానో దధృషిర్దుధిః ।
దుష్టరీతుర్దుశ్చ్యవనో దివోమానో దివోవృషా ॥ 89

దక్షాయ్యో దస్యుహాధృష్ణుః దక్షిణావాన్ ధియావసుః ।
ధనస్పృద్ధృషితో ధాతా దయమానో ధనఞ్జయః ॥ 90

దివ్యో ద్విబర్హాః సన్నార్యః సమర్యస్త్రాః సిమః సఖా ।
ద్యుక్షః సమానో దంసిష్ఠో రాధసః పతిరధ్రిగుః ॥ 91

సమ్రాట్ పృథివ్యా ఓజస్వాన్ వయోధా ఋతుపా ఋభుః ।
ఏకో రాజైధమానద్విడేకవీర ఉరుజ్రయాః ॥ 92

లోకకృజ్జనితాఽశ్వానాం జోహూత్రోజనితా గవామ్ ।
జరితా జనుషాం రాజా గిర్వణాః సున్వతోఽవితా ॥ 93

అత్కం వసానః కృష్టీనాం రాజోక్థ్యః శిప్రవానురుః ।
ఈడ్యోదాశ్వానినతమో ఘోరః సఙ్క్రన్దనః స్వవాన్ ॥ 94

జాగృవిర్జగతో రాజా గృత్సో గోవిద్ధనాఘనః ।
జేతాఽభిభూరకూపారో దానవానసురోఽర్ణవః ॥ 95

ధృష్విర్దమూనాస్తవసస్తవీయాననన్తమోఽవృతః ॥
రాయోదాతా రయిపతిః విపశ్చిద్వృత్రహన్తమః ॥ 96

అపరీతః షాలపశ్చాద్ దధ్వాయుత్కార ఆరితః ।
వోహ్లవనిష్ఠో వృష్ణ్యావాన్వృషణ్వానవృకోఽవతః ॥ 97

గర్భోఽసమష్టకావ్యోయుగహిశుష్మోదధృష్వణిః ।
ప్రత్నః పతిర్వాజదావా జ్యోతిః కర్తా గిరాం పతిః ॥ 98

ఇతి నవమం నామశతకమ్ ।

అనవద్యః సమ్భృతాశ్వో వజ్రివాదద్రివాన్ద్యుమాన్ ।
దస్మో యజత్రో యోధీయానకవారిర్యతఙ్కరః ॥ 99

పృదాకుసానురోజీయాన్ బ్రహ్మణశ్చోదితా యమః ।
వన్దనేష్ఠాః పురాం భేత్తా బన్ధురేష్ఠా బృహద్దివః ॥ 100

వరూతా మఘనో రాజా ప్రణేనీః పప్రథీ యువా ।
ఉరుశంసోహవంశ్రోతా భూరిదావా బృహచ్ఛ్రవాః ॥ 101

మాతా స్త్రియానాం వృషభో మహోదాతా మహావధః ।
సుగ్మ్యః సురాధాః సత్రాషాడోదతీనాం నదోధునిః ॥ 102

అకామకర్శనః స్వర్షాః సుమృలీకః సహస్కృతః ।
పాస్త్యస్య హోతా సిన్ధూనాం వృషాభోజో రథీతమః ॥ 103

సఖా మునీనాం జనిదాః స్వధావానసమోఽప్రతిః ।
మనస్వానధ్వరో మర్త్యో బృబదుక్థోఽవితా భగః ॥ 104

అషాహ్యోఽరీళ్హ ఆదర్తా వీరం కర్తాం విశస్పతిః ।
ఏకః పతిరనిః పుష్టిః సువీర్యో హరిపాః సుదృక్ ॥ 105

ఏకో హవ్యః సనాదారుగోకోవాకస్య సక్షణిః ।
సువృక్తిరమృతోఽమృక్తః ఖజకృద్వలదాః శునః ॥ 106

అమత్రో మిత్ర ఆకాయ్యః సుదామాబ్జిన్ మహోమహీ ।
రథః సుబాహురుశనా సునీథో భూరిదాః సుదాః ॥ 107

మదస్య రాజా సోమస్య పీత్వీజ్యాయాన్దివః పతిః ।
తవిషీవాన్ధనో యుధ్మో హవనశ్రుత్సహాః స్వరాట్ ॥ 108

**ఇతి దశమం నామశతకమ్ ।**

అత్రేమే భవన్త్యుపసంహారశ్లోకాః ।

ఇదం సహస్రమిన్ద్రస్య నామ్నాం పరమపావనమ్ ।
ఋగ్వేదతో గణపతిః సఙ్గృహ్య వినిబద్ధవాన్ ॥ 1

నాత్ర నామ్నః పౌనరుక్త్యం న "చ" కారాది పూరణమ్ ।
శ్లోకమధ్యే న చారమ్భా శతకస్యోపసంహృతిః ॥ 2

నామ్నామేషాం ఛాన్దసత్వాత్సర్వేషాం చ స్వరూపతః ।
అవలోక్యా యథా ఛన్దః శబ్దశుద్ధిర్విచక్షణైః ॥ 3

అనేకపదనామాని వినియోజ్యాని పూజనే ।
చతుర్థ్యన్తప్రయోగేషు వ్యుత్క్రమాచ్చ యథాన్వయమ్ ॥ 4

అస్య నామసహస్రస్య వేదమూలస్య సేవనే ।
పూర్ణం ఫలం తద్విజ్ఞేయం యత్స్వాధ్యాయనిషేవణే ॥ 5

మన్త్రేభ్యః సమ్భృతం సారమేతన్నామసహస్రకమ్ ।
ఐన్ద్రం యో భజతే భక్త్యా తస్య స్యుః సిద్ధయో వశే ॥ 6

ఇన్ద్రో విజయతే దేవః సర్వస్య జగతః పతిః ।
వేదమూలం జయత్యేతత్తస్య నామసహస్రకమ్ ॥ 7

ఇతి శ్రీభగవన్మహర్షిరమణాన్తేవాసినో వాసిష్ఠస్య
నరసింహసూనోర్గణపతేః కృతిః ఇన్ద్రసహస్రనామస్తోత్రం సమ్పూర్ణమ్ ॥

***అక్షరదోషరహితమని భావింతును. పారాయణము చేయుదురుగాక.***
***మరిన్ని వివరములకు 'నామావళి' చూడగలరు (శ్రీరమణాశ్రమ ప్రచురణ) – రామోరా***





# శ్రీ నృసింహనఖస్తుతిః

– వ్యాఖ్యాత – డా॥ సూరం శ్రీనివాసులు

శ్లో॥ పాన్త్వస్మాన్పురుహూతవైరిబలవన్మాతఙ్గమాద్యద్ఘటా–
కుమ్భోచ్చాద్రివిపాటనాధికపటుప్రత్యేకవజ్రాయితాః ।
శ్రీమత్కణ్ఠీరవాస్యప్రతతసునఖరా దారితారాతిదూర–
ప్రధ్వస్తధ్వాన్తశాన్తప్రవితతమనసా భావితా భూరిభాగ్యైః ॥ 1

**నర/నృసింహనఖస్తుతి శ్రీమదానందతీర్థాచార్యకృతి.** వీరికే మాధవానందతీర్థ, శ్రీపాదమాధవాచార్య, శ్రీమదానందతీర్థభగవత్పాదాచార్య అని కూడా వ్యవహారం. ఈ స్తుతి రెండు శ్లోకాల సంపుటి. వాటిలో మొదటిది పై శ్లోకం.

**ప్రతిపదార్థము : పురుహూత..... వజ్రాయితాః –** పురుహూత = ఇంద్రునియొక్క (పురు ప్రభూతం హూతం యజ్ఞేషు ఆహ్వానం యస్య సః పురుహూతః, పురు భూయిష్ఠం హూయతే యజ్ఞేషు ఇతి పురుహూతః, హూ దానాదనయోః – అను ధాతువునుండి; పురు నామానమసురం హతవానితి వా అనగా యజ్ఞములందు ఎక్కువగా ఆహ్వానింపబడేవాడు, లేదా పురువను రాక్షసుని సంహరించినవాడు అని అర్థం); వైరి = శత్రువులనెడి, బలవత్ = శక్తిసంపన్నాలయిన, మాతంగ మాద్యత్ = మదపుటేనుగుల యొక్క, ఘటా = సమూహాలయొక్క, కుంభ = కుంభస్థలములనెడి, ఉచ్చ = ఎత్తయిన, అద్రి = పర్వతాలయొక్క,విపాటన = బ్రద్దలుచేయుట అను క్రియయందు; అధిక = మిగుల; పటు = సమర్థములయిన, ప్రత్యేక = విశిష్టమైన, వజ్రాయితాః = వజ్రాయుధమువలె ప్రవర్తించునవియు;

**భూరిభాగ్యైః –** భూరి = మిక్కిలిగా; భాగ్యైః = భాగ్యముగలవారిచే (భూరి భాగ్యం యేషాం తే = భూరిభాగ్యాః, మానవులకన్న దేవతల భాగ్యం విశిష్టమని మానవభావన కాబట్టి దేవతల నిక్కడ భూరిభాగ్యులని వ్యవహరిస్తున్నాడు కవి. కానీ ఇక్కడ నాకివృందైః అని పాఠాంతరముంది. నాకమంటే స్వర్గం. నాకం గలవారు నాకులు. నాకులయొక్క బృందం అనగా దేవతా సమూహం నాకివృంద మవుతుంది. వారిచేత అని తృతీయావిభక్త్యర్థం. నాకివృందైః అన్న పాఠమే సమంజసంగా కనిపిస్తుంది. భూరిబృందైః అన్న పాఠంలో అది విశేషణం మాత్రమే. విశేష్యం సంభావనీయం. సంభావన అందరికీ ఒకేరీతిగా కలగవలెనన్న నియమమేమీ ఉండదు. ఒకచో మానవులే భూరిభాగ్యులు కావచ్చు.)

**దారితా.... మనసా –** దారిత = చీల్చబడిన, అరాతి = శత్రువులు గలవై, దూర = దూరమునుండియే, ప్రధ్వస్త = నశింపజేయబడిన, ధ్వాంత = చీకటి గలవానిచే, శాంత = ప్రసన్నమునూ, ప్రవితత = విశాలమునూ చేయబడిన, మనసా = మనస్సుచే, భావితాః = పొందబడినవియు (భూప్రాప్తౌ ఆత్మనేపదీ చురాదిగణానికి సంబంధించిన ధాతువు, భావ్యతే స్మ ఇతి భావితం) అయిన;

**శ్రీమత్క..... సునఖరాః –** శ్రీమత్ = లక్ష్మీసంపన్నమైన, కణ్ఠీరవ + ఆస్య = నృసింహునియొక్క ప్రతత = విశాలములైన, సునఖరాః = మంచి గోళ్ళు (గోరు అనే అర్థంలో నఖ పదం ప్రసిద్ధం. నఖరపదం కూడా దానికి పర్యాయమేకానీ విశిష్టార్థంతో, నఖమంటే సుఖము లేనిది అని అర్థం. శరీరానికి సుఖహేతువు స్పర్శకాబట్టి ఆ స్పర్శజ్ఞానం గోటికి లేదు కాబట్టి నఖ శబ్దం ఆ అర్థంలో ప్రయోగింపబడుతోంది. అయితే నఖరశబ్దానికి అర్థం నఖముగలది అని చెప్పాలి. అలా చెప్పాలంటే

నఖ శబ్దానికి నఖంలోని భాగం అని అర్థం చెప్పాలి ముందుగా. ఆ నఖభాగాలు గలది కాబట్టి నఖరపదం నఖవాచకమవుతుంది. (చూ।। గురుబాల ప్రబోధిక పుట 402 – "న విద్యతే ఖ మింద్రియం స్పర్శజ్ఞాపకమత్ర నఖః. అ.ప్ర. స్పర్శ జ్ఞాపకమైన యింద్రియము దీనికి లేదు. నఖశబ్దః నఖైకదేశేఽపి. సోఽస్యాస్తీతి నఖరః. అ.ప్ర. నఖ శబ్దము నఖైకదేశమందు వర్తించును. ఆ నఖైకదేశము గలది – నఖరము)

అస్మాన్ = మమ్ములను / మనలను (సంస్కృతభాషలో మనము అని వ్యవహరించటానికి వేరే పదముండదు మేము అన్నదానినే తెలియజేసే వయం శబ్దం తప్ప. కానీ తెలుగులో ఆ అవకాశముంది. 'భూయ ఉభయార్థవాచీ యః కశ్చిద్ భవతి నిత్య బహువచనాంత' అని ఆంధ్రవ్యాకర్తల వచనం. కాబట్టి ఉన్న పదాన్ని వినియోగించుకొని మనలను అని అర్థం చెప్పుకోవటమే అందంగా వుంటుంది). పాంతు = రక్షించు గాక. (పా రక్షణే ధాతువు మీద లోట్ ప్రథమ పురుషబహువచనరూపం)

**తాత్పర్యము :** లక్ష్మీసంపన్నుడైన నృసింహస్వామి నఖాలు శుభప్రదాలై మనలను కాపాడాలి. ఆ గోళ్ళు ఇంద్రశత్రువులనే మదపుటేనుగుల కుంభస్థలాలను బ్రద్దలు చేయటంలో వజ్రాయుధం వంటివి. శత్రువినాశనం ద్వారా చీకట్లు దూరమయినందువలన ప్రశాంత మనస్సుతో దేవతలచే సత్కరింపబడేవి, సంభావింపబడేవి ఆ గోళ్ళు.

**విశేషాలు :** ఈ శ్లోకాన్ని చూడగానే ఆనందవర్ధనుడు ధ్వన్యాలోకంలో ప్రార్థనాశ్లోకంగా రచించిన శ్లోకం గుర్తుకు వస్తుంది. అది –

శ్లో।। స్వేచ్ఛాకేసరిణః స్వచ్ఛస్వచ్ఛాయాయాసితేన్దవః ।
త్రాయన్తాం వో మధురిపోః ప్రపన్నార్తిచ్ఛిదో నఖాః ।।

ఈ శ్లోకం అనుష్టుప్ఛందస్సులో వుంది. కానీ ప్రకృతిశ్లోకంలో ఛందస్సు విలక్షణంగా కనిపిస్తోంది.

మొదటి రెండు పాదాలు... పాన్త్వస్మాన్...... వజ్రాయితాః = శార్దూలవిక్రీడితమ్
చివరి రెండు పాదాలు... శ్రీమత్కం..... నాకివృందైః (భూరిభాగ్యైః) = స్రగ్ధరావృత్తమ్.
మ స జ స త త గ – ఇది శార్దూలవిక్రీడితలక్షణం.
మ ర భ న య య య – ఇది స్రగ్ధరావృత్తలక్షణం.

ఉపజాతుల (ఇంద్రవజ్రా – ఉపేంద్రవజ్రల కలయిక) లాగా శార్దూల, స్రగ్ధరావృత్తాల కలయిక నాకు తెలిసినంతలో సంస్కృతసాహిత్యంలో ఇతరత్ర కనిపించదు. నరసింహాల కలయిక నృసింహావతారం కాబట్టి ఛందస్సులో కూడా దాదాపు దగ్గరగా కనిపించే రెండు వృత్తాలను కలపటం ఔచిత్యమహితం కావచ్చు. పొరపాటయితే ఏ ఒక్కపాదంలోనే జరగవచ్చును కానీ రెండు పాదాలలోనూ జరగకపోవచ్చు.

**అవతారవైభవం :**

పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్ ।
ధర్మసంస్థాపనార్థాయ సమ్భవామి యుగే యుగే ।। (భగవద్గీత 4-8)

అని గీతావచనం. సాధురక్షణకోసం, దుష్టశిక్షణ కోసం ఈ రెండింటిద్వారా ధర్మసంస్థాపన కోసం పరమాత్మ అవతరిస్తాడు. ఆ అవతార ప్రయోజనం నృసింహావతారంలో ప్రత్యక్షంగా స్పష్టంగా కనిపిస్తుంది.

ప్రహ్లాదరక్షణ, హిరణ్యకశిపుశిక్షణ తద్వారా భాగవతధర్మసంస్థాపన ఇక్కడ ప్రధానలక్ష్యం. హిరణ్యకశిపుడు ప్రహ్లాదుని హింసించటానికి కారణం ప్రహ్లాదునిలోని భాగవతధర్మమే గదా! ప్రహ్లాదరక్షణ సముచితమే. కానీ శ్లోకంలో 'పురుహూతవైరి' అని ఇంద్రశత్రువులనే మాతంగవిదారణ వర్ణింపబడింది గదా! తనతో శత్రుత్వం లేదు. ఇంద్రునితో వైరం. మరి తన జోక్యమెందుకు? వాస్తవానికి హిరణ్యకశిపుడు తనతో శత్రుత్వం వహించినా, నిందించినా విష్ణువు అవతరించలేదు. ప్రహ్లాదుని హింసించినందుకే అవతరించవలసి వచ్చింది. అదే న్యాయం ఇంద్రవిషయంలో కూడా! ఇంద్ర–ఉపేంద్రులు ఒకే కర్తవ్యంలో భాగస్వాములు గదా!

ఆ అవతారవైభవమే మొదటి రెండో పాదాలలో అనిష్టనివర్తనరూపంలోనూ, చివరి రెండు పాదాలలో ఇష్టప్రాప్తిరూపంలోనూ వస్తువుగా ధ్వనిస్తుంది. ఇది అర్థశక్తిమూలవస్తుకృత వస్తుధ్వని. దేవతల బాధలలో పోగొట్టటంలో ఆ గోళ్ళు వజ్రసమానాలు. వారికి ఆనందాన్ని కల్గించి వాళ్ళ మనస్సులను ప్రసన్నం చేయటం ఇష్టప్రాప్తిరూపం.

**అలంకారాలు :**

కుంభ + ఉచ్చ + అద్రి = కుంభస్థలాలనే పెద్ద కొండలు అన్నచోట కుంభస్థలాలపై పర్వతత్వారోపణవలన రూపకాలంకారం.

దారిత + అరాతి పదాన్ని ఉపమేయంగానూ, దూరప్రధ్వస్తధ్వాంత పదాన్ని ఉపమానంగాను స్వీకరించి ఉపమేయంలో ఉపమానత్వారోపణరూపమైన రూపకాలంకారంగా దీనిని కూడా వ్యవహరించవచ్చు. కాకపోతే మధ్యలో విశేషణం చేరింది.

వజ్రాయిత – అన్నచోట ఉపమేయలుప్త, కంఠీరవాస్య – అన్నచోట ఉపమానలుప్త అని లుప్తోపమాభేదాలు కనిపిస్తాయి.

శ్లోకం నిండా వృత్త్యనుప్రాస విభిన్నాక్షరాలతో కనిపిస్తుంది. కానీ అది రసభంజకం కాకపోగా రసానుగుణమై ఆహ్లాదాన్ని కలిగిస్తోంది. వీరరౌద్రరసానుగుణమైన శైలి శ్లోకానికి వన్నె తెచ్చింది.

**సు** నఖరాః – **ప్రత్యేక** వజ్రాయితాః అన్న ప్రయోగంలో వ్యతిరేకాలంకారం ధ్వనిస్తుంది.

**మాతఙ్గమాద్యత్...**

మాతంగాలు (ఏనుగులు) విశేష్యం. మదించి వుండటం (మాద్యత్) విశేషణం. ఇక్కడ విశేషణం ఉత్తరపదంగా వుంది. మాద్యంతశ్చ తే మాతంగాః మాతంగమాద్యన్తః అని సమాసాన్ని సాధించాలి. సుబ్లోపంతో **మాతంగమాద్యత్** అనిరూపం.

అయితే మాతంగాన్ మాద్యద్ఘటాః అని కూడా చెప్పవచ్చు మాద్యత్ శబ్దాన్ని ఘటాపదానికి విశేషణం చేసి. అప్పుడు ఏనుగుల బృందం మదించిందని చెప్పాలి. ఒంటరిగా వుంటే మంచిగా వుండటం, గుంపులో పొగరు ప్రదర్శించటం ఏనుగులలో కూడా ఉందనవలసి వస్తుంది. ఇక్కడ శతృ (కృత్) ప్రత్యయప్రయోగం కూడా మంచి వయస్సులోనున్న ఏనుగులని సూచిస్తూ రౌద్రరసానికి ఉద్దీపకమవుతుంది.

**ప్రవితతమనసా...**

ప్రవితతత్వం (విశాలత) ఆనందానికి సూచకం. అద్భుతరసఫలంగా హృదయం విస్తృత మవుతుంది. మనసా అని ఏకవచనాన్ని ప్రయోగించటం కూడా విశేషమే. దేవతాబృందాల మనస్సులన్నీ ఒక్కటై ప్రసన్నమయ్యాయి. రెండవ అభిప్రాయానికి గానీ, ఆలోచనకు గానీ తావులేకపోవటం విశేషం. సంకుచితత్వంలో భేదాలుంటాయి గానీ విస్తృతిలో భేదాలుండవు.

**ప్రత్యేకవజ్రాయితాః :**

వాస్తవంగా ఏకైకస్మిన్ ఏకైకస్మిన్ = ప్రత్యేకం అని విగ్రహవాక్యం. దేనికి దానికి విడిగా అని అర్థం. కానీ ప్రత్యేక పదాన్ని విశిష్టమనే అర్థంలో వాడటం అలవాటైంది. బాగా ప్రచారంలోకి కూడా వచ్చింది కాబట్టి ప్రత్యేక వజ్రాయితాః అంటే విశిష్టవజ్రాయిధాలు అని కానీ; ఏనుగుల కుంభస్థలాలను చీల్చటానికి ఒక్కొక్క గోరూ ఒక్కొక్క వజ్రాయుధమై అన్నింటినీ ఒకేసారి చీల్చిందని గానీ వ్యతిరేకాలంకారం గానీ ఉగ్రత్వం కానీ ధ్వనిస్తుంది. ఇవి అర్థశక్తిమూలధ్వనులు.

**భక్తికి ప్రాధాన్యం :**

ఇక్కడ సంలక్ష్యక్రమధ్వనులు (పైన వివరించినవి) రౌద్ర - అద్భుతరూపంలో అసంలక్ష్యక్రమధ్వనులు ఎన్ని ఉన్నా ఇక్కడ ప్రాధాన్యం భక్తికే. కాబట్టి భక్తికి రౌద్రాద్భుతాలు అంగభావాన్ని పొందాయి కాబట్టి శ్లోకంలో రసవదలంకారమున్నట్లు గ్రహించాలి. భక్తిని రసంగా అంగీకరించే పక్షంలో రసవదలంకారం, భక్తిని భావంగానే స్వీకరించేవారి పక్షంలో ప్రేయోలంకారం ఈ శ్లోకంలో వున్నట్టు. కవి మనోగతమైన నృసింహభక్తి శ్రీమంతమై వ్యక్తమయింది. కాబట్టి ఇది శుభప్రదం, సుఖప్రదం, సంపత్ప్రద మవుతుంది.

**శ్లో॥ లక్ష్మీకాన్త! సమన్తతోఽపి కలయన్నైవేశితుస్తే సమం**
**పశ్యామ్యుత్తమవస్తు దూరతరతోఽపాస్తం రసో యోఽష్టమః ।**
**యద్రోషోత్కరదక్షనేత్రకుటిలప్రాన్తోత్థితాగ్నిస్ఫురత్-**
**ఖద్యోతోపమవిస్ఫులింగభసితా బ్రహ్మేశశక్రోత్కరాః ॥** **2**

నఖస్తుతిలో రెండవశ్లోకమిది. లక్ష్మీకాంతవైభవాన్ని, శక్తిసామర్థ్యాలనూ ప్రస్తుతించే శ్లోకమిది.

**ప్రతిపదార్థము :**

లక్ష్మీకాన్త! = శ్రీహరీ! (లక్ష్మ్యాః కాంతః = లక్ష్మీకాంతః, లక్ష్మీః కాంతా యస్య సః = లక్ష్మీకాంతః - తత్పురుషం కానీ బహువ్రీహి కానీ చెప్పుకోవచ్చు. సమాసభేదాన్ని బట్టి కామనకర్మలో కర్తృభేదమేర్పడుతుంది), యః = ఎవడయితే, అష్టమః = ఎనిమిదవ, రసః = రసమో;

**బ్రహ్మే.... త్కరాః :**

బ్రహ్మ + ఈశ - శక్ర + ఉత్కరాః = బ్రహ్మదేవుడు, ఈశ్వరుడు, దేవేంద్రుడు మొదలయిన దేవతాసమూహాలు;

**యద్రోషో.... భసితాః :**

యత్ = ఎవనియొక్క, రోష = క్రోధంయొక్క, ఉత్కర = రాశిచే (భావానికి రాశిత్వ మంటే ఆ భావనలోని సాంద్రతను సూచిస్తుంది); దక్ష = సమర్థమైన, నేత్ర = కంటియొక్క, కుటిల = వక్రమయిన,

ప్రాంత = కొనయందు (కోపంతో ముడివడిన కడకంటి చూపు నుండి అని భావం); ఉత్థిత = పుట్టినట్లు, అగ్ని = అగ్నిలో, స్ఫురత్ = వెలుగుతున్న, ఖద్యోత + ఉపమ = మిణుగురుపురుగువంటి; విస్ఫులింగ = నిప్పుకణికచే; భసితాః = బూడిద చేయబడినవో (అటువంటి), ఈశితుః = పాలకుడవైన, తే = నీకు (నీతో); సమమ్ = సమానమైనవానిని; సమంతతః = అన్ని కోణాలనుండి, కలయన్ = వెదకినను, న పశ్యామి = చూడలేకున్నాను (కనుగొనలేకపోతున్నాను), ఉత్తమ = శ్రేష్ఠమయిన, వస్తు = పదార్థం (లోకంలో ఉత్తమంగా భావింపబడే పదార్థ సమూహం), దూరతరతః = మరీ దూరంగా, అప + అస్తమ్ = తొలగింపబడినది (నెట్టివేయబడినది), (లోకంలో అది ఉత్తమ వస్తువే. కానీ లక్ష్మీకాంతునితో పోల్చిచూసినపుడు అది తక్కువదే. అందుకే తమప్, తరప్ ప్రత్యయాలను (ఉత్తమ – దూరతర) దగ్గర దగ్గరగా ప్రయోగించాడు కవి.)

**తాత్పర్యము :** లక్ష్మీకాంతా! నీవు ఈశుడవు. నీతో సమానుడైన పాలకుని ఎంతగా వెదకినా చూడలేకపోతున్నాను. లోకంలో ఉత్తమవస్తువులుగా భావింపదేవన్నీ నీ ముందు దిగదుడుపే. అందుకే వాటిని దూరంగా పడవేస్తున్నాను. (దిగదుడిచిన వస్తువులను దూరంగా పడవేయటమనే అలవాటును ఇక్కడ గుర్తుతెచ్చుకోవాలి). బ్రహ్మ, ఈశ్వరుడు, ఇంద్రుడు మొదలయిన దేవతలందరూ నీ క్రోధాగ్నినుండి పుట్టిన మిణుగురుపురుగువంటి ఒక్క అగ్నికణంతో భస్మమై పోతున్నారు.

**విశేషాలు :** నారాయణుని కన్న మరేదీ గొప్పకాదు అన్నది విశిష్టాద్వైతంలోనూ, ద్వైతం (మాధ్వసంప్రదాయం)లోనూ విశదమైన విషయం.

"నారాయణీయంలోనూ, నారాయణసూక్తంలోనూ, మహాభారత తాత్పర్య నిర్ణయంలోనూ, అది కంఠోక్తిగా కనిపిస్తుంది.

మహాభారతతాత్పర్యనిర్ణయంలో శ్రీమధ్వాచార్యులు ఇలా ప్రకటించారు.

శ్లో॥ ఆలోడ్య సర్వశస్త్రాణి విచార్య చ పునః పునః ।
ఇదమేకం తు నిష్పన్నం ధ్యేయో నారాయణస్సదా ॥

శ్లో॥ సత్యం సత్యం పునస్సత్యముద్ధృత్య భుజముచ్యతే ।
వేదశాస్త్రపరం నాస్తి న దైవం కేశవాత్పరమ్ ॥ 2/71, 72.

నఖస్తుతిలోని 'సమంతతోఽపి కలయన్' అన్న పదాలకు వ్యాఖ్యానరూపాల వంటివి ఈ శ్లోకాలు. సర్వశాస్త్రాలను చూసి (చదివి) పదే పదే ఆలోచన చేసిన తర్వాత ఒకే నిశ్చయం పుట్టిందట, సదా ధ్యానింపవలసినవారు నారాయణుడే అని. వేదాశాస్త్రాలకన్న గొప్ప శాస్త్రం లేదనీ కేశవుని మించిన దైవం లేదనీ – ఈ సత్యాన్ని చేతులు పైకెత్తి మరీ చెప్తున్నాడట.

(అప్రస్తుతమయినా ఇక్కడొక విషయం చెప్పాలి. ఆలోక్య సర్వశాస్త్రాణి... ఈ శ్లోకం చాలా ప్రసిద్ధమైనది. ఎంతో వ్యాప్తి పొందింది. 13వ శతాబ్దానికి చెందిన వత్సరాజు రచించిన హాస్యచూడామణి ప్రహసనంలో దీనికి 'పేరడీ' (వ్యంగ్యానుకరణం) కనిపిస్తుంది చూడండి.

ఆలోక్య సర్వగాత్రాణి విచార్య చ పునః పునః ।
ఇదమేకం తు నిష్పన్నం ధ్యేయో నారీజనస్సదా ॥

'నారాయణ' పదాన్ని 'నారీజన' పదంగా మార్చి ఆ ప్రహసనంలో హాస్యాన్ని సాధించారు మూలకవిత ఎంతో ప్రచురమయితే తప్ప దానికి 'పేరడీ' రచన చేయరు కవులు)

**నారాయణీయం**లో కూడా నారాయణ భట్టతిరి పరబ్రహ్మకు బాహ్యరూప వైకుంఠవాసుడే అని నిక్కచ్చిగా వ్రాసారు.

నిర్వ్యాపారో౽పి నిష్కారణమజ భజసే యత్క్రియామీక్షణాఖ్యాం
తేనైవోదేతి లీనా ప్రకృతిరసతికల్పాపి కల్పాదికాలే ।
తస్యాస్సంశుద్ధమంశం కమపి తమతిరోధాయకం సత్త్వరూపం
స త్వం ధృత్వా దధాసి స్వమహిమవిభవాకుంఠవైకుంఠరూపమ్ ॥

"పరమాత్మా! నీవు ఎట్టి కర్మలనూ ఆచరింపవలసిన పనిలేదు. ఐనను అయస్కాంత సన్నిధిలో ఇనుము ఆకర్షింపబడునట్లు నీ కృపాకటాక్షవీక్షణ ప్రభావమున నీయందు విలీనమై 'అసత్' స్వరూపమైన ప్రకృతి సృష్టి ప్రారంభ కాలమగు కల్పాదియందు వ్యక్తమగుచున్నది. ఆ మాయయొక్క ఆవరణరహితమై, పరిశుద్ధమైన అంశను 'సత్త్వము' అని అందురు. నీవు ప్రకృతికి అతీతుడవు. నీ మహిమాప్రభావముచే అకుంఠితమైన వైకుంఠరూపమున నీవు విలసిల్లుచున్నావు. భక్తులను అనుగ్రహించుటకై ప్రకృతివిభూతులద్వారా నిన్ను నీవు ప్రకటించు కొనుచున్నావు. (ఈవిధముగా పరబ్రహ్మమే సగుణాత్మకుడైన శ్రీమన్నారాయణుడని ఎఱుంగవలెను)" (అనువాదం శ్రీమాన్ ఎన్.నరసింహాచార్యులు)

యజుర్వేదంలోని నారాయణసూక్తం కూడా

యచ్చ కించిజ్జగత్సర్వం దృశ్యతే శ్రూయతే౽పి వా ।
అన్తర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః ॥

అని దృశ్యమాన శ్రూయమాణ విశ్వమతా నారాయణ స్వరూపమే అంటుంది. స్మార్తులు, అద్వైతులు కూడా 'ఆకాశాత్పతితం తోయం యథా గచ్ఛతి సాగరమ్ । సర్వదేవనమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి" అని సర్వదేవ నమస్కారాలు కేశవునికే చెందుతాయని సంధ్యావందన ముగిస్తారు.

**'రసో యో౽ష్టమః'** అన్న వాక్యం ఉపనిషత్ప్రతిపాదనను వ్యాఖ్యానిస్తోంది. ఛాందోగ్యోపనిషత్తు ఉద్గీథాన్ని (ఓం) వివరిస్తూ ఇలా అంటుంది –

ఏషాం భూతానాం పృథివీరసః పృథివ్యా ఆపో రస అపామోషధయో రస ఓషధీనాం పురుషో రసః । పురుషస్య వాగ్రసో వాచ ఋగ్రస ఋచస్సామ రసః, సామ్న ఉద్గీథో రసః స ఏష రసానాం రసతమః పరమః పరార్ధ్యో౽ష్టమో య ఉద్గీథః – 1.1.1

చరాచరాలకు భూమి ఆధారం. భూమికి నీరు ఆధారం. జలసారం ఓషధులు. ఓషధసారం పురుషుడు. పురుషునకు వాక్కు సారం. వాగ్రసం ఋక్కు. ఋక్కులలో సారం సామం. సామసారం ఉద్గీథం – కాబట్టి ఉద్గీథం పరమరసం. అదే ఓంకారం. ఓంకారమంటే సర్వస్వరూపం.

సర్వేవేదా యత్పదమామనన్తి తపాంసి సర్వాణి చ యద్వదన్తి ।
యదిచ్ఛన్తో బ్రహ్మచర్యం చరన్తి తత్తేపదం సంగ్రహేణ బ్రవీమ్యోమిత్యేతత్ ॥
ఏతద్ధ్యేవాక్షరం బ్రహ్మ ఏతదేవాక్షరం పరమ్ ।
ఏతద్ధ్యేవాక్షరం జ్ఞాత్వా యో యదిచ్ఛతి తస్య తత్ ॥ కఠోపనిషత్తు 2-15,16

ఓంకారాన్నే పరస్వరూపంగా, బ్రహ్మస్వరూపంగా వేదనినాదంగా, తపఃఫలంగా బ్రహ్మచర్య గమ్యంగా వ్యాఖ్యానించింది కఠోపనిషత్తు. ప్రకృతిశ్లోకం **'యః అష్టమః రసః'** అని ఆ ఓంకారస్వరూపునిగా, సర్వస్వరూపునిగా నృసింహుని వ్యాఖ్యానిస్తోంది. అదే నఖస్తుతి, నఖరస్తుతికూడా.

**లక్ష్మీకాంత! :**

కమూకాంతౌ (కాంతిరిచ్ఛా) ధాతువు నుండి కాంతశబ్దం నిష్పన్నమవుతుంది. లక్ష్మియొక్క కామనాస్వరూపుడు నృహరి. పురుషత్వానికి కొంత స్త్రీత్వం కూడా కలిస్తేనే శోభ. నృసింహరూపం, దానివెనుక లక్ష్మీకామన కలిసి అవతార ప్రయోజనాన్ని సుసంపన్నం చేశాయి. సౌందర్యలహరిలో ఆదిశంకరులు, శ్రీగురురత్నకోశంలో పరాశరభట్టరు ఆ అంశాన్నే ప్రస్తుతిస్తారు.

శివశ్శక్త్యాయుక్తో యది భవతి శక్తః ప్రభవితుం
న చేదేవం దేవో న ఖలు కుశలః స్పందితుమపి ।
అతస్త్వామారాధ్యాం హరిహరవిరించ్యాదిభిరపి
ప్రణంతుం స్తోతుం వా కథమకృతపుణ్యః ప్రభవతి ॥ సౌందర్యలహరి-1

శ్రియై సమస్తచిదచిద్విధానవ్యసనం హరేః ।
అంగీకారాభిరాలోకైః సార్థయంత్యై కృతోఽఞ్జలిః ॥ శ్రీగుణరత్నకోశం - 1

శక్తి లేకపోతే శివుడు కనీసం కదలలేడు. లక్ష్మీకటాక్షాంగీకారం లేకపోతే లోకవిధానమనే హరివ్యసనం సఫలంకాదు. ఎంత ముచ్చటయిన ఆలోచనలు. అందుకే లక్ష్మీకాంత అని సాభిప్రాయంగా నరహరిని సంబోధించటం. బ్రహ్మాదులను కూడా దహించగల ఆ ఉగ్రత పరమాత్మకు కలగటానికి కారణం శక్తియే. ఋగ్వేదంలోని దశమ మండలంలోని 125వ సూక్తం (ఆంభృణీసూక్తం)

అహం సోమమాహనసం బిభర్మ్యహం త్వష్టారముత పూషణం భగమ్ ।
అహం దధామి ద్రవిణం హవిష్మతే సుప్రావ్యే యజమానాయ సున్వతే ॥

అహమేవ స్వయమిదం వదామి జుష్టం దేవేభిరుత మానుషేభిః ।
యం కామయే తం తముగ్రం కృణోమి తం బ్రహ్మాణం తమృషిం తం సుమేధామ్ ॥
ఋగ్వేదం 10-125-2,5

ఆమె అనుగ్రహ - ఆగ్రహాల ఫలాన్ని స్పష్టంగా చెప్తోంది.

అగ్నికణం (ఖద్యోతోపమవిస్ఫులింగం) చేతనే బ్రహ్మాదులు కూడా బూడిద అవుతున్నారంటే ఇక పూర్తి నిప్పు ఎంత శక్తివంతమో అని ధ్వనిస్తుంది. ఇది అర్థాపత్త్యలంకార ధ్వని.

నృసింహలాభం చేత ఉత్తమవస్తువులను నెట్టివేయటమంటే వర్ణ్యోపమేయలాభం వలన అన్యవస్తు నిరాకరణ రూపమైన ప్రతీపాలంకారమిక్కడ.

రౌద్రాద్భుతరసాలు భగవద్భక్తికి అంగాలుగా మారుతున్నాయి కాబట్టి రసవదలంకారం. భక్తిప్రధానం అది రసమైనా, భావమైనా. భగవద్రతిని సంచారిభావంగా భావించారు కొందరు ఆలంకారికులు, రసంగానే నిర్ణయించారు మరికొందరు.

రెండు శ్లోకాలలోని ఈ నఖస్తుతిలాగా, లికుచతిలకసూను విరచితమైన నృసింహస్తుతి (23 శ్లోకాలు), భవిష్యోత్తరపురాణంలోని శనైశ్చరకృత నరసింహస్తుతి (12 శ్లోకాలు) కూడా ప్రచురమయినవే.

**ఛందస్సు -** ఈ శ్లోకం కేవలం శార్దూలవిక్రీడితమే. ✦



# వినాయక స్తుతి

| పొలుపుగ నీశుకంఠమునఁ బూనినయట్టికపాలమాలికల్ |
|---|
| వలనుగఁజూచి గొప్పలుగ వండినయుండ్రము లంచు భ్రాంతి లో |
| పల జనియించి తుండమునఁ బట్టి వడిం దివియంగఁజూచు వి |
| ద్యలగురుఁ డేకదంతుఁడు ముదంబున మత్కృతిఁ బ్రోచుఁగావుతన్ |

– కూచిమంచి తిమ్మకవి ప్రణీత "రాజశేఖరవిలాసము" నుండి

వ్యాఖ్య.– డా॥ తాడేపల్లి పతంజలి.

**ప్రతిపదార్థము :** పొలుపుగన్ = అందముగా; ఈశు కంఠమునన్ = పరమేశ్వరుని కంఠములో; పూనిన = ధరించిన; అట్టి కపాల మాలికల్ = అటువంటి పుఱ్ఱెల పంక్తులను; వలనుగన్ + చూచి = నేర్పుగా లేదా యుక్తముగా చూచి; గొప్పలుగవండిన = గొప్పగా వండిన; ఉండ్రములు + అంచు = ఉడికిన పిండియుండలు– ఉండ్రాళ్ళు అనుచు; భ్రాంతి = ఉన్నది లేనట్టును లేనిది ఉన్నట్టును తలచు బుద్ధి; లోపల జనియించి = హృదయములోపల పుట్టి; తుండమునన్ + పట్టి = ఖండించబడిన తన ఏనుగు చేతితో పట్టి; వడిన్ + తివియంగన్ + చూచు = వేగముగా వాటిని ఆకర్షించి, తినాలని ప్రయత్నించు; విద్యలగురుడు = విద్యల గురువైన; ఏకదంతుడు = ఒక దంతము గలవాఁడు. ఒంటికొమ్ముదేవర (ఏకః దంతో యస్య. బ.వ్రీ.); ముదంబునన్ = సంతోషముతో; మత్కృతిన్ = నా ఈ రాజశేఖర విలాసమను కావ్యమును; ప్రోచున్ + కావుతన్ = చక్కటి రచనా పద్ధతులతో పోషించి, చిరస్థాయిగా ఈ కావ్యము ఉండేటట్లు రక్షించవలసినదిగా మనవి.

**తాత్పర్యము :** పరమేశ్వరుని కంఠములో పుఱ్ఱెలున్నాయి. గుండ్రంగా ఉన్న వాటిని చూస్తుంటే వినాయకునికి ఉండ్రాళ్ళు గుర్తుకు వచ్చాయి. పుఱ్ఱెలను ఉండ్రాళ్ళనుకొని భ్రాంతితో– తినటానికి తొండంతో లాగుతుండే వినాయకుడు రక్షించాలని ప్రార్థన.

**విశేషాలు :** కూచిమంచి తిమ్మకవి రచించిన ఈ పద్యంలో భ్రాంతిమదాలంకారం ఉంది. ఇటువంటి అందమైన ఊహలకు ఆద్యులు శంకర భగవత్పాదులు.

**"సమం దేవి స్కంద ద్విప వదన పీతం స్తన యుగం**
**తవేదం నః ఖేదం హరతు సతతం ప్రస్నుత ముఖం**
**యదాలోక్యాదాశంకా కులిత హృదయో హాస జనకః**
**స్వ కుంభౌ హేరంబః పరి మృశతి హస్తేన ఝుటితి"** (సౌందర్యలహరి)

అని శంకర భగవత్పాదులు వినాయకుని భ్రాంతిని మనోహరంగా వర్ణించారు.

అమ్మా! నీ స్తన్యపానం చేస్తున్న వినాయకునికి నీ వక్షోజం చూసి ఒక అనుమానం వచ్చింది. తన కుంభస్థలం ఇక్కడ ఉన్నదేమిటనే భ్రాంతితో, తన కుంభ స్థలాన్ని తొండంతో తడిమి చూసు కొంటున్నాడు. కుమారుని అమాయకత్వానికి పార్వతీ పరమేశ్వరులు నవ్వుకొంటున్నారు. వినాయకుడు, కుమారస్వామి ఒకే సారి స్తన్యపానం చేస్తున్నారు. బిడ్డల మీద ప్రేమతో పాలు పొంగుతున్న ఆ వక్షోజాల జంట మా దుఃఖాన్ని పోగొట్టు గాక"

ఈ భ్రాంతిని పెద్దన అంకము జేరి...పద్యం లో చిరస్మరణీయం చేసారు.

**అంకము జేరి శైల-తనయా-స్తన-దుగ్ధము లాను వేళ బా-**
**ల్యాంక-విచేష్ట దొండమున నవ్వలి చన్ కబళింపబోయి యా**
**వంక కుచంబు గాన కహి-వల్లభ-హారము గాంచి వే మృణా-**
**ళాంకుర-శంక నంటెడు గజాస్యుని గొల్తు నభీష్ట-సిద్ధికిన్**

ఈ పద్యానికి విశ్వనాథ సత్యనారాయణ వారి అద్భుత వివరణమిది

అంకము, జేరి - తొడనెక్కి, తల్లితీసి తొడనెక్కించుకోలేదు. ఇతడే ఎక్కినాడు.

శైలతనయాస్తన దుగ్ధములు - తల్లి అయిన పార్వతి చనుబాలు. ఆమె కొండకూతురు. ఆమె యందు స్తన్యసమృద్ధి ఎంత ఉండునో తెలియదు. బాల్యాంక విచేష్టన్ - బాల్యమునకు చిహ్నమైన విశేషమైన చేష్టతో, శైశవము కాదు బాల్యం అంటే మకురుపాలు తాగుచున్నాడేమో. తొండమున నవ్వలి చన్గబళింపఁబోయి - పిల్లలు పాలు త్రాగుతూ విడిగా ఉన్న చేతితో తల్లి రెండవ మ్మును స్పృశించుదురు, పుణుకుదురు. ఈ చేష్టసరియే ఈ విఘ్నేశ్వరుడు తల్లియొక్క రెండవ చన్ను తొండంతో గ్రహించబోతున్నాడు. తనకు చేయి ఉన్నది కదా! ఇది బాల్యాంక విచేష్టము కాదు. ఏనుగు మొగము కలిగి ఉన్నవాని లక్షణము. అవ్వలి చన్ కబళింపఉబోయి - కబళించుట అనగా తినుట, కబళము - ముద్ద, చన్నును కబళింప బోవుటయేమి సరే! ఆవంక కుచంబుఁగాన కహివల్లభహారము గాంచి - వెదకినాడు కుచము కనిపించలేదు. హారముగా ఉన్న పాము కనిపించింది. హివల్లభుడే హారము. దానిని చూచినాడు. చూచినాడనగా తెలిసికొన్నాడని అర్థం. కాంచి అనకూడదు. అతడు అహివల్లభ హారముగా తెలిసికొనలేదు. అచట అహివల్లభహారము ఉండటంచేత అది మృణాళాంకురం అనుకున్నాడు. మృణాళాంకురం- తామర యొక్కతూటి మొక్క. అహివల్లభుడు అనగా వాసుకి. సర్పములకు రాజు. అతడు శివునికి ఆభరణం. అతన్ని మృణాళాంకురంగా అనుకోవడం ఎలా ఆవాసుకి శరీరం మహాదీర్ఘము, మహాస్థూలము అయి ఉండాలి. ఇది అర్ధనారీశ్వర మూర్తి యొక్క వర్ణన. ఇతడు గజాస్యుడు ఏనుగు మొగంవాడు. అభీష్టసిద్ధికై ఇతనిని కొలుచుటలో అతనియందభీష్టములు సమకూర్చు లక్షణములు లేవు. అలాంటి లక్షణాలు వర్ణింపబడలేదు. వ్యుత్పత్తి చేత గజ శబ్దం అర్థం మదంకలది - అని. యదార్థం గ్రహించలేనిది. ఇది లోకం స్వభావం. ఈ లోకమే విఘ్నేశ్వరుని ముఖం. ఈ లోకం వట్టి భ్రాంతిమయం. తెలిసికూడా

వట్టి భ్రాంతి. అర్ధనారీశ్వరుడు అనగా లోకము యొక్క మహాతత్వం. పుంజీభూతమై అట్టి దేవతా రూపం కట్టినాడు. పార్వతి, దుర్గ, ప్రక ృతి – పంచభూతముల సమాహారం. పరమేశ్వరుడు ఈ పంచభూతముల యందు అభివ్యాప్తమైన చైతన్యం. ముఖ్యప్రాణం. విజ్ఞానమయ బ్రహ్మ మొదలైనవి కావచ్చు. వారికి ముఖము మదముతో నిండిన కొడుకు పుట్టాడు. మదాన్ని మినహాయిస్తే వీడు పరమ చైతన్య స్వరూపం. అతనిని కూడా దేవతగా కన్పించి – మన మదం మనకు తగ్గరాదు – మన పనులు మనకు కావాలని అలాంటి విఘ్నేశ్వరుని ప్రార్థిస్తున్నాము. (విశ్వనాథ కావ్యపరీమళం వ్యాససంపుటి )

ఈ అంకముజేరి పద్య ప్రభావంతో “జననీస్తన్యము గ్రోలుచున్ జరణ కంజాతంబునన్ గింకిణీ/స్వన మింపారగ దల్లి మేన మ ృదుల స్పర్శంబుగా దొండ మ/ల్లన యాడించుచు జొక్కు విఘ్నపతి యుల్లాసంబుతో మంత్రి వె/న్ననికిన్ మన్నపు పొంపుమీర నొసగున్ భద్రంబు లెల్లెప్పుడున్” మొదలైన పద్యాలు వచ్చాయి.

కూచిమంచి తిమ్మకవి తతిమ్మా కవులకంటె భిన్నంగా ఈ వర్ణన చేసాడు.

పరమేశ్వరుని కంఠములో ష్టులను చూస్తుంటే వినాయకునికి ఉండ్రాళ్ళు గుర్తుకు వచ్చాయి. తినటానికి తొండంతో వాటిని లాగుతుండే వినాయకుడు రక్షించాలని ప్రార్థించాడు.

“వందే రుద్రం వరద మమలం దండినం ముండధారం” అని ఒక శివస్తుతి. ఆయన ముండ ధరుడు అంటే కపాల ధరుడు. శివుడి మెడలో కపాలాలు జీవులకు సంబంధించినవి. చనిపోయినవారి కపాలాలను ఆయన మెడలో ధరిస్తాడని ఒక కథనం. బ్రహ్మ దేవుడు చేసిన ఒక చిన్నతప్పువల్ల అతని అయిదవ ముఖం ఊడిపోయి, శివుని చేతిలో కపాలంగా – భిక్షా పాత్రగా మారిందట. బదరీ నారాయణ క్షేత్రంలోకపాలం ఊడి క్రిందపడిపోయి శిలామయ శివలింగరూపంగా మారిపోయింది,ఆనాటి నుండి శివలింగరూపధారి అయిన బ్రహ్మకపాలం మహా క్షేత్రమైందని మరొక కథనం.

**కపాలాల అసలు రహస్యం ఇది :** భ్రూమధ్యమునుంచి బ్రహ్మరంధ్రం వరకు అర్ధ చంద్రాకారములో రుద్రంలో చెప్పిన ధనస్సు ఆకారం వస్తుంది. దానికి సంకేతమే శివుని మెడలోని కపాల ధారణమని పెద్దలు ఆంతర్యాన్ని వివరించాను.

**ఉండ్రాళ్లు :** ఇదివరలో వినాయక చవితి నాటికి బాగా వర్షాలు పడేవి. వాతావరణములో వచ్చిన మార్పుల వలన రొంప, కలరా మొదలయిన వ్యాధులు బలాన్ని పుంజుకుంటాయి. నూనె తో చేసిన వంటకాలు ఈ వ్యాధులకు ఇంకా బలాన్నిస్తాయి. అందుకే నూనె పదార్థాలు కాకుండా ఉండ్రాళ్ళు మొదలయినవి శరీరానికి చాలా మంచిది. వినాయకునికి ఇష్టమయిన ఉండ్రాళ్ల నైవేద్యంలో ఈ ఆరోగ్య రహస్యం కూడా ఉంది. ఈ ఉండ్రాళ్లతో కపాలాలను పోల్చిన కవి ఊహ ప్రశంసనీయం.

**ముగింపు :** ఇతరుల కంటె భిన్నంగా, అందంగా ఆలోచించగలిగిన కవి రచనకు శాశ్వతత్వముంటుంది. కూచిమంచి తిమ్మయ విఘ్నేశవర్ణన అటువంటిదే. ఏనుగు లక్ష్మణకవి “తేనియ టేటలు మా కూచిమంచి తిమ్మయ మాటల్”అని ఒక పద్యంలో అన్నాడు. ఎవరూ కాదనలేని సత్యమిది. ✦





శ్రీః

# శ్రీ ఛిన్నమస్తాష్టోత్తరశతనామస్తోత్రమ్

శ్రీ పార్వత్యువాచ :

శ్లో॥ నామ్నాం సహస్రం పరమం – ఛిన్నమస్తాప్రియం శుభమ్ ।
కథితం భవతా శంభో – సద్యశ్శత్రునికృంతనమ్ ॥

శ్లో॥ పునః పృచ్ఛామ్యహం దేవ – కృపాం కురు మమోపరి।
సహస్రనామపాఠేన – అశక్తో యః పుమాన్ భవేత్ ॥

శ్లో॥ తేన కిం పఠ్యతే నాథ – తన్మే బ్రూహి కృపామయ ।

శ్రీ సదాశివ ఉవాచ :

శ్లో॥ అష్టోత్తరశతం నామ్నాం – పఠ్యతే తేన సర్వదా ।
సహస్రనామపాఠస్య – ఫలం ప్రాప్నోతి నిశ్చితమ్ ॥

ఓం అస్యశ్రీ ఛిన్నమస్తాష్టోత్తరశతనామస్తోత్రమహామంత్రస్య సదాశివ ఋషిః, అనుష్టుప్ఛందః, శ్రీఛిన్నమస్తా దేవతా, మమ సకలసిద్ధిప్రాప్తయే పాఠే వినియోగః ।

ధ్యానమ్

శ్లో॥ దక్షేణ ఖడ్గమథ వామకరేణ ఛిన్నశీర్షం నిజస్య దధతీం రుధిరం పిబంతీమ్।
శ్రీకామదంపతిమహాసనసంస్థితాం తాం నగ్నాం నమామి హ్యరుణామపి ఛిన్నమస్తామ్ ॥

ఓం

శ్లో॥ ఛిన్నమస్తా మహావిద్యా మహాభీమా మహోదరీ ।
చణ్డేశ్వరీ చణ్డమాతా చణ్డముణ్డప్రభంజనీ ॥ 1

శ్లో॥ మహాచణ్డా చణ్డరూపా చణ్డికా చణ్డఖణ్డినీ ।
క్రోధినీ క్రోధజననీ క్రోధరూపా కుహూః కలా ॥ 2

శ్లో॥ కోపాతురా కోపయుతా – కోపసంహారకారిణీ ।
వజ్రవైరోచనీ వజ్రా – వజ్రకల్పా చ డాకినీ ॥ 3

శ్లో॥ డాకినీకర్మనిరతా – డాకినీకర్మపూజితా ।
డాకినీసంగనిరతా – డాకినీప్రేమపూరితా ॥ 4

శ్లో॥ ఖట్వాంగధారిణీ సర్వా – ఖడ్గకర్పూరధారిణీ ।
ప్రేతాసనా ప్రేతయుతా – ప్రేతసంగవిహారిణీ ॥ 5

శ్లో॥ ఛిన్నముండధరా ఛిన్నచణ్డవిద్యా చ చిత్రిణీ ।
ఘోరరూపా ఘోరదృష్టిః – ఘోరరావా ఘనోదరీ ॥ 6

శ్లో॥ యోగినీ యోగనిరతా – జపయజ్ఞపరాయణా ।
యోనిచక్రమయీ యోని – ర్యోనిచక్రప్రవర్తినీ ॥ 7

శ్లో॥ యోనిముద్రా యోనిగమ్యా - యోనిమంత్రనివాసినీ ।
యంత్రరూపా యంత్రమయీ - యంత్రేశీ యంత్రపూజితా॥ 8

శ్లో॥ కీర్త్యా కపర్దినీ కాళీ - కంకాళీ కలవికారిణీ ।
ఆరక్తా రక్తనయనా - రక్తపానపరాయణా ॥ 9

శ్లో॥ భవానీ భూతిదా భూతి - ర్భూతిదాత్రీ చ భైరవీ ।
భైరవాచారనిరతా - భూతభైరవసేవితా ॥ 10

శ్లో॥ భీమా భీమేశ్వరీ దేవీ - భీమనాదపరాయణా ।
భవారాధ్యా భవనుతా - భవసాగరతారిణీ ॥ 11

శ్లో॥ భద్రకాళీ భద్రతను - ర్భద్రరూపా చ భద్రికా ।
భద్రరూపా మహాభద్రా - సుభద్రా భద్రపాలినీ ॥ 12

శ్లో॥ సుభవ్యా భవ్యవదనా - సుముఖీ సిద్ధసేవితా ।
సిద్ధిదా సిద్ధినివహా - సిద్ధాసిద్ధనిషేవితా ॥ 13

శ్లో॥ శుభదా సుభగా శుద్ధా - శుద్ధసత్త్వా శుభావహా ।
శ్రేష్ఠా దృష్టిమయీ దేవీ - దృష్టిసంహారకారిణీ ॥ 14

శ్లో॥ శర్వాణీ సర్వగా సర్వా - సర్వమంగళకారిణీ ।
శివా శాంతా శాంతిరూపా - మృడానీ మదనాతురా ॥ 15

ఓం

శ్లో॥ ఇతి తే కథితం దేవి స్తోత్రం పరమదుర్లభమ్ ।
గుహ్యాద్గుహ్యతరం గోప్యం - గోపనీయం ప్రయత్నతః ॥ 1

శ్లో॥ కిమత్ర బహునోక్తేన - త్వదగ్రే ప్రాణవల్లభే ।
మారణం మోహనం దేవి - హ్యుచ్చాటనమతః పరమ్ ॥ 2

శ్లో॥ స్తంభనాదికకర్మాణి - ఋద్ధయసిద్ధయోఽపి చ ।
త్రికాలపఠనాదస్య - సర్వేస్సిద్ధ్యంత్యసంశయమ్ ॥ 3

శ్లో॥ మహోత్తమం స్తోత్రమిదం వరాననే
మయేరితం నిత్యమనన్యబుద్ధయః ।
పఠన్తి యే భక్తియుతా నరోత్తమా
భవేన్న తేషాం రిపుభిః పరాజయః ॥ 4

- ఇతి శ్రీఛిన్నమస్తాష్టోత్తరశతనామస్తోత్రం సమాప్తమ్ -

✦ ✦ ✦

**ఓం ఐం హ్రీం శ్రీం క్లీం వజ్రవైరోచనీయే**
**హూం హూం ఫట్ స్వాహా ।**

*జానపద గీతం*

# దశావతారస్తుతి
## బేట్రాయి సామి దేవుడా!



బేట్రాయి సామి దేవుడా – నన్నేలినోడ – బేట్రాయి సామి దేవుడా
కాటేమి రాయుడా – కదిరినరసిమ్ముడా
మేటైన వేటుగాడ నిన్నే నమ్మితిరా ॥బేట్రాయి॥

శాప కడుపు సేరి పుట్టగా – రాకాసిగాని – కోపామునేసి కొట్టగా
ఓపినన్ని నీల్లలోన వలసీ వేగామె తిరిగి
బాపనోల్ల సదువులెల్ల బెమ్మదేవరకిచ్చినోడ ॥బేట్రాయి॥

తాబేలై తాను పుట్టగా ఆ నీల్లకాడ – దేవాసురులెల్లకూడగా
దోవసూసి కొండకింద దూరగానే సిల్కినపుడు
సావులేని మందులెల్ల దేవర్లకిచ్చినోడ ॥బేట్రాయి॥

అందగాడనవుదులేవయా – గోపాల గో
విందా రచ్చించా బేగరావయా
పందిలోన సేరి కోర పంటితోనె ఎత్తి భూమి
కిందు మిందు సేసినోడ సందమామ నీవె కాద ॥బేట్రాయి॥

నారసిమ్మ నిన్నె నమ్మితి – నానాటికైన – కోరితి నీ పాదమే గతీ
ఓరి నీవు కంబాన సేరి ప్రహ్లాదు గాచి
కోర మీసవైరిగాని గుండె దొర్లసేసినోడ ॥బేట్రాయి॥

బుడత బాపనయ్యవైతివి ఆ సక్కురవరితి
నడిగి భూమి నేలుకుంటివే
నిడువు కాల్లోడివై అడుగు నెత్తిపైన బెట్టి
తడవులేక లోకమెల్ల మెదిమతోటి తొక్కినోడ ॥బేట్రాయి॥

రెందుపదులు ఒక్కమారుతో ఆ దొరలనెల్ల
సెండాడినావు పరసుతో
సెందకోల బట్టి కోదండరామసామికాడ
బెండు కోల సేసికొనే కొండకాడకేగినోడ ॥బేట్రాయి॥

రామదేవ రచ్చించరావయా సీతమ్మతల్లి
శ్యామసుందర నిన్ను మెచ్చగా
సామి తండ్రిమాట గాచి ప్రేమ భక్తినాదరించి
ఆమైన లంకనెల్ల దోమనాకు సేసినోడ ॥బేట్రాయి॥

దేవకీదేవి కొడుకుగా ఈ జగములోన
దేవుడై నిలిచినావురా
ఆవూల మేపుకొనీ ఆడోళ్ళాగుడుకొనీ
తావుబాగ సేసుకొనీ తక్కిడి బిక్కిడి సేసినోడ ॥బేట్రాయి॥

ఏదాలు నమ్మరాదనీ ఆ శాస్త్రాలా
వాదాలూ బాగలేవనీ
బోధనలూ సేసికొనీ బుద్ధులూ సెప్పుకొనీ
నాదావినోదుడైన నల్లనయ్య నీవెకాద ॥బేట్రాయి॥

కలికి డ దొరవు నీవెగా ఈ జగములోన
పలికినావు బాలసిసువుడా
చిల్లకట్టు పురములోన సిన్నీ గోపాలుదొర
పిల్లంగోవె సేతబట్టి పేట పేట తిరిగినోడ ॥బేట్రాయి॥ 



# హర్యష్టకమ్

- వ్యాఖ్యాత - డా॥ సూరం శ్రీనివాసులు

(మాధ్వ సంప్రదాయంలో శ్రీమదానందతీర్థ, జయతీర్థుల తరువాత అంతటి మహనీయుడుగా కీర్తిప్రతిష్ఠల నందిన 'వాదిరాజతీర్థరు' రచించినదీ హర్యష్టకమ్. క్రీ.శ. 1480-1600 మధ్య జీవించిన శ్రీ వాదిరాజతీర్థరు **'భావిసమీర'** పదవిని పొందగలడని కూడా అనుయాయులు భావించేవారు. **మహాభారతలక్షణాలంకారం** (మహాభారత ప్రస్థానం), **మహాభారతతాత్పర్యనిర్ణయ** (శ్రీమదానందతీర్థకృతం) వ్యాఖ్య, **రుక్మిణీవిజయ మహాకావ్యం,** యుక్తిమల్లిక, స్వప్నవృందావనాఖ్యానం, సరసభారతీవిలాసం, శ్రుతితత్త్వ ప్రకాశిక, తీర్థప్రబంధం మొదలైనవి వాదిరాజ కృతులు. వీటితోపాటు ఎన్నో ఉపనిషత్తులకు టీకను, మరెన్నో స్తోత్రకృతులను కూడా విరచించి శ్రీవాదిరాజతీర్థరు భక్తిసాహిత్యానికీ, మాధ్వసంప్రదాయ ప్రచారానికి ఎంతో దోహదం చేశారు)

ప్రస్తుత **'హర్యష్టకమ్'** విష్ణుపారమ్యాన్ని బోధించే ఎనిమిది శ్లోకాల సమీకృతి. ఫలశ్రుతి ప్రబోధకంగా మరొక శ్లోకముంటుంది. అది హర్యష్టకానికి అర్థవాదరూపం.

**శ్లో॥ స్వముద్ధర్తుం హరే! వేత్తి కిం కూపే పతితః పశుః ।**
**క్షిపన్నంఘ్రిం ముహుః క్రందన్ కృపాం జనయతి ప్రభో! ॥ 1**

**ప్రతిపదార్థము :** హరే! = విష్ణూ!, కూపే = బావిలో, పతితః = పడినట్టి, పశుః = జంతువు, స్వమ్ = తనను, ఉత్ + హర్తుమ్ = పైకి లేపికొనుటకు (ఉద్ధరించుకొనుటకు), వేత్తి కిమ్? = ఎఱుగునా?, ప్రభో! = స్వామీ, ముహుః = మాటిమాటికీ, అంఘ్రిమ్ = కాలిని, క్షిపన్ = కదల్చుచూ (ఆత్మరక్షణలో గోవు తన గిట్టలతో భూమిని వెనుకకు నెడుతున్నట్లు చేసే చర్య), క్రందన్ = విలపిస్తూ, కృపామ్ = జాలిని, జనయతి = కలిగించును.

**తాత్పర్యము :** బావిలో లేదా గోతిలో పడిన పశువు తనను తానుగా పైకి రాలేదు. పైకి రావాలన్న తపనతో మాటిమాటికీ కాళ్ళు కదుల్చుతూ, దీనంగా విలపిస్తూ చూపరులకు జాలి కలిగిస్తుంది స్వామీ! నారాయణా!

విశేషాల : శ్లో॥ ఉద్ధరేదాత్మనాత్మానం నాత్మానమవసాదయేత్ ।
ఆత్మైవ హ్యాత్మనో బన్ధురాత్మైవ రిపురాత్మనః ॥

అని శ్రీకృష్ణముఖంగా వ్యాసవచనం భగవద్గీతలో 'తనను తానే ఉద్ధరించుకోవాలి. తనను తాను చెరుపుకోరాదు. తనకు బంధువయినా శత్రువయినా తానే' - అని నిక్కచ్చిగా చెప్పిన తరువాత కూడా జంతువు తనను తాను రక్షించుకొనగలదా? అని ప్రశ్నించటం శరణాగతి లక్షణం. ఇహ శరీరంలో సుఖదుఃఖాలను అనుభవిస్తున్న జీవుడికి కొన్నిచోట్ల కార్యకారణసంబంధం అవగాహనకు రాదు. కారణం తెలిస్తేనే కానీ పరిష్కరించుకొనే అవకాశం లేదు. ఒకవేళ తెలిసినా పరిష్కరించుకొనే శక్తి చాలదు. అది గతజన్మ కర్మఫలం కావటం, శక్తి సామర్థ్యాలు వర్తమానజన్మకు సంబంధించినవి కావటం అందుకు కారణం. కాబట్టి సర్వకారణస్వరూపుడైన శ్రీహరిని ఆశ్రయించటం భాగవతధర్మం.

నమో నమస్తేఽఖిలకారణాయ నిష్కారణాయాద్భుతకారణాయ ।
సర్వాగమామ్నాయ మహార్ణవాయ నమోఽపవర్గాయ పరాయణాయ ॥
– శ్రీమద్భాగవతమ్ – 8-3-15

అఖిలకారణుడూ, అద్భుతకారణుడూ అయి కూడా తాను నిష్కారణుడుగా నిలువగలగటం పరమాత్మకే సాధ్యం. మనలను కూడా అలా భావించి జీవించాలని ఉద్బోధ.

సంసారాన్ని సాగరంతోనో, బావితోనో పోల్చటం ఆధ్యాత్మికభావనలో చాలా ప్రసిద్ధం. ఉద్ధరణం అన్నది సముద్రంలో కన్న 'బావి'లోనే అనటమే బాగా అతికిపోయే పోలిక. ప్రహ్లాదుడు హిరణ్యకశిపునికి చేసిన బోధ కూడా ప్రధానాంశమిదే.

ఎల్ల శరీరధారులకు నిల్లను **చీకటినూతిలోపలం**
ద్రెళ్ళక వీరు నేమను మతిభ్రమణంబున భిన్నులై ప్రవ
ర్తిల్లక సర్వమున్నతని దివ్యకళామయమంచు విష్ణునం
దుల్లముఁజేర్చి తారడవినుండుట మేలు నిశాచరాగ్రణీ! భాగవతము7-142

**శ్లో॥ అనిచ్ఛతోఽపి తస్యాజ్ఞస్యాంగం కుక్షిం చ దామభిః ।**
**శనైర్నిబధ్య స్వజనైః హరే! స పరముద్ధరేత్ ॥ 2**

**ప్రతిపదార్థము :** హరే! = నారాయణా!, అనిచ్ఛతః + అపి = ఇష్టపడకపోయిననూ, అజ్ఞస్య = అవివేకి అయిన, తస్య = దానియొక్క (కూపంలో పడినదానియొక్క), అంగమ్ = శరీరావయవాన్ని (కాళ్ళు), కుక్షిం చ = పొట్టను, దామభిః = త్రాళ్ళతో, నిబధ్య = కట్టి, సః = ఆ పశువు, స్వజనైః = తనవారిచే (తనవారి ద్వారా), శనైః = మెల్లగా, పరమ్ = గట్టిగా (పరలోకం వైపుగా), ఉద్ధరేత్ = ఉద్ధరింపబడుగాక.

**తాత్పర్యము :** శ్రీహరీ! బావిలో పడిపోయిన ఆ పశువునకు ఇష్టంలేకపోయినా దానికి సంబంధించిన వారు దాని కాళ్ళనూ, పొట్టనూ త్రాళ్ళతో కట్టి మెల్లగా దానిని పైకి లాగుతారు.

**విశేషాలు :** ఈ శ్లోకంలో కర్తరి ప్రయోగంగా ఉన్న 'ఉద్ధరేత్' అన్న క్రియకు 'ఉద్ధ్రియేత' అని కర్మపరంగా అర్థం చెప్పుకోవాలి. లేకుంటే అన్వయం కుదరదు.

'హర్యష్టకం' లోని ఎనిమిది శ్లోకాలలోనూ 'హరే' అన్న సంబోధనాత్మక పద ముంటుంది. దానికి అనుగుణంగానే అర్థాన్ని చెప్పుకొనవలసివుంటుంది.

**'అనిచ్ఛతః'** అన్న పదం ఇక్కడ విశిష్టం. పశువు బావిలో పడిన తరువాత బాధపడుతూ కూడా, పైకి రావాలని కోరుకుంటూ కూడా, ఎవరైనా పైకి లాగటానికి ప్రయత్నిస్తున్నా వ్యతిరేకిస్తుంది. వారినే కుమ్మబోతుంది. అది దాని భయం. ఉన్న స్థితికన్న ప్రమాదకరమయిన పరిస్థితికి లోనవుతామేమో అని దాని భయం. ఆ భయంతో సహకరిస్తున్నవారితోనే పోరాడుతూ మరీ క్రుంగిపోతుంది. అందుకే ఆ పశువుకు ఇష్టం లేకున్నా మెల్లగా పైకి తేవాలి.

ధనం చ మే మే సదనం చ మే మే
దారాశ్చ మే మే తనయాశ్చ మే మే ।
మే మే వదన్ మేషసమో మనుష్యః
మే మే వదన్ కాలవృకేణ నీతః ।

"నా డబ్బు, నా ఇల్లు, నా భార్య, నా పిల్లలు అని ఎప్పుడూ 'మే' 'మే' (నాది, నాది) అనుకొంటూ – గొర్రె లాగా – మనిషి కాలమనే తోడేలుచేత కొనపోబడుతున్నాడు"

కాబట్టి బావిలో పడికూడా పైకి రావటానికి ఇష్టపడడు(దు). అయినా సరే స్వజనం దానిని పైకి లాగాలి.

అయితే... స్వజనమంటే? తనవారు. తనవారెవరు? తన భార్యాసుతులూనా? బంధువులూనా? కాదు. ఆదిశంకరులేమన్నారు?

కా తే కాంతా కస్తే పుత్రః – సంసారోఽయమతీవ విచిత్రః ।
కస్య త్వం వా కుత ఆయాతః – తత్త్వం చింతయ తదిహ భ్రాతః ॥

'భార్య ఎవరు? పుత్రుడెవడు? ఈ సంసారం విచిత్రతమం. నీవెవరివాడవు? ఎక్కడనుండి వచ్చావు? సోదరా! ఆ తత్త్వాన్ని గురించి ఆలోచించు. **'యతో వా ఇమాని భూతాని జాయన్తే. యేన జాతాని జీవన్తి. యత్ప్రయన్త్యభిసంవిశన్తి. తద్విజిజ్ఞాసస్వ'** అని తైత్తిరీయోపనిషత్తు బోధిస్తోంది. ఈ ప్రాణులన్నీ ఎక్కడినుండి వచ్చాయో, ఎవరివలన బ్రతుకుతున్నాయో, ఎవరిలో లీనమవుతున్నాయో అది తెలిసికోవాలి. దానికి దారిచూపే వారే స్వజనులు కానీ బంధువులూ, బంధాలూ కాదు. దానికి మార్గం సత్‌సాంగత్యమే. సత్‌సాంగత్యమంటే సజ్జనసాంగత్యం, సత్పదార్థసాంగత్యం కూడా.

కా తే కాంతా ధనగతచిన్తా – వాతుల కిం తవ నాస్తి నియన్తా ।
త్రిజగతి **సజ్జనసంగతిరైకా** – భవతి **భవార్ణవతరణే నౌకా** ॥ – భజగోవిందం-14

**శ్లో॥ స హరే! లాలయేత్పంకం క్షాలయేత్పాలయేత్తృణైః ।**
**శమయేదోషధైర్మంత్రైః స్వగోష్ఠస్థస్య వేదనామ్ ॥ 3**

**ప్రతిపదార్థము :** హరే! = నారాయణా!, సః = ఆ పశువు (బావిలో పడి కొట్టుకుంటున్న పశువు), లాలయేత్ = లాలింపబడవలె (బుజ్జగింపబడవలెను – వాస్తవానికి ఇక్కడ కూడా తప్పనిసరియై కర్మణి ప్రయోగార్థాన్ని చెప్పవలసి వస్తోంది.), పంకమ్ = బురద, క్షాళయేత్ = కడుగబడవలెను, తృణైః = గడ్డి (పరకల)చే, పాలయేత్ = పోషింపబడవలెను, స్వగోష్ఠ-స్థస్య = తన గోశాలలో నున్న దానియొక్క వేదనామ్ = బాధను, ఓషధైః = మందులచే, మంత్రైః = మంత్రాలచే, శమయేత్ = తొలగజేయబడవలెను.

**తాత్పర్యము :** శ్రీహరీ! (బావిలో పడి తనను తానుద్ధరించుకొనలేని స్థితీ, పరులు ప్రయత్నించినా పైకి రానిచ్చగింపని స్థితిలో వున్న) ఆ పశువును హరియే లాలించాలి. బురద కడగాలి. గడ్డిపెట్టి పోషించాలి. అది తన అధీనంలోనే వున్నది కాబట్టి మందులతో కానీ, మంత్రాలతో కానీ దాని వేదనను తొలగించాలి.

**విశేషాలు : 'నారు పోసినవాడే నీరు పోస్తాడు'** అన్నది మన విశ్వాసం. ఆ విశ్వాసాన్ని పరమాత్మ కర్తవ్యంగా ప్రతిపాదిస్తున్నారీ శ్లోకంలో వాదిరాజతీర్థరు. ఇదంతా విష్ణుమాయయే కాబట్టి లాలించటం, బురద కడగటం, గడ్డిపెట్టి పోషించటం, మందో మంత్రమో వాడి బాధను తొలగించటం ఆయన కర్తవ్యమే.

అనన్యాశ్చిన్తయన్తో మాం – యే జనాః పర్యుపాసతే ।
తేషాం నిత్యాభియుక్తానాం – యోగక్షేమం వహామ్యహమ్ ॥ –భ.గీ. 9-22

అన్న భరోసా పరమాత్మ ఇచ్చినదే కదా! **'అనన్య భావంతో నిత్యమూ తనను ఉపాసించిన వారి యోగక్షేమాల బాధ్యత'** తనదే కదా! నిత్యాభియుక్తత అన్న అంశాన్నే స్వగోష్ఠస్థత అని వాదిరాజతీర్థరు ప్రతిపాదించారు.

ఆధివ్యాధుల (మానసిక, శారీరక రోగాల) నివారణకు అథర్వవేదంలో అనేక మంత్రాలు, ఓషధులు ఉన్నాయి. రుద్రాధ్యాయంలోని నమకమంత్రాలనూ, రామాయణం, సౌందర్యలహరి వంటి గ్రంథాలనూ, మహాభారతంలోని విష్ణుసహస్రనామాన్నీ, శివసహస్ర నామాన్నీ, దుర్గాస్తుతినీ, బ్రహ్మాండపురాణంలోని లలితాసహస్రనామాన్నీ... ఇంకా ఇటువంటి స్తోత్రపాఠాలను, పూర్తిగా కానీ, పాక్షికంగా కానీ వేదనా నివారక మంత్రాలుగా వినియోగిస్తున్నారు.

రోగార్తో ముచ్యతే రోగాత్ బద్ధో ముచ్యేత బంధనాత్ ।
భయాన్ముచ్యతే భీతస్తు ముచ్యేతాపన్న ఆపదః ॥

అని విష్ణుసహస్రనామం కంఠోక్తిగానే ఫలస్వరూపాన్ని ప్రబోధించింది.

**శ్లో॥ తథా నరపశోరీశ! భవకూపేఽర్దితస్య మే ।**
**హరే! పరిహరాశేషక్లేశం కేశిఘ్న! కేశవ! ॥ 4**

పై మూడు శ్లోకాలలో రూపకాతిశయోక్తితో ఉపమేయాన్ని మరుగుపరచి ఉపమానాన్ని మాత్రమే చెప్పిన రచయిత ఆ ఉపమానాంశాన్ని ఉపమేయంతో 'తథా' అని జతపరుస్తూ పోలికను చెప్తున్నాడు –

**ప్రతిపదార్థము :** ఈశ! = పరిపాలకా!, హరే! = నారాయణా!, కేశిఘ్న! = కేశిని సంహరించిన వాడా!, కేశవ! = విష్ణూ, తథా = పైన చెప్పిన రీతిగా, భవకూపే = సంసారమనే బావిలో, అర్దితస్య = బాధింపబడినట్టి, నరపశోః = మానవజంతువునైన, మే = నాయొక్క, అశేషక్లేశమ్ – అశేష = సమస్తమైన, క్లేశమ్ = కష్టాన్ని, పరిహర = తొలగించు.

**తాత్పర్యము :** ఈశా! హరీ! కేశిసంహారా! కేశవ! గోవు బావిలో పడి బాధపడుతున్నట్టు సంసారమనే బావిలో పడి పీడింపబడుతున్న నరపశువునైన నా కష్టాలను కూడా పూర్తిగా తొలగించు.

**విశేషాలు :** ఈ శ్లోకంలో **'నరపశోః' 'భవకూపే'** అని రెండు రూపకాలంకారాలు కవి మనోహరంగా ప్రయోగించాడు. నరుడనే పశువు, సంసారమనే బావి అని ఆ ఆరోపణలు. ఇల్లు, ఇల్లాలు ఇవన్నీ బంధాలే అని భాగవతం ఎంతగానో వ్యాఖ్యానించింది.

తత్సాధు మన్యేఽసురవర్య దేహినాం
సదా సముద్విగ్నధియామసద్గ్రహాత్ ।
హిత్వాత్మపాతం **గృహమంధకూపం**
వనం గతో యద్ధరిమాశ్రయేత్ ॥ –శ్రీమద్భాగవతమ్–7–5–5

అని గృహాన్ని చీకటి బావిగా ప్రహ్లాదుని ద్వారా వ్యాసముని ప్రబోధించాడు. కానీ ప్రాణికి చీకటిభయం కన్న బ్రతుకుభయం పెద్దది కాబట్టి చీకటయినా సరే ప్రాణాలు మిగిలితే చాలనుకొంటుంది.

ఈ శ్లోకంలో పరమాత్మ (నారాయణ) పరంగా ఈశ, హరి, కేశిఘ్న, కేశవ అని నాలుగు పదాలు కనిపిస్తున్నాయి. వాటిని గురించి కొంచెమాలోచించాలి.

**ఈశః :** ఈష్టే ఇతి ఈశః (ఈశ ఐశ్వర్యే ధాతువు). అనగా ఐశ్వర్యయుక్తుడు అని అర్థం. ఈ పదాన్ని అమరకోశం శివపర్యాయపదంగానే చెపుతుంది. అయితే యోగార్థంతో దానిని విష్ణుపరంగా స్వీకరించవచ్చు. పాలక పర్యాయంగా కూడా ఈశ పదాన్ని ఉపయోగిస్తారు. ప్రజారక్షణ, పాలన కర్తవ్యాన్ని

పాలకుడు స్వీకరించాలని కాళిదాసు అంటాడు రఘువంశంలో. ఇక భక్తసంరక్షణలో భగవంతుని పాత్రను గురించి చెప్పవలసిన దేముంది.

**హరిః :** హరతీతి హరిః (హృఞ్ హరణే ధాతువు) హరించువాడు. విష్ణుపరంగా ప్రసిద్ధమైన ఈ పదాన్ని అమరకోశం విష్ణుపర్యాయపదంగా చూపలేదు. హరించుట అనే లక్షణాన్ని బట్టి ఔపచారికంగా వాడే పదమిది.

**కేశిఘ్నః :** కేశినం హతవాన్ ఇతి కేశిఘ్నః (కేశిని చంపినవాడు). కేశి అనువాడొక రాక్షసుడు. మహాభారతంలో వనపర్వం ప్రకారం ఈ కేశి విష్ణుమూర్తితో పదమూడు రోజులు యుద్ధం చేశాడు. మహాభాగవతం ప్రకారం కేశి రాక్షసుడే కానీ కంసుని అనుచరుడు. కంసుని ఆదేశం మేరకు అశ్వరూపంతో గోకులానికి వెళ్ళి కృష్ణుని చేతిలో మరణించాడు. కేశిని చంపాడు కాబట్టి కృష్ణుడు కేశిఘ్నుడయ్యాడు. కేశవ పదం అందువలననే వచ్చినదని మలయాళంలోని భాగవతం అంటోంది.

**కేశవః :** కేశం వాతి ఇతి కేశవః = కేశిని సంహరించినవాడు. కేశాః ప్రశస్తాః సంతి అస్య ఇతి = కేశవః, చక్కని వెంట్రుకలు గలవాడు. కశ్చ ఈశశ్చ = కేశౌ, తౌ అస్మిన్ స్తః = కేశవః = బ్రహ్మరుద్రులు తనయందు గలవాడు.

> క ఇతి బ్రహ్మణో నామ ఈశోఽహం సర్వదేహినామ్ ।
> ఆవాం తవాంగే సంభూతౌ తస్మాత్ కేశవనామవాన్ । (హరివంశం)

కేశవశబ్దం పరమాత్మపరంగా కూడా అన్వయిస్తుంది. కశ్చ అశ్చ ఈశశ్చ సంతి వశే అస్య = బ్రహ్మ విష్ణు రుద్రులు తన వశంలో వుండువాడు = పరమాత్మ.

> **శ్లో॥ మాం హి జీవన్మృతం కర్తుం యతన్తే పరితః ఖలాః ।**
> **తాన్నిహత్య హరే! శీఘ్రం సేవాయాం తే నియుంక్ష్వ మామ్ ॥ 5**

**ప్రతిపదార్థము :** మామ్ = నన్ను, జీవన్మృతమ్ = బ్రతికి యున్నపుడే మరణించిన వానిగా, కర్తుమ్ = చేయుటకు, పరితః = చుట్టూ ఉన్న, ఖలాః = నీచులు, యతన్తే = ప్రయత్నించుచున్నారు. హరే! = నారాయణా!, తాన్ = ఆ నీచులను, నిహత్య = చంపి, శీఘ్రమ్ = త్వరగా (వెంటనే), మామ్ = నన్ను, తే = నీయొక్క, సేవాయామ్ = సేవయందు, నియుంక్ష్వ = నియోగింపుము.

**తాత్పర్యము :** నారాయణా! నా చుట్టూ ఉన్న నీచులు నన్ను జీవన్మృతునిగా చేయాలని ప్రయత్నిస్తున్నారు. వారిని చంపి, నన్ను వెంటనే నీ సేవలో నియోగించు.

**విశేషాలు :** ఈ శ్లోకంలో తాత్త్విక ప్రార్థన కన్నా భౌతికలక్షణాలకు సంబంధించిన ఆర్తి కనిపిస్తుంది. ఆర్తి కూడా భగవత్సేవకూ, శరణాగతికీ మూలమే.

> చతుర్విధా భజన్తే మాం జనాస్సుకృతినోఽర్జున! ।
> ఆర్తో జిజ్ఞాసురర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ! ॥ – భగవద్గీత 7-16.

ఆర్తుడు, జిజ్ఞాసువు, అర్థార్థి, జ్ఞాని – ఈ నాలుగువిధాలవారు నన్ను సేవిస్తారు – వారి సుకృతపరిపాకం వలన. తనను జీవన్మృతుని చేయాలని ప్రయత్నిస్తున్నారనీ, వారిని సంహరింపుమని ప్రార్థించటంలో తన నిస్సహాయత కనిపిస్తుంది. గొప్ప ఆధ్యాత్మిక తత్త్వవేత్తగానే కాక గొప్ప పరిపాలకుడుగా కూడా (మఠం విషయంలో) వాదిరాజతీర్థరుకు ప్రశస్తి ఉన్నది. ఆ పరిపాలనలోని ఆటుపోట్ల ప్రభావం ఈ

శ్లోకంపై పడివుండవచ్చు. లేకపోతే అంత తీవ్రమయిన ఆత్మాశ్రయతకు అవకాశం లేదు. అంతశ్శత్రువులను అదుపుచేసే ప్రయత్నంలో సాధన చేస్తున్నవారిని బాహ్యశత్రువులు కూడా పీడించటం శోచనీయం. హరిపదసమాశ్రయణ మప్పుడు తప్పని పని.

**శ్లో॥ కామాద్యాంతరశత్రుభ్యో బాహ్యశత్రుభ్య ఏవ చ ।**
**భీతం హరేఽసురాద్భీతప్రహ్లాదాహ్లాద! పాహి మామ్ ॥ 6**

**ప్రతిపదార్థము :** హరే = నారాయణా!, అసు...హ్లాద! – అసురాత్ = రాక్షసునివలన, భీత = భయపడిన, ప్రహ్లాద = ప్రహ్లాదునకు (ప్రహ్లాదుడు హిరణ్యకశిపుని కొడుకు), ఆహ్లాద = ఆనందాన్ని కల్గించినవాడా!, కామా..... శత్రుభ్యః – కామ + ఆది = కామం మొదలుగా గల, ఆంతర = లోనున్న, శత్రుభ్యః = శత్రువులనుండి, బాహ్య శత్రుభ్యః – బాహ్య = వెలుపల వున్నటి, శత్రుభ్యః = శత్రువులనుండి, చ = కూడా, భీతమ్ = బెదరిన, మామ్ = నన్ను, పాహి ఏవ = రక్షించనే రక్షించు.

**తాత్పర్యము :** శ్రీహరీ! కామం మొదలయిన అంతశ్శత్రువులు, (నీచులయిన) బాహ్యశత్రువులు నన్ను బాధిస్తున్నారు, భయపెడుతున్నారు. రాక్షసునికి (తన తండ్రికి) భయపడిన ప్రహ్లాదునికి ఆహ్లాదాన్ని కలిగించినట్లు నన్ను రక్షించు.

**విశేషాలు :** కామం, క్రోధం, లోభం, మోహం, మదం, మాత్సర్యం ఇవి (ఆరు) మనలోపల వుండి మనలనే ఇబ్బందులు పెట్టేవి. అందుకే వాటిని అంతశ్శత్రువు లన్నారు. లోభ మోహ మద మాత్యర్యాలను జయించినవారు ఎందరో కనిపిస్తారు కానీ కామక్రోధాలను జయించినవారు అరుదుగానే వుంటారు.

కామ ఏష క్రోధ ఏష రజోగుణసముద్భవః ।
మహాశనో మహాపాప్మా విద్ధ్యేనమిహ వైరిణమ్ ॥ – భగవద్గీత – 3–37

అంటుంది గీత. రజోగుణం నుండి పుట్టిన కామ, క్రోధాలు జ్ఞానాన్ని ఆవరిస్తాయి. కళ్ళకు పొగగ్రమ్మినట్లు. ఎంత ఆహారాన్ని అందించినా వాటి ఆకలి తీరదు.

అయితే పురుషార్థాలలో కూడా కామాన్ని పరిగణించారు గదా! వాస్తవమే. అక్కడ కామం ధర్మంతో అనుబద్ధమై వుంటుంది కాబట్టి అది పురుషార్థం.

బలం బలవతాం చాహం కామరాగవివర్జితమ్ ।
**ధర్మవిరుద్ధో భూతేషు కామోఽ**స్మి భరతర్షభ ॥ – భగవద్గీత – 7–11

అందువలన ధర్మాన్ని అతిచరించని కామం దైవస్వరూపమే.

'రాక్షసునికి భయపడిన ప్రహ్లాదునికి ఆహ్లాదాన్ని కలిగించినట్లు' అన్న మాటను కూడా పరిశీలించాలి. ప్రహ్లాదుడు తన తండ్రికి భయపడినాడా? దైవవిశ్వాసంతో ధైర్యంగా నిలిచాడా? ప్రహ్లాదుడు ఒకవేళ భయపడి వుంటే శ్రీహరితో శత్రుత్వాన్ని వహిస్తున్న తన తండ్రికి ఏమయినా కీడు కలుగుతుందేమో అని భయపడి వుండవచ్చు. అంతేగాని తన గురించి భయపడలేదు. భావనాత్మకమయిన తన విశ్వాసానికి విష్ణువు మూర్తీభావాన్ని కల్గించినందుకు ప్రహ్లాదుడు ఆనందించి యుండవచ్చు అంతేకాని తండ్రి మరణం తనకు ఆహ్లాదకరం కాకపోవచ్చు సాధారణ స్థితిలో.

'అసురాద్భీతం' ఒక పాఠాంతరం కనిపిస్తోంది. ఆ పాఠాన్ని స్వీకరిస్తే భయవిషయ సంశయం తొలగకపోగా అన్వయంకూడా కుదరని స్థితి ఏర్పడుతుంది.

కాబట్టి తప్పనిసరి పరిస్థితిలో ప్రహ్లాదుడు కూడా అసురునకు భయపడ్డాడని చెప్పటమే యుక్తంగా కనిపిస్తోంది.

**శ్లో॥ వ్యాధీనాధీనరీన్ రాజ్ఞో ద్రోహిణోఽన్యాంశ్చ దుర్జనాన్ ।**
**క్షిప్రం నాశయ సర్వజ్ఞ! సర్వశక్తే! హరే! మమ ॥ 7**

**ప్రతిపదార్థము :** సర్వజ్ఞ! = అన్నీ తెలిసినవాడా! (సర్వం జానాతి ఇతి సర్వజ్ఞః), సర్వశక్తే! = అన్నిశక్తులూ కలవాడా!, హరే! = నారాయణా, మమ = నాయొక్క, వ్యాధీన్ = (శరీరానికి సంబంధించిన) రోగాలనూ, ఆధీన్ = (మానసికాలయిన) రోగాలనూ, అరీన్ = శత్రువులను, రాజ్ఞః = ప్రభువుయొక్క, ద్రోహిణః = ద్రోహులను (రాజద్రోహులనని భావం), అన్యాన్ + చ = ఇతరులైన, దుర్జనాన్ = చెడ్డవారిని, క్షిప్రమ్ = వేగంగా, నాశయ = నశింపజేయుము.

**తాత్పర్యము :** శ్రీహరీ! నీవు సర్వజ్ఞుడవు. సర్వశక్తిసంపన్నుడవు. నా వ్యాధులను, మనోవ్యథలను, నా శత్రువులను, నా రాజ్యానికి ద్రోహం చేస్తున్నవారిని, ఇతర దుర్జనులనూ త్వరగా నశింపజేయవలసినది.

**విశేషాలు :** సర్వజ్ఞ – సర్వశక్తి పదాలు సాభిప్రాయాలు. ఇతరులు మనకు సహకరించాలంటే రెండు అంశాలు ప్రధానం. ఒకటి మన అవసరం వారికి తెలియటం, రెండు దానికి సహకరించగల శక్తి వారికి వుండటం. ఈ రెండింటినీ స్ఫురింపజేస్తూ సర్వజ్ఞ, సర్వశక్తి పదాలు సార్థకమయ్యాయి.

వ్యక్తిగతంగా తన కవసరమయిన వాటిని కోరుకోవటంతో పాటు సామాజిక దృష్టితో రాజద్రోహులను నశింపజేయమని కోరటం శ్లోకానికి ఉదాత్తతను చేకూరుస్తోంది.

**శ్లో॥ కలిం ఖణ్డయ తద్భృత్యాన్ దండయాశు హరే! మమ ।**
**మనశ్శోధయ సత్తత్త్వం బోధయేష్టం ప్రసాదయ ॥ 8**

**ప్రతిపదార్థము :** హరే! = నారాయణా, కలిమ్ = కలి (పురుషు)ని, ఖణ్డయ = నరకుము, తత్ + భృత్యాన్ = అతని సేవకులను, ఆశు = వేగంగా, దండయ = శిక్షింపుము, మమ = నాయొక్క, మనః = మనస్సును, శోధయ = ప్రక్షాళన చేయుము, సత్ + తత్త్వం = సత్పదార్థ స్వరూపాన్ని (మంచిగా ప్రవర్తించే లక్షణాలను), బోధయ = నేర్పుము, ఇష్టమ్ = కోరిన దానిని, ప్రసాదయ = అనుగ్రహింపుము (అందజేయుము).

**తాత్పర్యము :** శ్రీహరీ! కలిపురుషుని ఖండించు. ఆ కలిని అనుసరించి నడిచేవారిని శిక్షించు. నా మనస్సును శోధించు. సత్పదార్థాన్ని బోధించు. ఇష్టసిద్ధిని కల్పించు.

**విశేషాలు :** యుగాలలో నాల్గవది కలియుగం. ధర్మం ఒక్క పాదం మీదనే నిలవటం కలియుగ లక్షణం. పాప స్వరూపమే కలి. కశ్యపప్రజాపతికి మునియందు పుట్టిన పదిహేనవ కొడుకు కలి. తానొక దేవగంధర్వుడు.

శ్రీమహాభాగవతంలో కలిపురుష ప్రస్తావన ఉంది. పరీక్షిన్మహారాజుకు లోబడిన కలిని దేశబహిష్కరణను విధిస్తాడు ఆ రాజు. నిరాశ్రయభయంతో వున్న కలికి "ప్రాణివధ – స్త్రీ – ద్యూత – పానంబు లనియెడు నాలుగు స్థానంబులనిచ్చి, మఱియు నడిగిన సువర్ణమూలకంబగు నసత్య – మద – కామ – హింస – వైరంబు లనియెడు పంచ ప్రదేశంబుల" నిచ్చాడు. (భాగవతం – ప్రథమ స్కంధం – 433) కాబట్టి పైన చెప్పిన ప్రదేశాలలో కలి మానవులను పట్టి పీడించే అవకాశముంది.

అయితే కలికి లోబడకుండా బ్రతకటానికి పౌరాణికులు కొన్ని ఉపాయాలను చెప్పారు.

కర్కోటకస్య నాగస్య దమయంత్యా నలస్య చ ।
ఋతుపర్ణస్య రాజర్షేః కీర్తనం కలినాశనమ్ ॥

అన్నది ప్రసిద్ధ శ్లోకం. నలకథాశ్రవణం కలికల్మషాన్ని తొలగిస్తుంది. మహాభారతంలో నలకథా ఫలశ్రుతిగా వ్యాసమహర్షి చెప్పాడు. ఆ విశ్వాసాన్నే బలపరుస్తూ నలచరిత్రను కావ్యంగా వ్రాసిన శ్రీహర్షుడిలా అన్నాడు.

పవిత్రమత్రాతనుతే జగద్యుగే – స్మృతా రసక్షాలనయేవ తత్కథా ।
కథం న సా మద్గిరమావిలామపి – స్వసేవినీమేవ పవిత్రయిష్యతి ॥
– నైషధీయ చరితమ్ –1–3

“ఈ కలియుగంలో నలకథా స్మరణమాత్రమే నీటితో శుద్ధి చేసినట్లు పవిత్రతను కలిగిస్తుంది. ఇక తననే సేవించే నా పలుకు నది పవిత్రం చేయలేదా!

**కలిసంతరణోపనిషత్తు** కంఠోక్తిగా కలినుండి బయటపడే మార్గాన్ని సూచించింది. నారదుని కోరికపై బ్రహ్మ ఆ మంత్రాన్ని ఉపదేశించారు. అది –

**శ్లో॥ హరేరామ హరేరామ రామరామ హరేహరే ।**
**హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణకృష్ణ హరేహరే ॥**

**శ్లో॥ ఇతి షోడశకం నామ్నాం కలికల్మషనాశనమ్ ।**
**నాతః పరతరోపాయః సర్వవేదేషు దృశ్యతే ॥**

కాబట్టియే వాదిరాజతీర్థరు హర్యష్టకంలోని ప్రతి శ్లోకంలోనూ ‘హరే’ అని సంబోధనను ప్రయోగించారు.

**శ్లో॥ వాదిరాజయతిప్రోక్త–మేవం హర్యష్టకం నవమ్ ।**
**పఠన్నృసింహకృపయా–రిపూన్ సంహరతి క్షణాత్ ॥ 9**

**ప్రతిపదార్థము :** ఏవమ్ = ఈరీతిగా, వాదిరాజ–యతి–ప్రోక్తమ్ – వాదిరాజయతి = వాదిరాజమునిచే, ప్రోక్తమ్ = చెప్పబడినట్టి, నవమ్ = క్రొత్తదైన, హరి+అష్టకమ్ = హరిస్తుతిరూపమైన ఎనిమిది శ్లోకాల సంపుటిని, పఠన్ = చదువుతూ, నృసింహ కృపయా – నృసింహ = నరసింహ స్వరూపుడైన శ్రీహరియొక్క, కృపయా = దయచే, క్షణాత్ = త్రుటికాలంలో, రిపూన్ = శత్రువులను, సంహరతి = చంపగలడు.

**తాత్పర్యము :** ఈ రీతిగా వాదిరాజయతి మరో కొత్త హర్యష్టకాన్ని నిర్మించారు. దీనిని చదువుతూ, నరసింహుని దయతో క్షణకాలంలోనే శత్రువులను చంపగలడు (భక్తుడు).

**విశేషాలు : ‘పఠన్’** అని శత్రంతప్రత్యయాన్ని ప్రయోగించట మిక్కడ విశేషం. చదవటానికి – శత్రుసంహారం చేయగలగటానికి మధ్య అసలు వ్యవధానమే వుండదని సూచించటానికి ఈ **శతృప్రత్యయప్రయోగం.**

ఇది క్రొత్త **హర్యష్టకం**. అంటే హర్యష్టకం పేరుతో మరొకటుంది. అది ప్రహ్లాద కృతమ్. ఈ సందర్భంలో దానిని కూడా ఉదాహరిస్తూ విరమిస్తా –

శ్లో॥ హరిర్హరతి పాపాని దుష్టచిత్తైరపి స్మృతః ।
అనిచ్ఛయాపి సంస్పృష్టో దహత్యేవ హి పావకః । **1**

శ్లో॥ స గంగా స గయా సేతుః స కాశీ స చ పుష్కరమ్ ।
జిహ్వాగ్రే వర్తతే యస్య హరిరిత్యక్షరద్వయమ్ ॥ **2**

శ్లో॥ వారాణస్యాం కురుక్షేత్రే నైమిశారణ్య ఏవ చ ।
యత్కృతం తేన యేనోక్తం హరిరిత్యక్షరద్వయమ్ ॥ **3**

శ్లో॥ పృథివ్యాం యాని తీర్థాని పుణ్యాన్యాయతనాని చ ।
తాని సర్వాణ్యశేషాణి హరిరిత్యక్షరద్వయమ్ ॥ **4**

శ్లో॥ గవాం కోటి సహస్రాణి హేమకన్యాసహస్రకమ్ ।
దత్తం స్యాత్తేన యేనోక్తం హరిరిత్యక్షరద్వయమ్ ॥ **5**

శ్లో॥ ఋగ్వేదోఽథ యజుర్వేదః సామవేదోఽప్యథర్వణః ।
అధీతస్తేన యేనోక్తం హరిరిత్యక్షరద్వయమ్ ॥ **6**

శ్లో॥ అశ్వమేధమహాయజ్ఞైః నరమేధైస్తథైవ చ ।
ఇష్టం స్యాత్తేన యేనోక్తం హరిరిత్యక్షరద్వయమ్ ॥ **7**

శ్లో॥ ప్రాణప్రయాణపాథేయం సంసారవ్యాధినాశనమ్ ।
దుఃఖాత్యన్త పరిత్రాణం హరిరిత్యక్షరద్వయమ్ ॥ **8**

శ్లో॥ బద్ధః పరికరస్తేన మోక్షాయ గమనం ప్రతి ।
సకృదుచ్చారితం యేన హరిరిత్యక్షరద్వయమ్ ॥ **9**

శ్లో॥ హర్యష్టకమిదం పుణ్యం ప్రాతరుత్థాయ యః పఠేత్ ।
ఆయుష్యం బలమారోగ్యం యశోబుద్ధిం చ విన్దతి ॥ **10**

శ్లో॥ ప్రహ్లాదేన కృతం స్తోత్రం దుఃఖసాగరశోషణమ్ ।
యః పఠేత్స నరో యాతి తద్విష్ణోః పరమం పదమ్ ॥ **11**

ఇక్కడ పదకొండు శ్లోకాలు కనిపిస్తున్నాయి. మొదటిది ప్రవేశిక. చివరి రెండూ ఫలశ్రుతి రూపాలు. **'హరిరిత్యక్షరద్వయమ్'** అన్న మకుటంతో వున్న ఎనిమిది శ్లోకాలూ 'హర్యష్టకమ్'. ✦

ఓం నమో నారాయణాయ

# యోగకుండల్యుపనిషత్ - ఖేచరీవిద్య

- వ్యాఖ్యాత - డా॥ సూరం శ్రీనివాసులు

ఉపనిషత్తులు భారతీయుల తత్త్వశాస్త్రానికి పునాదులు, ఆ పునాదులపై నిర్మించిన జ్ఞానభాండాగారాలు కూడా! మరణానంతరస్థితిమీద కలిగిన విచికిత్స జననమరణ చక్రానికి సంబంధించిన సమస్తాన్వేషణలకూ ఆలవాలమై అంతులేని వేదాంతాన్ని అందించింది ఉపనిషద్వాఙ్మయం.

ఆత్మజ్ఞానం ద్వారా ఆనందాన్ని పొందగలగటాన్ని, ఆపై ఆత్మజ్ఞానాన్నే ఆనందంగా భావించటాన్నీ, విశ్వమంతా పరమాత్మ స్వరూపంగా, పరమాత్మను ఆనంద స్వరూపునిగా, ఆనందానుభవమే జీవనలక్ష్యంగా సిద్ధాంతీకరించటాన్నీ మనకు ఉపనిషత్తులే నేర్పాయి.

సాంఖ్యమార్గంలోనూ, యోగ మార్గం లోనూ కూడా ఆనందాన్వేషణనూ; యోగమార్గంలోనూ శారీరక మానసిక యోగసాధననూ నిర్దేశించాయి.

శారీరకమయిన యోగమార్గంలో ప్రాణాయాది విశేష ప్రక్రియలనూ, విశేషాసనాలనూ, ముద్రలను సూచిం చాయి. ఆ విధమయిన యోగశాస్త్రాన్ని నిర్దేశిస్తున్న ఉపనిషత్తులు యోగోపనిషత్తులు. అవి

**ఋగ్వేదం :-** నాదబిందూపనిషత్తు

**యజుర్వేదం :-** యోగకుండల్యుపనిషత్తు, యోగతత్త్వోపనిషత్తు. యోగశిఖోపనిషత్తు. అద్వయోపనిషత్తు. అమృతనాదోపనిషత్తు. అమృతబిందూపనిషత్తు. క్షురికోపనిషత్తు. తేజోబిందూపనిషత్తు. త్రిశిఖిబ్రహ్మోపనిషత్తు. ధ్యానబిందూపనిషత్తు. బ్రహ్మవిద్యోపనిషత్తు, మండలబ్రాహ్మణోపనిషత్తు, మహావాక్యోపనిషత్తు. వరాహోపనిషత్తు, హంసోపనిషత్తు.

**సామవేదం :-** యోగచూడామణ్యుపనిషత్తు, దర్శనోపనిషత్తు.

**అథర్వవేదం :-** పాశుపతోపనిషత్తు, శాండిల్యోపనిషత్తు.








ఈ యోగసాధనలో ఖేచరీవిద్య - ఖేచరీముద్ర - కూడా ఒకటి. శరీరాన్ని, శరీర నిర్మాణాన్నీ, శరీరావయవాల పనితీరును మన అదుపులో ఉంచుకొనగలగటం, తద్వారా మనస్సుపై పట్టు సాధించగలగటం యోగవిద్యలో ప్రధానాంశం. శరీరనిర్మాణంలో మనం జోక్యం చేసుకోకుండా చేసే సాధన ఇది.

ఖేచరీవిద్యలో కొంత వైలక్షణ్యం కనిపిస్తుంది. శరీరాన్ని యథాతథంగా కాకుండా కృత్రిమంగా కొంత తీక్ష్ణ ప్రక్రియతో దాన్ని అదుపుచేసే ప్రయత్నం దీనిలో కనిపిస్తుంది. అందుకే దీని విషయంలో మరింత శ్రద్ధ, మరింత శిక్షణ అవసరం. నిష్ణాతుల సహకారం లేకుండా అభ్యాసకులు దీనికై ప్రయత్నించటం ప్రమాదకరం. దాని ప్రయోజనాన్ని కూడా తద్వేత్తల ద్వారా తెలిసికొనియే ఉపక్రమించాలి.

యోగకుండల్యుపనిషత్తులోని రెండవ అధ్యాయం **ఖేచరీవిద్యనే** ప్రతిపాదిస్తుంది. దానిని పరిశీలిద్దాం.

**ఖేచరీ(రి) విద్య**

**(యోగకుండల్యుపనిషత్తులోని రెండవ అధ్యాయము)**

శ్లో॥ **అథాహం సంప్రవక్ష్యామి విద్యాం ఖేచరిసంజ్ఞికామ్ ।**
**యథా విజ్ఞానవానస్యాః లోకేఽస్మిన్నజరోఽమరః ॥** 1

ఇక నేను ఖేచరి అను పేరుగల విద్యను గూర్చి చెప్పబోతున్నాను. ఈ లోకంలో దానినెరిగినవాడు అజరుడు, అమరుడు కాగలిగినట్లుగా దానిని ప్రకటింపబోతున్నాను.

శ్లో॥ **మృత్యువ్యాధిజరాగ్రస్తో దృష్ట్వా విద్యామిమాం మునే ।**
**బుద్ధిం దృఢతరాం కృత్వా ఖేచరీం తు సమభ్యసేత్ ॥** 2

మహర్షీ! గౌతమా! మరణానికీ, వ్యాధులకూ, ముసలితనానికీ లోనైనవాడు ఈ విద్యను గురించి తెలిసికొని, దానిని గట్టిచేసికొని ఖేచరీవిద్యను అభ్యసించాలి. (వ్యాధులకూ, ముసలితనానికీ లోనైన వాడు ఈ విద్యనభ్యసించటం కుదరవచ్చు. మరణానికి లోనైనవాడు ఏ విద్యనూ నేర్చే అవకాశం లేదుగదా! అంటే నిజమే. మరణానికి లోనుకావటమంటే మరణావస్థ నిశ్చితంగా దగ్గరపడటం, లేదా జరామరణ వార్ధక్యాలు పుట్టుకతోనే వచ్చిన మానవజాతిపరంగా ఈ అభ్యాసాన్ని అన్వయించుకోవాలి.)

శ్లో॥ **జరామృత్యుగదఘ్నో యః ఖేచరీం వేత్తి భూతలే ।**
**గ్రంథతశ్చార్థతశ్చైవ తదభ్యాసప్రయోగతః ॥** 3

శ్లో॥ **తం మునే సర్వభావేన గురుం మత్వా సమాశ్రయేత్ ।**
**దుర్లభా ఖేచరీ విద్యా తదభ్యాసోఽపి దుర్లభః ॥** 4

ఈ ఖేచరీవిద్యను గురించి గ్రంథాల ద్వారా విని, తదర్థాన్ని చక్కగా గ్రహించి, దానిని అభ్యసించి, ఆపై ప్రయోగించినవాడు ముసలితనాన్నీ, మరణాన్నీ, రోగాలనూ తొలగించుకొనగలుగును. మునీ! అటువంటి వానిని పరిపూర్ణభావనతో గురువుగా ఆశ్రయించవలెను (ఖేచరీ విద్యాధ్యయనం కోసం). ఎందుకంటే ఖేచరీ విద్యను పొందటం కష్టం. దానిని అభ్యసించి ప్రయోగించటం కూడా కష్టం.

(ఖేచరీవిద్య మనస్సుకు సంబంధించినది. దానికి శారీరకరూపం ఒకానొక ముద్ర. దానిని ఖేచరీ ముద్ర అని వ్యవహరిస్తుంది యోగశాస్త్రం.

*శ్లో॥* ***చిత్తం చరతి ఖే యస్మాత్ జిహ్వాచరతి ఖే గతా ।***
***తేనైషా ఖేచరీ నామ ముద్రా సిద్ధైర్నిరూపితా ॥*** (హఠయోగప్రదీపిక 3/41)

మనస్సు, నాలుక రెండూ 'ఖేచరాలు' (శూన్యంలో చరించేవి) అవుతాయి కాబట్టి ఇది ఖేచరీ ముద్ర. కాబట్టి ఇది శారీరకంగా చేయవలసిన అభ్యాసమే. ఆ క్రమంలో మనస్సును కూడా స్థిరీకరించాలి. అంతే. కాబట్టే ఇది కష్టం. మంత్రతంత్రాల విషయంలో దృష్టకారణత్వం కన్న అదృష్టకారణత్వమే ఎక్కువ కాబట్టి దానిని కళ్ళకు కట్టించలేము. కానీ యోగాభ్యాస విషయంలో దానిని కళ్ళకు కట్టించవలసినదే. దానికై అధీతి – బోధ – ఆచరణం – ప్రచారం అనే నాలుగుదశలు తప్పవు మరి.

**ఖేచరీ విద్యకు తాంత్రికరూపం ఖేచరీ బీజం.** ఖేచరీముద్రాస్వరూపాన్నీ, ఖేచరీ బీజస్వరూపాన్నీ కూడా తర్వాత వివరిస్తుందీ ఉపనిషత్తు)

**శ్లో॥ అభ్యాసం మేలనం చైవ యుగపన్నైవ సిద్ధ్యతి ।**
**అభ్యాసమాత్రనిరతా న విందంతే హి మేలనమ్ ॥ 5**

మేలన మనగా ప్రయోగం లేదా ప్రదర్శనం. అభ్యాసం తనకు మాత్రం పరిమితం. దానిని ఇతరులకు ప్రత్యక్షీకరించటానికి చేసే ప్రయత్నం **మేలనం** లేదా ప్రయోగం. ఈ అభ్యాసప్రయోగాలను ఒకేమారుగా సిద్ధింపజేసుకొనగలగటం కష్టం. అభ్యాసం మీదనే ఆసక్తి గలవారు తత్ప్రయోగాన్ని సాధించలేరు.

(తర్కశాస్త్రంలోని స్వార్థానుమాన, పరార్థానుమానాల వంటివి అభ్యాస ప్రయోగాలు. సాధ్యసిద్ధిని తాను భావించటం స్వార్థానుమానం. ఇతరులు దానిని భావించేటట్లు చేయగలగటం పరార్థానుమానం. ప్రతిజ్ఞ – హేతువు – ఉదాహరణం – ఉపనయం – నిగమనం అనే పంచావయవాలతో కూడిన వాక్యప్రయోగం పరార్థానుమానంలో అవసరం.

అలాగే యోగాభ్యాసం (ఖేచరీముద్రాభ్యాసం) దానిని తాను సాధించటానికి సరిపోతుంది. కానీ మేలనం (ప్రయోగం) ఇంకా లోతైన పరిశీలననూ, పరిశోధననూ అపేక్షిస్తుంది. అప్పుడే దానిని ఇతరులకు అందజేయగల శక్తి లభిస్తుంది.)

**శ్లో॥ అభ్యాసం లభతే బ్రహ్మన్ జన్మజన్మాంతరే క్వచిత్ ।**
**మేలనం జన్మనాం తత్తు శతాంతేఽపి న లభ్యతే ॥ 6**

**శ్లో॥ అభ్యాసం బహు జన్మాంతే కృత్వా తద్భావసాధితమ్ ।**
**మేలనం లభతే కశ్చిద్యోగీ జన్మాంతరే క్వచిత్ ॥ 7**

వేదస్వరూపా! జననమరణక్రమంలో ఏదో ఒక జన్మలో అభ్యాసాన్ని సిద్ధింపజేసికొనవచ్చును. కానీ మేలనం మాత్రం వంద పుట్టుకల తర్వాత కూడా లభించటం కష్టం. 'జన్మజన్మాంతరే'.... 'జన్మానాం శతాంతేఽపి' – ఈ రెండూ దాదాపు సమానార్థకాలే. కాకపోతే రచయిత తొలిపదాన్ని పరిమితిని, రెండవ ప్రయోగాన్ని అపరిమితిని చెప్పటానికి వినియోగించాడు.

ఎవరో ఒక యోగి అనేకజన్మలలో అభ్యాసాన్ని సాధించి, ఆపై, మరొక జన్మలో ఎప్పుడో దాని ప్రయోగాన్ని (మేలనాన్ని) సాధించగలుగుతాడు.

(ఖేచరీవిద్యా ప్రయోగ సాధకునకు ఒక జన్మకాలం సరిపోదని రచయిత అభిప్రాయం. ముందు ముందు జన్మలలో సాధించిన సంస్కార విశేషం మరుసటి జన్మకు సంక్రమించి, తత్ఫలంగా ఖేచరీవిద్యాప్రయోగం సాధింపబడాలి. భారతీయ దార్శనికతలో జన్మాంతర సంస్కారం ప్రస్తుత జన్మలో

కూడా సంక్రమిస్తుందన్నది ఒక ప్రధానాంశం. ప్రజాజీవనంలోని ప్రధాన విశ్వాసం కూడా. మహాకవి కాళిదాసు పార్వతి విద్యాభ్యాసాన్ని వర్ణిస్తూ ఇలా అంటాడు.)

**శ్లో॥ తాం హంసమాలాః శరదీవ గంగాం మహౌషధిం నక్తమివాత్మభాసః ।**
**స్థిరోపదేశాముపదేశకాలే ప్రపేదిరే ప్రాక్తనజన్మవిద్యాః ॥** (కు.సం. 1-30)

శరత్కాలంలో హంసల సమూహం గంగను చేరినట్లు, రాత్రివేళ మహౌషధిని తన కాంతులు చేరినట్లు పురాజన్మవిద్యలన్నీ పార్వతికి సంక్రమించాయట అధ్యయన కాలంలో.

**శ్లో॥ యదా తు మేలనం యోగీ లభతే గురువక్త్రతః ।**
**తదా తత్సిద్ధిమాప్నోతి యదుక్తౌ శాస్త్రసంతతౌ ॥ 8**

**శ్లో॥ గ్రంథతశ్చార్థతశ్చైవ మేలనం లభతే యదా ।**
**తదా శివత్వమాప్నోతి నిర్ముక్తః సర్వసంసృతేః ॥ 9**

యోగి గురుముఖతః మేలనాన్ని అధ్యయనం చేసినప్పుడే శాస్త్రగ్రంథాలలో చెప్పిన ఆ మేలనసిద్ధిని పొందగలుగుతాడు. సిద్ధాంతరూపంగానూ, ప్రయోగాత్మకంగానూ మేలనసిద్ధిని పొందినప్పుడు యోగి సంసారబంధవిముక్తుడై శివత్వాన్ని పొందగలుగుతాడు.

(సంసారబంధవిముక్తి భౌతికంగానూ, భావనాత్మకంగానూ కూడా లభిస్తుంది. భౌతికంగా బంధవిముక్తి రెండు రకాలు. తనువు చాలించటం, లేదా బంధనాలకు దూరంగా వెళ్ళటం. తనువు చాలిస్తే తానే లేదు కాబట్టి బాధలేదు. బంధాలకు దూరంగా వెళ్ళటమంటే బాధ్యతల నుండి తప్పించుకొనే ప్రయత్నమే. అదేమంత గొప్పవిషయం కాదు, ఆదర్శమూ కాదు. కాబట్టి బంధవిముక్తి అంటే భావనాత్మకం కావాలి.

**శ్లో॥ కర్మణైవ హి సంసిద్ధిమాస్థితా జనకాదయః ।**
**లోకసంగ్రహమేవాపి సంపశ్యన్ కర్తుమర్హసి ॥**

అని గీతలో వ్యాసమహర్షి ప్రతిపాదించినదీ భావనాత్మక బంధవిముక్తినే, జనకమహారాజును ఉదాహరణంగా చూపిస్తూ, తీర్చుకొనవలసిన ఋణాలు లేనపుడూ, చేసి తీరవలసిన కర్తవ్యాలూ లేనపుడు ఎవరి బంధవిముక్తి వారి ఇష్టం. వ్యక్తి బంధవిముక్తి సమాజానికి భారం కాకూడదు.

**శ్లో॥ శాస్త్రం వినాపి సంబోద్ధుం గురవోఽపి న శక్నుయుః ।**
**తస్మాత్సుదుర్లభతరం లభ్యం శాస్త్రమిదం మునే ॥ 10**

**శ్లో॥ యావన్న లభ్యతే శాస్త్రం తావద్గాం పర్యటేద్యతిః ।**
**యదా సంలభ్యతే శాస్త్రం తదా సిద్ధిః కరే స్థితా ॥ 11**

మునీ! యోగశాస్త్రం తెలియకుండా, యోగగురువులు కూడా దానిని నేర్వలేరు, నేర్పలేరు. ఆ శాస్త్రాన్ని పొందటం చాలా కష్టం. ఆ శాస్త్రం లేదా శాస్త్రజ్ఞానం లభించేవరకు యతి భూపర్యటనం చేయాలి దానిని పొందటానికి. ఆ శాస్త్రజ్ఞానం లభిస్తే ప్రయోగసిద్ధి కరతలామలకమే.

(జ్ఞానం లేని ప్రయోగం ప్రమాదకరం. ప్రయోగంలేని జ్ఞానం నిరర్థకం, అజాగళస్తనంతో సమానం.)

**శ్లో॥ న శాస్త్రేణ వినా సిద్ధిః దృష్టా చైవ జగత్త్రయే ।**
**తస్మాన్మేలనదాతారం శాస్త్రదాతారమచ్యుతమ్ ॥ 12**

**శ్లో॥ తదభ్యాసప్రదాతారం శివం మత్వా సమాశ్రయేత్ ।**
**లబ్ధ్వా శాస్త్రమిదం గుహ్యమన్యేషాం న ప్రకాశయేత్ ॥ 13**

**శ్లో॥ తస్మాత్సర్వప్రయత్నేన గోపనీయం విజానతా ।**

ముల్లోకాలలో ఎక్కడా కూడా శాస్త్రజ్ఞానం లేకుండా సిద్ధి కనిపించదు. కాబట్టి ఆ శాస్త్రజ్ఞానాన్నీ, ఖేచరీవిద్యాభ్యాసాన్నీ, దాని ప్రయోగవిజ్ఞానాన్నీ అందించే గురువును అచ్యుతశివస్వరూపంగా భావించి ఆశ్రయించాలి. ఈ రహస్యశాస్త్రస్వరూపాన్ని గ్రహించిన తర్వాత దానిని ఇతరులకు తెలియజేయదగదు.

(సనాతన శాస్త్రీయవిషయబోధనలో చాలా సందర్భాలలో అవి రహస్యాలనీ, గోపనీయాలనీ, దాచవలసినవనీ చెప్పటం కద్దు. దానికి కారణం అపరిపక్వబుద్ధితో వాటిని అధ్యయనం చేస్తే అవి వికటించవచ్చునన్న భావనమే కానీ అందరికీ అందుబాటు లోనికి రాకూడదన్న లక్ష్యం కాదు. లక్ష్యం అదే అనటమంటే శాస్త్రాలనూ, శాస్త్రవేత్తలనూ కూడా కించపరచటమే.)

**యత్రాస్తే చ గురుర్బ్రహ్మన్ దివ్యయోగప్రదాయకః ॥ 14**

**శ్లో॥ తత్ర గత్వా చ తేనోక్తవిద్యాం సంగృహ్య ఖేచరీమ్ ।**
**తేనోక్తః సమ్యగభ్యాసం కుర్యాదాదావతన్ద్రితః ॥ 15**

వేదస్వరూపా! దివ్యమయిన ఈ ఖేచరీ విద్యను అందించగల గురువు ఎక్కడుంటే అక్కడకు వెళ్ళి ఆయన బోధనలద్వారా ఖేచరీవిద్యను గ్రహించి, ఆయన అనుమతితో, వారి మార్గదర్శనంతో అలసత లేకుండా ఈ ఖేచరీవిద్యను చక్కగా అభ్యసించాలి.

(గురువు అనుమతి శాస్త్రంలో శిష్యుని పరిపక్వతను ధ్రువీకరించటమే కాని గురువు ఆధిపత్యాన్ని నిరూపించుకొనటం కాదు.)

**శ్లో॥ అనయా విద్యయా యోగీ ఖేచరీసిద్ధిభాగ్భవేత్ ।**
**ఖేచర్యా ఖేచరీం యుంజన్ ఖేచరీ బీజపూరయా ॥ 16**

**శ్లో॥ ఖేచరాధిపతిర్భూత్వా ఖేచరీషు సదా వసేత్ ।**

ఈ విద్యద్వారా యోగి ఖేచరీసిద్ధిని పొందుతాడు. ఖేచరీబీజాలతో కూడిన ఖేచరీయోగాన్ని ఖేచరీముద్రతో సంయోజనం చేసి సాధించినవాడు మరణానంతరం సూర్యసమానుడై ఖేచరలోకాలలో నిత్యనివాసం చేయగలడు.

(ఊర్ధ్వలోకాలు తేజస్స్వరూపాలు. అధోలోకాలు అంధతామిస్రాలు. మరణానంతరం జీవికి వసు రుద్ర ఆదిత్యరూపాలను క్రమంగా కల్పిస్తున్నాం. అత్యుత్తమం ఆదిత్యరూపం. అది తేజోమయం. ఖేచరీసిద్ధిని పొందినవాడు ఆదిత్యరూపాన్ని పొందగలుగుతాడు ప్రత్యక్షంగా.

ఖేచరీవిద్యా స్వరూపాన్ని ఇలా వివరిస్తారు –

**శ్లో॥ అంతర్లక్ష్యవిలీనచిత్తపవనో యోగీ సదావర్తతే**
**దృష్ట్యా నిశ్చలతారయా బహిరధః పశ్యన్నపశ్యన్నపి ।**

**ముద్రేయం ఖలు ఖేచరీ భవతి సా లక్ష్యైకతానా శివా**
**శూన్యాశూన్యవివర్జితం స్ఫురతి సా తత్త్వం పదం వైష్ణవి ॥**

యోగి మనస్సును, శ్వాసను అంతర్లక్ష్యంపై నిలపాలి. కనుపాప నిశ్చలంగా ఉండాలి. బాహ్యదృష్టివున్నా లేనట్లుగానే ఉండాలి. అది ఖేచరీముద్ర. దానిలో శూన్యతా లేదు. అశూన్యతా ఉండదు.

హఠయోగప్రదీపిక ఖేచరీయోగాన్నీ, లంబికాయోగాన్నీ కలిపి ఖేచరీముద్ర అని వ్యవహరిస్తే, ఇక్కడ ఖేచరీయోగాన్నే ఖేచరీముద్రగా వివరించటాన్ని చూడవచ్చు).

**ఖేచరావసథం వహ్నిమమ్బుమణ్డలభూషితమ్ ॥** **17**

శ్లో॥ **ఆఖ్యాతం ఖేచరీబీజం తేన యోగః ప్రసిద్ధ్యతి ।**
**సోమాంశనవకం వర్ణం ప్రతిలోమేన చోద్ధరేత్ ॥** **18**

శ్లో॥ **తస్మాత్ త్ర్యంశకమాఖ్యాతమక్షరం చంద్రరూపకమ్ ।**
**తస్మాదప్యష్టమం వర్ణం విలోమేనాపరం మునే ॥** **19**

శ్లో॥ **తథా తత్పరమం విద్ధి తదాదిరపి పంచమా ।**
**ఇందోశ్చ బహుభిన్నం చ కూటోఽయం పరికీర్తితః ॥** **20**

ఇక్కడనుండి ఖేచరీబీజస్వరూపాన్ని వివరిస్తున్నాడు రచయిత. ఇది లంబికాయోగంలో అంతర్భాగమే –

ఖేచరమంటే హకారం. ఆవసథమంటే ఈకారం. వహ్ని అంటే రకారం. అంబు మండలమంటే బిందువు (మకారం). ఈ నాలుగు కలిస్తే ఏర్పడేవి **హ్రీమ్.** (ఇక్కడొక విషయాన్ని గమనించాలి. ఉచ్చారణ క్రమాన్ని బట్టి ఆలోచిస్తే హకార – రకార – ఈకార – మకారాలు వరుసగా వుంటాయి. కానీ ఇక్కడ హకార – ఈకార – రకార – మకారాల వరుస ప్రతిపాదించబడినది. ఇది ఉచ్చారణను బట్టి కాక ఏదో ఒక లిపిని ఆధారం చేసికొని చెప్పిన క్రమం కావచ్చు. లేకపోతే క్రమాన్ని పాటించలేదనవలసి వస్తుంది.) ఆ ఖేచరీబీజంతో కలసి ఖేచరీయోగం సిద్ధిస్తుంది.

సోమాంశమంటే సకారం. దానినుండి వెనుకకు తొమ్మిదవ వర్ణం భ. దానినుండి మూడు మూడుగా మూడవ వర్ణం స. ఆ సకారం నుండి మరల వెనుకకు ఎనిమిదవ అక్షరం మ. ఆ మకారం నుండి వెనుకకు అయిదవ అక్షరం ప. మరల చంద్రబీజమైన స. ఆ పై బహుభిన్నం కూటాక్షరం క్ష. ప్రతివర్ణానికి కూడా బిందువును చేర్చాలి. అప్పుడు **హ్రీం భం సం మం పం సం క్షం** – ఈ ఏడు బీజాక్షరాలు గలది ఖేచరీబీజం.

### ఖేచరీబీజ మంత్రసిద్ధి

శ్లో॥ **గురూపదేశలభ్యం చ సర్వయోగప్రసిద్ధిదమ్ ।**
**యత్తస్య దేహజా మాయా నిరుద్ధకరణాశ్రయా ॥** **21**

**స్వప్నేఽపి న లభేత్.....**

సర్వయోగసిద్ధినీ కలిగించగల ఈ ఖేచరీయోగం గురూపదేశం వలననే పొందదగినది.

ఎవని శరీరం నుండి పుట్టిన మాయ అతని ఇంద్రియాలను ఆశ్రయించి అర్థజ్ఞానాన్ని నిరోధిస్తుందో అటువంటి వానికిది (ఈ యోగం) కలలో కూడా లభించదు.

**.... తస్య నిత్యం ద్వాదశ జప్యతః ।**
**య ఇమాం పంచ లక్షాణి జపేదపి సుయన్త్రితః ॥ 22**

శ్లో॥ **తస్య శ్రీ ఖేచరీసిద్ధిః స్వయమేవ ప్రవర్తతే ।**
**నశ్యన్తి సర్వవిఘ్నాని ప్రసీదంతి చ దేవతాః ॥ 23**

శ్లో॥ **వలీపలితనాశశ్చ భవేదపి న సంశయః ।**
**ఏవం లబ్ధ్వా మహావిద్యామభ్యాసం కారయేత్తతః ॥ 24**

ఈ ఖేచరీ బీజమంత్రాన్ని చక్కగా యంత్రబద్ధం చేసి ఆపై రోజుకు అయిదు లక్షల చొప్పున పంద్రెండురోజులు జపం చేసిన వానికి ఖేచరీవిద్య తనంత తానుగా సిద్ధిస్తుంది. సర్వవిఘ్నాలూ తొలగిపోతాయి. దేవతలు ప్రసన్నులవుతారు. దైహికమయిన ముడతలు, తలనెరవటం వంటివి వుండవు. ఈ విషయంలో సందేహమవసరం లేదు.

ఈ రీతిగా ఈ మహావిద్యను పొంది, ఆ తరువాత అభ్యాసం చేయాలి.

(రోజుకు పంద్రెండు సార్లు జపం చేసే వానికి... అని ఉపనిషద్ బ్రహ్మ వ్యాఖ్యానంలో కనిపిస్తుంది. అది అంత సమంజసంగా కనిపించదు. రోజుకు పంద్రెండు సార్లు అయిదు లక్షల జపం చేయటమంటే అది అసాధ్యం. అలా కాకుండా జపసంఖ్య నియమం లేకుండా రోజుకు పంద్రెండు సార్లు అంటే అది అర్థంలేని నియమమవుతుంది. కాబట్టి పంద్రెండు రోజులలో అయిదు లక్షలు జపించాలి అన్నదే నియమస్వరూపం కావచ్చు. దానిలోని సాధ్యాసాధ్యాలను సాధకులే ఆలోచించుకోవాలి.)

శ్లో॥ **అన్యథా క్లిశ్యతే బ్రహ్మన్న సిద్ధిః ఖేచరీపథే ।**
**యదభ్యాసవిధౌ విద్యాం న లభేద్యః సుధామయీమ్ ॥ 25**

శ్లో॥ **తతః సంమేలకాదౌ చ లబ్ధ్వా విద్యాం సదా జపేత్ ।**
**నాన్యథా రహితో బ్రహ్మన్న కించిత్సిద్ధిభాగ్భవేత్ ॥ 26**

శ్లో॥ **యదిదం లభ్యతే శాస్త్రం తదా విద్యాం సమాశ్రయేత్ ।**
**తతస్తదోదితాం సిద్ధిమాశు తాం లభతే మునిః ॥ 27**

ఆ రీతిగా అభ్యసించకపోతే ఈ ఖేచరీ మార్గంలో శ్రమ మాత్రమే మిగులుతుంది, సిద్ధి కలగదు. ఒకవేళ అమృతప్రాయమయిన ఈ విద్యను అభ్యాసదశలో పొందలేకపోతే ప్రయోగదశలో అయినా దానిని సిద్ధింపజేసికొనే ప్రయత్నం చేయాలి. దానికై ప్రతినిత్యం జపం చేయాలి. మరొక మార్గం లేదు. ఇతర మార్గాలు కొంచెం కూడా సిద్ధిహేతువులు కాలేవు. యోగి సిద్ధినందలేడు. ఈ శాస్త్రం సిద్ధించిన తరువాత (బీజముద్రారూపమయిన) ఖేచరీయోగవిద్యను ఆశ్రయించాలి. అప్పుడు యోగవిద్య ద్వారా సిద్ధించే ఫలితాన్ని త్వరగా పొందవచ్చు.

### ఖేచరీ యోగసాధన విధి

శ్లో॥ **తాలుమూలం సముత్కృష్య సప్తవాసరమాత్మవిత్ ।**
**స్వగురూక్తప్రకారేణ మలం సర్వం విశోధయేత్ ॥ 28**

**శ్లో॥ స్నుహిపత్రనిభం శస్త్రం సుతీక్ష్ణం స్నిగ్ధనిర్మలమ్ ।**
**సమాదాయ తతస్తేన రోమమాత్రం సముచ్ఛినేత్ ॥ 29**

**శ్లో॥ హిత్వా సైంధవపథ్యాభ్యాం చూర్ణితాభ్యాం ప్రకర్షయేత్ ।**
**పునః సప్తదినే మాత్రే రోమమాత్రం సముచ్ఛినేత్ ॥ 30**

ఆత్మజ్ఞాని అయిన యోగి తన గురువు చెప్పిన విధానంలో ఏడురోజులపాటు తాలుమూలాన్ని (దౌడల మూలభాగాన్ని – అంకిలిని) శుభ్రపరచుకోవాలి. మాలిన్యాలను తొలగించుకోవాలి. ఆపై పదునుగా, శుభ్రంగా జెముడు ఆకులా వున్న ఒక నూనె పూసిన శస్త్రాన్ని (కోసేందుకుపయోగపడేదానిని) తీసికొని నాలుక క్రింది నరాన్ని వెంట్రుకంత ఖండించాలి. ఆ తరువాత మరేపనీ చేపట్టకుండా కరక్కాయ, సైంధవ లవణ చూర్ణంతో దానికి చికిత్స చేయాలి. మరల ఏడు రోజుల తరువాత వెంట్రుకవాసిలోనే మరల ఖండించాలి.

**శ్లో॥ ఏవం క్రమేణ షణ్మాసం నిత్యోద్యుక్తః సమాచరేత్ ।**
**షణ్మాసాద్రసనామూలం సిరాబద్ధం ప్రణశ్యతి ॥ 31**

ఈ రీతిగా నిత్యప్రయత్నంతో ఆరునెలలపాటు ఆచరించాలి. ఈ ఆరునెలల వ్యవధిలో అంకిలిదగ్గర నాలుకను పట్టివున్న నరం పూర్తిగా అదృశ్యమవుతుంది. (నిత్యప్రయత్నమంటే ఉత్సాహం నశించకుండా అని మాత్రమే అర్థం. ఖండన ఖండన మధ్య వ్యవధి మాత్రం ఏడురోజులే. అది నిత్యకార్యక్రమం కాదు).

**శ్లో॥ అథ వాగీశ్వరీధామశిరో వస్త్రేణ వేష్టయేత్ ।**
**శనైరుత్కర్షయేద్యోగీ కాలవేలావిధానవిత్ ॥ 32**

ఆ తర్వాత తగిన కాలాన్నీ, తగిన సమయాన్నీ తెలిసి యోగి తన నాలుకయొక్క శిరోభాగాన్ని గుడ్డతో చుట్టి మెల్లగా దానిని సాగదీయాలి.

**శ్లో॥ పునః షణ్మాసమాత్రేణ నిత్యం సంఘర్షణాన్మునే ।**
**భ్రూమధ్యావధి చాప్యేతి తిర్యక్కర్ణబిలావధిః ॥ 33**

**శ్లో॥ అధశ్చ చుబుకం మూలం ప్రయాతి క్రమచారితా ।**
**పునస్సంవత్సరాణాం తు తృతీయాదేవ లీలయా ॥ 34**

**శ్లో॥ కేశాంతమూర్ధ్వం క్రమతి తిర్యక్‌శాఖావధిర్మునే ।**
**అధస్తాత్కంఠకూపాన్తం పునర్వర్షత్రయేణ తు ॥ 35**

**శ్లో॥ బ్రహ్మరంధ్రం సమావృత్య తిష్ఠేదేవ న సంశయః ।**
**తిర్యక్ చూలితలం యాతి అధః కంఠబిలావధిః ॥ 36**

**శ్లో॥ శనైశ్శనైర్మస్తకాచ్చ మహావజ్రకవాటభిత్ ।**

మరో ఆరునెలలపాటు నాలుకను నిత్యమూ అలా సాగదీయటం వలన నాలుకలో నిటారుగా కనుబొమల మధ్యభాగాన్ని, అడ్డంగా కర్ణరంధ్రాన్నీ తాకవచ్చు. క్రమంగా ఇలా అభ్యసించటం వలన క్రిందుగా చుబుకమూలం (గెడ్డం) వరకు కూడా దానిని సాగదీయ గలుగుతాం.

ఆ రీతిగా మూడు సంవత్సరాలు అభ్యసించిన తరువాత నుదుటిపై నున్న ముంగురులను, అడ్డంగా శిఖామూలాన్ని, క్రిందుగా గొంతును తాకవచ్చు. మరో మూడు సంవత్సరాలకు నాలుక బ్రహ్మరంధ్రం వరకు సాగుతుంది. దానిని పూర్తిగా చుట్ట గలుగుతుంది. అడ్డంగా శిఖోపరితలాన్ని అందుకొనగలుగుతుంది. క్రిందుగా కంఠబిలం కన్న క్రిందకు కూడా సాగుతుంది.

అది క్రమక్రమంగా మహావజ్రంవంటి శిరోరంధ్రాన్ని భేదించగలుగుతుంది.

**పూర్వం బీజయుతా విద్యా హ్యాఖ్యాతా యతి దుర్లభా ॥ 37**

**శ్లో॥ తస్యాః షడంగం కుర్వీత తయా షట్స్వరభిన్నయా ।**
**కుర్యాదేవం కరన్యాసం సర్వసిద్ధ్యాదిహేతవే ॥ 38**

ఇంతవరకు చెప్పిన ఈ ఖేచరీబీజసహితమైన ఖేచరీవిద్య యోగులకు కష్టసాధ్యంగా కనిపించినప్పుడు ఆరు అంగన్యాసాలతో, ఆయా బీజాక్షరాలకు నిర్దేశించిన స్వరసంవిధానంతో దానిని అభ్యసించాలి. అదే రీతిగా ఖేచరీవిద్యాసంబద్ధాలయిన సర్వసిద్ధులనూ పొందటానికి కరన్యాసాలను కూడా అనుసంధానించుకోవాలి.

**శ్లో॥ శనైరేవం ప్రకర్తవ్యమభ్యాసం యుగపన్న హి ।**
**యుగపద్వర్తతే యస్య శరీరం విలయం వ్రజేత్ ॥ 39**

**శ్లో॥ తస్మాచ్ఛనైశ్శనైః కార్యమభ్యాసం మునిపుంగవ ।**

ఈ అభ్యాసాన్ని మెల్లమెల్లగా కొనసాగించాలి కానీ ఒక్కమాటుగా దానికి ఉపక్రమింపకూడదు. ఒకవేళ ఎవరయినా ఒక్కమారుగా అభ్యాసాన్ని ఆరంభిస్తే శరీర నాశమే జరగవచ్చు. కాబట్టి మహర్షీ! ఈ అభ్యాసం నెమ్మదిగానే కొనసాగాలి.

**యదా చ బాహ్యమార్గేణ జిహ్వా బ్రహ్మబిలం వ్రజేత్ ॥ 40**

**శ్లో॥ తదా బ్రహ్మార్గలం బ్రహ్మన్ దుర్భేద్యం త్రిదశైరపి ।**
**అంగుళ్యగ్రేణ సంఘృష్య జిహ్వామాత్రం నివేశయేత్ ॥ 41**

బయటనుండి నాలుక బ్రహ్మరంధ్రాన్ని తాకగలిగినప్పుడు, సాధకుడు తన వ్రేలితో నొక్కి దేవతలు కూడా భేదింపరాని బ్రహ్మార్గలాన్ని (అంతర్జిహ్వ – లో నాలుక) భేదించి నాలుకను మాత్రం దానిలో ప్రవేశపెట్టాలి.

**శ్లో॥ ఏవం వర్షత్రయం కృత్వా బ్రహ్మద్వారం ప్రవిశ్యతి ।**
**బ్రహ్మద్వారే ప్రవిష్టే తు సమ్యక్ మథనమాచరేత్ ॥ 42**

ఈ రీతిగా మూడు సంవత్సరాల పాటు సాధన చేసిన తరువాత సాధకుడు బ్రహ్మద్వారాన్ని భేదించగలుగుతాడు. అప్పుడు సాధకుడు మథనాన్ని (చిలకటం – కవ్వంతో మజ్జిగ చిలికినట్లు) ప్రారంభించాలి.

**శ్లో॥ మథనేన వినా కేచిత్ సాధయంతి విపశ్చితః ।**
**ఖేచరీమంత్రసిద్ధస్య సిధ్యతే మథనం వినా ॥ 43**

మథనం చేయకపోయినా కొంత మంది యోగులు తత్ఫలాన్ని అనుభవించ గలుగుతారు. ఖేచరీమంత్రసిద్ధిని పొందిన యోగి మథనం లేకపోయినా ఫలితాన్ని పొందగలడు.

**శ్లో॥ జపం చ మథనం చైవ కృత్వా శీఘ్రం ఫలం లభేత్ ।**
**స్వర్ణజాం రౌప్యజాం వాపి లోహజాం వా శలాకికామ్ ॥ 44**

**శ్లో॥ నియోజ్య నాసికారంధ్రం దుగ్ధసిక్తేన తంతునా ।**
**ప్రాణాన్నిరుధ్య హృదయే సుఖమాసనమాత్మనః ॥ 45**

**శ్లో॥ శనైస్సుమథనం కుర్యాత్ భ్రూమధ్యే న్యస్తచక్షుషీ ।**
**షణ్మాసం మథనావస్థా భావేనైవ ప్రజాయతే ॥ 46**

జపాన్నీ, మథనాన్నీ కలిపి అభ్యసించినవాడు త్వరగా ఫలితాన్ని పొంద గలుగుతాడు. బంగారం, వెండి, లోహాలతో దేనితో అయినా ఒక సన్నకడ్డీని చేసి, పాలతో తడిపిన త్రాటిని దానికి చుట్టి, దానిని నాసికారంధ్రం లోనికి చొప్పించి, శ్వాసను హృదయంలో నిరోధించి, సుఖాసీనుడై, చూపును కనుబొమల మధ్య నిలిపి, మెల్లగా మథనం చేయాలి. ఆరునెలల పాటు ఈ మథనావస్థ భావనామాత్రం గానే వుంటుంది.

**శ్లో॥ యథా సుషుప్తిర్బాలానాం యథా భావస్తథా భవేత్ ।**
**న సదా మథనం శస్తం మాసే మాసే సమాచరేత్ ॥ 47**

**శ్లో॥ సదా రసనయా యోగీ మార్గం న పరిసంక్రమేత్ ।**
**ఏవం ద్వాదశవర్షాంతే సంసిద్ధిర్భవతి ధ్రువా ॥ 48**

**శ్లో॥ శరీరే సకలం విశ్వం పశ్యత్యాత్మావిభేదతః ।**
**బ్రహ్మాండోఽయం మహామార్గో రాజదంతోర్ధ్వ కుండలీ ॥ 49**

బాలురకు నిద్రలో కలిగిన ఆనందం వంటి ఆనందం వంటి ఆనందం మథన భావనలోనే కలుగుతుంది. ఈ మథన కార్యక్రమాన్ని ప్రతిదినమూ చేయకూడదు. నెలకొకసారి సాధన చేయవచ్చు.

యోగి ఎప్పుడూ తన నాలుకను ఇతర కార్యక్రమాలకు ప్రతిబంధకంగా నిలువరించకూడదు. ఈ విధంగా పండ్రెండు సంవత్సరాలపాటు సాధన చేసిన యోగి తత్ఫలాన్ని పొందగలడు.

యోగి తన దేహంలోనే తనకన్న అభిన్నంగా సమస్త విశ్వాన్నీ చూడగలుగుతాడు. ఖేచరీవిద్యారూపమయిన ఈ ఊర్ధ్వకుండలి (నాలుకతో సహస్రారాన్ని స్పృశించటం) బ్రహ్మాండమయిన రాజమార్గం, చర్వణాత్మకమయిన ఆనందస్వరూపం –

ఇది ద్వితీయాధ్యాయము

ఖేచరీవిద్యను ప్రస్తావించిన యోగోపనిషత్తులు మరికొన్ని వున్నాయి.

**శ్లో॥ కపాలకుహరే జిహ్వా ప్రవిష్టా విపరీతగా ॥**

**శ్లో॥ భ్రువోరంతర్గతా దృష్టిః ముద్రా భవతి ఖేచరీ ।**
**న రోగో మరణం తస్య న నిద్రా న క్షుధా తృషా ॥**

**శ్లో॥ న చ మూర్ఛా భవేత్తస్య యో ముద్రాం వేత్తి ఖేచరీమ్ ।**
**పీడ్యతే న చ రోగేణ లిప్యతే న చ కర్మణా ॥** ధ్యానబిందూపనిషత్తు 79–81

నాలుక వెనుదిరిగి కపాలకుహరంలో ప్రవేశించి, దృష్టి కనుబొమల మధ్య నిలిచినపుడు అది ఖేచరీముద్ర అవుతుంది. ఖేచరీవిద్యలో బడినవానికి ఆకలి, దప్పిక, నిద్ర, మోహం, మరణం ఉండవు. రోగపీడ కానీ కర్మబంధం కానీ కలుగవు.

**శ్లో॥ కపాలకుహరే జిహ్వా ప్రవిష్టా విపరీతగా ।**
**భ్రువోరంతర్గతా దృష్టిః ముద్రా భవతి ఖేచరీ ॥**

**శ్లో॥ న రోగో మరణం తస్య న నిద్రా న క్షుధా తృషా ।**
**న చ మూర్ఛా భవేత్తస్య యో ముద్రాం వేత్తి ఖేచరీమ్ ॥**
**పీడ్యతే న చ రోగేణ లిప్యతే న స కర్మభిః ॥**

యోగచూడామణ్యుపనిషత్తు 52-54

పైన చెప్పిన భావమే. అయితే అక్కడ కర్మపదం ఏకవచనంలో ఉంది. ఇక్కడ బహువచనంలో ఉంది.

**శ్లో॥ అంతఃకపాలకుహరే జిహ్వాం వ్యావృత్య ధారయేత్ ॥**

**శ్లో॥ భ్రూమధ్యదృష్టిరప్యేషా ముద్రా భవతి ఖేచరీ ॥**

యోగతత్త్వోపనిషత్తు 117-118

**శ్లో॥ కపాలకుహరే జిహ్వా ప్రవిష్టా విపరీతగా ।**
**భ్రువోరంతర్గతా దృష్టిః ముద్రా భవతి ఖేచరీ ॥**

**శ్లో॥ ఖేచర్యా ముద్రితం యేన వివరం లంబికోర్ధ్వతః ।**
**న పీయూషం పతత్యగ్నౌ న చ వాయుః ప్రధావతి ॥**

యోగశిఖోపనిషత్తు 5/40,41

**శ్లో॥ అంతర్లక్ష్యవిలీనచిత్తపవనో యోగీ సదా వర్తతే**
**దృష్ట్యా నిశ్చలతారయా బహిరధః పశ్యన్న పశ్యన్నపి ।**
**ముద్రేయం ఖలు ఖేచరీ భవతి సా లక్ష్యైకతానా శివా**
**శూన్యాశూన్యవివర్జితం స్ఫురతి సా తత్త్వం పదం వైష్ణవీ ॥**

శాండిల్యోపనిషత్తు 7/15

---

# గాయత్రీమంత్రం

**ఓం భూర్భువస్సువః ।**
**తత్ సవితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి ।**
**ధియో యో నః ప్రచోదయాత్ ॥ ఓం ॥**

ఓం = ప్రణవమంత్రంగాను; భూర్భువస్సువః = భూః, భువః, సువః అనే వ్యాహృతులుగాను ఉంటున్న; యః = ఎవరు; నః = మన; ధియః = బుద్ధిని; ప్రచోదయాత్ = ప్రేరేపిస్తారో; సవితుః = సకలాన్ని సృష్టించేవాడైన; తత్ = ఆ; దైవస్య = దైవంయొక్క; వరేణ్యమ్ = ప్రశస్తమైన; భర్గః = జ్యోతిర్మయ రూపాన్ని; ధీమహి = ధ్యానిద్దాం.

# ఆపాతాళ నభః స్థలాంత

## (రుద్రాభిషేకంలోని ధ్యానశ్లోక ప్రతిపదార్థ తాత్పర్య విశేషాలు)

"శివా! నువ్వు ఇటువంటి వాడివి. నీకు నమస్కారము" అని చెప్పేది నమకము. "ఓ శివా! ఇది కూడా (చ) నాకు ఇవ్వు. (మే)" అని ప్రార్థనా పూర్వకంగా చెప్పేది చమకము. నమకము, చమకము కలిపితే అది శతరుద్రీయము. సహస్రము అంటే వేయి అని కాదు. అనంతము అంటే లెక్కపెట్టలేనన్ని అని అర్థం చెప్పుకోవాలి. అలాగే శతరుద్రీయములోని శతకు వంద – అని అర్థం కాదు. అనేక అని చెప్పుకోవాలి. అనేకమంది శివులు కనబడేది శతరుద్రీయము. ఈ నమకచమకాల ప్రార్థనా శ్లోకము ఇది.




**శ్లో॥ ఆపాతాళనభఃస్థలాంతభువనబ్రహ్మాండమావిర్భవ –**
**జ్జ్యోతిఃస్ఫాటికలింగమౌళివిలసత్పూర్ణేందువాంతామృతైః ।**
**అస్తోకాప్లుతమేకమీశమనిశం రుద్రానువాకాఞ్జపన్**
**ధ్యాయేదీప్సితసిద్ధయే ధ్రువపదం విప్రోభిషించేచ్ఛివమ్ ॥**

**ప్రతిపదార్థము :** ఆపాతాళ = పాతాళము మొదలుకొని, నభః స్థలాంత = ఆకాశతలము తుదిగాఉన్న, భువన = భువనములతో గూడిన, బ్రహ్మాండమ్ = బ్రహ్మాండరూపముగా, ఆవిర్భవత్ = ఆవిర్భవించు, జ్యోతిః స్ఫాటికలింగ = జ్యోతిర్మయమగు స్ఫటికలింగము యొక్క, మౌళి = తలపై, విలసత్ = వెలుగు, పూర్ణేందు = నిండు చంద్రుని నుండి, వాంత = (టు వమ ఉద్గిరణే) కురియు, అమృతైః = అమృతములచే, అస్తోకాప్లుతమ్ = దట్టముగా ముంచబడి నట్టియు, ఏకమ్ = కేవలుడగు, ఈశమ్ = ఈశ్వరుని, ఈప్సితసిద్ధయే = కోరిక నెరవేరుటకు, అనిశమ్ = ఎల్లపుడును, రుద్రానువాకాన్ = రుద్రానువాకములను, జపన్ = జపించుచు, ధ్యాయేత్ = ధ్యానించునది, ధ్రువపదమ్ = మూడుకాలములందును చెడని, శివమ్ = శివుని, విప్రః = విప్రుడు, అభిషించేత్ = అభిషేకించునది.

**తాత్పర్యము :** పాతాళం నుండి ఆకాశం వరకూ సమస్తం ఒకటే లింగం. ఆ లింగ రూపం బ్రహ్మాండం (బ్రహ్మ + అండం = అనగా ఒక కోడి గుడ్డు లా). ఆ వెలుగులతో కూడిన జ్యోతిర్మయమయిన లింగం శుద్ధమయిన స్ఫటికంలా ఉంటుంది. మౌళి అంటే తల. కనుక ఆ తలలో చంద్రమండలం ఉంది. చంద్రునిలోని ఆ అమృతం శివలింగం తల నుంచి క్రిందకి అభిషేకంలా పడుతోంది. అందువల్ల బ్రహ్మాండంలో ఉన్న లోకాలన్నింటికీ కూడా ఈ అమృత ధార వలన చల్లదనం కలుగుతోంది. శివలింగానికి అభిషేకం చేసేటప్పుడు, మూడు కాలాల్లోనూ నమకచమకాలు చదివేముందు ఈ శ్లోకం చదువుతూ ఈ సృష్టి మొత్తంగా వ్యాపించిన ఆ మహాశివ లింగానికి అభిషేకం చేస్తున్నామని భావించాలి.

**విశేషాలు :** 1. ఈశ్లోకమున "అస్తోకాప్లుతమేకమ్'కు బదులు "అస్తోకాప్లుతలోకమ్' అనియు "ధ్రువపదమ్'కు బదులు "అద్రుతపదమ్" అనియు "ఆవిర్భవత్" అనుటకు "ఆవిస్ఫురత్" అనియూ ఇతర పాఠాలు ఉన్నాయి.

2. "ఆపాతాళ నభః స్థలాంత భువన బ్రహ్మాండమ్" అను మొత్తాన్ని ఒక పదంగా (సమస్త పదము) భావించి కొంతమంది అర్థం చెప్పారు. పాతాళము మొదలు ఆకాశము వరకు బ్రహ్మాండాన్ని ప్రతిబింబిస్తూ స్ఫాటిక లింగమున్నదని వివరించారు. ఇక్కడ ఈ అర్థములో వీరు "అస్తోకాప్లుత లోకమ్" అని చదివి, దానిని "ఈశ" పదానికి విశేషణముగా చెబుతారు.

3. ఇంకొందరు– "బ్రహ్మాండ మభితః' (= అంతటా బ్రహ్మాండము వ్యాపించి ఉన్నది) అని అధ్యాహరించి (= ఊహించి) బ్రహ్మాండమును ద్వితీయావిభక్తిగా చెబుతూ బ్రహ్మాండ మంతటను ఆవిః స్ఫురజ్జ్యోతిః – ప్రకాశించు (ఆవిస్ఫురత్) శివస్వరూప మని చెబుతారు.

4. అర్థముల్లో కొంచెము తేడా ఉన్నప్పటికీ తాత్పర్యమొకటే.

5. నడిచే దేవుడు కంచి స్వామి ఈ శ్లోకానికి ఇలా వ్యాఖ్యానం చేసారు – పాతాళలోకంనుండి ఆకాశపర్యంతము వ్యాపించి ప్రకాశిస్తున్న స్ఫటికలింగాన్ని అభిషేకిస్తున్నాను – అని దీనిభావం. స్ఫటికలింగం నిర్లిప్తమైనది. శుద్ధమైనది. నైసర్గికంగాగాని ఔపాధికంగాకాని అది పరిణామం చెందుతుంటుంది. అది గుణదోషరహితమైనది. జ్ఞానమెట్లు నిరంజనమో, పరిశుద్ధమో స్ఫటికమూ అట్లే పరిశుద్ధమైనది. పచ్చని ఆకును దానిమీద ఉంచితే అది పచ్చగానూ, ఎఱ్ఱపూవుతో అలంకరిస్తే ఎఱ్ఱగాను కనపడుతుంది. స్వతహాగా అది నిర్వికారమైనది. నిర్వికార పరబ్రహ్మము, మన మనోభావాలను అనుసరించి మారుతుంది. అనుటకు స్ఫటికలింగ మొక దృష్టాంతం. అది నిర్గుణపరమాత్మకు చిహ్నం.

స్ఫటికలింగానికి శిరోభాగంలో ఒక చంద్రకళ, సహస్రార కమలములోని చంద్రకళను జ్యోతిస్వరూపాన్ని ధ్యానించేవారికి చంద్రకళనుండి అమృతం స్రవించి ఆనందమిస్తున్నది. ఈ సమస్త ప్రపంచమున్నూ ఆనందజ్యోతి స్వరూపమైన ఒక లింగమే. దానిని చల్లచేసినామంటే లోకమున్నూ చల్లనౌతుంది. రుద్రాభిషేకానికిముందు ఈ శ్లోకం చెప్పి మరీ ధ్యానించాలి.

ఈ బ్రహ్మాండమే ఒక శివలింగమనీ, అభిషేక కాలంలో అట్లు ధ్యానిస్తూ అభిషేకం చేయాలనీ, శ్రీరుద్రం నిర్దేశిస్తున్నది. మంచీ, చెడ్డా అన్నీ భగవత్స్వరూపంగా భావించవలెననే రుద్రం చెప్పుతున్నది. అతి మధురమును, శీతలమునూ అయిన చంద్రమండలాన్ని, నిదానంగా ఉచ్చారణచేస్తూ రుద్రాధ్యయనం చేస్తూ లింగాన్ని అభిషేకించాలి.

లింగానికి ఆద్యంతాలులేవు. మనం ఏరీతిగా స్ఫటికాన్ని చూస్తున్నామో, ఆ రీతిగానే అది మనకు కనబడుతుంది. భగవంతుడున్నూ మనం ఏ విధంగా ప్రార్థిస్తున్నామో ఆ విధంగానే మనలను అనుగ్రహిస్తున్నాడు. మన మనస్సునకు ఒక ఆకృతి అవలంబంలేక ప్రతీకం ఉంటేనేకాని ఆనందం కలగటంలేదు. మనం ప్రేమించే బంధువర్గం విషయంలో కూడా క్షేమవార్త వినటం ఒకరకం, సమక్షంలో దర్శించటం మరొక రకం. ప్రత్యక్షమైతేనే ఆనందం కలుగుతున్నది. భగవద్విషయంలోకూడా ఒక మూర్తి ద్వారా లభించే అనుగ్రహమే సంతోషదాయకంగా ఉంటున్నది. ఆద్యంతరహితంగా పరమేశ్వరమూర్తి జ్యోతి స్వరూపంలో అరుణాచలక్షేత్రంలో ఆవిర్భవించాడు.

ఆపాతాళ నభస్థలాంత భువన బ్రహ్మాండంగా వ్యాపించియున్న ఆ జ్యోతి స్వరూపాన్ని చంద్రమౌళీశ్వరుని స్ఫాటికలింగ రూపంగా మనం ధ్యానిస్తే వారి అనుగ్రహంకల్గి మనకు ఆనందం కల్గుతుంది.

6. కే.శివానందమూర్తిగారు ఈ శ్లోకానికి ఇలా వివరణ చేసారు.

తూర్పు దిశ నుండి అష్ట వసువులు గాయత్రీ ఛందస్సులో మహాదేవుని పొగుడుతూ అమృతముతో అభిషేకిస్తున్నారు.

దక్షిణ దిశనుండి ఏకాదశ రుద్రులు త్రిష్టుప్ ఛందస్సులో రుద్రుని పొగుడుతూ అభిషేకిస్తున్నారు. ద్వాదశాదిత్యులు పడమర దిశనుండి జగతీ ఛందస్సులోనూ, విశ్వేదేవతలు ఉత్తర దిశనుండి అనుష్టుప్ ఛందస్సులోనూ శివునికి అభిషేక క్రియ చేస్తున్నారు. బృహస్పతి పఙ్క్తి ఛందస్సులోని మంత్రములతో బ్రహ్మాండములో ఊర్ధ్వ దిశనుంచి దశ దిశలనుంచి అభిషేక క్రియ నిర్వహిస్తున్నాడు.

7. భాషా విశేషాలు :

ఆపాతాళ : ఆపాతాళ శబ్దాన్ని మురారి కవి చక్కగా ప్రయోగించాడు. ఆ ప్రయోగమిది.

శ్లో॥ దేవీం వాచముపాసతే హి బహవః సారం తు సారస్వతమ్
జానీతే నితరామసౌ గురుకులక్లిష్టో మురారిః కవిః ।
అబ్ధిర్లంఘిత ఏవ వానరభటైః కిం త్వస్య గంభీరతాం
ఆపాతాళనిమగ్నపీవరతనుర్జానాతి మంద్రాచలః ॥

సరస్వతిని ఎంతోమంది పూజించవచ్చు. కాని సారస్వతము గురుకులములో శ్రమపడి చదువుకొన్న ఒక "మురారి" కే తెలుస్తుంది. సముద్రమును ఎన్నో కోతులు దాటాయి. కాని సముద్రపులోతు – పాతాళం వరకు మునిగిన మందరపర్వతానికి మాత్రమే తెలుస్తుంది.

ఈ "ఆపాతాళ" శ్లోకం లోతు కూడా ధ్యానపరులకు మాత్రమే విస్పష్టంగా తెలుస్తుంది. ✦





శ్రీః

# శ్రీ ఛిన్నమస్తా సహస్ర నామస్తోత్రమ్

శ్రీదేవ్యువాచ :

శ్లో॥ వద దేవ మహాదేవ సర్వశాస్త్రవిదాంవర ।
కృపాం కురు జగన్నాథ కథయస్వ మమ ప్రభో॥ 1

శ్లో॥ ప్రచండచండికా దేవీ సర్వలోకహితైషిణీ ।
తస్యాశ్చ కథితం సర్వం స్తవం చ కవచాదికమ్ ॥ 2

శ్లో॥ ఇదానీం ఛిన్నమస్తాయా నామ్నాం సాహస్రకం శుభమ్ ।
త్వం ప్రకాశయ మే దేవ కృపయా భక్తవత్సల ॥ 3

శ్రీ శివ ఉవాచ :

శ్లో॥ శ్రుణు దేవి ప్రవక్ష్యామి ఛిన్నాయాస్సుమనోహరమ్ ।
గోపనీయం ప్రయత్నేన యదీచ్ఛేదాత్మనోహితమ్ ॥ 1

శ్లో॥ న వక్తవ్యం చ కుత్రాపి ప్రాణైః కంఠగతైరపి ।
తచ్ఛృణుష్వ మహేశాని సర్వం తత్కథయామి తే ॥ 2

శ్లో॥ వినా పూజాం వినా ధ్యానం వినా జాప్యేన సిద్ధ్యతి ।
వినా ధ్యానం తథా దేవి వినా భూతాదిశోధనమ్ ॥ 3

శ్లో॥ పఠనాదేవ సిద్ధిః స్యాత్ సత్యం సత్యం వరాననే ।
పురా కైలాసశిఖరే సర్వదేవసభాలయే ॥ 4

పరిపప్రచ్ఛ కథితం తథా శ్రుణు వరాననే ॥

అస్యశ్రీ ప్రచండచండికా సహస్రనామస్తోత్రస్య భైరవ ఋషిః, సమ్రాట్ ఛందః, ప్రచండచండికా దేవతా, ధర్మార్థకామమోక్షార్థే పాఠే వినియోగః ॥

ఓం

శ్లో॥ ప్రచండచండికా చండా చండదేవ్యవినాశినీ ।
చాముండా చ సుచండా చ చపలా చారుదేహినీ ॥ 1

శ్లో॥ లలజ్జిహ్వా చలద్రక్తా చారుచంద్రనిభాననా ।
చకోరాక్షీ చండనాదా చంచలా చ మనోన్మదా ॥ 2

శ్లో॥ చేతనా చితిసంస్థా చ చిత్కళా జ్ఞానరూపిణీ ।
మహాభయంకరీ దేవీ వరదాభయధారిణీ ॥ 3

శ్లో॥ భవాఢ్యా భయరూపా చ భవబంధమోచనీ ।
భవానీ భువనేశీ చ భవసంసారతారిణీ ॥ 4

శ్లో॥ భవాబ్ధిర్భవమోక్షా చ భవబంధవిఘాతినీ ।
భాగీరథీ భగస్థా చ భాగ్యభోగప్రదాయినీ ॥ 5

శ్లో॥ కమలా కామదా దుర్గా దుర్గబంధవిమోచనీ ।
దుర్దర్శనా దుర్గరూపా దుర్‌జ్ఞేయా దుర్గనాశినీ ॥ 6

శ్లో॥ దీనదుఃఖహరా నిత్యా నిత్యశోకవినాశినీ ।
నిత్యానందమయా దేవీ నిత్యం కళ్యాణకారిణీ ॥ 7

శ్లో॥ సర్వార్థసాధనకరీ సర్వసిద్ధిస్వరూపిణీ ।
సర్వక్షోభణశక్తిశ్చ సర్వవిద్రావిణీ వరా ॥ 8

శ్లో॥ సర్వరంజనశక్తిశ్చ సర్వోన్మాదస్వరూపిణీ ।
సర్వజ్ఞా సిద్ధిదాత్రీ చ సిద్ధివిద్యాస్వరూపిణీ ॥ 9

శ్లో॥ సకలా నిష్కలా సిద్ధా కళాతీతా కళామయీ ।
కులజ్ఞా కులరూపా చ చక్షురానందదాయినీ ॥ 10

శ్లో॥ కులీనా సామరూపా చ కామరూపా మనోహరా ।
కమలస్థా కంజముఖీ కుంజరేశ్వరగామినీ ॥ 11

శ్లో॥ కులరూపా కోటరాక్షీ కమలైశ్వర్యదాయినీ ।
కాంతీ కకుద్మినీ కుళ్యా కురుకుళ్యా కరాళికా ॥ 12

శ్లో॥ కామేశ్వరీ కామమాతా కామతాపవిమోచనీ ।
కామరూపా కామసత్వా కామకౌతుకకారిణీ ॥ 13

శ్లో॥ కారుణ్యహృదయా క్రీం క్రీం మంత్రరూపా చ కోటరా ।
కౌమోదకీ కుముదినీ కైవల్యకులవాసినీ ॥ 14

శ్లో॥ కేశవీ కేశవారాధ్యా కేశిదైత్యనిషూదినీ ।
క్లేశహా క్లేశరహితా క్లేశసంఘవినాశినీ ॥ 15

శ్లో॥ కరాళీ చ కరాళాస్యా కరాళాసురనాశినీ ।
కరాలచర్మాసిధరా కరాలకులనాశినీ ॥ 16

శ్లో॥ కంకినీ కంకనిరతా కపాలవరధారిణీ ।
ఖడ్గహస్తా త్రినేత్రా చ ఖండముండాసిధారిణీ ॥ 17

శ్లో॥ ఖలహా ఖలహంత్రీ చ క్షరంతీ ఖగతీ సదా ।
గంగాగౌతమపూజ్యా చ గౌరీగంధర్వవాసినీ ॥ 18

శ్లో॥ గంధర్వా గగనారాధ్యా గణా గంధర్వసేవితా ।
గణత్కారగణా దేవీ నిర్గుణా చ గుణాత్మికా ॥ 19

శ్లో॥ గుణతా గుణదాత్రీ చ గుణగౌరవదాయినీ ।
గణేశమాతా గంభీరా గగణా జ్యోతికారిణీ ॥ 20

శ్లో॥ గౌరాంగీ చ గయాగమ్యాగౌతమస్థానవాసినీ ।
గదాధరప్రియా జ్ఞేయా జ్ఞానగమ్యా గణేశ్వరీ ॥ 21

శ్లో॥ గాయత్రీ చ గుణవతీ గుణాతీతా గుణేశ్వరీ ।
గణేశజననీ దేవీ గణేశవరదాయినీ ॥ 22

శ్లో॥ గణాధ్యక్షనుతా నిత్యా గణాధ్యక్షప్రపూజితా ।
గిరీశ రమణీ దేవీ గిరీశపరివందితా ॥ 23

శ్లో॥ గతిదా గతిహా గౌతా గౌతమీ గురుసేవితా ।
గురుపూజ్యా గురుయుతా గురుసేవనతత్పరా ॥ 24

శ్లో॥ గంధద్వారా చ గంధాఢ్యా గంధాత్మా గంధకారిణీ ।
గీర్వాణపతిసంపూజ్యా గీర్వాణపతితుష్టిదా ॥ 25

శ్లో॥ గీర్వాణాధీశరమణీ గీర్వాణాధీశవందితా ।
గీర్వాణధీశసంసేవ్యా గీర్వాణాధీశహర్షదా ॥ 26

శ్లో॥ గానశక్తిర్గానగమ్యా గానశక్తిప్రదాయినీ ।
గానవిద్యా గానసిద్ధా గానసంతుష్టమానసా ॥ 27

శ్లో॥ గానాతీతా గానగీతా గానహర్షప్రపూరితా ।
గంధర్వపతిసంహృష్టా గంధర్వగుణమండితా ॥ 28

శ్లో॥ గంధర్వగుణసంసేవ్యా గంధర్వగుణమధ్యగా ।
గంధర్వగణకుశలా గంధర్వగణపూజితా ॥ 29

శ్లో॥ గంధర్వగణనిరతా గంధర్వగణభూషితా ।
ఘర్ఘరా ఘోరరూపా చ ఘోరఘుర్ఘురనాదినీ ॥ 30

శ్లో॥ ఘర్మబిందుసముద్భూతా ఘర్మబిందుస్వరూపిణీ ।
ఘంటారవా ఘనరవా ఘనరూపా ఘనోదరీ ॥ 31

శ్లో॥ ఘోరసత్త్వా చ ఘనదా ఘంటానాదవినోదినీ ।
ఘోరచండాలినీ ఘోరా ఘోరచండవినాశినీ ॥ 32

శ్లో॥ ఘోరదానవదమనీ ఘోరదానవనాశినీ ।
ఘోరకర్మాదిరహితా చ ఘోరకర్మనిషేవితా ॥ 33

శ్లో॥ ఘోరతత్త్వమయీ దేవీ ఘోరతత్త్వవిమోచినీ ।
ఘోరకర్మాదిరహితా ఘోరకర్మాదిపూరితా ॥ 34

శ్లో॥ ఘోరకర్మాదినిరతా ఘోరకర్మప్రవర్ధినీ ।
ఘోరభూతప్రమథినీ ఘోరభేతాళనాశినీ ॥ 35

శ్లో॥ ఘోరదావాగ్నిదమనీ ఘోరశత్రునిషూదినీ ।
ఘోరమంత్రమనోభిజ్ఞా ఘోరమంత్రప్రపూజితా ॥ 36

శ్లో॥ ఘోరమంత్రమనోభిజ్ఞా ఘోరమంత్రఫలప్రదా ।
ఘోరమంత్రనిధిశ్చైవ ఘోరమంత్రకృతాస్పదా ॥ 37

శ్లో॥ ఘోరమంత్రేశ్వరీ దేవీ ఘోరమంత్రార్థమానసా ।
ఘోరమంత్రార్థతత్త్వజ్ఞా ఘోరమంత్రార్థపారగా ॥ 38

శ్లో॥ ఘోరమంత్రార్థవిభవా ఘోరమంత్రార్థబోధినీ ।
ఘోరమంత్రార్థనిచయా ఘోరమంత్రార్థజన్మభూః ॥ 39

శ్లో॥ ఘోరమంత్రజపరతా ఘోరమంత్రజపోద్యతా ।
జకారవర్ణనిలయా జకారాక్షరమండితా ॥ 40

శ్లో॥ జకారాపరరూపా చ జకారాక్షరరూపిణీ ।
చిత్రరూపా చిత్రనాడీ చారుకేశీ చయప్రభా ॥ 41

శ్లో॥ చంచలా చంచలాకారా చారురూపా చ చండికా ।
చతుర్వేదమయీ చండా చండాలగణమండితా ॥ 42

శ్లో॥ చండాలచ్ఛేదినీ చండతాపనిర్మూలకారిణీ ।
చతుర్భుజా చండరూపా చండముండవినాశినీ ॥ 43

శ్లో॥ చంద్రికా చంద్రకీర్తిశ్చ చంద్రకాంతిస్తథైవ చ ।
చంద్రాస్యా చంద్రరూపా చంద్రమౌళిస్వరూపిణీ ॥ 44

శ్లో॥ చంద్రమౌళిప్రియా చంద్రమౌళిసంతుష్టమనసా ।
చకోరబంధురమణీ చకోరబంధుపూజితా ॥ 45

శ్లో॥ చంద్రరూపా చక్రమయీ చక్రాకారస్వరూపిణీ ।
చక్రపాణిప్రియా చక్రపాణిప్రీతిప్రదాయినీ ॥ 46

శ్లో॥ చక్రపాణిరసాభిజ్ఞా చక్రపాణివరప్రదా ।
చక్రపాణివరోన్మత్తా చక్రపాణిస్వరూపిణీ ॥ 47

శ్లో॥ చక్రపాణీశ్వరీ నిత్యం చక్రపాణినమస్కృతా ।
చక్రపాణిసముద్భూతా చక్రపాణిగుణాస్పదా ॥ 48

శ్లో॥ చంద్రావళీ చంద్రవతీ చంద్రకోటిసమప్రభా ।
చందనార్చితపాదాబ్జా చందనాన్వితమస్తకా ॥ 49

శ్లో॥ చారుకీర్తిశ్చారునేత్రా చారుచంద్రవిభూషణా ।
చారుభూషా చారువేషా చారువేషప్రదాయినీ ॥ 50

శ్లో॥ చారుభూషాభూషితాంగీ చతుర్వక్త్రవరప్రదా ।
చతుర్వక్త్రసమారాధ్యా చతుర్వక్త్రసమాశ్రితా ॥ 51

శ్లో॥ చతుర్వక్త్రచతుర్వాహా చతుర్థీ చ చతుర్దశీ ।
చిత్రా చర్మణ్వతీ చైత్రీ చంద్రభాగా చ చంపకా ॥ 52

శ్లో॥ చతుర్దశయమాకారా చతుర్దశయమానుగా ।
చతుర్దశయమప్రీతా చతుర్దశయమప్రియా ॥ 53

శ్లో॥ చలస్థా ఛిద్రరూపా చ ఛద్మదా ఛద్మరాజికా ।
ఛిన్నమస్తా తథా ఛిన్నా ఛిన్నముండవిదారిణీ ॥ 54

శ్లో॥ జయదా జయరూపా చ జయన్తీ జయమోహినీ ।
జయా జీవనసంస్థా చ జాలంధరవినాసినీ ॥ 55

శ్లో॥ జ్వాలాముఖీ జ్వాలదాత్రీ జాజ్వల్యదహనోపమా ।
జగద్వంద్యా జగత్పూజ్యా జగత్త్రాణపరాయణా ॥ 56

శ్లో॥ జగతీ జగదాధారా జన్మమృత్యుజరాపహా ।
జననీ జన్మభూమిశ్చ జన్మదా జయశాలినీ ॥ 57

శ్లో॥ జ్వరరోగహరా జ్వాలా జ్వాలామాలాప్రపూరితా ।
జంభారాతీశ్వరీ జంభారాతివైభవకారిణీ ॥ 58

శ్లో॥ జంభారాతిస్తుతా జంభారాతిశత్రునిషూదినీ ।
జయదుర్గా జయారాధ్యా జయకాళీ జయేశ్వరీ ॥ 59

శ్లో॥ జయతారా జయాతీతా జయశంకరవల్లభా ।
జలదా జహ్నుతనయా జలధిత్రాసకారిణీ ॥ 60

శ్లో॥ జలధివ్యాధిదమనీ జలధిజ్వరనాశినీ ।
జంగమేశీ జాడ్యహరా జాడ్యసంఘనివారిణీ ॥ 61

శ్లో॥ జాడ్యగ్రస్తజనాతీతా జాడ్యరోగనివారిణీ ।
జన్మదాత్రీ జన్మహర్త్రీ జయఘోషసమన్వితా ॥ 62

శ్లో॥ జపయోగసమాయుక్తా జపయోగవినోదినీ ।
జపయోగప్రియా జాప్యా జపాతీతా జయస్వనా ॥ 63

శ్లో॥ జాయాభావస్థితా జాయా జాయాభావప్రపూరిణీ ।
జపాకుసుమసంకాశా జపాకుసుమపూజితా ॥ 64

శ్లో॥ జపాకుసుమవద్భాసా జపాకుసుమరూపిణీ ।
జమదగ్నిస్వరూపా చ జానకీ జనకాత్మజా ॥ 65

శ్లో॥ ఝంఝావాతప్రముక్తాంగీ ఝోరాఝంకారవాసినీ ।
ఝంకారకారిణీ ఝంఝావాతరూపా చ ఝంకరీ ॥ 66

శ్లో॥ ఞ కారాణుస్వరూపా చ టపటంకారనాదినీ ।
టంకారీ టకువాణీ చ ఠకారాక్షరరూపిణీ ॥ 67

శ్లో॥ డిండిమా చ తథా డింభా డిండుడిండిమనాదినీ ।
ఢక్కామయీ ఢిలమయీనృత్యశబ్దవిలాసినీ ॥ 68

శ్లో॥ ఢక్కా ఢక్కేశ్వరీ ఢక్కాశబ్దరూపా తథైవ చ ।
ఢక్కానాదప్రియా ఢక్కానాదసంతుష్టమానసా ॥ 69

శ్లో॥ ణకారా ణాక్షరమయీ ణాక్షరాదిస్వరూపిణీ ।
త్రిపురా త్రిపురమయీ త్రిశక్తిస్త్రిగుణాత్మికా ॥ 70

శ్లో॥ తామసీ చ త్రిలోకేశీ త్రిపురా చ త్రయీశ్వరీ ।
త్రివిద్యా చ త్రిరూపా చ త్రినేత్రా చ త్రిరూపిణీ ॥ 71

శ్లో॥ తారిణీ తరళా తారా తారకారిప్రపూజితా ।
తారకారిసమారాధ్యా తారకారివరప్రదా ॥ 72

శ్లో॥ తారకారిప్రసూస్తన్వీ తరుణీ తరళప్రభా ।
త్రిరూపా చ త్రిపురగా త్రిశూలవరధారిణీ ॥ 73

శ్లో॥ త్రిశూలినీ తంత్రమయీ తంత్రశాస్త్రవిశారదా ।
తంత్రరూపా తపోమూర్తి స్తంత్రమంత్రస్వరూపిణీ ॥ 74

శ్లో॥ తడిత్తడిల్లతాకారా తత్త్వజ్ఞానప్రదాయినీ ।
తత్త్వజ్ఞానేశ్వరీ దేవీ తత్త్వజ్ఞానప్రమోదినీ ॥ 75

శ్లో॥ త్రయీమయీ త్రయీసేవ్యా త్ర్యక్షరీ త్ర్యక్షరేశ్వరీ ।
తాపవిధ్వంసినీ తాపసంఘనిర్మూలకారిణీ ॥ 76

శ్లో॥ శాస్త్రకర్త్రీ త్రాసహర్త్రీ త్రాసదాత్రీ చ త్రాసహా ।
తిథీశా తిథిరూపా చ తిథిస్థా తిథిపూజితా ॥ 77

శ్లో॥ తిలోత్తమా చ తిలదా తిలప్రీతా తిలేశ్వరీ ।
త్రిగుణా త్రిగుణాకారా త్రిపురీ త్రిపురాత్మికా ॥ 78

శ్లో॥ త్రికూటా త్రికుటాకారా త్రికుటాచలమధ్యగా ।
త్రిజటా చ త్రినేత్రా చ త్రినేత్రవరసుందరీ ॥ 79

శ్లో॥ తృతీయా చ త్రివర్షా చ త్రివిధా త్రిమతేశ్వరీ ।
త్రికోణస్థా త్రికోణేశీ త్రికోణయంత్రమధ్యగా ॥ 80

శ్లో॥ త్రిసంధ్యా చ త్రిసంధ్యార్చ్యా త్రిపదా త్రిపదాస్పదా ।
స్థానస్థితా స్థలస్థా చ ధన్యస్థలనివాసినీ ॥ 81

శ్లో॥ థకారాక్షరరూపా చ స్థూలరూపా తథైవ చ ।
స్థూలహస్తా తథా స్థూలా స్థైర్యరూపప్రకాశినీ ॥ 82

శ్లో॥ దుర్గా దుర్గార్తిహంత్రీ చ దుర్గబంధవిమోచినీ ।
దేవీ దానవసంహంత్రీ దనుజేష్ఠనిషూదినీ ॥ 83

శ్లో॥ దారాపత్యప్రదా నిత్యా శంకరార్ధాంగధారిణీ ।
దివ్యాంగీ దేవమాతా చ దేవదుష్టవినాశినీ ॥ 84

శ్లో॥ దీనదుఃఖహరా దీనతాపనిర్మూలకారిణీ ।
దీనమాతా దీనసేవ్యా దీనదంభవినాశినీ ॥ 85

శ్లో॥ దనుజధ్వంసినీ దేవీ దేవకీ దేవవల్లభా ।
దానవారిప్రియాదీర్ఘా దానవారిప్రపూజితా ॥ 86

శ్లో॥ దీర్ఘస్వరా దీర్ఘతనుర్దీర్ఘదుర్గతినాశినీ ।
దీర్ఘనేత్రా దీర్ఘచక్షుః దీర్ఘకేశీ దిగంబరా ॥ 87

శ్లో॥ దిగంబరప్రియాదాంతా దిగంబరస్వరూపిణీ ।
దుఃఖహీనా దుఃఖహరా దుఃఖసాగరతారిణీ ॥ 88

శ్లో॥ దుఃఖదారిద్ర్యశమనీ దుఃఖదారిద్ర్యకారిణీ ।
దుఃఖదా దుస్సహా దుష్టఖండనైకస్వరూపిణీ ॥ 89

శ్లో॥ దేవవామా దేవసేవ్యా దేవశక్తిప్రదాయినీ ।
దామినీ దామినీప్రీతా దామినీశతసుందరీ ॥ 90

శ్లో॥ దామినీశతసంసేవ్యా దామినీదామభూషితా ।
దేవతాభావసంతుష్టా దేవతాశతమధ్యగా ॥ 91

శ్లో॥ దయార్ద్రా చ దయారూపా దయాదానపరాయణా ।
దయాశీలా దయాసారా దయాసాగరసంస్థితా ॥ 92

శ్లో॥ దశవిద్యాత్మికా దేవీ దశవిద్యాస్వరూపిణీ ।
ధరణీ ధనదా ధాత్రీ ధన్యా ధాన్యపరాశివా ॥ 93

శ్లో॥ ధర్మరూపా ధనిష్ఠా చ ధేయా చ ధీరగోచరా ।
ధర్మరాజేశ్వరీ ధర్మకర్మరూపా ధనేశ్వరీ ॥ 94

శ్లో॥ ధనుర్విద్యా ధనుర్గమ్యా ధనుర్ధరవరప్రదా ।
ధర్మశీలా ధర్మలీలా ధర్మకర్మవివర్జితా ॥ 95

శ్లో॥ ధర్మదా ధర్మనిరతా ధర్మపాఖండఖండినీ ।
ధర్మేశీ ధర్మరూపా చ ధర్మరాజవరప్రదా ॥ 96

శ్లో॥ ధర్మిణీ ధర్మగేహస్థా ధర్మాధర్మస్వరూపిణీ ।
ధనదా ధనదప్రీతా ధనధాన్యసమృద్ధిదా ॥ 97

శ్లో॥ ధనధాన్యసమృద్ధిస్థా ధనధాన్యవినాశినీ ।
ధర్మనిష్ఠా ధర్మధీరా ధర్మమార్గరతా సదా ॥ 98

శ్లో॥ ధర్మబీజకృతస్థానా ధర్మబీజసురక్షిణీ ।
ధర్మబీజేశ్వరీ ధర్మబీజరూపా చ ధర్మగా ॥ 99

శ్లో॥ ధర్మబీజసముద్భూతా ధర్మబీజసమాశ్రితా ।
ధరాధరపతిప్రాణా ధరాధరపతిస్తుతా ॥ 100

శ్లో॥ ధరాధరేంద్రతనుజా ధరాధరేంద్రవందితా ।
ధరాధరేంద్రగేహస్థా ధరాధరేంద్రపాలినీ ॥ 101

శ్లో॥ ధరాధరేంద్రసర్వార్తినాశినీ ధర్మపాలినీ ।
నవీనా నిర్మలా నిత్యా నాగరాజప్రపూజితా ॥ 102

శ్లో॥ నాగేశ్వరీ నాగమాతా నాగకన్యా చ నగ్నికా ।
నిర్లేపా నిర్వికల్పా చ నిర్లోభా నిరుపద్రవా ॥ 103

శ్లో॥ నిరాహారా నిరాకారా నిరంజనస్వరూపిణీ ।
నాగినీ నాగవిభవా నాగరాజపరిస్తుతా ॥ 104

శ్లో॥ నాగరాజగుణజ్ఞా చ నాగరాజసుఖప్రదా ।
నాగలోకగతా నిత్యం నాగలోకనివాసినీ ॥ 105

శ్లో॥ నాగలోకేశ్వరీ నాగభాగినీ నాగపూజితా ।
నాగమధ్యస్థితా నాగమోహసంక్షోభదాయినీ ॥ 106

శ్లో॥ నృత్యప్రియా నృత్యవతీ నృత్యగీతపరాయణా ।
నృత్యేశ్వరీ నర్తకీ చ నృత్యరూపా నిరాశ్రయా ॥ 107

శ్లో॥ నారాయణీ నరేంద్రస్థా నరముండాస్థిమాలినీ ।
నరమాంసప్రియా నిత్యా నరరక్తప్రియా సదా ॥ 108

శ్లో॥ నరరాజేశ్వరీ నారీరూపా నారీస్వరూపిణీ ।
నారీగణార్చితా నారీమధ్యగా నూతనాంబరా ॥ 109

శ్లో॥ నర్మదా చ నదీరూపా నదీసంగమసంస్థితా ।
నర్మదేశ్వరసంప్రీతా నర్మదేశ్వరరూపిణీ ॥ 110

శ్లో॥ పద్మావతీ పద్మముఖీ పద్మకింజల్కవాసినీ ।
పట్టవస్త్రపరీధానా పద్మరాగవిభూషితా ॥ 111

శ్లో॥ పరమా ప్రీతిదా నిత్యా ప్రేతాసననివాసినీ ।
పరిపూర్ణరసోన్మత్తా ప్రేమవిహ్వాలవల్లభా ॥ 112

శ్లో॥ పవిత్రాశవనిఃపూతా ప్రేయసీపరమాత్మికా ।
ప్రియవ్రతపరా నిత్యా పరమప్రేమదాయినీ ॥ 113

శ్లో॥ పుష్పప్రియా పద్మకోశా పద్మధర్మనివాసినీ ।
ఫేత్కారిణీ తంత్రరూపా ఫేరుఫేరవనాదినీ ॥ 114

శ్లో॥ వంశినీ వంశరూపా చ బగలా కామరూపిణీ ।
వాఙ్మయీ వసుధా ధృష్యా వాగ్భవాఖ్యా వరాననా ॥ 115

శ్లో॥ బుద్ధిదా బుద్ధిరూపా చ విద్యా వాదస్వరూపిణీ ।
బాలా వృద్ధమయీరూపా వాణీ వాక్యనివాసినీ ॥ 116

శ్లో॥ వరుణా వాగ్వతీ వీరా వీరభూషణభూషితా ।
వీరభద్రార్చితపదా వీరభద్రప్రసూరపి ॥ 117

శ్లో॥ వేదమార్గరతా వేదమంత్రరూపా వషట్ప్రియా ।
వీణావాద్యసమాయత్తా వీణావాద్యపరాయణా ॥ 118

శ్లో॥ వీణారవా తథా వీణాశబ్దరూపా చ వైష్ణవీ ।
వైష్ణవాచారనిరతా వైష్ణవాచారతత్పరా ॥ 119

శ్లో॥ విష్ణుసేవ్యా విష్ణుపత్నీ విష్ణురూపా వరాననా ।
విశ్వేశ్వరీ విశ్వమాతా విశ్వనిర్మాణకారిణీ ॥ 120

శ్లో॥ విశ్వరూపా విశ్వేశీ విశ్వసంహారకారిణీ ।
భైరవీ భైరవారాధ్యా భూతభైరవసేవితా ॥ 121

శ్లో॥ భైరవేశీ తథా భీమా భైరవేశ్వరతుష్టిదా ।
భైరవాధీశరమణీ భైరవాధీశపాలినీ ॥ 122

శ్లో॥ భీమేశ్వరీ భీమమాతా భీమశబ్దపరాయణా ।
భీమరూపా భీమేశీ భీమా భీమవరప్రదా ॥ 123

శ్లో॥ భీమపూజితపాదాబ్జా భీమభైరవపాలినీ ।
భీమాసురధ్వంసకరీ భీమదుష్టవినాశినీ ॥ 124

శ్లో॥ భువనా భువనారాధ్యా భవానీ భూతిదా సదా ।
భయదాభయహన్త్రీ చ అభయాఽభయరూపిణీ ॥ 125

శ్లో॥ భీమనాదావిహ్వలా చ భయభీతివినాశినీ ।
మత్తాప్రమత్తరూపా చ మదోన్మత్తస్వరూపిణీ ॥ 126

శ్లో॥ మన్యా మనోజ్ఞా మానా చ మంగళా చ మనోహరా ।
మాననీయా మహాపూజ్యా మహిషీదుష్టమర్దినీ ॥ 127

శ్లో॥ మహిషాసురహంత్రీ చ మాతంగీ మయవాసినీ ।
మాధ్వీ మధుమయీ ముద్రా ముద్రికా మంత్రరూపిణీ ॥ 128

శ్లో॥ మహావిశ్వేశ్వరీ దూతీ మౌళిచంద్రప్రకాశినీ ।
యశఃస్వరూపిణీ దేవీ యోగమార్గప్రదాయినీ ॥ 129

శ్లో॥ యోగినీ యోగగమ్యా చ యామ్యేశీ యోగరూపిణీ ।
యజ్ఞాంగీ చ యోగమయీ జపరూపా జపాత్మికా ॥ 130

శ్లో॥ యుగాఖ్యా చ యుగాంతా చ యోనిమండలవాసినీ ।
అయోనిజా యోగనిద్రా యోగానందప్రదాయినీ ॥ 131

శ్లో॥ రమా రతిప్రియా నిత్యా రతిరాగవర్ధినీ ।
రమణీ రాససంభూతా రమ్యా రాసప్రియా రసా ॥ 132

శ్లో॥ రణోత్కంఠా రణస్థా చ వరా రంగప్రదాయినీ ।
రేవతీ రణజైత్రీ చ రసోద్భూతా రణోత్సవా ॥ 133

శ్లో॥ లతా లావణ్యరూపా చ లవణాబ్ధిస్వరూపిణీ ।
లవంగకుసుమారాధ్యా లోలజిహ్వా చ లేలిహా ॥ 134

శ్లో॥ వశినీ వనసంస్థా చ వనపుష్పప్రియా వరా ।
ప్రాణేశ్వరీ బుద్ధిరూపా బుద్ధిదాత్రీ బుధాత్మికా ॥ 135

శ్లో॥ శమనీ శ్వేతవర్ణా చ శాంకరీ శివభాషిణీ ।
శ్యామరూపా శక్తిరూపా శక్తిబిందువాసినీ ॥ 136

శ్లో॥ సర్వేశ్వరీ సర్వదాత్రీ సర్వమాతా చ శర్వరీ ।
శాంభవీ సిద్ధిదా సిద్ధా సుషుమ్నాసర్వభాసినీ ॥ 137

శ్లో॥ సహస్రదళమధ్యస్థా సహస్రదళవర్తినీ ।
హరప్రియా హరధ్యేయా హూంకారబీజరూపిణీ ॥ 138

శ్లో॥ లంకేశ్వరీ చ తరళా లోమమాంసప్రపూజితా ।
క్షేమ్యా క్షేమకరీ క్షామా క్షీరబిందుస్వరూపిణీ ॥ 139

శ్లో॥ క్షిప్తచిత్తప్రదా నిత్యా క్షౌమవస్త్రవిలాసినీ ।
ఛిన్నా చ ఛిన్నరూపా చ క్షుధా క్షౌత్కారరూపిణీ ॥ 140

శ్లో॥ సర్వవర్ణమయీ దేవీ సర్వసంపత్ప్రదాయినీ ।
సర్వసంపద్ప్రదాత్రీ చ సంపదాపద్విభూషితా ॥ 141

శ్లో॥ సత్త్వరూపా సర్వార్థా సర్వదేవప్రపూజితా ।
సర్వేశ్వరీ సర్వమాతా సర్వజ్ఞా సురసాత్మికా ॥ 142

శ్లో॥ సింధుర్మందాకినీ గంగా నదీ సాగరరూపిణీ ।
సుకేశీ ముక్తకేశీ చ డాకినీ వరవర్ణినీ ॥ 143

శ్లో॥ జ్ఞానదా జ్ఞానగగనా సోమమండలవాసినీ ।
ఆకాశనిలయా నిత్యా పరమాకాశరూపిణీ ॥ 144

శ్లో॥ అన్నపూర్ణా మహానిత్యా మహాదేవరసోద్భవా ।
మంగళా కాళికా చండా చండనాదాతిభీషణా ॥ 145

శ్లో॥ చండాసురస్య మథినీ చాముండా చపలాత్మికా ।
చండీ చామరకేశీ చ చలత్కుండలధారిణీ ॥ 146

శ్లో॥ ముండమాలాధరా నిత్యా ఖండముండవిలాసినీ ।
ఖడ్గహస్తా ముండహస్తా వరహస్తా వరప్రదా ॥ 147

శ్లో॥ అసిచర్మధరా నిత్యా పాశాంకుశధరా పరా ।
శూలహస్తా శివహస్తా ఘంటానాదవిలాసినీ ॥ 148

శ్లో॥ ధనుర్బాణధరాఽఽదిత్యా నాగహస్తా నగాత్మజా ।
మహిషాసురహంత్రీ చ రక్తబీజనివాసినీ ॥ 149

శ్లో॥ రక్తరూపా రక్తగా చ రక్తహస్తాభయప్రదా ।
అసితా చ ధర్మధరా పాశాంకుశధరా పరా ॥ 150

శ్లో॥ ధనుర్బాణధరా నిత్యా ధూమ్రలోచననాశినీ ।
పరస్థా దేవతామూర్తిః శర్వాణీ శారదా పరా ॥ 151

శ్లో॥ నానావర్ణవిభూషాంగీ నానారాగసమాపినీ ।
పశువస్త్రపరీధానా పుష్పాయుధధరా పరా ॥ 152

శ్లో॥ ముక్తరంజితమాలాఢ్యా ముక్తాహారవిలాసినీ ।
స్వర్ణకుండలభూషా చ స్వర్ణసింహాసనస్థితా ॥ 153

శ్లో॥ సుందరాంగీ సువర్ణాభా శాంభవీ శకటాత్మికా ।
సర్వలోకేశవిద్యా చ మోహసమ్మోహకారిణీ ॥ 154

శ్లో॥ శ్రేయసీ సృష్టిరూపా చ ఛిన్నచ్ఛద్మమయీ ఛలా ।
ఛిన్నముండధరా నిత్యా నిత్యానందవిధాయినీ ॥ 155

శ్లో॥ నందా పూర్ణా చ రిక్తా చ తిథయఃపూర్ణషోడశీ ।
కుహూః సంక్రాంతిరూపా చ పంచపర్వవిలాసినీ ॥ 156

శ్లో॥ పంచబాణధరా నిత్యా పంచమీప్రీతిదా పరా ।
పంచపత్రాభిలాషా చ పంచామృతవిలాసినీ ॥ 157

శ్లో॥ పంచాలీ పంచమీ దేవీ పంచరక్తప్రసారిణీ ।
పంచబాణధరా నిత్యా నిత్యదాత్రీ దయాపరా ॥ 158

శ్లో॥ పలలాదిప్రియా నిత్యా పశుగమ్యా పరేశితా ।
పరా పరరహస్యా చ పరమప్రేమవిహ్వలా ॥ 159

శ్లో॥ కులీనా కేశిమార్గస్థా కులమార్గప్రకాశినీ ।
కులాకులస్వరూపా చ కులార్ణవమయీ కులా ॥ 160

శ్లో॥ రుక్మా చ కాలరూపా చ కాలకంపనకారిణీ ।
విలాసరూపిణీ భద్రా కులాకులనమస్కృతా ॥ 161

శ్లో॥ కుబేరవిత్తదాత్రీ చ కుమారజననీ పరా ।
కుమారీరూపసంస్థా చ కుమారీపూజనాంబికా ॥ 162

శ్లో॥ కురంగనయనా దేవీ దినేశాస్యాఽపరాజితా ।
కుండలీ కదలీసేనా కుమార్గరహితా వరా ॥ 163

శ్లో॥ అనంతరూపానంతస్థా ఆనందసింధువాసినీ ।
ఇలాస్వరూపిణీ దేవీ ఇ ఈ భేద భయంకరీ ॥ 164

శ్లో॥ ఇంగళా పింగళా నాడీ ఇకారాక్షరరూపిణీ ।
ఉమా ఉత్పత్తిరూపా చ ఉచ్చభావవినాశినీ ॥ 165

శ్లో॥ ఋగ్వేదా చ నిరారాధ్యా యజుర్వేదప్రపూజితా ।
సామవేదేన సంగీతా అథర్వవేదభాషిణీ ॥ 166

శ్లో॥ ఋకారరూపిణీ ఋక్షా నిరక్షరస్వరూపిణీ ।
అహిదుర్గాసమాచారా ఇకారవర్ణస్వరూపిణీ ॥ 167

శ్లో॥ ఓంకారా ప్రణవస్థా చ ఓంకారాదిస్వరూపిణీ ।
అనులోమవిలోమస్థా థకారవర్ణసంభవా ॥ 168

శ్లో॥ పంచాశద్వర్ణబీజాఢ్యా పంచాశన్ముండమాలికా ।
ప్రత్యేకాదశసంఖ్యా చ షోడశీ ఛిన్నమస్తకా ॥ 169

శ్లో॥ షడంగయువతీపూజ్యా షడంగరూపవర్జితా ।
షడ్వక్త్రసంశ్రితా నిత్యా విశ్వేశీ ఖంగదాలయా ॥ 170

శ్లో॥ మాలామంత్రమయీ మంత్రజపమాతా మదాలసా ।
సర్వవిశ్వేశ్వరీ శక్తిః సర్వానందప్రదాయినీ ॥ 171

ఓం

శ్లో॥ ఇతి శ్రీ ఛిన్నమస్తాయాః నామసహస్రముత్తమమ్ ।
పూజాక్రమేణ కథితం సాధకానాం సుఖావహమ్ ॥ 172

శ్లో॥ గోపనీయం గోపనీయం గోపనీయం న సంశయః ।
అర్ధరాత్రే ముక్తకేశో! భక్తియుక్తో భవేన్నరః ॥ 173

శ్లో॥ జపిత్వా పూజయిత్వా చ పఠేన్నామసహస్రకమ్ ।
విద్యాసిద్ధిర్భవేత్తస్య షణ్మాసాభ్యాసయోగతః ॥ 174

శ్లో॥ యేన కేన ప్రకారేణ దేవీభక్తిపరో భవేత్ ।
అఖిలాంస్తంభయేల్లోకాన్ రాజ్ఞోఽ మోహయేత్ సదా॥ 175

శ్లో॥ ఆకర్షయేద్దేవశక్తిం మారయేద్దేవివిద్విషమ్ ।
శాత్రవో దాసతాం యాంతి పాపాని యాంతి సంక్షయమ్ ।
మృత్యుశ్చ క్షయతాం యాతి పఠనాద్భాషణాత్ ప్రియే ॥ 176

శ్లో॥ ప్రశస్తాయాః ప్రసాదేన కిం న సిద్ధ్యతి భూతలే ।
ఇదం రహస్యం పరమం పరం స్వస్త్యయనం మహత్ ॥ 177

శ్లో॥ ధృత్వా బాహౌ మహాసిద్ధః ప్రాప్యతే నాత్ర సంశయః ।
అనయా సదృశీ విద్యా విద్యతే న మహేశ్వరి ॥ 178

శ్లో॥ వారమేకం తు యోఽధీతే సర్వసిద్ధీశ్వరో భవేత్ ।
కులవారే కులాష్టమ్యాం కుహూసంక్రాంతిపర్వసు ॥ 179

శ్లో॥ యశ్చేమాం పఠతే విద్యాం తస్య సమ్యక్ఫలం శ్రుణు ।
అష్టోత్తరశతం జప్త్వా పఠేన్నామసహస్రకమ్ ॥ 180

శ్లో॥ భక్త్యా స్తుత్వా మహాదేవి సర్వపాపాత్ప్రముచ్యతే ।
సర్వపాపైః వినిర్ముక్తః సర్వసిద్ధీశ్వరో భవేత్ ॥ 181

శ్లో॥ అష్టమ్యాం వా నిశీథే చ చతుష్పథగతో నరః ।
మాషయుక్తబలిం దత్వా పఠేన్నామసహస్రకమ్ ॥ 182

శ్లో॥ సుధర్మా వామవేద్యాం తు మాసత్రయవిధానతః ।
దుర్జయః కామరూపశ్చ మహాబలపరాక్రమః ॥ 183

శ్లో॥ కుమారీపూజనం నామ మంత్రమాత్రం పఠేన్నరః ।
ఏతన్మాత్రస్య పఠనాత్ సర్వసిద్ధీశ్వరో భవేత్ ॥ 184

శ్లో॥ ఇతి తే కథితం దేవి సర్వసిద్ధిపరన్నరః ।
జప్త్వా స్తుత్వా మహాదేవీం సర్వపాపైః ప్రముచ్యతే ॥ 185

శ్లో॥ న ప్రకాశ్యమిదం దేవి సర్వదేవనమస్కృతమ్ ।
ఇదం రహస్యం పరమం గోప్తవ్యం పశుసంకటే ॥ 186

శ్లో॥ ఇతి సకలవిభూతేర్హేతుభూతం ప్రశస్తమ్ ।
పఠతి య ఇహ మర్త్యశ్ఛిన్నమస్తాస్తవం చ ॥ 187

శ్లో॥ ధనద ఇవ ధనాఢ్యో మాననీయో నృపాణామ్ ।
స భవతి చ జనానామాశ్రయః సిద్ధివేత్తా ॥ 188

ఇతి శ్రీ విశ్వసారతంత్రే శివపార్వతీసంవాదే
శ్రీఛిన్నమస్తాసహస్రనామస్తోత్రం సంపూర్ణమ్.

---

# శాంతి మంత్రం

**ఓం తచ్ఛం యోరావృణీమహే । గాతుం యజ్ఞాయ । గాతుం యజ్ఞపతయే ।**
**దైవీ స్వస్తిరస్తు నః । స్వస్తిర్మానుషేభ్యః । ఊర్ధ్వం జిగాతు భేషజమ్ ।**
**శం నో అస్తు ద్విపదే । శం చతుష్పదే ॥**
**ఓం శాంతిః శాంతిః శాంతిః శాంతిః ॥**

యః = ఎవరు; శం = మంగళం ప్రసాదిస్తారో; తత్ = ఆ భగవంతుని; ఆవృణీమహే = ప్రార్థిస్తాము; యజ్ఞాయ = యజ్ఞం చక్కగా నెరవేర; గాతుమ్ = అర్థిస్తున్నాము; యజ్ఞపతయే = యజ్ఞం నిర్వర్తించే వారికై; గాతుమ్ = అర్థిస్తున్నాము; నః = మనకు; దైవీః = దేవతల; స్వస్తిః అస్తు = మేలు చేయుగాక; మనుషేభ్యః = మానవులందరికీ; స్వస్తి = మేలు ఒకగూరుగాక; భేషజమ్ = చెట్టుచేమలు; ఊర్ధ్వం జిగాతు = ఊర్ధ్వముఖంగా (పైకి) పెరుగుగాక; నః = మనవద్ద ఉన్న; ద్విపదే = రెండు పాదాల జీవులకు; శం అస్తు = మంగళకరం అగుగాక; చతుష్పదే = నాలుగు పాదాల జీవులకు; శమ్ = మేలు జరుగుగాక.





శ్రీః

సరస్వతీదేవి నలునికి చెప్పిన

# "అవామా" మంత్ర శ్లోకం

## అర్థ తాత్పర్య విశేషాలు



–డా. తాడేపల్లి పతంజలి

పూర్వ కవులలో చాలామంది మంత్రోపాసన చేసి కవిత్వశక్తిని సంపాదించిన వాళ్లు. శ్రీ హర్షుడు అను మహాకవి **సారస్వతచింతామణి** అను మంత్రమును జపించి, **త్రిపుర సుందరీదేవి** ప్రత్యక్షము పొంది, ఎవరూ వ్రాయలేని విధముగా శ్రీ హర్ష నైషధాన్ని వ్రాసాడు. అందులోని పద్నాలుగవ సర్గలో సరస్వతీదేవి, నలునికి ఆ సారస్వత చింతామణి మంత్రాన్ని "అవామా..." అను ఒక శ్లోకంలో చెబుతుంది. హర్ష నైషధకావ్యానికి మణిపూసవంటి ఆ పూర్తి శ్లోకమిది.

**శ్లో॥ అవామావామార్ధే సకలముభయాకారఘటనాత్**
**ద్విధాభూతం రూపం భగవదభిధేయం భవతి యత్ ॥**
**తదన్తర్మన్త్రం మే స్మర హరమయం సేన్దుమమలం**
**నిరాకారం శశ్వజ్జప నరపతే! సిద్ధ్యతు స తే ॥** (14–84)

ఈ శ్లోకం శిఖరిణి వృత్తంలో (య, మ, న, స, భ, వ) ఉంది. ఈ శ్లోకానికి మూడు రకాలుగా అర్థాలను పెద్దలు శ్రీ ఉడాలి సుబ్బరాయ శాస్త్రిగారు తమ హర్షనైషధ వ్యాఖ్యలో చెప్పారు. నేను దానిని నా వ్యావహారిక శైలిలో తాత్పర్యవిశేషాలు జోడించి మళ్ళీ చెప్పటానికి ప్రయత్నిస్తాను.

**శ్లోకానికి అర్ధనారీశ్వరమూర్తి పక్షములో ప్రతిపదార్థం :** నరపతే! = ఓ నలమహారాజా! (ఆ శివుని అర్ధనారీశ్వర స్వరూపము); అర్ధే = ఒక భాగములో; అవామా = స్త్రీ రూపము కానిది (అనగా పురుషుడు); అర్ధే = ఇంకొక భాగములో; వామా = స్త్రీ రూపము కలిగినది; (అత ఏవ = అందువలననే); ద్విధాభూతం ఉభయాకార = రెండు రకాల రూపాలను; ఘటనాత్ = ఒకచోట కలుపుటవలన; సకలమ్ = సంపూర్ణత పొందిన; భగవత్ + అభిధేయమ్ = భగవంతుని పదముతో చెప్పదగిన; రూపమ్ = రూపము (అర్ధనారీశ్వర రూపము); భవతి = కలుగుచున్నది; యత్ = ఏదయితే; సేన్దుమ్ = స + ఇన్దుమ్ = చంద్ర కళలతో కూడినది; అమలమ్ = స్వచ్ఛమైనది; నిరాకారమ్ = ఆకారము లేనిది; మన్త్రమ్ = మంత్రరూపమైనదియూ; హరమయమ్ = శివమయమైనదియు; మే = నాయొక్క (సరస్వతీదేవి యొక్క); తత్ = ఆ స్వరూపమును; అన్తః = మనస్సులో; స్మర = స్మరింపుము; శశ్వత్ = ఎప్పుడూ; జప = జపింపుము; సః = ఆపరమశివుడు; తే = నీకు; సిద్ధ్యతు = ప్రసన్నుడగు గాత!

**తాత్పర్యము :** శివునికి "వామార్ధజాని" అని పేరు ఉంది. అంటే ఎడమసగమున భార్య కలవాడు అని అర్థం. దీనినే సరస్వతీదేవి ఈ శ్లోకంలో చెబుతోంది. ఓ నలమహారాజా! ఆ శివుని అర్ధనారీశ్వరస్వరూపము కుడిసగములో స్త్రీ రూపము కానిది. ఎడమ సగములో స్త్రీ రూపము కలిగినది. ఆరెండు రకాల రూపాలను ఒకచోట కలుపుటవలన సంపూర్ణతపొందిన భగవంతుని పదముతో చెప్పదగిన అర్ధనారీశ్వర రూపము శివునికి కలుగుచున్నది. అది చంద్రకళలతో కూడినది. స్వచ్ఛమైనది. ఆకారములేనిది. మంత్రరూపమైనది. శివమయము. సరస్వతీదేవి యొక్క ఆ స్వరూపమును మనస్సులో స్మరింపుము ఎప్పుడూ జపింపుము. ఆపరమశివుడునీకు ప్రసన్నుడగు గాత!

**విశేషాలు :** సంభర్తృత్వము, భర్తృత్వము, నేతృత్వము, గమయతృత్వము, స్రష్టృత్వము, సర్వశరీరత్వము, సర్వభూతాంతరాత్మత్వము, నిరస్త నిఖిలదోషత్వము, షాడ్గుణ్యపూర్ణత్వము మొదలయిన గుణములు కలవాడు భగవంతుడు.

**సంభర్తృత్వము** అంటే ఉపకరణ సంపాదనము. ప్రకృతి పురుషకాలములకు కార్యములను పుట్టించే యోగ్యతను కలుగచేయుట. **భర్తృత్వము** అంటే స్థితిని కలుగచేయుట. **గమయితృత్వము** అంటే సంహారముచేయుట. **స్రష్టృత్వము** అంటే సృష్టించుట. **సర్వశరీరత్వము** అంటే ప్రపంచము శరీరముగా కలిగి ఉండుట. **సర్వభూతాంతరాత్మత్వము** అంటే అన్ని భూతాలకు లోపల ఆత్మగా ఉండుట. **నిరస్త నిఖిలదోషత్వము** అంటే ప్రకృతి సంబంధముతో వచ్చే దోషాలు ఏవి లేక ఉండుట. **షాడ్గుణ్యపూర్ణత్వము** అంటే ఐశ్వర్యము, వీర్యము, యశస్సు, శ్రీ, జ్ఞానము, వైరాగ్యము ఈ ఆఱుగుణములను కలిగి ఉండుట.

పురుష శరీరము – స్త్రీ శరీరాన్ని చేరటంతో భగవానుడను పదంతో పిలవటానికి యోగ్యత వస్తుందని శ్రీ హర్షుని మాట.

**ఇంకొక విశేషము :** అర్ధనారీశ్వరస్వరూపము సరస్వతీస్వరూపమని ఈ అవామా శ్లోకంలో ఉంది. "ఈశ్వరాదనుగ్రహేణ పుంసామద్వైతవాసనా" "జ్ఞానం మహేశ్వరాదిచ్ఛేత్" వంటి అనేక ప్రమాణ వాక్యములు ఈశ్వరుని జ్ఞానప్రదాతగా నిర్ణయిస్తున్నాయి. దీనిని బలపరుస్తూ శ్రీ హర్షుడు సరస్వతీ రూపములో శివుని పోల్చాడు.

**అవామా శ్లోకానికి మంత్రపక్షమున ప్రతిపదార్థం :** నరపతే! = ఓ నలమహారాజా!; అర్ధే = పూర్వార్ధములో; మా = మకారము చేత (ప్రణవము చేత); అవామార్ధే = ఉత్తర భాగములో; అవా = ఓంకారము చేత; మా = మకారము చేత (మొదలు, చివర ప్రణవము చేత సంపుటీకరింపబడినదియూ – (సంపుటీకరణం = బీజాక్షరాలతో మంత్రాలను రూపొందించే ఒక పద్ధతి.); ఉభయాకార = రెండు ఆకారములతో; ఘటనాత్ = ఒకచోట కలుపుటవలన; ద్విధాభూతమ్ = హ, ర అని రెండుగా విభజింపబడినదియు (రెండు ఆకారములచే ప్రణవమునందు కలుపుటవలన), రెండు ఆకారములు కలదియు; సకలమ్ = సంపూర్ణతపొందిన; భగవత్ + అభిధేయమ్ = శివుని వాచ్యార్థముగా కలదియు; యత్ రూపమ్ = ఏ స్వరూపము; భవతి = ఉన్నదో (ఓం హర ఓం అను ఏ రూపము ఉన్నదో); తత్ = ఆ స్వరూపమును; హరమయమ్ = హకార రేఫ స్వరూపముగల; నిరాకారమ్ = అకారములు లేక హ్, ర్, అను వ్యంజన మాత్ర స్వరూపము కలిగినదియూ; సేన్దుమ్ = తురీయ (నాలుగవ) స్వరమగు ఈకారముతోను, బిందువుతోను కలిసినదియూ (హ్, ర్, అను హల్లులను, ఈ, బిందువులతో కలిపిన ఎడల **హ్రీం** అను మంత్రాక్షరము ఏర్పడుచున్నదని భావం); అమలమ్ = స్వచ్ఛమైనది; నిరాకారమ్ = రహితములైన అకారద్వయము కలదియు; మే = నాయొక్క; మన్త్రమ్ = మంత్రమును; అన్తః = అంతఃకరణములో; స్మర = స్మరింపుము; శశ్వత్ = ఎప్పుడూ; జప = జపింపుము; సః = ఆపరమశివుడు; తే = నీకు; సిధ్యతు = ప్రసన్నుడగు గాక!

**తాత్పర్యము :** ఓ నలమహారాజా! పూర్వార్ధములో మకారము చేత (ప్రణవము చేత) ఉత్తర భాగములో మకారము చేత రెండు ఆకారములతో ఒకచోట కలుపుటవలన హ, ర అని రెండుగా విభజింపబడినదియు (రెండు ఆకారములచే ప్రణవమునందు కలుపుటవలన) రెండు ఆకారములు కలదియు, సంపూర్ణత పొందిన శివుని వాచ్యార్థముగా కలదిగా ఏ స్వరూపము ఉన్నదో – ఓం హర ఓం అను రూపము ఏర్పడుచున్నదో – ఆ స్వరూపమును – హకార రేఫ స్వరూపముగల ఈకారముతో కూడుకొన్న

స్వచ్ఛమైనది రహితములైన అకారద్వయము కలదియు నాయొక్క మంత్రమును (సారస్వతచింతామణి) మనస్సులో స్మరింపుము. ఎప్పుడూ జపింపుము. ఆపరమశివుడు నీకు ప్రసన్నుడగు గాత! అని సరస్వతీదేవి చెప్పుచున్నది.

**విశేషాలు :** "ఓం హర ఓం" అనునది ఒక శివ మంత్రము. "ఓం హ్రీం ఓం" అనునది సారస్వతచింతామణి మంత్రం. ఇది సరస్వతీదేవికి సంబంధించినది.

"ఓం హర ఓం" అను మంత్రము "ఓం హ్రీం ఓం" అనునది సారస్వత చింతామణి మంత్రంగా రూపము మార్చుకొన్నదని భావం.

**అవామా శ్లోకానికి యంత్రపక్షమున (బీజాక్షరచక్రము) ప్రతిపదార్థం :** భగవత్ + అభిధేయమ్ = యోనివలె కనబడునదియూ; యత్ రూపమ్ = ఏ త్రికోణాత్మక రూపము; భవతి = కలదో; ఉభయాకార = రెండు త్రికోణములను; ఘటనాత్ = చేర్చుటవలన; సకలమ్ = సమగ్రమగు షట్కోణము ఏర్పడుచున్నది; తత్ = ఆ షట్కోణములకు; అన్తః = మధ్యలో; మన్త్రమ్ = ఓం హ్రీం ఓం అను ఆకారము కలిగిన మంత్రము ఏర్పడుచున్నది; తత్ = ఆరూపమును; స్మర = ధ్యానింపుము; (మిగిలిన అర్థాలు ముందువలెనె).

**తాత్పర్యము :** మొదట యోని రూపములో కనబడే త్రికోణాన్ని మరొక త్రికోణముతో కలుపుట వలన షట్కోణములు ఏర్పడుతున్నాయి. ఆ షట్కోణములకు మధ్యలో "ఓం హ్రీం ఓం" అను ఆకారము కలిగిన మంత్ర రూపమును ధ్యానింపుము అని సరస్వతీదేవి నలమహారాజుకు చెప్పింది.

**విశేషాలు :** అమ్మవారి భగమును (యోని) పూజించేవారిని వామాచారులంటారు. వామాచారము అంటె నిఘంటులలో వేద విరుద్ధమైన ఆచారము అని అర్థం ఉంది. అయితే లలితా సహస్ర నామాలలో ఒక నామము వామకేశ్వరీ. వామాచారులు పూజించు తల్లి అని దీని అర్థం.

అస్సాం రాజధాని గౌహతి లో "నీలాచలపర్వతం" మీద ఉన్న కామాఖ్య దేవాలయంలో (అష్టాదశ శక్తి పీఠాలలో ఒకటి) ఇప్పటికీ యోని పూజ జరుగుతుంది. ఒకమూల, నల్లనిరాయిమీద 'యోని' రూపం చెక్కి ఉంటుంది. ఆ రూపాన్ని భక్తులు పూజిస్తూ ఉంటారు.

విశాఖపట్నం జిల్లా సబ్బవరం మండలం దేవీపురంలో శ్రీచక్ర ఆలయం ఒకటి ఉంది. ఇక్కడ యోని ఆకారంలో కామాఖ్యపీఠం ఏర్పాటు చేసి శ్రీచక్రాన్ని పీఠానికి అడుగున ప్రతిష్ఠించారు. **జ్ఞానాన్నిచ్చేది ముఖమని, పోషించేది స్తన్యమని, జన్మనిచ్చేది యోని అని, మోక్షాన్ని ఇచ్చేది పాదాలని అవగాహన చేసుకుని అమ్మవారి పూజలు చేస్తే విద్య, ధనం, సంతానం, మోక్షంవరుసగా ప్రాప్తిస్తాయని ఇక్కడివారి నమ్మిక.**

శ్రీ హర్షుని కాలములో ఈ వామాచారము బాగా ఉన్నట్లుంది. అందుకే ఈ మూడవ అర్థాన్ని పేర్కొన్నాడు. **"యోని తంత్రం"** అని పేర్కొనబడే ఈ వామాచార సాధన చాలా సున్నితమైన అంశం. అందరూ చేయలేనిది.

**గుంటూరు శేషేంద్ర శర్మ గారి వ్యాఖ్యానము :** "అవామావామార్ధే" అను శ్లోకమునకు మల్లినాథుడు మూడర్థములు ఉన్నాయని చెప్పాడు. శ్రీశర్మగారు ఆ మూడర్థములే గాక బ్రహ్మ విద్యా రహస్య పరమగు నాల్గవ అర్థము ఉందన్నారు తమ **స్వర్ణహంస** అను పుస్తకములో. బ్రహ్మ విద్యా రహస్య పరమగు నాల్గవ అర్థము ప్రకృతము కాకపోయినప్పటికీ ప్రకృతమైన మంత్ర శాస్త్రార్థము కన్న పరమ రమణీయమైనదని వీరి ఉద్దేశ్యం.

ప్రపంచానికి కారణమయిన బ్రహ్మతత్వం రెండు రకాలుగా కలిసి ఉంది.

(అర్ధనారీశ్వరస్వరూపము) ఈ రెండు రకాలయిన సగుణ బ్రహ్మాన్ని ఉపాసిస్తే – మనస్సు ఆ ఆకారానికి మారి – స్మరహరమయం – స్మృతులు నశించి పోతాయి. అభేద స్థితి వస్తుంది. అహం బ్రహ్మాస్మి అవుతుంది. ఈ స్మరహర సమాసానికి సేందుం, అమలం, నిరాకారం విశేషణాలు. నిర్వికల్పస్థితి కనుక శ్రీ హర్షుడు అమలం – (నిర్వికారం) అన్నాడు. ఇది ఈ శ్లోకం చెప్పే బ్రహ్మావిద్యారహస్యం. (స్వర్ణహంస– 74 వ పుట)

అద్భుతమైన భార్గవ రామావతారం, శ్రీ రామావతారం ముందు శక్తిని కోల్పోయినట్లుగా – నైషధంలో అద్భుతమైన సరస్వతీదండకము చెప్పిన శ్రీనాథుడు ఈ "అవామా" శ్లోకానువాదాన్ని పాడు చేసాడని శ్రీ శర్మగారి అభిప్రాయం. "సకలంబై, హిమరుక్కళాభరణమై, సవ్యాపసవ్యార్ధ యుగ్మక రూపంబయి, శైవమై, ...." ఇదీ శ్రీనాథుని అనువాదం. అవామా రాకపోతే అ ఉ మ కలిస్తే ఓం అన్న అర్థం రాదు. శ్రీనాథుని సవ్యాప సవ్యార్ధ యుగ్మక సమాసం అందుకు ఎంత మాత్రము పనికిరాదు. తదంతర్మంత్రం స్మరహరమయం అనకపోతే ఓం శ్రీం అను వర్ణాలమధ్య ఉన్న హ్రీం అనే అర్థం రాదు. హర శబ్దం రాకపోతే రేఫాత్మకం అనే అర్థం రాదు. శ్రీనాథుని "శైవంబై" ఆ పని చేయుటకు అసమర్థము. (స్వర్ణహంస– 78 వ పుట)

**అవామా ప్రయోగాలు :** రుద్రదేవుడు అనే కవి గాయత్రీ దేవిని ప్రార్థిస్తూ ఇలా అన్నాడు.

"అవామా సంయుక్తం సకలమనుజైర్జాప్యమభితో–  
హ్యాపాయాత్పాయాద్భూరథ భువి భువః స్వః పదమితి ।  
పదం తన్మే పాదావవతు సవితుశ్చైవ జఘనే–  
వరేణ్యం శ్రోణిం మే సతతమవతాన్నాభిమపి చ ॥ (గాయత్రీ లహరి)

అవామా పదాన్ని శిఖరిణి వృత్తంలో ప్రారంభ పదంలో ఈ కవి అందంగా ప్రయోగించాడు. అధునాతన కాలంలో కీర్తిశేషులు, అవధాన విద్యావాచస్పతి డా॥ చెఱువు సత్యనారాయణ శాస్త్రిగారు ఇంతే అందంగా **లింగోద్భవవృత్తమాలికా స్తుతి**లో అవామా పదాన్ని అందంగా ప్రయోగించారు. పూర్తి శ్లోకం ఇది.

శ్లో॥ జయతు జయతు దేవోఽర్ధాంగజానిర్మహేశో  
జయతు జయతు దేవీ తస్య వామాప్య వామా ।  
జయతు జయతు తజ్జాయా పతీద్య ప్రసాదో  
జయతు జయతు భక్తౌఘ శ్శివార్థ్య స్మదాదిః ॥ (50 వశ్లోకం)

వామా = ఉత్తమ స్త్రీ అయినప్పటికీ – అవామా = స్త్రీ రూపము కానిది (అనగా పురుషుడు) అని అర్ధనారీశ్వర స్వరూపాన్ని పూర్వ కావ్య పఠనా ప్రఢిమ కలిగిన చెఱువువారు చమత్కరించారు. (ఈ శ్లోక పూర్తి అర్థ విశేష వివరాలు శ్రీ రావి మోహనరావు గారిచే ముద్రణా భాగ్యము పొందనున్న చెఱువు వారి **లింగోద్భవవృత్తమాలికాస్తుతి** పుస్తకంలో ఆసక్తి కలిగిన వారు చూడవచ్చు.)

**ముగింపు :** సమర్థుడు కాని వాడెవడూ, తాను పండితుడిని అనే గర్వంతో నా గ్రంథంలో వేలు పెట్టకుండా వుండడానికి నైషధీయచరిత్రంలో ప్రయత్నించి కావాలని కొన్ని పీటముడులు వేసాను. శ్రద్ధగా గురువుగారి దగ్గర నేర్చుకున్న మంచివాడు, గురువు సహాయంతో ఆ ముడులు విప్పి, ఈ కావ్య రస డోలికల్లో ఓలలాడుదురు గాక. (గ్రంథ గ్రంథి క్వచిత్క్వచిదపి...) అని శ్రీ హర్షుడు నైషధీయ చరిత్రం చివర వ్రాసాడు. ఆయన వేసిన పీటముడులలో (గట్టిముడి, విడదీయరాని ముడి) ఈ **"అవామా"** శ్లోకం ఒకటి.

✦



# బ్రహ్మాండ వ్యాప్త దేహాః

## (రుద్రాభిషేకంలోని రెండవ ధ్యానశ్లోక ప్రతిపదార్థ తాత్పర్య విశేషాలు)

*- డా॥ తాడేపల్లి పతంజలి, హైదరాబాద్.*

ఈ శ్లోకంలో అనేక మంది రుద్రులవర్ణన జరిగింది. జ్యోతిర్మయమైన శివలింగంలో అనేకమంది రుద్రులను దర్శించి వారు సుఖాన్ని ఇవ్వాలని ఈ శ్లోకంలో ప్రార్థిస్తున్నారు ద్రష్టలు.

**శ్లో॥ బ్రహ్మాండవ్యాప్తదేహా భసితహిమరుచా, భాసమానా భుజంగైః,**
**కంఠే కాలాః, కపర్దాః, కలితశశికలాశ్చండకోదండహస్తాః ।**
**త్ర్యక్షా రుద్రాక్షమాలాస్సలలితవపుషాశ్శాంభవామూర్తిభేదాః**
**రుద్రాశ్శ్రీరుద్రసూక్తప్రకటితవిభవా నః ప్రయచ్ఛంతు సౌఖ్యమ్!!**

**ప్రతిపదార్థము :** బ్రహ్మాండ = రుద్రులు బ్రహ్మాండమంతా; వ్యాప్త = నిండిపోయిన; దేహాః = శరీరము కలవారు; భసిత హిమరుచాః = బూడిదవంటి, మంచువంటి తెల్లని కాంతులతో ఉన్నారు. (దానికితోడు భస్మ రేఖలు దిద్దుకొన్నారు.); భాసమానా భుజంగైః = పాములతో ఆలంకరించబడి ఉన్నారు; కంఠే కాలాః = అందరి కంఠములందు నల్లని మచ్చలు ఉన్నాయి. అందరూ నీలకంఠులే; కపర్దాః = అందరూ కపర్దమను పేరు గల జటాజూటములను ధరించి ఉన్నారు; కలితశశికలాః = అందరు చంద్రరేఖలను ధరించి ఉన్నారు; చండ కోదండ హస్తాః = వాడియైన కోదండాలను ధరించారు; త్ర్యక్షాః = త్రి + అక్షాః = అందరూ మూడు కన్నులు కలవారు; రుద్రాక్షమాలాః = అందరూ రుద్రాక్షలు ధరించి ఉన్నారు; సలలితవపుషాః = లావణ్యమైన, లోకానికి అతీతమయిన శరీరములు కలిగి ఉన్నారు; శాంభవాః = అందరూ లోకానికి శుభమును కలిగించువారు; మూర్తిభేదాః = అనేక మూర్తులతో ఉన్నవారు; రుద్రాః = అటువంటిరుద్రులు; శ్రీరుద్రసూక్త ప్రకటిత విభవాః = ఈ రుద్ర సూక్తము ద్వారా (నమకచమకములద్వారా) తమ సంపదను(కాన్తిని) ప్రకటింపచేస్తున్నారు; నః ప్రయచ్ఛంతు సౌఖ్యమ్ = అటువంటి రుద్రులు వారు నమక చమక పారాయణము చేయబోవు మాకు - సౌఖ్యమును ఇచ్చెదరు గాక!

**తాత్పర్యము :** రుద్రులు బ్రహ్మాండమంతా నిండిపోయిన శరీరము కలవారు; బూడిదవంటి, మంచువంటి తెల్లని కాంతులతో ఉన్నారు. దానికితోడు భస్మ రేఖలు దిద్దుకొన్నారు. పాములతో అలంకరించబడి ఉన్నారు. అందరి కంఠములందు నల్లని మచ్చలు ఉన్నాయి. అందరూ నీలకంఠులే. అందరూ కపర్దమను పేరు గల జటాజూటములను ధరించి ఉన్నారు; అందరు చంద్రరేఖలను ధరించి ఉన్నారు. వారు వాడియైన కోదండాలను ధరించారు; అందరూ మూడు కన్నులు కలవారు; అందరూ రుద్రాక్షలు ధరించి ఉన్నారు; లావణ్యమైన, లోకానికి అతీతమయిన శరీరములు కలిగి ఉన్నారు. అందరూ లోకానికి శుభమును కలిగించువారు. అనేక మూర్తులతో ఉన్నవారు. అటువంటి రుద్రులు ఈ రుద్రసూక్తము ద్వారా (నమకచమకములద్వారా) తమ సంపదను ప్రకటింపచేస్తున్నారు. వారు నమక చమక పారాయణముము చేయబోవు మాకు- సౌఖ్యమును ఇచ్చెదరు గాక!

**విశేషాలు :** బ్రహ్మాండమంటే ప్రపంచము. ఆకాశానికి శబ్ద గుణము ఉంది. వాయువుకి శబ్ద, స్పర్శ గుణాలు ఉన్నాయి. అగ్నికి శబ్ద, స్పర్శ రూప గుణాలు ఉన్నాయి. నీటికి శబ్ద, స్పర్శ రూప, రస

గుణాలున్నాయి. భూమికి శబ్ద, స్పర్శ రూప, రస, రస గంధ గుణాలున్నాయి. ఇవన్నీ కలిస్తే బ్రహ్మాండమైందని బ్రహ్మపురాణంలో ఉంది. (23 వ అధ్యాయము) ఈ బ్రహ్మాండము వెలగ పండు విత్తనంలా ఉంటుందని పోలిక చెప్పారు. ఈ మానవశరీరము బ్రహ్మాండము యొక్క సూక్ష్మరూపం. హరి బ్రహ్మాండములో వ్యాపించినట్లే ఈ శరీరములో కూడా వ్యాపించి హృదయ సీమలో అలంకరించి ఉంటాడని ప్రశ్నోపనిషత్తు చెబుతోంది. (ఆరవ అధ్యాయము)

**కాలము :** కాలము అనగా నల్లనిది. కాలయతి మనఇతి కాలః. మనస్సును ప్రేరేపించునది కనుక నల్లని రంగుకు కాలమని పేరు.

భూతభవిష్యద్వర్తమానములు కాలత్రయము: ప్రాతస్సంగమ మధ్యాహ్నాపరాహ, సాయంకాలములు కాలపంచకము, వీటిని కూడా శివులు కంఠమునందు కలిగి ఉన్నారని ఇంకొక సమన్వయము.

**కపర్ది :** 'కపర్దిన్' పదము సంస్కృతమున శివునకు రూఢివాచకముగను, జటాధారులకు సామాన్యవాచకముగను నున్నది. కపర్దమనగా కిరీటమని అర్థముగలదు; 'కపర్ది' యన గిరీటి కావచ్చును. ఇందుకు సంస్కృతమున బ్రయోగము మృగ్యము; కాని, ఋగ్వేదమున 'కపర్దిన్, శబ్దము 'కిరీటి' పదమునకు బర్యాయముగ వాడబడియున్నది. "అయం సోమః కపర్దినే ఘృతం న్య పవతే మధు, ఆభక్షత్ కన్యాను నః" (ఋగ్వేదము 7-67. 11.) దీనిలోని 'కపర్దినే' అను పదమునకు భాష్యమున 'కల్యాణ ముకుటవతే' అని యర్థము చెప్పబడినది. ఈ సంప్రదాయార్థము ననుసరించి 'కిరీటి' పదమునకు బర్యాయపదముగా 'కపర్ది' శబ్దభవమగు 'కవ్వడి' పదము తెనుగు భారతమున నుపయోగింప బడియుండును. కాని, 'కిరీటి' పదమునకు గ్రీడియను తద్భవముండనే యున్నది కావున 'కవ్వడి' పదము 'కపర్ది' భవముగనే అనగా 'కపర్దము' లేక 'జటాజూటము' కలవాడను నర్థముననే యుపయోగింపబడినట్లెంచుట యుక్తమని తోచుచున్నది.

అయినను భారతమున గాని మ యెచ్చటగాని యర్జునునకు కపర్దియను నామము కానరాదు. అంతమాత్రమున 'కవ్వడి' పదమునకు 'కపర్ది' భవత్వమును త్రోసివేయుటకు వీలులేదు. 'కవ్వడి' యనునది లక్షణార్థమున దొలుత నుపయోగింపబడి తరువాత రూఢ్యర్థమున దెలుగుకవుల వాడుక యందు నెలకొన్నదని చెప్పవలెను. అర్జునుడును కపర్దము కలవాడే యనుట కాతని 'గుడాకేశ' నామము తెలుపుచున్నది. గుడాకేశు డనినను కపర్ది యనినను నర్థమొక్కటే. కపర్దాకారముగల కేశపాశమును జుట్టు కొనువారి కెల్లరకు కపర్ది, గుడాకేశనామములు చెల్లును. (ఆంధ్ర భాషా చరిత్రము 846 పుట)

దేవాలయానికి కాని, పుణ్య క్షేత్రాలకు కాని వెళ్ళే ముందు, "కపర్ది కపర్ది కపర్ది" అని 3 సార్లు అనుకొని బయలుదేరితే, దారిలో ఎదురయ్యే అడ్డంకులు తొలగిపోతాయి. ఆ గంగమ్మ నీటితో తడుస్తున్న "పరమశివుడి" జటాజూటాన్ని తలుచుకుంటే మన పాపరాసి దగ్ధమవుతుందని పెద్దలు చెప్పారు. స్వస్తి.



**ఓం నమః శివాయ**



## మకరతోరణం
# కీర్తిముఖుడు

శ్రీ శివమహాపురాణములో రుద్రసంహిత యందు యుద్ధఖండములో దూతసంవాదమనే పందొమ్మిదవ అధ్యాయములో ఈ కీర్తిముఖుని ప్రస్తావన కనబడుతుంది. ఆ వైనం చిత్తగించండి.

జలంధరుడనే రాక్షసుని దూత రాహువు అనేవాడు ఒకసారి శివుని దగ్గరగా వచ్చి ఇలా అన్నాడు. "ఓ శివా! దైత్యులచే నాగులచే సేవింపబడువాడు, ముల్లోకములకు అధిపతి అయిన ఆ జలంధరుడు నన్ను పంపించాడు. (22శ్లో.). జలంధరుడు నీతో ఇలా చెప్పమన్నాడు. శ్మశానములో ఉండేవాడివి, నిత్యము ఎముకల మాలను ధరించువాడివి, దిగంబరుడవు అయిన నీకు పార్వతి భార్య ఎలా అయింది? (26) నేను రత్నములకు అధీశ్వరుడను (27). మేము శ్రేష్ఠవస్తువులను అనుభవించే రారాజులము. నీవైతే యోగివి, దిగంబరుడవు. నీవద్దనున్న స్త్రీరత్నమును నాకు సమర్పించు". (29)

రాహువు ఇలా మాట్లాడుతుంటే, కోపించిన శూలపాణి అయిన శివుని కనుబొమల మధ్యనుండి భయంకరుడు, తీవ్రమగు పిడుగుతో సమానమగు ధ్వని కలిగిన పురుషుడు పుట్టాడు (30). సింహపు నోటిలో వలె కదలాడుచున్న నాలుక గలవాడు, నిప్పులు గ్రక్కు కన్నులవాడు, పెద్ద శరీరము గలవాడు, పైకి లేచి నిలబడిన వెంట్రుకలు గలవాడు, శుష్కించిన దేహము గలవాడు అగు ఆ పురుషుడు వెంటనే వేగముగా రాహువుపైకి పరుగెత్తాడు. (32). తనను తినివేయుటకు వచ్చుచున్న ఆ పురుషుని చూచి రాహువు భయపీడితుడై వేగముగా పారిపోతుంటే ఆ పురుషుడు ఆతనిని పట్టుకొన్నాడు. (33).

అప్పుడు రాహువు రక్షించవలసినదని శివుడిని ప్రార్థించాడు. శివుడు దయతో శరణుజొచ్చిన ఈ రాహువును శిక్షించవద్దని ఆ భయంకర పురుషునికి చెప్పాడు. అతడు రాహువును విడిచిపెట్టి శివుని సమీపమునకు వచ్చి ఇలా అన్నాడు. (40) "ఓ స్వామీ! ఆకలి నన్ను బాధిస్తోంది. నేను మలమల మాడిపోతున్నాను. ఓ దేవదేవా! నేను ఏమి తినాలి? ఓ ప్రభూ! నన్ను ఆజ్ఞాపించు". శివుడు వెంటనే ఇలా అన్నాడు "ఆకలి నిన్ను బాధిస్తే, నీవు నీ కాళ్ళు చేతుల మాంసమును వెంటనే చక్కగా తిను" (44 శ్లో).

ఆ భయంకర పురుషుడు శివుని ఆజ్ఞను పొంది తన కాళ్లు చేతులలోని మాంసమును తిన్నాడు. తల మాత్రమే మిగిలింది. (45). సదాశివుడు భయంకరమగు కర్మను చేసిన ఆ పురుషునితో ఆశ్చర్యపూర్వకముగా ఇలా అన్నాడు. (46). "నువ్వు చేసిన ఈ పనికి నేను చాలా సంతోషించాను. (47). నువ్వు ఎప్పుడూ నా కుమారుడివి. మహాగణుడవు, మహావీరుడవు, దుష్టులందరికీ భయమును గొల్పువాడవు అగు నీవు కీర్తిముఖుడను పేరును పొందు. (48). నన్ను కొలిచే నా భక్తులు నాకు ఇష్టమయిన నిన్ను కూడ ఎప్పుడూ పూజిస్తారు." (49).

**విశ్లేషణ :** ఇప్పటికీ వివిధ దేవాలయాలలో మకరతోరణ మధ్యభాగంలో (మొసలి రూపము గల తోరణము.) ఒక కనుగుడ్లు ముందుకు చొచ్చుకు వచ్చిన ఒక రాక్షసముఖం కనబడుతుంది. ఇతడే కీర్తిముఖుడు. ఆకలి తీరని కీర్తిముఖుడు ఇప్పటికీ శివదర్శనానికి వచ్చే ప్రజలందరిలో ఉండే దుష్టమైన అహంకారాన్ని, ఆశను, తింటూ ఉంటాడు.

సద్గురు జగ్గీ వాసుదేవ్ కీర్తిముఖుని గురించి ఇలా వ్యాఖ్యానించారు. "ప్రతి దేవాలయంలోనూ కీర్తిముఖం ఉంటుంది. శివుడు చెప్పినంత మాత్రంచేతనే అతను తన శరీరాన్ని తానే భుజించాడు. మరో కారణం లేదు, అర్థం లేదు, తినేశాడంతే. అందుకే దేవతలను మించినవాడయ్యాడు. ఏం చెప్తున్నానంటే అతను స్థాన, కాలాలను – సర్వాన్నీ అధిగమించాడు. దేవతలను మించిపోయాడంటే, దేవతలు కూడా వీటిలో కొన్ని వాస్తవాలకు అధీనులే, కానీ కీర్తిముఖుడు ఆ కోణాలన్నిటినీ దాటి ముందుకు వెళ్ళిపోయాడన్నమాట. అతను వీరందరికంటే మిన్నగా ఉన్నాడు. ఎవరైనా తనను తాను తినివేయడమన్నది అత్యద్భుతమైన విషయం. ఎందుకంటే దైవత్వం మీలో ప్రవేశించాలంటే, అది మీలో వ్యక్తం కావాలంటే మీలో ఖాళీ స్థలం ఉండాలి కదా. అటువంటి శూన్యస్థితిలో మాత్రమే మీకు ప్రేమ, సంతోషం, శాంతి తెలుస్తాయి. మీలో శూన్యం ఏర్పడితేనే దివ్యత్వం కలుగుతుంది. మీరు మీ శారీరక, మానసిక పరిమితుల్ని, చివరికి మీ జీవన శక్తుల్నీ అధిగమించాలంటే మీరిలా ఉండాలి. లేకపోతే మీరు ఆ కోణాలను స్పృశించను కూడా స్పృశించలేరు. మిమ్మల్ని మీరు తినగలిగితేనే మీరు కీర్తిముఖులు కాగలరు."

**ఉపసంహారం :** పవిత్రమైన కార్తికమాసంలో ఉపవాసాలుంటాం... ఉసిరిని తినాలంటాం. ఉసిరినే కాదు కీర్తిముఖునిలా మనలోని అహంకారాన్ని మనమే తినేయాలి. అహంభావాన్ని లేశం కూడా మిగల్చకూడదు. అప్పుడే కార్తికమాసంలో చేసే పూజలకు, ఉపవాసాలకు పరిపూర్ణత ఏర్పడుతుంది.

✦ ✦ ✦

---

# గణపతి మంత్రం

**ఓం గణానాం త్వా గణపతిగ్ం హవామహే కవిం కవీనాముపమశ్రవస్తమమ్ । జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత ఆ నః శృణ్వన్నూతిభిస్సీద సాదనమ్ ॥ మహాగణపతయే నమః ॥ ఓం ॥**

గణానామ్ = దేవగణాలకు; గణపతిమ్ = గణపతిగా పేరుపొందిన; త్వా = నిన్ను; హవామహే = కీర్తించి ఆహ్వానిస్తున్నాము; కవీనామ్ = మేధావులలో; కవిః = మేధావివి; ఉపమ శ్రవః తమమ్ = సాటిలేని ఖ్యాతి గలవాడవు; జ్యేష్ఠరాజం = ప్రధానులలో శ్రేష్ఠతముడవు; బ్రహ్మణామ్ = వేదాలకు; బ్రహ్మణస్పతః = వేదనాయకుడవు; నః = మా యొక్క; శృణ్వన్ = విని; ఊతిభిః సీదసాదనమ్ = సత్వరం కాపాడ; ఆ = వచ్చి అనుగ్రహిస్తావుగాక; మహాగణపతయే = మహాగణపతికి; నమః = నమస్కారము.





శ్రీ అభినవగుప్తాచార్యవిరచిత

# భైరవస్తోత్రమ్



శ్లో॥ వ్యాప్తచరాచరభావవిశేషం చిన్మయమేకమనన్తమనాదిమ్ ।
భైరవనాథమనాథశరణ్యం త్వన్మయచితయా హృది వన్దే ॥ 1

శ్లో॥ త్వన్మయమేతదశేషమిదానీం భాతి, మమ త్వదనుగ్రహశక్త్యా ।
త్వఞ్చ మహేశ! సదైవ మమాత్మా స్వాత్మయ మమ తేన సమస్తమ్ ॥ 2

శ్లో॥ స్వాత్మని విశ్వగతే త్వయి నాథే తేన న సంస్కృతిభీతికథాస్తి ।
సత్స్వపి దుర్ధరదుఃఖవిమోహత్రాసవిధాయిషు కర్మ గణేషు ॥ 3

శ్లో॥ అన్తక! మాం ప్రతి మాదృశమేనాం క్రోధకరాళతమాం విదధీహి ।
శఙ్కరసేవనచిన్తనధీరో భీషణభైరవశక్తిమయోఽస్మి ॥ 4

శ్లో॥ ఇత్థముపోఢభవన్మయసంవిద్దీధితిదారితభూరితమిస్రః ।
మృత్యుయమాంతకకర్మపిశాచైః నాథ! నమోఽస్తు న జాతు బిభేమి ॥ 5

శ్లో॥ ప్రోదితసత్యవిబోధమరీచిప్రోక్షితవిశ్వపదార్థసతత్త్వః ।
భావపరామృతనిర్భరపూర్ణే త్వయ్యహమాత్మని నిర్వృతిమేమి ॥ 6

శ్లో॥ మానసగోచరమేతి యదైవ క్లేశదశా తనుతాపవిధాత్రీ ।
నాథ! తదైవ మమ త్వదభేదస్తోత్రపరామృతవృష్టిరుదేతి ॥ 7

శ్లో॥ శఙ్కర! సత్యమిదం వ్రతదానస్నానతపో భవతాపవినాశి ।
తావకశాస్త్రపరామృతచింతా స్యన్దతి చేతసి నిర్వృతిధారా ॥ 8

శ్లో॥ నృత్యతి గాయతి హృష్యతి గాఢం సంవిదియం మమ భైరవనాథ! ।
త్వాం ప్రియమాప్య సుదర్శనమేకం దుర్లభమన్యజనైః సమయజ్ఞమ్ ॥ 9

శ్లో॥ వసురసపౌషే కృష్ణదశమ్యాం అభినవగుప్తః స్తవమిమమకరోత్ ।
యేన విభుర్భవమరుసంతాపం శమయతి ఝటితి జనస్య దయాళుః ॥ 10

ఓం నమో భగవతే భైరవాయ

*అక్షరదోషరహితమైనది. కంఠస్థం చేయగలరు.*



# శ్రీ శివహృదయమ్



అస్యశ్రీ శివహృదయస్తోత్రమహామంత్రస్య । వామదేవ ఋషిః । పంక్తిశ్ఛందః । శ్రీసాంబసదాశివో దేవతా । ఓం బీజమ్ । నమః శక్తిః । శివాయేతి కీలకమ్ । మమ చతుర్వర్గఫలావాప్తయే శ్రీసాంబసదాశివహృదయమంత్రజపే వినియోగః ॥

**ఋష్యాదిన్యాసః :**

వామదేవాయ ఋషయే నమః (శిరసి)। పంక్త్యైఛందసే నమః (ముఖే)। శ్రీసాంబసదాశివాయ దేవతాయై నమః (హృది) । ఓం బీజాయ నమః (గుహ్యే) । నమః శక్తయే నమః (పాదయోః) । శివాయేతి కీలకాయ నమః (నాభౌ)। వినియోగాయ నమః ఇతి కరసంపుటే ॥

**కర, హృదయాదిన్యాసః :**

ఓం సదాశివాయాఙ్గుష్ఠాభ్యాం నమః । ఓం సదాశివాయ హృదయాయ నమః ।
నం గఙ్గాధరాయ తర్జనీభ్యాం నమః । నం గఙ్గాధరాయ శిరసే స్వాహా ।
మం మృత్యుఞ్జయాయ మధ్యమాభ్యాం నమః । మం మృత్యుఞ్జయాయ శిఖాయై వషట్ ।
శిం శూలపాణయేఽనామికాభ్యాం నమః । శిం శూలపాణయే కవచాయ హుమ్ ।
వాం పినాకపాణయే కనిష్ఠికాభ్యాం నమః । వాం పినాకపాణయే నేత్రత్రయాయ వౌషట్ ।
యం ఉమాపతయే కరతలకరపృష్ఠాభ్యాం నమః । యం ఉమాపతయేఽస్త్రాయ ఫట్ ।

భూర్భువస్సువరోమితి దిగ్బంధః ।

**ధ్యానమ్ :**

శ్లో॥ వామాఙ్కన్యస్తవామేతరకరకమలాయాస్తథా వామహస్త –
న్యస్తారక్తోత్పలాయాః స్తనపరివిలసద్వామహస్తః ప్రియాయాః ।
సర్వాకల్పాభిరామో ధృతపరశుమృగాభీష్టదః కాంచనాభః
ధ్యేయః పద్మాసనస్థః స్మరలలితవపుస్సమ్పదే పార్వతీశః ॥

(ఎడమతొడపై కుడిచేయిపెట్టికొని, ఎడమచేత ఎఱ్ఱకలువను ధరించిన ప్రియురాలి వక్షోజములమీద వామహస్తముగలవాడై సర్వాభరణాభిరాముడును, పరశుమృగవరహస్తములను ధరించినవాడును, బంగారురంగువాడును, పద్మాసనమునందున్నవాడును, మన్మథసుందరుడను అగు పార్వతీవల్లభుడు మీకు సంపత్కరుడు అగుగాక!)

**ఓం**

శ్లో॥ ప్రణవో మే శిరః పాతు మాయాబీజం శిఖాం మమ ।
ప్రాసాదో హృదయం పాతు నమో నాభిం సదాఽవతు ॥ 1

శ్లో॥ లింగఞ్చ మే శివః పాయాదష్టార్ణం సర్వసంధిషు ।
ధ్రువః పాదయుగం పాతు కటిం మాయా సదాఽవతు ॥ 2

శ్లో॥ నమశ్శివాయ కణ్ఠం మే శిరో మాయా సదాఽవతు ।
శక్త్యష్టార్ణస్సదా పాయాదాపాదతలమస్తకమ్ ॥ 3

శ్లో॥ వర్ణవ్యాహృత్ సర్వదిక్షు పఞ్చార్ణః పాపనాశనః ।
వాగ్బీజపూర్వః పఞ్చార్ణో వాచాం సిద్ధిం ప్రయచ్ఛతు ॥ 4

శ్లో॥ లక్ష్మీం దిశతు లక్ష్మ్యార్థః కామాన్యః కామమిచ్ఛతి ।
పరా పూర్వస్తు పంచార్ణః పరలోకం ప్రయచ్ఛతు ॥ 5

శ్లో॥ మోక్షం దిశతు తారాద్యః కేవలం సర్వదాఽవతు ।
త్ర్యక్షరీసహితశ్శంభుః త్రిదివం సంప్రయచ్ఛతు ॥ 6

శ్లో॥ సౌభాగ్యవిద్యాసహితః సౌభాగ్యం మే ప్రయచ్ఛతు ।
షోడశీసహితశ్శంభుః సర్వదా మాం ప్రరక్షతు ॥ 7

శ్లో॥ ఏవం **ద్వాదశభేదాని** విద్యాయాః సర్వదాఽవతు ।
సర్వమంత్రస్వరూపశ్చ శివః పాయాన్నిరంతరమ్ ॥ 8

శ్లో॥ యంత్రరూపశ్శివః పాతు సర్వకాలం మహేశ్వరః ।
శివస్య పీఠం మాం పాతు గురుపీఠస్య దక్షిణే ॥ 9

శ్లో॥ వామే గణపతిః పాతు శ్రీ దుర్గా పురతోఽవతు ।
క్షేత్రపాలః పశ్చిమే తు సదా పాతు సరస్వతీ ॥ 10

శ్లో॥ ఆధారశక్తిః కాలాగ్నిరుద్రో మాండూకసంజ్ఞితః ।
ఆదికూర్మో వరాహశ్చ చానంతః పృథివీ తథా ॥ 11

శ్లో॥ ఏతా మాం పాతు పీఠాధః స్థితాః సర్వత్ర దేవతాః ।
మహార్ణవే జలమయే మాం పాయాదమృతార్ణవః ॥ 12

శ్లో॥ రత్నద్వీపే చ మాం పాతు సప్తద్వీపేశ్వరస్తథా ।
తథా హేమగిరిః పాతు గిరికాననభూమిషు ॥ 13

శ్లో॥ మాం పాతు నన్దనోద్యానం వాపికోద్యానభూమిషు ।
కల్పవృక్షస్సదా పాతు మమ కల్పనహేతుషు ॥ 14

శ్లో॥ భూమౌ మాం పాతు సర్వత్ర సర్వదా మణిభూతలమ్ ।
గృహం మే పాతు దేవస్య రత్ననిర్మితమణ్డపమ్ ॥ 15

శ్లో॥ ఆసనే శయనే చైవ రత్నసింహాసనం తథా ।
ధర్మం జ్ఞానం చ వైరాగ్యమైశ్వర్యం చాఽనుగచ్ఛతు ॥ 16

శ్లో॥ అథాఽజ్ఞానమవైరాగ్య-మనైశ్వర్యం చ నశ్యతు ।
సత్వం రజస్తమశ్చైవ గుణాన్ రక్షన్తు సర్వదా ॥ 17

శ్లో॥ మూలం విద్యా తథా కన్దో నాళం పద్మఞ్చ రక్షతు ।
పత్రాణి మాం సదా పాతు కేసరాః కర్ణికాఽవతు ॥ 18

శ్లో॥ మణ్డలేషు చ మాం పాతు సోమసూర్యాగ్నిమణ్డలమ్ ।
ఆత్మాఽత్మానం సదా పాతు చాంతరాత్మాఽంతరాత్మకమ్ ॥ 19

శ్లో॥ పాతు మాం పరమాత్మాఽపి జ్ఞానాత్మా పరిరక్షతు ।
**వామా జ్యేష్ఠా తథా శ్రేష్ఠా రౌద్రీ కాళీ తథైవ చ ॥** 20

శ్లో॥ **కలపూర్వా వికరణీ బలపూర్వా తథైవ చ ।**
**బలప్రమథనీ చాపి సర్వభూతదమన్యథ ॥** 21

శ్లో॥ **మనోన్మనీ** చ **నవమీ** ఏతా మాం పాతు దేవతాః ।
యోగపీఠః సదా పాతు శివస్య పరమస్య మే ॥ 22

శ్లో॥ శ్రీశివో మస్తకం పాతు బ్రహ్మరంధ్రముమాఽవతు ।
హృదయం హృదయం పాతు శిరః పాతు శిరో మమ ॥ 23

శ్లో॥ శిఖాం శిఖా సదా పాతు కవచం కవచోఽవతు ।
నేత్రత్రయం పాతు నేత్రే హస్త్రావస్త్రం చ రక్షతు ॥ 24

శ్లో॥ లలాటం పాతు హృల్లేఖా గగనం నాసికాఽవతు ।
రాకా గండయుగం పాతు పాత్వోష్ఠే చ కరాళికాః ॥ 25

శ్లో॥ జిహ్వాం పాతు మహేష్వాసో గాయత్రీ ముఖమణ్డలమ్ ।
తాలుమూలం తు సావిత్రీ జిహ్వామూలం సరస్వతీ ॥ 26

శ్లో॥ వృషధ్వజః పాతు కణ్ఠం క్షేత్రపాలో భుజౌ మమ ।
చణ్డీశ్వరః పాతు వక్షో దుర్గా కుక్షిం సదాఽవతు ॥ 27

శ్లో॥ స్కందో నాభిం సదా పాతు నన్దీ పాతు కటిద్వయమ్ ।
పార్శ్వౌ విఘ్నేశ్వరః పాతు పాతు సేనాపతిర్వళిమ్ ॥ 28

శ్లో॥ బ్రాహ్మీ లిఙ్గం సదా పాయా-దసితాంగసమన్వితా ।
రురుభైరవయుక్తా చ గుదం పాయాత్ మహేశ్వరీ ॥ 29

శ్లో॥ చండయుక్తా చ కౌమారీ చోరుయుగ్మం చ రక్షతు ।
వైష్ణవీ క్రోధసంయుక్తా జానుయుగ్మం సదాఽవతు ॥ 30

శ్లో॥ ఉన్మత్తయుక్తా వారాహీ జంఘాయుగ్మం ప్రరక్షతు ।
కపాలయుక్తా మాహేంద్రీ గుల్ఫౌ మే పరిరక్షతు ॥ 31

శ్లో॥ చాముణ్డా భీషణయుతా పాదపృష్ఠే సదాఽవతు ।
సంహారేణయుతా చణ్డీ రక్షేత్ పాదతలే ఉభే ॥ 32

శ్లో॥ పృథగష్టౌ మాతరస్తు నఖాన్ రక్షన్తు సర్వదా ।
రక్షన్తు రోమకూపాని చాసితాంగాదిభైరవాః ॥ 33

శ్లో॥ వజ్రహస్తశ్చ మాం పాయా-దింద్రః పూర్వే చ సర్వదా ।
ఆగ్నేయ్యాం దిశి మాం పాతు శక్తిహస్తోఽనలో మహాన్ ॥ 34

శ్లో॥ దణ్డహస్తో యమః పాతు దక్షిణాదిశి సర్వదా ।
నిరృతిః ఖడ్గహస్తశ్చ నైరృత్యాం దిశి రక్షతు ॥ 35

శ్లో॥ ప్రతీచ్యాం వరుణః పాతు పాశహస్తశ్చ మాం సదా ।
వాయవ్యాం దిశి మాం పాతు ధ్వజహస్తః సదా గతిః ॥ 36

శ్లో॥ ఉదీచ్యాం తు కుబేరస్తు గదాహస్తః ప్రతాపవాన్ ।
శూలపాణిః శివః పాయాత్ ఈశాన్యాం దిశి మాం సదా ॥ 37

శ్లో॥ కమండలుధరో బ్రహ్మా మామూర్ధ్వం పరిరక్షతు ।
అథస్తాద్విష్ణురవ్యక్త-శ్చక్రపాణిః సదాఽవతు ॥ 38

శ్లో॥ ఓం హ్రౌం ఈశానో మే శిరః పాయాత్ ।
ఓం హ్రైం ముఖం తత్పురుషోఽవతు ॥ 39

శ్లో॥ ఓం హ్రూమఘోరో హృదయం పాతు ।
ఓం హ్రీం వామదేవస్తు గుహ్యకమ్ ॥ 40

శ్లో॥ ఓం హ్రాం సద్యోజాతస్తు మే పాదౌ ।
ఓం హ్రాం హ్రీం హ్రూం హ్రైం హ్రౌం హ్రః పాతు మే శిఖామ్ ॥ 41

**ఫలశ్రుతి :-**

శ్లో॥ అనుక్తమపి యత్ స్థానం తత్ సర్వం శఙ్కరోఽవతు ।
ఇతి మే కథితం నన్దిన్ శివస్య హృదయం పరమ్ ॥ 42

శ్లో॥ మంత్రయంత్రస్థదేవానాం రక్షణాత్మకమద్భుతమ్ ।
**సహస్రావర్తనాత్సిద్ధిం** ప్రాప్నుయాన్మంత్రవిత్తమః ॥ 43

శ్లో॥ శివస్య హృదయేనైవ నిత్యం సప్తాభిమంత్రితమ్ ।
తోయం పీత్వేప్సితాం సిద్ధిం మండలాల్లభతే నరః ॥ 44

శ్లో॥ వంధ్యా పుత్రవతీ భూయాత్ రోగీ రోగాత్ విముచ్యతే ।
చంద్రసూర్యగ్రహే నద్యాం నాభిమాత్రోదకే స్థితః ॥ 45

శ్లో॥ మోక్షాంతం ప్రజపేద్భక్త్యా సర్వసిద్ధీశ్వరో భవేత్ ।
రుద్రసంఖ్యాజపాద్రోగీ నీరోగో జాయతే క్షణాత్ ॥ 46

శ్లో॥ ఉపోషితః ప్రదోషే చ **శ్రావణ్యాం సోమవాసరే** ।
శివం సంపూజ్య యత్నేన హృదయే తత్పరో జపేత్ ॥ 47

శ్లో॥ కృత్రిమేషు చ రోగేషు వాతపిత్తజ్వరేషు చ ।
త్రిసప్తమంత్రితం తోయం పీత్వారోగ్యమవాప్నుయాత్ ॥ 48

శ్లో॥ నిత్యమష్టోత్తరశతం శివస్య హృదయం జపేత్ ।
మండలాల్లభతే నందిన్ సిద్ధిదం నాత్ర సంశయః ॥ 49

శ్లో॥ కిం బహూక్తేన నందీశ! శివస్య హృదయస్య చ ।
జపిత్వా తు మహేశస్య వాహనత్వమవాప్స్యసి ॥ 50

ఇతి శ్రీ లిఙ్గపురాణే ఉత్తరభాగే వామదేవనన్దీశ్వరసంవాదే
శ్రీశివహృదయస్తోత్రనిరూపణం నామాష్టషష్టితమోధ్యాయః సమాప్తః ॥
భూర్భువస్సువరోమితి దిగ్విమోకః
ఓం శాంతిశ్శాంతిశ్శాంతిః ॥

హనూమదష్టాక్షరమంత్రః

ఓం హ్రాం హ్రీం హ్రూం హ్రైం హ్రౌం హ్రః ఓం

# శ్రీమద్ధనూమద్దండకము

– చందోలు మహర్షి (తాడేపల్లి రాఘవనారాయణశాస్త్రి)



శ్రీరామదూతా! శ్రితార్తిప్రవాతా! భవిష్యద్విధాతా! పరేశప్రమాతా! సమీరప్రసూతా! సమస్తప్రగీతా! పరాస్తాసురప్రేతబేతాళభూతాదికవ్రాత! సీతామహామాతృకాన్వేషణా భాషణాదిప్రకారప్రశస్త ప్రసంగప్రసన్నప్రజానాథదృక్పావితా! పావనీ! పావనాత్మీయనామా! హరీ! మర్కటా! మర్కటాయాంచితా! సంచితానేక సత్కార్యసంభార! స్వాహాకృతిప్రాయసంపత్తి బీజప్రశస్తాభిధేయాక్షరీభూతమంత్రాక్షరాతీత సంత్రాణపర్యస్తతంత్ర! స్వతంత్రాత్మభాస్వద్భిదౌజా! ప్రవృద్ధాంగ! వీరాహవోపాంతకాంతస్వసారప్రసారా! మహాప్రాభవప్రాభృతీభూతలోకౌఘసద్భక్తి సూత్రైకకప్రోతసూక్తిప్రసూనాచ్ఛగుచ్ఛస్రగాబద్ధసర్వాంతరవ్యాప్త తద్విశ్వరూపాయితస్వీయకీర్తి ప్రియామూర్తిదత్తాదరా! శ్రీప్రపత్త్యాంజనేయా! ప్రభాదివ్యకాయా! ప్రమాణప్రమేయా! విధూతారిమాయా! విమాయా! స్వవాలాగ్రచాంచల్యసంస్ఫోట్యమానోచ్ఛలత్కర్పరాజాండ భాండా! గలద్గండభేరుండరుండాంత్రమాలాధరాదిప్రయోగా! నియోగానపేతప్రవేగా! సువేగాపగాజాల సంపూర్యమాణాద్రిసోపద్రవచ్ఛాయికామాయికాంచద్గ్రహగ్రాహసంభార సంభీకరాంభోధి నిర్విఘ్నకైకోత్ల వోద్వేగనాలంకృతావేలభూమధ్యగానేకగవ్యూతిదీవ్యత్ప్రదేశా! జయశ్రీప్రదేశప్రసాదా! సదాస్వాన్యసాహాయ్యనాపేక్ష! సాపేక్షదేహిస్పృహాపూరణార్థా! నిరర్థార్థ దూరప్రచారా! విచారాత్తతత్త్వత్యగాత్మ ప్రమాయత్తచిత్తా! నమత్తా! నమత్తారకా! రామగాథాసుధా మాధురీలోల! లీలాప్లవంగా! నసంగా! సుసంగా! మహాంగా! త్వదేకార్థినం మామకామార్థినం మామవాశేషదోషాపహారం కురు శ్రేయ ఆధత్స్వ మయ్యంజసా తే నమస్తే నమస్తే నమః.



ప్రీం

# కిరాతవారాహీ స్తోత్రమ్



అస్య శ్రీ కిరాతవారాహీ స్తోత్ర మహామంత్రస్య – దూర్వాసో భగవాన్ ఋషిః – అనుష్టుప్ ఛందః – శ్రీ కిరాతవారాహీ ముద్రారూపిణీ దేవతా – హుం బీజం – రం శక్తిః – క్లీం కీలకం – మమ సర్వశత్రుక్షయార్థం శ్రీ కిరాతవారాహీస్తోత్రజపే వినియోగః ।

శ్లో॥ ఉగ్రరూపాం మహాదేవీం శత్రునాశనతత్పరామ్ ।
క్రూరాం కిరాతవారాహీం వందేఽహం కార్యసిద్ధయే ॥ 1

శ్లో॥ స్వాపహీనాం మదాలస్యామప్రమత్తామతామసీమ్ ।
దంష్ట్రాకరాళవదనాం వికృతాస్యాం మహారవామ్ ॥ 2

శ్లో॥ ఊర్ధ్వకేశీముగ్రధరాం సోమసూర్యాగ్నిలోచనామ్ ।
లోచనాగ్నిస్ఫులింగాద్యైర్భస్మీకృత్వా జగత్త్రయమ్ ॥ 3

శ్లో॥ జగత్త్రయం మోదయంతీమట్టహాసైర్ముహుర్ముహుః ।
ఖడ్గం చ ముసలం చైవ పాశం శోణితపాత్రకమ్ ॥ 4

శ్లో॥ దధతీం పంచశాఖైః స్వైః స్వర్ణాభరణభూషితామ్ ।
గుంజామాలాం శంఖమాలాం నానారత్నవిభూషితామ్ ॥ 5

శ్లో॥ వైరిపత్నీకంఠసూత్రచ్ఛేదనక్షురరూపిణీమ్ ।
క్రోధోద్ధతాం ప్రజాహంతృ క్షురికే వస్థితాం సదా ॥ 6

శ్లో॥ జితరంభోరుయుగళాం రిపుసంహారతాండవీమ్ ।
రుద్రశక్తిం పరాం వ్యక్తామీశ్వరీం పరదేవతామ్ ॥ 7

శ్లో॥ విభజ్య కంఠదంష్ట్రాభ్యాం పిబంతీమసృజం రిపోః ।
గోకంఠమివ శార్దూలో గజకంఠం యథా హరిః ॥ 8

శ్లో॥ కపోతాయాశ్చ వారాహీ పతత్యశనయా రిపౌ ।
సర్వశత్రుం చ శుష్యంతీ కంపంతీ సర్వవ్యాధయః ॥ 9

శ్లో॥ విధివిష్ణుశివేంద్రాద్యా మృత్యుభీతిపరాయణాః ।
ఏవం జగత్త్రయక్షోభకారకక్రోధసంయుతామ్ ॥ 10

శ్లో॥ సాధకానాం పురః స్థిత్వా ప్రవదంతీం ముహుర్ముహుః ।
ప్రచరంతీం భక్షయామి తపస్సాధకతే రిపూన్ ॥ 11

శ్లో॥ తేపి యానో బ్రహ్మజిహ్వే శత్రుమారణతత్పరామ్ ।
త్వగసృజ్మాంసమేదోస్థిమజ్జాశుక్లాని సర్వదా ॥ 12

శ్లో॥ భక్షయంతీం భక్తశత్రోరచిరాత్ప్రాణహారిణీమ్ ।
ఏవంవిధాం మహాదేవీం యాచేఽహం శత్రుపీడనమ్ ॥ 13

శ్లో॥ శత్రునాశనరూపాణి కర్మాణి కురు పంచమి ।
సర్వశత్రువినాశార్థం త్వామహం శరణం గతః ॥ 14

శ్లో॥ తస్మాదవశ్యం శత్రూణాం వారాహి కురు నాశనమ్ ।
పాతుమిచ్ఛామి వారాహి దేవి త్వం రిపుకర్మతః ॥ 15

శ్లో॥ మారయాశు మహాదేవీ తత్కథాం తేన కర్మణా ।
ఆపదశత్రుభూతాయాగ్రహోత్థా రాజకాశ్చ యాః ॥ 16

శ్లో॥ నానావిధాశ్చ వారాహి స్తంభయాశు నిరంతరమ్ ।
శత్రుగ్రామగృహాన్దేశాన్రాష్ట్రాన్యపి చ సర్వదా ॥ 17

శ్లో॥ ఉచ్చాటయాశు వారాహి వృకవత్ప్రమథాశు తాన్ ।
అముకాముకసంజ్ఞాంశ్చ శత్రూణాం చ పరస్పరమ్ ॥ 18

శ్లో॥ విద్వేషయ మహాదేవి కుర్వంతం మే ప్రయోజనమ్ ।
యథా నశ్యంతి రిపవస్తథా విద్వేషణం కురు ॥ 19

శ్లో॥ యస్మిన్ కాలే రిపుస్తంభం భక్షణాయ సమర్పితమ్ ।
ఇదానీమేవ వారాహి భుంక్ష్వేదం కాలమృత్యువత్ ॥ 20

శ్లో॥ మాం దృష్ట్వా యే జనా నిత్యం విద్వేషంతి హసంతి చ ।
దూషయంతి చ నిందంతి వారాహ్యేతాన్ ప్రమారయ ॥ 21

శ్లో॥ హంతు తే ముసలః శత్రూన్ అశనేః పతనాదివ ।
శత్రుదేహాన్ హలం తీక్ష్ణం కరోతు శకలీకృతాన్ ॥ 22

శ్లో॥ హంతు గాత్రాణి శత్రూణాం దంష్ట్రా వారాహి తే శుభే ।
సింహదంష్ట్రైః పాదనఖైర్హత్వా శత్రూన్ సుదుస్సహాన్ ॥ 23

శ్లో॥ పాదైర్నిపీడ్య శత్రూణాం గాత్రాణి మహిషో యథా ।
తాంస్తాడయంతీ శృంగాభ్యాం రిపుం నాశయ మేధునా ॥ 24

శ్లో॥ కిముక్తైర్బహుభిర్వాక్యైరచిరాచ్ఛత్రునాశనమ్ ।
కురు వశ్యం కురు కురు వారాహి భక్తవత్సలే ॥ 25

శ్లో॥ ఏతత్కిరాతవారాహ్యం స్తోత్రమాపన్నివారణమ్ ।
మారకం సర్వశత్రూణాం సర్వాభీష్టఫలప్రదమ్ ॥ 26

శ్లో॥ త్రిసంధ్యం పఠతే యస్తు స్తోత్రోక్తఫలమశ్నుతే ।
ముసలేనాథ శత్రూంశ్చ మారయంతి స్మరంతి యే ॥ 27

శ్లో॥ తార్క్ష్యారూఢాం సువర్ణాభాం జపేత్తేషాం న సంశయః ।
అచిరాద్దుస్తరం సాధ్యం హస్తేనాకృష్య దీయతే ॥ 28

శ్లో॥ ఏవం ధ్యాయేజ్జపేద్దేవీమాకర్షణఫలం లభేత్ ।
అశ్వారూఢాం రక్తవర్ణాం రక్తవస్త్రాద్యలంకృతామ్ ॥ 29

శ్లో॥ ఏవం ధ్యాయేజ్జపేద్దేవీం జనవశ్యమాప్నుయాత్ ।
దంష్ట్రాధృతభుజాం నిత్యం ప్రాణవాయుం ప్రయచ్ఛతి ॥ 30

శ్లో॥ దూర్వాస్యాం సంస్మరేద్దేవీం భూలాభం యాతి బుద్ధిమాన్ ।
సకలేష్టార్థదా దేవీ సాధకస్తత్ర దుర్లభః ॥ 31

ఇతి శ్రీ కిరాతవారాహీ స్తోత్రమ్

---

## SURYA RAVI mudra

### Intangible Benefits


Boosts energy


Stimulates digestion


Boosts metabolism


Increases stamina



The Fit Indian

శ్రీరామచంద్రాయ నమః

# ఆపదుద్ధారక స్తోత్రమ్



హరిః ఓమ్ అస్య శ్రీ ఆపదుద్ధారకస్తోత్రస్య వసిష్ఠో భగవాన్ ఋషిః, అనుష్టుప్ ఛందః, శ్రీరామచంద్రో దేవతా, శ్రీం బీజం, రాం శక్తిః, మం కీలకం, మమ ఆపదుద్ధారక శ్రీరామచంద్రప్రసాదసిద్ధ్యర్థే జపే వినియోగః

| | | |
|---|---|---|
| ఆపదామపహర్తారం | – | అంగుష్ఠాభ్యాం నమః |
| దాతారం సర్వసంపదామ్ | – | తర్జనీభ్యాం నమః |
| లోకాభిరామం | – | మధ్యమాభ్యాం నమః |
| శ్రీరామం | – | అనామికాభ్యాం నమః |
| భూయోభూయో | – | కనిష్ఠికాభ్యాం నమః |
| నమామ్యహం | – | కరతలకరపృష్ఠాభ్యాం నమః |

హృదయాదిన్యాసమ్

ఆపదామపహర్తారం – జ్ఞానాయ హృదయాయ నమః
దాతారం సర్వసంపదామ్ – ఐశ్వర్యాయ శిరసే స్వాహా
లోకాభిరామం – శక్త్యై శిఖాయై వౌషట్
శ్రీరామం – బలాయ కవచాయ హుం
భూయో భూయో – నేత్రత్రయాయ వౌషట్
నమామ్యహం – అస్త్రాయ ఫట్
భూర్భువస్సువరోమితి – దిగ్బంధః ॥

**ధ్యానము**

శ్లో॥ ఆర్తానామార్తిహంతారం – భీతానాం భయనాశనమ్ ।
ద్విషతాం కాలదండం తం, రామచంద్రం నమామ్యహమ్ ॥

శ్లో॥ చాపంధునాన స్తనయిత్నుఘోషం
కర్షన్నిషంగాదిషుమార్తివిఘ్ను।
ఆపత్సు భూయాదభయప్రదోమే
సాకం సుమిత్రాతనయేన రామః ॥

ఆపదామపహర్తారం దాతారం సర్వసంపదామ్,
లోకాభిరామం శ్రీరామం భూయో భూయో నమామ్యహమ్.

ఆపన్నజనరక్షైక, దీక్షాయామితితేజసే,
నమోస్తు విష్ణవే తుభ్యం, రామాయాపన్నివారిణే. ॥ఆపదా॥ 1

పదాంభోజరజస్స్పర్శ, పవిత్రమునియోషితే
నమోస్తు సీతాపతయే, రామాయాపన్నివారిణే ॥ఆపదా॥ 2

దానవేంద్రమహామత్త, గజపంచాస్యరూపిణే,
నమోస్తు రఘునాథాయ, రామాయాపన్నివారిణే ॥ఆపదా॥ 3

మహిజాకుచసంలగ్న, కుంకుమారుణవక్షసే,
నమః కల్యాణరూపాయ, రామాయాపన్నివారిణే ॥ఆపదా॥ 4

పద్మసంభవభూతేశ, మునిసంస్తుతకీర్తయే
నమో మార్తాండవంశాయ, రామాయాపన్నివారిణే ॥ఆపదా॥ 5

హరత్యార్తిం చ లోకానాం, యో వా మధునిషూదనః
నమోస్తు హరయే తుభ్యం, రామాయాపన్నివారిణే ॥ఆపదా॥ 6

తాపకారణసంసార, గజసింహస్వరూపిణే,
నమో వేదాంతవేద్యాయ, రామాయాపన్నివారిణే ॥ఆపదా॥ 7

రంగత్తరంగజలధి, గర్వహృచ్ఛరధారిణే,
నమః ప్రతాపరూపాయ, రామాయాపన్నివారిణే ॥ఆపదా॥ 8

దారాసహితచంద్రావ, తంసధ్యాతస్వమూర్తయే,
నమస్సత్యస్వరూపాయ, రామాయాపన్నివారిణే ॥ఆపదా॥ 9

తారానాయకసంకాశ, వదనాయ మహౌజసే,
నమోస్తుతాటకాహంత్రే, రామాయాపన్నివారిణే ॥ఆపదా॥ 10

రమ్యసానులసచ్చిత్ర, కూటాశ్రమవిహారిణే,
నమస్సౌమిత్రిసేవ్యాయ, రామాయాపన్నివారిణే ॥ఆపదా॥ 11

సర్వదేవాహితాసక్త, దశాననవినాశినే,
నమః కలుషసంహర్త్రే, రామాయాపన్నివారిణే ॥ఆపదా॥ 12

రత్నసానునివాసైక, వంద్యపాదాంబుజాయ చ
నమస్త్రైలోక్యనాథాయ, రామాయాపన్నివారిణే ॥ఆపదా॥ 13

సంసారబంధమోక్షైక, హేతునామప్రకాశినే
నమః కలుషసంహర్త్రే, రామాయాపన్నివారిణే ॥ఆపదా॥ 14

పవనాశుగసంక్షిప్త, మారీచాదిసురారయే
నమో మఖపరిత్రాత్రే, రామాయాపన్నివారిణే ॥ఆపదా॥ 15

దాంబికేతరభక్తౌఘ, మహదానందదాయినే,
నమః కమలనేత్రాయ, రామాయాపన్నివారిణే ॥ఆపదా॥ 16

లోకత్రయోద్వేగకర, కుంభకర్ణశిరశ్ఛిదే,
నమో భీషణరూపాయ, రామాయాపన్నివారిణే ॥ఆపదా॥ 17

కాకాసురైకనయన, హరల్లీలాస్త్రధారిణే,
నమో భక్తైకవంద్యాయ, రామాయాపన్నివారిణే ॥ఆపదా॥ 18

భిక్షురూపసమాక్రాంత, బలివీర్యైకసంపదే,
నమో వామనరూపాయ, రామాయాపన్నివారిణే ॥ఆపదా॥ 19

రాజీవనేత్రసుస్పంద, రుచిరాంగసురోచిషే,
నమః కైవల్యనిధయే, రామాయాపన్నివారిణే ॥ఆపదా॥ 20

మందమారుతసంవీత, మందారద్రుమవాసినే
నమః పల్లవహస్తాయ, రామాయాపన్నివారిణే ॥ఆపదా॥ 21

శ్రీకంఠచాపదళన, ధురీణబలబాహవే,
నమః సీతానుషక్తాయ, రామాయాపన్నివారిణే ॥ఆపదా॥ 22

రాజరాజసుహృద్యోషా, ర్చితమంగళమూర్తయే,
నమ ఇక్ష్వాకువంశాయ, రామాయాపన్నివారిణే ॥ఆపదా॥ 23

మంజులాదర్శవిప్రేక్ష, ణోత్సుకైకవిలాసినే,
నమః పోషితభక్తాయ, రామాయాపన్నివారిణే ॥ఆపదా॥ 24

భూరిభూధరకోదండ, మూర్తిజ్ఞేయస్వరూపిణే
నమః ప్రతాపరూపాయ, రామాయాపన్నివారిణే ॥ఆపదా॥ 25

యోగీంద్రహృత్సరోజ, మధుపాయమహాత్మనే
నమో రాజాధిరాజాయ, రామాయాపన్నివారిణే ॥ఆపదా॥ 26

భూవరాహస్వరూపాయ నమో భూతిప్రదాయినే,
నమః కోమలదేహాయ, రామాయాపన్నివారిణే ॥ఆపదా॥ 27

యోషాంజలివినిర్ముక్త, లాంజాంచితవపుష్మతే,
నమః సౌందర్యనిధయే, రామాయాపన్నివారిణే ॥ఆపదా॥ 28

నఖకోటివినిర్భిన్న, దైత్యాధిపతివక్షసే,
నమో నృసింహరూపాయ, రామాయాపన్నివారిణే ॥ఆపదా॥ 29

మాయామానుషదేహాయ, వేదోద్ధరణహేతవే,
నమోస్తు మత్స్యరూపాయ, రామాయాపన్నివారిణే ॥ఆపదా॥ 30

మితిశూన్యమహాదివ్య మహిమ్నే మానితాత్మనే
నమో బ్రహ్మస్వరూపాయ, రామాయాపన్నివారిణే ॥ఆపదా॥ 31

అహంకారేతరజన, స్వాంతసౌధవిహారిణే,
నమోస్తు చిత్స్వరూపాయ, రామాయాపన్నివారిణే ॥ఆపదా॥ 32

సీతాలక్ష్మణసంశోభి, పార్శ్వాయ పరమాత్మనే
నమః పట్టాభిషిక్తాయ, రామాయాపన్నివారిణే ॥ఆపదా॥ 33

ఇమం స్తవం భగవతః, పఠేద్యః ప్రీతమానసః
ప్రభాతే వా ప్రదోషే వా, రామస్య పరమాత్మనః ॥ఆపదా॥ 34

స తు తీర్త్వా భవాంభోధి, మాపదస్సకలా అపి
రామసాయుజ్యమాప్నోతి, దేవదేవ ప్రసాదతః ॥ఆపదా॥ 35

కారాగృహాదిబాధాస్తు, సంప్రాప్తే బహుసంకటే
ఆపన్నివారకం స్తోత్రం, పఠేద్యస్తు యథావిధిః ॥ఆపదా॥ 36

సంయోజ్యానుష్టుభం మంత్ర, మనుశ్లోకం స్మరన్ విభుః ।
సప్తాహం సర్వబాధ్యేభ్యో ముచ్యతే నాత్రసంశయః ॥

ద్వాత్రింశద్వారజపతః ప్రత్యహం సుదృఢవ్రతః ।
వైశాఖే భానుమాలోక్య ప్రత్యహం శతసంఖ్యయా ॥

ధనేన ధనదప్రఖ్యాం, లభతే నాత్రసంశయః ।
బహునాత్ర కిముక్తేన, యం యం కామయతే నరః ॥

తం తం కామమవాప్నోతి, స్తోత్రేణానేన మానవః ।
యంత్రపూజావిధానేన, జపహోమాదితర్పణైః ॥

యస్తు కుర్వీత సహసా, సర్వాన్ కామానవాప్నుయాత్
ఇహ లోకే సుఖీ భూత్వా, పరే ముక్తో భవిష్యతి ॥

భూర్భువస్సువరోం ఇతి దిగ్విమోకః
ఇతి శ్రీ అగస్త్య సంహితాయాం ఉమామహేశ్వరసంవాదే
ఆపదుద్ధారకస్తోత్రపఠనం నామ ఏకత్రింశోధ్యాయః ॥

ఓం తత్సత్ బ్రహ్మార్పణమస్తు





# శ్రీరామరక్షాస్తోత్రమ్

ఓం శ్రీగణేశాయ నమః

అస్య శ్రీరామరక్షాస్తోత్రమంత్రస్య । బుధకౌశిక ఋషిః ।
శ్రీసీతారామచంద్రో దేవతా । అనుష్టుప్ ఛందః ।
సీతా శక్తిః । శ్రీమద్ హనుమాన్ కీలకమ్ ।
శ్రీరామచంద్రప్రీత్యర్థే రామరక్షాస్తోత్రజపే వినియోగః ।

॥ అథ ధ్యానమ్ ॥

ధ్యాయేదాజానుబాహుం ధృతశరధనుషం బద్ధపద్మాసనస్థమ్ ।
పీతం వాసో వసానం నవకమలదలస్పర్ధినేత్రం ప్రసన్నమ్ ।
వామాంకారూఢ సీతాముఖకమలమిలల్లోచనం నీరదాభమ్ ।
నానాలంకారదీప్తం దధతమురుజటామండనం రామచంద్రమ్ ॥

॥ అథ స్తోత్రమ్ ॥

శ్లో॥ చరితం రఘునాథస్య శతకోటిప్రవిస్తరమ్ ।
ఏకైకమక్షరం పుంసాం మహాపాతకనాశనమ్ ॥ 1

శ్లో॥ ధ్యాత్వా నీలోత్పలశ్యామం రామం రాజీవలోచనమ్ ।
జానకీలక్ష్మణోపేతం జటాముకుటమండితమ్ ॥ 2

శ్లో॥ సాసితూణధనుర్బాణపాణిం నక్తంచరాన్తకమ్ ।
స్వలీలయా జగత్రాతుమావిర్భూతమజం విభుమ్ ॥ 3

శ్లో॥ రామరక్షాం పఠేత్ప్రాజ్ఞః పాపఘ్నీం సర్వకామదామ్ ।
శిరో మే రాఘవః పాతు భాలం దశరథాత్మజః ॥ 4



శ్లో॥ కౌసల్యేయో దృశౌ పాతు విశ్వామిత్రప్రియః శ్రుతీ ।
ఘ్రాణం పాతు మఖత్రాతా ముఖం సౌమిత్రివత్సలః ॥ 5

శ్లో॥ జిహ్వాం విద్యానిధిః పాతు కంఠం భరతవందితః ।
స్కంధౌ దివ్యాయుధః పాతు భుజౌ భగ్నేశకార్ముకః ॥ 6

శ్లో॥ కరౌ సీతాపతిః పాతు హృదయం జామదగ్న్యజిత్ ।
మధ్యం పాతు ఖరధ్వంసీ నాభిం జామ్బవదాశ్రయః ॥ 7

శ్లో॥ సుగ్రీవేశః కటీ పాతు సక్థినీ హనుమత్ప్రభుః ।
ఊరూ రఘూత్తమః పాతు రక్షఃకులవినాశకృత్ ॥ 8

శ్లో॥ జానునీ సేతుకృత్పాతు జంఘే దశముఖాన్తకః ।
పాదౌ విభీషణశ్రీదః పాతు రామోఖిలం వపుః ॥ 9

శ్లో॥ ఏతాం రామబలోపేతాం రక్షాం యః సుకృతీ పఠేత్ ।
స చిరాయుః సుఖీ పుత్రీ విజయీ వినయీ భవేత్ ॥ 10

శ్లో॥ పాతాలభూతలవ్యోమచారిణశ్ఛద్మచారిణః ।
న ద్రష్టుమపి శక్తాస్తే రక్షితం రామనామభిః ॥ 11

శ్లో॥ రామేతి రామభద్రేతి రామచంద్రేతి వా స్మరన్ ।
నరో న లిప్యతే పాపైః భుక్తిం ముక్తిం చ విన్దతి ॥ 12

శ్లో॥ జగజ్జైత్రైకమంత్రేణ రామనామ్నాభిరక్షితమ్ ।
యః కంఠే ధారయేత్తస్య కరస్థాః సర్వసిద్ధయః ॥ 13

శ్లో॥ వజ్రపంజరనామేదం యో రామకవచం స్మరేత్ ।
అవ్యాహతాజ్ఞః సర్వత్ర లభతే జయమంగలమ్ ॥ 14

శ్లో॥ ఆదిష్టవాన్ యథా స్వప్నే రామరక్షామిమాం హరః ।
తథా లిఖితవాన్ ప్రాతః ప్రబుద్ధో బుధకౌశికః ॥ 15

శ్లో॥ ఆరామః కల్పవృక్షాణాం విరామః సకలాపదామ్ ।
అభిరామస్త్రిలోకానాం రామః శ్రీమాన్ స నః ప్రభుః ॥ 16

శ్లో॥ తరుణౌ రూపసంపన్నౌ సుకుమారౌ మహాబలౌ ।
పుండరీకవిశాలాక్షౌ చీరకృష్ణాజినామ్బరౌ ॥ 17

శ్లో॥ ఫలమూలాశినౌ దాన్తౌ తాపసౌ బ్రహ్మచారిణౌ ।
పుత్రౌ దశరథస్యైతౌ భ్రాతరౌ రామలక్ష్మణౌ ॥ 18

శ్లో॥ శరణ్యౌ సర్వసత్త్వానాం శ్రేష్ఠౌ సర్వధనుష్మతామ్ ।
రక్షః కులనిహంతారౌ త్రాయేతాం నో రఘూత్తమౌ ॥ 19

శ్లో॥ ఆత్తసజ్యధనుషావిషుస్పృశావక్షయాశుగనిషంగసంగినౌ ।
రక్షణాయ మమ రామలక్ష్మణావగ్రతః పథి సదైవ గచ్ఛతామ్ ॥ 20

శ్లో॥ సన్నద్ధః కవచీ ఖడ్గీ చాపబాణధరో యువా ।
గచ్ఛన్మనోరథోస్మాకం రామః పాతు సలక్ష్మణః ॥ 21

శ్లో॥ రామో దాశరథిః శూరో లక్ష్మణానుచరో బలీ ।
కాకుత్స్థః పురుషః పూర్ణః కౌసల్యేయో రఘూత్తమః ॥ 22

శ్లో॥ వేదాన్తవేద్యో యజ్ఞేశః పురాణపురుషోత్తమః ।
జానకీవల్లభః శ్రీమానప్రమేయపరాక్రమః ॥ 23

శ్లో॥ ఇత్యేతాని జపన్నిత్యం మద్భక్తః శ్రద్ధయాన్వితః ।
అశ్వమేధాధికం పుణ్యం సమ్ప్రాప్నోతి న సంశయః ॥ 24

శ్లో॥ రామం దుర్వాదలశ్యామం పద్మాక్షం పీతవాససమ్ ।
స్తువంతి నామభిర్దివ్యైః న తే సంసారిణో నరః ॥ 25

శ్లో॥ రామం లక్ష్మణపూర్వజం రఘువరం సీతాపతిం సుందరమ్ ।
కాకుత్స్థం కరుణార్ణవం గుణనిధిం విప్రప్రియం ధార్మికమ్ ।
రాజేంద్రం సత్యసంధం దశరథతనయం శ్యామలం శాంతమూర్తిమ్ ।
వందే లోకాభిరామం రఘుకులతిలకం రాఘవం రావణారిమ్ ॥ 26

శ్లో॥ రామాయ రామభద్రాయ రామచంద్రాయ వేధసే ।
రఘునాథాయ నాథాయ సీతాయాః పతయే నమః ॥ 27

శ్లో॥ శ్రీరామ రామ రఘునందన రామ రామ ।
శ్రీరామ రామ భరతాగ్రజ రామ రామ ।
శ్రీరామ రామ రణకర్కశ రామ రామ ।
శ్రీరామ రామ శరణం భవ రామ రామ ॥ 28

శ్లో॥ శ్రీరామచంద్రచరణౌ మనసా స్మరామి ।
శ్రీరామచంద్రచరణౌ వచసా గృణామి ।
శ్రీరామచంద్రచరణౌ శిరసా నమామి ।
శ్రీరామచంద్రచరణౌ శరణం ప్రపద్యే ॥ 29

శ్లో॥ మాతా రామో మత్పితా రామచంద్రః ।
స్వామీ రామో మత్సఖా రామచంద్రః ।
సర్వస్వం మే రామచంద్రో దయాలుః ।
నాన్యం జానే నైవ జానే న జానే । 30

శ్లో॥ దక్షిణే లక్ష్మణో యస్య వామే తు జనకాత్మజా ।
పురతో మారుతిర్యస్య తం వందే రఘునందనమ్ ॥ 31

శ్లో॥ లోకాభిరామం రణరంగధీరమ్ ।
రాజీవనేత్రం రఘువంశనాథమ్ ।
కారుణ్యరూపం కరుణాకరం తమ్ ।
శ్రీరామచంద్రమ్ శరణం ప్రపద్యే ॥ 32

శ్లో॥ మనోజవం మారుతతుల్యవేగమ్ ।
జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠమ్ ।
వాతాత్మజం వానరయూథముఖ్యమ్ ।
శ్రీరామదూతం శరణం ప్రపద్యే ॥ 33

శ్లో॥ కూజంతం రామ రామేతి మధురం మధురాక్షరమ్ ।
ఆరుహ్య కవితాశాఖాం వందే వాల్మీకికోకిలమ్ ॥ 34

శ్లో॥ ఆపదామపహర్తారం దాతారం సర్వసమ్పదామ్ ।
లోకాభిరామం శ్రీరామం భూయో భూయో నమామ్యహమ్ ॥ 35

శ్లో॥ భర్జనం భవబీజానామర్జనం సుఖసమ్పదామ్ ।
తర్జనం యమదూతానాం రామ రామేతి గర్జనమ్ ॥ 36

శ్లో॥ రామో రాజమణిః సదా విజయతే రామం రమేశం భజే ।
రామేణాభిహతా నిశాచరచమూ రామాయ తస్మై నమః ।
రామాన్నాస్తి పరాయణం పరతరం రామస్య దాసోఽస్మ్యహమ్ ।
రామే చిత్తలయః సదా భవతు మే భో రామ మాముద్ధర ॥ 37

శ్లో॥ రామ రామేతి రామేతి రమే రామే మనోరమే ।
సహస్రనామతత్తుల్యం రామనామ వరాననే ॥ 38

ఇతి శ్రీబుధకౌశికవిరచితం శ్రీరామరక్షాస్తోత్రం సమ్పూర్ణమ్ ।
శ్రీసీతారామచంద్రార్పణమస్తు ।

---



# రాధా షోడశ నామ స్తోత్రమ్

శ్రీ నారాయణ ఉవాచ

శ్లో॥ రాధా రాసేశ్వరీ రాసవాసినీ రసికేశ్వరీ ।
కృష్ణప్రాణాధికా కృష్ణప్రియా కృష్ణస్వరూపిణీ ॥

శ్లో॥ కృష్ణవామాంగసంభూతా పరమానందరూపిణీ ।
కృష్ణా వృందావనీ వృందా వృందావనవినోదినీ ॥

శ్లో॥ చంద్రావళీ చంద్రకాంతా శరచ్చంద్రప్రభాననా ।
నామాన్యేతాని సారాణి తేషామభ్యన్తరాణి చ ॥



శ్రీః

# శ్రీ ఛిన్నమస్తా మన్త్రధ్యానమ్





**శ్రీ ఛిన్నమస్తాదేవీ షోడశాక్షర మహామన్త్రమ్.**

**ఓం శ్రీం హ్రీం ఐం వజ్రవైరోచనీయే హూం హూం ఫట్ స్వాహా ।**



అథాతశ్ఛిన్నమస్తాయా మన్త్రం తే వ్యాహరామ్యహమ్ ॥

శ్లో॥ జిఘృక్షయాపి యస్య స్యుః సాధకస్యాష్టసిద్ధయః ।
నాతః పరతరా కాచిదుగ్రా దేవీ భవిష్యతి ॥

శ్లో॥ తస్మాదశక్తైర్మనుజైర్న గ్రాహ్యోఽయం కథఞ్చన ।
సిద్ధిర్వా మృత్యురపి వా ద్వయోరకేతరం భవేత్ ॥



**శ్లో॥ ప్రణవం చ రమాబీజం లజ్జాం వాగ్భవమేవ చ ।**
**వజ్రవైరోచనీయే చ ఇత్యేవం తత ఉద్ధరేత్ ॥**

**శ్లో॥ క్రోధద్వయం తతశ్చాస్త్రం స్వాహాన్తః షోడశాక్షరః ।**

ధ్యానం చాస్యాః ప్రవక్ష్యామి తత్ర చేతో నివేశయ ॥

శ్లో॥ స్వనాభౌ నీరజం ధ్యాయేచ్ఛుద్ధం వికసితం సితమ్ ।
తత్పద్మకోషమధ్యే తు మణ్డలం చణ్డరోచిషః ॥

శ్లో॥ జపాకుసుమసఙ్కాశం రక్తబన్ధూకసన్నిభమ్ ।
రాజఃసత్త్వతమోరేఖాయోనిమణ్డలసన్నిభమ్ ॥

శ్లో॥ మధ్యే తస్యా మహాదేవీం సూర్యకోటిసమప్రభామ్ ।
ఛిన్నమస్తాం కరే వామే ధారయన్తీం స్వమస్తకమ్ ॥

శ్లో॥ ప్రసారితముఖం భీమం లేలిహానోగ్రజిహ్వకమ్ ।
ప్రపిబద్రౌధిరీం ధారాం నిజకణ్ఠసముద్భవామ్ ॥

శ్లో॥ వికీర్ణకేశపాశం చ నానాపుష్పవిరాజితమ్ ।
దిగమ్బరాం మహారూపాం ప్రత్యాలీఢపదస్థితామ్ ॥

శ్లో॥ అస్థిమాలాధరాం దేవీం నాగయజ్ఞోపవీతినీమ్ ।
విపరీతరతాసక్తరతికామోపరిస్థితామ్ ॥



శ్లో॥ వర్ణినీడాకినీయుక్తాం వామదక్షిణపార్శ్వతః ।
దక్షిణే వర్ణినీం ధ్యాయేద్వామపార్శ్వే చ డాకినీమ్ ॥

శ్లో॥ వర్ణినీం లోహితశ్యామాం ముక్తకేశీం దిగమ్బరామ్ ।
కపాలకర్తృకాహస్తాం వామదక్షిణయోగతః ॥

శ్లో॥ దేవీకణ్ఠోచ్ఛలద్రక్తధారాపానం ప్రకుర్వతీమ్ ।
అస్థిమాలాధరాం దేవీం నాగయజ్ఞోపవీతినీమ్ ॥

శ్లో॥ డాకినీం వామపార్శ్వే చ కల్పాన్తజలదోపమామ్ ।
విద్యుచ్ఛటాభనయనాం దన్తపఙ్క్తివలాకినీమ్ ॥

శ్లో॥ దంష్ట్రాకరాలవదనాం పీనోత్తుఙ్గకుచద్వయామ్ ।
మహోదరీం ముక్తకేశీం మహాఘోరాం దిగమ్బరామ్ ॥

శ్లో॥ లేలిహానచలజ్జిహ్వాం ముణ్డమాలావిభూషితామ్ ।
కపాలకర్తృకాహస్తాం వామదక్షిణయోగతః ॥

శ్లో॥ దేవీం గలోచ్ఛలద్రక్తధారాపానం ప్రకుర్వతీమ్ ।
కరస్థితకపాలేన భీషణేనాతిభీషణామ్ ॥

శ్లో॥ దుర్నిరీక్ష్యాం చేతసాపి సర్వకామఫలప్రదామ్ ।
ధ్యాత్వేత్థం మనునానేన న్యసేత్ సాధకసత్తమః ॥

– మహాకాలసంహితా – కామకలాకాలీఖండః 441–459

1. (ప్రణవం–ఓం, రమాబీజం–శ్రీం, లజ్జాబీజం–హ్రీం, వాగ్భవబీజం–ఐం, క్రోధబీజం–హూం, అస్త్రమ్–ఫట్), 2. జపానంతరం యోనిస్తోత్రమును తప్పక పఠింపవలయునని యోనితంత్రము పేర్కొన్నది, 3. **వజ్రవైరోచనీ వజ్రా వజ్రకల్పా చ డాకినీ** అని శ్రీ ఛిన్నమస్తా అష్టోత్తర శతనామ స్తోత్రమ్. ✦

---

మృత్యుంజయశతకం - బుచ్చిసుందరరామశాస్త్రి

# ఏరో వెన్నెల చీకటుల్ గలసినట్లు

ఉన్నం జ్యోతివాసు
వేములపాడు

మాట్లాడే విధానం రకరకాలుగా ఉంటుంది. కొందఱు చాలా అందంగా చమత్కారంగా మాట్లాడతారు. కొందరి మాటలలో హాస్యం తొణికిసలాడుతూ ఉంటుంది. కొందరి హాస్యం చాటున ఎత్తిపొడుపులూ ఉంటాయి. కొందరి మాటలకు అర్థం తర్వాత ఎప్పుడో కాని స్ఫురించదు. కొందరి మాటలలో చాలా అర్థాలు స్ఫురిస్తాయి. ఇలా మాట్లాడడం ఒక ప్రతిభగా గుర్తించిన భర్తృహరి ఇలా అన్నాడు.

ప్రతిభాయాశ్చ శబ్దమేవ మూలమిత్యాః ।
భావనానుగతా ఏతదాగమాదేవ జాయతే ॥ - వాక్యపదీయము 1-153

భావనానుగతముగా వచ్చిన శబ్దమే (మాటయే) ప్రతిభకు మూలమని భర్తృహరి ప్రవచించాడు. ఈ ప్రతిభ పండితులలోనే కాదు పామరులలోను కన్పిస్తుంది. కొందరి మాటలు పొగడినట్లుంటాయి. కాని లోపల నింద ఉంటుంది. ఒక మోసగాడైన మిత్రుని గురించి ఒక జానపదుడు - 'అబ్బో! వాడు అసాధ్యుడు, మబ్బుల్లో నీళ్లు తెస్తాడు' - అని ప్రశంసిస్తాడు. మబ్బులు ఆకాశంలో ఉంటాయి. అవి చల్లబడితేనే వర్షం కురుస్తుంది. ఇదేదీ లేకుండానే వాడు ఆకాశంలో ఉన్న మబ్బుల్లోంచి నీళ్ళు తెస్తాడంటే వాడో పెద్ద మాయగాడని అర్థము. పైకి ప్రశంసలా కన్పించే నింద ఇది. దీనినే వ్యాజస్తుతి అలంకారమని ఆలంకారికులు అంటారు.

"వ్యాజస్తుతిర్ముఖే నిందాస్తుతిర్వా రూఢిరన్యథా" - స్తుతి ద్వారా నింద కాని, నింద ద్వారా స్తుతి కాని స్ఫురిస్తే వ్యాజస్తుతి అలంకారమవుతుందని కావ్య ప్రకాశము నిర్వచించింది. అన్ని అలంకారాలకు పుట్టిల్లు ఉపమాలంకారము. భాష పుట్టినప్పుడు పుట్టిన అలంకారమిది. ఇది అత్యంత పురాతనమైన అలంకారము. వ్యాజస్తుతి కూడా దీని నుండే పుట్టింది. క్రీస్తుపూర్వము నాటి భరతుని నాట్యశాస్త్రము - ఉపమ, దీపకము, రూపకము, యమకము - అన్న 4 అలంకారాలనే ప్రతిపాదించింది. క్రీ.శ. 2వ శతాబ్దప్రాంతంలో పుట్టిన విష్ణుధర్మోత్తరపురాణము తొలిసారిగా వ్యాజస్తుతిని అలంకారంగా గుర్తించింది. తర్వాత వచ్చిన ఆలంకారికులు దండి (క్రీ.శ. 600-680 ప్రాంతాలు), భట్టి (క్రీ.శ.590-650 ప్రాంతాలు), భామహుడు (క్రీ.శ.705-762 ప్రాంతాలు) మొదలైనవారు వ్యాజస్తుతిని అర్థశ్లేషమూలకవ్యాజస్తుతి అనీ, శ్లేషమూలక వ్యాజస్తుతి అని రకరకాలుగా వర్గీకరించారు. భోజుడు దీనిన లేశసహోక్తిగా సరస్వతీ కంఠాభరణంలో పేర్కొన్నాడు.

ఆప్టే నిఘంటువు వ్యాజస్తుతిని ఇలా నిర్వచించింది. "Figure of speech resembling the English Irony where in censure is implied by apparent praise, or praise by apparent censure"

తెలుగు ఆలంకారికులు ఇలా నిర్వచించారు.

క. వ్యాజస్తుతి యనఁగఁబరి, భ్రాజితమగు నిందవోలె బ్రణుతింపంగాఁ
దేజం బెసఁగెడు కథనము, రాజిల్లెడు మధుర వచన రచనల చేతన్
- కావ్యాలంకార చూడామణి 5-89

సంస్కృతాంధ్ర శతకాలలో వ్యాజస్తుతికి సంబంధించిన రచనలు చాలా తక్కువ. మిగతా అలంకారాలకు లేని ప్రత్యేకత వ్యాజస్తుతికి ఉంది. శాస్త్రజ్ఞత, ధర్మజ్ఞత, కావ్యజ్ఞత, తత్త్వజ్ఞత ఉంటే చాలు. అలంకారాలను పండించవచ్చు. కానీ, వ్యాజస్తుతి పండాలంటే వీటితో పాటు లోకవ్యవహారము కూడా బాగా తెలిసి ఉండాలి. కవికి లౌక్యమూ ఉండాలి. ఆంధ్ర సాహిత్యములో లోకవ్యవహారము బాగా తెలిసిన కవులలో – తిక్కన, నాచనసోమన, పింగళిసూరన, చరిగొండ ధర్మన, శ్రీనాథుడు మొదలైనవారు ప్రసిద్ధులు. అందుకే వారి రచనలలో రాయబారాలు అద్భుతంగా రాణించాయి. 'వాణి నారాణి' – అని సగర్వంగా ప్రకటించుకొన్న పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడికి లోకజ్ఞానం అంతగా లేదని ప్రముఖ విమర్శకులు టేకుమళ్ల అచ్యుతరావుగారు అభిప్రాయ పడ్డారు. ఇక మిగిలిన కవుల గుఱించి చెప్పవలసినది ఏముంది.

సంస్కృతంలో వాంఛేశ్వర కవి మహిష శతకము – ప్రభులక్షణాలు మహిషములో చూపిస్తూ వ్యాజస్తుతి శ్లేషానుప్రాణితమై చమత్కారంగా భాసించింది. కుమార సంభవములో కాళిదాసు కూడా కపటబ్రహ్మచారి సంభాషణను (5–72) వ్యాజస్తుతిలో రమణీయంగా నిర్వహించాడు. శివుడు వపుర్విరూపాక్షుడనీ, అలక్ష్య జన్ముడనీ, దిగంబరత్వమే అతని సంపద అనీ, వరులకు ఏ లక్షణాలు ఉండాలో అవేవీ ఆయనలో లేవనీ బ్రహ్మచారి నిందిస్తాడు. ఇది పైకి నిందయే కాని ఇందులో స్వామిస్తుతి కన్పిస్తుంది. పరమజ్ఞానానికి చిహ్నమైన మూడవ కన్నువల్ల స్వామి విరూపాక్షుడైనాడు. అందరి జన్మవంటి జన్మ కాదాయనది. ఆయన జన్మ అగోచరమైనది. ఇది ఈశ్వర లక్షణం. అందువల్ల ఆయన అలక్ష్యజన్ముడైనాడు. దిక్కులే అంబరముగా కలిగిన వైభవము ఆయనది. అందువల్ల దిగంబరుడు. ఈవిధంగా వరులలో ఉండవలసిన మేలిమి గుణాలన్నీ ఆయనలో దండిగా ఉన్నాయనే స్తుతి భంగ్యంతరంగా ఈ నిందలో కనిపిస్తుంది. పండితారాయుల భామినీవిలాసంలోను, సుభాషితరత్నభాండాగారములో లక్ష్మి స్వభావము గఱించి గల శ్లోకాలలోను కొన్ని వ్యాజస్తుతులు కన్పిస్తాయి.

భాగవతములో పోతన – శ్రీకృష్ణ నిందను వ్యాజస్తుతిలోనే నిర్వహించాడు. రుక్మిణీ కల్యాణములోని – 'మాసరివాడవా మా పాపగొనిపోవ' – వంటి పద్యాలు వ్యాజస్తుతిలో గట్టెక్కినవే. పల్నాటి సీమలో మంచినీళ్లు దొరకక శ్రీనాథుడు చెప్పిన – సిరిగలవానికి చెల్లును తరుణులు పదియాఱువేలు తగపెండ్లాడన్" – అన్న పద్యమూ, అట్లే ఒంటికన్నురాజు తిరుమల రాయలను స్తుతిస్తూ తెనాలి రామకృష్ణుడు చెప్పిన – అన్నాతి గూడ హరుడగు, అన్నాతిని గూడకున్న నసురగురుండౌ, అన్నా! తిరుమల రాయా! కన్నొక్కటి దక్కెగాని కౌరవ పతివే' – అన్న పద్యము వ్యాజస్తుతికి మంచి ఉదాహరణలు.

తెలుగులో చాటువులలోను, శతకాలలోను వ్యాజస్తుతి ఎక్కువగా కన్పిస్తుంది. కొన్ని శతకాలు కేవలము వ్యాజస్తుతిలోనే నడిచాయి. అవి – 1. ఆంధ్రనాయక శతకము (కాసుల పురుషోత్తమకవి) 2. శత్రుసంహారము (కవిపేరు తెలియదు), 3. సింహాద్రి నారసింహశతకము (గోగులపాటి కూర్మనాథము), 4. భద్రగిరి శతకము (భల్లా పేరయ్య), 5. బాలసుబ్రహ్మణ్యశతకము ( బృహత్తటాకము నాగశాస్త్రి), 6. విశ్వనాథ శతకము (అమలాపురం సంన్యాసిరాజు), 7. శ్రీ విల్లూరు పార్వతీశ శతకము (వేములపాటి భాస్కర సుబ్బకవి) మొదలైనవి. కూచిమంచి తిమ్మకవి భర్గశతకములోను, జగ్గకవి భక్తమందార శతకములోను కొన్ని వ్యాజస్తుతులు కన్పిస్తాయి. ఇలా ఎంత వ్రాసినా తరగని ఇసుకపాతర వంటిది ఈ అలంకారము. ఆధునికులలో విన్నకోట వేంకటరత్నశర్మ వంటివారు కొన్ని వ్యాజస్తుతులు వ్రాసినా,

మాధవపెద్ది బుచ్చి సుందరరామశాస్త్రి గారు అందులో పోయిన పోకడలు ఆంధ్ర సరస్వతికి అద్దాల మేడలు. ఆయన వ్రాసిన ప్రస్తుత గ్రంథము మృత్యుంజయ శతకములోని వ్యాజస్తుతులు ఆంధ్రదేశమంతటా మారుమ్రోగు తున్నాయి.

మృత్యుంజయ శతకము 108 పద్యాలు ఉన్న శంకర స్తుతి. ఇందులో చాలా వరకు వ్యాజస్తుతి ఉంది. కవి తన కష్టాలు స్వామికి నివేదించడంతో పాటు ప్రజల కష్టాలను కూడా ఏకరువుపెట్టి కైలాసంలో ఇలాంటివి లేవు కదా అని పైకి నిందిస్తూ అంతర్లీనంగా స్తుతించడం ఇందలి ప్రధానాంశము. ఇది శతకమైనా కావ్యత్వాన్ని సాధించిన రచన. ఈ కవి వ్యాజస్తుతిలో ఈశ్వరుని స్తుతించిన జగత్ప్రసిద్ధమైన ఈ పద్యాన్ని చూడండి.

మ. మెడ నాగయ్యకు నొక్కటే బుసబుసల్, మేనన్ సగంబైన యా
బిడతో నీకిఁక నెప్పుడున్ గుసగుసల్, వీక్షించి మీ చందమె
క్కడ లేనంతగ నెత్తిపై రుసరుసల్ గంగమ్మకున్, నీ చెవిన్
బడటేలాగునొ మా మొఱల్ తెలియదప్పా! మాకు మృత్యుంజయా! (5ప)

స్వామీ! నీ మెడలో నాగుపాము ఎప్పుడూ బుసలు కొడుతూనే ఉంటుంది. నీ దేహంలో సగభాగమైన పార్వతీదేవితో ఎప్పుడూ గుసగుసలాడుతూ ఉంటావు. మీ ఇద్దరి గుసగుసలు విని పట్టరాని కోపముతో నెత్తిమీద ఉన్న గంగమ్మ ఎప్పుడూ రుసరుసలాడుతూ ఉంటుంది. ఈ బుసబుసలు, గుసగుసలు, రుసరుసల మధ్య నా నసనసలు (మొఱలు) నీ చెవిలో ఎలా వెయ్యాలో తెలియడములేదప్పా – అని ఇందలి నింద.

శివునాజ్ఞ లేనిదే చీమైనా కుట్టదు. ఇన్ని బుసబుసలు, గుసగుసలు, రుసరుసల మధ్య అనేక వ్యగ్రతలతో ఉన్నప్పటికీ, స్వామీ! మిమ్మల్ని విస్మరించకుండా బాధ్యతగా ఆలించి పాలిస్తున్నావు. భక్తపాలన కళాశీలుడవైన నీకు నా నమస్సు – అని ఇందలి స్తుతి.

మనిషి భుక్తికోసం తప్పులు చేస్తూ, వాటిని సమర్థించుకోవడానికి దేవుడిని కూడా తృణీకరించే మానవ నైజాన్ని ఎత్తి చూపే ఈ పద్యాన్ని పరికించండి.

శా. ఏదో నీకొక దేవిగాని యిఁక నేవేవో సవాలక్ష లా
వాదేవీలయిపోయె మాకు, జరుగుంబాటెట్టు, లే కొండనో
లేదా యే గుహలోనొ పట్టకొక జోలే దాగియుండంగ, మే
మే దేవుళ్లమొ, విశ్వమూర్తులమొ నీవే తెల్పు మృత్యుంజయా! (23ప)

ఒక దేవి (భార్య) తోనే ఉంటూ, ఒకరి జోలే పట్టక, ఏ కొండలోనో గుహలోనో నువ్వు కనబడకుండా ఉంటున్నావు. నువ్వు ఎక్కడో ఉంటూ మమ్మల్ని పట్టించుకోక పోవడం వలన, అక్కడా ఇక్కడా అన్న తేడా లేకుండా అన్నిచోట్లా తిరుగుతూ ఏదో ఒక విధముగా జీవనోపాధి చూసుకొంటూ సంచరించే మేమే దేవుళ్లము, విశ్వమూర్తులము కాని నీవెలా అవుతావో చెప్పు – అని నింద.

స్వామి అంతటివాడే ఒక దేవితో ఏ కొండలోనో, గుహలోనో ఉంటున్నాడు. సవాలక్ష లావాదేవీలతో జరుగుబాటు కోసం తప్పులు చేస్తూ, ఆ తప్పులు సమర్థించు కోవడం కోసము దేవుడిని కూడా తృణీకరిస్తూ మేము అహంకరిస్తున్నాము. ఎవరికీ కనబడకుండా సర్వాంతర్యామివై అన్నిచోట్ల సంచరిస్తూ మమ్మల్ని కాపాడే నీవే దేవుడివి విశ్వమూర్తివి కాని మేము కాదని ఇందలి స్తుతి.

ఉమ్మడి కుటుంబంలో తండ్రి కుటుంబ బాధ్యత వహిస్తూ ఉంటాడు. కొడుకులు సంపాదించి ఆయనకు ఇస్తుంటారు. ఇక్కడ కవిగారి ఉమ్మడి కుటుంబంలో శివుడు తండ్రి, కవిగారు కొడుకు. వీళ్ల ఇంట్లో గుద్దులాటను చూడండి.

శా. పద్దుల్ వ్రాసి గడించుకొన్న దెదియో పద్యమ్ము లచ్చుందునన్
గ్రుద్దింపంగను దెచ్చిపెట్టి యిదిగో! కూర్చుంటి, నాయొద్ద నీ
యొద్దం గూడను సర్వమంగళము, నాకో నీకొ యీమీద నిల్
దిద్దన్ బాధ్యత వచ్చి తేల్చుకొనరాదే తండ్రి! మృత్యుంజయా! (37ప)

ఆ లెక్కలు ఈ లెక్కలు వ్రాసి సంపాదించిన డబ్బును కావ్యాన్ని అచ్చువేయించు కోవడానికి తెచ్చిపెట్టుకొని ఇదిగో ఇలా కూర్చున్నాను. నావద్ద, నీవద్ద కూడ సర్వమంగళమే (దరిద్రము) ఉంది. నువ్వు నా తండ్రివి కనుక ఇల్లు చక్కదిద్దాల్సిన బాధ్యత నీకూ ఉంది. రా! ఎవరము ఇంటిని చక్కదిద్దాలో తేల్చుకొందాము – అని కవి స్వామిని చొక్కా పట్టుకొని నిలేస్తున్నాడు.

పద్దులు వ్రాసి సంపాదించిన డబ్బు, నిన్ను స్తుతిస్తూ వ్రాసిన కావ్యాన్ని అచ్చు వేయించడానికి ఖర్చు పెడుతున్నాను స్వామీ! దాంతో అంతా సర్వమంగళము అవుతుంది. ఇక ఇల్లు ఎలా గడుస్తుంది. నీ వద్ద సర్వమంగళ (జగన్మాతయైన పార్వతీదేవి) ఉంది. నా తండ్రివి కనుక ఈ ఇంటిని నీవు కాకపోతే ఇంకెవరు చక్కదిద్దుతారు స్వామీ – అని ఇందలి అభ్యర్థన.

తండ్రికి తన బిడ్డలందఱి మీద సమానమైన ప్రేమ ఉంటుంది. తక్కువ స్థితిలో ఉన్న బిడ్డ పట్ల కాస్త ప్రేమ ఎక్కువగానే ఉంటుంది. కానీ నీవేమిటి తండ్రి! దీన స్థితిలో ఉన్న నా పట్ల ఇంత అనాదరం చూపిస్తున్నావని కవి స్వామిని గట్టిగా అడుగుతున్న ఈ పద్యం చూడండి.

మ. ఒక లంబోదరుడైన పుత్రుకుడు మున్నున్నట్టిదే నీకు జా
లక కాఁబోలును సృష్టి జేసితివి యీ లంబోదరుం గూడ దీ
గకుఁ గాయల్ బరువౌన కాని, కుడుముల్ గల్పించి యవ్వాని కే
లొకొ యివ్వానికి నొక్కమైని యిడుముల్ మొల్పింతు మృత్యుంజయా! (19ప)

ఇంతకు ముందే బానవంటి పెద్ద పొట్ట ఉన్న ఒక లంబోదరుడు (వినాయకుడు) నీకు కొడుకుగా ఉన్నాడు. ఆయనొక్కడే నీకు సరిపోయినట్టులేదు. బుచ్చి సుందరరామ శాస్త్రి అనే ఈ లంబోదరుడిని కూడా సృష్టించావు. మా ఇద్దరివి పెద్దపొట్టలే. నీవే పోషించాలి మరి. తీగెకు కాయలు బరువు కాదు కదా. ఆ లంబోదరునికి కుడుములు ఇచ్చావు. మరి ఈ లంబోదరునికి ఇడుములు (కష్టాలు, దరిద్రాలు) ఇచ్చావు. ఎందుకు స్వామీ – అని నింద.

స్వామికి అనుగ్రహం కలిగినప్పుడు కష్టాలు కలిగించి కర్మక్షయం చేస్తాడు. కర్మక్షయమయ్యాకే మోక్షం లభిస్తుంది. నిప్పులలోనే బంగారం నిగ్గుతేలుతుంది. ఆ ఇడుములు (కష్టాలు) అనుభవించిన తర్వాతనే కుడుములు (శుభాలు) లభిస్తాయని అర్థము. భాగవతములో వామనమూర్తి ఘట్టములో విష్ణుమూర్తి బ్రహ్మతో ఇలా చెప్పాడు.

బ్రహ్మన్ యమనుగృహ్ణామి తద్విశో విధునోమ్యహమ్ ।
యన్మదః పురుషః స్తబ్ధో లోకం మాం చావమన్యతే॥ (అష్టమ 22-24)

'బ్రహ్మదేవా! నేను మనస్సులో ఎవరిని అనుగ్రహించాలని అనుకొంటానో వాని సంపదలనన్నిటిని హరించి, కష్టాలు కలిగిస్తాను. లేకుంటే మనిషి ధనగర్వంతో కళ్లు నెత్తికెక్కి నన్ను, లోకాలను తృణీకరిస్తాడు' – అని చెప్పాడు.

ఈ విషయాన్ని దృష్టిలో పెట్టుకొని – కవి ఇప్పుడు ఇడుములు కల్గించి, తర్వాత నన్ను అనుగ్రహించ దలచిన స్వామికి నా నమస్సు – అని స్తుతిస్తున్నాడు.

ఈశ్వరతత్త్వములో అర్ధనారీశ్వరము చాలా ఉత్కృష్టమైనది. కవి దానినీ వదిలిపెట్టలేదు. ఎలా ఎత్తిపొడుస్తున్నాడో చూడండి.

మ. ఉమ నీకిచ్చి వివాహమున్ సలిపినారో చెప్పు మా మేనకా
హిమవత్పర్వత రాజు, లేనటననో నీవామె జేపట్టి యా
యమచేతన్ సవతాలు గంగమను మోయం జేయుచున్నావు పా
పము! దేహార్ధమొసంగి నట్లొసఁగి సేబాసయ్య! మృత్యుంజయా! (55వ)

మా మేనకా హిమవంతులు తమ కూతురు ఉమాదేవిని నీకిచ్చి పెండ్లి చేశారా? నిజం చెప్పు. ఏవో నాటకాలాడి ఆమెను పెండ్లి చేసికొన్నావు. ఆమెకు నీ దేహంలో సగభాగం ఇచ్చావు. అంతటితో ఊరుకొన్నావా? ఆయమ్మ చేతనే నెత్తిమీద సవతి గంగమ్మను మోపిస్తున్నావు. శభాష్ స్వామీ! – అని ఇందలి నింద. నిజానికి సంస్కృత కవులకు కూడా ఇంత గొప్ప ఊహ రాలేదు. ఏ నటనో – అన్న వాదంలో చాలా వ్యవహారముంది. ఉమను పెండ్లి చేసికోవడానికి ఎన్ని నాటకాలాడావు. సప్తఋషులను ఆమె తండ్రి హిమవంతుని వద్దకు పంపావు. నీ కూతురు పార్వతిని శివునికిచ్చి పెండ్లి చేస్తే జగన్మాత అవుతుందని, శివునికి రాణి అయితే దేవతలు ఆమె పాదాలకు కూడా నమస్కరిస్తారని, శివునికి నీవు మామవైతే ఎవరికీ నమస్కరించని ఆయన నీకు నమస్కరిస్తాడని – అమ్మో అమ్మో ఎన్ని మాటలు చెప్పించావు. చివరకు ఆమెను పెండ్లి చేసికొని ఆయమ్మ చేతనే సవతిని మోపిస్తున్నావే – అని ఎత్తిపొడుపు.

ఇందులో కవి అర్ధనారీశ్వరతత్త్వాన్ని ప్రౌఢంగా గుర్తు చేస్తున్నాడు. శక్తి లేనిచో శివుడు లేడు. శివుడు లేనిదే శక్తిలేదు. ఇదే అర్ధనారీశ్వరతత్త్వము. దీనినే శంకర భగవత్పాదులు సౌందర్యలహరిలో అద్భుతంగా ప్రతిపాదించారు.

శ్లో॥ శివశ్శక్త్యా యుక్తో యది భవతి శక్తః ప్రభవితుం
న చేదేవం దేవో న ఖలు కుశలః స్పందితుమపి ।
అతస్త్వామారాధ్యాం హరిహరవిరించాదిభిరపి
ప్రణతుం స్తోతుం వా కథమకృతపుణ్యః ప్రభవతి ॥ (సౌందర్య. 1శ్లో)

తల్లీ! పరమశివుడు ప్రపంచ నిర్మాణ శక్తితో కూడినప్పుడే ప్రపంచమును సృష్టించగలడు. లేనిచో కదలను కూడా కదలలేడు. హరిహరబ్రహ్మాదులే ఆరాధించే నిన్ను పూర్వజన్మలో ఏ కొంచెమైనా పుణ్యం చేయనివాడు ధ్యానించలేడని శంకరపాదులు అమ్మవారిని స్తుతించారు.

అద్భుతమైన ఈ అర్ధనారీశ్వరతత్త్వాన్ని మన బుచ్చన్న కవి ఇక్కడ చూపించాడు. భగీరథుడు కోరినప్పుడు లోకకల్యాణము కొఱకు స్వామి గంగను తలపై ధరించవలసి వచ్చింది. అందులో అమ్మవారు కూడా పాలుపంచుకొన్నారు. అప్పుడే అది సాధ్యమయింది. అటువంటి అర్ధనారీశ్వరుడు నన్ను

అనుగ్రహించుగాత – అని ఇందలి స్తుతి. (అర్ధనారీశ్వరతత్త్వ అంతరార్థాన్ని నాకు తెలిపిన మిత్రులు డా॥ వద్దేపల్లి శ్రీనివాసరావు గారికి నా కృతజ్ఞతలు)

ఈవిధంగా వ్యాజస్తుతి సౌందర్యాన్ని ఇక చాలుబాబోయ్ అన్నంతగా పోషించారు మన బుచ్చన్నకవి. చివరి పద్యాలకు వచ్చేసరికి వ్యాజస్తుతి మందగించి, అది మధురభక్తిగా రూపాంతరం చెందింది. కొన్ని పద్యాలలో గీతాంజలి, భక్త చింతామణి శతకము (వసురాయ కవి) స్థాయి భావాలు కన్పిస్తాయి. 14, 82, 106 సంఖ్యలు గల పద్యాలలో భావకవిత్వపు జాడలు కన్పిస్తాయి. 10, 12, 13, 49, 50, 76, 81, 88, 89, 93, 97, 102, 103 సంఖ్యలు గల పద్యాలలో కవిగారి ప్రౌఢమైన శాస్త్ర పరిజ్ఞానం కన్పిస్తుంది. 17, 38, 46, 56, 63, 78, 39, 40, 41, 47, 48, 80, 83, 85, 86, 87 సంఖ్యలు గల పద్యాలలో కవియొక్క సొంతగోడు, జీవుని వేదన గోచరిస్తాయి.

ఇందలి శైలి అనర్గళ గంగా ప్రవాహము వంటిది. రచనలో దేశిపదాలు, పలుకుబడులు దండిగా తగులుతాయి. భాషలో మెత్తదనం, భావాలలో కొత్తదనం, పదబంధంలో గట్టిదనం ఈ కృతికి సహజాలంకారాలు. లావాదేవీలు (23, హంగామా (25), ఫక్తు (32), రొక్కము (33), టికాణా (34) వంటి అన్యదేశ్యాలు, గాడిద తన్నులు, భోగాపురి బొల్లిమబ్బు విధము వంటి అరుదైన పలుకుబడులు కన్పిస్తాయి. చేసుక, రణపెంకె వంటివి అక్కడక్కడ తగిలినా మంచి రుచిగల కాఫీ వంటిది ఈ శతకము.

భీమఖండములో – 'ఎల్లన్ శిష్యులఁగొంచు వత్తునొ' (2+20) – అని ఒక ప్రయోగం ఉంది. ఇందలి 'ఎల్లన్‌శిష్యుల' – అన్నది చాలా చర్చకు గురయింది. బాలవ్యాకరణనియమము (సంధి–24) ప్రకారము ఇది ఎల్లశిష్యుల – అవుతుంది. ఎల్లన్ శిష్యుల – కాదు. ఎల్లశిష్యుల – అంటే గణభంగమవుతుంది. బండారు తమ్మయ్య వంటివారు శ్రీనాథుడు కన్నడ సంప్రదాయం ప్రకారం దీనిని 'ఎల్లాశిష్యుల' – అని ప్రయోగించి ఉంటాడని ఊహించారు. మరి కొందరు ఎల్లర్‌శిష్యుల – అని ప్రయోగించి ఉంటారని భావించారు. ఈ శతకంలో కూడా 'ఎల్లన్ నీవయి పోయి (105 ప)– అన్న ప్రయోగం ఒకటి ఉంది. దీనికి అనంతర వ్యాకర్తలు గతిని కల్పించారు.

ఈ గ్రంథములో నేను చేసిన ఒండు, రెండు సవరణల గుఱించి చెప్పవలసి ఉంది. 22వ పద్యంలో – 'ఈ నాకే యని కాదు, నీకయినఁగానీ నేటి కాలానఁ బూర్ణానుస్వారము ముష్టియేని కనంబన్ దాన' – అని ఉంది. 'కనంబన్ దాన' లో ఒక మాత్ర లోపించి గణభంగం జరిగింది. దానిని – 'కననంబన్‌దాన' అని దిద్దాను. 48వ పద్యంలో 'రేజాము' అన్న పదం నాకర్థం కాలేదు.

40వ పద్యంలో – 'నడిగోదావరి లోపలన్ బయన మట్లెన్నాళ్లు సాగించెనో' – అని ఉంది. ఇందులో యతి భంగమయింది. ఇక్కడ కవి దృష్టిలో 'న' కు – 'న్నా'కు యతి. కాని యతిస్థానంలో 'ఎ' – పడింది. ఈ ప్రమాదం ప్రాచీన కవులలో కూడా కన్పిస్తుంది.

మ. **అ**తను క్రీడ రహించుటలో చెలులకి**ట్లీ** యానముల్ పొందుటల్

– వసుంధరా పరిణయము 3–110

కవిదృష్టిలో 'అ' కు – 'యా'కు యతి. కానీ పద్యంలో 'అ' కు – 'ట్లీ' లోని 'ఈ' కి మైత్రి జరిగింది. శశాంక విజయము పూర్వప్రతులలో –

గీ. **తు**రగములనెక్కి యుద్ధస**న్న**ద్ధులగుచు (5–16)

– అని ఉంది. ఇక్కడ కవి దృష్టిలో 'తు' కు – 'ద్ధు' కు యతి. కానీ యతి స్థానాన్ని 'న్న' – ఆక్రమించింది. ఎమెస్కో ప్రతిలో దీనిని – 'నాగములనెక్కి యుద్ధ సన్నద్ధులగుచు' – అని దిద్దారు. పద్యకవులకిది అనుభవమైన విషయమే. అందువలన పై పద్యపాదాన్ని 'పయనమెన్నాళ్లిట్లు సాగించెనో' – అని దిద్దాను. 60వ పద్యంలో ఇటువంటి యతియే ఉంది. కాని దిద్దలేదు. అచ్చుతప్పులు కారణంగా గణభంగము జరిగిన కొన్ని చోట్ల సవరణలు చేశాను. కవి ఇష్టపడి యతిస్థానంలో ప్రయోగించిన ఎఱిగించన్, ద–డ యతులు, వ్యావహారికరూపాలు, క్వార్థకీకారాలు మొదలైనవాటిని నేను దిద్దలేదు. అది పరిష్కర్త పనిగాదు.

**బుచ్చి సుందరరామశాస్త్రి గారు 1895**లో గుంటూరు జిల్లా బ్రాహ్మణకోడూరు గ్రామంలో జన్మించారు. ఆయన తండ్రి శంకరశాస్త్రి రామభక్తుడు. మంచి పౌరాణికుడు. ఆయన వద్ద బుచ్చన్నగారు భారత, భాగవతాది పురాణాలు, కావ్యాలు చదువుకొన్నారు. సంగీతం నేర్చుకొన్నారు. 1910 ప్రాంతంలో కడియంలో చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారి వద్ద శుశ్రూష చేసి మాఘము, కౌముది చదువుకొన్నారు. చెళ్లపిళ్ల దంపతులు బుచ్చన్నను ఇంటిలో పెట్టుకొని కన్నకొడుకులా ఆదరించారు. చెళ్లపిళ్ల వారి మూడవ కొడుకును ఆడిస్తూ, తనకు నచ్చినప్పుడే పాఠము చదువుతూ బుచ్చన్న కాలక్షేపం చేసేవాడు. చెళ్లపిళ్లవారు మోహనరాగంలో పద్యాన్ని ఎత్తికొనేవారు. అదే వారి శిష్యులకు, జాషువా వంటివారికి ఒరవడి అయింది. కాని బుచ్చన్నగారు నాదనామక్రియ అన్న రాగంలో ముక్కుతో పద్యాలు ఇంపుగా పాడేవారు. అదొక తరహాలో ఆయన ఆకర్షణీయంగా పద్యం పాడుతూ ఉంటే సభ సద్దుమణిగేది. ఇతనిని గుఱించి చెళ్లపిళ్లవారు – "నాకు శిష్యుడై కూడా నా చదువు ధోరణి యితర శిష్యులతో పాటుగా నీతడనుకరించు వాడు కాదు. ఇతని చదువు ఫక్కి మిక్కిలి శ్రావ్యముగా నుండును. ఇతని కవిత్వము కేవలము కొత్తపోకడలతో రుచ్యముగా నుండును. ఒకరి త్రోవకు బొత్తిగా లేఖినిని నడుపని వాడగుటచే నీతని కవితకు గ్రంథచౌర్యదోషము లేశమును తగులదు. ఈ కవిత్వ స్వారస్యమట్టిది. తన్మయత్వము సర్వత్ర కవికి స్ఫురించు చుండును" – అని (బృందావనము పీఠిక పుట 3) అభిప్రాయపడ్డారు.

బుచ్చన్నగారు విద్వత్కవి. జాతీయవాది. సంస్కరణ భావాలు గల రచయిత. ఆయన చాటువులు, సినిమా తారల మీద వ్రాసిన పేరడీలు హాస్యరసభరితాలై ప్రసిద్ధి గాంచాయి. స్వరాజ్య సమస్యపైన, హరిజన సమస్యపైన ప్రచార గీతాలు వ్రాశారు. 'అంటరాని వారెవరో కాదు – మావెంటరాని వారే' – అన్న ఆయన ప్రచారగీతం చాలా ప్రసిద్ధికెక్కింది.

ఆయన కావ్యాలు కూడా చాలా వ్రాశారు. అందులో సతీస్మృతి (1932), మృత్యుంజయము (1945), ఉమర్‌ఖయ్యామ్ (1946), శృంగార చాటువులు (1946), శబరి (1945), పంచవటి (1948), అశోకము (1948), చిత్రకూటము (1949), కళాతపస్వి (1950) – అచ్చుపడ్డాయి. శారద, ప్రణయలీల అన్న కావ్యాలు అచ్చు కాలేదు. భారతానికి చెందిన సంజయరాయబారము, కొన్ని ఘట్టాలు వ్రాశారు కానీ అవన్నీ అచ్చుకాలేదు. రామాయణం లోని ప్రధాన కథాఘట్టాలను చిన్న చిన్న కావ్యాలుగా వ్రాసి, వాటిని రామాయణ మహాకావ్యంగా తీసికొని రావాలనుకొన్నాడు. శబరి, పంచవటి, అశోకము, చిత్రకూటము లను చిన్న చిన్న గ్రంథాలుగా ప్రచురించారు. శూర్పణఖ, ఋష్యమూకము, మిథిల మొదలైన కథాఘట్టాలను చిన్న చిన్న కావ్యాలుగా వ్రాశారు కానీ అవి అచ్చుకెక్కకముందే ఆయన గతించారు. అవన్నీ అచ్చుపడి, రామాయణ మహాకావ్యంగా వచ్చి ఉంటే తెలుగువారికి పోతన రామాయణము వ్రాయలేదే అన్న వెలితి ఉండేది కాదు.

బుచ్చన్నగారికి చిన్నవయస్సులోనే భార్యావియోగం కలిగింది. అప్పటికి ఆ దంపతులకు ముగ్గురు ఆడపిల్లలు. ఇంట్లో ముసలి తల్లి. దానికి తోడు నిత్యదారిద్ర్యము. ఇల్లాలు పోయిన బాధతో ఆయన సతీస్మృతి – అన్న కావ్యం వ్రాశాడు. ఆ పద్యాలు మొదట భారతిలో అచ్చుపడ్డాయి. అందలి – 'జ్వరతీవ్ర తీవ్రతా త్వరమాణ హృద్యంత్ర చరమనాడీ హతాస్తంభనములు' – అన్న పద్యాన్ని చూచి మహాకవి కాటూరి వేంకటేశ్వరరావు గారు – ఎవడీ సుందరరాముడు. ఇంత ప్రౌఢకవి ఇన్నాల్లు ఎక్కడ దాంకొన్నాడు' – అని ఆశ్చర్యపోయారు. ఆ తర్వాత గుంటూరు నవ్యసాహిత్యపరిషత్తు లో విశ్వనాథవారు బుచ్చన్నగారిని కాటూరి వారికి పరిచయం చేశారు. కాటూరివారి సాంగత్యము బుచ్చన్నగారి సాహిత్యాన్ని ప్రౌఢతరం చేసింది. అంతకు ముందు ప్యారడీ కవిత్వము, హాస్యపద్యాలు వ్రాసి హాస్యకవిబ్రహ్మగా ప్రసిద్ధికెక్కిన ఆయనకు కాటూరి సాంగత్యం పంచవటి, శబరి, చిత్రకూటము వంటి ప్రౌఢసాహిత్యాలను వ్రాయించింది. ఆ గౌరవంతోనే ఆయన కాటూరివారిని 'బాబుగారూ' అని పిలిచేవారు. కాటూరి వారి పరిచయం ఆయనకు కృష్ణా దర్బారులో స్థానం కల్పించింది.

కృష్ణా దర్బారు ఆధునిక భువన విజయము వంటిది. అందలి రాయలు ముట్నూరు కృష్ణారావుగారు. కృష్ణా పత్రిక కార్యాలయము జమ్ముపాకలో నిర్వహించేవారు. దర్బారీయులు దీనిని జమ్మామసీదు అని పిలిచేవారు. ఆనాటి గట్టి పండితులు, కవులు, గాయకులు, కళాకారులు చాలావరకు కృష్ణాదర్బారును దర్శించి ధన్యులైనవారే. కాటూరివారు దర్బారు శాయరు (ఆస్థానకవి). ఆయన తమ కవిత్వపు పన్నీటిజల్లులు కురిపించేవారు. కాటూరివారి వెంట సూర్యుని నీడలా బుచ్చన్నగారు కూడ దర్బారుకు వచ్చేవారు. అప్పటి ఆయన రూపాన్ని కాటూరివారు అక్షరాలలో ఇలా చిత్రించారు.

"విశాలమైన ఆ ఫాలతలము, ఎత్తయిన కనుబొమ్మలు, కొట్టవచ్చినట్లుండు ఆ ముక్కు, శరీరమునకు స్థౌల్యమాపాదించు ఆ బొజ్జయు – ఎగ్రదోయ దిగజారు నెద్ది మాధవపెద్ది" అని ఆయన చెప్పుకొనినట్లే – "ఎంత లాగినను బొద్దు క్రిందికి జారిపోవు ఆ పంచెకట్టు – అడుగో! మా సుందరరామ వామనుడు! పరధ్యానముగా ఒక్కొక్క అడుగే వేసికొనుచు నడచివచ్చు చున్నట్లే ఉన్నది. బొత్తములు లేని ఆ చొక్కా, ఎంత తుడిచిననూ ఊటలూరు ఆ పొడుము చారికలు, మడిచి చంకను బెట్టికొన్న ఆపై పంచెయు, అయ్యో! ఆ యవతారము తలచుకొనినచో నవ్వువచ్చును. మఱి సారస్వత తేజము ఉట్టిపడెడి ఆ ఫాలతలము చూచినచో ముద్దువచ్చి చేతులు మోడ్చ బుద్ధిపుట్టును" – సాహిత్యదర్శనము పుట 102.

అలా వచ్చి దర్బారులో ఒకప్రక్కన కూర్చునేవారు. ఎవరేమన్నా త్వరగా జవాబు చెప్పేవారు కాదు. ముక్కుతుడుచుకోవడమే ఆయన ముఖ్య కార్యక్రమంగా ఉండేది. ఆయనను చూడగానే అందరూ నవ్వుకొనేవారు. ఆ సందర్భంలోనే కాటూరివారి సైగతో – ఆయన తన పంచవటి, ఉమర్‌ఖయ్యామ్ కావ్యాల నుండి పద్యాలను నాదనామక్రియా రాగంలో ఎత్తుకొనేవారు. దాంతో ఆ నవ్వులు ఆగి సభ సద్దుమణిగేది. దర్బారంతా నాదనామక్రియారాగంలో తడిసి ముద్దయ్యేది. కంచు కంఠముతో ఆయన గంటలు గంటలు వినిపిస్తూ ఉంటే, ఎప్పుడు పొద్దుపోయేదో తెలిసేది కాదు. పొద్దు పోయాక, దర్బారు ముగిశాక ఇంటికి వెళుతూ ఉంటే దారిలో కూడ కాటూరివారిని వెంబస్తూ పసిపిల్లాడిలా ఆనందంగా పద్యాలు విన్పిస్తుండేవాడు. ఆ హడావుడిలో పొడుముకాయో, ముక్కు తుడుచుకొనే చేతిగుడ్డో, పై పంచో దారిలో పోగొట్టుకొనేవాడు. పద్యగానంలో అంతగా ఆయన మైమరచిపోయేవారు.

జీవితంలో ఆయన దుర్భరమైన దారిద్ర్యాన్ని అనుభవించాడు. ఈ లోకము, జీవితము

అంతా ఆయనకు ఒక కలలాగా అన్పించేది. ప్రణవ మంత్రసిద్ధమైన చిత్సుఖము, కావ్యరస పరాయణత్వము – ఈ రెండే ఆయనకు సత్యంగా తోచేవి. మిగతా విషయంలో నిర్లిప్తంగా ఉండేవాడు. అందువలన కూతుళ్లు, బంధువులు ఆయనను మమకారహీనుడని, ఆయనది కపట ప్రేమ అనీ అనుకొనేవారు. ఆయన స్వభావం తెలిసినవారు మా బుచ్చన్న వట్టి వెఱ్ఱిబాగులవాడని అనుకొనేవారు.

ఆయనకు తలలో ఎప్పుడూ ఏదో ఘంటానాదము వలె విన్పిస్తూ ఉండేది. ఆ ధ్వని ఆయనకు ఎంతో సుఖాన్ని ఇస్తుండేది. దానినే 'నాలో కొన్ని దినాల నుండి ఎవడో నాగస్వరంబూదుచున్' – అని మృత్యుంజయము (103ప) లో బయటపెట్టాడు. ఆయన ప్రణవ మంత్ర పరాయణుడు. 'నావంబోలె ప్రయాణమైనది మహానంద ప్రవాహమ్ములో భావంబెక్కడికో' (107ప) అనీ, ఏరో వెన్నెల చీకటుల్ గలసినట్లీ పర్వతాగ్రాన నున్నారే. ఒక్కరిలోన ఇంకొకరు లీనంబౌచునున్నటులు, వేఱౌచున్నటు కానుపించెదరె. కానీ వారికే వారు పట్టీరే ఆది పురాణ దంపతులు కారే వారు (108 పద్యం) – అంటూ ఈ కృతిలోనే దివ్యానుభూతిని ప్రకటించారు. ప్రకృతి పురుషుల లీల నింత స్పష్టముగా దర్శించిన లోతైన చూపులు బుచ్చన్న కవివి.

బుచ్చన్నగారి పద్యాలు జగత్ప్రసిద్ధమయ్యాయి కాని ఆయనకు దక్కిన గౌరవాలు అంతంత మాత్రమే. విజయవాడలో రసజ్ఞులు ఆయనకొక గొప్ప సత్కారము చేసి, చేతికి స్వర్ణఘంటాకంకణము తొడిగారు. అర్థశాస్త్ర రహస్యాలను, ప్రకృతిశాస్త్ర విశేషాలను సూక్ష్మదృష్టితో పరిశీలించి, వాటిని హాస్యరసములో ముంచి, సులభసుందరముగా కంటిముందు నిలిపే ఆయన కవనమార్గము చెళ్లపిళ్లవారిని విస్మయపరిచేది. అందుకే ఆయన – 'తన త్రోవ తాను నిర్మించుకొనిన సుందరరామశాస్త్రి నిజముగ స్వయంవ్యక్తి' – అని ప్రశంసించారు. బందరు హిందూకాలేజీలో తన అధ్యక్షతన వర్ధిల్లిన సన్మానసభలో బుచ్చన్నకవికి "స్వయంవ్యక్తి" – అన్న బిరుదప్రదానం చేశారు. ఆ సభలో నాటి సాహిత్య దిగ్గజాలు చాలామంది పాల్గొని ఆయనను ఆశీర్వదించారు. కాటూరివారు

మ. కవితావీథుల గోడుబిళ్లలను బొంగ్రాలాడు కోడూరి మా
ధవ పెద్దింటికి బుచ్చి సుందరుడవై, త్వత్కావ్య గంగాఝురుల్
కవివైరోచన రాజ్యచక్రమొక యంగన్ జుట్టి మిన్ముట్టగా
నవురా! సుందర రామ వామన! స్వయం వ్యక్తుండ వైనావురా

అంటూ అరడజను ప్రశంసా పద్యాలను చదివి ఆశీర్వదించారు. బుచ్చన్న గారి జీవితగ్రంథంలో ఆ సభ ఒక బంగారు పుట.

ఇక ఈ **మృత్యుంజయ శతకం** – లోకంలో మృత్యుంజయముగా, మృత్యుంజయ స్తవముగా ప్రసిద్ధికెక్కింది. మృత్యుంజయుడు అంటే మృత్యువును జయించినవాడు, శివుడు అని అర్థం. మృత్యువు నుంచి రక్షించమని – **త్ర్యంబకం యజామహే సుగంధిం పుష్టివర్ధనం ఉర్వారుకమివ బంధనాత్ మృత్యోర్ముక్షీయ మామృతాత్** – అని ఒక ప్రసిద్ధ మంత్రం ఉంది. మృత్యువు అంటే భౌతికంగా చనిపోవడమని స్థూలార్థం. కాని ఒక లక్ష్యము, కార్యసాధన, భక్తి, తపస్సు, చేతనత్వము లేనివారు మృతప్రాయులు. అందువలన లక్ష్యసిద్ధిని కలిగించేదే మృత్యుంజయ మంత్రం.

చేబ్రోలు చిన్మయబ్రహ్మకవి రాణ్మహేంద్రవర మార్కండేయ మృత్యుంజయా అన్న శతకం వ్రాసి మల్లంపల్లి శరభయ్య శర్మగారికి వినిపించారు. ఎవరి కవిత్వాన్ని అంతగా మెచ్చని శర్మగారు

బుచ్చన్నగారి మృత్యుంజయం నుంచి – ఒక లంబోదరుడు, మెడనాగయ్యకు పద్యాలు, అందలి స్వారస్యం విన్పించి ఇలా ఉండాలి పద్యాలు – అని అన్నారు. చెళ్లపిళ్లవారు, తెన్నేటి నారాయణశర్మ, వింజమూరి లక్ష్మీనరసింహారావు, ఆదిభట్ల నారాయణదాసు వంటి విద్వాంసులు మృత్యుంజయ శతకాలు వ్రాశారు. వాటికంత ప్రసిద్ధి లేదు. బుచ్చన్నగారి మృత్యుంజయమే వాసికెక్కింది. మైత్రి భక్తికి దారితీయడం, భక్తి అమృతత్వాన్ని ప్రసాదించడం, చివరకు భక్తి దీప్తవంతమవడం అన్నవి ఒక క్రమ పరిణామంగా బుచ్చన్నగారు తీర్చిదిద్దడంతో ఈ శతకానికి కావ్యత్వం సిద్ధించింది.

శివనామం జపించి, అది విశ్వగానంగా, బ్రహ్మగానంగా వ్యాపించగా (101ప), ఆ మహానంద ప్రవాహంలో తన హృదయనావలో ప్రయాణించి, ఆదిపురాణ దంపతలను దర్శించి తన్మయుడైన బుచ్చన్నకవి 1950 ఫిబ్రవరి 6వ శివసాయుజ్యం పొందారు. ఆయన తన పాదాలకర్పించిన మృత్యుంజయాన్ని ఆ శివయ్య మాత్రం మరచిపోలేదు. విశ్రాంత భూగర్భ శాస్త్రోపన్యాసకులు, సంస్కృత మహాకావ్య వ్యాఖ్యాత, ఆర్షవాఙ్మయ కేంద్రంగా భాసిస్తున్న **శ్రీ రావి మోహనరావుగారి** రసస్ఫోరకమైన మస్తిష్కంలో – తాను తియ్యతియ్యగా తిట్టించుకొన్న ఈ స్తవంలోని ఒక అనర్ఘపద్యరత్నాన్ని జారవిడిచాడు. ఆ పద్యరత్న కాంతులలో ఆయన హృదయమందిరం దివ్యమయమయింది. దాంతో ఈ గ్రంథం సర్వాంగసుందరంగా అచ్చయి ఇప్పుడు ఆంధ్ర వాఙ్మయాన్ని శివగానమయం చేస్తున్నది. నాకు ఈ నాల్గుముక్కలు వ్రాసే భాగ్యం కల్పించిన ఆ శివయ్యకు, ఈ మోహనయ్యకు నా ఏటికోళ్లు...

---

# శక్తి మంత్రం

**ఓం తేజో౽సి తేజో మయి దేహి । వీర్యంసి వీర్యమ్ మయి దేహి । బలమసి బలం మయి దేహి । ఓజో౽సి ఓజో మయి దేహి । మన్యురసి మన్యుం మయి దేహి । సహో౽సి సహో మయి దేహి ॥ ఓం ॥**

తేజః = ఆత్మశక్తిగా; అసి = ఉంటున్నావు; మయి = నాకు; తేజః = ఆత్మశక్తిని; దేహి = ప్రసాదించు; వీర్యమ్ = సంయమశక్తి; బలమ్ = శరీరశక్తి; ఓజః = దివ్యశక్తి; మన్యుః = ధైర్యం; సహః = సహనం.

# శివ మంత్రం

**ఓం నమః శంభవే చ మయోభవే చ నమః శంకరాయ చ**
**మయస్కరాయ చ నమః శివాయ చ శివతరాయ చ ॥ ఓం ॥**

శంభవే చ = ప్రపంచ ఆనందంగాను; మయోభవే చ = మోక్ష ఆనందంగాను; శంకరాయ చ = ప్రాపంచిక ఆనందాన్ని ఇచ్చేవాడూ; మయస్కరాయచ = మోక్ష ఆనందాన్ని ఇచ్చేవాడూ; శివాయ చ = మంగళ స్వరూపుడూ; శివతరాయ చ = శివమయం గావించేవాడూ; నమః = నమస్కారము.



# బగలాముఖీ మన్త్రధ్యానమ్

ॐ
నమో భగవత్యై పీతాంబరాయై
హ్రీం హ్రీం సుముఖి బగలే విశ్వమేతం
వశం కురు కురు స్వాహా।

శ్లో॥ శృణ్వతో బగలామన్త్రం యేన సంవదనం భవేత్ ॥

శ్లో॥ ప్రణవాన్తే నమో దత్వా భగవత్యై తతోఽపి చ ।
పీతామ్బరాయై చోద్ధృత్య త్రపాయుగ్మం తతః పరమ్ ॥

శ్లో॥ తతశ్చ సుముఖి ప్రోచ్య బగలే తదనంతరమ్ ।
విశ్వమేతం వశం ప్రోచ్య కురుయుగ్మం శిరోఽపి చ ॥

శ్లో॥ ఏకత్రింశాక్షరో మన్త్రో జగద్వశ్యకరః ప్రియే ।
నిగద్యమానమస్యాస్త్వం ధ్యానమప్యవధారయ ॥

✦ ✦ ✦

శ్లో॥ గౌరీ పీతామ్బరధరా పీతస్రగనులేపనా ।
రత్నసింహాసనగతా రత్నాలఙ్కారభూషితా ॥

శ్లో॥ త్రినేత్రా చన్ద్రశకలవిరాజితలలాటికా ।
సౌన్దర్యసారవిజితజగల్లావణ్యపుఞ్జికా ॥

శ్లో॥ చతుర్భుజాఙ్కుశవరే దక్షిణే బిభ్రతీ కరే ।
తథైవ ధారయన్తీ చ వామే దీపాభయే కరే ॥

శ్లో॥ ధ్యాతవ్యా భక్తిభావేన వశ్యకర్మ చికీర్షతా ।

– మహాకాలసంహితా, కామకలాకాలీఖండః – అష్టమః పటలః

✦ ✦ ✦

(1. శిరోబీజమ్ = స్వాహా, 2. త్రపా = హ్రీం)



# కమలా స్తోత్రం (దశమహావిద్య)

శ్లో॥ ఓంకారరూపిణీ దేవి విశుద్ధసత్త్వరూపిణీ ।
దేవానాం జననీ త్వం హి ప్రసన్నా భవ సుందరి ॥ 1

శ్లో॥ త్వన్మాత్రం చైవ భూతాని తవ వక్షఃస్థలం స్మృతమ్ ।
త్వమేవ వేదగమ్యా తు ప్రసన్నా భవ సుందరి ॥ 2

శ్లో॥ దేవదానవగంధర్వయక్షరాక్షసకిన్నరః ।
స్తూయసే త్వం సదా లక్ష్మి ప్రసన్నా భవ సుందరి ॥ 3

శ్లో॥ లోకాతీతా ద్వైతాతీతా సమస్తభూతవేష్టితా ।
విద్వజ్జనకీర్తితా చ ప్రసన్నా భవ సుందరి ॥ 4

శ్లో॥ పరిపూర్ణా సదా లక్ష్మి త్రాత్రీ తు శరణార్థిషు ।
విశ్వాద్యా విశ్వకర్త్రీ చ ప్రసన్నా భవ సుందరి ॥ 5

శ్లో॥ బ్రహ్మరూపా చ సావిత్రీ త్వద్దీప్త్యా భాసతే జగత్ ।
విశ్వరూపా వరేణ్యా చ ప్రసన్నా భవ సుందరి ॥ 6

శ్లో॥ క్షిత్యప్తేజోమరుద్వ్యోమపంచభూతస్వరూపిణీ ।
బంధాదేః కారణం త్వం హి ప్రసన్నా భవ సుందరి ॥ 7

శ్లో॥ మహేశే త్వం హైమవతి కమలే కేశవేఽపి చ ।
బ్రహ్మణః ప్రేయసీ త్వం హి ప్రసన్నా భవ సుందరి ॥ 8

శ్లో॥ చండీ దుర్గా కాళికా చ కౌశికీ సిద్ధిరూపిణీ ।
యోగినీ యోగగమ్యా చ ప్రసన్నా భవ సుందరి ॥ 9

శ్లో॥ బాల్యే చ బాలికా త్వం హి యౌవనే యువతీతి చ ।
స్థవిరే వృద్ధరూపా చ ప్రసన్నా భవ సుందరి ॥ 10

శ్లో॥ గుణాతీతా గుణమయీ చాద్యా విద్యా సనాతనీ ।
మహత్తత్త్వాదిసంయుక్తా ప్రసన్నా భవ సుందరి ॥ 11

శ్లో॥ తపస్వినీ తపఃసిద్ధిః స్వర్గసిద్ధిస్తదర్థిషు ।
చిన్మయీ ప్రకృతిస్త్వం తు ప్రసన్నా భవ సుందరి ॥ 12

శ్లో॥ త్వమాదిర్జగతాం దేవి త్వమేవ స్థితికారణమ్ ।
త్వమంతే నిధనస్థానం స్వేచ్ఛాచారా త్వమేవ హి ॥ 13

శ్లో॥ చరాచరాణాం భూతానాం బహిరంతస్త్వమేవ హి ।
వ్యాప్యవ్యాపకరూపేణ భాసి త్వం భక్తవత్సలే ॥ 14

శ్లో॥ త్వన్మాయయా హృతజ్ఞానా నష్టాత్మానో విచేతసః ।
గతాగతం ప్రపద్యంతే పాపపుణ్యవశాస్సదా ॥ 15

శ్లో॥ తావత్సత్యం జగద్భాతి శుక్తికారజతం యథా ।
యావన్న జ్ఞాయతే జ్ఞానం చేతసా నాన్యగామినీ ॥ 16

శ్లో॥ అజ్ఞానాత్తు సదా యుక్తః పుత్త్రదారగృహాదిషు ।
రమంతే విషయాన్సర్వానంతే దుఃఖప్రదం ధ్రువమ్ ॥ 17

శ్లో॥ త్వదాజ్ఞయా తు దేవేశి గగనే సూర్యమండలమ్ ।
చంద్రశ్చ భ్రమతే నిత్యం ప్రసన్నా భవ సుందరి ॥ 18

శ్లో॥ బ్రహ్మేశవిష్ణుజననీ బ్రహ్మాఖ్యా బ్రహ్మసంశ్రయా ।
వ్యక్తాఽవ్యక్తా చ దేవేశి ప్రసన్నా భవ సుందరి ॥ 19

శ్లో॥ అచలా సర్వగా త్వం హి మాయాతీతా మహేశ్వరి ।
శివాత్మా శాశ్వతా నిత్యా ప్రసన్నా భవ సుందరి ॥ 20

శ్లో॥ సర్వకార్యనియంత్రీ చ సర్వభూతేశ్వరీ శుభా ।
అనంతా నిష్కలా త్వం హి ప్రసన్నా భవ సుందరి ॥ 21

శ్లో॥ సర్వేశ్వరీ సర్వవంద్యా చాచింత్యా పరమాత్మికా ।
భుక్తిముక్తిప్రదా త్వం హి ప్రసన్నా భవ సుందరి ॥ 22

శ్లో॥ బ్రహ్మాణీ బ్రహ్మలోకే త్వం వైకుంఠే సర్వమంగళా ।
ఇంద్రాణీ చామరావత్యామంబికా వరుణాలయే ॥ 23

శ్లో॥ యమాలయే కాలరూపా కుబేరభవనే శుభా ।
మహానందాగ్నికోణే చ ప్రసన్నా భవ సుందరి ॥ 24

శ్లో॥ నైరృత్యాం రక్తదంతా త్వం వాయవ్యాం మృగవాహినీ ।
పాతాళే వైష్ణవీరూపా ప్రసన్నా భవ సుందరి ॥ 25

శ్లో॥ సురసా త్వం మణిద్వీపే చైశాన్యాం శూలధారిణీ ।
భద్రకాళీ చ లంకాయాం ప్రసన్నా భవ సుందరి ॥ 26

శ్లో॥ రామేశ్వరీ సేతుబంధే సింహలే దేవమోహినీ ।
విమలా త్వం చ శ్రీక్షేత్రే ప్రసన్నా భవ సుందరి ॥ 27

శ్లో॥ కాళికా త్వం కాళిఘాటే కామాఖ్యా నీలపర్వతే ।
విరజా చౌడ్రదేశే త్వం ప్రసన్నా భవ సుందరి ॥ 28

శ్లో॥ వారాణస్యామన్నపూర్ణా చాయోధ్యాయాం మహేశ్వరీ ।
గయాసురీ గయాధామ్ని ప్రసన్నా భవ సుందరి ॥ 29

శ్లో॥ భద్రకాళీ కురుక్షేత్రే త్వం చ కాత్యాయనీ వ్రజే ।
మహామాయా ద్వారకాయాం ప్రసన్నా భవ సుందరి ॥ 30

శ్లో॥ క్షుధా చ సర్వజీవానాం వేలా త్వం సాగరస్య హి ।
మహేశీ మథురాయాం చ ప్రసన్నా భవ సుందరి ॥ 31

శ్లో॥ రామస్య జానకీ త్వం చ శివస్య మనమోహినీ ।
దక్షస్య దుహితా చైవ ప్రసన్నా భవ సుందరి ॥ 32

శ్లో॥ విష్ణుభక్తిప్రదా త్వం చ కంసాసురవినాశినీ ।
రావణనాశినీ చైవ ప్రసన్నా భవ సుందరి ॥ 33

ఫలశ్రుతి : శ్లో॥ లక్ష్మీస్తోత్రమిదం పుణ్యం యః పఠేద్భక్తిసంయుతః ।
సర్వజ్వరభయం నశ్యేత్సర్వవ్యాధినివారణమ్ ॥

శ్లో॥ ఇదం స్తోత్రం మహాపుణ్యమాపదుద్ధారకారణమ్ ।
త్రిసంధ్యమేకసంధ్యం వా యః పఠేత్సతతం నరః ॥

శ్లో॥ ముచ్యతే సర్వపాపేభ్యో సంకటేభ్యస్తథైవ హి ।
ముచ్యతే నాత్ర సందేహో భువి స్వర్గే రసాతలే ॥

శ్లో॥ సమస్తం చ తథా చైకం యః పఠేద్భక్తితత్పరః ।
స సర్వదుస్తరం తీర్త్వా లభతే పరమాం గతిమ్ ॥

శ్లో॥ సుఖదం మోక్షదం స్తోత్రం యః పఠేద్భక్తిసంయుతః ।
స హై కోటితీర్థఫలం ప్రాప్నోతి నాత్ర సంశయః ॥

శ్లో॥ ఏకా దేవీ తు కమలా యస్మింస్తుష్టా భవేత్సదా ।
తస్యాఽసాధ్యం తు దేవేశి నాస్తి కించిజ్జగత్త్రయే ॥

శ్లో॥ పఠనాదపి స్తోత్రస్య కిం న సిద్ధ్యతి భూతలే ।
తస్మాత్స్తోత్రవరం ప్రోక్తం సత్యం త్వం బ్రూహి పార్వతి ॥

॥ ఇతి శ్రీకమలా స్తోత్రం సంపూర్ణమ్ ॥

(హై = సంబోధనమ్, ఓయి)

✦ (అక్షరదోషరహితం) ✦



# వారాహ్యా మన్త్రధ్యానమ్




ఓం
నమో భగవత్యై వారాహరూపిణ్యై
చతుర్దశభువనాధిపాయై వారాహ్యై భూపతిత్వం మే దేహి
దాపయ స్వాహా ।

ధరిత్రీధరణే ధీరామాకర్ణయ ఇతః పరమ్ । 564

తారం నమః సమాభాష్య భగవత్యై తతో వదేత్ ।
వారాహ ఇతి చోద్ధృత్య రూపిణ్యై తదనన్తరమ్ ॥ 565

తతశ్చతుర్దశ ప్రోచ్య కీర్తయేద్ భువనా తతః ।
ధిపాయై సమనూద్ధృత్య వారాహ్యై తదనన్తరమ్ ॥ 566

భూపతిత్వం తతః ప్రోచ్య మే దేహి తదనన్తరమ్ ।
దాపయానన్తరం వహ్నిజాయాన్తో మనురీరితః ॥ 567

ఘననీలఘనాకారాం ఖర్వస్థూలకలేవరామ్ ।
హస్తమాత్రవినిష్క్రాన్తప్రచలత్పోత్రరన్ధ్రవత్ ॥ 568

వామభాగేఽక్షివదనం ధారయన్తీం ద్విలోచనామ్ ।
అష్టమీచన్ద్రఖణ్డాభదంష్ట్రాయుగవిరాజితామ్ ॥ 569

కోపాదాలోలరసనాం విస్తారివివృతాననామ్ ।
కల్పాన్తరవిసఙ్కాశాం పూరయన్తీం జగత్ త్విషా ॥ 570

భీమదంష్ట్రాట్టహాసాం చ రక్తాక్షీం రక్తవాససమ్ ।
కృపాణాకారరోమాలీపరిపూర్ణకలేవరామ్ ॥ 571

ఖూదారరూపధాత్రీం ప సఞ్చరన్తీం విహాయసి ।
సటాధూననవిత్రస్తప్రపలాయితఖేచరామ్ ॥ 572

సర్వాలఙ్కారసంయుక్తాం ఘుర్ఘురారావకారిణీమ్ ।
అబ్జచాపాఙ్కుశాన్ పాశం వామగే బిభ్రతీం కరే ॥ 573

చక్రం బాణం గదాం శఙ్ఖం దధాతీం దక్షిణే కరే ।
దూర్వాదలశ్యామలయా ధరణ్యా సేవితాం సదా ॥ 574

వారాహీం చిన్తయేదిత్థం సర్వకామఫలప్రదామ్ ।

(వహ్నిజాయా = స్వాహా) – మహాకాలసంహితా

# శ్రీః



# శ్రీకృష్ణసహస్రనామస్తోత్రమ్ సాత్వతతన్త్రే

శ్రీనారద ఉవాచ ।

శ్లో॥ కథితం మే త్వయా దేవ హరినామానుకీర్తనమ్ ।
పాపాపహం మహాసౌఖ్యం భగవద్భక్తికారణమ్ ॥ 1

శ్లో॥ తత్రాహం యాని నామాని కీర్తయామి సురోత్తమ ।
తాన్యహం జ్ఞాతుమిచ్ఛామి సాకల్యేన కుతూహలాత్ ॥ 2

శ్రీశివ ఉవాచ ।

శ్లో॥ భూమ్యమ్బుతేజసాం యే వై పరమాణూనపి ద్విజ ।
శక్యన్తే గణితుం భూయో జన్మభిర్న హరేర్గుణాన్ ॥ 3

శ్లో॥ తథాపి ముఖ్యం వక్ష్యామి శ్రీవిష్ణోః పరమాద్భుతమ్ ।
నామ్నాం సహస్రం పార్వత్యై యదిహోక్తం కృపాలునా ॥ 4

శ్లో॥ సమాధినిష్ఠం మాం దృష్ట్వా పార్వతీ వరవర్ణినీ ।
అపృచ్ఛత్పరమం దేవం భగవన్తం జగద్గురుమ్ ॥ 5

శ్లో॥ తదా తస్యై మయా ప్రోక్తో మత్పరో జగదీశ్వరః ।
నామ్నాం సహస్రం చ తథా గుణకర్మానుసారతః ॥ 6

శ్లో॥ తదహం తేఽభివక్ష్యామి మహాభాగవతో భవాన్ ।
యస్యైకస్మరణేనైవ పుమాన్ సిద్ధిమవాప్నుయాత్ ॥ 7

శ్లో॥ ఉద్యన్నవీనజలదాభమకుణ్ఠధిష్ణ్యం
విద్యోతితానలమనోహరపీతవాసమ్ ।
భాస్వన్మయూఖముకుటాఙ్గదహారయుక్తం
కాఞ్చీకలాపవలయాఙ్గులిభిర్విభాతమ్ ॥ 8

శ్లో॥ బ్రహ్మాదిదేవగణవన్దితపాదపద్మం శ్రీసేవితం సకలసున్దరసంనివేశమ్ ।
గోగోపవనితామునివృన్దజుష్టం కృష్ణం పురాణపురుషం మనసా స్మరామి ॥ 9

శ్లో॥ ఓం నమో వాసుదేవాయ కృష్ణాయ పరమాత్మనే ।
ప్రణతక్లేశసంహర్త్రే పరమానన్దదాయినే ॥ 10

శ్లో॥ ఓం శ్రీకృష్ణః శ్రీపతిః శ్రీమాన్ శ్రీధరః శ్రీసుఖాశ్రయః ।
శ్రీదాతా శ్రీకరః శ్రీశః శ్రీసేవ్యః శ్రీవిభావనః ॥ 11

శ్లో॥ పరమాత్మా పరం బ్రహ్మ పరేశః పరమేశ్వరః ।
పరానన్దః పరం ధామ పరమానన్దదాయకః ॥ 12

శ్లో॥ నిరాలమ్బో నిర్వికారో నిర్లేపో నిరవగ్రహః ।
నిత్యానన్దో నిత్యముక్తో నిరీహో నిస్పృహప్రియః ॥ 13

శ్లో॥ ప్రియంవదః ప్రియకరః ప్రియదః ప్రియసజ్జనః ।
ప్రియానుగః ప్రియాలమ్బీ ప్రియకీర్తిః ప్రియాత్ప్రియః ॥ 14

శ్లో॥ మహాత్యాగీ మహాభోగీ మహాయోగీ మహాతపాః ।
మహాత్మా మహతాం శ్రేష్ఠో మహాలోకపతిర్మహాన్ ॥ 15

శ్లో॥ సిద్ధార్థః సిద్ధసఙ్కల్పః సిద్ధిదః సిద్ధసాధనః ।
సిద్ధేశః సిద్ధమార్గాగ్రః సిద్ధలోకైకపాలకః ॥ 16

శ్లో॥ ఇష్టో విశిష్టః శిష్టేష్టో మహిష్ఠో జిష్ణురుత్తమః ।
జ్యేష్ఠః శ్రేష్ఠశ్చ సర్వేష్టో విష్ణుర్భ్రాజిష్ణురవ్యయః ॥ 17

శ్లో॥ విభుః శమ్భుః ప్రభుర్భూమా స్వభూః స్వానన్దమూర్తిమాన్ ।
ప్రీతిమాన్ ప్రీతిదాతా చ ప్రీతిదః ప్రీతివర్ధనః ॥ 18

శ్లో॥ యోగేశ్వరో యోగగమ్యో యోగీశో యోగపారగః ।
యోగదాతా యోగపతిర్యోగసిద్ధివిధాయకః ॥ 19

శ్లో॥ సత్యవ్రతః సత్యపరః త్రిసత్యః సత్యకారణః ।
సత్యాశ్రయః సత్యహరః సత్పాలిః సత్యవర్ధనః ॥ 20

శ్లో॥ సర్వానన్దః సర్వహరః సర్వగః సర్వవశ్యకృత్ ।
సర్వపాతా సర్వసుఖః సర్వశ్రుతిగణార్ణవః ॥ 21

శ్లో॥ జనార్దనో జగన్నాథో జగత్త్రాతా జగత్పితా ।
జగత్కర్తా జగద్ధర్తా జగదానన్దమూర్తిమాన్ ॥ 22

శ్లో॥ ధరాపతిర్లోకపతిః స్వర్పతిర్జగతామ్పతిః ।
విద్యాపతిర్విత్తపతిః సత్పతిః కమలాపతిః ॥ 23

శ్లో॥ చతురాత్మా చతుర్బాహుశ్చతుర్వర్గఫలప్రదః ।
చతుర్వ్యూహశ్చతుర్ధామా చతుర్యుగవిధాయకః ॥ 24

శ్లో॥ ఆదిదేవో దేవదేవో దేవేశో దేవధారణః ।
దేవకృద్దేవభృద్దేవో దేవేడితపదామ్బుజః ॥ 25

శ్లో॥ విశ్వేశ్వరో విశ్వరూపీ విశ్వాత్మా విశ్వతోముఖః ।
విశ్వసూర్విశ్వఫలదో విశ్వగో విశ్వనాయకః ॥ 26

శ్లో॥ భూతకృద్భూతభృద్భావో భూతాత్మా భూతభావనః ।
భూతిదో భూతివిస్తారో విభూతిర్భూతిపాలకః ॥ 27

శ్లో॥ నారాయణో నారశాయీ నారసూర్నారజీవనః ।
నారైకఫలదో నారముక్తిదో నారనాయకః ॥ 28

శ్లో॥ సహస్రరూపః సాహస్రనామా సాహస్రవిగ్రహః ।
సహస్రశీర్షా సాహస్రపాదాక్షిభుజశీర్షవాన్ ॥ 29

శ్లో॥ పద్మనాభః పద్మగర్భః పద్మీ పద్మనిభేక్షణః ।
పద్మశాయీ పద్మమాలీ పద్మాఙ్కితపదద్వయః ॥ 30

శ్లో॥ వీర్యవాన్ స్థైర్యవాన్ వాగ్మీ శౌర్యవాన్ ధైర్యవాన్ క్షమీ ।
ధీమాన్ ధర్మపరో భోగీ భగవాన్ భయనాశనః ॥ 31

శ్లో॥ జయన్తో విజయో జేతా జయదో జయవర్ధనః ।
అమానీ మానదో మాన్యో మహిమావాన్మహాబలః ॥ 32

శ్లో॥ సన్తుష్టస్తోషదో దాతా దమనో దీనవత్సలః ।
జ్ఞానీ యశస్వాన్ ధృతిమాన్ సహ ఓజోబలాశ్రయః ॥ 33

శ్లో॥ హయగ్రీవో మహాతేజా మహార్ణవవినోదకృత్ ।
మధుకైటభవిధ్వంసీ వేదకృద్వేదపాలకః ॥ 34

శ్లో॥ సనత్కుమారః సనకః సనన్దశ్చ సనాతనః ।
అఖణ్డబ్రహ్మవ్రతవానాత్మా యోగవివేచకః ॥ 35

శ్లో॥ శ్రీనారదో దేవఋషిః కర్మాకర్మప్రవర్తకః ।
సాత్వతాగమకృల్లోకహితాహితప్రసూచకః ॥ 36

శ్లో॥ ఆదికాలో యజ్ఞతత్త్వం ధాతృనాసాపుటోద్భవః ।
దన్తాగ్రన్యస్తభూగోలో హిరణ్యాక్షబలాన్తకః ॥ 37

శ్లో॥ పృథ్వీపతిః శీఘ్రవేగో రోమాన్తర్గతసాగరః ।
శ్వాసావధూతహేమాద్రిః ప్రజాపతిపతిస్తుతః ॥ 38

శ్లో॥ అనన్తో ధరణీభర్తా పాతాలతలవాసకృత్ ।
కామాగ్నిజవనో నాగరాజరాజో మహాద్యుతిః ॥ 39

శ్లో॥ మహాకూర్మో విశ్వకాయః శేషభుక్సర్వపాలకః ।
లోకపితృగణాధీశః పితృస్తుతమహాపదః ॥ 40

శ్లో॥ కృపామయః స్వయం వ్యక్తిర్ధ్రువప్రీతివివర్ధనః ।
ధ్రువస్తుతపదో విష్ణులోకదో లోకపూజితః ॥ 41

శ్లో॥ శుక్లః కర్దమసన్తప్తస్తపస్తోషితమానసః ।
మనోఽభీష్టప్రదో హర్షబిన్ద్వఞ్చితసరోవరః ॥ 42

శ్లో॥ యజ్ఞః సురగణాధీశో దైత్యదానవఘాతకః ।
మనుత్రాతా లోకపాలో లోకపాలకజన్మకృత్ ॥ 43

శ్లో॥ కపిలాఖ్యః సాఙ్ఖ్యపాతా కర్దమాఙ్గసముద్భవః ।
సర్వసిద్ధగణాధీశో దేవహూతిగతిప్రదః ॥ 44

శ్లో॥ దత్తోఽత్రితనయో యోగీ యోగమార్గప్రదర్శకః ।
అనసూయానన్దకరః సర్వయోగిజనస్తుతః ॥ 45

శ్లో॥ నారాయణో నరఋషిర్ధర్మపుత్రో మహామనాః ।
మహేశశూలదమనో మహేశైకవరప్రదః ॥ 46

శ్లో॥ ఆకల్పాన్తతపోధీరో మన్మథాదిమదాపహః ।
ఊర్వశీసృగ్జితానఙ్గో మార్కణ్డేయప్రియప్రదః ॥ 47

శ్లో॥ ఋషభో నాభిసుఖదో మేరుదేవీప్రియాత్మజః ।
యోగిరాజద్విజస్రష్టా యోగచర్యాప్రదర్శకః ॥ 48

శ్లో॥ అష్టబాహుర్దక్షయజ్ఞపావనోఽఖిలసత్కృతః ।
దక్షేశద్వేషశమనో దక్షజ్ఞానప్రదాయకః ॥ 49

శ్లో॥ ప్రియవ్రతకులోత్పన్నో గయనామా మహాయశాః ।
ఉదారకర్మా బహువిన్మహాగుణగణార్ణవః ॥ 50

శ్లో॥ హంసరూపీ తత్త్వవక్తా గుణాగుణవివేచకః ।
ధాతృలజ్జాప్రశమనో బ్రహ్మచారిజనప్రియః ॥ 51

శ్లో॥ వైశ్యః పృథుః పృథ్విదోగ్ధా సర్వజీవనదోహకృత్ ।
ఆదిరాజో జనావాసకారకో భూసమీకరః ॥ 52

శ్లో॥ ప్రచేతోఽభిష్టుతపదః శాన్తమూర్తిః సుదర్శనః ।
దివారాత్రిగణాధీశః కేతుమానజనాశ్రయః ॥ 53

శ్లో॥ శ్రీకామదేవః కమలాకామకేలివినోదకృత్ ।
స్వపాదరతిదోఽభీష్టసుఖదో దుఃఖనాశనః ॥ 54

శ్లో॥ విభుర్ధర్మభృతాం శ్రేష్ఠో వేదశీర్షో ద్విజాత్మజః ।
అష్టాశీతిసహస్రాణాం మునీనాముపదేశదః ॥ 55

శ్లో॥ సత్యసేనో యక్షరక్షోదహనో దీనపాలకః ।
ఇన్ద్రమిత్రః సురారిఘ్నః సూనృతాధర్మనన్దనః ॥ 56

శ్లో॥ హరిర్గజవరత్రాతా గ్రాహపాశవినాశకః ।
త్రికూటాద్రివనశ్లాఘీ సర్వలోకహితైషణః ॥ 57

శ్లో॥ వైకుణ్ఠశుభ్రాసుఖదో వికుణ్ఠాసున్దరీసుతః ।
రమాప్రియకరః శ్రీమాన్నిజలోకప్రదర్శకః ॥ 58

శ్లో॥ విప్రశాపపరీఖిన్ననిర్జరార్తినివారణః ।
దుగ్ధాబ్ధిమథనో విప్రో విరాజతనయోఽజితః ॥ 59

శ్లో॥ మన్దారాద్రిధరః కూర్మో దేవదానవశర్మకృత్ ।
జమ్బూద్వీపసమః స్రష్టా పీయూషోత్పత్తికారణమ్ ॥ 60

శ్లో॥ ధన్వన్తరీ రుగ్ఘ్నమనోఽమృతధృక్కృశాన్తకః ।
ఆయుర్వేదకరో వైద్యరాజో విద్యాప్రదాయకః ॥ 61

శ్లో॥ దేవాభయకరో దైత్యమోహినీ కామరూపిణీ ।
గీర్వాణామృతపో దుష్టదైత్యదానవవఞ్చకః ॥ 62

శ్లో॥ మహామత్స్యో మహాకాయః శల్కాన్తర్గతసాగరః ।
వేదారిదైత్యదమనో వ్రీహిబీజసురక్షకః ॥ 63

శ్లో॥ పుచ్ఛాఘాతభ్రమత్సిన్ధుః సత్యవ్రతప్రియప్రదః ।
భక్తసత్యవ్రతత్రాతా యోగత్రయప్రదర్శకః ॥ 64

శ్లో॥ నరసింహో లోకజిహ్వః శఙ్కుకర్ణో నఖాయుధః ।
సటావధూతజలదో దన్తద్యుతిజితప్రభః ॥ 65

శ్లో॥ హిరణ్యకశిపుధ్వంసీ బహుదానవదర్పహా ।
ప్రహ్లాదస్తుతపాదాబ్జో భక్తసంసారతాపహా ॥ 66

శ్లో॥ బ్రహ్మేన్ద్రరుద్రభీతిఘ్నో దేవకార్యప్రసాధకః ।
జ్వలజ్జ్వలనసఙ్కాశః సర్వభీతివినాశకః ॥ 67

శ్లో॥ మహాకలుషవిధ్వంసీ సర్వకామవరప్రదః ।
కాలవిక్రమసంహర్తా గ్రహపీడావినాశకః ॥ 68

శ్లో॥ సర్వవ్యాధిప్రశమనః ప్రచణ్డరిపుదణ్డకృత్ ।
ఉగ్రభైరవసన్త్రస్తహరార్తివినివారకః ॥ 69

శ్లో॥ బ్రహ్మచర్మావృతశిరాః శివశీర్షైకనూపురః ।
ద్వాదశాదిత్యశీర్షైకమణిర్దిక్పాలభూషణః ॥ 70

శ్లో॥ వామనోఽదితిభీతిఘ్నో ద్విజాతిగణమణ్డనః ।
త్రిపదవ్యాజయాఞ్చాప్తబలిత్రైలోక్యసమ్పదః ॥ 71

శ్లో॥ పన్నగక్షతబ్రహ్మాణ్డకటాహోఽమితవిక్రమః ।
స్వర్ధునీతీర్థజననో బ్రహ్మపూజ్యో భయాపహః ॥ 72

శ్లో॥ స్వాఙ్ఘ్రివారిహతాఘౌఘో విశ్వరూపైకదర్శనః ।
బలిప్రియకరో భక్తస్వర్గదోగ్ధా గదాధరః ॥ 73

శ్లో॥ జామదగ్న్యో మహావీర్యః పరశుభృత్కార్తవీర్యజిత్ ।
సహస్రార్జునసంహర్తా సర్వక్షత్రకులాన్తకః ॥ 74

శ్లో॥ నిఃక్షత్రపృథ్వీకరణో వీరజిద్విప్రరాజ్యదః ।
ద్రోణాస్త్రవేదప్రవదో మహేశగురుకీర్తిదః ॥ 75

శ్లో॥ సూర్యవంశాబ్జతరణిః శ్రీమద్దశరథాత్మజః ।
శ్రీరామో రామచన్ద్రశ్చ రామభద్రోఽమితప్రభః ॥ 76

శ్లో॥ నీలవర్ణప్రతీకాశః కౌసల్యాప్రాణజీవనః ।
పద్మనేత్రః పద్మవక్త్రః పద్మాఙ్కితపదామ్బుజః ॥ 77

శ్లో॥ ప్రలమ్బబాహుశ్చార్వఙ్గో రత్నాభరణభూషితః ।
దివ్యామ్బరో దివ్యధనుర్దిష్టదివ్యాస్త్రపారగః ॥ 78

శ్లో॥ నిస్త్రింశపాణిర్వీరేశోఽపరిమేయపరాక్రమః ।
విశ్వామిత్రగురుర్ధన్వీ ధనుర్వేదవిదుత్తమః ॥ 79

శ్లో॥ ఋజుమార్గనిమిత్తేషు సఙ్ఘతాడితతాడకః ।
సుబాహుర్బాహువీర్యాఢ్యబహురాక్షసఘాతకః ॥ 80

శ్లో॥ ప్రాప్తచణ్డీశదోర్దణ్డచణ్డకోదణ్డఖణ్డనః ।
జనకానన్దజనకో జానకీప్రియనాయకః ॥ 81

శ్లో॥ అరాతికులదర్పఘ్నో ధ్వస్తభార్గవవిక్రమః ।
పితృవాక్యత్యక్తరాజ్యశ్రీవనవాసకృతోత్సవః ॥ 82

శ్లో॥ విరాధరాధదమనశ్చిత్రకూటాద్రిమన్దిరః ।
ద్విజశాపసముచ్ఛన్నదణ్డకారణ్యకర్మకృత్ ॥ 83

శ్లో॥ చతుర్దశసహస్రోగ్రరాక్షసఘ్నః ఖరాన్తకః ।
త్రిశిరఃప్రాణశమనో దుష్టదూషణదూషణః ॥ 84

శ్లో॥ ఛద్మమారీచమథనో జానకీవిరహార్తిహృత్ ।
జటాయుషః క్రియాకారీ కబన్ధవధకోవిదః ॥ 85

శ్లో॥ ఋష్యమూకగుహావాసీ కపిపఞ్చమసఖ్యకృత్ ।
వామపాదాగ్రనిక్షిప్తదున్దుభ్యస్థిబృహద్గిరిః ॥ 86

శ్లో॥ సకణ్టకారదుర్భేదసప్తతాలప్రభేదకః ।
కిష్కిన్ధాధిపవాలిఘ్నో మిత్రసుగ్రీవరాజ్యదః ॥ 87

శ్లో॥ ఆఞ్జనేయస్వలాఙ్గూలదగ్ధలఙ్కామహోదయః ।
సీతావిరహవిస్పష్టరోషక్షోభితసాగరః ॥ 88

శ్లో॥ గిరికూటసముత్క్షేపసముద్రాద్భుతసేతుకృత్ ।
పాదప్రహారసన్త్రస్తవిభీషణభయాపహః ॥ 89

శ్లో॥ అఙ్గదోక్తిపరిక్లిష్టఘోరరావణసైన్యజిత్ ।
నికుమ్భకుమ్భధూమ్రాక్షకుమ్భకర్ణాదివీరహా ॥ 90

శ్లో॥ కైలాససహనోన్మత్తదశాననశిరోహరః ।
అగ్నిసంస్పర్శసంశుద్ధసీతాసంవరణోత్సుకః ॥ 91

శ్లో॥ కపిరాక్షసరాజాఙ్గప్రాప్తరాజ్యనిజాశ్రయః ।
అయోధ్యాధిపతిః సర్వరాజన్యగణశేఖరః ॥ 92

శ్లో॥ అచిన్త్యకర్మా నృపతిః ప్రాప్తసింహాసనోదయః ।
దుష్టదుర్బుద్ధిదలనో దీనహీనైకపాలకః ॥ 93

శ్లో॥ సర్వసమ్పత్తిజననస్తిర్యఙ్న్యాయవివేచకః ।
శూద్రఘోరతపఃప్లుష్టద్విజపుత్రైకజీవనః ॥ 94

శ్లో॥ దుష్టవాక్క్లిష్టహృదయః సీతానిర్వాసకారకః ।
తురఙ్గమేధక్రతుయాట్ శ్రీమత్కుశలవాత్మజః ॥ 95

శ్లో॥ సత్యార్థత్యక్తసౌమిత్రిః సూన్నీతజనసఙ్గ్రహః ।
సత్కర్ణపూరసత్కీర్తిః కీర్త్యాలోకాఘనాశనః ॥ 96

శ్లో॥ భరతో జ్యేష్ఠపాదాబ్జరతిత్యక్తనృపాసనః ।
సర్వసద్గుణసమ్పన్నః కోటిగన్ధర్వనాశకః ॥ 97

శ్లో॥ లక్ష్మణో జ్యేష్ఠనిరతో దేవవైరిగణాన్తకః ।
ఇన్ద్రజిత్ప్రాణశమనో భ్రాతృమాన్ త్యక్తవిగ్రహః ॥ 98

శ్లో॥ శత్రుఘ్నోఽమిత్రశమనో లవణాన్తకకారకః ।
ఆర్యభ్రాతృజనశ్లాఘ్యః సతాం శ్లాఘ్యగుణాకరః ॥ 99

శ్లో॥ వటపత్త్రపుటస్థాయీ శ్రీముకున్దోఽఖిలాశ్రయః ।
తనూదరార్పితజగన్మృకణ్డతనయః ఖగః ॥ 100

శ్లో॥ ఆద్యో దేవగణాగ్రణ్యో మితస్తుతినతిప్రియః ।
వృత్రఘోరతనుత్రస్తదేవసన్మన్త్రసాధకః ॥ 101

శ్లో॥ బ్రహ్మణ్యో బ్రాహ్మణశ్లాఘీ బ్రహ్మణ్యజనవత్సలః ।
గోష్పదాప్పుగలద్గాత్రవాలఖిల్యజనాశ్రయః ॥ 102

శ్లో॥ దౌస్వస్తిర్యజ్వనాం శ్రేష్ఠో నృపవిస్మయకారకః ।
తురఙ్గమేధబహుకృద్వదాన్యగణశేఖరః ॥ 103

శ్లో॥ వాసవీతనయో వ్యాసో వేదశాఖానిరూపకః ।
పురాణభారతాచార్యః కలిలోకహితైషణః ॥ 104

శ్లో॥ రోహిణీహృదయానన్దో బలభద్రో బలాశ్రయః ।
సఙ్కర్షణః సీరపాణిః ముసలాస్త్రోఽమలద్యుతిః ॥ 105

శ్లో॥ శఙ్ఖకున్దేన్దుశ్వేతాఙ్గస్తాలభిద్ధేనుకాన్తకః ।
ముష్టికారిష్టహననో లాఙ్గలాకృష్టయామునః ॥ 106

శ్లో॥ ప్రలమ్బప్రాణహా రుక్మీమథనో ద్వివిదాన్తకః ।
రేవతీప్రీతిదో రామారమణో బల్వలాన్తకః ॥ 107

శ్లో॥ హస్తినాపురసఙ్కర్షీ కౌరవార్చితసత్పదః ।
బ్రహ్మాదిస్తుతపాదాబ్జో దేవయాదవపాలకః ॥ 108

శ్లో॥ మాయాపతిర్మహామాయో మహామాయానిదేశకృత్ ।
యదువంశాబ్ధిపూర్ణేన్దుర్బలదేవప్రియానుజః ॥ 109

శ్లో॥ నరాకృతిః పరం బ్రహ్మ పరిపూర్ణః పరోదయః ।
సర్వజ్ఞానాదిసమ్పూర్ణః పూర్ణానన్దః పురాతనః ॥ 110

శ్లో॥ పీతామ్బరః పీతనిద్రః పీతవేశ్మమహాతపాః ।
మహోరస్కో మహాబాహుర్మహార్హమణికుణ్డలః ॥ 111

శ్లో॥ లసద్గణ్డస్థలీహైమమౌలిమాలావిభూషితః ।
సుచారుకర్ణః సుభ్రాజన్మకరాకృతికుణ్డలః ॥ 112

శ్లో॥ నీలకుఞ్చితసుస్నిగ్ధకున్తలః కౌముదీముఖః ।
సునాసః కున్దదశనో లసత్కోకనదాధరః ॥ 113

శ్లో॥ సుమన్దహాసో రుచిరభ్రూమణ్డలవిలోకనః ।
కమ్బుకణ్ఠో బృహద్బ్రహ్మ వలయాఙ్గదభూషణః ॥ 114

శ్లో॥ కౌస్తుభీ వనమాలీ చ శఙ్ఖచక్రగదాబ్జభృత్ ।
శ్రీవత్సలక్ష్మ్యా లక్ష్యాఙ్గః సర్వలక్షణలక్షణః ॥ 115

శ్లో॥ దలోదరో నిమ్ననాభిర్నిరవద్యో నిరాశ్రయః ।
నితమ్బబిమ్బవ్యాలమ్బికిఙ్కిణీకాఞ్చిమణ్డితః ॥ 116

శ్లో॥ సమజఙ్ఘాజానుయుగ్మః సుచారురుచిరాజితః ।
ధ్వజవజ్రాఙ్కుశామ్భోజశరాఙ్కితపదామ్బుజః ॥ 117

శ్లో॥ భక్తభ్రమరసఙ్ఘాతపీతపాదామ్బుజాసవః ।
నఖచన్ద్రమణిజ్యోత్స్నాప్రకాశితమహామనాః ॥ 118

శ్లో॥ పాదామ్బుజయుగన్యస్తలసన్మఞ్జీరరాజితః ।
స్వభక్తహృదయాకాశలసత్పఙ్కజవిస్తరః ॥ 119

శ్లో॥ సర్వప్రాణిజనానన్దో వసుదేవనుతిప్రియః ।
దేవకీనన్దనో లోకనన్దికృద్భక్తభీతిభిత్ ॥ 120

శ్లో॥ శేషానుగః శేషశాయీ యశోదానతిమానదః ।
నన్దానన్దకరో గోపగోపీగోకులబాన్ధవః ॥ 121

శ్లో॥ సర్వవ్రజజనానన్దీ భక్తవల్లభవల్లభః ।
వల్యవ్యఙ్గలసద్గాత్రో బల్లవీబాహుమధ్యగః ॥ 122

శ్లో॥ పీతపూతనికాస్తన్యః పూతనాప్రాణశోషణః ।
పూతనోరస్థలస్థాయీ పూతనామోక్షదాయకః ॥ 123

శ్లో॥ సమాగతజనానన్దీ శకటోచ్చాటకారకః ।
ప్రాప్తవిప్రాశిషోఽధీశో లఘిమాదిగుణాశ్రయః ॥ 124

శ్లో॥ తృణావర్తగలగ్రాహీ తృణావర్తనిషూదనః ।
జనన్యానన్దజనకో జనన్యా ముఖవిశ్వదృక్ ॥ 125

శ్లో॥ బాలక్రీడారతో బాలభాషాలీలాదినిర్వృతః ।
గోపగోపీప్రియకరో గీతనృత్యానుకారకః ॥ 126

శ్లో॥ నవనీతవిలిప్తాఙ్గో నవనీతలవప్రియః ।
నవనీతలవాహారీ నవనీతానుతస్కరః ॥ 127

శ్లో॥ దామోదరోఽర్జునోన్మూలో గోపైకమతికారకః ।
వృన్దావనవనక్రీడో నానాక్రీడావిశారదః ॥ 128

శ్లో॥ వత్సపుచ్ఛసమాకర్షీ వత్సాసురనిషూదనః ।
బకారిరఘసంహారీ బాలాద్యన్తకనాశనః ॥ 129

శ్లో॥ యమునానిలసఙ్జుష్టసుమృష్టపులినప్రియః ।
గోపాలబాలపూగస్థః స్నిగ్ధదధ్యన్నభోజనః ॥ 130

శ్లో॥ గోగోపగోపీప్రియకృద్ధనభృన్మోహఖణ్డనః ।
విధాతుర్మోహజనకోఽత్యద్భుతైశ్వర్యదర్శకః ॥ 131

శ్లో॥ విధిస్తుతపదామ్భోజో గోపదారకబుద్ధిభిత్ ।
కాలీయదర్పదలనో నాగనారీనుతిప్రియః ॥ 132

శ్లో॥ దావాగ్నిశమనః సర్వవ్రజభృజ్జనజీవనః ।
ముఞ్జారణ్యప్రవేశాప్తకృచ్ఛదావాగ్నిదారణః ॥ 133

శ్లో॥ సర్వకాలసుఖక్రీడో బర్హిబర్హావతంసకః ।
గోధుగ్వధూజనప్రాణో వేణువాద్యవిశారదః ॥ 134

శ్లో॥ గోపీపిధానారున్ధానో గోపీవ్రతవరప్రదః ।
విప్రదర్పప్రశమనో విప్రపత్నీప్రసాదదః ॥ 135

శ్లో॥ శతక్రతువరధ్వంసీ శక్రదర్పమదాపహః ।
ధృతగోవర్ధనగిరిర్వ్రజలోకాభయప్రదః ॥ 136

శ్లో॥ ఇన్ద్రకీర్తిలసత్కీర్తిర్గోవిన్దో గోకులోత్సవః ।
నన్దత్రాణకరో దేవజలేశేడితసత్కథః ॥ 137

శ్లో॥ వ్రజవాసిజనశ్లాఘ్యో నిజలోకప్రదర్శకః ।
సువేణునాదమదనోన్మత్తగోపీవినోదకృత్ ॥ 138

శ్లో॥ గోధుగ్వధూదర్పహరః స్వయశఃకీర్తనోత్సవః ।
వ్రజాఙ్గనాజనారామో వ్రజసున్దరివల్లభః ॥ 139

శ్లో॥ రాసక్రీడారతో రాసమహామణ్డలమణ్డనః ।
వృన్దావనవనామోదీ యమునాకూలకేలికృత్ ॥ 140

శ్లో॥ గోపికాగీతికాగీతః శఙ్ఖచూడశిరోహరః ।
మహాసర్పముఖగ్రస్తత్రస్తనన్దవిమోచకః ॥ 141

శ్లో॥ సుదర్శనార్చితపదో దుష్టారిష్టవినాశకః ।
కేశిద్వేషీ వ్యోమహన్తా శ్రుతనారదకీర్తనః ॥ 142

శ్లో॥ అక్రూరప్రియకృత్క్రూరరజకఘ్నః సువేశకృత్ ।
సుదామాదత్తమాలాఢ్యః కుబ్జాచన్దనచర్చితః ॥ 143

శ్లో॥ మథురాజనసంహర్షీ చణ్డకోదణ్డఖణ్డకృత్ ।
కంససైన్యసముచ్ఛేదీ వణిగ్విప్రగణార్చితః ॥ 144

శ్లో॥ మహాకువలయాపీడఘాతీ చాణూరమర్దనః –
రఙ్గశాలాగతాపౌరనరనారీకృతోత్సవః ॥ 145

శ్లో॥ కంసధ్వంసకరః కంసస్వసారూప్యగతిప్రదః ।
కృతోగ్రసేననృపతిః సర్వయాదవసౌఖ్యకృత్ ॥ 146

శ్లో॥ తాతమాతృకృతానన్దో నన్దగోపప్రసాదదః ।
శ్రితసాన్దీపనిగురుర్విద్యాసాగరపారగః ॥ 147

శ్లో॥ దైత్యపఞ్చజనధ్వంసీ పాఞ్చజన్యదరప్రియః ।
సాన్దీపనిమృతాపత్యదాతా కాలయమార్చితః ॥ 148

శ్లో॥ సైరన్ధ్రీకామసన్తాపశమనోఽక్రూరప్రీతిదః ।
శార్ఙ్గచాపధరో నానాశరసన్ధానకోవిదః ॥ 149

శ్లో॥ అభేద్యదివ్యకవచః శ్రీమద్దారుకసారథిః ।
ఖగేన్ద్రచిహ్నితధ్వజశ్చక్రపాణిర్గదాధరః ॥ 150

శ్లో॥ నన్దకీయదుసేనాఢ్యోఽక్షయబాణనిషఙ్గవాన్ ।
సురాసురాజేయరణ్యో జితమాగధయూథపః ॥ 151

శ్లో॥ మాగధధ్వజినీధ్వంసీ మథురాపురపాలకః ।
ద్వారకాపురనిర్మాతా లోకస్థితినియామకః ॥ 152

శ్లో॥ సర్వసమ్పత్తిజననః స్వజనానన్దకారకః ।
కల్పవృక్షాక్షితమహీః సుధర్మానీతభూతలః ॥ 153

శ్లో॥ యవనాసురసంహర్తా ముచుకున్దేష్టసాధకః ।
రుక్మిణీద్విజసంమన్త్రరథైకగతకుణ్డినః ॥ 154

శ్లో॥ రుక్మిణీహారకో రుక్మిముణ్డముణ్డనకారకః ।
రుక్మిణీప్రియకృత్సాక్షాద్రుక్మిణీరమణీపతిః ॥ 155

శ్లో॥ రుక్మిణీవదనామ్భోజమధుపానమధువ్రతః ।
స్యమన్తకనిమిత్తాత్మభక్తర్క్షాధిపజిత్శుచిః ॥ 156

శ్లో॥ జామ్బవార్చితపాదాబ్జః సాక్షాజ్జామ్బవతీపతిః ।
సత్యభామాకరగ్రాహీ కాలిన్దీసున్దరీప్రియః ॥ 157

శ్లో॥ సుతీక్ష్ణశృఙ్గవృషభసప్తజిద్రాజయూథభిద్ ।
నగ్నజిత్తనయాసత్యానాయికానాయకోత్తమః ॥ 158

శ్లో॥ భద్రేశో లక్ష్మణాకాన్తో మిత్రవిన్దాప్రియేశ్వరః ।
మురుజిత్పీఠసేనానీనాశనో నరకాన్తకః ॥ 159

శ్లో॥ ధరార్చితపదామ్భోజో భగదత్తభయాపహా ।
నరకాహృతదివ్యస్త్రీరత్నవాహాదినాయకః ॥ 160

శ్లో॥ అష్టోత్తరశతద్వ్యష్టసహస్రస్త్రీవిలాసవాన్ ।
సత్యభామాబలావాక్యపారిజాతాపహారకః ॥ 161

శ్లో॥ దేవేన్ద్రబలభిజ్జాయాజాతనానావిలాసవాన్ ।
రుక్మిణీమానదలనః స్త్రీవిలాసావిమోహితః ॥ 162

శ్లో॥ కామతాతః సామ్బసుతోఽ సఙ్ఖ్యపుత్రప్రపౌత్రవాన్ ।
ఉశాయానితపౌత్రార్థబాణబాహుసస్రఛిత్ ॥ 163

శ్లో॥ నన్ద్యాదిప్రమథధ్వంసీ లీలాజితమహేశ్వరః ।
మహాదేవస్తుతపదో నృగదుఃఖవిమోచకః ॥ 164

శ్లో॥ బ్రహ్మస్వాపహరక్లేశకథాస్వజనపాలకః ।
పౌణ్డ్రకారిః కాశిరాజశిరోహర్తా సదాజితః ॥ 165

శ్లో॥ సుదక్షిణవ్రతారాధ్యశివకృత్యానలాన్తకః ।
వారాణసీప్రదహనో నారదేక్షితవైభవః ॥ 166

శ్లో॥ అద్భుతైశ్వర్యమహిమా సర్వధర్మప్రవర్తకః ।
జరాసన్ధనిరోధార్తభూభుజేరితసత్కథః ॥ 167

శ్లో॥ నారదేరితసన్మిత్రకార్యగౌరవసాధకః ।
కలత్రపుత్రసన్మిత్రసద్వృత్తాప్తగృహానుగః ॥ 168

శ్లో॥ జరాసన్ధవధోద్యోగకర్తా భూపతిశర్మకృత్ ।
సన్మిత్రకృత్యాచరితో రాజసూయప్రవర్తకః ॥ 169

శ్లో॥ సర్వర్షిగణసంస్తుత్యశ్చైద్యప్రాణనికృన్తకః ।
ఇన్ద్రప్రస్థజనైః పూజ్యో దుర్యోధనవిమోహనః ॥ 170

శ్లో॥ మహేశదత్తసౌభాగ్యపురభిచ్ఛత్రుఘాతకః ।
దన్తవక్త్రరిపుచ్ఛేత్తా దన్తవక్త్రగతిప్రదః ॥ 171

శ్లో॥ విదూరథప్రమథనో భూరిభారావతారకః ।
పార్థదూతః పార్థహితః పార్థార్థః పార్థసారథిః ॥ 172

శ్లో॥ పార్థమోహసముచ్ఛేదీ గీతాశాస్త్రప్రదర్శకః ।
పార్థబాణగతప్రాణవీరకైవల్యరూపదః ॥ 173

శ్లో॥ దుర్యోధనాదిదుర్వృత్తదహనో భీష్మముక్తిదః ।
పార్థాశ్వమేధాహరకః పార్థరాజ్యప్రసాధకః ॥ 174

శ్లో॥ పృథాభీష్టప్రదో భీమజయదో విజయప్రదః ।
యుధిష్ఠిరేష్టసన్దాతా ద్రౌపదీప్రీతిసాధకః ॥ 175

శ్లో॥ సహదేవేరితపదో నకులార్చితవిగ్రహః ।
బ్రహ్మాస్త్రదగ్ధగర్భస్థపూరువంశప్రసాధకః ॥ 176

శ్లో॥ పౌరవేన్ద్రపురస్త్రీభ్యో ద్వారకాగమనోత్సవః ।
ఆనర్తదేశనివసత్ప్రజేరితమహత్కథః ॥ 177

శ్లో॥ ప్రియప్రీతికరో మిత్రవిప్రదారిద్ర్యభఞ్జనః ।
తీర్థాపదేశసన్మిత్రప్రియకృన్నన్దనన్దనః ॥ 178

శ్లో॥ గోపీజనజ్ఞానదాతా తాతక్రతుకృతోత్సవః ।
సద్వృత్తవక్తా సద్వృత్తకర్తా సద్వృత్తపాలకః ॥ 179

శ్లో॥ తాతాత్మజ్ఞానసన్దాతా దేవకీమృతపుత్రదః ।
శ్రుతదేవప్రియకరో మైథిలానన్దవర్ధనః ॥ 180

శ్లో॥ పార్థదర్పప్రశమనో మృతవిప్రసుతప్రదః ।
స్త్రీరత్నవృన్దసన్తోషీ జనకేలికలోత్సవః ॥ 181

శ్లో॥ చన్ద్రకోటిజనానన్దీ భానుకోటిసమప్రభః ।
కృతాన్తకోటిదుర్లఙ్ఘ్యః కామకోటిమనోహరః ॥ 182

శ్లో॥ యక్షరాట్కోటిధనవాన్మరుత్కోటిస్వవీర్యవాన్ ।
సముద్రకోటిగమ్భీరో హిమవత్కోట్యకమ్పనః ॥ 183

శ్లో॥ కోట్యశ్వమేధాఘహరః తీర్థకోట్యధికాహ్వయః ।
పీయూషకోటిమృత్యుఘ్నః కామధుక్కోట్యభీష్టదః ॥ 184

శ్లో॥ శక్రకోటివిలాసాఢ్యః కోటిబ్రహ్మాణ్డనాయకః ।
సర్వామోఘోద్యమోఽనన్తకీర్తినిఃసీమపౌరుషః ॥ 185

శ్లో॥ సర్వాభీష్టప్రదయశాః పుణ్యశ్రవణకీర్తనః ।
బ్రహ్మాదిసురసఙ్గీతవీతమానుషచేష్టితః ॥ 186

శ్లో॥ అనాదిమధ్యనిధనో వృద్ధిక్షయవివర్జితః ।
స్వభక్తోద్ధవముఖ్యైకజ్ఞానదో జ్ఞానవిగ్రహః ॥ 187

శ్లో॥ విప్రశాపచ్ఛలధ్వస్తయదువంశోగ్రవిక్రమః ।
సశరీరజరావ్యాధస్వర్గదః స్వర్గిసంస్తుతః ॥ 188

శ్లో॥ ముముక్షుముక్తవిషయీజనానన్దకరో యశః ।
కలికాలమలధ్వంసియశాః శ్రవణమఙ్గలః ॥ 189

శ్లో॥ భక్తప్రియో భక్తహితో భక్తభ్రమరపఙ్కజః ।
స్మృతమాత్రాఖిలత్రాతా యన్త్రమన్త్రప్రభఞ్జకః ॥ 190

శ్లో॥ సర్వసమ్పత్స్రావినామా తులసీదామవల్లభః ।
అప్రమేయవపుర్భాస్వదనర్ఘ్యాఙ్గవిభూషణః ॥ 191

శ్లో॥ విశ్వైకసుఖదో విశ్వసజ్జనానన్దపాలకః ।
సర్వదేవశిరోరత్నమద్భుతానన్తభోగవాన్ ॥ 192

శ్లో॥ అధోక్షజో జనాజీవ్యః సర్వసాధుజనాశ్రయః ।
సమస్తభయభిన్నామా స్మృతమాత్రార్తినాశకః ॥ 193

శ్లో॥ స్వయశః శ్రవణానన్దజనరాగీ గుణార్ణవః ।
అనిర్దేశ్యవపుస్తప్తశరణో జీవజీవనః ॥ 194

శ్లో॥ పరమార్థః పరంవేద్యః పరజ్యోతిః పరాగతిః ।
వేదాన్తవేద్యో భగవాననన్తసుఖసాగరః ॥ 195

శ్లో॥ జగద్బన్ధధ్వంసయశా జగజ్జీవజనాశ్రయః ।
వైకుణ్ఠలోకైకపతిర్వైకుణ్ఠజనవల్లభః ॥ 196

శ్లో॥ ప్రద్యుమ్నో రుక్మిణీపుత్రః శమ్బరఘ్నో రతిప్రియః ।
పుష్పధన్వా విశ్వజయీ ద్యుమత్ప్రాణనిషూదకః ॥ 197

శ్లో॥ అనిరుద్ధః కామసుతః శబ్దయోనిర్మహాక్రమః ।
ఉషాపతిర్వృష్ణిపతిర్హృషీకేశో మనఃపతిః ॥ 198

శ్లో॥ శ్రీమద్భాగవతాచార్యః సర్వవేదాన్తసాగరః ।
శుకః సకలధర్మజ్ఞః పరీక్షిన్నృపసత్కృతః ॥ 199

శ్లో॥ శ్రీబుద్ధో దుష్టబుద్ధిఘ్నో దైత్యవేదబహిష్కరః ।
పాఖణ్డమార్గప్రవదో నిరాయుధజగజ్జయః ॥ 200

శ్లో॥ కల్కీ కలియుగాచ్ఛాదీ పునః సత్యప్రవర్తకః ।
విప్రవిష్ణుయశోఽపత్యో నష్టధర్మప్రవర్తకః ॥ 201

శ్లో॥ సారస్వతః సార్వభౌమో బలిత్రైలోక్యసాధకః ।
అష్టమ్యన్తరసద్ధర్మవక్తా వైరోచనిప్రియః ॥ 202

శ్లో॥ ఆపః కరో రమానాథోఽమరారికులకృన్తనః ।
సురేన్ద్రహితకృద్ధీరవీరముక్తిబలప్రదః ॥ 203

శ్లో॥ విష్వక్సేనః శమ్భుసఖో దశమాన్తరపాలకః ।
బ్రహ్మసావర్ణివంశాబ్ధిహితకృద్విశ్వవర్ధనః ॥ 204

శ్లో॥ ధర్మసేతురధర్మఘ్నో వైద్యతన్త్రపదప్రదః ।
అసురాన్తకరో దేవార్థకసూనుః సుభాషణః ॥ 205

శ్లో॥ స్వధామా సూనృతాసూనుః సత్యతేజో ద్విజాత్మజః ।
ద్విషన్మనుయుగత్రాతా పాతాలపురదారణః ॥ 206

శ్లో॥ దైవహోత్రిర్వార్హతోయో దివస్పతిరతిప్రియః ।
త్రయోదశాన్తరత్రాతా యోగయోగిజనేశ్వరః ॥ 207

శ్లో॥ సత్రాయణో బృహద్బాహుర్వైనతేయో విదుత్తమః ।
కర్మకాణ్డైకప్రవదో వేదతన్త్రప్రవర్తకః ॥ 208

శ్లో॥ పరమేష్ఠీ సురజ్యేష్ఠో బ్రహ్మా విశ్వసృజాम్పతిః ।
అబ్జయోనిర్హంసవాహః సర్వలోకపితామహః ॥ 209

శ్లో॥ విష్ణుః సర్వజగత్పాతా శాన్తః శుద్ధః సనాతనః ।
ద్విజపూజ్యో దయాసిన్ధుః శరణ్యో భక్తవత్సలః ॥ 210

శ్లో॥ రుద్రో మృడః శివః శాస్తా శమ్భుః సర్వహరో హరః ।
కపర్దీ శఙ్కరః శూలీ త్ర్యక్షోఽభేద్యో మహేశ్వరః ॥ 211

శ్లో॥ సర్వాధ్యక్షః సర్వశక్తిః సర్వార్థః సర్వతోముఖః ।
సర్వావాసః సర్వరూపః సర్వకారణకారణమ్ ॥ 212

శ్లో॥ ఇత్యేతత్కథితం విప్ర విష్ణోర్నామసహస్రకమ్ ।
సర్వపాపప్రశమనం సర్వాభీష్టఫలప్రదమ్ ॥ 213

శ్లో॥ మనఃశుద్ధికరం చాశు భగవద్భక్తివర్ధనమ్ ।
సర్వవిఘ్నహరం సర్వాశ్చర్యైశ్వర్యప్రదాయకమ్ ॥ 214

శ్లో॥ సర్వదుఃఖప్రశమనం చాతుర్వర్గ్యఫలప్రదమ్ ।
శ్రద్ధయా పరయా భక్త్యా శ్రవణాత్పఠనాజ్జపాత్ ॥ 215

శ్లో॥ ప్రత్యహం సర్వవర్ణానాం విష్ణుపాదాశ్రితాత్మనామ్ ।
ఏతత్పఠన్ ద్విజో విద్యాం క్షత్రియః పృథివీమిమామ్ ॥ 216

శ్లో॥ వైశ్యో మహానిధిం శూద్రో వాఞ్ఛితాం సిద్ధిమాప్నుయాత్ ।
ద్వాత్రింశదపరాధాన్యో జ్ఞానాజ్ఞానాచ్చరేద్ధరేః ॥ 217

శ్లో॥ నామ్నా దశాపరాధాంశ్చ ప్రమాదాదాచరేద్యది ।
సమాహితమనా హ్యేతత్పఠేద్వా శ్రావయేజ్జపేత్ ॥ 218

శ్లో॥ స్మరేద్వా శృణుయాద్వాపి తేభ్యః సద్యః ప్రముచ్యతే ।
నాతః పరతరం పుణ్యం త్రిషు లోకేషు విద్యతే ॥ 219

శ్లో॥ యస్యైకకీర్తనేనాపి భవబన్ధాద్విముచ్యతే ।
అతస్త్వం సతతం భక్త్యా శ్రద్ధయా కీర్తనం కురు ॥ 220

శ్లో॥ విష్ణోర్నామసహస్రం తే భగవత్ప్రీతికారణమ్ ।

శ్రీనారద ఉవాచ ।

శ్లో॥ ధన్యోఽస్మ్యనుగృహీతోఽస్మి త్వయాతికరుణాత్మనా ।
యతః కృష్ణస్య పరమం సహస్రం నామకీర్తితమ్ ॥ 221

శ్లో॥ యద్యాలస్యాత్ప్రమాదాద్వా సర్వం పఠితుమన్వహమ్ ।
న శక్నోమి తదా దేవ కిం కరోమి వద ప్రభో ॥ 222

శ్రీశివ ఉవాచ ।

శ్లో॥ యది సర్వం న శక్నోషి ప్రత్యహం పఠితుం ద్విజ ।
తదా కృష్ణేతి కృష్ణేతి కృష్ణేతి ప్రత్యహం వద ॥ 223

శ్లో॥ ఏతేన తవ విప్రర్షే సర్వం సమ్పద్యతే సకృత్ ।
కిం పునర్భగవన్నామ్నాం సహస్రస్య ప్రకీర్తనాత్ ॥ 224

శ్లో॥ యన్నామకీర్తనేనైవ పుమాన్ సంసారసాగరమ్ ।
తరత్యద్ధా ప్రపద్యే తం కృష్ణం గోపాలరూపిణమ్ ॥ 225

ఇతి సాత్వతతన్త్రే శ్రీకృష్ణసహస్రనామషష్ఠః పటలః ॥6॥



# వాగీశ్వర్యా మన్త్రధ్యానమ్

ఓం హ్రీం ఐం హ్రీం ఓం సరస్వత్యై నమః

– ఏకాదశాక్షరమన్త్రమ్

అథ వాగీశ్వరీమన్త్రస్తారం మాయా చ వాగ్భవః ।
పునర్మాయా పునస్తారో జేఽన్తాపి చ సరస్వతీ ॥ 216

అన్తే హృన్మనునా జ్ఞేయో మన్త్రో హ్యేకాదశాక్షరః ।
ధ్యాయేద్ వాగీశ్వరీం దేవీం హంసారూఢాం హసన్ముఖీమ్ ॥ 217

పూర్ణేన్దువదనాం కున్దకర్పూరసితవిగ్రహామ్ ।
అర్ధేన్దువిలసద్భాలాం దివ్యాభరణభూషితామ్ ॥ 218

విశాలలోచనాం తుఙ్గస్తనీం స్మితమనోహరామ్ ।
పీయూషకుమ్భం విద్యాం చ వామే సమ్బిభ్రతీం శివామ్ ॥ 219

వీణామక్షగుణాన్ దక్షే ధారయన్తీం చతుర్భుజామ్ ।
ధ్యాత్వా తు మూలమన్త్రేణ సాధకో న్యాసమాచరేత్ ॥ 220 (మహాకాలసంహితా)

శ్రీః

# కల్యాణవృష్టిస్తవః

**క**ల్యాణవృష్టిభిరివామృతపూరితాభి-
ర్లక్ష్మీస్వయంవరణమఙ్గలదీపికాభిః ।
సేవాభిరమ్బ తవ పాదసరోజమూలే
నాకారి కిం మనసి భాగ్యవతాం జనానామ్ ॥ 1

**ఏ**తావదేవ జనని స్పృహణీయమాస్తే
త్వద్వన్దనేషు సలిలస్థగితే చ నేత్రే ।
సాన్నిధ్యముద్యదరుణాయుతసోదరస్య
త్వద్విగ్రహస్య పరయా సుధయాప్లుతస్య ॥ 2

**ఈ**శత్వనామకలుషాః కతి వా న సన్తి
బ్రహ్మాదయః ప్రతిభవం ప్రలయాభిభూతాః ।
ఏకః స ఏవ జనని స్థిరసిద్ధిరాస్తే
యః పాదయోస్తవ సకృత్ప్రణతిం కరోతి ॥ 3

**ల**బ్ధ్వా సకృత్త్రిపురసున్దరి తావకీనం
కారుణ్యకన్దలితకాన్తిభరం కటాక్షమ్ ।
కన్దర్పకోటిసుభగాస్త్వయి భక్తిభాజః
సంమోహయన్తి తరుణీర్భువనత్రయేఽపి ॥ 4

**హ్రీం**కారమేవ తవ నామ గృణన్తి వేదా
మాతస్త్రికోణనిలయే త్రిపురే త్రినేత్రే ।
త్వత్సంస్మృతౌ యమభటాభిభవం విహాయ
దీవ్యన్తి నన్దనవనే సహ లోకపాలైః ॥ 5

**హ**న్తుః పురామధిగలం పరిపీయమానః
క్రూరః కథం న భవితా గరలస్యవేగః ।
నాశ్వాసనాయ యది మాతరిదం తవార్ధం
దేవస్య శశ్వదమృతాప్లుతశీతలస్య ॥ 6

**స**ర్వజ్ఞతాం సదసి వాక్పటుతాం ప్రసూతే
దేవి త్వదఙ్ఘ్రిసరసీరుహయోః ప్రణామః ।
కిం చ స్ఫురన్మకుటముజ్జ్వలమాతపత్రం
ద్వే చామరే చ మహతీం వసుధాం దదాతి ॥ 7

**క**ల్పద్రుమైరభిమతప్రతిపాదనేషు
కారుణ్యవారిధిభిరమ్బ భవత్కటాక్షైః ।
ఆలోకయ త్రిపురసున్దరి మామనాథం
త్వయ్యేవ భక్తిభరితం త్వయి బద్ధతృష్ణమ్ ॥ 8

**హ**న్తేతరేష్వపి మనాంసి నిధాయ చాన్యే
భక్తిం వహన్తి కిల పామరదైవతేషు ।
త్వామేవ దేవి మనసా సమనుస్మరామి
త్వామేవ నౌమి శరణం జనని త్వమేవ ॥ 9

**ల**క్ష్యేషు సత్స్వపి కటాక్షనిరీక్షణానా–
మాలోకయ త్రిపురసున్దరి మాం కదాచిత్ ।
నూనం మయా తు సదృశః కరుణైకపాత్రం
జాతో జనిష్యతి జనో న చ జాయతే వా ॥ 10

**హ్రీం** హ్రీమితి ప్రతిదినం జపతాం తవాఖ్యాం
కిం నామ దుర్లభమిహ త్రిపురాధివాసే ।
మాలాకిరీటమదవారణమాననీయా
తాన్సేవతే వసుమతీ స్వయమేవ లక్ష్మీః ॥ 11

**స**మ్పత్కరాణి సకలేన్ద్రియనన్దనాని
సామ్రాజ్యదాననిరతాని సరోరుహాక్షి ।
త్వద్వన్దనాని దురితాహరణోద్యతాని
మామేవ మాతరనిశం కలయన్తు నాన్యమ్ ॥ 12

**క**ల్పోపసంహృతిషు కల్పితతాణ్డవస్య
దేవస్య ఖణ్డపరశోః పరభైరవస్య ।
పాశాఙ్కుశైక్షవశరాసనపుష్పబాణా
సా సాక్షిణీ విజయతే తవ మూర్తిరేకా ॥ 13

**ల**గ్నం సదా భవతు మాతరిదం తవార్ధం
తేజః పరం బహులకుఙ్కుమపఙ్కశోణమ్ ।
భాస్వత్కిరీటమమృతాంశుకలావతంసం
మధ్యే త్రికోణనిలయం పరమామృతార్ద్రమ్ ॥ 14

**హ్రీం**కారమేవ తవ నామ తదేవ రూపం
త్వన్నామ దుర్లభమిహ త్రిపురే గృణన్తి ।
త్వత్తేజసా పరిణతం వియదాదిభూతం
సౌఖ్యం తనోతి సరసీరుహసమ్భవాదేః ॥ 15

**హ్రీం**కారత్రయసమ్పుటేన మహతా మన్త్రేణ సన్దీపితం
స్తోత్రం యః ప్రతివాసరం తవ పురో మాతర్జపేన్మన్త్రవిత్ ।
తస్య క్షోణిభుజో భవన్తి వశగా లక్ష్మీశ్చిరస్థాయినీ
వాణీ నిర్మలసూక్తిభారభరితా జాగర్తి దీర్ఘం వయః ॥ 16

ఇతి శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్యస్య శ్రీగోవిన్దభగవత్పూజ్యపాదశిష్యస్య
శ్రీమచ్ఛఙ్కరభగవతః కృతౌ కల్యాణవృష్టిస్తవః సమ్పూర్ణః ।

# లొట్ట యిదేటిమాట

## చాటువు- విజయనగరసామ్రాజ్య పరిపాలనా కాలము

- డా॥ యలవర్తి భానుభవాని, గుంటూరు.

"తిమ్మరసు, ఈతఁడు కృష్ణరాయలయొద్ద ముఖ్యమంత్రి. రాయలకుఁ బితృసముఁడు. కృష్ణరాయ లీతని 'నప్పాజీ' యని పిలుచువాఁడు. ఒకప్పు డీతనియెడ భట్టుమూర్తికవి కడుఁ గుపితుఁడై యీ క్రింద నుదాహరింపఁబడు నుత్పలమాలికాదులను జెప్పెనఁట.

ఉ॥ లొట్ట యి దేటిమాట పెనులోభులతో మొగమాట మేల తాఁ
గుట్టకయున్న వృశ్చికముఁ గుమ్మరపుర్వని యందురే కదా
పట్టపురాజుపట్టి సరిపల్లెసరాసరి యాయకున్న నేఁ
దిట్టకమాన నామతము తీవ్రమహోగ్రభయంకరంబుగాఁ
దిట్టితినా మహోగ్రహమతిన్ మకరగ్రహజర్జరీభటా
పట్టనదట్టఫాలపణిభర్తృబహూకృతపర్జటస్ఫుటా
ఘట్టపుదట్టణాలకవిఘట్టనిరర్గళరాజభృత్యకీ
చట్టచటార్భటీనయనజర్జరకీలలు రాలఁగావలెన్.
జుట్టతికంబునం బొగడఁ జూచితినా రజతాద్ర్యధిత్యకా
పట్టణమధ్యరంగగతభవ్యవధూవదనామషంగదసం
హట్టశిరస్థగాంగఝరహల్లకజాలసుధాతరంగముల్
చుట్టుకొనన్వలెన్ భువనచోద్యముగా పయదంబుగా మతిన్
దిట్టితినా సభాభవనధీంకృతభీమనృసింహరాడ్ధ్వజా
తాట్టమహోట్టహాసచతురాస్యసముద్భ్రుకుటీతటీనటీ
కోట్టణరోషజాలహృతకుంఠితకంఠగభీరనాదసం
ఘట్టవిజృంభమాణగతి గావలె, దీవనపద్య మిచ్చి చే
పట్టితినా మణీకనకభాజనభూషణభాసురాంబరా
రట్టతురంగగంధగజరాజదమూల్యఘనాతపత్రభూ
పట్టణభర్మహర్మ్యభటపఙ్క్తి చిరాయురనామయంబునై
గట్టిగఁ దోడుతో వెలయఁగావలె నెక్కువతీవిఁ జూడుఁ డీ
యట్టిటు మందెమేలముల నందఱనుం బలెఁ జుల్కఁజూచి యే
పట్టుననైనఁ గౌరవము పల్కకుఁడీ పయిపెచ్చునందులన్
గొట్టుదు దుష్కవిద్విరదకోటులఁ బంచముఖోద్భటాకృతిన్
బెట్టుదు దండముల్ సుకవిబృందము కే నతిభక్తి సారెకున్
గట్టితి ముల్లె లేఁబదియుఁ గాఁగలనూటపదాఱు లెయ్యేడన్
రట్టడిభట్టుమూర్తికవిరాయనిమార్గమెఱుంగఁ జెప్పితిన్.

గీ. ముందు నిప్పుడు నిఁకమీఁద మోద మలరఁ
బద్యదండంబు చేఁబూని పార్థివులను

**జంపుచున్నాఁడు చంపును జంపఁగలఁడు**
**పరుషవాక్యత సమవర్తి భట్టుమూర్తి.**

**శా. గుత్తిం బుల్లెలు కుట్టి చంద్రగిరిలోఁ గూడెత్తి పెన్గొండలో**
**హత్తిన్ సత్రమునందు వేఁడి బలుదుర్గాధీశుతాంబూలపుం**
**దిత్తు ల్మోసి పదస్థులైనఘనులన్ దీవింప –**

**అనునంతవఱకుఁ జెప్పునప్పటికిఁ దిమ్మరుసు దుష్కీర్తికి భయపడి పచ్చలహారము మెడనుండి తీసి భట్టుమూర్తికి సమర్పింపఁగా నాతఁడు ప్రహృష్టుఁడై పూరించెను –**

**దీవించెదన్**
**మత్తారాతియయాతి నాగమనుతున్ మంత్రీశ్వరున్ దిమ్మరున్.**

**క. అయ్య యనిపించుకొంటివి**
**నెయ్యంబునఁ గృష్ణరాయనృపపుంగవుచే**
**నయ్యా! నీసరి యేరీ?**
**తియ్యనివిలుకాఁడవయ్య! తిమ్మరుసయ్యా!**

**గురువై మహారాజ్యప్రదాపయితయై తన్ను సర్వవిధముల సంరక్షించిన తిమ్మరుసు మంత్రిని శ్రీకృష్ణరాయలు కడకాలమున విద్వేషించెను. ఆయన రెండుగ్రుడ్లను దోడించెను. తన యశశ్చంద్రున కిట్లపయశఃకళంకమును గూర్చుకొనెను".**

లొట్ట = బానిసస్వభావుడా!; ఇదేటిమాట = ఇటువంటి మాటలెందుకు? పెనులోభులతో = పెద్ద పిసినిగొట్టులతో; మొగమోటమేల = వెనుకముందాడుట ఎందుకు? వృశ్చికము = తేలు; తా = తాను; కుట్టకయున్న = ఎవరినీ కుట్టకపోతే; కుమ్మరిపుర్వని = కుమ్మరిసారెల దగ్గర ఉండు మట్టిపురుగని; అందురేకదా = అంటారు కదా. (అనగా కుట్టినప్పుడు మాత్రమే దాని స్వభావాన్ని గుర్తిస్తారని సారాంశం); పట్టపురాజుపట్టి = ప్రభువును ఒప్పించి; సరిపల్లె = సరిపల్లె అనే పేరున్న ప్రాంతాన్ని; ఈయకున్న = ఇవ్వకపోతే; తీవ్ర = అధికమైన; మహా + ఉగ్ర = రౌద్రముతో; భయంకరముగా = భీతికల్గునట్లు; మహా + ఆగ్రహమతిన్ = అత్యంతకోపావేశముతో; నామతము = నా పద్ధతిలో; నే = నేను; తిట్టకమాన = తిట్టకుండా ఉండను; తిట్టితినా = నేను తిట్టినట్లైతే; మకర గ్రహ = మచ్చగల గ్రహమైన చంద్రగ్రహమువల్ల (నవగ్రహములలో చంద్రుడొకడు); జర్జరీ = శిథిలమైన (చివరకు వచ్చిన); ఘటా = రోజులో పదిహేడవ భాగమైన చివరి దశయందు; ఫాల = నుదిటియందలి; పట్టనదట్ట = పట్టాభిషేక సమయంలో కట్టిన పట్టెకు చెందిన వస్త్రము; ఫణిభర్తృ = సర్పరాజుచే; బహూకృత = బహూకరించబడిన; పర్జట = జటలపైనున్న; స్ఫుటా = విచ్చిన పడగలయొక్క; ఘట్టపు = రాపిడిచే; దట్టణ = తిరస్కరించబడి; అలక = సూక్ష్మముగా; విఘట్ట = విడగొట్టబడి; నిరర్గళ = అడ్డంకిలేని; రాజభృత్యకీ = రాజసేవకురాండ్రయొక్క; చట్ట = తొడల వెలుపలిభాగముల; ఛటా = సమూహముయొక్క; ఆర్భటీ = విజృంభణతో (అనగా తొడలు చఱచుచు విజృంభించుటతో); నయన = వారి కన్నులనుండి; జర్జరకీల = భయంకర అగ్నిజ్వాలలు; రాలగావలెన్ = రాలి తీరాలి. (తీవ్ర ఆగ్రహానికి, తిరస్కరణకు గురి కావలసి వస్తుందని భావం.)

చుట్టరికంబున్ = ఇష్టముతో లేదా బంధుభావములో; పొగడజూచితినా = స్తుతిచేసినచో; రజతాద్రి = వెండికొండయొక్క (కైలాసం); అధిత్యకా = సానుప్రదేశమున నున్న లేదా

కొండపైభాగమునందున్న; పట్టణ = పురమునందలి; మధ్యరంగగత = మధ్యభాగముననున్న రంగస్థలమందలి; భవ్యవధూ = పార్వతి అనెడు స్త్రీయొక్క; వదన + అనుషంగ = ముఖముతో సంబంధము కల్గిన; సంహట్ట = అంగడివీథియొక్క; శిరఃస్థ = అగ్రభాగమునందున్న; గంగాఝర = గంగాప్రవాహమునందలి; హల్లకజాల = చెంగలువలపైనున్న; సుధాతరంగముల్ = అమృతప్రవాహములు; భువనచోద్యముగా = లోకాలన్నీ ఆశ్చరపడే విధంగా; పయదంబుగా = మేఘములై; చుట్టుకొనన్వలెన్ = ఆక్రమించవలెను. (అనగా పార్వతీదేవియొక్క అపారకృపకు పాత్రులు కాగలరని పిండితార్థం.); మరిన్ తిట్టితినా = మళ్ళీ తిట్టినట్లైతే; సభాభవన = రాజసభాభవనమును; ధీంకృత = ధిక్కరించునట్లు; భీమ నృసింహరాట్ = ఉగ్రనరసింహునియొక్క; ధ్వజ = ధ్వజస్తంభముపై; ఆత = విస్తరించిఉన్న; అట్ట = ఎనిమిది పన్నగములుగల అష్టకము లేదా (భీమ నృసింహరాట్ = నరసింహరాయల; ధ్వజ = ధ్వజము; ఆత = విస్తరించియున్న; అట్ట = ఉపరిగృహము అని చెప్పవచ్చు); మహా + అట్టహాస = పెద్ద నవ్వుతోకూడిన; చతురాస్య = బ్రహ్మయొక్క; సముత్ + భ్రుకుటీతటీ = ఎత్తైన కనుబొమల ప్రదేశమున; నటీక = కదలుతున్న; ఉట్టణ = వెల్వడుతున్న; రోషజాల = కోపాగ్ని కీలలచే; హృత = హరింపబడి; కుంఠిత = మొక్కవోయిన; కంఠ గంభీరనాద = గంభీరమైన కంఠస్వర; సంఘట్ట = రాపిడిచే; విజృంభమాణ = విజృంభించిన స్థితియందున్న; గతి = పరిస్థితికి; కావలెన్ = లోను కావలెను.

దీవన పద్యమిచ్చి = ఆశీర్వచన పద్యమును చదివి; చేపట్టితినా = ప్రేమతో స్వీకరించితినా (అనగా అభిమానించి నట్లైతే); మణీ = రత్నములతో, కనక = బంగారముతో; భాజన = యోగ్యములైన / చేయబడిన; భూషణ = ఆభరణములు; భాసుర = ప్రకాశవంతమైన; అంబర = వస్త్రములు, ఆరట్ట = వేగవంతమైన; తురంగ = గుఱ్ఱములు, గంధగజ = మదపుటేనుగులు; రాజత్ = ప్రకాశించుచున్న; అమూల్య = మిక్కిలి విలువైన; ఘన = గొప్పవైన; ఆతపత్ర = గొడుగులు (ఛత్రము రాజచిహ్నముగా చెప్పబడినది); భూ = భూములు; పట్టణ = పురములు, భర్మ = బంగారపు; హర్మ్య = మేడలు; భటపంక్తి = సేవకుల సమూహములు (కలిగి లేదా ప్రాప్తించి); చిరాయుః + అనామయంబునై = అనారోగ్యములేని దీర్ఘాయుష్షుతో; గట్టిగా = చక్కగా; తోడుతో = సహాయ, సహకారములతో (లేదా పై చెప్పిన అంశములతో); ఎక్కువ తీవి = అధిక దర్పముతో; వెలయఁగావలెన్ = చక్కగా జీవించాలి (లేదా ప్రకాశించాలి); చూడుడీ = చూడండి.

కాబట్టి – మందెమేలముల = గుంపులతో కలిసి; అందరనుబలె = అందరిని చూచినట్లే (ఏ ప్రత్యేకతా లేకుండా); చుల్కజూచి = చులకనగా చూచి; యట్టిటు = ఎట్లా వీలైతే అట్లా (ఎక్కువ, తక్కువగా); ఏ పట్టుననైన = ఏ సమయంలోకూడా; గౌరవము పల్కకుడీ = గౌరవించినట్లు మాట్లాడవద్దు; అందులన్ = ఆ విషయంలో; పయిపెచ్చు = అదనంగా; దుష్కవి = చెడ్డకవులనే; ద్విరదకోటులన్ = ఏనుగులను; పంచముఖ + ఉద్భటాకృతిన్ = రుద్రునివలె తీవ్రముగా; కొట్టుదున్ = కొడతాను / దెబ్బతీస్తాను. (అనగా తన వాగ్ధాటితో, కవిత్వ ప్రౌఢిమతో అణగద్రొక్కుతానని భావం.) సారెకున్ = మాటిమాటికి, సుకవి బృందమునకు = మంచి కవుల సమూహానికి (సత్కవులకు); ఏన్ = నేను; దండముల్ = నమస్కారములు; పెట్టుదు = పెడతాను; ఏబదియుగాగల = యాభైసంఖ్య గల; ముల్లెలు = చిల్లరనాణెముల సంచులు; నూటపదారులు = ఒక్కొక్కటి నూరు పదహారు నాణెములతో కూడినవి (లేదా శ్రేష్ఠమైనవని కూడా చెప్పవచ్చు); కట్టితిన్ = తయారు చేశాను (బహూకరణ నిమిత్తం కావచ్చు); ఎయ్యెడన్ = ఎక్కడైనా; రట్టడి = నింద్యమైన; భట్టుమూర్తికవి రాయని = భట్టుమూర్తి అను కవిశ్రేష్ఠుని; మార్గము = విధానమును; ఎఱుంగ చెప్పితిన్ = తెలియచేశాను (నింద్యమైన అని చెప్పడం వ్యంగ్యంగా ఇతరుల ధోరణిని తెలియచెప్పేందుకే కావచ్చు).

**సందర్భము :** విజయనగరసామ్రాజ్య కాలములో భట్టుమూర్తి రచించిన చాటు పద్యమిది. చాటు పద్యమణిమంజరిలో దీనికి స్థానం కల్పించబడినది. రావూరి దొరస్వామిశర్మ గారు "తెలుగులో తిట్టుకవిత్వము" అనే తమ గ్రంథంలో ఈ పద్యాన్ని ఉదాహరించారు. తిమ్మరుసుపై భట్టుమూర్తికి ఎందుకో ఆగ్రహముండెడిదట. కృష్ణరాయలకు అభిమాన పాత్రుడైన భట్టుమూర్తిపై తిమ్మరుసుకు కూడా ఆదరభావము లేదట. ఎవ్వరినీ లెక్కచేయని భట్టుమూర్తి తెనాలి రామకృష్ణునికి మాత్రము భయపడెడివాడట. భక్తివలననో, ఇతర కారణమో మాత్రము తెలియదు. పై పద్యమాలిక ఉత్పలమాల వృత్తంలో నున్నది. తిమ్మరును చూచి ఆగ్రహంతో భట్టుమూర్తి ఈ పద్యమాలికను చెప్పినట్లు, ఆ పద్యమాలిక పూర్తికాకముందే ఆలస్యం చేస్తే ఇంకేమి నిందలు వినాల్సి వస్తుందోనని తిమ్మరుసు తన మెడలోని హారాన్ని తీసి భట్టుమూర్తి మెడలో వేసి గౌరవించాడని, వెంటనే భట్టుమూర్తి తిమ్మరుసయ్యను స్తుతిస్తూ పద్యం చెప్పాడని "చాటుపద్యమణిమంజరి" ద్వారా తెలుస్తున్నది.

**తాత్పర్యము :** లోభివారి దగ్గర ముఖమాటపడటం అనవసరం. అలా మొగమాట పడటం వల్ల వారి స్వభావం ఎవరికీ తెలియదు. కుట్టినప్పుడు మాత్రమే తేలు అని గుర్తిస్తారు. కుట్టనంతసేపు కుమ్మరి పురుగనే అనుకుంటారు. పరిపాలించే ప్రభువును ఒప్పించి సరిపల్లెను ఏకముఖంగా ఇవ్వకున్నచో నేను నా పద్ధతిలో మిక్కిలి భయంకరముగా తిట్టక మానను. నేను తిట్టినట్లైతే పట్టాభిషేక చిహ్నముగా కట్టిన పట్టపుదట్ట, పాముపడగల రాపిడికి గురై, రాజసేవకులే ఎదురుతిరుగుతారు. వారి కనులనుండి నిప్పులు రాలతాయి. అనగా పదవి పోయి, పొగడిన వారే తిరగబడి అల్లకల్లోలం చేస్తారని భావం.

ప్రేమతో పొగిడితే సాక్షాత్తు వెండికొండపై వసించే ఆ పార్వతీదేవి అనుగ్రహం కలుగుతుంది. ఆకాశగంగలో విచ్చుకున్న కలువలపైని అమృతబిందువులు పయోదములుగా మారి, చుట్టూ వ్యాపించి అమృత వర్షం కురిపిస్తాయి.

మరల నేను తిట్టడం జరిగితే సభాభవనాన్ని గజగజలాడించే విధంగా ఉగ్ర నరసింహుని కోపానికి గురియై, మిక్కిలిగా కోపించిన సృష్టికర్త కంఠం నుండి జాలువారే రోషావేశపు గంభీర నాదానికి అనగా సృష్టికర్త కోపానికి గురికావలసి వస్తుంది.

మరల ఆశీర్వచన పద్యములో అనుగ్రహిస్తే విలువైన ఆభరణాలు, వస్త్రాలు, వస్తువాహనాలు, అధికారం, రాజ్యం, బంగారు మేడలు, పరివారం, ఆయురారోగ్యములు అన్నీ లభిస్తాయి. హాయిగా అకుంఠిత కీర్తితో భూమిపై వెలుగొందవచ్చు.

అందువల్ల గుంపులో గోవింద అన్నట్లుగా కాకుండా, అందరితోపాటు చులకనగా చూచి ఏదో నామమాత్రపు గౌరవపు మాటలు పలుకకండి.

నేను దుష్కవులనే ద్విరదములను కోపోద్రిక్తుడైన శివునివలె తరిమి కొడతాను. సుకవులకు అనేక మార్లు చేతులెత్తి నమస్కరిస్తాను. నూటపదార్ల విలువచేసే యాభై ముల్లెలను కట్టి దాచి ఉంచాను. అందరు నిందించినప్పటికిని, భట్టుమూర్తి కవి పుంగవుని మార్గము ఇది. స్పష్టముగా చెప్పుచున్నాను. ✦





శౌనక మహర్షి విరచిత

# శ్రీ గర్భరక్షా స్తోత్రం




ఓం శ్రీ గణేశాయ నమః

ఓం శ్రీమాత్రే నమః

శ్లో॥ ఏహ్యేహి భగవన్ బ్రహ్మన్ – ప్రజాకర్తా, ప్రజాపతే ।
ప్రగృహ్ణీష్వ బలిం చేమాం – సాపత్యాం రక్ష గర్భిణీమ్ ॥ 1

శ్లో॥ అశ్వినౌ దేవదేవేశౌ – ప్రగృహ్ణీథామ్ బలిం త్విమామ్ ।
సాపత్యం గర్భిణీం చేమాం – రక్షతం పూజ యనయా ॥ 2

శ్లో॥ రుద్రాశాః ఏకాదశ ప్రోక్తాః – ప్రగృహనంతు బలిం త్విమామ్ ।
వృత్తం యక్షాగమప్రీత్యై – నిత్యం రక్షన్తు గర్భిణీమ్ ॥ 3

శ్లో॥ ఆదిత్యా ద్వాదశ ప్రోక్తాః – ప్రగ్రహ్ణీధ్వమ్ బలిం త్విమామ్ ।
యుష్మాకం తేజసాం వృద్ధ్యా – నిత్యం రక్షన్తు గర్భిణీమ్ ॥ 4

శ్లో॥ వినాయక గణాధ్యక్ష – శివపుత్ర మహాబల ।
ప్రగ్రహ్ణీష్వ బలిం చేమం – సాపత్యం రక్ష గర్భిణీమ్ ॥ 5

శ్లో॥ స్కంద షణ్ముఖ దేవేశ – పుత్రప్రీతి వివర్ధన ।
ప్రగ్రహ్ణీష్వ బలిం చేమాం – సాపత్యం రక్ష గర్భిణీమ్ ॥ 6

శ్లో॥ ప్రభాసః ప్రభవః శ్యామః – ప్రత్యూషో మారుతోఽనలః ।
ధ్రువః ధురాధురశ్చైవ – వసవోఽష్టౌ ప్రకీర్తితాః ।
ప్రగ్రహ్ణీధ్వమ్ బలిం చేమాం – నిత్యం రక్షన్తు గర్భిణీమ్ ॥ 7

శ్లో॥ పితృదేవి పితృశ్రేష్ఠే – బహుపుత్రి మహాబలే ।
బుధశ్రేష్ఠే నిశావాసే – నివృత్తే శౌనకప్రియే ।
ప్రగృహ్ణీష్వ బలిం చేమాం – సాపత్యం రక్ష గర్భిణీమ్ ॥ 8

శ్లో॥ రక్ష రక్ష మహాదేవ, – భక్తానుగ్రహకారక ।
పక్షివాహన గోవింద – సాపత్యం రక్ష గర్భిణీమ్ ॥ 9 ✦



# బాలాయా మన్త్రధ్యానమ్

శ్రీమత్ బాలాత్రిపురసుందరీ త్ర్యక్షర మహామంత్రము

**ఐం క్లీం సౌః**

| | |
|---|---|
| కృత్వా ధ్యానం న్యసేదఙ్గే బాలామాకలయాధునా ॥351 | |
| ఆదౌ వాగ్భవముద్ధృత్య కామబీజం తతః పరమ్ । | |
| సకారోఽధోదన్తయుతో మహాసేనవిరాజితః ॥ | 352 |

త్ర్యక్షరః పరమో మన్త్రో విద్యైశ్వర్యప్రదాయకః ।
సముద్యద్రవిబిమ్బాభామరుణక్షౌమధారిణీమ్ ॥ 353

ఫుల్లరాజీవవదనాం పీనోత్తుఙ్గపయోధరామ్ ।
రత్నకేయూరతాటఙ్కముక్తాహారవిరాజితామ్ ॥ 354

త్రినేత్రాం బాలశీతాంశుఖణ్డశోభిలలాటికామ్ ।
పద్మోపరి సమాసీనాం బాలాం దేవీం చతుర్భుజామ్ ॥ 355

విద్యామభీతిం వామేన దక్షే జపవటీం వరమ్ ।
ధారయన్తీం జగద్ధాత్రీం సర్వదైవ హసన్ముఖీమ్ ॥ 356

సచ్చిన్త్య న్యసనం కుర్యాదప్రమత్తేన చేతసా ।

✦ మహాకాలసంహితా

# శ్రీరాజరాజేశ్వరీమంత్రమాతృకాస్తవమ్
## (పంచదశీమహామంత్రస్తవమ్)



శ్లో॥ కల్యాణాయుతపూర్ణచంద్రవదనాం ప్రాణేశ్వరానందినీం
పూర్ణాం పూర్ణతరాం పరేశమహిషీం పూర్ణామృతాస్వాదినీమ్ ।
సంపూర్ణాం పరమోత్తమామృతకళాం విద్యావతీం భారతీం
శ్రీచక్రప్రియబిందుతర్పణపరాం శ్రీరాజరాజేశ్వరీమ్ ॥ 1

శ్లో॥ ఏకారాదిసమస్తవర్ణవివిధాకారైకచిద్రూపిణీం
చైతన్యాత్మకచక్రరాజనిలయాం చక్రాంతసంచారిణీమ్ ।
భావభావవిభావినీం భవప(హ)రాం సద్భక్తిచింతామణీం
శ్రీచక్రప్రియబిందుతర్పణపరాం శ్రీరాజరాజేశ్వరీమ్ ॥ 2

శ్లో॥ ఈహాధిక్పరయోగిబృందవిదితాం స్వానందభూతాం పరాం
పశ్యంతీం తనుమధ్యమాం విలసినీం శ్రీవైఖరీరూపిణీమ్ ।
ఆత్మానాత్మవిచారిణీం వివరగాం విద్యాం త్రిబీజాత్మికాం
శ్రీచక్రప్రియబిందుతర్పణపరాం శ్రీరాజరాజేశ్వరీమ్ ॥ 3

శ్లో॥ లక్ష్యాలక్ష్యనిరీక్షణాం నిరుపమాం రుద్రాక్షమాలాధరాం
త్ర్యక్షార్ధాకృతిదక్షవంశకలికాం దీర్ఘాక్షిదీర్ఘస్వరామ్ ।
భద్రాం భద్రవరప్రదాం భగవతీం భద్రేశ్వరీం ముద్రిణీం
శ్రీచక్రప్రియబిందుతర్పణపరాం శ్రీరాజరాజేశ్వరీమ్ ॥ 4

శ్లో॥ హ్రీం బీజాగతనాదబిందుభరితాం ఓంకారనాదాత్మికాం
బ్రహ్మానందఘనోదరీం గుణవతీం జ్ఞానేశ్వరీం జ్ఞానదామ్ ।
ఇచ్ఛాజ్ఞానకృతీం మహీం గతవతీం గంధర్వసంసేవితాం
శ్రీచక్రప్రియబిందుతర్పణపరాం శ్రీరాజరాజేశ్వరీమ్ ॥ 5

శ్లో॥ హర్షోన్మత్తసువర్ణపాత్రభరితాం పీనోన్నతాఘూర్ణితాం
హుంకారప్రియశబ్దజాలనిరతాం సారస్వతోల్లాసినీమ్ ।
సారాసారవిచారచారుచతురాం వర్ణాశ్రమాచారిణీం
శ్రీచక్రప్రియబిందుతర్పణపరాం శ్రీరాజరాజేశ్వరీమ్ ॥ 6

శ్లో॥ సర్వేశాంగవిహారిణీం సకరుణాం సన్నాదినీం నాదినీం
సంయోగప్రియరూపిణీం ప్రియవతీం ప్రీతాం ప్రతాపోన్నతామ్ ।
సర్వాంతర్గతశాలినీం శివతనూసందీపినీం దీపినీం
శ్రీచక్రప్రియబిందుతర్పణపరాం శ్రీరాజరాజేశ్వరీమ్ ॥ 7

శ్లో॥ కర్మాకర్మవివర్జితాం కులవతీం కర్మప్రదాం కౌళినీం
కారుణ్యాంబుధిసర్వకామనిరతాం సింధుప్రియోల్లాసినీమ్ ।
పంచబ్రహ్మసనాతనాసనగతాం గేయాం సుయోగాన్వితాం
శ్రీచక్రప్రియబిందుతర్పణపరాం శ్రీరాజరాజేశ్వరీమ్ ॥ 8

శ్లో॥ హస్త్యుత్కుంభనిభస్తనద్వితయతః పీనోన్నతాదానతాం
హారాద్యాభరణాం సురేంద్రవినుతాం శృంగారపీఠాలయామ్ ।
యోన్యాకారకయోనిముద్రితకరాం నిత్యాం నవార్ణాత్మికాం
శ్రీచక్రప్రియబిందుతర్పణపరాం శ్రీరాజరాజేశ్వరీమ్ ॥ 9

శ్లో॥ లక్ష్మీలక్షణపూర్ణభక్తవరదాం లీలావినోదస్థితాం
లాక్షారంజితపాదపద్మయుగళాం బ్రహ్మేంద్రసంసేవితామ్ ।
లోకాలోకితలోకకామజననీం లోకాశ్రయాంకస్థితాం
శ్రీచక్రప్రియబిందుతర్పణపరాం శ్రీరాజరాజేశ్వరీమ్ ॥ 10

శ్లో॥ హ్రీంకారాశ్రితశంకరప్రియతనుం శ్రీయోగపీఠేశ్వరీం
మాంగల్యాయుతపంకజాభనయనాం మాంగల్యసిద్ధిప్రదామ్ ।
తారుణ్యేన విశేషితాంగసుమహాలావణ్యసంశోభితాం
శ్రీచక్రప్రియబిందుతర్పణపరాం శ్రీరాజరాజేశ్వరీమ్ ॥ 11

శ్లో॥ సర్వజ్ఞానకళావతీం సకరుణాం సర్వేశ్వరీం సర్వగాం
సత్యాం సర్వమయీం సహస్రదళగాం సత్త్వార్ణవోపస్థితామ్ ।
సంగాసంగవివర్జితాం సుఖకరీం బాలార్కకోటిప్రభాం
శ్రీచక్రప్రియబిందుతర్పణపరాం శ్రీరాజరాజేశ్వరీమ్ ॥ 12

శ్లో॥ కాదిక్షాంతసువర్ణబిందుసుతనుం సర్వాంగసంశోభితాం
నానావర్ణవిచిత్రచిత్రచరితాం చాతుర్యచింతామణిమ్ ।

చిత్రానందవిధాయినీం సుచపలాం కూటత్రయాకారిణీం
శ్రీచక్రప్రియబిందుతర్పణపరాం శ్రీరాజరాజేశ్వరీమ్ ॥ 13

శ్లో॥ లక్ష్మీశానవిధీంద్రచంద్రమకుటాద్యష్టాంగపీఠాశ్రితాం
సూర్యేంద్వగ్నిమయైకపీఠనిలయాం త్రిస్థాం త్రికోణేశ్వరీమ్ ।
గోప్త్రీం గర్వనిగర్వితాం గగనగాం గంగాం గణేశప్రియాం
శ్రీచక్రప్రియబిందుతర్పణపరాం శ్రీరాజరాజేశ్వరీమ్ ॥ 14

శ్లో॥ హ్రీంకూటత్రయరూపిణీం సమయినీం సంసారిణీం హంసినీం
వామాచారపరాయణీం సుకులజాం బీజావతీం ముద్రిణీమ్ ।
కామాక్షీం కరుణార్ద్రచిత్తసహితాం శ్రీమత్త్రిమూర్త్యంబికాం
శ్రీచక్రప్రియబిందుతర్పణపరాం శ్రీరాజరాజేశ్వరీమ్ ॥ 15

శ్లో॥ యా విద్యా శివకేశవాదిజననీ యా వై జగన్మోహినీ ।
యా బ్రహ్మాదిపిపీలికాంతజగదానందైకసంధాయినీ ।
యా పంచప్రణవద్విరేఫనళినీ యా చిత్కళామాలినీ
సా పాయాత్ పరదేవతా భగవతీ శ్రీరాజరాజేశ్వరీ ॥ 16

శ్లో॥ హ్రీంకారాసనగర్భితానలశిఖాం సౌఃక్లీంకళాం బిభ్రతీం
సౌవర్ణాంబరధారిణీం వరసుధాధౌతాం త్రినేత్రోజ్జ్వలామ్ ।
వందే పుస్తకపాశమంకుశధరాం స్రగ్భూషితాముజ్జ్వలాం
త్వా గౌరీం త్రిపురాం పరాత్పరకళాం శ్రీచక్రసంచారిణీమ్ ॥

✦ ✦ ✦





# అగ్నేః మన్త్రధ్యానమ్

శ్లో॥ అగ్నిం ప్రజ్వలితం వన్దే జాతవేదం హుతాశనమ్ ।
సువర్ణవర్ణమమలం సమిద్ధం విశ్వతోముఖమ్ ॥

శ్లో॥ అథాగ్నిమన్త్రం విన్యస్యేత్తద్విధానముదీర్యతే ।
వైశ్వానరాన్తే జాతేతి వేదాన్తే స్యాదిహావహ ॥

శ్లో॥ లోహితాక్షపదాత్సర్వకర్మాణ్యన్తే తు సాధయ ।
వహ్నిప్రియాన్తో మన్త్రోయం షడ్వింశత్యక్షరాన్వితః ॥

శ్లో॥ ఋషిశ్ఛన్దో దేవతాస్య భృగుర్గాయత్రపావకాః ।
రం బీజం ఠద్వయం శక్తిర్ హవనే వినియోజనమ్ ॥

– మన్త్రమహోదధిః – 1 ప్రథమతరంగః

షడ్వింశత్యక్షరమహామంత్రము

| *"వైశ్వానర జాతవేద ఇహావహ లోహితాక్ష సర్వకర్మాణి సాధయ స్వాహా"* |
|---|

వహ్నిప్రియా = స్వాహా = ఠద్వయమ్

ఓం అస్య అగ్నిమన్త్రస్య భృగుర్ఋషిః, గాయత్రీ ఛందః, పావకో దేవతా, రం బీజం,
స్వాహా శక్తిః, హవనే వినియోగః

ధ్యానశ్లోకః

శ్లో॥ త్రినేత్రమారక్తతనుం సుశుక్లవస్త్రం సువర్ణస్రజమగ్నిమీడే ।
వరాభయస్వస్తికశక్తిహస్తం పద్మస్థమాకల్పసమూహయుక్తమ్ ॥ ✦

# ।। मन्त्रमातृकापुष्पमालास्तवः ।।

कल्लोलोल्लसितामृताब्धिलहरीमध्ये विराजन्मणि -
द्वीपे कल्पकवाटिकापरिवृते कादम्बवाट्युज्ज्वले ।
रत्नस्तम्भसहस्रनिर्मितसभामध्ये विमानोत्तमे
चिन्तारत्नविनिर्मितं जननि ते सिंहासनं भावये ।। १

एणाङ्कानलभानुमण्डललसच्छ्रीचक्रमध्ये स्थितां
बालार्कद्युतिभासुरां करतलैः पाशांकुशौ बिभ्रतीम् ।
चापं बाणमपि प्रसन्नवदनां कौसुम्भवस्त्रान्वितां
तां त्वां चन्द्रकलावतंसमकुटां चारुस्मितां भावये ।। २

ईशानादिपदं शिवैकफलकं रत्नासनं ते शुभं
पाद्यं कुंकुमचन्दनादिभरितैरर्घ्यं सरत्नाक्षतैः ।
शुद्धैराचमनीयकं तव जलैर्भक्त्या मया कल्पितं
कारुण्यामृतवारिधे तदखिलं संतुष्टये कल्पताम् ।। ३

लक्ष्ये योगिजनस्य रक्षितजगज्जाले विशालेक्षणे
प्रालेयाम्बुपटीरकुंकुमलसत्कर्पूरमिश्रोदकैः ।
गोक्षीरैरपि नारिकेलसलिलैः शुद्धोदकैर्मन्त्रितैः
स्नानं देवि धिया मयैतदखिलं संतुष्टये कल्पताम् ।। ४

ह्रींकाराङ्कितमन्त्रलक्षिततनो हेमाचलात्संचितै
रत्नैरुज्ज्वलमुत्तरीयसहितं कौसुम्भवर्णांशुकम् ।
मुक्तासंततियज्ञसूत्रममलं सौवर्णतन्तूद्भवं
दत्तं देवि धिया मयैतदखिलं संतुष्टये कल्पताम् ।। ५

हंसैरप्यतिलोभनीयगमने हारावलीमुज्ज्वलां
हिन्दोलद्युतिहीरपूरिततरे हेमाङ्गदे कङ्कणे ।
मञ्जीरौ मणिकुण्डले मकुटमप्यर्धेन्दुचूडामणिं
नासामौक्तिकमंगुलीयकटकौ काञ्चीमपि स्वीकुरु ।। ६

सर्वाङ्गे घनसारकुंकुमघनश्रीगन्धपङ्काङ्कितं
कस्तूरीतिलकं च फालफलके गोरोचनापत्रकम् ।
गण्डादर्शनमण्डले नयनयोर्दिव्याञ्जनं तेऽञ्चितं
कण्ठाब्जे मृगनाभिपङ्कममलं त्वत्प्रीतये कल्पताम् ।। ७

कल्हारोत्पलमल्लिकामरुवकैः सौवर्णपङ्केरुहै-
र्जातीचम्पकमालतीवकुलकैर्मन्दारकुन्दादिभिः ।
केतक्या करवीरकैर्बहुविधैः क्लृप्ताः स्रजो मालिकाः
संकल्पेन समर्पयामि वरदे संतुष्टये गृह्यताम् ॥ ८

हन्तारं मदनस्य नन्दयसि यैरङ्गैरनङ्गोज्ज्वलै-
र्यैर्भृङ्गावलिनीलकुन्तलभरैर्बध्नासि तस्याशयम् ।
तानीमानि तवाम्ब कोमलतरण्यामोदलीलागृहा-
ण्यामोदाय दशाङ्गगुग्गुलुघृतैर्धूपैरहं धूपये ॥ ९

लक्ष्मीमुज्ज्वलयामि रत्ननिवहोद्भास्वत्तरे मन्दिरे
मालारूपविलम्बितैर्मणिमयस्तम्भेषु संभावितैः ।
चित्रैर्हाटकपुत्रिकाकरधृतैर्गव्यैर्घृतैर्वर्धितै-
र्दिव्यैर्दीपगणैर्धिया गिरिसुते संतुष्टये कल्पताम् ॥ १०

ह्रींकारेश्वरि तप्तहाटककृतैः स्थालीसहस्रैर्भृतं
दिव्यान्नं घृतसूपशाकभरितं चित्रान्नभेदं तथा ।
दुग्धान्नं मधुरशर्करादधियुतं माणिक्यपात्रे स्थितं
माषापूपसहस्रमम्ब सकलं नैवेद्यमावेदये ॥ ११

सच्छायैर्वरकेतकीदलरुचाताम्बूलवल्लीदलैः
पूगैर्भूरिगुणैः सुगन्धिमधुरैः कर्पूरखण्डोज्ज्वलैः ।
मुक्ताचूर्णविराजितैर्बहुविधैर्वक्त्राम्बुजामोदनैः
पूर्णा रत्नकलाचिका तव मुदे न्यस्ता पुरस्तादुमे ॥ १२

कन्याभिः कमनीयकान्तिभिरलङ्कारामलारार्तिका-
पात्रे मौक्तिकचित्रपङ्क्तिविलसत्कर्पूरदीपालिभिः ।
तत्तत्तालमृदङ्गगीतसहितं नृत्यत्पदाम्भोरुहं
मन्त्राराधनपूर्वकं सुविहितं नीराजनं गृह्यताम् ॥ १३

लक्ष्मीर्मौक्तिकलक्षकल्पितसितच्छत्रं तु धत्ते रसा-
दिन्द्राणी च रतिश्च चामरवरे धत्ते स्वयं भारती ।
वीणामेणविलोचनाः सुमनसां नृत्यन्ति तद्रागव-
द्भावैराङ्गिकसात्त्विकैः स्फुटरसं मातस्तदाकर्ण्यताम् ॥ १४

ह्रींकारत्रयसंपुटेन मनुनोपास्ये त्रयीमौलिभि-
र्वाक्यैर्लक्ष्यतनो तव स्तुतिविधौ को वा क्षमेताम्बिके ।

सल्लापाः स्तुतयः प्रदक्षिणशतं सञ्चार एवास्तु ते
संवेशो नमसः सहस्रमखिलं त्वत्प्रीतये कल्पताम् ।। १५

श्रीमन्त्राक्षरमालया गिरिसुतां यः पूजयेच्चेतसा
सन्ध्यासु प्रतिवासरं सुनियतस्तस्यामलं स्यान्मनः ।
चित्ताम्भोरुहमण्टपे गिरिसुता नृत्तं विधत्ते रसा-
द्वाणीं वक्त्रसरोरुहे जलधिजा गेहे जगन्मङ्गला ।। १६

इति गिरिवरपुत्रीपादराजीवभूषा
भुवनममलयन्ती सूक्तिसौरम्यसारैः ।
शिवपदमकरन्दस्यन्दिनीयं निबद्धा
मदयतु कविभृङ्गान्मातृकापुष्पमाला ।। १७

मन्त्रमातृकापुष्पमालास्तवः संपूर्णः ।।

---

# YONI MUDRA




## BENEFITS

- Relieves from menstrual pain.
- Menopause problems can be resolved.
- Calms nervous system.
- Awakens the kundalini.

శ్రీం

# ఋషభతీర్థమాహాత్మ్యమ్

## (శ్రీలక్ష్మీనారాయణీయసంహితాయామ్)

ఓం శ్రీ గణేశాయ నమః

శ్రీకృష్ణ ఉవాచ

శ్లో॥ శృణు త్వం రాధికే చాన్యం చమత్కారం శ్రియఃపతేః ।
కుంకుమవాపికాక్షేత్రే జాతం యోగేశ్వరం ప్రతి ॥ 1

శ్లో॥ వీతిహోత్రో మహాయోగీ వనే యోగేశ్వరోఽభవత్ ।
హిమాచలే బదర్యాం స తపస్తేపేఽతిదారుణమ్ ॥ 2

శ్లో॥ సర్వయోగకలాః ప్రాప యథా శంభుస్తథాఽభవత్ ।
తేన యోగప్రతాపేన దృష్టా వై దివ్యచక్షుషా ॥ 3

శ్లో॥ కేతుమాలే కృతా యజ్ఞాః కేనాటేఽపి కృతా మఖాః ।
అమరీణాం ప్రదేశేషు కృతం యద్ధరిణా తు తత్ ॥ 4

శ్లో॥ ఊర్జాకృష్ణాష్టమీజన్మమహోత్సవశ్చ యః కృతః ।
శారదాపూజనాద్యం చ హ్యన్నకూటమహోత్సవః ॥ 5

శ్లో॥ ఏతత్సర్వం దివ్యదృష్ట్యా విజ్ఞాయ పరమేశ్వరమ్ ।
కాంభరేయం బాలకృష్ణం ద్రష్టుం సాక్షాదుపాయయౌ ॥ 6

శ్లో॥ ఆయయౌ కుంకుమవాపీక్షేత్రే కృష్ణనారాయణమ్ ।
సహస్రరూపధర్తాఽసౌ వీతిహోత్రః సమాధిమాన్ ॥ 7

శ్లో॥ మార్గశీర్షతృతీయాయామశ్వపట్టసరస్తటే ।
సేతుమాశ్రిత్య చ న్యగ్రోధస్యాఽధోఽధాన్నిజాసనమ్ ॥ 8

శ్లో॥ సహస్రరూపధర్తాఽసౌ సంకల్ప్య నిషసాద హ ।
మమ మూలస్వరూపం చాగత్యాఽఽశ్లిష్యేత్ రమాపతిః ॥ 9

శ్లో॥ తతః సహస్రరూపైశ్చాఽఽశ్లిష్యేన్మాం స ప్రభుః పునః ।
ఋషభస్య కారయేన్మే సద్గురోర్దర్శనం యది ॥ 10

శ్లో॥ తదాఽహం శ్రీహరేరగ్రే నివత్స్యేఽత్ర సదాఽనుగః ।
మోక్షం ప్రసాధయిష్యేఽత్ర బదర్యా న ప్రయోజనమ్ ॥ 11

శ్లో॥ న గురోరపరస్యాపి మోక్షదో హి గురుర్యతః ।
యత్రాత్మనో భవేత్పుష్టిర్యేన తరతి సాగరమ్ ॥ 12

శ్లో॥ యస్మాచ్చాత్మమహాశాన్తిస్తం గురుం త్వాశ్రయేజ్జనః ।
యస్మాత్పాపవినాశశ్చ యస్మాదజ్ఞాననాశనమ్ ॥ 13

శ్లో॥ యస్మాద్ వృత్తినిరోధశ్చ వాసనాక్షపణం యతః ।
యస్మాదాత్మప్రకాశశ్చ తం గురుం త్వాశ్రయేజ్జనః ॥ 14

శ్లో॥ యస్మాచ్ఛిక్షామవాప్యైతైశ్వర్యం చమత్కృతిం తథా ।
దివ్యభావమధితిష్ఠేత్తం గురుం త్వాశ్రయేజ్జనః ॥ 15

శ్లో॥ గురవో బహవః సన్తి లౌకికాశ్చాప్యలౌకికాః ।
లౌకికేన హి లోకస్థాః కార్యా వై గురవో యథా ॥ 16

శ్లో॥ అలౌకికేన శిష్యేణాఽలౌకికా గురవో ధృతాః ।
మయాఽప్యలౌకికః సోఽయం కర్తవ్యో భగవాన్ గురుః ॥ 17

శ్లో॥ యత్ర సర్వం హి కర్తవ్యం హరౌ పరిసమాప్యతే ।
మాతా గురుర్హి జనిదా పితా గురుర్హి బీజదః ॥ 18

శ్లో॥ అన్యే రక్షాకరాః సన్తి దేహస్య గురవో హి తే ।
భాషాజ్ఞానకరాశ్చాన్యే బాన్ధవాద్యాశ్చ యోషితః ॥ 19

శ్లో॥ తథా శిక్షాకరాశ్చాన్యే విద్యాదానకరా అపి ।
కలాకౌశల్యశిక్షాయా దాతారో గురవోఽపి చ ॥ 20

శ్లో॥ త ఏతే దేహయాత్రాయా భవన్తి గురవః ఖలు ।
ఆత్మజ్ఞానప్రదో యస్తు విష్ణుమన్త్రప్రదశ్చ యః ॥ 21

శ్లో॥ ధర్మవృత్తిప్రదో యశ్చ గురుః శ్రేష్ఠో హి సమ్మతః ।
బ్రహ్మస్థితిప్రదో యశ్చ యోగసిద్ధిప్రదశ్చ యః ॥ 22

శ్లో॥ వైశారద్యప్రదో బుద్ధౌ గురుః శ్రేష్ఠతరో హి సః ।
నిర్మూలాం వాసనాం కృత్వా పరమేశప్రదర్శకః ॥ 23

శ్లో॥ ఆత్మనా పరమాత్మానం ప్రాపకో దివ్యమోక్షదః ।
బ్రహ్మలోకప్రేషకశ్చ గురుః శ్రేష్ఠతమో హి సః ॥ 24

శ్లో॥ గకారస్త్వన్ధమజ్ఞానం రకారో జ్ఞానముజ్జ్వలమ్ ।
అజ్ఞానహా జ్ఞానదశ్చ గురుర్గౌరవవాన్మతః ॥ 25

శ్లో॥ గమయత్యక్షరం ధామ రమయత్యపి ధామినా ।
గురుః సోఽయం మోక్షదాతా నాన్యః శ్రేష్ఠస్తతో గురుః ॥ 26

శ్లో॥ గురుర్యోగీ బ్రహ్మచారీ ధర్మీ జ్ఞానీ విరాగవాన్ ।
సాధుశీలో గురుశ్చాపి నారాయణః పరో గురుః ॥ 27

శ్లో॥ భుక్తిదాతా మోక్షదాతా సర్వస్వదో హరిర్గురుః ।
గురోః సాక్షాత్కారయితా గురోర్గురుర్యతోఽత్ర సః ॥ 28

శ్లో॥ స ఏవ శ్రీహరిశ్చాఽయం ముక్తానాం పరమో గురుః ।
గురుః సర్వావతారాణాం సతీనాం చ సతాం గురుః ॥ 29

శ్లో॥ ఈశ్వరాణాం తథా ధామ్నాం యోగినాం సర్గసంవిదామ్ ।
పూర్వేషాం సృష్టికర్తౄణాం మహర్షీణాం ద్యువాసినామ్ ॥ 30

శ్లో॥ ప్రజేశానాం కర్మఠానాం భక్తానాం చ పరో గురుః ।
గురూణాం యావతామగ్ర్యో నారాయణగురోర్గురుః ॥ 31

శ్లో॥ అనాది శ్రీకృష్ణనారాయణః శ్రీకృష్ణవల్లభః ।
శ్రీకృష్ణవల్లభః స్వామీ కాంభరేయః పరాత్పరః ॥ 32

శ్లో॥ శ్రీమద్గోపాలబాలోఽయం స్వామీ వై సర్వదేహినామ్ ।
మయా లబ్ధః స మే పూర్ణం కరిష్యత్యేవ మానసమ్ ॥ 33

శ్లో॥ నివత్స్యామి చరణేఽస్య ప్రాప్స్యామి ధామ చాక్షరమ్ ।
సఞ్చిన్త్యేతి వీతిహోత్రో ధ్యానమగ్నః సహస్రధా ॥ 34

శ్లో॥ సహస్రరూపవాన్ జాతో దృష్ట్వా తం మానవాస్తటే ।
స్నాతారోఽగుః పరాశ్చర్యం కస్యేమాని సమాని వై ॥ 35

శ్లో॥ రూపాణి, కే చాగతా వై యోగినోఽత్ర సహస్రశః ।
సమవేషాః సమదేహాః సమాంగాః సన్తి సదృశాః ॥ 36

శ్లో॥ సమకేశాః సమధ్యానాః సమానపరిమాణకాః ।
భ్రాతరో వా భవన్త్యేతే ధామముక్తా భవన్తి వా ॥ 37

శ్లో॥ బదరీవాసినో వాఽపి శ్వేతముక్తాః కిమాగతాః ।
శంకరస్య గణాః కింవా దేవాస్తాపసరూపిణః ॥ 38

శ్లో॥ సాధ్యా వా దేవతా యద్వా మేరువాసా హి తాపసాః ।
క ఏతే తు భవేయుర్వై చన్ద్రాస్యా భాస్కరప్రభాః ॥ 39

శ్లో॥ ధ్యానయోగా యోగినో వా యోగీశ్వరాః సహస్రశః ।
న వదన్తి న పశ్యన్తి న ప్రాణాన్ చాలయన్త్యపి ॥ 40

శ్లో॥ స్థిరమౌనాః స్థిరచిత్తా ఈశ్వరాః స్యుశ్చ కేన్విమే ।
ఇత్యేవం తర్కయన్తో వై కుంకుమవాపికాజనాః ॥ 41

శ్లో॥ సంఘశో వై సమాయాన్తి ద్రష్టుం కుతూహలాన్వితాః ।
కేచిన్నమన్తి దృష్ట్వైవ ప్రశంసన్తి వదన్తి చ ॥ 42

శ్లో॥ ప్రతాపోఽయం బాలకృష్ణకృపానాథస్య వర్తతే ।
అస్య దర్శనలాభార్థం నిత్యమాయాన్తి యోగినః ॥ 43

శ్లో॥ అదృశ్యా ఈదృశాః సర్వేఽధునా తే దృశ్యతాం గతాః ।
రుద్రాః సహస్రశశ్చాపి విష్ణవశ్చ సహస్రశః ॥ 44

శ్లో॥ సహస్రశో౽పి బ్రహ్మాణో ద్రష్టుమాయాన్తి సత్వరమ్ ।
తథా మహర్షయో నిత్యం పితరో దేవతాస్తథా ॥ 45

శ్లో॥ సాధ్యా విశ్వే చ మరుతో ద్రష్టుమాయాన్తి నిత్యశః ।
తీర్థాన్యపి సమాయాన్తి దిక్పాలాః సృష్టిపాలకాః ॥ 46

శ్లో॥ అథవా పార్షదా దివ్యా గోలోకాదినివాసినః ।
సమాయాన్తి చ వైకుణ్ఠపార్షదా అపి నిత్యశః ॥ 47

శ్లో॥ గ్రహనక్షత్రతారాశ్చ సూర్యాశ్చన్ద్రాః సహస్రశః ।
వైమానికాః సమాయాన్తి లోకాన్తరేభ్య ఆదృతాః ॥ 48

శ్లో॥ వాలఖిల్యాః సమాయాన్తి యద్వా బ్రహ్మసభాద్విజాః ।
కిం వా భవేయుర్గాన్ధర్వా యక్షా వా ధనదాశ్చ వా ॥ 49

శ్లో॥ చారణాః పర్వతావాసా మునయో వా వనస్థితాః ।
పరం సాదృశ్యమేవైషామపూర్వత్వం విగాహతే ॥ 50

శ్లో॥ లలాటే వైష్ణవం పుణ్ద్రం మస్తకే తాపసీ జటా ।
నేత్రముద్రా యోగపుష్టాః ఖ్యాపయన్త్యంశమాచ్యుతమ్ ॥ 51

శ్లో॥ యే వా కే వా భవేయుస్తే సాక్షాత్కృతా యదత్ర తే ।
అస్మాభిర్దైవయోగేన పుణ్యవద్భిః సుభాగ్యకైః ॥ 52

శ్లో॥ అవశ్యమేషాం విజ్ఞానం క్షణే౽త్రైవ భవిష్యతి ।
ఇత్యేవం తే వదన్తశ్చ ప్రజాః సంఘశ ఏవ హ ॥ 53

శ్లో॥ ప్రపశ్యన్తి సరస్తీరే సహస్రయోగినస్తదా ।
అథ శ్రీమద్బాలకృష్ణో నారాయణగురోర్గురుః ॥ 54

శ్లో॥ సమాయయౌ సరస్తీరే సన్నిధౌ యోగినాం తదా ।
హార్దం జానంస్తదా తూర్ణం ప్రవీక్ష్య మూలరూపిణమ్ ॥ 55

శ్లో॥ సముత్తోల్య సమాహూయ నామ్నా తం వీతిహోత్రక ! ।
ఉత్తిష్ఠేతి కరౌ ధృత్వా కృత్వా వక్షసి యోగినమ్ ॥ 56

శ్లో॥ సమాశ్లిష్యద్ధసంస్తూర్ణం స్వయం సహస్రధా౽భవత్ ।
సముత్థితైః సహస్రస్వరూపైరాశ్లిష్యదచ్యుతః ॥ 57

శ్లో॥ తతస్తూర్ణం హరిశ్చైకస్వరూపః సమ్బభూవ హ ।
వీతిహోత్రో౽పి సహసా త్వేకరూపో వ్యజాయత ॥ 58

శ్లో॥ ఆశ్చర్యచకితా లోకా జయశబ్దాన్ ప్రచక్రిరే ।
తావచ్ఛ్రీబాలకృష్ణో౽పి బభూవ ఋషభో గురుః ॥ 59

శ్లో॥ వృద్ధః శ్వేతజటాయుక్తో వివస్త్రో ధూలిధూసరః ।
విచిత్త ఇవ చోన్మత్తో జితసర్వేన్ద్రియో యతిః ॥ 60

శ్లో॥ స్వభావతేజసా వ్యాప్తో బ్రహ్మనిష్ఠాపరః పుమాన్ ।
అప్రాకృత ఇవ త్వాస్తే విమనా ఇవ దేహిషు ॥ 61

శ్లో॥ వీతిహోత్రోఽపి చ గురుమృషభం వీక్ష్య దణ్డవత్ ।
చకార బహుధా తత్ర తుష్టావ పరమేశ్వరమ్ ॥ 62

శ్లో॥ త్వం గురుస్త్వం చాన్తరాత్మా ఋషభస్త్వం చ యోగిరాట్ ।
యోగేశ్వరో భవానేవ త్వం చేశస్త్వం పరేశ్వరః ॥ 63

శ్లో॥ త్వం ముక్తస్త్వం మహాముక్తో ముక్తేశ్వరో భవానపి ।
అక్షరం త్వం భవాన్ బ్రహ్మ పరబ్రహ్మ భవానపి ॥ 64

శ్లో॥ భగవాన్ కృష్ణ ఏవాసి కృష్ణనారాయణోఽసి చ ।
అనాదిశ్రీకృష్ణనారాయణస్త్వం పరమేశ్వరః ॥ 65

శ్లో॥ అవతారా ఋషభాద్యాస్తవైవ శ్రీపతే విభో ।
రాధాపతిస్త్వమేవాఽసి లక్ష్మీపతిస్త్వమేవ చ ॥ 66

శ్లో॥ వాసుదేవీపతిస్త్వం చ నారాయణీపతిస్తథా ।
ముక్తపతిర్బ్రహ్మపతిర్ధామపతిస్త్వమేవ చ ॥ 67

శ్లో॥ మహాకాలస్య హేతుస్త్వం మహావిష్ణోశ్చ కారణమ్ ।
సదాశివస్య హేతుస్త్వం వైరాజస్య చ కారణమ్ ॥ 68

శ్లో॥ భూమా త్వం పూరుషసంజ్ఞః పురుషోత్తమ ఇత్యపి ।
బ్రహ్మవిష్ణుమహేశానాం రుద్రాణాం సర్జకో భవాన్ ॥ 69

శ్లో॥ దేవానాం లోకపాలానాం పితౄణాం సర్జకో భవాన్ ।
మహర్షీణాం యతీనాం చ సాధూనాం సర్జకః సతామ్ ॥ 70

శ్లో॥ సతీనాం కమలాద్యానాం పతిః పాతా చ వై భవాన్ ।
సురాణాం మానవానాం చ పశూనాం పక్షిణాం తథా ॥ 71

శ్లో॥ వల్లీనాం చ ద్రుమాణాం చ సర్జకస్త్వం రసప్రదః ।
కామధేనుకామవల్లీచిన్తామణ్యాదిసర్జకః ॥ 72

శ్లో॥ యక్షరక్షఃపిశాచానాం సర్జకస్త్వం ఖచారిణామ్ ।
వారిజానాం వనస్థానాం భూగర్భాణాం ప్రసర్జకః ॥ 73

శ్లో॥ దైత్యానాం దానవానాం చ సర్జకస్త్వం జనార్దనః ।
దీనానాథదరిద్రానాం రక్షకః పోషకో భవాన్ ॥ 74

శ్లో॥ ఆశ్రితానామన్నదాతా శరణ్యశ్చార్తిదేహినామ్ ।
కాముకానాం కామదాతా సకామానాం ప్రపూరకః ॥ 75

శ్లో॥ త్వం నారీ త్వం నరశ్చాస్సే త్వం గర్భస్త్వం కుమారకః ।
త్వం బీజం త్వం సస్యరూపస్త్వం పుష్పం ఫలమిత్యపి ॥ 76

శ్లో॥ త్వమిన్ద్రస్త్వమిన్ద్రియస్త్వం నిద్రా త్వం జాగరో భవాన్ ।
త్వం సుషుప్తిర్మహానన్దస్త్వం ప్రీతిస్త్వం రతిస్తథా ॥ 77

శ్లో॥ మన్మథస్త్వం మనోజన్యో మనఃసంస్థో భవానపి ।
జ్ఞానం జ్ఞాతా జ్ఞేయమేవ త్వమేవాఽసి పరేశ్వర ॥ 78

శ్లో॥ త్వమ్ ఋతుస్త్వం దినం రాత్రిస్త్వముద్యోగో విరామకః ।
త్వం విశ్వాసశ్చాశ్రయశ్చ త్వం మాతా చ పితా గురుః ॥ 79

శ్లో॥ ధనం ధాన్యం త్వమేవాఽసి శక్తిర్బలం త్వమేవ చ ।
నీతిర్భక్తిర్వృషో రాగో వైరాగ్యం చ త్వమేవ హ ॥ 80

శ్లో॥ త్వం ప్రాణస్త్వం జీవనం చ నైకధా చైకధా భవాన్ ।
ప్రకాశస్త్వం ప్రవృత్తిస్త్వం నిరోధస్త్వం గుణాత్మకః ॥ 81

శ్లో॥ గుణాతీతస్త్వమేవాఽసి సర్వసిద్ధిగుణాశ్రయః ।
ఆశ్చర్యం త్వం చమత్కారస్త్వమైశ్వర్యం ప్రభుత్వకమ్ ॥ 82

శ్లో॥ త్వం భూర్జలం భవాంస్తేజోఽనిలస్త్వం త్వం తథాఽనలః ।
త్వం ఖం త్వం మాత్రకం త్వం చ బుద్ధిస్త్వం చైషణాత్రయమ్ ॥ 83

శ్లో॥ త్వం పరీక్షా తితిక్షా త్వం త్వం బుభుక్షా ముముక్షుతా ।
త్వం స్నేహస్త్వం ధ్యానవృత్తిస్త్వం సమాధిః పరాత్పరః ॥ 84

శ్లో॥ ఉపాస్తిస్త్వం చిత్తచైత్యం త్వం జాడ్యం త్వం తథాఽఽణుతా ।
త్వం సామ్యం త్వం చ వైషమ్యం త్వమేవ సర్వమేవ హ ॥ 85

శ్లో॥ అహం త్వం వీతిహోత్రస్త్వం త్వం గురుః ఋషభస్తథా ।
తవైవాంఽశకలాఽఽవేశవిభూతిసృష్టిజం త్విదమ్ ॥ 86

శ్లో॥ యత్ కించిద్ దృశ్యతే చాపి భుజ్యతే లీయతేఽపి చ ।
యస్మాద్ యత్ర చ యేనాపి యదర్థం చ త్వమేవ సః ॥ 87

శ్లో॥ తస్మై కృష్ణాయ నాథాయ బ్రహ్మణే పరబ్రహ్మణే ।
సమర్పయామి చాత్మానం వీతిహోత్రాభిధం సదా ॥ 88

శ్లో॥ దానమేవ న తు న్యాసం నాపి కుసీదకం తథా ।
యథేష్టవినియోగార్హం సమర్పయామి మాం త్వహమ్ ॥ 89

శ్లో॥ ఇతి స్తుత్వా రాధికే సమ్పపాత పాదయోర్ద్వరేః ।
వీతిహోత్రశ్చాఽథ కృష్ణస్తముత్థాపయదూర్ధ్వకమ్ ॥ 90

శ్లో॥ సమాశ్లిష్య పునర్హస్తౌ దత్వా తస్య చ మూర్ధని ।
న్యయుంక్త వరలాభార్థం వీతిహోత్రం హరిర్యదా ॥ 91

శ్లో॥ వీతిహోత్రస్తదా ప్రాహ స్థాస్యేఽత్ర తవ పాదయోః ।
అన్తే మోక్షం గమిష్యస్యక్షరం ధామ తవ ప్రభో ॥ 92

శ్లో॥ దేహి వాసం సదా చాత్ర తథాస్తూవాచ వై హరిః ।
రాధికే తన్మహత్తీర్థమ్ ఋషభాఖ్యం సరోవరే ॥ 93

శ్లో॥ వీతిహోత్రాభిధం తీర్థం సహస్రయోగితీర్థకమ్ ।
ఏవం నామ్నా తదేవాసీత్ ప్రసిద్ధం మోక్షదం శుభమ్ ॥ 94

శ్లో॥ హరిర్బభూవ సహసా బాలకృష్ణస్వరూపధృక్ ।
ప్రయయౌ చ నిజావాసం వీతిహోత్రస్తతే స్థితః ॥ 95

శ్లో॥ వటవృక్షం సమాశ్లిష్య తాపసో జనదర్శనః ।
తత్ర తీర్థే కృతస్నానాః ప్రాప్స్యన్తి పరమాం గతిమ్ ॥ 96

శ్లో॥ యోగసిద్ధిమవాప్స్యన్తి యోగాభ్యాసం వినాఽపి చ ।
రాధికే తత్ర సంస్నాన్నాశమేష్యన్తి పాతకాః ॥ 97

శ్లో॥ ఆర్ద్రం శుష్కం మహత్స్వల్పం పరపీడాకరం చ యత్ ।
సర్వం నశ్యతి పాపం తజ్జలపానాదపి ద్రుతమ్ ॥ 98

శ్లో॥ తత్రాఽన్నదానతః స్యాత్తు వాజిమేధసమం ఫలమ్ ।
ఋషభస్యాఽఽలయకర్తుర్మమ ధామాఽక్షరం భవేత్ ॥ 99

శ్లో॥ ఇత్యేవం భగవానాహ రాధికే తీర్థవైభవమ్ ।
పఠనాచ్ఛ్రవణాచ్చాస్య భవేత్తత్తీర్థజం ఫలమ్ ॥ 100

ఇతి శ్రీలక్ష్మీనారాయణీయసంహితాయాం ద్వితీయే త్రేతాసన్తానే
వీతిహోత్రయోగీశ్వరాయ ఋషభరూపేణ సహస్రరూపేణ చ
హరేర్దర్శనమ్, ఋషభతీర్థీకరణమ్, స్తుతిశ్చేత్యాదినిరూపణనామా
చత్వారింశదధికద్విశతతమోఽధ్యాయః ।



# కనకధారాస్తవము

## "జాతవేదో మమావహ"

శంకర విరచితమయిన యీ స్తోత్రం లోక ప్రసిద్ధం. దీని ప్రసిద్ధనామం 'కనకధారాస్తవం'. శంకరులు బ్రహ్మచారిగా ఉన్న దశలో కౌమారవయస్సులో భిక్షాస్వీకారానికి ఒక పేద యింటికి వెళ్ళారు. ఆ యింటి యిల్లాలు ఇంట్లో ఏమీ లేక – ఒక ఉసిరికాయ దొరికితే అదే ఆయనకు భిక్షగా యిచ్చింది. శంకరులు ఆమె భక్తికి మెచ్చి, ఆమె అశక్తతకి నొచ్చి వారికి లక్ష్మీకటాక్షం కలిగించటానికి వెంటనే ఆశువుగా "హరివల్లభ"ను ఈ స్తవంతో స్తుతించారు. ఆ ప్రభావంతో ఆ యింట బంగారు 'ఉసిరికాయ'ల వర్షం కురిసిందట. అంతటితో ఆ యింటికి సౌభాగ్యం కలిగింది. అందువలననే దీనికి కనకధారాస్తవమని పేరు వచ్చినది. సువర్ణధారాస్తోత్రమని మరొక పేరున్నది. సువర్ణం అనగా, బంగారు, అక్షరాలు. అంటే సువర్ణములు అనగా మంచి రమణీయార్థం గల అక్షరములు. అట్టి రమణీయాక్షరధార ఇది అన్నది ప్రత్యక్ష విషయం. సువర్ణం అంటే మంచి వర్ణన అని అర్థము. ఈ కవితలో వర్ణనగూడా పుష్కలంగా ఉన్నది. మంచి వర్ణాలు, వర్ణనలు – ఏదో ఒకటి లేని శ్లోకం ఈ స్తుతిలో లేదు. హృదయంగమమయిన భావాలు చాలా ఉన్నాయి. అట్టి యీ సువర్ణధారాస్తోత్రం చదువరులకు సువర్ణధారలతో బాటు భక్తులకు కనకధారలు కురిపిస్తుందని ఆశ. కుబేరులను చేస్తుందని ఆశ. "ఆశ దురాశ నిరాశ" మనకు సహజం. 'సదాశ' తక్కువ. సదాశ లేనివారికి ఈ ఫలశ్రుతులు ఆశను, దురాశను, చివరకు నిరాశను కలిగిస్తాయి. ఎందుకంటే,

నేటివరకు ఎవరయినా యీ స్తోత్రపారాయణ ద్వారా కనకవర్షం కురిపించిందీ లేనిదీ మనకు తెలియదు. బంగారు ఉసిరివాన మనకు అనుభవంలో లేదు. అంత 'దృశ్య'ం లేక పోయినా యీ స్తోత్రపారాయణతో కుబేరులయిన వారెవరో మనకు తెలియదు. ఒకవేళ అయినామని ఎవరయినా చెప్పినా దానిచేతనే అయినారని నిరూపణ కావాలి.

సరే! అదట్లా ఉండనీయండి. అలా జరగకపోవటానికి మనం కారణాలు ఊహించాలి. అందులో

**మొదటిది :** మన "శ్రద్ధాలోపం భక్తిలోపం" – కాని యిన్ని వందల సంవత్సరాలలో ఒక్కరికయినా అంతటి భక్తి లేదనాలా? ఒక్క పేదవాడయినా నిండు భక్తితో చదవడా! లక్ష్మీదేవికి పక్షపాతమని – అలా అనరాదుగదా! ఇక

**రెండవది :** రామబాణం వంటి సమాధానం. "ప్రారబ్ధం। గ్రహచారం। కర్మ" ఇందులో ప్రతిబంధకమయిన ప్రారబ్ధం పోవటమో, అనుకూల ప్రారబ్ధం రావటమో, లేక ప్రారబ్ధలేశం ఈ స్తోత్రం వలన నశించి వ్యక్తి బాగుపడటమో అవుతుంది. ఈ కారణానికి వేద శాస్త్రాలు పెట్టనికోటలు.

"హరిణాపి హరేణాపి బ్రహ్మణాపి సురైరపి।
లలాటలిఖితా రేఖా పరిమార్ష్టుం న శక్యతే ॥ అలాగే
"అవశ్యం భావి భావానాం – ప్రతీకారో భవేద్యది।
తథా దుఃఖైః న బాధ్యేరన్ – నలరామయుధిష్ఠిరాః ॥

అయితే ప్రతిబంధకం తొలగడం ఎలా? ప్రతిబంధకం అనుభవంతో శాంతించి చివరిదశకు

వచ్చినపుడుగాని, అసలు ప్రతిబంధక కర్మయే బలహీనమయినపుడు గాని యిట్టి స్తోత్రములు తీవ్రభక్తితో పారాయణ చేస్తే శాంతిస్తుందని శాస్త్రనిర్ణయం.

"పూర్వజన్మార్జితం కర్మ – వ్యాధిరూపేణ బాధతే ।
తచ్ఛాంతిరౌషధైః దానైః – జపహోమసురార్చనైః ॥

శ్రీవిద్యారణ్యస్వామి వారు మాధవనామంతో గృహస్థులై యుండగా పేదరికంతో బాధపడి లక్ష్మీ మంత్రారాధన చేసినట్లు, కాని దేవి ప్రారబ్ధ ప్రతిబంధము వలన సంపద నివ్వలేనని చెప్పినట్లు వదంతి. తర్వాత కాలక్రమంలో వారు సన్యసించారు. సంన్యాసం మరోజన్మతో సమానం కనుక ఆయనకు శృంగగిరి పీఠాధిపత్యము మొదలగు అసంగరాజయోగం పట్టినది. అంటే తనకనుభవం లేదు. సంన్యాసి గదా! కోరి రాజయోగం పట్టింది. ఈ కథ పెద్దల వలన విన్నాము. కనుక ఏదయినా కర్మఫలాన్ని బట్టే జరుగుతుంది.

మహాత్ములయినా ఆశ్రితుని కర్మ ఫలాన్నిబట్టి గాని దాని బలహీనతను, సమాప్తి దశను గ్రహించి తమ మహిమతో ఆ ప్రారబ్ధలేశఖండనతో ఉపకారం చేస్తారు. దేవతలయినా అంతే. 'మూక' కవికి ప్రారబ్ధావసానాన్ని బట్టియే స్వామి కవితా శక్తినిప్పించారనక తప్పదు. లేదంటే శంకరులు చిరాయువయ్యేవారు. మార్కండేయుని ఆయుర్దాయం కోసం మృత్యు – మృత్యుంజయుల మధ్య అంత పోరాటం అవసరం లేదు. పరీక్షిత్తును బ్రతికించటానికి చక్రి 'గర్భం'లో కాపలా ఉండే అవసరం లేదు. ప్రారబ్ధం। గ్రహచారం బలవత్తరం.

అందువలననే కొందరికి ఏమి చేసినా ఏ ఉపకారం జరగదు. ఏ స్వాములవారు ఏమీ చెప్పరు, చేయరు. బలవత్తరమయిన కర్మఫలాన్ని ఎవరూ ఏమీ ఆపలేరు. సంచితాగామి కర్మలను క్షణంలో భస్మం చేయగలిగిన 'తత్త్వదర్శనం' కూడా ప్రారబ్ధాన్ని మాత్రం తప్పించదని శాస్త్రం ఘంటాపథంగా చెప్తున్నది. మరి యీ స్తోత్రాలు కర్మలు పెద్దల మహిమలు ఎలా ప్రారబ్ధాన్ని మార్చగలవు. అందువలన దేవతలయినా కర్మ ఫలం ఇవ్వడం తప్ప ఏమీ చేయలేరు.

"సర్వకర్మప్రవర్తినీ", "సుఖప్రాణిశిరోరేఖా", సదదృష్టప్రదాయినీ" అన్నది లక్ష్మీసహస్రనామం. "తాం మ అవహ జాతవేదో లక్ష్మీమనపగామినీమ్" అన్నది శ్రీసూక్తం. 'అగ్ని' దేవుడు 'శ్రీ' ని కలిగిస్తాడట. "అగ్నే నయ సుపథా రాయే అస్మాన్ ", "హోతారం రత్నధాతమమ్", అన్నది శ్రుతి.

"శ్రియమిచ్ఛేత్ హుతాశనాత్" అని వాక్యము. అంటే అర్థం అగ్నిముఖులయిన దేవతలను అగ్నిద్వారా హవ్యకవ్యములతో సంతృప్తి పరిచిన వానికి లక్ష్మీప్రాప్తి. అనగా కర్మఫలమే సంపద. కర్మ, కర్మఫలవ్యవస్థలకు ప్రవర్తకురాలు శ్రీదేవియే.

"తామగ్నివర్ణాం తపసా జ్వలంతీం వైరోచనీం  కర్మ ఫలేషు జుష్టామ్" – శ్రుతి.

ఈ వ్యవస్థ విషయంలో "మంత్రరహస్యం" అనే గ్రంథంలో ఇలా చెప్పబడినది.

"అత్యుత్కటైః పుణ్య పాపైః – ఇహైవ ఫలముచ్యతే ।
పుణ్యస్యానుత్కటత్వేతు – చిరాత్ కించిత్ఫలం లభేత్ ॥ అన్నారు.

అంతేకాక "ప్రతిబంధకబాహుళ్యే ఫలం జన్మాంతరే లభేత్" అన్నారు కనుక అతి తీవ్రంగా పారాయణం చేస్తే, ప్రారబ్ధం బలహీనం అయితే 'వాయిదా తీర్మానం' లాగా వెంటనే మన పారాయణం ఆ ప్రారబ్ధాన్ని వాయిదా వేయించి మరీ ఫలించవచ్చు. ఇలా అనుకొని చేయటం 'సదాశ', అట్టివారికి

తరువాత జన్మలోనయిన ఫలితం ఉంటుందనే 'ఆశ' ఉంటుంది. వీరికి 'నిరాశ' ఉండదు. 'దురాశ'కు నిరాశ తప్పదు.

"న దేవతోషణం వ్యర్థం – భవిష్యతి కదాచన" – మంత్రరహస్యం. అయితే పైజన్మసంగతి మనకు తెలియదు గనుక వ్యర్థమయినట్లు భావిస్తాము.

అందుకే శంకరులు గూడా తమ స్తోత్రంలో ఈ విషయాన్ని సూచించారు. చూడండి. "దుష్కర్మఘర్మమపనీయ", "దురితాహరణోద్యతాని" శంకరవాక్కు వేదతుల్యం. ఆయన లోకాతీతుడయిన జ్ఞాని. జ్ఞానతపస్వి.

"జ్ఞానీత్వాత్మైవ కేవలమ్" అది భగవంతుని వాక్కు. విశ్వగురువు జగద్గురువు నోట పలికించిన అపరశ్రీసూక్తము ఈ స్తోత్రము. వారి వాక్కులో 'లక్ష్మి' ఉంటుంది. 'వచనాంగమానసైః' అన్న మాటలో వారదే సూచించారు. శ్రీసూక్తం గూడా చివరి మంత్రంలో ధీరవాక్కులో లక్ష్మి ఉంటుందని చెప్పింది. చూడండి.

"సక్తుమివ 'తితఉ'నా పునంతో – యత్ర ధీరా మనసావాచమక్రత,
అత్ర సఖాయ స్సఖ్యాని జానతే – భద్రైషాం లక్ష్మీః నిహితాధివాచి"

అనగా, 'జల్లెడ' తో సత్తుపిండిని పవిత్ర పరచినట్లు ధీరులు తమ మనస్సుతో వాక్కును శుద్ధంగా చేస్తారు. ఆ వాక్కుతో స్నేహితులు స్నేహాలు తెలిసికొంటారు. (శబ్దార్థాలు తమ సఖ్యాన్ని తెలిసికొంటాయి) వారి వాక్కులో భద్రమూర్తి అయిన లక్ష్మి ఉంటుంది. అని అదే అన్నాడు భవభూతి.

"లౌకికానాం హి సాధూనాం – అర్థం వాగనువర్తతే ।
ఋషీణాం పునరాద్యానాం – వాచమర్థోనుధావతి"

అంతేగాదు ఆర్షవాక్కు గురించి అందులో లక్ష్మి ఉంటుందని భవభూతి ఉత్తరరామచరితంలో అంటాడు.

ఆవిర్భూతజ్యోతిషాం బ్రాహ్మణానాం
యే వ్యాహారాః తేషు మా సంశయోభూత్ ।
భద్రాహ్యేషాం వాచి లక్ష్మీః నిషక్తా
నైతే వాచం విప్లుతార్థాం వదంతి ॥

వాక్కును అగ్ని అని, ధేనువని చెప్తారు. ఈ ధీరుని వాగగ్నిధారయే యీ కనకధార. అదే యీ సువర్ణధార. ఆనందించండి.

ఇందులో కొన్ని శ్లోకాలు లక్ష్మీనారాయణుల వివాహదాంపత్యాదులను అందంగా వర్ణించాయి. కనుక పెళ్లికి సిద్ధమయిన వధూవరులు గూడా అట్టి అనుసంధానంతో పారాయణ చేయదగిన "కళ్యాణధార" ఇది అని నా జ్ఞాన ఘోష. కళ్యాణం అంటే బంగారం అని మరొక అర్థం. ప్రధానంగా వర్ణింపబడిన విషయం "దేవీకటాక్షం". అదే కళ్యాణరూపం సంపద్రూపం అదే కారుణ్యరూపం. అందువలన దీనిని, కటాక్షధారాస్తోత్రం అనవచ్చు. "అపాంగలహరీస్తోత్రం" అనిగూడా అనవచ్చును – అని నా ఆనందఘోష.

ఏదయినా మొత్తంమీద ఈ "స్తవం" శబ్దార్థాలంకార శృంగారాద్యంగములతో చక్కని భక్తిభావధ్వనులకు ఆలవాలమై మనోవాక్కులకు ప్రసాదం కలిగిస్తుందన్నది అనుభవసత్యం.

– మేళ్ళచెర్వు

తాం పద్మినీమీం శరణమహం ప్రపద్యే ।

కనకధారాస్తవః

# కనకధారాస్తవము

శ్లో॥ వందే వందారుమందార - మిందిరానందకందలమ్ ।
అమందానందసందోహ - బంధురం సింధురాననమ్ ॥ 1 ॥

శ్లో॥ అంగం హరేః పులకభూషణమాశ్రయంతీ
భృంగాంగనేవ ముకులాభరణం తమాలమ్ ।
అంగీకృతాఖిలవిభూతిరపాంగలీలా
మాంగల్యదాస్తు మమ మంగలదేవతాయాః ॥ 2 ॥

శ్లో॥ ముగ్ధా ముహుర్విదధతీ వదనే మురారేః
ప్రేమత్రపాప్రణిహితాని గతాగతాని ।
మాలా దృశోర్మధుకరీవ మహోత్పలే యా
సా మే శ్రియం దిశతు సాగరసంభవాయాః ॥ 3 ॥

శ్లో॥ విశ్వామరేంద్రపదవిభ్రమదానదక్షం
ఆనందహేతురధికం మురవిద్విషోఽపి ।
ఈషత్ నిషీదతు మయి క్షణమీక్షణార్థం
ఇందీవరోదరసహోదరమిందిరాయాః ॥ 4 ॥

శ్లో॥ ఆమీలితాక్షమధిగమ్య ముదా ముకుంద-
మానందకందమనిమేషమనంగతంత్రమ్ ।
ఆకేకరస్థితకనీనికపక్ష్మ నేత్రం
భూత్యై భవేన్మమ భుజంగశయాంగనాయాః ॥ 5 ॥

శ్లో॥ కాలాంబుదాళి లలితోరసి కైటభారేః
ధారాధరే స్ఫురతి యా తటిదంగనేవ ।
మాతుస్సమస్తజగతాం మహనీయమూర్తిః
భద్రాణి మే దిశతు భార్గవనందనాయాః ॥ 6 ॥

శ్లో॥ బాహ్యాంతరే మురజిత్ణ శ్రితకౌస్తుభే యా
హారావలీవ హరినీలమయీ విభాతి ।
కామప్రదా భగవతోఽపి కటాక్షమాలా
కల్యాణమావహతు మే కమలాలయాయాః ॥ 7 ॥

శ్లో॥ ప్రాప్తం పదం ప్రథమతః ఖలు యత్ప్రభావాత్
మాంగల్యభాజి మధుమాథిని మన్మథేన ।
మయ్యాపతేత్తదిహ మంథర మీక్షణార్ధం
మందాలసం చ మకరాలయకన్యకాయాః ॥ 8 ॥

శ్లో॥ దద్యాత్ దయానుపవనో ద్రవిణాంబుధారాం
అస్మిన్నకించనవిహంగశిశౌ విషణ్ణే ।
దుష్కర్మఘర్మమపనీయ చిరాయ దూరం
నారాయణప్రణయినీ నయనాంబువాహః ॥ 9 ॥

శ్లో॥ ఇష్టావిశిష్టమతయోఽపి నరా యయా ద్రాక్
దృష్టాః త్రివిష్టపపదం సులభం భజంతే ।
దృష్టిః ప్రహృష్టకమలోదరదీప్తిరిష్టాం
పుష్టిం కృషీష్ట మమ పుష్కరవిష్టరాయాః ॥ 10 ॥

శ్లో॥ గీర్దేవతేతి గరుడధ్వజసుందరీతి
శాకంభరీతి శశిశేఖరవల్లభేతి ।
సృష్టిస్థితిప్రళయకేళిషు సంస్థితా యా
తస్యై నమః త్రిభువనైకగురోః తరుణ్యై ॥ 11 ॥

శ్లో॥ శ్రుత్యై నమోఽస్తు శుభకర్మఫలప్రసూత్యై
రత్యై నమోఽస్తు రమణీయగుణార్ణవాయై ।
శక్త్యై నమోఽస్తు శతపత్రనికేతనాయై
పుష్ట్యై నమోఽస్తు పురుషోత్తమవల్లభాయై ॥ 12 ॥

శ్లో॥ నమోఽస్తు నాళీకనిభాననాయై
నమోఽస్తు దుగ్ధోదధిజన్మభూమ్యై ।
నమోఽస్తు సోమామృతసోదరాయై
నమోఽస్తు నారాయణవల్లభాయై ॥ 13 ॥

శ్లో॥ నమోఽస్తు హేమాంబుజపీఠికాయై
నమోఽస్తు భూమండలనాయికాయై ।
నమోఽస్తు దేవాదిదయాపరాయై
నమోఽస్తు శార్ఙ్గాయుధవల్లభాయై ॥ 14 ॥

శ్లో॥ నమోఽస్తు దేవ్యై భృగునందనాయై
నమోఽస్తు విష్ణోరురసిస్థితాయై ।
నమోఽస్తు లక్ష్మ్యై కమలాలయాయై
నమోఽస్తు దామోదరవల్లభాయై ॥ 15 ॥

శ్లో॥ నమోఽస్తు కాంత్యై కమలేక్షణాయై
నమోఽస్తు భూత్యై భువనప్రసూత్యై ।
నమోఽస్తు దేవాదిభిరర్చితాయై
నమోఽస్తు నందాత్మజవల్లభాయై ॥ 16 ॥

శ్లో॥ సంపత్కరాణి సకలేంద్రియమోహనాని
సామ్రాజ్యదాననిరతాని సరోరుహాక్షి! ।
త్వద్వందనాని దురితాహరణోద్యతాని
మామేవ మాతరనిశం కలయంతు మాన్యే ॥ 17 ॥

శ్లో॥ యత్కటాక్షసముపాసనావిధిః
సేవకస్య సకలార్థసంపదః ।
సంతనోతి వచనాంగమానసైః
త్వాం మురారిహృదయేశ్వరీం భజే ॥ 18 ॥

శ్లో॥ సరసిజనయనే! సరోజహస్తే!
ధవళతమాంశుకగంధమాల్యశోభే !
భగవతి! హరివల్లభే! మనోజ్ఞే !
త్రిభువనభూతికరి! ప్రసీద! మహ్యామ్ ॥ 19 ॥

శ్లో॥ దిగ్దంతిభిః కనకకుంభముఖావసృష్ట-
స్వర్వాహినీవిమలచారుజలప్లుతాంగీమ్ ।
ప్రాతర్నమామి జగతాం జననీమశేష-
లోకాధినాథగృహిణీమమృతాబ్ధిపుత్రీమ్ ॥ 20 ॥

శ్లో॥ కమలే! కమలాక్షవల్లభే! త్వం
కరుణాపూరతరంగితైరపాంగైః ।
అవలోకయ మామకించనానాం
ప్రథమం, పాత్రమకృత్రిమం దయాయాః ॥ 21 ॥

శ్లో॥ బిల్వాటవీమధ్యలసత్సరో జే
సహస్రపత్రే సుఖసన్నివిష్టామ్ ।
అష్టాపదాంభోరుహపాణిపద్మామ్
సువర్ణవర్ణాం ప్రణమామి లక్ష్మీమ్ ॥ 22 ॥

శ్లో॥ కమలాసనపాణినా లలాటే
లిఖితామక్షరపంక్తిమస్య జంతోః ।
పరిమార్జయ మాతరంఘ్రిణా తే
ధనికద్వారనివాసదుఃఖదోగ్ధ్రీమ్ ॥ 23 ॥

శ్లో॥ అంభోరుహం జన్మగృహం భవత్యాః
వక్షఃస్థలం భర్తృగృహం మురారేః ।
కారుణ్యతః కల్పయ పద్మవాసే!
లీలాగృహం మే హృదయారవిందమ్ ॥ 24 ॥

శ్లో॥ స్తువంతి యే స్తుతిభిరమూభిరన్వహం
త్రయీమయీం త్రిభువనమాతరం రమామ్ ।
గుణాధికా గురుతరభాగ్యభాజినో
భవంతి తే భువి బుధభావితాశయాః ॥ 25 ॥

ఫలశ్రుతి

శ్లో॥ సువర్ణధారాస్తోత్రం యత్ శంకరాచార్యనిర్మితమ్ ।
త్రిసంధ్యం యః పఠేన్నిత్యం స కుబేరసమో భవేత్ ॥

శ్రీః

ఓం
శ్రీగణేశాయ నమః

# శ్రీ శివపంచాక్షరీభాష్యమ్

**ఓం నమశ్శివాయేతి మన్త్రః**

శ్లో॥ త్యాగో హి నమసో వాచ్య ఆనన్దః ప్రకృతేస్తథా ।
ఫలం ప్రత్యయవాచ్యం స్యాత్త్యాజ్యం పత్రఫలాదికమ్ ॥ 1

శ్లో॥ త్యజామీదమిదం సర్వం చతుర్ణామిహ సిద్ధయే ।

**ఓం నమశ్శివాయ**

అథవా నమసో వాచ్యః ప్రణామో దైన్యలబ్ధయే ॥ 2

శ్లో॥ దైన్యం సేవా తథా జ్ఞప్తిః సిద్ధిస్సర్వస్య వస్తునః ।
నమామి దేవదేవేశం సకామోఽకామ ఏవ వా ॥ 3

**ఓం నమశ్శివాయ**

శ్లో॥ నఞా నిషిధ్యతే భావవికృతిర్జగదాత్మనః ।
మననం దేవదేవేశ నేహ నానాస్తి శబ్దతః ॥ 4

శ్లో॥ అయేతి గమయేత్యర్థే తస్మాచ్ఛుద్ధోఽస్మి నిత్యశః ।
ప్రణామో దేహగేహాదేరభిమానస్య నాశనమ్ ॥ 5

**ఓం నమశ్శివాయ**

శ్లో॥ శివో బ్రహ్మాదిరూపస్స్యాచ్ఛక్తిభిస్తిసృభిస్సహ ।
అథవా తుర్యమేవ స్యాన్నిర్గుణం బ్రహ్మ తత్పరమ్ ॥ 6

శ్లో॥ నమసో నమనే శక్తిర్నమనం ధ్యానమేవ చ ।
జేఽన్తాత్తాదాత్మ్యసమ్బన్ధః కథ్యతే ప్రత్యగాత్మనోః ॥ 7

శ్లో॥ అహం శివః శివోఽహఞ్చ మన్యే వేదాన్తనిష్ఠయా ।
ఇత్యేవం నమ ఇత్యుక్తం వేదైశ్శాస్త్రైశ్చ సర్వశః ॥ 8

శ్లో॥ అథవా దాస ఏవాహమహం దాస ఇతీరణమ్ ।
ఇత్యేవ నమ ఇత్యుక్తం వేదైశ్శాస్త్రైశ్చ సర్వశః ॥ 9

శ్లో॥ అథవేదమిదం సర్వం త్యజామి పరమాప్తయే ।
అర్థం ధర్మఞ్చ కామఞ్చ వాఞ్ఛంశ్చ జగదీశ్వరమ్ ॥ 10

శ్లో॥ ఏతన్మన్త్రార్థతత్త్వజ్ఞైర్వేదవేదాన్తతత్పరైః ।
నిర్ణీతం తత్త్వగర్భం యద్విజ్ఞేయం ముక్తిలబ్ధయే ॥ 11

శ్లో॥ అథవా ముక్తిలాభాయ ధ్యేయం తత్త్వం వివేకతః ।
భిన్నం బుద్ధ్వా హృదా దేవం మన్త్రేశం జగద్గురుమ్ ॥ 12

**ఓం నమశ్శివాయ**

శ్లో॥ నమేరచి నమః ప్రోక్తో జన్తా స్యాజ్జగదీశ్వరే ।
తస్మాద్దాసోఽహమిత్యేవం మత్వా మాం ప్రాపయాత్మని ॥ 13

**ఓం నమశ్శివాయ**

శ్లో॥ అస్మిఞ్ఛతే జగత్సర్వం తన్మయం శబ్దగామి యత్ ।
తద్వానాచ్ఛివ ఇత్యుక్తం కారణం బ్రహ్మ తత్పరైః ॥ 14

శ్లో॥ న మా యస్యాస్తి లక్ష్మీశ! సోఽహం దేవో న సంశయః ।
తస్మాన్మే ప్రాపయేహైవ లక్ష్మీం విద్యాం సనాతనీమ్ ॥ 15

శ్లో॥ యస్మాదానన్దస్వరూపస్త్వం దేవైర్వేదైర్నిగద్యసే ।
తస్మాన్మే దేహి యోగీశ! భద్రం జ్ఞానం సుభావనమ్ ॥ 16

**ఓం నమశ్శివాయ**

శ్లో॥ యస్మాత్త్వం నేతి నేతీతి నఞర్థం మాఽసి వేదజమ్ ।
తస్మాన్నమోఽసి భద్రం మే యతో జాతోఽనమో నమః ॥ 17

శ్లో॥ శివం శివమథాప్రాప్తః శివాయేతి నిగద్యసే ।
శివాయ మే తథా ప్రాప్త్యా శివాయం కురు సర్వదా ॥ 18

**ఓం నమశ్శివాయ**

శ్లో॥ శివాం యాతో మహాభద్ర! నమోఽహం మాయయా ధ్రువమ్ ।
తతో నమాయ మహ్యం మః శివాయం కురు సర్వథా॥ 19

**ఓం నమశ్శివాయ**

శ్లో॥ శివమేషి యతో జ్ఞప్త్యా శివాయస్త్వం ప్రపఠ్యసే ।
న తే మాయా యతో జ్ఞప్త్యా నమో వేదైః ప్రపఠ్యతే ॥ 20

శ్లో॥ నమోఽహఞ్చ శివాయోఽహం నమో మహ్యం నమో నమః ।
నమో నమాయ శుద్ధాయ మఙ్గళాయ నమో నమః ॥ 21

శ్లో॥ నమో న మసనం శంభో! నిరాకారాయ తే నమః ।
నిర్గుణం నిష్క్రియం శాన్తమిత్యాద్యాః శ్రుతయో జగుః ॥ 22

శ్లో॥ నమో బ్రహ్మ నిరాకారం శివాయం శివ సర్వదా ।
అతోఽహఞ్చ న మా భద్ర! శివాయోఽహం న సంశయః ॥ 23

ఇతి శ్రీమద్ పద్మపాదాచార్యవిరచితం "శ్రీ శివపఞ్చాక్షరీభాష్యమ్"
సమాప్తమ్ (అక్షరదోషరహితం)





# శివపఞ్చాక్షరీస్తోత్రమ్

ఓం నమః శివాయ శివాయ నమ ఓం

ఓం నమః శివాయ శివాయ నమ ఓం

శ్లో॥ నాగేంద్రహారాయ త్రిలోచనాయ
భస్మాంగరాగాయ మహేశ్వరాయ ।
నిత్యాయ శుద్ధాయ దిగంబరాయ
తస్మై "న" కారాయ నమః శివాయ ॥ 1

శ్లో॥ మందాకినీసలిలచందనచర్చితాయ
నందీశ్వరప్రమథనాథమహేశ్వరాయ ।
మందారముఖ్యబహుపుష్పసుపూజితాయ
తస్మై "మ" కారమహితాయ నమః శివాయ ॥ 2

శ్లో॥ శివాయ గౌరీవదనాబ్జబృంద-
సూర్యాయ దక్షాధ్వరనాశకాయ ।
శ్రీనీలకంఠాయ వృషభధ్వజాయ
తస్మై "శి" కారాయ నమః శివాయ ॥ 3

శ్లో॥ వశిష్ఠకుంభోద్భవగౌతమార్య-
మునీంద్రదేవార్చితశేఖరాయ ।
చంద్రార్కవైశ్వానరలోచనాయ
తస్మై "వ" కారాయ నమః శివాయ ॥ 4

శ్లో॥ యజ్ఞస్వరూపాయ జటాధరాయ
పినాకహస్తాయ సనాతనాయ ।
దివ్యాయ దేవాయ దిగంబరాయ
తస్మై "య" కారాయ నమః శివాయ ॥ 5

శ్లో॥ పంచాక్షరమిదం పుణ్యం యః పఠేచ్ఛివసన్నిధౌ ।
శివలోకమవాప్నోతి శివేన సహ మోదతే ॥

✦



శ్రీః

# శ్రీ చంద్రశేఖర సరస్వతీస్వామివారి స్తుతి

శ్లో॥ యః సర్వజ్ఞ ఇతీర్యతే యమభితః ప్రాజ్ఞా న యేనాజ్ఞతా
యస్మై చ స్పృహయత్యశేషజనతా యస్మాన్న మృగ్యం క్వచిత్ ।
యస్య ప్రేమలతాభివర్షతి శుభాన్ యస్మిన్ మనో ముచ్యతే
సోఽవ్యాత్సర్వవిభక్తిగమ్యచరణః శ్రీకామకోటీశితా ॥

– బ్రహ్మశ్రీ తాడేపల్లి రాఘవనారాయణశాస్త్రి, చందోలు.
– వ్యాఖ్య – మేళ్ళచెర్వు వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి, తెనాలి.

**ప్రతిపదార్థము :** యః = ఏ మహాత్ముడు, సర్వజ్ఞః = సర్వజ్ఞానముగలవాడు, ఇతి = అని, ఈర్యతే = చెప్పబడునో, ప్రాజ్ఞాః = పండితులు, యమ్ = ఏ దేవుని, అభితః = చుట్టూ ఉ ండెదరో, యేన = ఎవనిచేత, అజ్ఞతా = అజ్ఞానము, న = ఉండదో, అశేష = సమస్తమయిన, జనతా చ = జనసమూహమున్ను, యస్మై = ఎవనికొఱకు, స్పృహయతి = కోరుచుండునో, యస్మాత్ = ఎవనికన్న భిన్నముగా, మృగ్యమ్ = అన్వేషింపదగినది, క్వచిత్ = ఎక్కడయినా, న = లేదో, యస్య = ఏ దేవునియొక్క, ప్రేమలతా = ప్రేమ / వాత్సల్యవల్లరి, శుభాన్ = శుభములను, అభివర్షతి = కురియునో, యస్మిన్ = ఎవనియందు, మనః = మనస్సు, ముచ్యతే = విడువబడునో, సః = అట్టివాడును, సర్వవిభక్తి = సమస్తవిభక్తులచేత, విభాగములచేత, గమ్య = పొందదగిన, చరణః = పాదములుగల, శ్రీ = శ్రీమంతమయిన, కామకోటీ = కామకోటిపీఠముయొక్క, ఈశితా = ప్రభువయిన పరమేశ్వరుడు, చంద్రశేఖరేంద్రసరస్వతీస్వాములు, అవ్యాత్ = అందఱిని రక్షించుగాక!

**తాత్పర్యము :** ఈ శ్లోకరచయిత బ్రహ్మశ్రీ తాడేపల్లి రాఘవనారాయణశాస్త్రిగారు, చందోలు నివాసులు. ప్రస్తుతం కీర్తిశేషులు. వారు శ్రీ కాంచీపీఠాధిపతి పరమాచార్యులు శ్రీ చంద్రశేఖరేంద్రసరస్వతీస్వామివారికి అత్యంతప్రియభక్తులు. ఆత్మరూపులు శ్రీశ్రీశ్రీ స్వామివారిని గూర్చి స్వామికి పరమేశ్వరునికి బ్రహ్మాత్మైక్యరూపమయిన అభేదమును మనస్సున లగ్నము చేసి యీ శ్లోకమును రచించినారు. సర్వవిభక్తులతో ఒక పద్యమును వ్రాయుట సంప్రదాయములోనున్న విషయమే. కృష్ణో రక్షతు నో– అని ముకుందమాలలో సంబోధనతో సహా విభక్తి స్తోత్రము చేయబడినది.

సర్వమూలపదార్థమయిన పరమాత్మ సర్వప్రాతిపదికవాచ్యుడు, నిష్క్రియుడుగదా! అయినను వ్యావహారికముగా ఆయన సర్వక్రియలకు మాయద్వారా గాని శక్తిద్వారా గాని ఆశ్రయుడు. సర్వజీవాశ్రయుడు గనుక సర్వకారకాశ్రయుడు. అందువలన పరమార్థమున అక్రియుడు, వ్యవహారమున సక్రియుడు.

అట్టి పరమాత్మను సర్వవిభక్తులతో స్తుతించటం ఇందులో జరిగినది. చూడండి–

యః = ప్రథమావిభక్తి = ఆయన సర్వజ్ఞుడు.

యం = ద్వితీయావిభక్తి = ఆయనను ప్రాజ్ఞులు పరివేష్టించెదరు.

యేన = తృతీయావిభక్తి = ఆయన చేత 'అజ్ఞత' నిలువదు.

యస్మై = చతుర్థీవిభక్తి = ఆయన కొఱకు / ఆయన కోసము అందరు కోరుదురు.

యస్మాత్ = పంచమీవిభక్తి = ఆయనకన్న భిన్నమయినది ఏదీ లేదు. ఉన్నదనుకొన్న అన్నింటికన్న అన్వేషణీయుడాయన.

యస్య = షష్ఠీవిభక్తి = ఆయనయొక్క వాత్సల్యము అందరికి శుభములను వర్షించును.

యస్మిన్ = సప్తమీవిభక్తి = ఆయనయందు మన మనస్సు విడువబడును. లయము చేయబడును.

శ్రీ కామకోటీశ్వరులయిన ఉభయచంద్రశేఖరులు (అనగా స్వామివారు, పరమేశ్వరుడు) సర్వవిభక్తిగమ్యమయిన పాదపద్మములు గలవారు. అట్టి ఐక్యరూపమయిన ఆ కామకోటి పీఠేశ్వరుడయిన చంద్రశేఖరుడు అందరిని రక్షించుగాక!

నోట్ : 'యః – ఎవడు' ఇలా అర్థం రాయకుండా పాఠకసౌకర్యముకొరకు ఆయన – మొ॥ అర్థములను వ్రాసినాను – వ్యాఖ్యాత.

**తాత్పర్యానుసంధానము** – (ఏకవాక్యముగా) –

"సర్వజ్ఞుడు ప్రాజ్ఞపరివృతుడు, అజ్ఞానవినాశకుడు, సమస్తప్రజాప్రేమపాత్రుడు, సర్వోత్తమ – అన్వేషణీయుడు, వాత్సల్యముతో సమస్తశుభములను ఇవ్వగలవాడు, మన మనస్సులను చూరగొన్నవాడు అయిన శ్రీ కామకోటి పీఠాధిపతి అయిన చంద్రశేఖరుడు చంద్రమౌళీశ్వరుడు – సర్వవిభక్తులచేత తాత్పర్యముతో అన్వయించువాడు, అందరిని రక్షించుగాక!

**విశేషములు :**

**1. సర్వజ్ఞః :** సర్వజ్ఞ నామధేయము శర్వునకే తప్ప ఇతరులకు చెల్లదు. "యస్సర్వజ్ఞస్సర్వవిత్" – అయినను, "బ్రహ్మవిద్ బ్రహ్మైవ భవతి" అను విధమున బ్రహ్మవేత్త అయిన చంద్రశేఖరేంద్రయతి చంద్రశేఖరుడే గనుక ఆయనయు సర్వజ్ఞుడే. సర్వజ్ఞుడనగా, సర్వము బ్రహ్మము, అని తెలిసినవాడని శాస్త్రసమర్థితమయిన నిర్వచనము.

**2. ప్రాజ్ఞపరివేష్టితుడు :** ప్రాజ్ఞులనగా పండితులు – దేవతలు. స్వామి, ఈశ్వరుడు – ఇద్దరును ప్రాజ్ఞులచే పరివేష్టితులు. దక్షిణామూర్తిగా ఈశ్వరుడు ప్రాజ్ఞులయిన ఋషులచే పరివేష్టితుడే గదా!

ప్రాజ్ఞులనగా ప్ర + అజ్ఞులు = మిక్కిలి అజ్ఞానులు అనగా సంసారమున బడినవారు. అలాగే సుషుప్తిలో ఒళ్లెరుగని నిద్రలో అజ్ఞానసుఖములను అనుభవించువారు. వీరు ఆనందమయకోశమున ఆనందరూపుడయిన పరమాత్మకు అతిదగ్గరగా పరివేష్టించి యుందురు. దేహముననొక ప్రాజ్ఞుడు కనుక అట్టి ప్రాజ్ఞులచేత ఈశ్వరుడు పరివేష్టితుడే. ప్రాజ్ఞులనగా సమాధిగతులయిన జ్ఞానజీవులు. వారిచే పరివేష్టితుడు ఈశ్వరుడు. కనుక ప్రాజ్ఞపరివేష్టితుడు. అట్లే జ్ఞానబోధకొరకు స్వామివారిని అజ్ఞానులు అనగా సంసారగ్రస్తులయిన పండితజీవులు అపండితజీవులు అందరు ఆయా ఫలముల కొరకు చుట్టుకొని యుండెదరు గదా!

**3. అజ్ఞాననాశకుడు :** పరమేశ్వరదర్శనమయినచో ఆత్మానుభూతివలన అజ్ఞాననాశన మగును. అజ్ఞాన వికారములన్నియు మిథ్యాభూతములయి నశించును. – "భిద్యతే హృదయ గ్రంథిః ఛిద్యంతే సర్వసంశయాః, క్షియంతే తస్మిన్ దృష్టే పరావరే" స్వామి దర్శనమూ అట్టిదే. వారి బోధ అజ్ఞానభంజకము.

**4. సర్వజనతాస్పృహణీయుడు, అన్వేషణీయుడు :** "న రత్నమన్విష్యతి మృగ్యతే హి తత్" "స తం మణిమనిందత" అన్నట్లు ముముక్షువులకు, సంసారకాముకులకు వారి వారి భావనలను బట్టి స్వామి / ఈశ్వరుడు స్పృహణీయుడు. వారే యూరిలో విడిది చేసినా అచటకే వెళ్లి దర్శించేవారున్నారు గదా! "మనసైవ ద్రష్టవ్యమ్".

**5. వాత్సల్యలత – శుభవర్ణము :** ఆయన ప్రేమ దేవీస్వరూపము. ఆమెయే శక్తిరూపము. కామేశ్వరీ రూపము. అన్నపూర్ణారూపము. శాకంబరీరూపము. కనుక ఆ స్థాణువును అల్లికొన్న ఆ లతయే సర్వశు భదాయకము. స్వామి బ్రహ్మాత్మైక్యజ్ఞాని కనుక ఆయన వాత్సల్యమున్ను అట్టిదే.

**6. మనోలయము :** మన మనస్సును స్వామియందే ధారణ చేయుటద్వారా ఆ యోగీశ్వరుని యందు లయము చేసినచో మనకున్న ధ్యానాదికములు కలుగును. మన మనస్సును బ్రహ్మమునందు లయము చేసినచో అది బ్రహ్మాకారమై ప్రత్యక్షమగును. కనుక మనోనాశము బ్రహ్మసాక్షాత్కారము జరుగును. స్వామియందు సమర్పణవలన మనస్సు వ్యాపార రహితమయి మృతప్రాయమయి, అమృతమును కనబరచును. అదే మనోమోచనము. "మన ఏవ మనుష్యాణాం – కారణం బంధమోక్షయోః" కదా!

**7. సర్వవిభక్తులు :** బ్రహ్మం అఖండం. పూర్ణం. విభావరహితం. సర్వవ్యాప్తము. విభక్తి – అనగా విభాగం, విశేషభాగము, విశేషభక్తి అని అర్థములు గలవు. స్వామి అద్వైతాచార్యుడు బ్రహ్మస్వరూపుడు. కనుక ఆయనకు / ఈశ్వరునికి గాని విభాగములు లేవు. అయినను వ్యావహారికముగా జీవులను బట్టి ఆ అంతర్యామికి ఆ అధిష్ఠాన పురుషునకు విభాగములున్నట్లు కనబడుతుంది. కాని అన్ని విభాగములకు ఆయనయే శరణ్యుడు. కనుక పుష్పదంతుడు చెప్పినట్లు – "నృణామేకో గమ్యః త్వమసి పయసామర్ణవ ఇవ". అట్లే విభక్తులు అనగా శరీరధారులయి విశేషభక్తిగల జీవులు. విశేషమయిన ఉపాధి (శరీరం) గల జీవులు. వీరందరికి స్వామి ఆశ్రయణీయమయిన చరణములు లేదా 'ఆచరణ' గలవాడు. "త్వం తథా తత్ర వర్తేథాః" (తై) అన్నట్లు ఆదర్శమూర్తి.

**8. కామకోటీశితా :** 'కామం' అనగా భగవత్కామం అదే సృష్టి కామం. ఆమెకు ఈశ్వరుడు కామేశ్వరుడు. ప్రపంచం ఆ కామకోటి ఫలితము. అట్టి మహాదేవి కామాక్షి – అధిష్ఠానం గా గల కామకోటిపీఠాధిపతి ఏకామ్రనాథుడు – ఈశ్వరుడు. అట్లే స్వామియును ఉపాసనవలన కామాక్షీచంద్రమౌళీశ్వరరూపులు. కనుక మన కామకోటులను గూడా తీర్పగల ఐశ్వర్యం అనగా ఈశ్వరత్వం గలవారు.

ఇట్లు స్వామిని, ఈశ్వరుని, అభేదంగా అర్థశబ్దశ్లేషలతో, నిగమాగమసాక్ష్యంతో కీర్తించినారు శ్రీ చందోలు మహర్షి – శాస్త్రిగారు.



**చంద్రశేఖర చంద్రశేఖర పాహి మాం పాహి మామ్**



శ్రీః

# త్రిపురామన్త్రోద్ధారః

తదుక్తం వామకేశ్వరతంత్రే -

శ్లో॥ లక్ష్మీః పరా మదనవాగ్భవశక్తియుక్తా
తారం చ భూతికమలా కథయన్తి విద్యామ్ ।
శక్త్యాదికం చ విపరీతతయా చ ప్రోక్తం
శ్రీషోడశాక్షరవిధిః శుభదోఽస్తు పూర్ణః ॥

ఉడ్డామరే -

శ్లో॥ క్షీరోదసంభవా భూతిః కామో వాగ్భవమేవ చ ।
శక్తిః ప్రణవలజ్జేఽపి లక్ష్మీః శక్త్యాదికం తతః ॥
విపరీతతయా ప్రోక్తా విద్యా శ్రీషోడశాక్షరీ ॥

రుద్రయామలే -

శ్లో॥ హరిణాక్షీ తథా మాయా కామరాజశ్చ వాసనా ॥

శ్లో॥ శరత్ర్యక్షం తథా క్షామా లక్ష్మీః శక్త్యాదికం తతః ।
విపరీతతయా ప్రోక్తా విద్యా శ్రీషోడశాక్షరీ ॥

యాదవరాఘవపాండవీయేఽపి

శ్లో॥ శ్రీంకారాం త్రిపురం పరాపరమయీం హ్రీంకారబీజాత్మికాం
మాయాకుండలినీం గుణత్రయమయీం క్లీంకారతారాత్మికాం
ప్రాసాదప్రణవత్రయీం పరశివాం కూటత్రయీం చిన్మయీం
ప్రాసాదాదివిలోమషోడశిమయీం విద్యాత్మికాం చిన్తయే ॥

మంత్రప్రకాశనమ్

| శ్రీం హ్రీం క్లీం ఐం సౌః ఓం హ్రీం శ్రీం<br>**కఏఈలహ్రీం** హసకహలహ్రీం సకలహ్రీం<br>సౌః ఐం క్లీం హ్రీం శ్రీం |
|---|

1. శ్రీం హ్రీం క్లీం ఐం సౌః - ప్రాసాదపంచకము 5
2. ఓం హ్రీం శ్రీం - ప్రణవత్రయము 3
3. కఏఈలహ్రీం హసకహలహ్రీం సకలహ్రీం - కూటత్రయము 3
   (బీజములు -15, ఇది పంచదశిమంత్రము)
4. ప్రాసాదాదివిలోమపంచకము - సౌః ఐం క్లీం హ్రీం శ్రీం 5
   బీజములు-28 - సంజ్ఞ **షోడశి** **16**

## శ్రీం (లక్ష్మీబీజనామాని)

ఉక్తం చ ఛిన్నారహస్యే -

శ్లో॥ లక్ష్మీః పద్మా హరిణాక్షీ సరోరుహనివాసినీ ।
కమలా రుక్మిణీ చైవ నారాయణప్రియాపి చ ॥

శ్లో॥ లక్ష్మీబీజాని సప్తైవ కృత్రిమాణ్యపరాణి తు ।

అపరం చ త్రిపురాతిలకే -

శ్లో॥ ఇమే ద్వే కమలా పద్మా హరికాన్తా తథైవ చ ॥

శ్లో॥ శ్రియో బీజాని పంచైవమనృతాన్యపరాణి తు ।

శ్రీం ఇతి లక్ష్మీబీజమ్

---

## హ్రీం (పరాబీజనామాని)

ఉక్తం చ ఆగమాలంకారే -

శ్లో॥ పరా భూతిస్తథా లజ్జా మాయాపి సకలా కు(కృ)శా ॥

శ్లో॥ సమస్తాపి తథా క్షామా దేవీ ప్రణవవీరకౌ ।
వారణార్ణం సుధాబీజం కృత్రిమాణ్యపరాణి తు ॥

హ్రీం ఇతి పరాబీజమ్

---

## క్లీం (మదనబీజాని)

ఉక్తం చ భైరవతన్త్రే -

శ్లో॥ కామః పంచేషురేవం చ మనోజో మదన (మన్మథ) స్తథా ।
మారః ప్రద్యుమ్నకందర్పావనృతాన్యపరాణి తు ॥

క్లీం ఇతి మదనబీజమ్

---

## ఐం (వాగ్భవబీజాని)

ఉక్తం చ త్రిపురాసర్వస్వే -

శ్లో॥ వాగ్భవం మూర్ధబీజం చ చారణం చండికేశ్వరః ।
చంద్రోఽపి చర్మవసనం వాసనాపి తథైవ చ ॥

శ్లో॥ చార్వఙ్ప్యపి చర్మార్ణమసత్యాన్యపరాణి తు ॥

ఐం ఇతి వాగ్భవబీజమ్

---

## సౌః (శక్తిబీజాని)

ఉక్తం చ ఛిన్నాశిరోమణౌ -

శ్లో॥ శక్తిః శమాపి విజ్ఞేయే శరచ్ఛింకం తథైవ చ ॥

శ్లో॥ శక్తేర్బీజాని చత్వారి కృత్రిమాణ్యపరాణి తు ॥

సౌః ఇతి శక్తిబీజమ్

---

## ఓం (తారబీజాని)

శ్లో॥ ప్రణవం చ ఘనస్తారమక్షం (త్ర్యక్షం) తోమాపి చామ్బికః ।
త్రాస్రస్తారవ ఏతాని బీజాని ప్రణవస్య చ ॥

ఓం ఇతి తారబీజమ్

---

శ్లో॥ అపరాణి హ్యసత్యాని మయా ప్రోక్తాని పార్వతి ।
విపరీతతయా ప్రోక్తా విద్యా శ్రీషోడశాక్షరీ ॥

---

## అథ పంచదశి మహామంత్రోద్ధారః

1. శ్లో॥ శివః శక్తిః కామః క్షితిరథ రవిః శీతకిరణః
స్మరో హంసః శక్రస్తదను చ పరామారహరయః ।
అమీ హృల్లేఖాభిస్తిసృభిరవసానేషు ఘటితా
భజన్తే వర్ణాస్తే తవ జనని! నామావయతామ్ ॥

– సౌందర్యలహరి (32)

2. శ్లో॥ స్మరో మారో మారః స్మర ఇతి పరో మారమదనః
స్మరానంగాశ్చేతి స్మరమదనమారాః స్మర ఇతి ।
త్రిఖండః ఖండాంతే కలితభువనేశ్యక్షరయుత–
శ్చతుఃపంచార్ణాస్తే త్రయ ఇతి చ పక్షాక్షరమనుః ॥

– సుభగోదయస్తుతిః (19)

మరిన్ని వివరములకు – పరివస్యారహస్యము, లలితాత్రిశతి, సుభగోదయస్తుతిః, త్రిపురతాపిని ఉపనిషత్ – గ్రంథ, గ్రంథవ్యాఖ్యానములను చూడగలరు. ఇంకను – దక్షిణామూర్తిముని విరచిత 'ఉద్ధారకోశము'ను చూడగలరు.

---

## అభ్యారోహమంత్రం

ఓం అసతో మా సద్గమయ ।
తమసో మా జ్యోతిర్గమయ ।
మృత్యోర్మాఽమృతం గమయ ॥ ఓం ॥

అసతః = అసత్యమైన స్థితినుండి; మా = నన్ను; సత్ = సత్యమైన స్థితికి; గమయ = తోడ్కొనిపోతావు గాక; తమసః = అజ్ఞానంనుండి; మా = నన్ను; జ్యోతిః = జ్యోతిస్వరూపానికి; గమయ = తోడ్కొని వెళతావు గాక; మృత్యోః = మరణంనుండి; మా = నన్ను; అమృతమ్ = మరణరహిత ఉన్నత స్థితికి; గమయ = తీసుకు వెళతావుగాక.





## వనదుర్గాయా మంత్రః

ఉత్తిష్ఠ పురుషి! కిం స్వపిషి । భయమ్మే సముపస్థితమ్ ।
యది శక్యమశక్యం వా । తన్మే భగవతి! శమయ స్వాహా ।

మంత్రవ్యాఖ్య –

హే పురుషి! = పరమపురుషశక్తిరూపా! వనదుర్గామహాదేవీ!; ఉత్తిష్ఠ = లెమ్ము, జాగృతరాలవుకమ్ము; కిమ్ = ఏల?; స్వపిషి = స్వరూపానందముననున్నావు; భయమ్ = (అహంకారమనే) భయము / ఆపద; మే = నా; సముపస్థితమ్ = ఎదుటకు వచ్చియున్నది; యది శక్యం వా = అది నివారించ శక్యమగునదియో; యది అశక్యం వా = అది నివారించ శక్యము కానిదియో; తత్ మే = ఆ (అహంకారమనే) భయమును / ఆపదను; భగవతి! = ఓ భగవతీ!; శమయ = శాంతింపజేయుము; స్వాహా – సు – ఆవహ = మిక్కిలి ఆనందముతో నిర్దిష్టదేవతను ఉద్దేశించిన ఆహుతిని సమర్పించు చున్నాను. 'రమ్ము' అని ఇట అర్థము.

స్వాహా : చంద్రయుగ్మం శిరో దేవమాలా జ్వలనసుందరీ ।
స్వాహా పరా దేవభోజ్యం ఠద్వయం చంద్రయుగ్మమ్ ।
స్రువో హవిర్వేదమాతా దేవాస్యం వహ్నిసుందరీ ।

✦ వేదోక్తము – తంత్రోక్తము – భుక్తిముక్తిప్రదము. ✦



# వనదుర్గా మంత్రకవచమ్

దేవ్యువాచ –

శ్లో॥ హే దేవ! శంకర! శ్రీమన్! ప్రాణనాథ! మహేశ్వర!
కవచం వనదుర్గాయాః కథ్యతాం సిద్ధికారణాత్ ॥

శ్లో॥ మంత్రేణ మ్రియతే యోగీ కవచం రక్షయేత్తతః ।
అతో మే కవచం దేవ! కథ్యతాం మృత్యునాశనమ్ ॥

శివ ఉవాచ –

శ్లో॥ కథ్యతే కవచం దేవ్యాః । శృణు దేవి! సమాహితా ।
ఉత్తిష్ఠ రక్ష మే పాదౌ । పురుషికిం శిరో మమ ॥

శ్లో॥ స్వపిషి భయమ్మే హస్తౌ । రక్ష రక్ష మహేశ్వరి ।
సముపస్థితం తథ్యం మే । హృదయం పరిరక్షతు ॥

శ్లో॥ యది శక్యమశక్యం వా। పరితః పరిరక్షతు ।
తన్మే భగవతి! శ్రీమత్ । సర్వతః పరిరక్షతు ॥

శ్లో॥ శమయాగ్నివధూః* పాతు । సర్వత్రైవ జలే స్థలే ।

శ్లో॥ ఇతీదం వనదుర్గాయాః । కవచం భువి దుర్లభమ్ ।
న దేయం పరశిష్యేభ్యో । యది జీవితుమిచ్ఛతి ॥

---

అగ్నివధూః : – అగ్నిభార్య – స్వాహా.
*శమయ + అగ్నివధూః = శమయ స్వాహా




# ఊర్మిళాదేవి నిద్ర

శ్రీరామభూపాలుడూ – పట్టాభిషిక్తుడై కొలువుండగా
భరతశత్రుఘ్ను లపుడు – సౌమిత్రి వరుస సేవలు సేయగా
మారుతాత్మజు డప్పుడు – రాఘవులజేరి పాదము లొత్తగా
తుంబురు నారదులును – ఏతెంచి నిలిచిగానము సేయగా
రంభాదులా సభలలో – నంత శుభరమ్యమున నాట్యమాడా
సవకాది మౌనీంద్రులు – కొలువులో శాస్త్రములు తర్కింపగా
సకల దేవతలు గొలువ – ఉదయాన పుష్పవర్షము గురిసెనూ
సభయందు కొలువజూచి – ఏతెంచి సంతోషమున జానకి
పతిముఖము జూచినిలిచే – వినయముతో పట్టియంజలి గ్రక్కునా
దేవదేవేంద్ర వినుమా – విన్నపము దెలిపేను చిత్తగింపు
అల శేషు దవతరింప – నొకచిన్న మరది వద్దని పలికెను
ముందుమన మడవులకును – పోగాను ముద్దుమఅది వెంటను
పయనమైరాగ జూచి – తన చెలియ పయనమాయెను **ఊర్మిళా**
వద్దునీవుండు మనుచు సౌమిత్రి – మనల సేవింపవచ్చె
నాడు మొదలుగ శయ్యపై – కనుమూసినాది పవళించినాదీ
యికనయిన యానతిచ్చి – తమ్ముని యిందుముఖి కడకంపుడీ
ప్రాణసతి యీలాగునా – కూర్మితో పలుకంగ విని రాముడూ
తలపోసి చూడనెంచా – తనమదిని తగువిచారము బుట్టెను
ఆశ్చర్యపడి రాముడు – గ్రక్కునా అన్నలక్ష్మణ రమ్మనే
ఊర్మిళ నిద్రనుజూచి రాముడు ఆశ్చర్యపడి లక్ష్మణుని పిలువనంపుట

రమ్ములక్ష్మణ గ్రక్కున – యుచితమా రమణి నెడబాసియుండ
తడవాయె నింక నయిన – ప్రియురాలిదగ్గరకు నీవుపోయి
సరససల్లాపములచే – దుఃఖోపశ్రమలెల్ల మాన్పవయ్యా
అన్నమాటలకు రామా – నుజుడు మహాప్రసాదం బనుచును
అనిపించుకొని గ్రక్కునా – సభవిడిచి చనుదెంచె తనగృహముకూ

వచ్చె లక్ష్మణుని నెలవా – సత్రంబు వాకిళ్లు గడచివచ్చీ
కేళికా గృహముజొచ్చి – లక్ష్మన్న కీరవాణిని జూచెను
కోమలీ పాన్పుపయిన – తొడయెత్తి కోకసవరించి వేగ
తొడుగులు ధరించి వేగా – చల్లని తళ్లుపూరించె మేనా
ప్రాణనాయకి పాన్పునా – గూర్చుండి భాషించె విరహమ్మున
కొమ్మ నీముద్దుముఖమూ – సేవింప కోరినాడే చంద్రుడూ
తాంబూల మెడబాయును – సూపవే నీమోవి రుచులు కొనను
అమృత ధారలు కురియగా – పలుకవే ఆత్మ చల్లన జేయవే
చిటి తామరలు బోలెను – పాదములు కీలించు సత్వరమునా
తన్ను తా మరిచియున్నా – ఆ కొమ్మతమకమున వణకదొడగె

**ఊర్మిళాదేవి నిద్రలేచి భ్రమజెందుట**

అయ్యమీ రెవ్వరయ్యా – మీరింత యాగడమ్ముల కొస్తిరి
సందుగొందులు వెదకుచు – మీరింత తప్పుజేయగ వస్తిరీ
యెవ్వరూ లేనివేళా – మీరిపుడు ఏకాంతమున కొస్తిరా
మాతండ్రి జనకరాజూ – వింటె మిము యాజ్ఞసేయక మానరు
మాయొక్క బావవిన్నా – మీకిపుడు ప్రాణముకు హానివచ్చు
మాయొక్క మఱదివిన్నా – మిమ్మిపుడు బ్రతుకనివ్వరు జగతిలో
హెచ్చైన వంశానికీ – అపకీర్తివచ్చె నేనేమిసేతూ
ఒకడాలి కోరికాదా – ఇంద్రునికి నొడలెల్ల హీనమాయె
పరసతిని కోరిగాదా – రావణుడు మూలముతో హతమాయెను
ఇట్టి ద్రోహములు మీరు – యెరిగుండి యింత ద్రోహము కొస్తిరి
ఆడుతోడూ బుట్టరా – మావంటి తల్లి లేదా మీకునూ
అనుచు ఊర్మిళ పలుకగా – లక్ష్మణుడు విని నగచు నిట్లనియెను
శ్రీరాము తమ్ముండనే – అతడనగ సృష్టిలో నొకరు గలరా
జనకు నల్లుని గానటే – భూమిలో జనకులనగా నెవ్వరు
శత కమలముల బుట్టినా – చేడెరో సీతకును మఱిదిగానా
సీత యనగా నెవ్వరు – భూమిలో సృష్టిని నేను యెరుగా
భూమి ఊర్మిళ యందురే – నీపేరు బొంకవద్దీపట్లను
దశరథుల నెడబాసియో – అక్కడాజానకీ చెరబోయెను
రావణుని సంహరించి – ఆ ధరణిదేవితోడుక వస్తివీ
చేకొన్న యిందువదనా – లోకాపకీర్తికే లోనౌదును.
సీత మరిదిని గానటే – చేడెరో దయయుంచి మేలుకోవే
నిన్ను బాసినది మొదలూ – ప్రాణసఖి నిద్రహారము లెరుగనే
నీవు లేవాకున్నను – ఓ సఖీ ప్రాణములు నిలుపలేనే
అనుచు కన్నుల జలములూ – కారంగ లక్ష్మణుడు తాబలికెను
కత్తియొర తీసి యపుడు – లక్ష్మణుడు క్రూరముగ తాబలికెను

అనుచు వాదము సేయగా – ఊర్మిళా గద్దిల్లిపడి లేచెను
ప్రాణేశు డగుట దెలిసి – కోమలికి ప్రాణములు తేజరిల్లె

**పతిపాదములకు ఊర్మిళాదేవి మ్రొక్కుట**

పతిపాదపద్మములకూ – ప్రణమిల్లి పడతి లేవకయున్నను
పాదముల పైనయున్నా – తనసతిని కరమునా లేవనెత్తి
గ్రుచ్చికౌగిట చేర్చి యా – కాంతకు కండ్లజలములు దుడిచెనూ
మాతండ్రి జనకరాజూ – మిమునమ్మి మరచి పెండిలిచేసెను
మాసవ తల్లుడనుచూ – తెలియకా మదిని నుప్పొంగుచుండె
చిత్తమొక దిక్కునుంచీ – సమయమున చిన్నబుత్తురు యింతులా
అనుచు ఊర్మిళ పలుకగా – లక్ష్మణుడు మనసులో చింతించుచు
దుఃఖవశమున బలికినా – యుండేటి సుదతి భావమ్ము దెలిసి
చింతింప నిక నేటికి – వోబాల యని యిట్లు లాలించుచు
రమణి పదునాలుగేండ్లు – నినువిడిచి ధరియిస్తినే ప్రాణమూ
ఆహార నిద్రలూను – యెరుగనే యతివ నీమీదియానా
పుణ్యపురుషులు ఎవ్వరో – యెడబాసి పూర్వజన్మమున మనమూ
ఎన్నెన్ని యుగములైనా – యిది మనకు అనుభవింపక తీరదూ
సతిపతులు నుండజూచి – కౌసల్య సంపెంగ నూనెదెచ్చీ
రత్నపీఠము నుంచియూ – కౌసల్య దంపతుల శిరసంటెను
గంధమట చెలిదెచ్చియు – యొక్క చెలి పన్నీట జలకమార్చె
మేలైన వలిపట్టుతో – లక్ష్మణుని మేను తళ్ళొత్తిరపుడు
బంగారు పూలపట్లు – ఊర్మిళకు బాగుమీరా గట్టెను
కోటిసూర్యాదీప్తితో – వెలిగేటి మేలైనరవికె దొడిగె
ఆభరణములు సొమ్ములు – ఆయాదిలక్ష్మి కలంకరించి
ముత్యాల తిరుచూర్ణము – లక్ష్మన్న ముద్దుముఖమున దీర్చెను
రత్నాల కంఠమాల – లక్ష్మన్న రంజిల్ల ధరియించెను
వెలలేని మాణిక్యము – సతిగూడి నిలువుటద్దము జూచెను
సిగ్గుండి శిరసొంచుక – ఊర్మిళా చిరునవ్వుతో నిలిచెను
భోజనపు శాలలోన – ఆయాణి ముత్యాల పీఠమీద
రాజశేఖరు డప్పుడు – దేవేంద్ర భోగముతో గూర్చుండెను
మరదాల మాణిక్యమా – రమ్మన్న మగువతోడుక వచ్చెను
మురిపెంపు సిగ్గుచేతా – చిలుకలా కొలికియటు ముఖ మొంచును
హంసనడక చేడెతా – పాదములు యందెలు రవము చేయా
యొయ్యారమును చూచుచూ – నుండెకా యొప్పులా కుప్పవలెను
కులుకుముద్దుల గుమ్మను – సుమిత్ర కొడుకుపొత్తున నుండెను
బంగారు పళ్లెరమునా – పంచపదార్థాలు వడ్డించెను
వెండిగిన్నె నేతులు – కౌసల్య వేడుకతో వడ్డించెను

ఆవునెయ్యతిరసమును – సుమిత్ర కొమరునికి వడ్డించెను
కౌసల్య గారవమున – నవ్వుల శాంతితోడను బలికెను
అన్న పదునాలుగేండ్లు – అడవిలో ఆహారనిద్రలూనూ
ఉన్న బడలిక తీరగా – నేడు మన ఊర్మిళతో నారగించు
పిండివంటలు నేతులు – బొబ్బట్లు దండిగా నారగించు
మీగడ పెరుగు నీరు – మజ్జిగలు వాంఛదీర త్రాగుడీ
ఆరగించియు లేచిరీ – సంపూర్ణ మారగించి నిలిచిరీ
గంగజలమున హస్తమూ – కడిగి తాంబూలములు సేయుచుండ్రీ
చేడె వినవే జానకీ – చెలియ తాఊర్మిళా బుద్ధులన్ని
పైడి పానుపులసోలి – యుండెనొక పదునాలుగేండ్లు పణతి
కుందనపు పుత్రికళలూ – ఈకళలు యెందుండి దాగున్నవో
దృష్టితగులకుండనూ – నీలాగు నివ్వాళు లివ్వరమ్మ
అని శాంతి పలుకగాను – వినిసీత వినయముతో నిట్లులనెను
సృష్టంత యేలేటియో – శ్రీరామచంద్రు లక్ష్మణ దేవరా
భరతశత్రుఘ్ను మొదలు – అయినట్టి పట్టాభిషేకులమ్మ
ఇంద్రాది చంద్రులాను – వలచేటి చంద్రులు మీతమ్ములు
దృష్టితగులకుండను – నీలాల నివ్వాళు లివ్వరమ్మ

**సీతాదేవి మాటలు విని శాంతాదేవి నవ్వుట**

అని సీత పలుకగాను – విని శాంత నవ్వుచు నిట్లనియెను
అక్క చెల్లెంద్రు మీరు – మిక్కిలి సౌందర్య శాలురమ్మ
మాతమ్ముల నలుగురిని – వలపించు జాణలకు దృష్టితగులూ
అని శాంత పలుకగాను – వినిసీత నవ్వుచూ నిట్లనియెనూ
మాయన్న ఋష్యశృంగు వనములో గూడి పాయాకున్నను
ఏమి యెరుగని తపసిని ఓవదిన కేళించి విడిచినావూ
తామర కమలమందూ పుట్టి యీధరణిపై నిలువలేకా
ఈశ్వరా జనకునింట – ఈశ్వరు ధనుసు ఖండించివేయా
కోమలీ సీత నీవు – కోడలవు పావనమాయె గృహము

**సుమిత్ర హంసపానుపు పరచుట**

అలసివచ్చిన కొడుకుకు – సుమిత్ర హంసపానుపు పఱచెను
పట్టు తలగడలు పరచి – పాన్పుపై పన్నీరు చిలుకరించే
వట్టివేళ్లా సురటియు – నొకకీరవాణి యక్కడ నుంచెను
గంధకస్తూర్తి పునుగు – జవ్వాది గిన్నెలతో తెప్పించెను
పచ్చిపోకలు నాకులూ – ముత్యాల సున్నమక్కడ నుంచెను
సంపంగి పువ్వుగాలి – విసరగా తలుపులప్పుడు వేసిరీ
మల్లెపువ్వులగాలియు – విసరగా శయ్యపై కూర్చుండిరి

కీలుకొప్పును విడిచియు – లక్ష్మణుడు నేర్పుతో జడలల్లెనూ
బొండుమల్లెల జాజులు – జడపయిని శృంగారముగ జుట్టెనూ
తాంబూలములు వేయుచూ – దంపతులు కలసి ముచ్చటలాడుచూ

**సీతమ్మ చెరబోయిన విధమును ఊర్మిళ అడుగుట**

అక్క చెఱబోయిన విధమూ – ఏమని యడిగెనప్పుడు వూర్మిళా
సింహవిక్రములు మీరు – ఉండగా రమణెట్లు చెరబోయెను
రాజ్యాధిపతులు మీరు – యుండగా రమణెట్లు చెరబోయెను
కౌసల్య మొదలు నయినా – సుమిత్ర కైక శాంతా దేవులు
గద్దెపీటలు వెనుక నా మరుగునా సద్దుచేయక యుండిరి
రామలక్ష్మణులు మీరు – యుండగా రమణెట్లు చెరబోయెను
అనుచు వూర్మిళ పలుకగా – వినిమగిడి లక్ష్మణు డిట్లనియెను
కాలవిధి గడువ వశమా – యెవరికైనా బ్రహ్మకైనగాని
అయోధ్య వెడలి మేమూ – అందొక్క పర్ణశాల నుంటిమీ
కనకంపు మాయమృగము – ఆ పర్ణశాల వాకిటికొచ్చెను
ఆ మృగము తెమ్మనుచును – మీయక్క స్వామికాళ్ల మ్రొక్కెను
విల్లంబు చేతపట్టి – శ్రీరామచంద్రులు వేటకదిలె
విల్లంబు తొడిగివేయ – ఆ మృగము వింతైన కూతకూసే
**'హా! సీత హా! లక్ష్మణా!'** – యనికూయ అతివ భీతిల్లి పలికె
నన్ను పొమ్మనుచు పలుక – యెరుగవూ తల్లివద్దంటి నేను
గిరిగీచి యానబెట్టి – పోయితిని మాయన్న దగ్గరికిని
పోయినంతట వేగమె – రావణుడు మాయవేషము వేసుక
నారాయణనుచువచ్చి – నలినాక్షి యెదుటనే నిలుచుచుండెను
హరిభక్తుడానితోచి – ఆ మగువ యతివేగ భిక్షపెట్టె
పదితలలు చూడగానే – ఆచేడె తా మూర్ఛలే పోయెను
గడ్డతో పెళ్ళగించి యెత్తుకొని పోయెనే తన లంకకూ
పసిడి మృగమును బట్టక – శ్రీరామచంద్రులు యేతెంచిరి
వనమెల్ల చూచి వెదకి – ఆ పర్ణశాలెల్ల వెదకి యలసి
కిష్కింధ పర్వతాన – వెదకగా పరమ ఋషి సుగ్రీవుడూ
కౌసల్య తనయునకును – అపుడు తా కానుకను దెచ్చిచ్చెనూ
కానుకలు విప్పిచూడ – అందులో జానకీ తొడవులుండె
తమ్ముడా రమ్మనుచును – తనుబిలిచి నాకుజూపెను తొడవులు
ఇన్ని తొడవులు యెరుగను – శ్రీరామ సూర్యోదయమునకొక్కా
ఇందుముఖి పాదమ్ములా – యుండేటి యందెలట్లు నమ్మిస్తినీ
అంజనీ సుతుని బిలచి – ఆ రాము డుంగరము చేతికిచ్చి

ఆనవాలెల్ల జెప్పి – అంపెనే దేవిని చూచిరాగ
వారిధి దాటిపోయి – యశోకవనమెల్ల వెదకిచూచి
ఉంగరము దేవికిచ్చి – మాణిక్య మందుకొని మాటలాడి
తిరిగివచ్చి వేగమే – శ్రీరామచంద్రుల యెదుట నిలిచి
రామభూపాల చంద్రా – మీసతిని ఏవిధంబున దెత్తును
తలలెల్ల జడలుగట్టి – యున్నది యుదరమున నెదురు మొలచీ
తల్లియుండే విధమును – దలచితే తాళశక్యము గాదయా
దుఃఖవశమున జెప్పినా – రాఘవులు విని మూర్ఛబోయి దెలిసి
ఆ లంకచుట్టు వెలసి – రావణుని అక్షోణి బలములార్చె
శృంగారమును జేసియు – తెమ్మనెను సీతను తనయెదుటకు
తెచ్చి శ్రీరామునెదుటా – నిలిపితే యచ్యుతుం డిట్టులనెను
పదినెలలు చెరయున్న యీ – భామినితో భాషించనని పలికెను
వట్టి సత్యము లేటికి – వోరామ చిచ్చుదగిలించు మనెను
ఆకాశమంత పొడవూ – మంటలో మావదినె మాటలాడె
జగములూ నిండినట్లు – జలములు తటాకమై యొప్పెనూ
పరమపతివ్రత గనుకను – మావదినె పట్టెనే రాముచెట్టా
సీత శ్రీరాములకును – సృష్టిలో కట్టిరాయోధ్య పురము
తాబడ్డ కష్టమ్ములు – వూర్మిళతో తప్పకుండగ జెప్పెను

**ఊర్మిళాదేవి తన సహోదరితో సీత కష్టములను విన్నవించుట**

అక్కరో వింటిరటవే – నేడుమన చక్రధరుపతిబుద్ధులూ
నీలవర్ణు జానకీ నెడబాసి – ఘోరమౌ యడవిలోను
పాపకర్ముల లంకలో – పదినెలలు భామ చెరయున్నదటనే
అనుచు అందరు పలుకుచూ – చింతించి సంతోషమున చేరిరీ
అయిన కార్యంబులాను – మనము చింతింప కారణము లేదు
పట్టాభిషేకులయినా – రాఘవులు చూచి పొంగుచునుండిరి
**ఊర్మిళా విరహమ్ములూ – యిది యెవరు పాడినా విన్నగాని**
**శ్రీవిష్ణు కైవల్యమూ – సౌమిత్రి విష్ణులోకము నిచ్చునూ**

ఊర్మిళాదేవినిద్ర సంపూర్ణము

✦ ✦ ✦

**హరేరామ హరేరామ రామ రామ హరే హరే ।**
**హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే ॥**



# నీలకంఠమహం భజే
## (బసవరాజీయం)



శ్లో ॥ శ్రీనీలకంఠం భుజగేంద్రభూషం నాగాజినం రాజకలాకలాపమ్ ।
గౌరీశ్వరం దేవమునీంద్రసేవ్యం దేవం భజే శ్రీగిరిజాధినాథమ్ ॥ 1

శ్లో ॥ కృత్తివాసం పురారాతిమంధకాసురభంజనమ్ ।
భర్గం శైలసుతాధీశం నీలకంఠమహం భజే ॥ 2

శ్లో ॥ దక్షయజ్ఞాపహారం చ సర్వదేవమదాపహమ్ ।
వీరచూడామణిం వీరం వీరభద్రమహం భజే ॥ 3

శ్లో ॥ బ్రహ్మవిష్ణుసురాధీశసేవ్యపాదసరోరుహమ్ ।
పరాత్పరతరం దేవం నీలకంఠమహం భజే ॥ 4

శ్లో ॥ నందీశశేషశీతాంశుసింహకర్పూరసారసైః ।
చందనేన చ తుల్యాంగం నీలకంఠమహం భజే ॥ 5

శ్లో ॥ వృషేంద్రగామినం శుభ్రం సర్వేశం భక్తవత్సలమ్ ।
భూతేశం లోకకర్తారం నీలకంఠమహం భజే ॥ 6

శ్లో ॥ శూలినం మేరుకోదండం పద్మలోచనసాయకమ్ ।
త్రిపురాసురసంహారం నీలకంఠమహం భజే ॥ 7

శ్లో ॥ ఖట్వాంగధారిణం రుద్రం చంద్రసూర్యాగ్నిలోచనమ్ ।
విష్ణువల్లభమీశానం దేవదేవమహం భజే ॥ 8

శ్లో ॥ సర్వజ్ఞం సచ్చిదానందం లోకనాథం జగద్గురుమ్ ।
వ్యోమకేశం భవానీశం రాజభూషమహం భజే ॥ 9

శ్లో॥ మహాదేవం విరూపాక్షం శంకరం పరమేశ్వరమ్ ।
దేవేశం, కరుణాపాంగం జగదీశమహం భజే ॥ 10

శ్లో ॥ శంకరం నిర్మలాకారం బాలచంద్రకళాధరమ్ ।
స్థాణుం చోమాపతిం శర్వం భజేఽహం మల్లికార్జునమ్ ॥ 11

శ్లో॥ నీలకంఠం మహాదేవం తారకం కరుణార్ణవమ్ ।
దేవేశం భక్తమందారమష్టమూర్తిమహం భజే ॥ 12

శ్లో ॥ మహాదేవం మహాత్మానం దేవేశం శేషభూషణమ్ ।
శంకరం పార్వతీనాథం నీలకంఠమహం భజే ॥ 13

శ్లో ॥ శ్రీజంగమేశపాదాబ్జభృంగం శుద్ధం మహేశ్వరమ్ ।
సర్వజ్ఞం సకలాధారం బసవేశమహం భజే ॥ 14

శ్లో ॥ సర్వజ్ఞం జగదాధారం శూలహస్తం నగేశ్వరమ్ ।
ముక్తిప్రదాయకం దేవం నీలకంఠమహం భజే ॥ 15

శ్లో ॥ శంభుం పినాకినం బాలచంద్రభూషం కృపార్ణవమ్ ।
సర్వపాపహరం నిత్యం నీలకంఠమహం భజే ॥ 16

శ్లో ॥ వీరభద్రం విరూపాక్షం నారసింహం మదాంతకమ్ ।
అహిభూషం శుభాకారం భజేఽహం వీరశేఖరమ్ ॥ 17

శ్లో ॥ భూతేశం సర్వభూతేశం నాయకం సర్వనాయకమ్ ।
దేవదేవం మహాదేవం శంభుమూర్తిమహం భజే ॥ 18

శ్లో ॥ కందర్పనాగపంచాస్యం గజదైత్యవినాశనమ్ ।
మహాతాండవశాలీనం లింగమూర్తిమహం భజే ॥ 19

శ్లో ॥ భైరవం భైరవాకారం వీరం వీరేశ్వరం ప్రభుమ్ ।
రుద్రం రుద్రగణాధీశం వీరభద్రమహం భజే ॥ 20

శ్లో ॥ భూరథం మేరుకోదండం వేదాశ్వం పురనాశకమ్ ।
సర్వలోకపతిం శంభుం లింగమూర్తిమహం భజే ॥ 21

శ్లో ॥ జగత్కారణమీశానం జటామండలమండితమ్ ।
వ్యాఘ్రచర్మాంబరధరం లింగమూర్తిమహం భజే ॥ 22

శ్లో ॥ బాలచంద్రకళామౌలిం భుజగేంద్రవిభూషణమ్ ।
తారకం సచ్చిదానందం లింగమూర్తిమహం భజే ॥ 23

శ్లో ॥ అంబికాపతిమీశానం చంద్రశేఖరమచ్యుతమ్ ।
భస్మోద్ధూళితసర్వాంగం నీలకంఠమహం భజే ॥ 24

శ్లో॥ విశ్వనాథం జగన్నాథం లోకనాథం జగద్గురుమ్ ।
సర్వజ్ఞం పార్వతీనాథం లింగమూర్తిమహం భజే ॥ 25 ✦

---



# నమశ్శివాయ




శ్రీః

# మార్గబంధుస్తోత్రమ్

శంభో! మహాదేవ! దేవ! శివ!
శంభో! మహాదేవ! దేవేశ! శంభో!
శంభో! మహాదేవ! దేవ!

శ్లో॥ ఫాలావనమ్రత్కిరీటం ఫాలనేత్రార్చిషాదగ్ధపంచేషుకీటమ్ ।
శూలాహతారాతికూటం శుద్ధమర్ధేన్దుచూడం భజే మార్గబంధుమ్ ॥ 1

శ్లో॥ అంగే విరాజద్భుజంగమభ్రగంగాతరంగాభిరామోత్తమాంగమ్ ।
ఓంకారవాటీకురంగం సిద్ధసంసేవితాంఘ్రిం భజే మార్గబంధుమ్ ॥ 2

శ్లో॥ నిత్యం చిదానందరూపం నిహ్నుతాశేషలోకేశవైరిప్రతాపమ్ ।
కార్తస్వరాగేంద్రచాపం కృత్తివాసం భజే దివ్యసన్మార్గబంధుమ్ ॥ 3

శ్లో॥ కందర్పదర్పఘ్నమీశం కాలకంఠం మహేశం మహావ్యోమకేశమ్ ।
కుందాభదన్తం సురేశం కోటిసూర్యప్రకాశం భజే మార్గబంధుమ్ ॥ 4

శ్లో॥ మందారభూతేరుదారం మందరాగేంద్రసారం మహాగౌర్యదూరమ్ ।
సిందూరదూరప్రచారం సింధురాజాతిధీరం భజే మార్గబంధుమ్ ॥ 5

శ్లో॥ అప్పయ్యయజ్వేంద్రగీతం స్తోత్రరాజం పఠేద్యస్తు భక్త్యా ప్రయాణే ।
తస్యార్థసిద్ధిం విధత్తే మార్గమధ్యేఽభయం చాశుతోషో మహేశః ॥ 6

శ్రీః

# మార్గబంధుస్తోత్రమ్

రచన - శ్రీమదప్పయ్యదీక్షితులు
వ్యాఖ్యాత - శ్రీ మేళ్ళచెర్వు వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి

ఈ రచన ప్రత్యేకవృత్తములలో సాగినది. వృత్తనామము తెలియరాలేదు. చదవటంలో కొంత తెలివి కావలసియుండును. 8 అక్షరాల వద్ద పాదం ఆపి మిగిలిన పాదం చివరిదాకా చదువవచ్చు. దీనిలో గణవిధానము రెండు విధాలుగా చూడవచ్చు. "తతమ–యయయయ" మొత్తం 21 అక్షరాలు. లేదా 8 అక్షరాలదగ్గర ఆపితే గానానుకూలము.

తతగగ– 1 పాదం, 3వ పాదం 8 అక్షరాలు
రరరరగ – 2, 4 పాదాలు, 13 అక్షరాలు.

ఇందులో 6 శ్లోకములు గలవు.

'మార్గబంధువు' అనటానికి కారణం సుదీర్ఘదేశాలకు ప్రయాణము చేయుటలో ఆ రోజులలో ఆపదలు ఎక్కువ. "కాశీకి వెళ్లినవాడు – కాటికి వెళ్లినవాడు ఒకటే" అన్న సామెత తెలిసినదే గదా! వెనుకటి రోజులలో శ్రీశైలము వెళ్లువారికి ఆ అరణ్యాలలో చెంచులు సహాయము చేయువారని ప్రతీతి.

మృగవ్యాధస్వరూపుడు, మహాకిరాతుడు, శబరీపతి, గిరిశుడు – అయిన శివుడు అరణ్యదేవత అని అరణ్యపుష్పప్రియుడని "శివగీత" చెప్తున్నది.

అరణ్యప్రయాణాలలో వచ్చే బాధలు క్రూరమృగములు, చోరులు, నరబలులిచ్చే ఆటవికులు, సర్పములు మొ॥ వానివలన ప్రధానముగా ఉంటాయి. శివరూపములోనూ కొన్ని ఆటవిక ధర్మములుంటాయి. మృగము, శార్దూలచర్మము, గజచర్మము, జటామండలము, శూలము (ఈటె) మహావీరత్వము – భయంకర అవతారరూపము.

శివకవచము గూడా ఈయనను మార్గబంధువుగా చెప్పినది. చూ॥ "మార్గేషు మాం రక్షతు నీలకంఠః" "అరణ్యవాసాది మహాప్రవాసే పాయాత్ మృగవ్యాధ ఉదారశక్తిః" "అక్షౌహిణీనాం శతమాతతయినాం ఛింద్యాత్ మృడో ఘోరకుఠారధారయా" "శార్దూల సింహర్క్ష వృకాది హింస్రాన్ సంత్రాసయత్వీశధనుః పినాకః" "ఉత్పాత తాపవిషభీతి మసద్గ్రహార్తిం వ్యాధీంశ్చ నాశయతు మే జగతామధీశః"; అందువలన ఆయన మార్గబంధువు.

నమకమునందును,

"అహగ్ంశ్చ సర్వాన్ జంభయన్ – సర్వాశ్చ యాతుధాన్యః"
"నమో వృక్షేభ్యః హరికేశేభ్యః" "పథీనాం పతయే నమః"
వనానాం పతయే నమః" "స్తేనానాం పతయే నమః"
"నమో వంచతే పరివంచతే" "వ్రాత్యేభ్యో వ్రాత్యపతిభ్యశ్చ"
"అఘోరేభ్యో౽థ ఘోరేభ్యో – ఘోరఘోరతరేభ్యః"

అని యీవిధముగా మార్గాయాసకరమయిన బహురూపాలు, వాటి అధిపతి – ఆయనయే కనుక మార్గబంధువుగా ఆయనను కీర్తించుట వేదమతము. స్వరూపోచితము.

భవమార్గమునకు గూడా ఈయన మార్గబంధువే. "జ్ఞానం మహేశ్వరాదిచ్చేత్" కదా! ఆయన త్రిపురాంతకుడు అనగా స్థూల, సూక్ష్మ, కారణ శరీరరూపమయిన అజ్ఞాన పట్టణమును ధ్వంసము చేసినవాడు. అందుకాయన మన 'వెన్ను' అను మేరువును ధనుస్సుగా గ్రహించాడు. అందులోని సుషుమ్నానాడిని – అదే వాసుకిని అల్లెత్రాడుగా ఆదరించాడు. **'అచ్యుత – అగ్నిని'** బ్రహ్మజ్ఞానాగ్నిని బాణముగా పట్టినాడు. ఇంద్రియాశ్వస్థానములో వేదములను నిలిపాడు. రథమునకు ఇడా పింగళ లనే నాడులను అనగా సూర్యచంద్రులను చక్రములుగా స్వీకరించాడు. – ఇలా చేసి త్రిపురాసుర సంహారము చేసి శమదమాది సురులను రక్షించి మోక్షము నిచ్చువాడు.

ఆయనయే శుద్ధజ్ఞానస్వరూపుడు. శుద్ధజ్ఞానసాధనము గూడా! చూ. – శివకవచము "త్రివర్గ

సాధనము" "నిత్యశుద్ధబుద్ధపరిపూర్ణసచ్చిదానందాద్వయవైభవాయ" – అట్టి ఇహమార్గ, పరమార్గ బంధువయిన లోకబంధువయిన శివుని స్తోత్రమీ **"మార్గబంధు"** లఘుకావ్యము.

**శంభో! మహాదేవ! దేవ! శివ!**
**శంభో! మహాదేవ! దేవేశ! శంభో!**
**శంభో! మహాదేవ! దేవ!**

**అర్థము :** శంభో! = శుభమును గల్గించువాడా!, మహాదేవ! = గొప్పదేవా!, దేవ! = వెలుగువాడా! శివ = శుభమయినవాడా!, దేవేశ! = దేవతాధీశ్వరా!

**భావము :** శివుని సంబోధించి స్మరించుట ఇది. తరువాత శ్లోకములో స్తోత్రం, ప్రార్థన మొదలగును. లేదా ప్రతి శ్లోకము చివర ఈ "సంబోధనలను" పల్లవిగా పలుకవచ్చును.

**శ్లో॥ ఫాలావనమ్రత్కిరీటం ఫాలనేత్రార్చిషాదగ్ధపంచేషుకీటమ్ ।**
**శూలాహతారాతికూటం శుద్ధమర్ధేన్దుచూడం భజే మార్గబంధుమ్ ॥ 1**

**ప్రతిపదార్థము :** ఫాల = నుదుటిమీదకు, అవనమ్రత్ = నమ్రమయినట్లున్న, కిరీటమ్ = కిరీటము గలవాడును, ఫాల = నుదుటియందలి, నేత్ర = కంటియొక్క, అర్చిషా = జ్వాలచేత, దగ్ధ = తగలబడిన, పంచేషు = పంచబాణుడయిన మన్మథుడను, కీటమ్ = పురుగుగల వాడును, (లేదా కీటమువంటి పంచబాణుడు గలవాడును), శూల = త్రిశూలముచేత, ఆహత = చంపబడిన, అరాతికూటమ్ = శత్రుసమూహము గలవాడును, శుద్ధమ్ = మాయారహితుడును, అర్ధేందు = అర్ధచంద్రుడు, చూడమ్= ముందుజుట్టునందు గలవాడును, మార్గబంధుమ్ = మార్గబంధువయిన శివుని, భజే = సేవించెదను.

**తాత్పర్యము :** మొగముమీదకు కొంచెము వంగినట్లున్న కిరీటము గలవాడు, ఫాలనేత్రాగ్నిలో పురుగువంటి మన్మథుని దగ్ధము చేసినవాడు, శూలముచే శత్రుసంఘమును సంహరించినవాడును, పరిశుద్ధతత్త్వమున్ను అయిన చంద్రకళాశేఖరుని నా మార్గబంధువుగా సేవించెదను.

**విశేషములు :** 1. కిరీటము ఫాలముదాకా చక్కగా అమరియుండుట కిరీట పరిమాణ సౌష్ఠవమును తెలుపును. అవనమ్ర శబ్దముమీద 'క్విప్' ప్రత్యయము. అందువలన కిరీటము మొగముమీదకు వంగకపోయినా వంగినట్లనిపించటం – అర్థము. అది సరిగా సరిపోయినట్లర్థము.

2. పంచబాణుడనే కీటకము అనగా రూపకాలంకారము. కీటకమువంటి పంచబాణుడనగా – ఉపమిత సమాసము. ఉపమాలంకారము.

3. శూలము అనగా త్రిశూలము. అది ప్రణవమునకు ప్రతినిధి. దానిచేత శత్రుసమూహమును, అనగా మనలోని కామక్రోధాది రాక్షససమూహమును చంపుట. ఇది ఛాందోగ్యములోని 'ఉద్గీథ' విషయము వంటిది. ఇలా అర్థము చెప్పుటవలన ఆయన సంసారమార్గబంధువు – అని స్పష్టము.

4. మార్గబంధువు – జ్ఞానదాత కనుక మోక్షమార్గబంధువని వ్యంగ్యము.

5. మన్మథునికి "కీట" సామ్యమును చెప్పటం క్రొత్త కాదు. "యం పశ్యనదీపదర్భం సపది మనసిజః కీటనాశం ననష్టః" అని ఆయన చిత్రమీమాంసలో చెప్పినదే.

శ్లో॥ అంగే విరాజద్భుజంగమభ్రగంగాతరంగాభిరామోత్తమాంగమ్ ।
ఓంకారవాటీకురంగం సిద్ధసంసేవితాంఘ్రిం భజే మార్గబంధుమ్ ॥ 2

**ప్రతిపదార్థము :** అంగే = శరీరమునందు, విరాజత్ = ప్రకాశించుచున్న, భుజంగమ్ = పాములు కలవాడును, అభ్ర = ఆకాశమునందలి, గంగా = దేవగంగచేత, అభిరామ = మనోహరమయిన, ఉత్తమాంగమ్ = తలగలవాడును, ఓంకారవాటీ = ఓంకారమను తోటలో, కురంగమ్ = లేడి అయినవాడును, సిద్ధ = సిద్ధులచేత, సంసేవిత = సేవింపబడిన, అంఘ్రిమ్ = పాదములు గలవాడును, మార్గబంధుమ్ = మార్గబంధువయిన పరమశివుని, భజే = సేవించెదను.

**తాత్పర్యము :** భుజంగభూషితదేహుడు, ఆకాశగంగా మనోహరమయిన శిరస్సుగలవాడు, ఓంకారవనములో విహరించు లేడి, సిద్ధపూజితపాదుడు మార్గబంధువు అయిన శివుని సేవింతును.

**విశేషములు :** 1. భుజంగహారుడు – శివకవచమునందు **"అనంత–వాసుకి–తక్షక–కర్కోటక–కుళిక–పద్మ–మహాపద్మేత్యష్ట–మహానాగకులభూషణాయ–"** అను వాక్యము ప్రమాణము. శివకవచము స్కాందపురాణాంతర్గతము.

2. ప్రణవములోనున్న లేడి –

ఎ) "ఓంకారపంజరశుకీ" అని దేవికిన్ని విశేషణము. 'ఓం' అను పదము 'అవ' ధాతువునుంచి ఏర్పడినది. ఆర్షము = రక్షకము. అవ ధాతువుకు అర్థములు ఇవి అవ – రక్షణ గతి కాంతి, ప్రీతి, తృప్తి, అవగమ, ప్రవేశ, శ్రవణ, స్వామ్యర్ష యాచన క్రియా, ఇచ్ఛా దీప్తి, అవాప్తి, ఆలింగన, హింసాదాన భాగవృద్ధిషు"

ఈ అర్థములో 'ఓం' అను బీజమునకు సరిపడు అర్థములు ఏవనగా; రక్షించునది, గతి = వ్యాపించునది, కాంతి = కోరునది (సృష్టి కామం), ప్రీతి = ప్రేమించునది, ఇచ్ఛా = కోరునది, దీప్తి = ప్రకాశించునది. దీనివలన సృష్టికాముడై, సర్వవ్యాపియై, సర్వజీవులను ప్రేమించునదై, రక్షించునదై వెలుగునిచ్చునది – అయిన పరమేశతత్త్వమే – ఓం. దీని వ్యుత్పత్తి – అవధాతువుకు "మన్ ప్రత్యయం. టి లోపము ఊఠ్ దీర్ఘ గుణములు. సూత్రం = **"అవతేః టిలోపశ్చ"** స్వరాదిపాఠములోనిది కనుక అవ్యయము.

బి) ఇక వైదికవ్యుత్పత్తి **"అ+ఉ+మ్"** అను ఈ త్రికము ప్రపంచములోని త్రిపుటులకు గుర్తు. 1) నేను నీవు వాడు; 2) త్రిలోకములు, 3) స్థూల సూక్ష్మ కారణ శరీరములు, 4) త్రిమూర్తులు.

వ్యాహృతులు అనగా 'భూః, భువః, సువః' అనునవి. ఈ 'అఉమ్' అనువానికి సంకేతింపబడినవి. ఇందు ఈ మూడు తత్త్వములందు వ్యాపించి వీటికి పైన మూలముగా నుండిన బీజశక్తి అయిన మహాశక్తి 'మ' మీద పలుకబడే దీర్ఘనాదము. అదే అర్ధచంద్రము. అదే నాదరూపము. ఈ నాదముయొక్క సమాప్తి రూపము బిందువు. అదే పరమేశ్వర రూపము. ఓం.

ఈ ఓంకారమును ఇలా సాధన చేసినచో ఆ ఉద్గీథము ప్రభావము చేత మనలోని కామక్రోధాది – అసురులు హతమవుతారు. అందుకు కారణము అందలి 'పరమాత్మ' స్థితి అదే **"ఓంకారవాటీకురంగం"**

3. అభ్రగంగాతరంగాభిరామ – అనగా ఇది ఆకాశదృశ్యము. ఖగోళమున ఆకాశగంగ ఉన్నది. దానిని పాలసముద్రము, పాలపుంత, దేవతల దారి – అలా పిలుస్తారు. దానినే ఆకాశగంగ

అంటారు. ఈ ఆకాశగంగా ఆర్ద్రానక్షత్రమును చేరుకొనును. ఆర్ద్రానక్షత్రము "మిథున"రాశిలోనిది. **మిథునము పార్వతీపరమేశ్వరమిథునమే**. ఈ ఆర్ద్ర ఎఱ్ఱని నక్షత్రము.

**"ఆర్ద్రా ప్రవాళమేకమ్"** – వరరుచి. దీనినుండి వచ్చు ఒక కాంతికిరణము భూమిని తాకుటకు సుమారు 200 సంవత్సరములు పట్టును. అదీ కాంతివేగములో.

**ఆర్ద్ర – రుద్రదేవతా నక్షత్రము.** దానిమీదకు ఆకాశగంగ చేరటం ఆ వ్యోమకేశుని శిరస్సును దేవగంగావతరణము. ఇక రామాయణములోని గంగావతరణ వృత్తాంతము భగీరథ కథ – గూడా చారిత్రకరూపము.

**శ్లో॥ నిత్యం చిదానందరూపం నిహ్నుతాశేషలోకేశవైరిప్రతాపమ్ ।**
**కార్తస్వరాగేంద్రచాపం కృత్తివాసం భజే దివ్యసన్మార్గబంధుమ్ ॥ 3**

**ప్రతిపదార్థము :** నిత్యమ్ = నిత్యమయినవాడును, చిత్ = జ్ఞానము, ఆనంద = ఆనందము, రూపమ్ = స్వరూపముగా గలవాడును, నిహ్నుత = తిరస్కరింపబడిన, అశేష = సమస్తమయిన, లోకేశ = ఇంద్రాదులకు, వైరి = శత్రువులయిన వారియొక్క ప్రతాపమ్ = పరాక్రమము గలవాడును, కార్తస్వర = బంగారుమయమయిన, అగేంద్ర = పర్వతరాజ మయిన మేరువే, చాపమ్ = ధనుస్సుగా గలవాడును, దివ్య = దివ్యమయిన, సన్మార్గ = మంచి మోక్షమార్గమునకు, బంధుమ్ = బంధువయినవాడును, కృత్తివాసమ్ = చర్మాంబరుడు, చర్మోత్తరీయుడును, అయిన పరమశివుని, భజే = సేవించుచున్నాను.

**తాత్పర్యము :** అనాదినిధనుడు కనుక నిత్యుడు, సచ్చిదానందస్వరూపుడును, లోకేశ్వరులయిన ఇంద్రాదులకు శత్రువులయిన త్రిపురాసుర, అంధకాసురాదులను చంపినవాడు, త్రిపురాసుర సంహారకథలో సువర్ణపర్వతమయిన మేరువును ధనుస్సుగా ధరించువాడు, దివ్యమయిన సన్మార్గము అనగా దివ్యమార్గము, సన్మార్గము అనగా స్వర్గాదిలోకములు చేరు మార్గము, 'సత్' అనగా పరమాత్మను పొందు మార్గము అనగా కర్మ, జ్ఞాన మార్గములలో మనకు యోగక్షేమదర్శనుడయిన మార్గబంధువు అయినవాడు, గజచర్మమునుత్తరీయముగా వ్యాఘ్రచర్మమును పరిధానముగాను, ధరించిన ఆ పరమశివుని సేవించెదను.

**శ్లో॥ కందర్పదర్పఘ్నమీశం కాలకంఠం మహేశం మహావ్యోమకేశమ్ ।**
**కుందాభదన్తం సురేశం కోటిసూర్యప్రకాశం భజే మార్గబంధుమ్ ॥ 4**

**ప్రతిపదార్థము :** కందర్ప = మన్మథునియొక్క, దర్ప = దర్పమును, ఘ్నమ్ = పోగొట్టువాడును, ఈశమ్ = ఈశ్వరుడును, కాల = కాలకూటముతో నల్లనయిన, కంఠమ్ = కంఠముగలవాడును, మహేశమ్ = గొప్ప ఈశ్వరుడును, మహావ్యోమ = మహాకాశము, కేశమ్ = కేశములుగా గలవాడును, కుందాభ = మొల్లపూలవంటి, దంతమ్ = పన్నులు గలవాడును, సురేశమ్ = దేవప్రభువును, కోటీ = అనేకమయిన, సూర్య = సూర్యులయొక్క ప్రకాశమ్ = వెలుగు గలవాడును, మార్గబంధుమ్ = మార్గబంధువున్ను అయిన శివుని, భజే = సేవించెదను.

**తాత్పర్యము :** పరమేశ్వరుడు పార్వతీసేవాసందర్భములో హిమాలయమున మన్మథుని మదమును అణచినవాడును, సముద్రమథన సందర్భమున హాలాహలమును మ్రింగి, లోకరక్షణ సేయుటద్వారా నల్లనయిన కంఠముగలవాడు, ఈశ్వరులకే ఈశ్వరుడు, ఆకాశకేశుడు అనగా ఆకాశమే తలగా గలవాడు, మొల్లపూలవంటి దంతములు గలవాడు, సర్వసురేశ్వరుడు, కోటిసూర్యులవంటి ప్రకాశము గలవాడయిన ఆ మార్గబంధువును సేవించెదను.

శ్లో॥ మందారభూతేరుదారం మందరాగేంద్రసారం మహాగౌర్యదూరమ్ ।
సిందూరదూరప్రచారం సింధురాజాతిధీరం భజే మార్గబంధుమ్ ॥ 5

**ప్రతిపదార్థము :** మందార = మందారమను కల్పవృక్షముయొక్క, భూతేః = సంపదకన్న (లేదా) మందార = స్వర్గముయొక్క, భూతేః = ఐశ్వర్యమునకు, ఉదారమ్ = దాత అయినవాడు, మందరాగ = రాగరహితులయిన విరక్తులలో, ఇంద్ర = శ్రేష్ఠులయినవారికి, సారమ్ = ముఖ్యమయినవాడు, మహాగౌరీ = మహాగౌరికి, అదూరమ్ = ఎన్నటికి దూరముకానివాడును, సిందూర = సిందూరమునకు, దూర = దూరమయిన, ప్రచారమ్ = నడక కలవాడును, అనగా భస్మధారి, సింధురాజ = సముద్రునివలె, అతిధీరమ్ = మిక్కిలి గంభీరమయినవాడును, మార్గబంధుమ్ = మార్గబంధువయినవాడును అగు శివుని, భజే = సేవించెదను.

**తాత్పర్యము :** కల్పవృక్షసంపదకన్న ఎక్కువ సంపదను ఇవ్వగలవాడు (కుబేరునకు) లేదా స్వర్గసంపద ఇవ్వగలవాడు, మందరాగులు అనగా వీతరాగులలో శ్రేష్ఠులయిన వారికి సారమయిన (నిధి) వాడు, మహాగౌరికి నిత్యానుసంధానంగా ఉండువాడు, సిందూరముకాక భస్మాంగరాగము గలవాడు, సముద్రగంభీరుడు (అపామివాధారమను త్తరంగం – కాళిదాసు) అయిన ఆ మార్గబంధువును పొందెదను.

**విశేషములు :** 1. మందార – స్వర్గము – వి.యస్.ఆప్టే నిఘంటువు.

2. మందర – అగేంద్ర – అని విడదీస్తే మందర పర్వతమునకు శివుడు సారమన్న అర్థం కుదరదు.

శ్లో॥ అప్పయ్యయజ్వేంద్రగీతం స్తోత్రరాజం పఠేద్యస్తు భక్త్యా ప్రయాణే ।
తస్యార్థసిద్ధిం విధత్తే మార్గమధ్యేఽభయం చాశుతోషో మహేశః ॥ 6

**ప్రతిపదార్థము :** యః తు = ఎవడయితే, అప్పయ్య = అప్పయ్య అను, యజ్వేంద్ర = మహాసోమయాజి, దీక్షితులచేత, గీతమ్ = పాడబడిన, స్తోత్రరాజమ్ = స్తోత్రమును, ప్రయాణే = ప్రయాణకాలమున లేదా నిర్యాణకాలమున / లేదా యోగమార్గ ప్రయాణ కాలమున, పఠేత్ = చదువునో, తస్య = అతనికి, ఆశు తోషః = శీఘ్రసంతోషి అయిన, మహేశః = మహేశ్వరుడు, మార్గమధ్యే = ప్రయాణ లేదా నిర్యాణమార్గమధ్యమున / లేదా యోగమార్గ మధ్యమున, అభయమ్ = అభయమును, అర్థసిద్ధిం చ = కార్యసిద్ధిని, మోక్షపురుషార్థసిద్ధిని గూడా, విధత్తే = కలిగించును.

**తాత్పర్యము :** అప్పయ్యదీక్షితేంద్రుడు గానము చేసిన ఈ స్తోత్రమును ప్రయాణ / యోగమార్గ ప్రయాణ / నిర్యాణ మధ్యమున భక్తిగా చదువగలిగినచో ఆశుతోషి అయిన భగవాన్ ఈశ్వరుడు, అట్టి భక్తునకు మార్గమధ్యమున అభయమును, అద్వైతరూప అభయమును, ప్రయోజనసిద్ధిని, చోరాది బాధానివారణను, కామక్రోధాది బాధా నివారణను మోక్షరూపపురుషార్థసిద్ధిని కలిగించును.

శ్రీః



# శ్రీవేంకటేశ సుప్రభాతమ్

1) కౌసల్యాసుప్రజా! రామ! పూర్వా సంధ్యా ప్రవర్తతే ।
ఉత్తిష్ఠ! నరశార్దూల! కర్తవ్యం దైవమాహ్నికమ్ ॥

2) ఉత్తిష్ఠోత్తిష్ఠ గోవింద! ఉత్తిష్ఠ గరుడధ్వజ!
ఉత్తిష్ఠ కమలాకాంత! త్రైలోక్యం మంగళం కురు!

3) మాతః! సమస్తజగతాం మధుకైటభారేః
వక్షోవిహారిణి! మనోహరదివ్య(రూపే) మూర్తే ।
శ్రీస్వామిని! శ్రితజనప్రియదానశీలే!
శ్రీవేంకటేశదయితే! తవ సుప్రభాతమ్ ॥

4) తవ సుప్రభాతమరవిందలోచనే!
భవతు ప్రసన్నముఖచంద్రమండలే ।
విధిశంకరేంద్రవనితాభిరర్చితే!
వృషశైలనాథదయితే! దయానిధే ॥

5) అత్ర్యాదిసప్తఋషయస్సముపాస్య సంధ్యామ్
ఆకాశసింధుకమలాని మనోహరాణి ।
ఆదాయ పాదయుగమర్చయితుం ప్రపన్నాః
శేషాద్రిశేఖరవిభో! తవ సుప్రభాతమ్ ॥

6) పంచాననాబ్జభవషణ్ముఖవాసవాద్యాః
త్రైవిక్రమాదిచరితం విబుధాస్తువంతి ।
భాషాపతిః పఠతి వాసరశుద్ధిమారాత్
శేషాద్రిశేఖరవిభో! తవ సుప్రభాతమ్ ॥

7) ఈషత్ప్రఫుల్లసరసీరుహనారికేళ –
పూగద్రుమాది సుమనోహరపాలికానామ్ ।
అవాతి మందమనిలస్సహ దివ్యగంధైః
శేషాద్రిశేఖరవిభో! తవ సుప్రభాతమ్ ॥

8) ఉన్మీల్య నేత్రయుగముత్తమపంజరస్థాః
పాత్రావశిష్టకదళీఫలపాయసాని ।
భుక్త్వా సలీలమథ కేళిశుకాః పఠంతి
శేషాద్రిశేఖరవిభో! తవ సుప్రభాతమ్ ॥

9) తంత్రీప్రకర్షమధురస్వనయా విపంచ్యా
గాయత్యనంతచరితం తవ నారదోఽపి ।

భాషాసమగ్రమసకృత్కరచారరమ్యం
శేషాద్రిశేఖరవిభో! తవ సుప్రభాతమ్ ॥

10) భృంగావలీ చ మకరందరసానువిద్ధ-
ఝుంకారగీతనినదైః సహ సేవనాయ ।
నిర్యాత్యుపాంతసరసీకమలోదరేభ్యః
శేషాద్రిశేఖరవిభో! తవ సుప్రభాతమ్ ॥

11) యోషాగణేన వరదధ్ని విమథ్యమానే
ఘోషాలయేషు దధిమంథనతీవ్రఘోషాః ।
రోషాత్ కలిం విదధతే కకుభశ్చ కుంభాః
శేషాద్రిశేఖరవిభో! తవసుప్రభాతమ్ ॥

12) పద్మేశమిత్రశతపత్రగతాళివర్గాః
హర్తుం శ్రియం కువలయస్య నిజాంగలక్ష్మ్యా ।
భేరీనినాదమివ బిభ్రతి తీవ్రనాదం
శేషాద్రిశేఖరవిభో! తవ సుప్రభాతమ్ ॥

13) శ్రీమన్! అభీష్టవరదాఖిలలోకబంధో!
శ్రీ శ్రీనివాస! జగదేకదయైకసింధో ।
శ్రీదేవతాగృహభుజాంతరదివ్యమూర్తే !
శ్రీవేంకటాచలపతే! తవ సుప్రభాతమ్ ॥

14) శ్రీస్వామిపుష్కరిణికాప్లవనిర్మలాంగాః
శ్రేయోఽర్థినో హరవిరించిసనందనాద్యాః ।
ద్వారే వసంతి వరవేత్ర హతోత్తమాంగాః
శ్రీవేంకటాచలపతే! తవ సుప్రభాతమ్ ॥

15) శ్రీశేషశైలగరుడాచలవేంకటాద్రి -
నారాయణాద్రి వృషభాద్రి వృషాద్రిముఖ్యామ్ ।
ఆఖ్యాం త్వదీయవసతేరనిశం వదంతి
శ్రీవేంకటాచలపతే! తవ సుప్రభాతమ్ ॥

16) సేవాపరాః శివసురేశ కృశానుధర్మ -
రక్షోంబునాథపవమానధనాధినాథాః ।
బద్ధాంజలి ప్రవిలసన్నిజశీర్షదేశాః
శ్రీవేంకటాచలపతే! తవ సుప్రభాతమ్ ॥

17) ధాటీషు తే విహగరాజ మృగాధిరాజ -
నాగాధిరాజ గజరాజ హయాధిరాజాః ।
స్వస్వాధికారమహిమాధికమర్థయంతే
శ్రీవేంకటాచలపతే! తవ సుప్రభాతమ్ ॥

18) సూర్యేందుభౌమబుధవాక్పతికావ్యసౌరి–
స్వర్భానుకేతుదివిషత్పరిషత్ప్రధానాః ।
త్వద్దాసదాసచరమావధిదాసదాసాః
శ్రీవేంకటాచలపతే! తవ సుప్రభాతమ్ ॥

19) త్వత్పాదధూళిభరితస్ఫురితోత్తమాంగాః
స్వర్గాపవర్గనిరపేక్షనిజాంతరంగాః ।
కల్పాపగమాకలనయాకులతాం లభంతే
శ్రీవేంకటాచలపతే! తవ సుప్రభాతమ్ ॥

20) త్వద్గోపురాగ్రశిఖరాణి నిరీక్షమాణాః
స్వర్గాపవర్గపదవీం పరమాం శ్రయంతః ।
మర్త్యా మనుష్యభువనే మతిమాశ్రయంతే
శ్రీవేంకటాచలపతే! తవ సుప్రభాతమ్ ॥

21) శ్రీభూమినాయక! దయాదిగుణామృతాబ్ధే !
దేవాధిదేవ! జగదేకశరణ్యమూర్తే ।
శ్రీమన్! అనంతగరుడాదిభిరర్చితాంఘ్రే!
శ్రీవేంకటాచలపతే ! తవ సుప్రభాతమ్ ॥

22) శ్రీపద్మనాభ! పురుషోత్తమ! వాసుదేవ!
వైకుంఠ! మాధవ! జనార్దన! చక్రపాణే! ।
శ్రీవత్సచిహ్న! శరణాగతపారిజాత!
శ్రీవేంకటాచలపతే! తవ సుప్రభాతమ్ ॥

23) కందర్పదర్పహరసుందరదివ్యమూర్తే !
కాంతాకుచాంబురుహకుట్మలలోలదృష్టే ।
కల్యాణనిర్మలగుణాకర! దివ్యకీర్తే !
శ్రీవేంకటాచలపతే! తవ సుప్రభాతమ్ ॥

24) మీనాకృతే! కమఠ! కోల! నృసింహ! వర్ణిన్ !
స్వామిన్! పరశ్వథతపోధన! రామచంద్ర! ।
శేషాంశరామ! యదునందన! కల్కిరూప!
శ్రీవేంకటాచలపతే! తవ సుప్రభాతమ్! ॥

25) ఏలాలవంగఘనసారసుగంధితీర్థం
దివ్యం వియత్సరితి హేమఘటేషు పూర్ణమ్ ।
ధృత్వాఽద్య వైదికశిఖామణయః ప్రహృష్టాః
తిష్ఠంతి వేంకటపతే! తవ సుప్రభాతమ్ ॥

26) భాస్వానుదేతి వికచాని సరోరుహాణి
సంపూరయంతి నినదైః కకుభో విహంగాః ।

శ్రీవైష్ణవాస్సతతమర్థితమంగళాస్తే
ధామాశ్రయంతి తవ వేంకట! సుప్రభాతమ్ ॥

27) బ్రహ్మాదయస్సురవరాస్సమహర్షయస్తే
సంతస్సనందముఖాస్త్వథ యోగివర్యాః ।
ధామాంతికే తవ హి మంగళవస్తుహస్తాః
శ్రీవేంకటాచలపతే! తవ సుప్రభాతమ్ ॥

28) లక్ష్మీనివాస! నిరవద్య! గుణైకసింధో!
సంసారసాగరసముత్తరణైకసేతో(పోత)!
వేదాంతవేద్యనిజవైభవ! భక్తభోగ్య!
శ్రీవేంకటాచలపతే! తవ సుప్రభాతమ్ ॥

29) ఇత్థం వృషాచలపతేరిహ సుప్రభాతం
యే మానవాః ప్రతిదినం పఠితుం ప్రవృత్తాః ।
తేషాం ప్రభాతసమయే స్మృతిరంగభాజాం
ప్రజ్ఞాం పరార్థసులభాం పరమాం ప్రసూతే ॥

# శ్రీవేంకటేశస్తోత్రం

1. కమలాకుచచూచుకకుంకుమతో
నియతారుణితాతుల నీలతనో ।
కమలాయతలోచన! లోకపతే!
విజయీభవ! వేంకటశైలపతే ॥

2. సచతుర్ముఖషణ్ముఖపంచముఖ –
ప్రముఖాఖిలదైవతమౌళిమణే ।
శరణాగతవత్సల! సారనిధే!
పరిపాలయ మాం వృషశైలపతే ॥

3) అతివేలతయా తవ దుర్విషహై–
రనువేలకృతైరపరాధశతైః ।
భరితం త్వరితం వృషశైలపతే !
పరయా కృపయా పరిపాహి హరే ॥

4) అధివేంకటశైలముదారమతేః
జనతాభిమతాధికదానరతాత్ ॥
పరదేవతయా గదితాన్నిగమైః
కమలాదయితాన్న పరం కలయే ॥

5. కలవేణురవావశగోపవధూ –
శతకోటివృతాత్ స్మరకోటిసమాత్ ।

ప్రతివల్లవికాభిమతాత్ సుఖదాత్
వసుదేవసుతాన్నపరం కలయే ॥

6. అభిరామగుణాకర! దాశరథే!
జగదేకధనుర్ధర! ధీరమతే ।
రఘునాయక! రామ! రమేశ! విభో!
వరదో భవ దేవ! దయాజలధే ॥

7) అవనీతనయా కమనీయకరం
రజనీకరచారుముఖాంబురుహమ్ ।
రజనీచరరాజతమోమిహిరమ్
మహనీయమహం రఘురామమయే ॥

8) సుముఖం సుహృదం సులభం సుఖదం
స్వనుజం చ సుజాయమమోఘశరమ్ ।
అపహాయ రఘూద్వహమన్యమహం
న కథంచన కంచన జాతు భజే ॥

9. వినా వేంకటేశం న నాథో న నాథః
సదా వేంకటేశం స్మరామి స్మరామి! ।
హరే! వేంకటేశ! ప్రసీద ప్రసీద
ప్రియం వేంకటేశ! ప్రయచ్ఛ ప్రయచ్ఛ ॥

10. అహం దూరతస్తే పదాంభోజయుగ్మ ప్రణామేచ్ఛయాఽఽగత్య సేవాం కరోమి ।
సకృత్సేవయా నిత్యసేవాఫలం త్వం ప్రయచ్ఛ ప్రయచ్ఛ ప్రభో! వేంకటేశ ॥

11. అజ్ఞానినా మయా దోషానశేషాన్ విహితాన్ హరే! ।
క్షమస్వ త్వం క్షమస్వ త్వం శేషశైలశిఖామణే! ॥

# శ్రీవేంకటేశ ప్రపత్తిః

1. ఈశానాం జగతోఽస్య వేంకటపతేః విష్ణోః పరాం ప్రేయసీం
తద్వక్షఃస్థల నిత్యవాసరసికాం తత్క్షాంతిసంవర్ధినీమ్ ।
పద్మాలంకృతపాణిపల్లవయుగాం పద్మాసనస్థాం శ్రియం
వాత్సల్యాదిగుణోజ్జ్వలాం భగవతీం వందే జగన్మాతరమ్ ॥

2. శ్రీమన్! కృపాజలనిధే! కృతసర్వలోక!
సర్వజ్ఞ! శక్త! నతవత్సల! సర్వశేషిన్ !
స్వామిన్! సుశీల! సులభాశ్రితపారిజాత !
శ్రీవేంకటేశ! చరణౌ శరణం ప్రపద్యే ॥

3) ఆనూపురార్పితసుజాతసుగంధిపుష్ప -
సౌరభ్యసౌరభకరౌ సమసన్నివేశౌ ।

సౌమ్యౌ సదాఽనుభవనేఽపి నవానుభావ్యౌ
శ్రీవేంకటేశ! చరణౌ శరణం ప్రపద్యే ॥

4. సద్యోవికాసి సముదిత్వరసాంద్రరాగ -
సౌరభ్యనిర్భరసరోరుహసామ్యవార్తామ్ ।
సమ్యక్షు సాహసపదేషు విలేఖయంతౌ
శ్రీవేంకటేశ! చరణౌ శరణం ప్రపద్యే ॥

5. రేఖామయధ్వజసుధాకలశాతపత్ర-
వజ్రాంకుశాంబురుహకల్పకశంఖచక్రైః ।
భవ్యైరలంకృతతలౌ పరతత్త్వచిహ్నైః
శ్రీవేంకటేశ! చరణౌ శరణం ప్రపద్యే ॥

6) తామ్రోదరద్యుతిపరాజితపద్మరాగౌ
బాహ్యైర్మహోభిరభిభూతమహేంద్రనీలౌ ।
ఉద్యన్నఖాంశుభిరుదస్తశశాంకభాసౌ
శ్రీవేంకటేశ! చరణౌ శరణం ప్రపద్యే ॥

7) సప్రేమభీతికమలాకరపల్లవాభ్యాం
సంవాహనేఽపి సపది క్లమమాదధానౌ ।
కాంతావవాఙ్మనసగోచరసౌకుమార్యౌ
శ్రీవేంకటేశ! చరణౌ శరణం ప్రపద్యే ॥

8. లక్ష్మీమహీతదనురూపనిజానుభావ -
నీళాదిదివ్యమహిషీకరపల్లవానామ్ ।
ఆరుణ్యసంక్రమణతః కిల సాంద్రరాగౌ
శ్రీవేంకటేశ! చరణౌ శరణం ప్రపద్యే ॥

9. నిత్యానమద్విధిశివాదికిరీటకోటి -
ప్రత్యుప్తదీప్తనవరత్నమహఃప్రరోహైః ।
నీరాజనావిధిముదారముపాదదానౌ
శ్రీవేంకటేశ! చరణౌ శరణం ప్రపద్యే ॥

10. 'విష్ణోః పదే పరమ' ఇత్యుదితప్రశంసౌ
'యౌ మధ్వ ఉత్స' ఇతి భోగ్యతయాఽప్యుపాత్తౌ ।
భూయస్తథేతి తవ పాణితలప్రదిష్టౌ
శ్రీవేంకటేశ! చరణౌ శరణం ప్రపద్యే

11. పార్థాయ తత్సదృశసారథినా త్వయైవ
యౌ దర్శితౌ స్వచరణౌ శరణం వ్రజేతి ।
భూయోఽపి మహ్యమిహ తౌ కరదర్శితౌ తే
శ్రీవేంకటేశ! చరణౌ శరణం ప్రపద్యే ॥

12. మన్మూర్ధ్ని కాళియఫణే వికటాటవీషు
శ్రీవేంకటాద్రిశిఖరే శిరసి శ్రుతీనామ్ ।
చిత్తేఽ ప్యనన్యమనసాం సమమాహితౌ తౌ
శ్రీవేంకటేశ! చరణౌ శరణం ప్రపద్యే ॥

13. ఆమ్లానహృష్యదవనీతలకీర్ణపుష్పౌ
శ్రీవేంకటాద్రి శిఖరాభరణాయమానౌ ।
ఆనందితాఖిలమనోనయనౌ తవైతౌ
శ్రీవేంకటేశ! చరణౌ శరణం ప్రపద్యే ॥

14. ప్రాయః ప్రపన్నజనతా ప్రథమావగాహ్యౌ
మాతుఃస్తనావివ శిశోరమృతాయమానౌ ।
ప్రాప్తౌ పరస్పతులామతులాంతరౌ తే
శ్రీవేంకటేశ! చరణౌ శరణం ప్రపద్యే ॥

15. సత్త్వోత్తరైః సతతసేవ్యపదాంబుజేన
సంసారతారకదయార్ద్రదృగంచలేన ।
సౌమ్యోపయంతృమునినా మమ దర్శితౌ తే
శ్రీవేంకటేశ! చరణౌ శరణం ప్రపద్యే ॥

16. శ్రీశ! శ్రియా ఘటికయా త్వదుపాయభావే
ప్రాప్యే త్వయి స్వయముపేయతయా స్ఫురంత్యా ।
నిత్యాశ్రితాయ నిరవద్యగుణాయ తుభ్యం
స్యాం కింకరో వృషగిరీశ! న జాతు మహ్యమ్ ॥

# శ్రీవేంకటేశమంగళమ్

1. శ్రియః కాంతాయ కల్యాణనిధయే నిధయేఽర్థినామ్ ।
శ్రీవేంకటనివాసాయ శ్రీనివాసాయ మంగళమ్ ॥

2. లక్ష్మీసవిభ్రమాలోకసుభ్రూవిభ్రమచక్షుషే ।
చక్షుషే సర్వలోకానాం వేంకటేశాయ మంగళమ్ ॥

3) శ్రీవేంకటాద్రిశృంగాగ్రమంగళాభరణాంఘ్రయే ।
మంగళానాం నివాసాయ శ్రీనివాసాయ మంగళమ్ ॥

4) సర్వావయవసౌందర్యసంపదా సర్వచేతసామ్ ।
సదా సమ్మోహనాయాఽస్తు వేంకటేశాయ మంగళమ్ ॥

5. నిత్యాయ నిరవద్యాయ సత్యానంతచిదాత్మనే ।
సర్వాంతరాత్మనే శ్రీమద్వేంకటేశాయ మంగళమ్ ॥

6. స్వతస్సర్వవిదే సర్వశక్తయే సర్వశేషిణే ।
సులభాయ సుశీలాయ వేంకటేశాయ మంగళమ్ ॥

7. పరస్మై బ్రహ్మణే పూర్ణకామాయ పరమాత్మనే ।
ప్రయుంజే పరతత్త్వాయ వేంకటేశాయ మంగళమ్ ॥

8. ఆకారతత్త్వమశ్రాంతమాత్మనామనుపశ్యతామ్ ।
అతృప్త్యమృతరూపాయ వేంకటేశాయ మంగళమ్ ॥

9) ప్రాయస్స్వచరణౌ పుంసాం శరణ్యత్వేన పాణినా ।
కృపయాఽఽదిశతే శ్రీమద్వేంకటేశాయ మంగళమ్ ॥

10) దయామృతతరంగిణ్యాస్తరంగైరివ శీతలైః ।
అపాంగైస్సించతే విశ్వం వేంకటేశాయ మంగళమ్ ॥

11) స్రగ్భూషాంబరహేతీనాం సుషమాఽఽవహమూర్తయే ।
సర్వార్తిశమనాయాస్తు వేంకటేశాయ మంగళమ్ ॥

12) శ్రీవైకుంఠవిరక్తాయ స్వామిపుష్కరిణీతటే ।
రమయా రమమాణాయ వేంకటేశాయ మంగళమ్ ॥

13) శ్రీమత్సుందరజామాతృమునిమానసవాసినే ।
సర్వలోకనివాసాయ శ్రీనివాసాయ మంగళమ్ ॥

14. మంగళాశాసనపరైః మదాచార్యపురోగమైః ।
సర్వైశ్చపూర్వైరాచార్యైః సత్కృతాయాఽస్తు మంగళమ్ ॥

---



# కావేరీభుజఙ్గస్తోత్రమ్

శ్లో॥ కథం సహ్యజన్యే సురామే సజన్యే
ప్రసన్నే వదాన్యాః భవేయుర్వదాన్యే ।
సపాపస్య మన్యే గతిమమ్బ మాన్యే
కవేరస్య ధన్యే కవేరస్య కన్యే ॥ 1

శ్లో॥ కృపామ్బోధిసఙ్గే కృపార్ద్రాన్తరఙ్గే
జలాక్రాన్తరఙ్గే జవోద్యోతరఙ్గే
నభశ్చుమ్బివన్యేభసమ్పద్విమాన్యే
నమస్తే వదాన్యే కవేరస్య కన్యే ॥ 2

శ్లో॥ సమా తే న లోకే నదీ హ్యత్ర లోకే
హతాశేషశోకే లసత్తట్యశోకే ।
పిబన్తోఽమ్బ తే కే రమన్తే న నాకే
నమస్తే వదాన్యే కవేరస్య కన్యే ॥ 3

శ్లో॥ మహాపాపిలోకానపి స్నానమాత్రాన్
మహాపుణ్యకృద్భిర్మహత్కృత్యసద్భిః ।
కరోష్యమ్బ సర్వాన్సురాణాం సమానాన్
నమస్తే వదాన్యే కవేరస్య కన్యే ॥ 4

శ్లో॥ అవిద్యాన్తకర్త్రీ విశుద్ధప్రదాత్రీ
సస్యస్యవృద్ధిం తథాఽఽచారశీలమ్ ।
దదాస్యమ్బ ముక్తిం విధూయ ప్రసకిత్మ్
నమస్తే వదాన్యే కవేరస్య అకన్యే ॥ 5

ఇతి కావేరీభుజఙ్గస్తోత్రమ్ సమ్పూర్ణమ్ ।



# కావేరీ స్తోత్రమ్

శ్రీపరాశరభట్టాచార్యకృతే శ్రీరఙ్గరాజస్తోత్రే
కావేరీమాహాత్మ్యసమ్బన్ధే స్పష్టీకృతాని కానిచిత్ శ్లోకాని ।

శ్లో॥ దుగ్ధాబ్ధిర్జనకో జనన్యహమియం శ్రీరేవ పుత్రీ వరః
శ్రీరఙ్గేశ్వర ఏతదర్హమిహ కిం కుర్యామితీవాకులా ।
చఞ్చచ్చామరచన్ద్రచన్దనమహామాణిక్యముక్తోత్కరాన్
కావేరీలహరీకరైర్విదధతీ పర్యేతి సా సేవ్యతామ్ ॥ 1

శ్లో॥ అగణితగుణావద్యం సర్వం స్థిరత్నసమప్రతిక్రియా-
మపి పయఃపురైరాప్యాయయన్త్యను జాగ్రతి ।
ప్రవహతి జగద్ధాత్రీ భూత్వైవ రఙ్గపతేర్దయా
శిశిర మధురాగాధా సా నః పునాతు మరుద్వృధా ॥ 2

శ్లో॥ తరలతనుతరఙ్గైర్మన్దమాన్దోలిమాన-
స్వతటవిటపిరాజీ మఞ్జరీ సుప్తభృఙ్గా ।
క్షిపతు కనకనామ్నీ నిమ్నగా నారికేల-
క్రముకజమకరన్దైర్మాంసలాపా మదంహః ॥ 3

శ్లో॥ కదలవకులజమ్బూపూగమాకన్దకణ్ఠ -
ద్వయసరసనీరామన్తరా సహ్యకన్యామ్ ।
ప్రబలజలపిపాసాలమ్బమానామ్బుదౌఘ-
భ్రమకరతరువృన్దం వన్ద్యతామాన్తరీపమ్ ॥ 4

శ్లో॥ హంసయుక్తవిమానస్థే బ్రహ్మాణీరూపధారిణి ।
కౌశామ్భఃక్షరికే దేవి నారాయణి నమోఽస్తు తే ॥

✦ ✦ ✦

ఓం గణేశాయ నమః



# పంచముఖహనుమత్కవచమ్

ఓం శ్రీ పఞ్చవదనాయాఞ్జనేయాయ నమః । ఓం అస్య శ్రీ పఞ్చముఖహనుమన్మన్త్రస్య బ్రహ్మ ఋషిః । గాయత్రీఛన్దః । పఞ్చముఖవిరాట్ హనుమాన్దేవతా । హ్రీం బీజం । శ్రీం శక్తిః । క్రౌం కీలకం । క్రూం కవచం । మమ పఞ్చముఖహనుమద్ప్రసాదసిద్ధ్యర్థే పాఠే వినియోగః । ఓం భూర్భువస్సువరోం ఇతి దిగ్బన్ధః ।

శ్రీ గరుడ ఉవాచ ।

శ్లో॥ అథ ధ్యానం ప్రవక్ష్యామి శృణు సర్వాఙ్గసున్దరి ।
యత్కృతం దేవదేవేన ధ్యానం హనుమతః ప్రియమ్ ॥ 1

శ్లో॥ పఞ్చవక్త్రం మహాభీమం త్రిపఞ్చనయనైర్యుతమ్ ।
బాహుభిర్దశభిర్యుక్తం సర్వకామార్థసిద్ధిదమ్ ॥ 2

శ్లో॥ పూర్వం తు వానరం వక్త్రం కోటిసూర్యసమప్రభమ్ ।
దంష్ట్రాకరాలవదనం భ్రుకుటీకుటిలేక్షణమ్ ॥ 3

శ్లో॥ అస్యైవ దక్షిణం వక్త్రం నారసింహం మహాద్భుతమ్ ।
అత్యుగ్రతేజోవపుషం భీషణం భయనాశనమ్ ॥ 4

శ్లో॥ పశ్చిమం గారుడం వక్త్రం వక్రతుణ్డం మహాబలమ్ ।
సర్వనాగప్రశమనం విషభూతాదికృన్తనమ్ ॥ 5

శ్లో॥ ఉత్తరం సౌకరం వక్త్రం కృష్ణం దీప్తం నభోపమమ్ ।
పాతాలసింహవేతాలజ్వరరోగాదికృన్తనమ్ ॥ 6

శ్లో॥ ఊర్ధ్వం హయాననం ఘోరం దానవాన్తకరం పరమ్ ।
యేన వక్త్రేణ విప్రేన్ద్ర తారకాఖ్యం మహాసురమ్ ॥ 7

శ్లో॥ జఘాన శరణం తత్స్యాత్సర్వశత్రుహరం పరమ్ ।
ధ్యాత్వా పఞ్చముఖం రుద్రం హనుమన్తం దయానిధిమ్ ॥ 8

శ్లో॥ ఖడ్గం త్రిశూలం ఖట్వాఙ్గం పాశమఙ్కుశపర్వతమ్ ।
ముష్టిం కౌమోదకీం వృక్షం ధారయన్తం కమణ్డలుమ్ ॥ 9

శ్లో॥ భిన్దిపాలం జ్ఞానముద్రాం దశభిర్మునిపుఙ్గవమ్ ।
ఏతాన్యాయుధజాలాని ధారయన్తం భజామ్యహమ్ ॥ 10

శ్లో॥ ప్రేతాసనోపవిష్టం తం సర్వాభరణభూషితమ్ ।
దివ్యమాల్యామ్బరధరం దివ్యగన్ధానులేపనమ్ ।
సర్వాశ్చర్యమయం దేవం హనుమద్విశ్వతోముఖమ్ ॥ 11

శ్లో॥ పఞ్చాస్యమచ్యుతమనేకవిచిత్రవర్ణ–
వక్త్రం శశాఙ్కశిఖరం కపిరాజవర్యమ్ ।
పీతామ్బరాదిముకుటైరుపశోభితాఙ్గం
పిఙ్గాక్షమాద్యమనిశం మనసా స్మరామి ॥ 12

శ్లో॥ మర్కటేశం మహోత్సాహం సర్వశత్రుహరం పరమ్ ।
శత్రుం సంహర మాం రక్ష శ్రీమన్నాపదముద్ధర ॥ 13

శ్లో॥ ఓం హరిమర్కట మర్కట మన్త్రమిదం
పరిలిఖ్యతి లిఖ్యతి వామతలే ।
యది నశ్యతి నశ్యతి శత్రుకులం
యది ముఞ్చతి ముఞ్చతి వామలతా ॥ 14

**ఓం హరిమర్కటాయ స్వాహా ।**
ఓం నమో భగవతే పఞ్చవదనాయ **పూర్వకపిముఖాయ**
సకలశత్రుసంహారకాయ స్వాహా ।
ఓం నమో భగవతే పఞ్చవదనాయ దక్షిణముఖాయ కరాలవదనాయ
**నరసింహాయ** సకలభూతప్రమథనాయ స్వాహా ।
ఓం నమో భగవతే పఞ్చవదనాయ పశ్చిమముఖాయ **గరుడాననాయ**
సకలవిషహరాయ స్వాహా ।
ఓం నమో భగవతే పఞ్చవదనాయోత్తరముఖా**యాదివరాహాయ**
సకలసమ్పత్కరాయ స్వాహా ।
ఓం నమో భగవతే పఞ్చవదనాయోర్ధ్వముఖాయ **హయగ్రీవాయ**
సకలజనవశఙ్కరాయ స్వాహా ।

ఓం అస్య శ్రీ పఞ్చముఖహనుమన్మన్త్రస్య శ్రీరామచన్ద్ర ఋషిః । అనుష్టుప్ఛన్దః । పఞ్చముఖవీరహనుమాన్ దేవతా । హనుమానితి బీజమ్ । వాయుపుత్ర ఇతి శక్తిః । అఞ్జనీసుత ఇతి కీలకమ్ । శ్రీరామదూతహనుమత్ప్రసాదసిద్ధ్యర్థే జపే వినియోగః ।

ఇతి ఋష్యాదికం విన్యసేత్ ।

ఓం అఞ్జనీసుతాయ అఙ్గుష్ఠాభ్యాం నమః ।
ఓం రుద్రమూర్తయే తర్జనీభ్యాం నమః ।

ఓం వాయుపుత్రాయ మధ్యమాభ్యాం నమః ।
ఓం అగ్నిగర్భాయ అనామికాభ్యాం నమః ।
ఓం రామదూతాయ కనిష్ఠికాభ్యాం నమః ।
ఓం పఞ్చముఖహనుమతే కరతలకరపృష్ఠాభ్యాం నమః ।

ఇతి కరన్యాసః ।

ఓం అఞ్జనీసుతాయ హృదయాయ నమః ।
ఓం రుద్రమూర్తయే శిరసే స్వాహా ।
ఓం వాయుపుత్రాయ శిఖాయై వషట్ ।
ఓం అగ్నిగర్భాయ కవచాయ హుమ్ ।
ఓం రామదూతాయ నేత్రత్రయాయ వౌషట్ ।
ఓం పఞ్చముఖహనుమతే అస్త్రాయ ఫట్ ।
పఞ్చముఖహనుమతే స్వాహా ।
ఇతి దిగ్బన్ధః ।

అథ ధ్యానమ్ ।

వన్దే వానరనారసింహఖగరాట్క్రోడాశ్వవక్త్రాన్వితం
దివ్యాలఙ్కరణం త్రిపఞ్చనయనం దేదీప్యమానం రుచా ।
హస్తాబ్జైరసిఖేటపుస్తకసుధాకుమ్భాఙ్కుశాద్రిం హలం
ఖట్వాఙ్గం ఫణిభూరుహం దశభుజం సర్వారివీరాపహమ్ ।

అథ మన్త్రః ।

ఓం శ్రీరామదూతాయాఞ్జనేయాయ వాయుపుత్రాయ మహాబలపరాక్రమాయ సీతాదుఃఖనివారణాయ లఙ్కాదహనకారణాయ మహాబలప్రచణ్డాయ ఫాల్గునసఖాయ కోలాహలసకలబ్రహ్మాణ్డవిశ్వరూపాయ సప్తసముద్రనిర్లఙ్ఘనాయ పిఙ్గలనయనా- యామితవిక్రమాయ సూర్యబిమ్బఫలసేవనాయ దుష్టనివారణాయ దృష్టి నిరాలఙ్కృతాయ సఞ్జీవినీసఞ్జీవితాఙ్గదలక్ష్మణమహాకపిసైన్యప్రాణదాయ దశకణ్ఠవిధ్వంసనాయ రామేష్టాయ మహాఫాల్గునసఖాయ సీతాసహిత- రామవరప్రదాయ షట్ప్రయోగాగమపఞ్చముఖ-వీరహనుమన్మన్త్రజపే వినియోగః ।

ఓం హరిమర్కటమర్కటాయ బంబంబంబంబం వౌషట్ స్వాహా ।
ఓం హరిమర్కటమర్కటాయ ఫంఫంఫంఫంఫం ఫట్ స్వాహా ।
ఓం హరిమర్కటమర్కటాయ ఖేంఖేంఖేంఖేంఖేం మారణాయ స్వాహా ।
ఓం హరిమర్కటమర్కటాయ లుంలుంలుంలుంలుం ఆకర్షితసకలసమ్పత్కరాయ స్వాహా।
ఓం హరిమర్కటమర్కటాయ ధంధంధంధంధం శత్రుస్తమ్భనాయ స్వాహా ।
ఓం టంటంటంటంటం కూర్మమూర్తయే పఞ్చముఖవీరహనుమతే
పరయన్త్రపరతన్త్రోచ్చాటనాయ స్వాహా ।
ఓం కంఖంగంఘంఙం చంఛంజంఝంఞం టంఠండంఢంణం

తంథందంధనం పంఫంబంభంమం యంరంలంవం శంషంసంహం
ళంక్షం స్వాహా । ఇతి దిగ్బన్ధః ।

ఓం పూర్వకపిముఖాయ పఞ్చముఖహనుమతే టంటంటంటంటం సకలశత్రుసంహరణాయ స్వాహా । ఓం దక్షిణముఖాయ పఞ్చముఖహనుమతే కరాలవదనాయ నరసింహాయ ఓం హ్రాం హ్రీం హ్రూం హ్రైం హ్రౌం హ్రః సకలభూతప్రేతదమనాయ స్వాహా । ఓం పశ్చిమముఖాయ గరుడాననాయ పఞ్చముఖహనుమతే మంమంమంమంమం సకలవిషహరాయ స్వాహా । ఓం ఉత్తరముఖాయాదివరాహాయ లంలంలంలంలం నృసింహాయ నీలకణ్ఠమూర్తయే పఞ్చముఖహనుమతే స్వాహా । ఓం ఊర్ధ్వముఖాయ హయగ్రీవాయ రుంరుంరుంరుంరుం రుద్రమూర్తయే సకలప్రయోజననిర్వాహకాయ స్వాహా । ఓం అఞ్జనీసుతాయ వాయుపుత్రాయ మహాబలాయ సీతాశోకనివారణాయ శ్రీరామచన్ద్ర కృపాపాదుకాయ మహావీర్యప్రమథనాయ బ్రహ్మాణ్డనాథాయ కామదాయ పఞ్చముఖ వీరహనుమతే స్వాహా ।

భూతప్రేతపిశాచబ్రహ్మరాక్షసశాకినీడాకిన్యన్తరిక్షగ్రహ- పరయన్త్రపరతన్త్రోచ్చటనాయ స్వాహా।

సకలప్రయోజననిర్వాహకాయ పఞ్చముఖవీరహనుమతే శ్రీరామచన్ద్రవరప్రసాదాయ జంజంజంజంజం స్వాహా ।

శ్లో॥ ఇదం కవచం పఠిత్వా తు మహాకవచం పఠేన్నరః ।
ఏకవారం జపేత్స్తోత్రం సర్వశత్రునివారణమ్ ॥ 15

శ్లో॥ ద్వివారం తు పఠేన్నిత్యం పుత్రపౌత్రప్రవర్ధనమ్ ।
త్రివారం చ పఠేన్నిత్యం సర్వసమ్పత్కరం శుభమ్ ॥ 16

శ్లో॥ చతుర్వారం పఠేన్నిత్యం సర్వరోగనివారణమ్ ।
పఞ్చవారం పఠేన్నిత్యం సర్వలోకవశఙ్కరమ్ ॥ 17

శ్లో॥ షడ్వారం చ పఠేన్నిత్యం సర్వదేవవశఙ్కరమ్ ।
సప్తవారం పఠేన్నిత్యం సర్వసౌభాగ్యదాయకమ్ ॥ 18

శ్లో॥ అష్టవారం పఠేన్నిత్యమిష్టకామార్థసిద్ధిదమ్ ।
నవవారం పఠేన్నిత్యం రాజభోగమవాప్నుయాత్ ॥ 19

శ్లో॥ దశవారం పఠేన్నిత్యం త్రైలోక్యజ్ఞానదర్శనమ్ ।
రుద్రావృత్తిం పఠేన్నిత్యం సర్వసిద్ధిర్భవేద్ధ్రువమ్ ॥ 20

శ్లో॥ నిర్బలో రోగయుక్తశ్చ మహావ్యాధ్యాదిపీడితః ।
కవచస్మరణేనైవ మహాబలమవాప్నుయాత్ ॥ 21

ఓం భూర్భువస్సువరోం ఇతి దిగ్విమోకః
ఇతి శ్రీసుదర్శనసంహితాయాం శ్రీరామచన్ద్రసీతాప్రోక్తం
శ్రీపఞ్చముఖహనుమత్కవచం సమ్పూర్ణమ్ ।

---

**హరేరామ హరేరామ రామరామ హరేహరే ।**
**హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణకృష్ణ హరేహరే ॥**



# కాలభైరవాష్టకమ్



దేవరాజసేవ్యమానపావనాంఘ్రిపంకజం వ్యాలయజ్ఞసూత్రమిందుశేఖరం కృపాకరమ్ |
నారదాదియోగిబృందవందితం దిగంబరం కాశికాపురాధినాథ కాలభైరవం భజే || ౧ ||

భానుకోటిభాస్వరం భవాబ్ధితారకం పరం నీలకంఠమీప్సితార్థదాయకం త్రిలోచనమ్ |
కాలకాలమంబుజాక్షమక్షశూలమక్షరం కాశికాపురాధినాథ కాలభైరవం భజే || ౨ ||

శూలటంకపాశదండపాణిమాదికారణం శ్యామకాయమాదిదేవమక్షరం నిరామయమ్ |
భీమవిక్రమం ప్రభుం విచిత్రతాండవప్రియం కాశికాపురాధినాథ కాలభైరవం భజే || ౩ ||

భుక్తిముక్తిదాయకం ప్రశస్తచారువిగ్రహం భక్తవత్సలం స్థిరం సమస్తలోకవిగ్రహమ్ |
నిక్వణన్మనోజ్ఞహేమకింకిణీలసత్కటిం కాశికాపురాధినాథ కాలభైరవం భజే || ౪ ||

ధర్మసేతుపాలకం త్వధర్మమార్గనాశకం కర్మపాశమోచకం సుశర్మదాయకం విభుమ్ |
స్వర్ణవర్ణకేశపాశశోభితాంగనిర్మలం కాశికాపురాధినాథ కాలభైరవం భజే || ౫ ||

రత్నపాదుకాప్రభాభిరామపాదయుగ్మకం నిత్యమద్వితీయమిష్టదైవతం నిరంజనమ్ |
మృత్యుదర్పనాశనం కరాలదంష్ట్రభూషణం కాశికాపురాధినాథ కాలభైరవం భజే || ౬ ||

అట్టహాసభిన్నపద్మజాండకోశసంతతిం దృష్టిపాతనష్టపాపజాలముగ్రశాసనమ్ |
అష్టసిద్ధిదాయకం కపాలమాలికాధరం కాశికాపురాధినాథ కాలభైరవం భజే || ౭ ||

భూతసంఘనాయకం విశాలకీర్తిదాయకం కాశివాసిలోకపుణ్యపాపశోధకం విభుమ్ |
నీతిమార్గకోవిదం పురాతనం జగత్పతిం కాశికాపురాధినాథ కాలభైరవం భజే || ౮ ||

కాలభైరవాష్టకం పఠంతి యే మనోహరం జ్ఞానముక్తిసాధకం విచిత్రపుణ్యవర్ధనమ్ |
శోకమోహలోభదైన్యకోపతాపనాశనం తే ప్రయాంతి కాలభైరవాంఘ్రిసన్నిధిం ధ్రువమ్ ||








మహత్తరమైన మధ్వమతానికి మూలస్తంభాలలో శ్రీ జయతీర్థులు ఒకరు. ద్వైత వేదాంతానికి చెందిన గొప్ప యతులు ముప్వురిలో (యతిత్రయంలో) శ్రీమధ్వాచార్యులవారు, శ్రీ వ్యాసరాజవారితోపాటు వీరు కూడా ఒకరుగా పరిగణించబడతారు. శ్రీ మధ్వాచార్యులవారి నుండి ఆ పరంపరలో వీరు 6వ వారు.

పూర్వాశ్రమ వివరాలు

కాలం: 1365-1388

పూర్వాశ్రమ నామం: శ్రీ రఘునాథ నాయక

ఆశ్రమ గురువులు: శ్రీ అక్షోభ్య తీర్థులవారు

ఆశ్రమ శిష్యులు: శ్రీ విద్యాధిరాజ తీర్థులవారు

ఆరాధన: ఆషాఢ కృష్ణ పంచమి, విభవ సంవత్సరం

బృందావన స్థలం: నవబృందావనం (ఆనెగొంది)/మలఖేద

**సంక్షిప్త చిత్రం :** కర్ణాటకలోని జమఖండి ప్రాంతానికి చెందిన చిన్నబండారి కుటుంబంలో, భరద్వాజ గోత్రంలో, సుప్రసిద్ధ సస్తిక వంశంలో, శ్రీ దుండిరాజ నాయకుల 4వ కుమారులు శ్రీ రఘునాథ నాయకులు. శ్రీ దుండిరాజ నాయకుల వారు శ్రీ గోవింద భట్టులకు (శ్రీ అక్షోభ్య తీర్థులవారికి) దగ్గరి బంధువులు. వృత్తిరీత్యా సామంత ప్రభువులు, దేవగిరి యాదవుల రాజ్యంలో సమున్నత యోధులు. శ్రీ రఘునాథ నాయకుల వారు యువకులు, రూపసి, వివేకి, తన వృత్తికి అవసరమైన గుర్రపు స్వారీలో నిష్ణాతులు.

**సన్యాస స్వీకారం :** తత్త్వవాదాన్ని అత్యంత ఆమోదయోగ్యమైన చింతనా మార్గంగా స్థాపించటంలో విశేషంగా కృషిసల్పిన శ్రీ జయతీర్థులుగా శ్రీ రఘునాథ నాయకులవారిని తీర్చిదిద్దిన శ్రీ అక్షోభ్య తీర్థులవారికి మనందరం ఋణపడి ఉండాలి.

శ్రీ అక్షోభ్య తీర్థులవారు భీమా నదీతీరంలో బసచేసి ఉండగా, యువకులైన రఘునాయకులవారు అశ్వారూఢులై తన దాహార్తిని తీర్చుకొనేందుకు నదిలోకి ప్రవేశించి గుర్రం నుండి క్రిందకు దిగకుండానే నేరుగా నీటిని గ్రోలారు. ఇది గమనించిన శ్రీ అక్షోభ్య తీర్థులవారు 'కిం పశుః పూర్వదేహే' ('గత జన్మలో నీవు పశువువా?') అని అడిగారు. ఆ ప్రశ్నతో శ్రీ రఘునాథనాయకులవారి మనసు భౌతిక వాంఛనుండి ఆధ్యాత్మికతకు మళ్లటం మొదలైంది. శ్రీ రఘునాథనాయకులవారు

భౌతిక జీవితాన్ని త్యజించి తమ పూర్తి జీవితాన్ని తమ గురువుల సేవలకు అర్పించదలచి వారి అనుంగు శిష్యునిగా వారి అడుగుజాడలను అనుసరించారు. తన కుమారుడు కుటుంబ వృత్తిని మానాడన్న వార్త తెలిసిన ఆయన తండ్రి శ్రీ దుండిరాజ నాయకులవారు తన కుమారుని బలవంతంగా వెనక్కు రప్పించి వివాహం చేశారు. అప్పటికే ఆధ్యాత్మిక బుద్ధితో ఉన్న రఘునాథ నాయకులవారు భౌతిక జీవితంలో కొనసాగలేక, ఇల్లు వెడలిపోయి, మళ్లీ శ్రీ అక్షోభ్యతీర్థులవారి చెంతకు చేరారు. చివరికి శ్రీ అక్షోభ్యతీర్థులవారు దిండిరాజ నాయకులవారికి తమ కుమారుని తన ఆధ్యాత్మిక జీవితాన్ని కొనసాగనిచేందుకు అనుమతించమని నచ్చచెప్పి ఒప్పించి, తనతో శ్రీ రఘునాథనాయకులవారిని తమతో తోడ్కొనివచ్చి, తాము శ్రీ మధ్వాచార్యులవారి నుండి నేర్చుకొని ఉన్నదంతా ఆయనకు బోధించటం ఆరంభించారు. ఆచార్యులవారి దివ్య ఆశీస్సులతో శ్రీ అక్షోభ్యతీర్థులవారు రఘునాథనాయకులవారిని పూర్తిగా ఒక గొప్ప విద్వాంసునిగా తీర్చిదిద్ది, ఆయనను వారసునిగా నియమించి, **'శ్రీ జయతీర్థ'** అని నామకరణం చేశారు. ఈ సంఘటనతో శ్రీ దుండిరాజనాయకుల కుటుంబం మారిపోయి, శ్రీ మధ్వాచార్యులవారి ఆధ్యాత్మిక వారసత్వంలోకి ఆమోదించబడి, ద్వైత మతాన్ని సమున్నత శిఖరాలకు చేర్చిన ఎందరో మహానుభావులను అందించింది. శ్రీ జయధ్వజతీర్థులవారు, శ్రీ రాజేంద్రతీర్థులవారు, శ్రీ పురుషోత్తమతీర్థులవారు, శ్రీ బ్రాహ్మణ్యతీర్థులవారు, శ్రీ లక్ష్మీనారాయణతీర్థులవారు, శ్రీ సురేంద్రతీర్థులవారు, శ్రీ వ్యాసరాజులవారు, శ్రీ పురందరదాసువారు, శ్రీ విజయీంద్రతీర్థులవారు, శ్రీ సుధీంద్రతీర్థులవారు, ఇంకా సుప్రసిద్ధులైన శ్రీ రాఘవేంద్రతీర్థులవారితోపాటు మరెందరో వారిలో ఉన్నారు.

శ్రీ మధ్వాచార్యులవారి అనంతర కాలంలో తత్త్వవాదం గొప్ప మాంద్యాన్ని చూచింది. శ్రీ మధ్వాచార్యులవారి ప్రత్యక్ష శిష్యులైన శ్రీ అక్షోభ్యతీర్థులవారు అంతవరకు కొద్దిమందికే పరిమితమైఉన్న జ్ఞానాన్ని మరింత ఎక్కువ మందికి చేర్చవలసిన అవసరాన్ని ముందుగానే గుర్తించారు. అందుకే ఆయన శ్రీ జయతీర్థులవారిని ఆ బాధ్యతాయుతమైన పనికి సిద్ధపరిచి, సమాజానికి పూర్తిగా క్రొత్తవైన శ్రీ మధ్వాచార్యులవారి సందేశాలను, భావాలను మరింత సరళంగా, సంక్షిప్తంగా, అర్థమయ్యేరీతిలో మరింతమందికి చేరువ చేసేందుకు వివరంగా రూపొందిచమని ఆదేశించారు. విద్యార్థులకు బోధించేందుకు, ఇతర చింతనా మార్గాలైన అద్వైత, విశిష్టాద్వైత, బౌద్ధ, జైన మొదలైన వాటితో చర్చల ద్వారా తత్త్వవాదాన్ని స్థాపించేందుకు దానిని ఉపయోగించాలి.

ఒక బాధ్యతాయుతమైన పనికి నియమించబడి ఉండినందున శ్రీ జయతీర్థులవారు కత్తిని పట్టిన చేతితో కలాన్ని పట్టి తన రచనల ద్వారా శ్రీ మధ్వాచార్యులవారి సందేశాన్ని, భావాలను వివరించటం ఆరంభించారు. ఈ జ్ఞాన యజ్ఞంలో వారు రేయింబవలు గడిపారు, ఆయన యెర్గోలా గ్రామ సమీపంలోని ముఖ్య ప్రాణ ఆలయం ప్రక్కనె ఉన్న ఒక సహజ గుహలోనే తన అత్యధిక సమయం గడిపేవారు. ఆయన సంస్థానానికి సంబంధించిన ఇతర విషయాలలో అతి తక్కువ సమయం గడుపుతుండేవారు. ఇక శిష్యగణం అర్పించే మొక్క పిండి మాత్రమే గ్రహించి తన పని కొనసగించేవారు. ఆయన నిష్ఠ, గురువుగారిపట్ల నిబద్ధత అలాంటిది.

శ్రీ మధ్వాచార్యులవారి సందేశాన్ని వశంచేసికొనేందుకు వివిధ విషయాలపైన శ్రీ జయతీర్థులవారు ఇరవై రెండు గ్రంథాలు కూర్చారని విశ్వసిస్తుంటారు. వాటిలో అను వ్యాఖ్యాన టీక,(న్యాయసుధ), తత్త్వప్రకాశిక, ఉపనిషత్ భాష్యాలు, గీత, ఋగ్భాష్యాలు, ఇంకా శ్రీ మధ్వాచార్యులవారి ఇతర చిన్ని రచనల పైన టీకలు ఉన్నాయి. దీనితో శ్రీ జయతీర్థులవారు తత్త్వవేద సాహిత్యానికి ఒక

మైలురాయిని, ప్రమాణాన్ని నెలకొల్పారు. వీరి రచనలే రానున్న తరాల వ్యాఖ్యాతలు శ్రీ మధ్వాచార్యులవారి భావాలకు తప్పనిసరిగా సరైన వ్యక్తీకరణలుగా, భాష్యాలుగా, అధికీకృతమైనవిగా, నిర్దుష్టమైనవిగా నిర్దేశించారు.

శ్రీ జయతీర్థులవారి సర్వోత్కృష్ట కృతి అనువ్యాఖ్యానటీక (అనంతరకాలంలో శ్రీమాన్ న్యాయసుధ గా ప్రసిద్ధం) ను తత్త్వసిద్ధాంతంలో ఒక వ్యక్తి విద్వత్తును కొలిచే ప్రమాణంగా పరిగణించబడుతుంది. "సుధవ పఠనీయ వసుధవ పాలనీయ" (దానర్థం న్యాయసుధను అధ్యయనంచేసిన వారికి రాజుగా ఉన్న దానితో సమానమైన ఆనందం లభిస్తుంది) అని ఒక లోకోక్తి ఉంది. శ్రీమాన్ న్యాయసుధను అధ్యయనం చేసిన వారిని మధ్వ సంప్రదాయంలో మహాగొప్ప విద్వాంసునిగా పరిగణిస్తారంటారు. ద్వైత సిద్ధాంతలోని సాహితీపండితులందరూ న్యాయసుధ గ్రంథం పైన వ్యాఖ్యానం వ్రాసేందుకు స్రీ ప్రయత్నించారు. వాటిలో మంత్రాలయానికి చెందిన శ్రీరాఘవేంద్రతీర్థులవారు వ్రాసిన **శ్రీపరిమళ వ్యాఖ్యానం** సుప్రసిద్ధం.

శ్రీజయతీర్థులవారు తన వ్యాఖ్యానాల రచనలో ఒక రోగనిర్ధారణ చేసినంత కచ్చితత్వంతో సిద్ధాంతాన్ని క్రమమైన పద్ధతిలో పూర్వపక్షాన్ని, తత్వాన్ని, సిద్ధాంతాన్ని స్థాపించటంద్వారా ఒక అసమానమైన శైలిని ఎంచుకున్నారు. ఈ విధంగా సాహితీ ప్రపంచంలో భావగర్భితంగా గతంలోలేని విధంగా మెరుగుపరిచి, సాహితీ సిద్ధాంతానికి ఆద్యుడయ్యారు. తదనంతర కాలపు సాహితీ పండితులు వాదాలను నిర్వచించటంలో వారి అడుగుజాడలను అనుసరించటమేకాదు, నేటి ఆధునిక విశ్వవిద్యాలయాలు (పశ్చిమ/భారతీయ) సైతం పరిశోధకత్వం కోసం సిద్ధాంతగ్రంథాన్ని వ్రాసి,సమర్పించటంలో వారి శైలినే అనుసరిస్తున్నాయి.

ఉత్తమమైన, సముచితమైన పదాలు, పదబంధాల వాడకంతోపాటు విషయపరిజ్ఞానంలోను, ఆలోచనలోను అసాధారణమైన సామర్థ్యాన్ని, స్పష్టతను కలిగి ఉండటం వారి రచనాశైలి. ఇతర సిద్ధాంతాలలోని గుణదోషాలను సాధికార ప్రమాణాలు, ఋజువులతో ఎత్తిచూపుతూనే వాటితో గౌరవప్రదంగా ఏవిధంగా మెలగాలో వారు చూపుతారు.

మధ్వాచార్యులచారి రచనలన్నింటికీ శ్రీ జయతీర్థులవారు టీకలు (వ్యాఖ్యానం) వ్రాసి ఉన్నందున వారు టీకాచార్యులవారిగా సుప్రసిద్ధులైనారు, వారి ఆరాధనను "టీకాచార్యులవారి పంచమి" అంటారు.

విజయనగర సామ్రాజ్యపు శ్రీ విద్యారణ్యుల వారు శ్రీ జయతీర్థులవారిని యెరగోల గుహవద్ద కలుసుకుని, మధ్వాచార్యులవారి ప్రమాణలక్షణపై శ్రీ జయతీర్థులవారి వ్యాఖ్యానాన్ని ప్రశంసించిన సందర్భం కూడా ఉంది. తర్వాత గజారోహణం చేయించి వారిపట్ల తమకుగల గౌరవాన్ని సూచించారు. శ్రీ మధ్వసిద్ధాంతానికి జనబాహుళ్యపు ఆమోదమున్నదని తెలిపేవిధంగా, ఆ గజారోహణంలో మధ్వాచార్యులవారి గ్రంథాలను ఏనుగుపై ఉంచి ఊరేగించారు.

మూలమైన పునాదిని ఏర్పరిచాక, శ్రీ జయతీర్థులవారు తాము శ్రీ అక్షోభ్యతీర్థులవారి నుండి నేర్చుకున్న జ్ఞానాన్నంతటినీ, తమ రచనలనన్నిటినీ శ్రీ కృష్ణభట్ట (శ్రీ విద్యాధిరాజ తీర్థులవారు) వారికి బోధించారు, ఇంకా శ్రీ రాజేంద్ర తీర్థుల వారిని, శ్రీ జయదేవర తీర్థులవారిని, శ్రీ వ్యాస తీర్థుల వారిని, శ్రీ వాసుదేవశాస్త్రి (శ్రీ కావీంద్ర తీర్థుల వారు)ని తయారుచేశారు. శ్రీ రాజేంద్ర తీర్థులవారు పూర్వాశ్రమంలో నూతనంగా రూపుదిద్దుకున్న శ్రీ మధ్వ సిద్ధాంతాన్ని ప్రచారం చేసేందుకు దక్షిణ

భారతంలో పర్యటించారు. శ్రీ రాజేంద్ర తీర్థులవారు ఆ బాధ్యతను తీసికొని తత్త్వ సిద్ధాంతాన్ని స్థాపించేందుకు మార్గాన్ని ఏర్పరించి, అభివృద్ధిచేసిన శ్రీ విభూదేంద్ర తీర్థుల వారి లాంటి అనేకమంది అత్యున్నత స్థాయి పండితులను, విలువైన జ్ఞానాన్ని తర్వాతి తరాలకు అందించారు. శ్రీ జయధ్వజ తీర్థులవారిని పూర్వాశ్రమంలో ఈ తత్త్వాన్ని ప్రచారం చేసే నిమిత్తం ఉత్తర భారతదేశానికి పంపటం జరిగింది. అక్కడ బెంగాల్ ప్రాంతంలో వారు అనంతరకాలంలో చైతన్య భక్తి ఉద్యమంగా ప్రసిద్ధమైన భక్తి ఉద్యమాన్ని ఆరంభించారు.

ఈ విధంగా శ్రీ జయతీర్థులవారు శ్రీ మధ్వ సిద్ధాంతం పునరుత్తేజంపొంది, వ్యాప్తిచెందేందుకు అవసరమైన మౌలిక వసతులను, గ్రంథాలయాన్ని, వనరులను, సామర్థ్యాన్ని, సమాజంలో గౌరవాన్ని ఒంటిచేత్తో కల్పించారు. వారు సృష్టించిన జ్ఞానాన్ని వారి శిష్యులు ఒక తరం నుండి మరో తరానికి తరతరాలుగా అందచేశారు. అది అనేక శాఖలుగా విలసిల్లి, చివరిగా ఫలించింది.

**బృందావన ప్రవేశం:** శ్రీ జయతీర్థులవారు కేవలం 23 సంవత్సరాల సన్యాసాశ్రమంలోనే తమ అపారమైన విజయాలను పూర్తిచేసి, క్రీ.శ.1388లో ఆషాఢ కృష్ణ పంచమి నాడు బ ృందావన ప్రవేశం చేశారు. వారు శ్రీ మధ్వాచార్యులవారి సంస్థాన బాధ్యతను శ్రీ కృష్ణభట్టులవారికి అప్పగించి, వారికి శ్రీ విద్యాధిరాజతీర్థగా నామకరణం చేశారు.

శ్రీ జయతీర్థుల వారి అసలైన బ ృందావనం గురించి భిన్న వాదనలు ప్రచారంలో ఉన్నాయి. ఒక వర్గంవారు గుల్బర్గా సమీపంలోని మల్ఖేద్ లో వారు బృందావన ప్రవేశం చేశారంటారు. అందుబాటులో ఉన్న అత్యంత పురాతన ఆధారాన్ని, ఇటీవలి పరిశోధనలను అనుసరించి శ్రీ పద్మనాభ తీర్థులవారికి అభిముఖంగా ఆనెగొందేలో నవబృందావనంలో శ్రీ జయతీర్థులవారు బృందావన ప్రవేశం చేసారని మరో భావన కూడా ప్రచారంలో ఉంది. మరింతగా పరిశోధించి దీనిని రూఢిపరచవలసి ఉంది.

**గ్రంథాలు:** ద్వైత వేదాంతంలో శ్రీ మధ్వాచార్యుల తర్వాతి ప్రముఖ స్థానం శ్రీ జయతీర్థులవారిదే. శ్రీ టీకాకాచార్యుల వారి వ్యాఖ్యానం లేకుండా, శ్రీ మధ్వాచార్యులవారి ఏగ్రంథాన్నీ అవగతం చేసికోవటం అంత సులువుకాదు.

శ్రీ టీకాకాచార్యులవారు ఈ క్రింది గ్రంథాలను రచించారు

1. ఈశోపనిషట్టీక, 2. షట్ప్రశ్నోపనిషట్టీక, 3. బ్రహ్మసూత్రభాష్యటీక (తత్త్వప్రకాశిక), 4. అనువ్యాఖ్యానటీక (న్యాయసుధ), 5. న్యాయవివరణపంచిక, 6. గీతాభాష్యటీక (ప్రమేయదీపిక), 7. న్యాయదీపిక (గీతాతాత్పర్యటీక), 8. ప్రమాణలక్షణటీక, 9. కథాలక్షణటీక, 10. ఉపాధిఖండనటీక, 11. మాయావధఖండనటీక, 12. ప్రపంచమిథ్యాత్వనుమానఖండనటీక, 13. తత్త్వసాంఖ్యానవివరణ, 14. తత్త్వవివేకవివరణ, 15. తత్త్వోద్యోతవివరణ, 16. కర్మనిర్ణయటీక, 17. విష్ణుతత్త్వనిర్ణయటీక, 18. ఋగ్భాష్యటీక

స్వతంత్ర రచనలు

1. ప్రమాణపద్ధతి, 2. వదవలీ, 3. శతపరధ స్తోత్ర, 4. పద్యమాల

శ్లో॥ యస్య వాక్కామధేనుర్నః కామితార్థాన్ ప్రయచ్ఛతి ।
సేవే తం జయయోగీంద్రం కామబాణచ్ఛిదం సదా ॥



# కాల భైరవ అష్టోత్తరశతం

**ఓం నమో భగవతే కాలభైరవాయ**

ఓం భైరవాయ నమః
ఓం భూతనాథాయ నమః
ఓం భూతాత్మనే నమః
ఓం భూతభావనాయ నమః
ఓం క్షేత్రజ్ఞాయ నమః
ఓం క్షేత్రపాలాయ నమః
ఓం క్షేత్రదాయ నమః
ఓం క్షత్రియాయ నమః
ఓం విరజసే నమః
ఓం శ్మశానవాసినే నమః
ఓం మాంసాశినే నమః
ఓం ఖర్వరాశినే నమః
ఓం స్మరాంతకాయ నమః
ఓం రక్తపాయ నమః
ఓం ప్రాణపాయ నమః
ఓం సిద్ధాయ నమః
ఓం సిద్ధిదాయ నమః
ఓం సిద్ధిసేవితాయ నమః
ఓం కంకాలాయ నమః
ఓం కాలశమనాయ నమః
ఓం కలాకాష్ఠాయ నమః
ఓం తనవే నమః
ఓం కవయే నమః
ఓం త్రినేత్రాయ నమః
ఓం బహునేత్రాయ నమః
ఓం పింగళలోచనాయ నమః
ఓం శూలపాణయే నమః
ఓం ఖడ్గపాణయే నమః
ఓం కపాలినే నమః
ఓం ధూమ్రలోచనాయ నమః
ఓం అభిగమ్యాయ నమః



ఓం భైరవీనాథాయ నమః
ఓం భూతపాయ నమః
ఓం యోగినీపతయే నమః
ఓం ధనదాయ నమః
ఓం ధనహారిణే నమః
ఓం ధనధాత్రే నమః
ఓం ప్రీతివర్ధనాయ నమః
ఓం నాగాహారాయ నమః
ఓం నాగాపాశాయ నమః
ఓం వ్యోమకేశాయ నమః
ఓం కపాలభృతే నమః
ఓం కాలాయ నమః
ఓం కపాలమాలినే నమః
ఓం కమనీయాయ నమః
ఓం కలానిధయే నమః
ఓం త్రిలోచనాయ నమః
ఓం జ్వలన్నేత్రాయ నమః
ఓం త్రిశిఖినే నమః
ఓం త్రిలోకపాయ నమః
ఓం త్రినేత్రతనయాయ నమః
ఓం డింభాయ నమః
ఓం శాంతాయ నమః
ఓం శాంతజనప్రియాయ నమః
ఓం బటుకాయ నమః
ఓం బటుకేశాయ నమః
ఓం ఖట్వాంగధారకాయ నమః
ఓం ధనాధ్యక్షాయ నమః
ఓం పశుపతయే నమః
ఓం భిక్షుకాయ నమః
ఓం పరిచారకాయ నమః
ఓం ధూర్తాయ నమః

ఓం దిగంబరాయ నమః
ఓం శూరాయ నమః
ఓం హారిణే నమః
ఓం పాండులోచనాయ నమః
ఓం ప్రశాంతాయ నమః
ఓం శాంతిదాయ నమః
ఓం సిద్ధాయ నమః
ఓం శంకరప్రియబాంధవాయ నమః
ఓం అష్టభూతయే నమః
ఓం నిధీశాయ నమః
ఓం జ్ఞానచక్షుషే నమః
ఓం తపోమయాయ నమః
ఓం అష్టాధారాయ నమః
ఓం షడాధారాయ నమః
ఓం సర్పయుక్తాయ నమః
ఓం శిఖిసఖాయ నమః
ఓం భూధరాయ నమః
ఓం భూధరాధీశాయ నమః
ఓం భూపతయే నమః
ఓం భూధరాత్మజాయ నమః
ఓం కంకాలధారిణే నమః
ఓం ముణ్డినే నమః
ఓం నాగయజ్ఞోపవీతినే నమః
ఓం జృమ్భణాయ నమః
ఓం మోహనాయ నమః
ఓం స్తంభినే నమః
ఓం మరణాయ నమః
ఓం క్షోభణాయ నమః
ఓం శుద్ధనీలాంజనప్రఖ్యాయ నమః
ఓం దైత్యఘ్నాయ నమః
ఓం ముణ్డభూషితాయ నమః
ఓం బలిభుజే నమః
ఓం బలిభుగ్నాధాయ నమః
ఓం బాలాయ నమః

ఓం బలపరాక్రమాయ నమః
ఓం సర్వాపత్తారణాయ నమః
ఓం దుర్గాయ నమః
ఓం దుష్టభూతనిషేవితాయ నమః
ఓం కామినే నమః
ఓం కలానిధయే నమః
ఓం కాంతాయ నమః
ఓం కామినీవశకృదుద్వాసినే
నమః
ఓం సర్వసిద్ధిప్రదాయ నమః
ఓం విద్యాయ నమః
ఓం ప్రభవే నమః
ఓం విష్ణవే నమః







శ్రీమయూరమహాకవివిరచితః

# సూర్యదణ్డకః

## బాలానన్దినీవ్యాఖ్యా

– ఆచార్య పుల్లెల శ్రీరామచంద్రుడు

**మూలమ్ : తముదయసమయం తవాగ్రేసరానూరు – పర్యస్త – భూయస్తమో – మణ్డలమ్, తత్సముత్థాన – మబ్ధే స్సముత్థానహేతుం – వినిద్రాణ – తత్ప్రాణినామ్, తన్నవాఖణ్డలాశావధూ – కుణ్డలం – నిర్మలం – దుర్నిరీక్షప్రభామణ్డలమ్, కించ తానంశుదణ్డాన్ ప్రచణ్డాన్, సమాలీఢ – విధృణ్డ – భాణ్డాంస్తదచ్ఛిన్న – నేమిప్రచార – భ్రమత్ – కాలచక్రం చ చక్రం రథైకాశ్రయమ్, తత్త్రివేదీవివృత్తం భవద్గాత్ర – ముద్దీప్తకార్తస్వరమ్, తం తవోష్మాణమూష్మాయమాణ – త్వదీయోపలప్రజ్వల – జ్వాలమాలాజటాలాద్రి – జాలాన్తరమ్, తచ్చ తారావలీ – చారు – హారావలీ – బన్ధురం తే భుజాభ్యన్తరమ్, తౌ చ సామ్భోరుహౌ తే నవామ్భోజ – సౌభాగ్యచోరౌ కరౌ, తత్ప్రసాదోన్ముఖం తావకీనం ముఖమ్, తే చ కారుణ్యాసారస్పృశౌ త్వద్దృశౌ, తదవ్ర – త్రాసవిత్రాణ – కృత్యా – విహస్తం చ హస్తద్వయం తావకమ్, తచ్చ తే దివ్యమాణిక్యకేయూరబద్ధం మృదుస్నిగ్ధముగ్ధం భుజామణ్డలమ్, తచ్చ వైకుణ్ఠశఙ్ఖప్రభాకుణ్ఠనోత్కణ్ఠి తే కణ్ఠనాలం త్రిరేఖమ్, తమప్యన్త – రుద్దీర్ణ – మన్దస్మిత – శ్రీ – సుధాసారపూరం త్వదీయాధరమ్, తం సకర్పూర – సౌరభ్య – తామ్బూల – గర్భం కపోలమ్, తత్సముద్గన్ధి మన్దారదామ్నా సమాసక్త – మాముక్త – ముక్తాకిరీటం చ చూడాపదమ్, తన్మణీ – కుణ్డల – శ్రీ – మహఃపుఞ్జకిఞ్జల్క వర్ణాభిరమ్యం చ కర్ణద్వయమ్, తాం చ తే నాసికామ్, తాం చ నాభిం గభీరాం శుభావర్త – సౌభాగ్య – శోభావతీమ్, తాం కటీం చ స్ఫుటీభూత – సౌవర్ణశాటీ – సమాటీ – సమాటీకనామ్, తత్త్రిలోకీధరం తావకీనోదరమ్, తత్త వైవాప్రతిద్వన్ద్వ – మూర్వోరపి ద్వన్ద్వమూర్జస్వలమ్, తచ్చ జానుద్వయం సర్వదృష్టిప్రియమ్, తత్త్వదీయం మనోభూ – నిషఙ్గానుషఙ్గాతి – శృఙ్గార – తుఙ్గాభిరూప్యం చ జఙ్ఘాయుగమ్, తన్నమత్సర్వ – గీర్వాణ – చూడామణీ – రాజినీరాజితం కిం చ తే పాదయోర్ద్వన్ద్వమాపాటలమ్, సర్వమేతజ్జగన్మఙ్గలం ధ్యాయతో మఙ్గలాకార! తే మఙ్గలాయాస్తు మే.**

**వ్యాఖ్యానము :** హే! మఙ్గలాకార! = మంగళప్రదమైన ఆకారము గలవాడా! అగ్రేసరానూరుపర్యస్త–భూయస్తమోమణ్డలమ్ = నీ ముందు వచ్చుచున్న అనూరువుచేత తొలగింపబడిన అధికమైన చీకట్ల సమస్త సముదాయం గల, తమ్ = ఆ , తవ = నీ యొక్క, ఉదయసమయమ్ = ఉదయసమయాన్ని, వినిద్రాణ = నిద్రపోతూన్న, తత్ప్రాణినామ్ = సముద్రములోని, ప్రాణుల, సముత్థానహేతుమ్ = లేవడానికి కారణమైన, తత్ = ఆ, అబ్ధేఃసముత్థానమ్ = నీవు సముద్రమునుండి పైకి లేచుటను, నవ = నూతనమైన, ఆఖణ్డలాశావధూకుణ్డలమ్ = తూర్పుదిక్కు అను స్త్రీకి కుండలమైన, నిర్మలమ్ = నిర్మలమైన, తత్ = ఆ, దుర్నిరీక్షప్రభామణ్డలమ్ = చూడ శక్యం కాని కాంతిగల మండలమును, కిం చ = మరియు, సమాలీఢ = నాకివేయబడిన, విధృణ్డభాణ్డాన్ = బ్రహ్మాండ మనే భాండం గల, ప్రచణ్డాన్ = తీవ్రమైన, తాన్ అంశుదణ్డాన్ = కిరణములనే దండాలను,

అచ్ఛిన్న = అవిచ్ఛిన్నంగా, నేమిప్రసార = రథాంతముయొక్క కదలికచేత, భ్రమత్ కాలచక్రమ్

= తిరుగుతూన్న కాలచక్రమైన, (కాలవిభాగానికి సూర్యరథగమనమే హేతువు గాన, రథచక్రమే కాలచక్రం అని వర్ణింపబడింది). రథైకాశ్రయమ్ = రథానికి ఒకే ఒక ఆధారమైన, (సూర్యరథం ఒక్క చక్రంమీదనే నడుస్తుంది అని శ్రుతి), చక్రమ్ = చక్రమును, త్రివేదీవివృత్తమ్ = వేదత్రయంగా పరిణమించిన, ఉద్దీప్తకార్తస్వరమ్ = ప్రకాశిస్తూన్న బంగారమైన – బంగారంవలె ఉన్న, తత్ భవద్గాత్రమ్ = ఆ నీ శరీరమును, ఊష్మాయమాణ = వేడెక్కిన, త్వదీయోపల = నీ రత్నాలమీద, సూర్యకాంతమణుల మీద, ప్రజ్వలత్ = జ్వలించుచున్న, జ్వాలమాలా జటాల = అగ్నిజ్వాలల పంక్తులు అల్లుకుపోయిన, అద్రిజాలాన్తరమ్ = పర్వత సముదాయాల మధ్యభాగము గల, తమ్ = ఆ, తవ ఊష్మాణమ్ = నీ వేడిని, తారావలీ = నక్షత్రపంక్తు లనే, చారుహారావలీ = అందమైన హారాల పంక్తుల చేత, బన్ధురమ్ = సుందరమైన, తత్ = ఆ, తే భుజాభ్యన్తరమ్ = వక్షఃస్థలమును, నవామ్భోజసౌభాగ్యచోరౌ = క్రొత్త పద్మముల సౌందర్యాన్ని అపహరించు, సామ్భోరుహౌ = పద్మాలతో కూడిన, తే = నీయొక్క, తౌ కరౌ = ఆ రెండు హస్తములను,

ప్రసాదోన్ముఖమ్ = అనుగ్రహించడానికి ఉన్ముఖమైన, సిద్ధం అవుతూన్న, తావకీనమ్ = నీకు చెందిన, తత్ ముఖమ్ = ఆ ముఖమును, కారుణ్యసారస్పృశౌ = అనంతమైన కారుణ్యంతో నిండిన, తే = ఆ, త్వద్దృశౌ = నీ రెండు నేత్రాలను, వర = వరాలు ఇవ్వడము, త్రాసవిత్రాణ = భయాలనుండి రక్షించడము అను, కృత్యా = పనిచేత, విహస్త = వ్యాపృతమైన, ఆ పనులలో ఉన్న, అనగా వరాభయముద్రలు ధరించిన, తత్ = ఆ, తావకం హస్తద్వయమ్ = నీ హస్త ద్వయమును, దివ్యమాణిక్యకేయూరబద్ధమ్ = దివ్యములైన మాణిక్యములు పొదిగిన బాహుపురులతో బంధింపబడిన, బాహుపురులు ధరించిన, మృదుస్నిగ్ధముగ్ధమ్ = మృదువుగాను, నున్నగాను, సుందరముగాను ఉన్న, తత్ = ఆ, తే భుజామణ్డలమ్ = నీ భుజమండలము, వైకుణ్ఠ = విష్ణువుయొక్క, శఙ్ఖ = శంఖముయొక్క, దివ్యప్రభా = దివ్యమైన కాంతిని (సౌందర్యాన్ని), కుణ్ఠన = వ్యర్థంచేయడానికి, ఉత్కణ్ఠి = వేడుక గల, త్రిరేఖమ్ = మూడు రేఖలు గల, తే = నీయొక్క, తత్ కణ్ఠనాలం చ = కంఠమును,

అన్తరుద్గీర్ణ = లోపలినుంచి బైటకు వెడలుచున్న, మన్దస్మిత = చిరునవ్వుయొక్క, శ్రీ = శోభ అను, సుధా = అమృతముయొక్క, ఆసార = ధారావర్షముచేత ఏర్పడిన, పూరమ్ = (అమృత) ప్రవాహము గల, తమ్ = ఆ, త్వదీయాధరమ్ = నీ అధరోష్ఠమును, సకర్పూరసౌరభ = కర్పూరసుగంధముతో కూడిన, తామ్బూలగర్భమ్ = తాంబూలము గర్భమునందు (మధ్యభాగమునందు) గల ,తం కపోలమ్ = ఆ గండస్థలమును, సముద్గన్ధి = వ్యాపించుచున్న సుగంధము గల, మన్దారదామ్నా = మందారపుష్పములతో, సమాసక్తమ్ = కూడినదీ, ఆముక్తముక్తాకిరీటమ్ = ధరింపబడిన ముత్యాల కిరీటం గల, తత్ చూడాపదమ్ = ఆ శిరస్సును, మణీకుణ్డలశ్రీ = మణికుండలాల శోభకు సంబంధించిన,మహఃపుఞ్జ = కాంతిసముదాయ మను, కిఞ్జల్కవర్ణాభిరమ్యమ్ = కింజల్కముల రంగులతో సుందరమైన, తత్ కర్ణద్వయం చ = ఆ రెండు చెవులను,

తామ్ = ఆ, తే నాసికాం చ = నీ నాసికను, శుభావర్తసౌభాగ్యశోభావతీమ్ = అందమైన నీటి సుడివంటి సౌందర్యము, శోభా గల, గభీరామ్ = లోతైన, తాం నాభిం చ = ఆ నాభిని, స్ఫుటీభూత = స్పష్టంగా కనబడుతూన్న, సౌవర్ణశాటీ = బంగారు వస్త్రముయొక్క, సమాటీకనామ్ = చలనము గల, తాం కటీం చ = ఆ కటిప్రదేశమును, త్రిలోకీధరమ్ = మూడు లోకాలను ధరించు, తత్ = ఆ, తావకీనోదరమ్ = నీ ఉదరమును, ఊర్జస్వలమ్ = బలము గలది, అప్రతిద్వన్ద్వమ్ = సాటి లేనిదీ అయిన, తత్ = ఆ, తవైవ = నీ యొక్క, ఊర్వోః ద్వంద్వమపి = ఊరువుల ద్వంద్వమును,

సర్వదృష్టిప్రియమ్ = అందరి దృష్టులకు ప్రియమైన, తత్ జానుద్వయం చ = ఆ మోకాళ్ల ద్వయమును, మనోభూ = మన్మథునియొక్క, నిషఙ్గ = అంబులపొదుల, అనుషఙ్గ = సాదృశ్యముతో, అతిశృఙ్గార = చాల సుందరమైన, తుఙ్గ = ఎత్తైన, అధికమైన, ఆభిరూప్యమ్ = రూపసంపద గల, జఙ్ఘాయుగమ్ = పిక్కల ద్వయమును, కించ = మరియు, నమత్ = నమస్కరిస్తూన్న, సర్వగీర్వాణ = సమస్తదేవతల, చూడామణీరాజి = శిరస్సులపై ఉన్న మణుల పంక్తులచేత, నీరాజితమ్ = నీరాజనం ఇవ్వబడిన, ఆపాటలమ్ = ఎఱ్ఱగా నున్న, తత్ = ఆ, పాదయోః ద్వన్ద్వమ్ = పాదాల ద్వంద్వమును, జగన్మఙ్గలమ్ = జగత్తుకు మంగళములను కూర్చు, తే = నీయొక్క, ఏతత్ సర్వమ్ = దీని నంతను, ధ్యాయతః = ధ్యానించుచున్న, మే = నాకు, మఙ్గలాయ అస్తు = మంగళమును చేయుగాక.

**మూలమ్ : త్వం విరిఞ్చాత్మనాసి ప్రపఞ్చాదికర్తా; త్వయా రక్ష్యతే విశ్వమబ్జాక్షమూర్త్యా; త్వమేవేశ్వరీభూయ విశ్వం నిగృహ్ణాసి చాహ్నాంపతే! త్వయ్యతో యుక్తమాస్తే గుణానాం త్రయీ త్వం మహేన్ద్రో భవన్ వీతతన్ద్రోఽసి సౌవర్గభోగాశ్రయే త్వం జగల్లోచనానన్దస – న్ధాయకో భాసి చన్ద్రాత్మనైవ, త్వమగ్న్యాహితైర్నిత్యమగ్న్యాకృతిః సద్భిరత్యూహ్యసే, త్వం కృతాన్తాత్మనా జీవితాన్తాయ సంనహ్యసే ప్రాణినామ్, త్వం ప్రచేతా భవన్నమ్బునేతాసి చ; త్వామలీకాక్షమిత్రం ధనాధ్యక్షరూపం సమాచక్షతే; త్వం జగత్ప్రాణసి ప్రాణభూతోఽఙ్గినామ్; త్వం హి నాసత్యమూర్త్యా గదాత్యాహితం లుమ్పసి, త్వం భవన్ గీష్పతిర్జమ్భభిత్పూర్వసర్వామరైః సేవ్యదివ్యానుభావోఽస్యసౌ; భార్గవోఽసి త్వమేవాసి భీమోఽ సతామ్; భౌమరూపస్త్వదాత్మా; తవైవాత్మజః సౌరిరాస్తే, సమస్తేష్వ భివ్యఞ్జిత – స్వప్రచారస్త్వయా సౌమ్యరూపేణ సౌమ్యత్వమాసాద్యతే, త్వద్విచేష్టామయీ రాహుకేతుద్వయీ; త్వద్రుచాం శీకరా వ్యోమ్ని తారోత్కరాః, త్వత్కృతా శామ్బరీ ధ్వాన్తపారమ్పరీ; త్వచ్ఛరీరాన్తరం తచ్చ రోదోన్తరమ్; త్వన్మహిమ్నా జగజ్జీవనం జీవనమ్; త్వద్విశాలాగమే తద్దిశాణ్డలమ్, త్వత్ప్రణీతా నభస్యప్రమేయాత్మతా; త్వత్క్షమామూర్తిరేవ క్షమాలక్ష్యతే; తే హి గామ్భీర్యసృష్టోఽయమమ్భోనిధిః, త్వత్సముచ్ఛ్రాయ ఏవాచలోచ్ఛ్రాయతా, తన్మనోవిక్రియా త్వత్సముత్పాదితా.**

**వ్యాఖ్యానము :** విరిఞ్చాత్మనా = బ్రహ్మస్వరూపంతో ఉన్న, త్వమ్ = నీవు, ప్రపఞ్చాదికర్తా అసి = ప్రపంచానికి మూలకర్తవు అయి ఉన్నావు. అబ్జాక్షమూర్త్యా = విష్ణుస్వరూపంతో ఉన్న, త్వయా = నీచేత, విశ్వమ్ = ప్రపంచము, రక్ష్యతే = రక్షింపబడుచున్నది. త్వమేవ = నీవే, ఈశ్వరీభూయ = ఈశ్వరుడుగా అయి, విశ్వమ్ = ప్రపంచమును, నిగృహ్ణాసి = నిగ్రహించుచున్నావు. అహ్నాం పతే = పగళ్లకు పతియైన ఓ ఆదిత్యా! అతః = అందువల్ల, గుణానాం త్రయీ = రజః–సత్త్వ–తమోగుణముల త్రయము. త్వయి = నీయందు, ఆస్తే = ఉన్నది, యుక్తమ్ = ఇది యుక్తమే. త్వమ్ = నీవు, మహేన్ద్రః భవన్ = మహేంద్రుడవగుచు, సౌవర్గభోగాశ్రయే = స్వర్గానికి సంబంధించిన భోగాలను అనుభవించడంలో, వీతతన్ద్రః = అలసత్వం లేనివాడవుగా, అసి = అయి ఉన్నావు. త్వమేవ = నీవే, చన్ద్రాత్మనా = చంద్రరూపంతో, జగల్లోచనానన్ద సంధాయకః = జగత్తుయొక్క నేత్రాలకు ఆనందం కూర్చువాడవై, భాసి = ప్రకాశిస్తున్నావు. అగ్న్యాకృతిః = అగ్నిస్వరూపంలో ఉన్న, త్వమ్ = నీవు, అగ్న్యాహితైః = ఆహితాగ్నులైన, సద్భిః = సత్పురుషులచేత, నిత్యమ్ = ఎల్లప్పుడు, అభ్యూహ్యసే = ధ్యానించబడుచున్నావు; ఉపాసించబడుచున్నావు.

త్వమ్ = నీవు, కృతాన్తాత్మనా = యముని స్వరూపంతో, ప్రాణినామ్ = ప్రాణుల, జీవితాన్తాయ = జీవితములను అంతమొందించుటకు, సంనహ్యసే = ఉద్యమించుచున్నావు. త్వమ్ = నీవు, ప్రచేతాః భవన్ = వరుణుడుగా ఉంటూ, అమ్బునేతా అసి = ఉదకముల, నదీసముద్రాదుల, నాయకుడుగా

అవుతున్నావు. త్వామ్ = నిన్ను, అలీకాక్షమిత్రమ్ = నిటలాక్షుడైన శివుని మిత్రుడైన, ధనాధ్యక్షరూపమ్ = కుబేర స్వరూపునిగా, సమాచక్షతే = చెప్పుదురు. త్వమ్ = నీవు, అఙ్గినామ్ = శరీరధారుల, ప్రాణభూతః = ప్రాణమై, జగత్ప్రాణసి = జగత్తుకు ప్రాణమైన వాయుస్వరూపుడవై ఉన్నావు. త్వం హి = నీవే, నాసత్యమూర్త్యా = అశ్వినీదేవతల మూర్తితో ఉండి, గదాత్యాహితమ్ = రోగాలవల్ల కలిగే ఆపదను, లుమ్పసి = త్రుంచి వేయుచున్నావు. త్వమ్ = నీవు, గీష్పతిఃభవన్ = బృహస్పతివి అయి, జమ్భభిత్పూర్వసర్వామరైః = ఇంద్రుడు మొదలైన సమస్తదేవతలచేత, సేవ్యదివ్యానుభావః = సేవింపదగిన దివ్యమైన ప్రభావము కలవాడవు, అసి = అయి ఉన్నావు. నీవే, అసౌ భార్గవః = ఈ శుక్రుడవు, అసి = అయి ఉన్నావు. త్వమేవ = నీవే, అసతామ్ = చెడ్డవారికి, భీమః = భయం కరుడైన, భౌమరూపః = కుజస్వరూపుడవు, అసి = అయిఉన్నావు. తవైవ ఆత్మజః = నీకుమారుడే అయిన, సౌరిః = శనీశ్వరుడు, త్వదాత్మా = నీ స్వరూపం గలవాడై, సమస్తేషు = దేవమనుష్యాదిసకలప్రాణులయందు, అభివ్యఞ్జితస్వప్రచారః = చూపబడిన తన ప్రభావముయొక్క ప్రసారం కలవాడై, ఆస్తే = ఉన్నాడు. శనైశ్చరుని ప్రభావానికి లొంగనివాడు ముల్లోకాలలోను లేడు అని భావం. సౌమ్యరూపేణ = బుధరూపుడవైన, త్వయా = నీచేత, సౌమ్యత్వమ్ = సౌమ్యత్వము, ఆసాద్యతే = పొందబడుచున్నది.

రాహుకేతుద్వయీ = రాహుకేతువు లిద్దరూ, త్వద్విచేష్టమయీ = నీ చేష్టల ఫలం అయినవారు. మోహిని అమృతం వడ్డిస్తూన్నప్పుడు దేవతారూపంలో అమృతం తీసికొని త్రాగుతూన్న అసురుణ్ణి నీవే చూపగా రాహు–కేతువుల ఆవిర్భావం జరిగింది గాన వాళ్ల ఆవిర్భావానికి నువ్వే కారణ మని అర్థం. ఈ విధంగా సూర్యుడే సకల గ్రహస్వరూపుడు; సూర్యారాధనం సకలగ్రహానుగ్రహ హేతువు అని చెప్పినట్లయింది. వ్యోమ్ని = ఆకాశమునందు, తారోత్కరాః = నక్షత్రసముదాయములు, త్వద్రుచామ్ = నీ కాంతుల, ఉత్కరాః = తుంపరలే. ధ్వాన్తపారమ్పరీ = అంధకారాల పరంపర, త్వత్కృతా = నీ చేత చేయబడిన, శామ్బరీ = మాయయే, తత్ = ఆ, రోదోన్తరమ్ = భూమ్యాకాశాల మధ్యభాగం, త్వచ్ఛరీరాన్తరమ్ = నీ మరొక శరీరమే. జగజ్జీవనమ్ = జగత్తును జీవింపచేసే, జీవనమ్ = ఉదకము, త్వన్మహిమ్నా = నీ మహిమచేతనే పుట్టుచున్నది. త్వద్విశాలాగమే = నీయొక్క విశాలమైన ఆగమనము నందే, తత్ = ఆ, దిశామణ్డలమ్ = దిక్కుల మండలము తెలియుచున్నది. నీవు అతి విస్తృతమైన ఆకాశంమీద సంచరిస్తూన్నప్పుడు మాత్రమే ఇంత విశాలమైన దిఙ్మండలం ఉన్న దను విషయం తెలుస్తూన్నది అని భావం. నభసి = ఆకాశమునందు, అప్రమేయాత్మతా = ఇంత అని కొలవడానికి శక్యం కాకపోవడం, త్వత్ప్రణీతా = నీ చేతనే చేయబడినది.

క్షమా = భూమి, త్వత్క్షమామూర్తిరేవ = నీ ఓర్పుయొక్క మూర్తిగా, లక్ష్యతే = కనబడుచున్నది. అయమ్ అమ్భోనిధిః = ఈ సముద్రం, తే = నీయొక్క, గామ్భీర్యసృష్టః హి = గాంభీర్యంచేతనే సృష్టింపబడినది కదా. అచలోచ్ఛ్రాయతా = పర్వతాల ఉన్నతత్వము, త్వత్సముచ్ఛ్రాయ ఏవ = నీలోని ఔన్నత్యమే. తన్మనోవిక్రియా = ప్రాణుల మనోవికారం, త్వత్సముత్పాదితా = నీచేతనే పుట్టించబడింది. నీ ప్రభావంవల్లనే ప్రాణులలో వేరు వేరు ఆలోచనలు పుడుతూంటాయి అని అర్థం.

**మూలమ్ : పాదపా వీరుధస్త్వన్మనోనిర్మితాః, నిర్మలాః సిన్ధవస్త్వత్ప్రభూతా ఇమే తోయదాః, త్వద్రుచాం విప్రుషో, విద్యుతాం చ త్విషః; త్వద్దయాస్థాపితాః స్థావరా జఙ్గమా స్త్వద్వచోనర్తనం తద్వచః ప్రాక్తనమ్; త్వత్ప్రతిష్ఠాపితాస్తే వసిష్ఠాదయః ; త్వం తపస్యాఫలమ్ త్వం తపశ్చాతులమ్; త్వం ప్రవృత్తోఽసి కర్మన్దినాంమన్దిరే; త్వద్గిరామేవ లీలాః కలాః పుష్కలాః; త్వన్మనీషాకణః సన్మనీషాగుణః. త్వత్కరోపక్రమం**

**దానవిద్యా క్రమః; త్వం సవిత్రీయసే శైలపుత్రీమయః; త్వత్ప్రబోధోదయశ్చాపరోధోదయశ్చాపరోధో విధస్త్వం మహైశ్వర్యభుక్ దుగ్ధవారాశిభుక్; త్వత్కటాక్షాహితాః కల్పవక్షా మతాః. సర్వమేతత్త్వదాయత్తమాస్తే జగత్; త్వత్ప్రభావస్తుతావస్తు శక్తస్తు కస్త్వత్ప్రశంసోన్ముఖీ త్వామసంప్రాప్య సంప్రాప్య లజ్జాం పునర్జాడ్యవత్యేవ వాణీ పురాణీ పరావర్తతే.**

**తాదృశార్థే చ వాగస్ఫుటార్థేయమర్థేన హీనాప్యనర్థైకరోధాయ మే మన్మఖోత్థే దృశం తే స్తవారమ్భదమ్భం సమాలమ్బతే; తత్సహస్వాపరాధం, వచస్స్వాశ్రితం మే దదస్వాఖిలమ్; మయ్యయస్వాదరమ్, మే దదస్వాధికం స్వాపతేయమ్, రమస్వాశయే, రఞ్జయస్వాశయమ్, భక్తినిస్స్వాయ మహ్యం దిశస్వాతిభక్తిమ్; యతస్వావితుం మాం నిశాస్వాపకృన్నీరజస్వాపలోపక్షమ! స్వాపదానైః ప్రథస్వాగతం స్వాన్తమాకల్పయ స్వాపయ స్వాదరమ్, ద్రావయ స్వాపదః స్వానభస్వానివ స్వానకమ్, ప్రీణయస్వాధునా మాం వివస్వన్! గ్రహస్వామినే దేవ తుభ్యం నమః ॥**

**వ్యాఖ్యానము :** పాదపాః = చెట్లూ, వీరుధః = మొక్కలూ, లతాగుల్మాదులూ కూడ, త్వన్మనోనిర్మితాః = నీ మనస్సుచేత (సంకల్పంచేత) నిర్మింపబడినవి. ఇమే = ఈ, నిర్మలాః సిన్ధవః = పరిశుద్ధమైన నదులు, తోయదాః = మేఘములూ కూడ, త్వత్ప్రభూతాః = నీనుండి పుట్టినవి. విద్యుతామ్ = మెఱుపుల, త్విషశ్చ = కాంతులు కూడ, త్వద్రుచామ్ = నీకాంతుల, విప్రుషః = తుంపరలు. స్థావరాః = స్థావరములైన వృక్షపర్వతాదులు, జఙ్గమాః = పశుమనుష్యాదిజంగమప్రాణులు, త్వద్దయాస్థాపితాః = నీ దయచేతనే నిలుపబడినవి. చరాచరాత్మకజగత్తు ఈ విధంగా ఉండడానికి నీ దయయే కారణ మని అర్థం. ప్రాక్తనమ్ = అతిపురాతనమైన, తత్ వచః = ఆ వేద వాఙ్మయము, త్వద్వచోనర్తనమ్ = నీ మాటల నర్తనమే. తే వసిష్ఠాదయః = ఆ వసిష్ఠాదిమునులు, త్వత్ప్రతిష్ఠాపితాః = నీచేతనే ఆ యా స్థానాలలో స్థాపింపబడ్డారు.

త్వమ్ = నీవే, తపస్యాఫలమ్ = తపస్సుల ఫలము. అతులమ్ = సాటిలేని, తపశ్చ = తపస్సు కూడ, త్వమ్ = నీవే. కర్మన్దినామ్ = కర్మాచరణం చేసే కర్మఠుల, మన్దిరే = గృహములలో (జాత్యేకవచనం), త్వమ్ = నీవే, ప్రవృత్తః అసి = కర్మాచరణము నందు ప్రవర్తించుచున్నావు. కర్మఠులచేత ఆ యా యజ్ఞయాగాదికర్మలు చేయించే వాడవు నువ్వే అని అర్థం. పుష్కలాః = పరిపూర్ణములైన, కలాః = సంగీతాదికళలు, త్వద్గిరామ్ = నీ వాక్కుల, లీలాః ఏవ = లీలలు మాత్రమే. సన్మనీషాగుణః = సత్పురుషులలో ఉన్న ఉత్తమమైన బుద్ధి అనే గుణం, త్వన్మనీషాకణః = నీ బుద్ధిలోని ఒక కణం మాత్రమే. దానవిద్యాక్రమః = దానం చేయడం అనే విద్యయొక్క క్రమం త్వత్కరోపక్రమమ్ = నీ కరములే ఉపక్రమం గలది; నీకరాలతోనే ప్రారంభమైనది. శైలపుత్రీమయః = పార్వతీస్వరూపుడ వైన, త్వమ్ = నీవు, సవిత్రీయసే = సకల జగత్తుకు జననివి అవుతున్నావు.

త్వత్ప్రబోధోదయః = (నీ భక్తులలో) నీవల్ల కలుగు జ్ఞానోదయము. అపరోధోదయః =అడ్డు లేని ఉదయం గలది. నీ అనుగ్రహం వల్ల నీ భక్తులకు కలిగే జ్ఞానోదయానికి ఏ అడ్డూ ఉండ దని అర్థం. అపరోధః = తన కార్యాలలో ఏ ఆటంకములు ఎరుగని, విధిః = బ్రహ్మదేవుడు, మహైశ్వర్యభుక్ = గొప్ప ఐశ్వర్యమును అనుభవించు మహేశ్వరుడు, దుగ్ధవారాశిభుక్ = క్షీరసముద్రాన్ని అనుభవిస్తూన్న, క్షీరసాగరశాయియైన మహావిష్ణువూ కూడ, త్వమ్ = నువ్వే, కల్పవృక్షాః = కల్పవృక్షములు, త్వత్కటాక్షాహితాః = నీ కటాక్షంచేతనే నిలపబడినవిగా, మతాః = చెప్పబడినవి. సర్వమ్ = సమస్తమైన, ఏతత్ జగత్ = ఈ జగత్తు, త్వదాయత్తమ్ = నీమీదనే ఆధారపడి, ఆస్తే = ఉన్నది. తు = కాని, త్వత్ప్రభావస్తుతౌ = నీ ప్రభావాన్ని స్తుతించడమునందు, కః = ఎవడు, శక్తః = సమర్థుడు, అస్తు = అవగలడు? పురాణీ వాణీ

= అతిపురాతన మైన వేదవాక్కు, త్వత్ప్రశంసోన్ముఖీ = నీ ప్రశంసయందు ఉన్ముఖమై, ప్రవర్తించి, త్వామ్ అసంప్రాప్య = నిన్ను పొందజాలక (తెలియజాలక), లజ్జాం సంప్రాప్య = సిగ్గుచెంది, పునః = మరల, జాడ్యవతీ ఏవ = జాడ్యం కలదై (ఏమీ తెలియని స్థితిలో పడి), పరావర్తతే = వెనుకకు తిరిగి వెళ్లిపోవుచున్నది.

తాదృశార్థే = వేదాలకు కూడ అందని అలాంటి నిన్ను స్తుతించడ మనే అర్థం విషయంలో, అనర్థైకరోధాయ = నా అనర్థాలను తొలగించుకొనడం అనే ఒకే ఒక ప్రయోజనాన్ని ఉద్దేశించి, మన్ముఖోత్థా = నా ముఖంనుండి బయల్వెడలిన, ఇయం వాక్ = ఈ వాక్కు, అస్ఫుటార్థా = స్ఫుటం కాని అర్థం కలదైనా, చెప్పదలచిన విషయాన్ని స్పష్టంగా చెప్పజాలక పోయినా, అర్థేన హీనాపి = మంచి అర్థంతో శూన్యమైనా, ఈదృశమ్ = ఈ విధమైన, తే స్తవారమ్భదమ్భమ్ = నీ స్తుతిని ప్రారంభించడం అనే దంభాన్ని, ఆత్మవంచనను, సమాలమ్బతే = అవలంబించు చున్నది. తత్ = అందువలన, వచస్సు = నా వాక్కులయందు, ఆశ్రితమ్ = ఉన్న, అపరాధమ్ = అపరాధమును, స్తుతికి అందనివానిని స్తుతించడానికి ప్రయత్నించడం అనే అపరాధాన్ని, సహస్వ = సహించుము, క్షమించుము. మే = నాకు, అఖిలమ్ = నేను కోరిన సమస్తమును, దదస్వ = ఇమ్ము. మయి = నా విషయంలో, ఆదరమ్ = ఆదరమును, అయస్వ = పొందుము, చూపుము. మే = నాకు, అధికమైన, స్వాపతేయమ్ = ధనమును, దదస్వ = ఇమ్ము. ఆశయే = నా మనస్సులో, రమస్వ = క్రీడించుము, ఆశయమ్ = నా హృదయమును, రఞ్జయస్వ = ఆనందింప జేయుము. భక్తి నిఃస్వాయ = భక్తిదరిద్రుడ నైన, భక్తిశూన్యుడనైన, మహ్యమ్ = నాకు, అతిభక్తిమ్ = అధికభక్తిని, దిశస్వ = ఇమ్ము, నిశాస్వాపకృన్నీరజ = రాత్రులందు నిద్రించు పద్మాల, స్వాపలోపక్షమ! = నిద్రను తొలగించుటకు సమర్థుడవైన ఆదిత్యా! మామ్ = నన్ను, అవితుమ్ = రక్షించుటకు, యతస్వ = ప్రయత్నం చేయుము. ప్రయత్నపూర్వకంగా నన్ను రక్షించుము. స్వాపదానైః = నీ ప్రశస్యములైన కర్మలచేత, ప్రథస్వ = ప్రసిద్ధుడవు అగుము. స్వాన్తమ్ = నా మనస్సును, ఆగతమ్ = నిన్ను చేరిన దానినిగా, ఆకల్పయ = చేయుము. ఆదరమును, ఆపయస్వ = పొందింపచేయుము. స్వాః = నాకు సంబంధించిన, ఆపదః = ఆపదలను, నభస్వాన్ = వాయువు, స్వానకమ్ ఇవ = పెద్దమేఘమునువలె, ద్రావయస్వ = దూరంగా ఎగురగొట్టుము. వివస్వన్! = ఓ వివస్వంతుడా! అధునా = వెంటనే, మామ్ = నన్ను ప్రీణయస్వ = ఆనందం కలవానినిగా చేయుము. దేవ = ఓ దేవా!, గ్రహస్వామినే = గ్రహాలకు ప్రభువైన, తే = నీకు, నమః = నమస్కారము.

**దినకర! తే క్షరన్మాక్షికం మన్త్రమష్టాక్షరం యే సమాచక్షతే తానసల్పాన్ స్వయంభూతజల్పాన్ అజల్పాకకత్వాన్న కల్పామహే జ్ఞాతు మజ్ఞా నిరజ్ఞాన- వైజ్ఞానిక - జ్ఞాత - భూయస్సమజ్ఞానిధే! మే హృది జ్ఞానవిజ్ఞాన మూఢాశయాజ్ఞాన భిజ్ఞాత! దేవాన్త రాజ్ఞాపి దూరే త్వదాజ్ఞావిధేయస్య, విజ్ఞాపనే మే రసజ్ఞా కృతా మాస్త్వవజ్ఞానవజ్ఞాత - వన్దారువిజ్ఞాపన! - జ్ఞాపనీయార్థమాజ్ఞాఽవివేకస్య వైజ్ఞానికం మాం విధాతుం ప్రతిజ్ఞా ప్రతిజ్ఞానిధే! తేఽస్తు, దివ్యం పరం వస్తు వేదే ధృతం మేఽస్తు; న త్వాం నమేద్యస్తు తం దుర్విధిశ్చాస్తు యే త్వాం హృది స్థాపయిత్వా చ నత్వాఽర్చయిత్వా చ దత్వా నివేద్యాని, మత్వాశయప్రీతిమత్వాయ చ త్వా మమత్వానుపేతాశ్చ నీత్వా తవ ధ్యాయకత్వాధికారం, పఠిత్వా మనుం తే, నటిత్వా ముదం తే విదిత్వా మహత్త్వానుబద్ధం గణం సంపదామప్యయిత్వాత్ర కృత్వా తపో దుశ్చరం, సంప్రహృష్యన్తి తేషాం విశుష్యన్త్యరం ఘోరసర్వాపదస్తేషు కశ్చిన్మహేన్ద్రస్సునిశ్చీయతే తేషు మేధాధిపః కోఽపి సంలక్ష్యతే తత్సమూహే శశాఙ్కం సమూహే స్థితమ్, తేషు గణ్యో హుతాశః సపుణ్యోదయ- స్తత్సభాసత్సు సత్స్వేక ఏవానిలస్తద్గతాశానువర్తీస పాశాయుధ- స్తన్నివేశాశ్రయస్సోఽపి నాగేశ్వరస్తత్పుర-**

**స్మారచుఞ్చుస్స వాచస్పతి – స్సర్వగీర్వాణ – తత్తత్పద – స్థూల – లక్షాయ సర్వేప్సితార్థార్పణే కల్పవృక్షాయ, సర్వాపరోక్షాయ, సర్వాన్తరీపప్రకాశైకదక్షాయ సర్వాపదుద్ధారణే బద్ధదీక్షాయ, సంరబ్ధ సంకృద్ధమన్దేహశిక్షాయ, తుభ్యం సమస్తాన్తరాత్మన్మమాత్మానమద్యార్పయే, ద్వాదశాత్మ – న్ననాత్మజ్ఞ – మాత్మజ్ఞ – రక్షాకరాద్వైవ రక్షాభివీక్షాభి – రుక్షాధిరూఢాలికాక్షాకృతే! వాసరాణాం పతే!**

**వ్యాఖ్యానము :–** దినకర = ఓ! సూర్యదేవా! క్షరన్మాక్షికమ్ = తేనెను స్రవించుచున్న, తే అష్టాక్షరం మన్త్రమ్ = నీ అష్టాక్షరమంత్రాన్ని, యే = ఎవరు, సమాచక్షతే = జపిస్తారో, అనల్పాన్ = మహాత్ములు, స్వయంభూతజల్పాన్ = స్వయంగా (అనాయాసంగా) ఆవిర్భవించిన వాగ్వైభవం గల, తాన్ = వారిని, అజల్పాకకత్వాత్ = (వారు) అధికంగా మాటలాడనివా రవడంవల్ల, అజ్ఞాః = అజ్ఞులమైన మేము, జ్ఞాతుమ్ = తెలిసికొనుటకు, న కల్పామహే = సమర్థులము కాము.

నిరజ్ఞాన = అజ్ఞానము తొలగిపోయిన,వైజ్ఞానిక = విశిష్టజ్ఞానవంతులచేత, జ్ఞాత = తెలియబడిన, భూయః సమజ్ఞానిధే = అధికమైన కీర్తికి నిధి యైనవాడా? జ్ఞాన = ఆత్మజ్ఞానమునందు, విజ్ఞాన = శిల్పాదిజ్ఞానమునందు, మూఢాశయ = మూఢమైన మనస్సగల, అజ్ఞ = మూఢులచేత, అనభిజ్ఞాత = గుర్తింపబడనివాడా! తవ = నీయొక్క, ఆజ్ఞావిధేయస్య = ఆజ్ఞకు విధేయుడ నైన, మే = నా యొక్క హృది = హృదయమునందు, దేవాన్తరాజ్ఞాపి = ఇతరదేవతల ఆజ్ఞ కూడ, దూరే = దూరము నందు ఉండును. ఇతరదేవతల ఆజ్ఞను నేను పాలించను అని అర్థం. విజ్ఞాపనే = నీకు విజ్ఞాపనం చేసికొనడమునందు (కొనుటకు) మే రసజ్ఞా = నా నాలుక, కృతా = ప్రవర్తింపచేయబడినది. హే! అనవజ్ఞాతవన్దారువిజ్ఞాపన! = నమస్కరించే స్వభావం గల భక్తుల విజ్ఞాపనమును తిరస్కరించనివాడా! అవజ్ఞా = నా విజ్ఞాపన విషయంలో అనాదరము, మాస్తు = నీకు లేకుండుగాక.

ప్రతిజ్ఞానిధే = ప్రతిజ్ఞకు నిధియైనవాడా! అవివేకస్య = వివేకశూన్యుడనైన యొక్క, జ్ఞాపనీయార్థమ్ = విజ్ఞాపన చేసికొనవలసినదానికొరకు, విజ్ఞాపనచేసి కొనుటకు, తే ఆజ్ఞా = నీ ఆజ్ఞ, మామ్ = నన్ను, వైజ్ఞానికమ్ = విజ్ఞానం కలవానినిగా, విధాతుమ్ = చేయుటకు ప్రతిజ్ఞా అస్తు = ప్రతిజ్ఞ అగుగాక. వేదే ధృతమ్ = వేదమునందు ధరింపబడిన (ప్రతిపాదింపబడిన), దివ్యం పరం వస్తు = దివ్యమైన పరవస్తువు, (త్వదభిన్నమైన) (నీకంటే వేరుగా లేని) పరమాత్మరూపమైన వస్తువు, మే = నాకు, అస్తు = అగుగాక; సాక్షాత్కరించుగాక.

యః తు = ఎవడు, త్వామ్ = నిన్ను, న నమత్ = నమస్కరించడో, తమ్ = వానిని గూర్చి, వానికి, దుర్విధిః = చెడ్డవిధి, అస్తు = అగుగాక; యే = ఏ నీ భక్తులు, త్వామ్ = నిన్ను, హృది స్థాపయిత్వా = హృదయములో నిలుపుకొని, నత్వా చ = నమస్కరించి, అర్చయిత్వా = పూజించి, నివేద్యాని చ = నివేదింపతగిన పదార్థాలను, దత్వా = ఇచ్చి, మమత్వానుపేతాః = మమకారం లేనివారై, ఆశయప్రీతి మత్యాయ = తమ మనఃప్రీతికొరకు, త్వా = నిన్ను, మత్వా = తలచి, తే మనుమ్ = నీ మంత్రమును, పఠిత్వా = పఠించి, (తమను), తవ ధ్యాయకత్వాధికారమ్ = నిన్ను ధ్యానం చేయడానికి తగిన అధికారమును (యోగ్యతను), నీత్వా = పొందించి, తే = నీయొక్క, ముదమ్ = సంతోషమును, అనుగ్రహమును, విదిత్వా = తెలిసికొని, నటిత్వా = నీవు అనుగ్రహించినందుకు ఆనందముతో నటించి, మహత్వానుబద్ధమ్ = మహత్వంతో కూడిన (అత్యధికమైన), సంపదామ్ = సంపదల, గణమ్ అపి = గణమును కూడ, అయిత్వా = పొంది, అత్ర = ఇహలోకంలో, దుశ్చరమ్ = ఇతరులెవరికీ చేయ శక్యం కాని, తపః = తపస్సు, కృత్వా = చేసి, సంప్రహృష్యన్తి = ఆనందిస్తారు. తేషామ్ = వాళ్లయొక్క,

ఘోరసర్వాపదః = ఘోరమైన ఆపదలు అన్నీ, అరమ్ = శీఘ్రంగా, విశుష్యన్తి = ఎండిపోవును. తేషు = అలాంటి నీ భక్తులలో, కశ్చిత్ = ఒకడు, సునిశ్చీయతే = నిశ్చయింపబడతాడు. తేషు = వారిలో, కోఽపి = ఒకడు, మేధాధిపః = శుక్రుడుగా, సంలక్ష్యతే = చూడబడతాడు. తత్సమూహే = వాళ్ల సముదాయంలో, ఒకనిని, శశాఙ్కమ్ = చంద్రుడుగా, స్థితమ్ = ఉన్నవానినిగా, సమూహే = ఊహింతును. సుపుణ్యోదయః = మంచి పుణ్యోదయం గల, హుతాశః = అగ్ని, తేషు గణ్యః = నీ భక్తులలో లెక్కపెట్టదగిన వాడు. సత్సు = సత్పురుషులైన, తత్సభాసత్సు = ఆ భక్తుల సభాసదులలో, అనిలః = వాయువు, ఏక ఏవ = ఒకడు. సః పాశాయుధః = ఆ వరుణుడు, తద్గతాశానువర్తీ = ఆ భక్తులు వెళ్లిన దిక్కును అనుసరించి వెళ్లేవా డవుతాడు. సః నాగేశ్వరః = ఆ ఆదిశేషుడు లేదా వాసుకి, తన్నిదేశాశ్రయః = వాళ్ల (భక్తుల) ఆదేశాలను పాలించేవాడేగా ఉంటాడు. సః వాచస్పతిః = ఆ బృహస్పతి, తత్పురస్కారచుఞ్చుః = వాళ్ల పురస్కారము చేత ప్రసిద్ధు డవుతాడు. వాళ్లను గౌరవిస్తాడు. నీ భక్తులకు మాత్రమే ఆ యా దేవతాస్థానాలు (అధికారాలు) లభిస్తాయి అని భావం.

సర్వగీర్వాణ = సమస్తదేవతలకు, తత్తత్పదస్థూలలక్షాయ = ఆ యా పదములు ఇచ్చేవాడవు, సర్వేప్సితార్థార్పణే = అందరికీ లేదా అన్ని కోరికలూ తీర్చుటలో, కల్పవృక్షాయ = కల్పవృక్ష మైనవాడవు, సర్వాపరోక్షాయ = అందరికీ ప్రత్యక్షంగా కనబడువాడవు, సర్వ = సమస్తమైన, అన్తరీప = ద్వీపముల, ప్రకాశ = ప్రకాశింప చేయడంలో, ఏకదక్షాయ = సమర్థుడైన ఒకే ఒక దేవుడవు, సర్వాపదుద్ధారణే = సకలభక్తులను లేదా సమస్తమైన, ఆపదలనుండి ఉద్ధరించడమునందు, బద్ధదీక్షాయ = దీక్ష వహించిన వాడవు, సంరబ్ధసంకృద్ధమన్దేహశిక్షాయ = కోపించిన మన్దేహు లను అసురుల శిక్షను చేసేవాడవు, మన్దేహాసురులను శిక్షించేవాడవు (మందేహాసురు లను అసురులు గుంపులు గుంపులుగా వచ్చి సూర్యోదయ సమయంలో సూర్యరథాన్ని అడ్డుకొంటారనీ, ఆ సమయంలో సూర్యుణ్ణి ఉద్దేశించి ద్విజులు పైకి చల్లిన అర్ఘ్యజలాంజలులు వజ్రాయుధములై వారిని సంహరిస్తాయని వేదంలో చెప్పబడింది) అయిన, తుభ్యమ్ = నీకు, సమస్తాన్తరాత్మన్! = అందరికీ అంతరాత్మయైన ఓ! ఆదిత్యా! అద్య = ఇప్పుడు, మమ ఆత్మానమ్ = నా ఆత్మను, నన్ను, అర్పయే = అర్పిస్తున్నాను, ద్వాదశాత్మన్! = పన్నెండు స్వరూపాలు గలవాడా! ఆత్మజ్ఞరక్షాకర! = నీ స్వరూపాన్ని తెలుసుకొన్నవారిని రక్షించేవాడా! ఉక్షాధిరూఢాలికాక్షాకృతే! = వృషభారూఢు డైన ఫాలనేత్రు డైన పరమేశ్వరుని ఆకారమైనవాడా! వాసరాణాం పతే! = దినాధిపతీ! అనాత్మజ్ఞమ్ = ఆత్మజ్ఞానం లేని నన్ను, అద్యైవ = ఇప్పుడే, అభివీక్షాభిః = నీ చూపులచేత, రక్ష = రక్షించుము.

**మూలమ్ :- దేవ! సాక్షాత్పరం బ్రహ్మ వీక్షామహే త్వాం పరోక్షామరేక్షా - విలమ్బ - ప్రయాస - ప్రతీక్షా చ యన్నైవ, తార్క్ష్యాధిరూఢామ్బుజాక్షాయసే చ, త్వమక్షేమ రాతేర్మమ క్షేమలాభాయ; హంసాధిరూఢం విధిం సావరోధం నినంసామి సంసారవిధ్వంస హేతో - ర్భవన్మణ్డలే యం యమిచ్ఛామ్యహం దేవమృచ్ఛామి పూర్త్యై మదిచ్ఛాసమం తత్తదాకారతః, కోకశోకాతిరేకాయనీకార! నిస్తన్ద్రశోకాపహర్తాసి, మే సౌఖ్యస్యకర్తాసి, లోకాధికర్తా, త్వమేకః పరః, కుత్ర శమ్భుః, క్వచామ్భోజనాభిః, క్వ చామ్భోజపీఠః, క్వ జమ్భాహితః, కుత్ర చామ్బుఃపతిః, కుత్ర వాన్యే సురా ఇత్యశేషామరాన్వేషణం నైవ కర్తుం క్షమే; సోఽహ మీక్షేఽ పరోక్షేఽత్ర తానేవ సర్వామరానద్య సర్వామరాకార! తే మణ్డలే; సర్వదేవాత్మనస్తే ప్రసాదేన సర్వాణ్యభీష్టాని సిధ్యన్తు మే. కిం బహూక్త్యా భవత్పాదభక్త్యా మహత్యా భవామ్యుత్సుకోఽహం తయా, భక్తిరేవాస్తు సా భక్తిరుద్వేల సంపత్తిదాత్రీ భవిత్రీ, మమారోగ్యకర్త్రీ తరిత్రీ చ దీర్ఘాయురున్మేషయిత్రీ, యశో దిక్షు దాత్రీ చ ధాత్రీవ మాం పాలయిత్రీ, ధరిత్రీం తవేమాం దశాన్తే చ**

**సా ప్రాపయేన్మహ్యమన్తే పదం తేజసా దాస్యతే; తేన సా భూయసా భక్తిరాశాస్యతే; పామరాన్ కామయే నామరాన్ సేవితుమ్.**

**వ్యాఖ్యానము :–** దేవ = దేవా! పరం బ్రహ్మ = పరబ్రహ్మయైన, త్వామ్ = నిన్ను, సాక్షాత్ వీక్షామహే = ప్రత్యక్షంగా చూస్తున్నాము. యత్ = ఎందువలన అనగా, పరోక్షామరేక్షా = పరోక్షు లైన దేవతలను చూడడంలో, విలమ్బ = ఆలస్యము, ప్రయాస = ప్రయాస, నిరీక్షా చ = వేచి ఉండడమూ కూడ, నైవ = మాకు లేదు. అక్షేమరాతేః = క్లేశములకు మిత్రుడ నైన, మమ = నాకు, త్వమ్ = నీవు, క్షేమలాభాయ =క్షేమం పొందుటకు, తార్క్ష్యాధిరూఢామ్బుజాక్షాయసే = గరుత్మంతుని అధిరోహించిన మహావిష్ణువు అగుచున్నావు. సర్వదేవతాస్వరూపుడ వైన నిన్ను ప్రత్యక్షంగా చూడడంచేత దేవత లందరినీ చూచి నట్లే గాన నువ్వే నాకు మహావిష్ణువు అని అర్థం. సంసారవిధ్వంసహేతోః = సంసారబాధావినాశంకొరకు, భవన్మణ్డలే = నీ మండలంలో, హంసాధిరూఢమ్ = హంసను అధిష్ఠించిన, సావరోధమ్ = భార్యయైన సరస్వతీదేవితో కూడిన, విధిమ్ = బ్రహ్మదేవుణ్ణి, నినంసామి = నమస్కరింపగోరుచున్నాను.

మదిచ్ఛాసమమ్ = నాకోరికకు తగిన, యం యం దేవమ్ = ఏ యే దేవుణ్ణి, పూర్త్యై = నా ఇచ్ఛ పూర్తి అగుటకు, అహమ్ = నేను, ఇచ్ఛామి = కోరుతానో, ఆ దేవుణ్ణి, తత్తదాకారతః = ఆ యా ఆకారాలలో, ఋచ్ఛామి = నీ మండలంలో పొందుతున్నాను. చూచుచున్నాను. హే! కోకశోకాయనీకార! = చక్రవాకపక్షుల శోకమును తొలగించు పగలును చేయువాడా! మే = నాయొక్క, నిస్తన్ద్రశోకాపహర్తా = నన్ను బాధించడానికి జాగరూకములై ఉన్నా శోకాలను అపహరించేవాడవు, అసి = అయి ఉన్నావు. సౌఖ్య కర్తా అసి = నాకు సౌఖ్యం ఇచ్చేవాడవై ఉన్నావు. త్వమ్ ఏకః = నీ వొక్కడవే, పరః = శేష్ఠుడవైన, లోకాధికర్తా = లోకములపై అధికారం కలవాడవు. శమ్భుః = శివుడు, కుత్ర = ఎక్కడ, అమ్భోజనాభిః = విష్ణువు, క్వ = ఎక్కడ, అమ్భోజపీఠః = పద్మాసనుడైన బ్రహ్మ; క్వ చ = ఎక్కడ; జమ్భాహితః = ఇంద్రుడు, క్వ = ఎక్కడ, అమ్భఃపతిః చ = వరుణుడు, కుత్ర = ఎక్కడ; అన్యే సురాః = ఇతర దేవతలు, కుత్ర వా = ఎక్కడుంటారు. ఇతి = ఇట్లు, అశేషామరాన్వేషణమ్ = మిగిలిన సమస్తదేవతల అన్వేషణమును, కర్తుమ్ = చేయుటకు, నైవ క్షమే =సమర్థుడను కాను.

సః అహమ్ = అట్టి నేను, సర్వామరాకార! = సమస్తదేవతాస్వరూపుడ వైన ఓ! భాస్కరా! అత్ర = ఇక్కడ, తే మణ్డలే ఏవ = నీ మండలమునందే, తాన్ సర్వామరాన్ = ఆ దేవతాశ్రేష్ఠులందరినీ, అద్య = ఇప్పుడు, అపరోక్షే = ప్రత్యక్షంగా, ఈక్షే = చూచుచున్నాను, సర్వదేవాత్మనః = సర్వదేవతాస్వరూపుడ వైన, తే = నీయొక్క, ప్రసాదేన = అనుగ్రహంచేత, మే = నా యొక్క, సర్వాణి అభీష్టాని = అన్ని కోరికలు, సిధ్యన్తు = సిద్ధించుగాక. బహూక్త్యా కిమ్ = చాల చెప్పడంచేత, ఏమి ప్రయోజనము! అహమ్ = నేను, తయా = ఆ, మహత్యా = గొప్పదైన, భవత్పాదభక్త్యా = నీ పాదములపై భక్తిచేతనే, భక్తిని పొందుటకై, ఉత్సుకః అస్మి = చాల ఆసక్తి కలవాడనై ఉన్నాను. భక్తిః ఏవ = నీ పాదభక్తియే, అస్తు నా కుండు గాక. సా భక్తిః = ఆ భక్తి, ఉద్వేలసంపత్తిదాత్రీ = అత్యధికమైన సంపదను ఇచ్చేదిగా, భవిత్రీ = కాగలదు. మమ = నాకు, ఆరోగ్యకర్త్రీ = ఆరోగ్యం చేసేది అవుతుంది. తరిత్రీ = తరింపచేసేది, దీర్ఘాయుః = దీర్ఘాయుర్దాయమును, ఉన్మేషయిత్రీ = వికసింపచేసేదీ, ఇచ్చేదీ, దిక్షు = దిక్కులయందు, యశఃదాత్రి = కీర్తిని వ్యాపింపచేసేదీ, ధాత్రీవ = పెంపుడుతల్లి వలె, మామ్ = నన్ను, పాలయిత్రీ చ = పాలించేదీ కూడ అవుతుంది. సా = ఆ భక్తి, దశాన్తే = జీవితాంతము నందు, ఇమామ్ = ఈ, తవ

ధరిత్రీమ్ = నీ లోకమును, ప్రాపయేత్ = పొందించును. అన్తే = అంతమునందు, మహ్యామ్ = నాకు, తేజసా = తేజస్సుతో కూడిన, పదమ్ = స్థానమును, దాస్యతే = ఇవ్వగలదు. తేన = ఆ కారణంచేతనే, భూయసా = అధికంగా, సా భక్తి, ఆశాస్యతే = కోరబడుచున్నది. పామరాన్ = పామరులైన, అమరాన్ = దేవతలను, సేవితుమ్ = సేవించుటకు, న కామయే = కోరను

**మూలమ్ :– సోఽమరాధీశ్వరోఽప్యామరానశ్వరైశ్వర్యభఙ్గప్రవృత్తం పురా లోక విద్రావణం రావణం హన్తుమేవావతీర్ణస్త్వదీయాన్వయే రామనామా – త్రిధామా హరిర్యుద్ధసీమాన – ముచ్చణ్డధామా సమాగత్య భీమాన్ సమాహత్య కల్పాన్త – జీమూత – కల్పా – నసృక్పానతః ప్రాప్తదర్పానసుగ్రాససర్పానదర్పాశయస్తం జగత్పాలనోత్పాది తస్ఫారసన్నాహ ఏవ, ప్రపన్నాగ్రహం పట్టసప్రాసహస్తం పురస్తాత్సమీకే విహస్తం ప్రహస్తం సమాకల్ప్య సానుప్లవం మృత్యుసోపప్లవం సప్లవఙ్గావలీకః ప్లవఙ్గాభిషఙ్గా పిశఙ్గాతితుఙ్గాఖిలాఙ్గాతిభీమం పురస్తాదపాస్తాయసస్తమ్భవర్ణం రణే కుమ్భకర్ణం చ కృత్వా ధనుర్యష్టి – నిష్ఠ్యూత – నైష్ఠుర్యవద్బాణ – నిర్ఘాత – నిష్పాత –నిష్పాదిత – ప్రాణనిభ్రంశ – ధైర్యో, దినభ్రంశ – విభ్రామ్యదభ్రాన్తర – ధ్వాన్త – సచ్ఛాయ – కాయాతికాయాది – రక్షోనికాయాధి – కాయామ – మాయాగవీపాటనోద్గాఢ – రూఢాద్భుత – ప్రౌఢి – సంపత్సమాలీఢ – కౌఠారికాడమ్బరం జృమ్భయిత్వా, క్షయం లమ్భయిత్వా సడమ్భాన్ పరాభూత – జమ్భాహితాం శ్చాపరానాశరాన్ యుద్ధసన్నద్ధ – మౌద్ధత్య – దుర్ధర్ష – ముచ్ఛృఙ్ఖల – క్రోధవహ్ని – స్ఫులిఙ్గోద్గమ – క్రూర – తారావలీ – ఘోర – నారాచ – ధారా – కఠోరాక్షిభిర్దుర్నిరీక్షం రణక్షోణి – విక్షోభ – దక్షోరు – రక్షో భటాక్షౌహిణీ – క్లప్తరక్షోపకణ్ఠం, పురఃపఙ్క్తికణ్ఠం, కరశ్రేణినిశ్రేణి కారూఢ – ఘూర్ణద్గదా – భిణ్డివాల – త్రిశూల – క్షురప్రాసి – దీప్రాంచలప్రాస – బాణాస – బాణాది – నానాయుధాక్రాన్త – దిక్చక్రమ్.**

**వ్యాఖ్యానము :–.** సః = ఆ, అమరాధీశ్వరోఽపి = దేవతల అధిపతి యైన, విష్ణువు కూడ, పురా = పూర్వమునందు, ఆమర = దేవతలకు సంబంధించిన, అనశ్వర = నాశము లేని, ఐశ్వర్య = ఐశ్వర్యముయొక్క, భఙ్గ = భంగమునందు, ప్రవృత్తమ్ = ప్రవర్తించినవాడు, లోకవిద్రావణమ్ = లోకములను భయంచేత పారిపోయే టట్లు చేసినవాడు, అయిన, రావణమ్ = రావణుని, హన్తుమేవ = సంహరించుటకే, త్వదీయాన్వయే = నీ వంశమునందు, అవతీర్ణః = అవతరించినవాడు. రామనామా త్రిధామా = రాము డను పేరు గల, మూడు లోకాలలో స్థానంగల, ఉచ్చణ్డధామా = తీవ్రమైన తేజస్సు గల, హరిః = విష్ణువు, యుద్ధసీమానమ్ = యుద్ధభూమిని గూర్చి, సమాగత్య = వచ్చి, కల్పాన్తజీమూతకల్పాన్ = కల్పాంతమునందలి మేఘములతో సమానులు, అసృక్పానతః = రక్తపానముచేత, ప్రాప్తదర్పాన్ = పొందబడిన దర్పం గలవారు, అసుగ్రాససర్పాన్ = ప్రాణాలను మ్రింగే సర్పములైన, ప్రాణాలను తీయడంలో సర్పాలవంటివాళ్లు అని అర్థం; భీమాన్ = భయంకరులైన రాక్షసులను, సమాహత్య = సంహరించి (కూడ), అదర్పాశయః = దర్పంలేని మనస్సు కలవాడై, జగత్పాలనోత్పాదిత స్ఫారసన్నాహః ఏవ = జగత్తును పాలించుటకు పుట్టింపబడిన (చేయబడిన) గొప్ప సన్నాహం (యుద్ధసన్నద్ధత్వం) కలవాడగుచునే, సప్లవఙ్గావలీకః =వానరపంక్తులతో కూడినవాడై, సమీకే = యుద్ధమునందు, ప్రపన్నాగ్రహమ్ = పొందబడిన పట్టుదలకలవాడు, పట్టసప్రాసహస్తమ్ = పట్టసములు ప్రాసలు హస్తములందు గలవాడు, సానుప్లవమ్ = అనుచరులతో కూడినవాడు అయిన, ప్రహస్తమ్ = ప్రహస్తు డను రావణామాత్యుని, విహస్తమ్ = ఓడిపోయినవానినిగాను, మృత్యుసోపప్లవమ్ = మరణోపద్రవం చెందినవానినిగాను (మరణించినవానినిగాను), సమాకల్ప్య = చేసి,

ప్లవఙ్గాభిషఙ్గ = వానరుల సంబంధంచేత (వానరులందరూ వానిపై ఎక్కడంచేత) ఆపిశఙ్గ = పసుపుపచ్చగా ఉన్న, అతితుఙ్గ = చాల ఎత్తైన, అఖిలాఙ్గ = సమస్తమైన దేహంతో, అతిభీమమ్ = చాల భయంకరు డైనవాడు; రణే = రణ రంగమునందు, పురస్తాత్ = ఎదుటకు వచ్చినవాడు అయిన, కుమ్భకర్ణం చ = కుమ్భకర్ణుని కూడ, అపాస్త = దూరంగా విసరివేయబడిన, ఆయసస్తమ్భవర్ణమ్ = ఇనుప స్తంభంవంటిరంగు గలవానినిగా, కృత్వా = చేసి, (లేదా కృత్త్వా = ఛేదించి) అనగా కుంభకర్ణుణ్ణిఛేదించి వానిని ఇనుపదూలం దూరంగా పడవేసి నట్లు పడవేసి అని అర్థం. ధనుర్యష్టి = ధనుర్దండమునుండి, నిష్ప్యూత = విడవబడిన(చిమ్మబడిన), నైష్ఠుర్యవద్బాణ = నైష్ఠుర్యం గల బాణాల, నిర్ఘాతనిష్పాత = పిడుగుల వంటి పడడములచేత, నిష్పాదిత = చేయబడిన, ప్రాణవిభ్రంశ = శత్రుప్రాణవినాశనము నందు, ధైర్యః = ధైర్యం కలవాడై,

దినభ్రంశ = సాయంకాలమునందు లేదా రాత్రియందు, విభ్రామ్యత్ = ఆకాశంలో సంచరించుచున్న (ఎగురుచున్న), అభ్రాన్తరధ్వాన్త = మేఘమధ్యము లందలి లేదా ఆకాశమధ్యమునందలి, చీకట్లతో, సచ్ఛాయ = సమానమైన కాంతి గల, కాయ = శరీరాలు గల, అతికాయాది = అతికాయుడు మొదలైన, రక్షోనికాయ = రాక్షస సమూహముల, అధికాయామ = అతిదీర్ఘమైన, మాయాగ = మాయ లనే వృక్షాల లేదా పర్వతాల, వీ(వి)పాటన = చీల్చివేయడంలో, ఉద్గాఢ = అత్యధికమైన, రూఢ = పెంపొందిన, అద్భుతప్రౌఢి = ఆశ్చర్యకర మైన ప్రౌఢత్వము యొక్క సంపత్ = సంపత్తుచేత, సమాలీఢ = వ్యాప్తమైన, కౌఠారికాడమ్బరమ్ = కుఠారధరుని ఆడంబరం వంటి ఆడంబరాన్ని, జృమ్భయిత్వా = విజృంభింపచేసి, అతికాయాదులు ప్రయోగించిన మాయావృక్షాదులను ఛేదించి అని భావం. సడమ్భాన్ = ఆటోపంతో కూడినవాళ్లు, పరాభూతజమ్భాహితాన్ = దేవేంద్రుణ్ణి కూడ ఓడించిన వాళ్లు అయిన, అపరాన్ ఆశరాన్ = ఇతర (మిగిలిన) రాక్షసులను కూడ, క్షయం లమ్భయిత్వా = క్షయం పొందించి, సంహరించి (ఉన్న రాముడు)

'యుద్ధసన్నద్ధమ్' మొదలైన 'పఙ్తికణ్ఠమ్' అనుదానికి విశేషణాలు. యుద్ధ సన్నద్ధమ్ = యుద్ధానికి సన్నద్ధుడు, ఔద్ధత్యదుర్ధర్షమ్ = ఔద్ధత్యంతో ఎదిరింప శక్యం కానివాడు, ఉచ్ఛృఙ్ఖల = అడ్డు లేని, క్రోధవహ్ని = క్రోధాగ్నినుండి, స్ఫులిఙ్గ = నిప్పునెరసుల, ఉద్గమ = బయల్వెడలుటచేత, క్రూర = క్రూరమైన, తారావలీ = కంటిలోని గుడ్ల పంక్తు లనే, ఘోరనారాచధారా = భయంకరమైన నారాచబాణాల ధారలచేత, కఠోర = కఠినమైన (భయంకరమైన), అక్షిభిః = నేత్రాలతో, దుర్నిరీక్షమ్ = చూడడానికి శక్యంకాకుండా ఉన్నవాడు, రణక్షోణి = రణభూమియొక్క (ని), విక్షోభ = క్షోభింపచేయడంలో, దక్ష = సమర్థులైన, ఉరు = గొప్పవైన, రక్షోభటా– క్షౌహిణీ = రాక్షసభటుల అక్షౌహిణులచేత, క్లప్తరక్ష = ఏర్పరుపబడిన రక్షణ గల, ఉపకణ్ఠమ్ = సమీపప్రదేశాలు కలవాడు, కరశ్రేణి = హస్తపంక్తు లను, నిశ్రేణికా = నిచ్చెనయందు, ఆరూఢ = ఎక్కిన (ఉన్న), ఘూర్ణత్ = తిరుగుచున్న, గదా = గద, భిణ్డివాల = భిండివాల మనే ఆయుధం, త్రిశూల = త్రిశూలము, క్షురప్ర =క్షురప్రము, అసి = ఖడ్గము, దీప్రాంచలప్రాస = మెరుస్తూన్న అంచులు గల ప్రాస, బాణాస = ధనుస్సు, బాణాది = బాణము మొదలైన, నానాయుధాక్రాన్త = అనేక విధాలైన ఆయుధాలచేత ఆక్రమింపబడిన, దిక్చక్రమ్ = దిక్కుల చక్రము (అన్నిదిక్కులూ కలవాడు)

**మూలమ్ :– ఆరూఢవన్తం మహాన్తం రథం స్వప్రయుక్తాని మత్తారి – విత్రాస – దాన – ప్రవృత్తాని తత్తావదాగ్నేయ – వాయవ్య – మన్త్రాది – మన్త్రానువిద్ధాని, శస్త్రాణి భిన్దాన – మిన్ద్రాగ్ని – బృన్దారకోత్సారణై – రాశుగై – ర్దారుణై – రాహవాజయ్య – మక్షయ్య – చణ్డాస్త్రవర్షం, స్వతో౽**

**ప్యాహితోత్కర్ష - ముద్వీక్ష్య నిర్జేతుమేనం సమర్థేతర - స్తజ్జయార్థే విచిన్త్యాకులః స్వాన్తసంతాపమేవానుసన్ధాయ హన్తాయ - మగ్రే నిహన్తా కపీనా - మహన్తా - మనన్తాం - సమభ్యేత్యహం తావదేనం నిహన్తా కథం వేతి తాం తోరణే శ్రాన్త ఏవ స్థితశ్చాపయష్టీమవష్టభ్యదోర్భ్యామహృష్టాశయః స్వస్య కష్టాం దశామేక్ష్య తస్మిన్ రణే.**

**వ్యాఖ్యానము :-** (ఈ ద్వితీయాంతాలు కూడ 'పంక్తికణ్ఠమ్' = అనుదానికి విశేషణాలు) మహ్తామ్ = గొప్ప, రథమ్ = రథమును, ఆరూఢవన్తమ్ = ఎక్కినవాడు, స్వప్రయుక్తాని = తనచేత (రామునిచేత) ప్రయోగింపబడినవి, మత్తారి = మదించిన శత్రువులకు, విత్రాసదాన = భయం కరిగించుటయందు, ప్రవృత్తాని = ప్రవర్తించు నవీ, తత్ = ప్రసిద్ధమైన, తావత్ = అంతటి, అన్ని, ఆగ్నేయవాయవ్య మన్త్రాది = ఆగ్నేయమంత్రము, వాయవ్యమంత్రము, మొదలైన, మన్త్రానువిద్ధాని = మంత్రము లతో కూర్చబడిన, శస్త్రాణి = శస్త్రములను, ఇన్ద్రాదిబృన్దారకోత్సారణైః = ఇంద్రుడు మొదలైన దేవతలను దూరంగా పారిపోవు నట్లు చేసి, దారుణైః = భయంకరము లైన, తీవ్రములైన, ఆశుగైః = బాణాలతో, భిన్దానమ్ = భేదించివేయుచున్నవాడు, ఆహవాజయ్యమ్ = యుద్ధమునందు జయింపశక్యం కానివాడు, అక్షయ్యచణ్డాస్త్రవర్షమ్ = అక్షయములైన తీవ్రము లైన అస్త్రములను వర్షించుచున్నవాడు, స్వతోఽపి = తనకంటె కూడ (రామునికంటె కూడ), ఆహితోత్కర్షమ్ = ఉంచబడిన (చూడ బడిన) ఉత్కర్ష (ఆధిక్యం) కలవాడు అయిన, పఙ్క్తికణ్ఠమ్ = దశకంఠుని, పురః = ఎదుట, ఉద్వీక్ష్య = చూచి, సమర్థేతరః =అసమర్థుడై, తజ్జయార్థే = వానిని జయించు విషయంలో, విచికిత్సాకులః = సంశయముతో వ్యాకులుడై, హన్త! = ఆహా! అయ్యో! అగ్రే = నా ఎదుటనే, కపీనాం హన్తా = వానరులను చంపుచున్న ఇతడు, అనన్తామ్ = అనంతమైన, అహన్తామ్ = అహంకారమును, అభ్యేతి = పొందుచున్నాడు; అహం తావత్ = నేనైతే, ఏనమ్ = వీనిని, కథం వా = ఎట్లు, నిహన్తా = చంపగలవాడను, ఇతి = అని, స్వాన్తచిన్తామేవ = మనస్సులో చింతనే, అనుసన్ధాయ = కూర్చుకొని, పొంది, తస్మిన్ రణే = ఆ రణమునందు, స్వస్య = తనయొక్క, కష్టాం దశామ్ = కష్టమైన అవస్థను, ఏక్ష్య = చూచి, అహృష్టాశయః = సంతోషించని మనస్సు కలవాడై, శ్రాన్తః = అలసిపోయినవాడై, తాం చాపయష్టిమ్ = ఆ ధనుర్దండమును, దోర్భ్యామ్ = బాహువులచేత, అవష్టభ్య = ఆనుకొని, ఊతగా చేసికొని, తోరణే ఏవ = ద్వారమునందే, స్థితః = రాముడను పేరుతో ఉన్న హరి నిలబడి ఉండెను.

**మూలమ్ :- పఙ్క్తికణ్ఠం రణోచ్చణ్డ - ముత్కణ్ఠయిష్యస్యలం - చిన్తయా పీడితస్వాన్తయా చిన్తయాదిత్యమాదిత్యవంశధ్వజాభీష్టసంసిద్ధయే, సైష ధాతా, పురాణాం చ జేతా, విజేతా చ దేవద్విషాం దేవనేతా చ, తాపాధినేతాఽమ్బునేతా చ యక్షాధినేతా, స్వయం సర్వదేవాకృతిః, సర్వదేవాత్మకః, సర్వలోకేశ్వరః, సర్వచక్షుర్మయః, సర్వతేజోమయః, సర్వరక్షాకరః, సర్వసంపత్కరః, సర్వదిక్పావనః, సర్వమౌనిస్తుతః, సర్వవిద్యామయః, సర్వమేతజ్జగచ్చక్రమేతన్మయత్వేన సంభావనీయం త్వయా, వేదమాతుః పరా దేవతేయం, పరం వేదమన్త్రాన్తరస్థం, మహామన్త్ర మారాధయన్తస్య మన్త్రానుభావం విదన్తో జనాస్తం త్వమారాధయాదిత్యమన్త్రేణ శత్రుం రణే జేష్యసీతి త్వదీయం మహామన్త్రమష్టాక్షరం, శిష్టమిష్టప్రదం కుమ్భజేనోపదిష్టం గృహీత్వా త్రిరాచమ్య జప్త్వా చ నత్వాపి హత్వా దశగ్రీవ - ముద్గ్రీవ - మాయోధనోద్గ్రీవ - సుగ్రీవ - సేనాభి - రుగ్రీభవన్ ఖణ్డితగ్రీవ - మాకల్ప్య, సీతాం పునః ప్రాప్య సాక్షాన్మహోక్షధ్వజ - బ్రహ్మదేవాగ్రణీపూర్వ దేవాభితోష్టూయమానో విమానోపరి ద్యోతమానో, దధానో ముదం సేవ్యమానోఽమరై - స్తామయోధ్యాపురీ - వీథిమధ్యావనీం సానుమధ్యాసితం వృద్ధసిద్ధర్షిభిః ప్రాప్యతత్రాధిగత్యైవ పిత్రాలయం స్వస్య మాత్రాశిషా సాతిమాత్రాశయప్రీతి -రారబ్ధపట్టాభిషేకో వసిష్ఠాదిభిః సీతయా సాక - మారూఢభద్రాసనో రామభద్రాభిధానో హరిః, తజ్జయస్యాపి, తద్విక్రమస్యాపి మూలం తవారాధనమ్.**

**వ్యాఖ్యానము :-** (ఇవి అగస్త్యుడు వచ్చి రామునితో అన్న మాటలు) ఆదిత్యవంశధ్వజ! = సూర్యవంశానికి ధ్వజమువంటి ఓ! రామా! పీడితస్వాన్తయా = పీడించబడిన మనస్సుగల, చిన్తయా = చింతతో, అలమ్ = చాలును; చింతించకుము. రణోచ్చణ్డమ్ = యుద్ధంలో తీవ్రస్వభావం గల, పఙ్క్తికణ్ఠమ్ = దశకంఠుణ్ణి, ఉత్కణ్ఠయిష్యసి = తీసివేయబడిన కంఠాలు గలవానినిగా చేయగలవు. ఆదిత్యమ్ = ఆదిత్యుణ్ణి, సంసిద్ధయే = కార్యసిద్ధికొరకు, చిన్తయ = ధ్యానించుము. సః ఏషః = ప్రసిద్ధు డైన ఈ ఆదిత్యుడు, ధాతా = బ్రహ్మదేవుడు; పురాణాం జేతా చ = పురములను జయించినవాడు; రుద్రుడు. దేవద్విషామ్ = దేవతల శత్రువులైన రాక్షసులకు (ను) విజేతా చ = జయించినవాడు. విష్ణువు; దేవనేతా = దేవేంద్రుడు, తాపాధినేతా = నరకప్రభువు, యముడు, అమ్బునేతా = వరుణుడు, స్వయమ్ = తానే, సర్వదేవాకృతిః = సకల దేవతాస్వరూపుడు, సర్వదేవాత్మకః = సర్వదేవాత్మకుడు. సర్వలోకేశ్వరః = సకల లోకములకు ఈశ్వరుడు, నియమించువాడు. సర్వచక్షుర్మయః = సకలప్రాణినేత్ర స్వరూపుడు. సర్వతేజోమయః = సకలతేజఃస్వరూపుడు. సర్వరక్షాకరః = అందరి రక్షణము చేసేవాడు. సర్వసంపత్కరః = అన్ని సంపదలు ఇవ్వగలిగినవాడు.

సర్వదిక్పావనః = అన్ని దిక్కులను పవిత్రింపచేయువాడు. సర్వమౌనిస్తుతః = మునులందరిచేతా స్తుతింపబడువాడు. సర్వవిద్యామయః = సకలవిద్యాస్వరూపుడు. సర్వమ్ = సమస్తమైన, ఏతత్ జగత్ = ఈ జగత్తు, ఏతన్మయత్వేన = ఈ సూర్యస్వరూపమే అయి ఉన్నది అని, త్వయా = నీచేత, సంభావనీయమ్ = భావింపదగినది. ఇయమ్ = ఇది, ఈ ఆదిత్యుడు, వేదమాతుః = వేదమాతకంటె కూడ, పరా = ఉత్తమమైన, దేవతా = దేవత. అస్య = ఈ ఆదిత్యునియొక్క, మన్త్రానుభావమ్ = మంత్రముయొక్క ప్రభావమును, విదన్తః = ఎరిగిన, జనాః = జనులు, వేదమన్త్రాన్తరస్థమ్ = వేద మంత్రాల మధ్యలో ఉన్న, మహామన్త్రమ్ = గాయత్రీమంత్రమును, లేదా సూర్యాష్టాక్షరీమంత్రమును, ఆరాధయన్తి = ఆరాధి స్తూంటారు. త్వమ్ = నీవు, ఆదిత్యమన్త్రేణ = ఆదిత్యమంత్రంతో, తమ్ = ఆ ఆదిత్యుణ్ణి, ఆరాధయ = ఆరాధించుము. రణే = యుద్ధమునందు, శత్రుమ్ = నీ శత్రువైన రావణుని, జేష్యసి = జయించగలవు,

ఇతి = అని పలికి, కుమ్భజేన = అగస్త్యునిచేత, ఉపదిష్టమ్ = ఉపదేశించబడిన, శిష్టమ్ = శ్రేష్ఠమైన, ఇష్టప్రదమ్ = ఇష్టములను ఇచ్చే, త్వదీయమ్ = నీకు సంబంధించిన, అష్టాక్షరం మహామన్త్రమ్ = ఎనిమిదక్షరాలు గల మహామంత్రాన్ని, గృహీత్వా = గ్రహించి, త్రిః = మూడు పర్యాయాలు, ఆచమ్య = ఆచమనం చేసి, జప్త్వా చ = ఆ మహామంత్రం జపించి, నత్వాపి = నీకు నమస్కారం కూడ చేసి, ఆయోధనోద్గ్రీవమ్ = యుద్ధమునకు అభిముఖుడైన, ఉద్గ్రీవమ్ = ఛేదించినా కూడ మళ్లీ మొలుస్తూన్న కంఠాలు గల, దశగ్రీవమ్ = దశగ్రీవుణ్ణి, ఉద్గ్రీవసుగ్రీవసేనాభిః = ఉత్కంఠతో మెడ లెత్తి చూస్తూన్న సుగ్రీవుని సేనలతో కూడి, ఉగ్రీభవన్ = ఉగ్రమూర్తి కలవా డగుచు, హత్వా = సంహరించి, సీతామ్ = సీతను, పునః = మరల, ప్రాప్య = పొంది, సాక్షాత్ = ప్రత్యక్షంగా, మహోక్షధ్వజ = వృషభధ్వజు డైన పరమేశ్వరుడు, బ్రహ్మ = బ్రహ్మదేవుడు, దేవాగ్రణీ = దేవనాయకుడైన దేవేంద్రుడు, పూర్వ = మొదలైన, దేవతాభితోష్టూయమానః = దేవతలచేత మాటిమాటికి అత్యధికముగా స్తుతింపబడుచు, విమానోపరి = పుష్పకవిమానంమీద, ద్యోతమానః = ప్రకాశించుచు, ముదం దధానః = ఆనందవంతుడై, అమరైః = దేవతలచేత, సేవ్యమానః = సేవింపబడుచు, వృద్ధసిద్ధర్షిభిః = వృద్ధులచేత, సిద్ధులచేత, ఋషులచేత, అధ్యాసితమ్ = అధిష్ఠింపబడిన, సానుమ్ = పర్వతముయొక్క చరియ అయిన, ఇది రూపకము. అయోధ్యాపురమధ్యభూమి సిద్ధులు, ఋషులు నివసించు పర్వతసానువువలె అతిపవిత్ర మైనది అని

భావం. అయోధ్యాపురీవీథిమధ్యావనిమ్ = అయోధ్యాపుర వీథిమధ్యయం దున్న ప్రదేశమును, అనగా దశరథమహారాజు ప్రాసాదమున్న, ప్రదేశమును, ప్రాప్య = పొంది, చేరి, తత్ర = అక్కడ, పిత్రాలయమ్ = తండ్రి గారి భవనమును, అధిగత్య ఏవ = చేరగానే,

స్వస్య = తనయొక్క, మాత్రాశిషా = తల్లుల ఆశీస్సుచే, సాతిమాత్రాశయప్రీతిః = అత్యధికమైన మానసప్రీతి (ఆనందం) కలవాడై, రామభద్రాభిధానః = రామభద్రు దను పేరుతో ఉన్న, హరిః = మహావిష్ణువు, వసిష్ఠాదిభిః = వసిష్ఠుడు మొదలైన మునులచేత, ఆరబ్ధపట్టాభిషేకః = ప్రారంభింపబడిన సామ్రాజ్యపట్టాభిషేకం గలవాడై, సీతయా సాకమ్ = సీతతో, ఆరూఢభద్రాసనః = అధిష్ఠించబడిన మంగళకరమైన సింహాసనం కలవాడైనాడు. సింహాసనం అధిష్ఠించి రాజ్యపాలనం నిర్వహించాడు. తజ్జయస్య అపి = ఆ రాముడు చేసిన శత్రుజయానికి, తద్విక్రమస్యాపి = ఆతని పరాక్రమమునకు, తవ ఆరాధనమ్ = నీ (నిన్ను) ఆరాధనయే (ఆరాధించుటయే), మూలమ్ = ప్రధానకారణము.

**మూలమ్ :- తత్త్వదారాధనప్రీతిరేవాస్తు మే; త్వం పితా మే త్వమేవాసి మాతా చ మాతామహస్త్వమ్, సఖా మే త్వమేవాసి, బన్ధుర్గురుస్త్వం హి మే, త్వాం ప్రపద్యే త్వదేకాశ్రయస్త్వాం ప్రశంసామి సంసారవిచ్ఛిత్తయే; త్వాం వినాఽన్యం న సేవే;త్వయి స్వాన్తమాస్తే; త్వయి న్యస్తభారోఽస్మి, సత్యం వదామి, త్వదారాధకానామ్; సమారాధయే త్వాం దిదృక్షాపరస్తేఽక్షరక్షేమహేతోస్త్వదాయత్తమేవాస్తు చిత్తం చ మే త్వం పరం దైవతమ్. త్వన్మయానేవ దేవానహం భావయే; త్వం భవామ్భోనిధేర్మాం సముత్తారయ; త్వం మమోద్ధిన్ధి తద్దైన్యముద్భటమ్; త్వత్ప్రసాదోఽస్తు మే; త్వం ధనం చాక్షయమ్; త్వత్కృతారోగ్యభాగ్యో భవేయమ్. త్వయా ముక్తిసంపత్ప్రదేయా చ కాలాత్యయే, త్వం వయో దేహి దీర్ఘం, త్వదభ్యర్చనాయాస్తు దీర్ఘం వయః సప్తసప్తే! నమస్తే దినేశాయ చణ్డత్విషే చణ్డధామ్నే నమస్తుభ్యమాదిత్య! తుభ్యం నమః సర్వలోకాత్మనే దేవ! తుభ్యం నమఃసర్వదేవాత్మనే దేవ, తుభ్యం నమః సర్వదేవాత్మనే దేవ, తుభ్యం నమః సర్వదేవాత్మనే దేవ! తుభ్యం నమో నమః.**

**వ్యాఖ్యానము :-** తత్ = ఆ కారణంవల్ల, మే = నాకు, త్వదారాధనప్రీతిరేవ = నిన్ను ఆరాధించుటయందు ప్రీతియే, అనగా నిన్నే ఆరాధించడంలో ప్రీతి, అస్తు = ఉండుగాక. త్వమ్ = నీవే, మే = నాయొక్క, పితా = తండ్రివి, తమేవ = నీవే, మాతా చ అసి = తల్లివి కూడ అయి ఉన్నావు. త్వమ్ = నీవే, మాతామహః = మాతామహుడవు, త్వమేవ = నీవే, మే = నా, సఖా అసి = స్నేహితుడవు అయి ఉన్నావు. త్వమ్ = నీవే, మే = నా, బన్ధుః = బంధువు, గురుః = గురువు, త్వదేకాశ్రయః = నీవు ఒక్కడవే ఆశ్రయంగా గల నేను, త్వామ్ = నిన్ను, ప్రపద్యే = శరణు పొందుచున్నాను.. సంసారవిచ్ఛిత్తయే = నా సంసారం తొలగిపోవడానికై, త్వామ్ = నిన్ను, ప్రశంసామి = స్తుతిస్తున్నాను. త్వాం వినా = నిన్ను కాదని, అన్యమ్ = ఇతరుణ్ణి ఎవనినీ, న సేవే = సేవించను. స్వాన్తమ్ = నా చిత్తము, త్వమ్ = నీపైననే, ఆస్తే = ఉన్నది. త్వయి = నీపైననే, న్యస్తభారః అస్మి = ఉంచబడిన భారం కలవాడను అయిన ఉన్నాను. భారం ఉంచాను. త్వదారాధకానామ్ = నీ ఆరాధన చేసేవాళ్లకు, సత్యం వదామి = సత్యం చెపుతున్నాను.

అక్షరక్షేమహేతోః = వినాశం లేని శాశ్వతమైన క్షేమం కొరకు, తే దిదృక్షాపరః = నిన్ను సాక్షాత్కరించుకొనవలె నని ఆసక్తి గలవాడనై, త్వామ్ = నిన్ను, సమారాధయే = ఆరాధించుచున్నాను. మే చిత్తం చ = నా చిత్తం కూడ, త్వదాయత్తమేవ = నీకే అధీనమై, అస్తు = ఉండుగాక. త్వమ్ = నీవే, పరమ్ = అత్యుత్కృష్టమైన, దైవతమ్ = దేవతవు. అహమ్ = నేను, దేవాన్ = దేవతలందరినీ, త్వన్మయానేవ = నీ స్వరూపంలోనే ఉన్నావారినిగా, భావయే = భావించుచున్నాను. త్వమ్ = నీవు, మామ్ = నన్ను,

భవామ్భోనిధేః = సంసారసముద్రమునుండి, సముత్తారయ = తరింపచేయుము, పైకి తీయుము. త్వమ్ = నీవు, మమ = నాయొక్క, అత్యుద్భటమ్ = చాల తీవ్రమైన, తత్ దైన్యమ్ = ఆ దైన్యమును, ఉద్భింధి = భేదించుము. మే = నాకు, త్వత్ప్రసాదః = నీ అనుగ్రహం, అస్తు ఉండుగాక. త్వమ్ = నీవే, అక్షయం ధనమ్ = నా క్షయం లేని ధనమ్, త్వత్కృతారోగ్యభాగ్యః = నీచేత చేయబడిన (కలిగింపబడిన) ఆరోగ్య మను భాగ్యం కలవాడను, భవేయమ్ = అగుదునుగాక. త్వయా = నీచేత, కాలాత్యయే = నా జీవనకాలం గడచి నప్పుడు, ముక్తిసంపత్ = మోక్ష మను సంపద, ప్రదేయా = ఇవ్వదగినది. త్వమ్ = నీవు, దీర్ఘం వయః = దీర్ఘ మైన వయస్సును, దేహి = ఇమ్ము. దీర్ఘం వయః = నీవు అనుగ్రహించిన ఆ దీర్ఘాయుర్దాయము, త్వదభ్యర్చనాయ = నిన్ను పూజించడానికి, అస్తు = వినియోగింప బడుగాక.

సప్తసప్తే! = సప్తాశ్వుడవైన ఓ ఆదిత్యా! దినేశాయ = దినములకు ఈశ్వరుడవు, చణ్డత్విషే = తీవ్రమైన కాంతి కలవాడవు అయిన, తే = నీకు, నమః = నమస్కారము. ఆదిత్య! = ఓ ఆదిత్యా!, చణ్డధామ్నే = తీక్ష్ణమైన కాంతిగల, తుభ్యమ్ = నీకు, నమః = నమస్కారము. దేవ! = దేవా, ప్రకాశించువాడా! సర్వలోకాత్మనే = సకలలోకస్వరూపుడవైన, తుభ్యమ్ = నీకు, నమః = నమస్కారము. దేవ! = ఓ దేవా! సర్వదేవాత్మనే = సమస్తదేవతాస్వరూపుడ వైన, తుభ్యమ్ = నీకు, నమః = నమస్కారము. దేవ! = ఓ దేవా! సర్వదేవాత్మనే = సర్వదేవతాస్వరూపుడవైన, తుభ్యమ్ = నీకు, నమః = నమస్కారము, ''భక్త్యతిశయంచేత తుభ్యం నమః సర్వదేవాత్మనే'' అను వాక్యం మూడు పర్యాయాలు ఉచ్చరించబడినది. దేవ! = దేవా! తుభ్యమ్ = నీకు, నమః నమః = నమస్కారము, నమస్కారము. మరీ మరీ నమస్కారము.

**శ్లో॥ మయూరకవినా కృతః సకలలోకమోదావహః**
**విచిత్రపదసున్దరో విబుధదన్తితీక్ష్ణాఙ్కుశః ।**
**సురాసురపరిష్టుతాదిమవచోవపుర్దణ్డకః**
**సమస్తకుశలాప్తయే భవతు సజ్జనానాం చిరమ్ ॥**

**సూర్యదణ్డకః సంపూర్ణః**

**వ్యాఖ్యానము :–** మయూరకవినా = మయూరకవిచేత, కృతః = రచింపబడినది, సకలలోక మోదావహః = సకలజనులకు ఆనందమును కలిగించేది, విచిత్రపదసున్దరః = విచిత్రపదములతో సుందరమైనది, విబుధదన్తితీక్ష్ణాఙ్కుశః = పండితు లనే ఏనుగులకు, తీక్ష్ణమైన అంకుశమూ, అర్థం చేసికొనలేని పండితమన్యులను అడుగడుగునా ముందుకు సాగకుండా చేసేది అని అర్థం. సురాసురపరిష్టుతాదిమ– వచోదణ్డకః = సురాసురులచేత స్తుతింపబడిన, ఆదిమవచోవపుస్సుయొక్క, అనగా అపౌరుషేయ మైన ప్రాచీనవాక్కు అయిన వేదముల స్వరూపమైన సూర్యుని, దణ్డకః = దణ్డకం, సజ్జనానామ్ = సజ్జనులకు, చిరమ్ = చిరకాలము, సమస్తకుశలాప్తయే = సమస్తకుశలముల ప్రాప్తికి, భవతు = అగుగాక. కుశలప్రాప్తిని కలిగించుగాక.

సూర్యదండకం సంపూర్ణం.

శ్రీః శ్రీః శ్రీః

**ఈ సూర్యదండకాన్ని కంఠహారంగా ధరించి ఆయురారోగ్యములు అనుభవింతురుగాక.** – రామోరా.





# శ్రీః
# శ్రీదేవీ ఖడ్గమాలా ప్రాశస్త్యము

*– డా॥ హరి శివకుమార్, వరంగల్.*

భారతీయ సంప్రదాయంలో దేవతారాధన ఒక విశిష్ట ప్రక్రియ. ఆ ప్రక్రియను వివరించేది మంత్రశాస్త్రము. ఆ శాస్త్రగ్రంథాలకు తంత్రములని వ్యవహారమున్నది. తంత్రమనగా జ్ఞానమును విస్తరింపజేసేదని అర్థము. అంటే – మంత్ర తత్త్వమును, దాని అర్థమును, దాని ఉపాసనా విధానమును వివరించేదని భావము. ఈ విషయ వివరణమును కొన్ని ప్రత్యక్షముగాను, మరికొన్ని పరోక్షముగాను బోధిస్తున్నవి. అది గ్రహించి ఉపాసిస్తే సత్ఫలితం లభిస్తుంది.

శక్తిపూజా విధానము విగ్రహాల రూపంలోను, యంత్రాల రూపంలోను జరుగుతూ ఉండటం సంప్రదాయం! ఆ రెండింటిలో యంత్రరూపోపాసన శ్రేష్ఠమైనదని ఆగమములు చెబుతున్నాయి. అట్టి యంత్రాలలో **సర్వోత్కృష్టమైనది శ్రీచక్రము.** అందుకే దానికి యంత్రరాజమని పేరు.

శ్రీచక్రావిర్భావమును గురించి బ్రహ్మాండపురాణములోను, రేణుకాపురాణము లోను చెప్పబడింది. ఇక్ష్వాకు వంశజుడైన రేణువనే మహారాజు తపస్సుకు మెచ్చి శ్రీదేవి శ్రీచక్రమధ్యగతయై ఆవిర్భవించిందని రేణుకాపురాణంలో చెప్పబడింది. కాగా భండాసురుని జయించటానికి ఇంద్రాదిదేవతలు యజ్ఞం చెయ్యగా, ఆ హెూమాగ్ని మధ్యంలో శ్రీచక్రమధ్యగతయై ప్రత్యక్షమైనదని బ్రహ్మాండపురాణం చెబుతున్నది.

ఈ శ్రీచక్రస్వరూపాన్ని వివరించే సంప్రదాయిక శ్లోకమిది –

**బిందు త్రికోణ వసుకోణ దశారయుగ్మ – మన్వశ్ర నాగదళ సంయుత షోడశారమ్ ।**
**వృత్తత్రయం చ ధరణీసదనత్రయం చ – శ్రీచక్రమేతదుదితం పరదేవతాయాః ॥**

అనగా – బిందువు, త్రికోణము, వసుకోణము, దశారయుగ్మము, మన్వస్రము, అష్టదళ పద్మము, షోడశదళపద్మము, మేఖలాత్రయము, రేఖాత్రయము – అనే ఆవరణములు ఈ శ్రీచక్రంలో ఉన్నాయి.

శ్రీచక్రంలో ఒకదానిలో ఒకటి ఇమిడియున్న 9 త్రికోణములున్నాయి. కేంద్రములో బిందువున్నది. వీనిలో 5 త్రికోణములు అధోముఖంగాను, నాలుగు త్రికోణములు ఊర్ధ్వ ముఖంగాను ఉన్నవి. అధోముఖములైన 5 త్రికోణములు శక్తికి, ఊర్ధ్వముఖములైన 4 త్రికోణములు శివునకు

శ్రీః

# శ్రీ బ్రహ్మవైవర్తమహాపురాణమ్
# పంచపంచాశతమోఽధ్యాయః
## రాధాదేవి యొక్క పూజ, స్తోత్రాదులు

శ్రీపార్వత్యువాచ - శ్రీపార్వతీదేవి ఇట్లనెను-

శ్లో॥ శ్రీకృష్ణస్య స్థితే మంత్రే చాన్యేషామీశ్వరస్య వః ।
కథం జగ్రాహ రాధాయా మంత్రం వై వైష్ణవో నృపః ॥ 1

శ్లో॥ కిం విధానం చ కిం ధ్యానం కిం స్తోత్రం కవచం చ కిమ్ ।
కం మంత్రం చ దదౌ రాజ్ఞే తాం పూజాపద్ధతిం వద ॥ 2

ఓ మహాదేవా! మీకు, ఇతరులకు కూడా ఈశ్వరుడగు శ్రీకృష్ణమంత్రముండగా దానిని కాదని విష్ణుభక్తుడైన రాజు రాధికామంత్రము నేల గ్రహించెను.

ఆ రాధికా పూజను ఎట్లు చేయవలెను? ఆమెను ఎట్లు ధ్యానింపవలెను? ఆ దేవియొక్క స్తోత్రము, కవచము ఏ తీరున ఉన్నవి? ఆ దేవిని ఉపాసించు మంత్రమేది? ఈ విషయముల నన్నిటిని నాకు వివరింపుము.

శ్రీ మహేశ్వర ఉవాచ - శ్రీమహాదేవు డిట్లనెను -

శ్లో॥ హే విప్ర! కం భజామీతి ప్రశ్నం కుర్వతి రాజని ।
శీఘ్రం ప్రాప్నోమి గోలోకం కస్యారాధనతో మునే ॥ 3

శ్లో॥ ఇత్యుక్తవంతం రాజేంద్రమువాచ బ్రాహ్మణోత్తమః ।
తత్సేవయా చ తల్లోకం ప్రాప్స్యసే బహుజన్మతః ॥ 4

శ్లో॥ తత్ప్రాణాధిష్ఠాతృదేవీం భజ రాధాం పరాత్పరామ్ ।
కృపామయీప్రసాదేన శీఘ్రం ప్రాప్నోషి తత్పదమ్ ॥ 5

శ్లో॥ ఇత్యుక్త్వా రాధికామంత్రం దదౌ తస్మై షడక్షరమ్ ।
ఓం రాధేతి చతుర్థ్యంతం వహ్నిజాయాంతమేవ చ ॥ 6

శ్లో॥ ప్రాణాయామం భూతశుద్ధిం మంత్రన్యాసం తథైవ చ ।
కరాంగన్యాసమేవం చ ధ్యానం సర్వసుదుర్లభమ్ ॥ 7

శ్లో॥ స్తోత్రం చ కవచం తం చ శిక్షయామాస భక్తితః ।
రాజా తేన క్రమేణైవ జజాప పరమం మనుమ్ ॥ 8

శ్లో॥ ధ్యానం చ సామవేదోక్తం మంగళానాం చ మంగళమ్ ।
కృష్ణస్తాం పూజయామాస పురా ధ్యానేన యేన చ ॥ 9

సుయజ్ఞమహారాజు బ్రాహ్మణునితో 'ఆర్యా నేనెవరిని సేవింపవలెను?' ఏదేవతను ఆరాధించినచో త్వరగా నేను గోలోకమును పొందగలనో ఆ దేవతామంత్రము నాకు ఉపదేశింపుడని బ్రాహ్మణుని అడుగగా సుతపుడను ఆ బ్రాహ్మణుడు శ్రీకృష్ణుని ఆరాధించినచో అనేక జన్మలకు ఆతడుండు

గోలోకమును చేరుకొందువు. కాని శ్రీకృష్ణునకు ప్రాణవల్లభయగు రాధికాదేవిని సేవించిన కృపామూర్తియగు ఆ తల్లియొక్క అనుగ్రహమువలన నీవు గోలోకమును త్వరగా పొందుదువని చెప్పెను.

తరువాత ఆ మహారాజునకు షడక్షరమైన రాధికాదేవి మంత్రమునుపదేశించెను. ఆ మంత్రము ఓంకారపూర్వమై చతుర్థీవిభక్తి చివర కలిగియున్న రాధాశబ్దమునకు వహ్నిజాయయగు స్వాహాకారాంతమై **(ఓం రాధికాయై స్వాహా)** ఉండును.

ఆ మంత్రమును ప్రాణాయామము, భూతశుద్ధి, మంత్రన్యాసము, అంగ న్యాసము, కరన్యాసము మొదలగు వాటితో ధ్యానించవలయునని ఆ దేవియొక్క స్తోత్రమును, కవచమును బోధించెను. సుయజ్ఞుడు తన మంత్రగురువగు సుతపుడు చెప్పినట్లు రాధికామంత్రమును జపించెను. అట్లే శ్రీకృష్ణుడు రాధికాదేవిని ఏరీతిగా ధ్యానము చేసెనో సామవేదమున రాధాదేవి ధ్యానమేరీతిగా కలదో ఆ పద్ధతిలో రాధాదేవిని ధ్యానించెను.

## -ధ్యానమ్-

శ్లో॥ శ్వేతచంపకవర్ణాభాం కోటిచంద్రసమప్రభామ్ ।
శరత్పార్వణచంద్రాస్యాం శరత్పంకజలోచనామ్ ।
సుశ్రోణీం సునితంబాం చ పక్వబింబాధరాం వరామ్ ॥ 10

శ్లో॥ ముక్తాపంక్తిప్రతినిధిదంతపంక్తిమనోహరామ్ ।
ఈషద్ధాస్యప్రసన్నాస్యాం భక్తానుగ్రహకారికామ్ ।
వహ్నిశుద్ధాంశుకాధానాం రత్నమాలావిభూషితామ్ ॥ 11

శ్లో॥ రత్నకేయూరవలయాం రత్నమంజీరరంజితామ్ ।
రత్నకుండలయుగ్మేన విచిత్రేణ విరాజితామ్ ।
సూర్యప్రభాప్రతికృతిగండస్థలవిరాజితామ్ ॥ 12

శ్లో॥ అమూల్యరత్నఖచితగ్రైవేయకవిభూషితామ్ ।
సద్రత్నసారఖచితకిరీటముకుటోజ్జ్వలామ్ ।
రత్నాంగులీయసంయుక్తాం రత్నపాశకశోభితామ్ ॥ 13

శ్లో॥ బిభ్రతీం కబరీభారం మాలతీమాల్యశోభితామ్ ।
రూపాధిష్ఠాతృదేవీం చ మత్తవారణగామినీమ్ ॥ 14

శ్లో॥ గోపీభిః సుప్రియాభిశ్చ సేవితాం శ్వేతచామరైః ।
కస్తూరీబిందుభిః సార్ధమధశ్చందనబిందునా ॥ 15

శ్లో॥ సిందూరబిందునా చారుసీమంతాధఃస్థలోజ్జ్వలామ్ ।
నిత్యం సుపూజితాం భక్త్యా కృష్ణేన పరమాత్మనా ॥ 16

శ్లో॥ కృష్ణసౌభాగ్యసంయుక్తాం కృష్ణప్రాణాధికాం వరామ్ ।
కృష్ణప్రాణాధిదేవీం చ నిర్గుణాం చ పరాత్పరామ్ ॥ 17

శ్లో॥ మహావిష్ణువిధాత్రీం చ ప్రదాత్రీం సర్వసంపదామ్ ।
కృష్ణభక్తిప్రదాం శాంతాం మూలప్రకృతిమీశ్వరీమ్ ॥ 18

శ్లో॥ వైష్ణవీం విష్ణుమాయాం చ కృష్ణప్రేమమయీం శుభామ్ ।
రాసమండలమధ్యస్థాం రత్నసింహాసనస్థితామ్ ।
రాసే రాసేశ్వరయుతాం రాధాం రాసేశ్వరీం భజే ॥ 19

రాధాదేవి ధ్యానశ్లోకములలో ఈ విధముగా వర్ణింపబడినది. ఆ దేవి తెల్లని చంపకపుష్పములవలె తెల్లగానుండును. శరత్కాలమందలి పూర్ణిమాచంద్రునివలె నిండైన ముఖముగలది. ఆమె నేత్రములు సైతము శరత్కాలమందలి పద్మములవలె శోభించు చుండును. చక్కని నడుము, నితంబములు కలది. ఆ దేవి పెదవులు పండిన దొండపండువలె ఎఱ్ఱగా నుండును. ఆ దేవి దంతములు ముత్యాలవరుసవలె నుండును. ఆమె ఎల్లప్పుడు చిఱునవ్వుతో ప్రసన్నముగానుండును. భక్తులననుగ్రహించును. పరిశుద్ధమైన వస్త్రమును, రత్నమాలలను, రత్నకేయూరములను, రత్నమంజీరములను, రత్నకుండలములను ఆమె ఎల్లప్పుడు ధరించును. సూర్యకాంతివంటి కాంతిగల చెక్కిళ్ళతో ఆ దేవి అమూల్యములైన రత్నములున్న కంఠాభరణమును, మంచి రత్నములుగల కిరీటమును, రత్నముల యుంగరమును, రత్నపాశమును మాలతీమాలచే అలంకరింప బడిన కొప్పును ధరించుచున్నది. ఆ దేవి సురూపమునకు అధిష్ఠానదేవత. మదించిన ఏనుగువంటి నడకగలది. ఆ దేవిని గోపికలు చెలికత్తెలు తెల్లని చామరములు వీయుచు సేవింతురు. ఆమె పాపిటలో కస్తూరి బిందువులు, దానికింద అర్ధచందనపు చుక్క, దానికింద సిందూరపు చుక్కలున్నవి. ఆ తల్లిని పరమాత్మయగు శ్రీకృష్ణుడే ప్రతిదినము ఆరాధించుచుండును. శ్రీకృష్ణునకు ప్రాణములకంటె మిన్నయైనది. ఆమె నిర్గుణ, పరాత్పర, సమస్తసంపదల నొసగునది. మహావిష్ణువునకు మాత. శ్రీకృష్ణునియందు భక్తిని కలిగించునది. మూలప్రకృతిరూపిణి. ఈశ్వరి, వైష్ణవి, విష్ణుమాయ, శ్రీకృష్ణప్రేమ రూపిణి. ఆ మహాదేవి రాసమండలమున రత్నసింహాసనమున రాసేశ్వరుడగు శ్రీకృష్ణునితో కలిసియున్నట్లు ధ్యానించుచు ఆమెను సేవింపవలెను.

శ్లో॥ ధ్యాత్వా పుష్పం మూర్ధ్ని దత్త్వా పునర్ధ్యాయేత్ జగత్ప్రసూమ్ ।
దద్యాత్ పుష్పం పునర్ధ్యాత్వా చోపచారాణి షోడశ ॥ 20

శ్లో॥ ఆసనం వసనం పాద్యమర్ఘ్యం గంధానులేపనమ్ ।
ధూపం దీపం సుపుష్పం చ స్నానీయం రత్నభూషణమ్ ॥ 21

శ్లో॥ నానాప్రకారనైవేద్యం తాంబూలం వాసితం జలమ్ ।
మధుపర్కం రత్నతల్పముపచారాణి షోడశ ॥ 22

శ్లో॥ ప్రత్యేకం వేదమంత్రేణ దత్తం భక్త్యా చ భూభృతా ।
మంత్రాంశ్చ శ్రూయతాం దుర్గే వేదోక్తాన్ సర్వసమ్మతాన్ ॥ 23

రాధాదేవిని పై విధముగా ధ్యానించి ఆ దేవి శిరస్సుపై పుష్పమునుంచి జగత్ప్రభువగు శ్రీకృష్ణుని కూడా ధ్యానింపవలెను. ఆ తరువాత మరల ఆ దేవి శిరస్సుపై పుష్పమునుంచి ఆమెను ధ్యానము చేయవలెను. అటుపిమ్మట షోడశోపచారములతో ఆమెను పూజింపవలెను.

షోడశోపచారములేవనగా ఆసనము, వస్త్రము, పాద్యము, అర్ఘ్యము, గంధానులేపనము, ధూపము, దీపము, పుష్పము, స్నానము, రత్నభూషణములు, అనేక విధములైన నైవేద్యములు, తాంబూలము, సువాసనలుగల జలము, మధుపర్కము, రత్నశయ్య అనునవి. వీటిని ప్రత్యేకముగా వేదమంత్రములతో సుయజ్ఞుడు చేసెను.

ఓ పార్వతి! ఈ షోడశోపచారములు చేయునపుడు ఉచ్చరింపవలసిన మంత్రములు వేదమున చెప్పబడినవి. అవి అందరికీ అన్ని సమయములందు సమ్మతమైనవి. ఆ మంత్రములివి.

**సింహాసనమంత్రము –**

**శ్లో॥ రత్నసారవికారం చ నిర్మితం విశ్వకర్మణా ।**
**వరం సింహాసనం రమ్యం రాధే! పూజాసు గృహ్యతామ్ ॥ 24**

ఓ రాధాదేవీ! నేను సమర్పించుచున్న ఈ ఆసనమును విశ్వకర్మ మంచి రత్నములను కూర్చి అందముగా నిర్మించెను. దీనిని పూజయందు నీవు స్వీకరింపుము.

**వస్త్రమంత్రము –**

**శ్లో॥ అమూల్యరత్నఖచితమమూల్యం సూక్ష్మమేవ చ ।**
**వహ్నిశుద్ధం నిర్మలం చ వసనం దేవి! గృహ్యతామ్ ॥ 25**

ఓ దేవీ! ఈ వస్త్రము అమూల్యములైన రత్నములు కలది. చాలా పలుచనిది. మిక్కిలి పరిశుద్ధమైనది. ఇట్టి వస్త్రమును నీవు అంగీకరింపుము.

**పాద్యమంత్రము –**

**శ్లో॥ సద్రత్నసారపాత్రస్థం సర్వతీర్థోదకం శుభమ్ ।**
**పాదప్రక్షాలనార్థం చ రాధే! పాద్యం చ గృహ్యతామ్ ॥ 26**

ఓ రాధాదేవీ! నీయొక్క పాదములను కడుగవలయునని మంచి రత్నములచే ఖచితమైన పాత్రలో సమస్తపుణ్యతీర్థములనుండి ఉదకమును తెచ్చితిని. నీవు ఈ పాద్యమును తీసికొమ్ము.

**అర్ఘ్యమంత్రము –**

**శ్లో॥ దక్షిణావర్తశంఖస్థం సదూర్వాపుష్పచందనమ్ ।**
**పూతం యుక్తం తీర్థతోయే రాధేఽర్ఘ్యం ప్రతిగృహ్యతామ్ ॥ 27**

ఓ రాధాదేవీ! నీకై దక్షిణావర్తశంఖమున గఱిక, పుష్పములు, చందనములతో సువాసితమై, పుణ్యతీర్థముల నీరు కావున పవిత్రమైన ఈ అర్ఘ్యమును స్వీకరింపుము.

**గంధమంత్రము –**

**శ్లో॥ పార్థివద్రవ్యసంభూతమతీవ సురభీకృతమ్ ।**
**మంగళార్హం పవిత్రం చ రాధే! గంధం గృహాణ మే ॥ 28**

భూమియందు దొరుకుచున్న సువాసనద్రవ్యములతో మిక్కిలి వాసనగలది, పవిత్రమైనది, మంగళకార్యములందు అర్హమైన గంధమును ఓ రాధాదేవి! నీవు గైకొనుము.

**అనులేపనమంత్రము –**

**శ్లో॥ శ్రీఖండచూర్ణం సుస్నిగ్ధం కస్తూరీకుంకుమాన్వితమ్ ।**
**సుగంధయుక్తం దేవేశి! గృహ్యతామనులేపనమ్ ॥ 29**

కస్తూరి కుంకుమలు కలది. చిక్కనిది అగు ఈ చందనచూర్ణము మంచి సువాసన కలిగియున్నది. దీనితో చేయు అనులేపనమును ఓ దేవేశి! నీవు గ్రహింపుము.

**ధూపమంత్రము –**

**శ్లో॥ వృక్షనిర్యాససంయుక్తం పార్థివద్రవ్యసంయుతమ్ ।**
**అగ్నిఖండశిఖాజాతం ధూపం దేవి! గృహాణ మే ॥ 30**

ఓ దేవి! ఈ ధూపము చెట్లనుండి వచ్చు జిగురు, భూమిపై దొరుకు సువాసన ద్రవ్యములు కలిసి నిప్పువలన వెలువడుచున్నది. దీనిని నీవు దయతో స్వీకరింపుము.

**దీపమంత్రము –**

**శ్లో॥ అంధకారే భయహరమమూల్యమణిశోభితమ్ ।**
**రత్నప్రదీపం శోభాఢ్యం గృహ్యతాం పరమేశ్వరి! ॥ 31**

ఓ పరమేశ్వరి! చీకటియందు కలుగు భయమును పోగొట్టునది, అమూల్య మణులచే శోభిల్లు ఈ రత్నదీపమును దయతో నీవు స్వీకరింపుము.

**పుష్పమంత్రము –**

**శ్లో॥ పారిజాతప్రసూనం చ గంధచందనచర్చితమ్ ।**
**అతీవ శోభనం రమ్యం గృహ్యతాం పరమేశ్వరి! ॥ 32**

ఓ పరమేశ్వరి! గంధము చందనములు కలది చాలా అందమైన ఈ పారిజాత పుష్పమును సమర్పించుచున్నాను. దీనిని నీవు ప్రతిగ్రహింపుము.

**స్నానీయమంత్రము –**

**శ్లో॥ సుగంధామలకీచూర్ణం సుస్నిగ్ధం సుమనోహరమ్ ।**
**విష్ణుతైలసమాయుక్తం స్నానీయం దేవి! గృహ్యతామ్ ॥ 33**

ఓ దేవి! విష్ణుతైలము గలది, సుమనోహరమైనది అగు సువాసనగల ఉసిరిక పప్పుయొక్క పిండిని తెచ్చితిని. ఈ నలుగుపిండిని నీవు స్వీకరింపుము.

**భూషణమంత్రము –**

**శ్లో॥ అమూల్యరత్నఖచితం కేయూరవలయాదికమ్ ।**
**శశ్వత్సుశోభనం రాధే! గృహ్యతాం భూషణం మమ ॥ 34**

ఓ రాధాదేవి! నేనొసగు ఈ కేయూరములు హస్తవలయములు (గాజులు) మొదలగు భూషణములు అమూల్యమైన రత్నములచే నిర్మితమైనవి. ఎల్లప్పుడు శోభను కలిగించు వీటిని నీవు స్వీకరింపుము.

**నైవేద్యమంత్రము –**

**శ్లో॥ కాలదేశోద్భవం పక్వఫలం వై లడ్డుకాదికమ్ ।**
**పరమాన్నం చ మిష్టాన్నం నైవేద్యం దేవి! గృహ్యతామ్ ॥ 35**

ఆయా కాలములందు ఆయా ప్రదేశములలో పండు ఫలమును, లడ్డులు మొదలైనవాటిని, పరమాన్నమును, మృష్టాన్నమును నైవేద్యముగా నీవు స్వీకరింపుము.

**తాంబూలమంత్రము –**

**శ్లో॥ తాంబూలం చ వరం రమ్యం కర్పూరాదిసువాసితమ్ ।**
**సర్వభోగాధికం స్వాదు తాంబూలం దేవి! గృహ్యతామ్ ॥ 36**

ఓ దేవి! ఈ తాంబూలము కర్పూరాదిసుగంధద్రవ్యవములతో వాసన కలిగియున్నది. రుచిగల ఈ తాంబూలమును నీవు గ్రహింపుము.

**అన్నమంత్రము –**

**శ్లో॥ అశనం రత్నపాత్రస్థం సుస్వాదు సుమనోహరమ్ ।**
**మయా నివేదితం భక్త్యా గృహ్యతాం పరమేశ్వరి! ॥ 37**

ఓ దేవి! రత్నపాత్రలో మనోహరము రుచియైన అన్నమును నీకు నివేదన చేయుచున్నాను. దీనిని దయతో స్వీకరింపుము.

**శయ్యామంత్రము –**

**శ్లో॥ రత్నేంద్రసారఖచితం వహ్నిశుద్ధాంశుకాన్వితమ్ ।**
**పుష్పచందనచర్చాఢ్యం పర్యంకం దేవి! గృహ్యతామ్ ॥ 38**

ఓ తల్లీ! నీకు రత్నములచే నిర్మింపబడిన మంచమును సమర్పించుచున్నాను. దీనిపై పరిశుద్ధమైన వస్త్రముకలదు. అందు పుష్పములు చందనము చల్లితిని. ఇట్టి పర్యంకికాయుక్తమైన శయ్యను నీవు పరిగ్రహింపుము.

**శ్లో॥ ఏవం సంపూజ్య దేవీం తాం దద్యాత్పుష్పాంజలిత్రయమ్ ।**
**యత్నేన పూజయేద్దేవీం నాయికాశ్చ వ్రతే వ్రతీ ॥ 39**

**శ్లో॥ ప్రాగాదిక్రమయోగేన దక్షిణావర్తతః ప్రియే! ।**
**భక్త్యా పంచోపచారేణ సుప్రియాః పరిచారికాః ॥ 40**

**శ్లో॥ మాలవతీం పూర్వకోణే వహ్నికోణే చ మాధవీమ్ ।**
**దక్షిణే రత్నమాలాం చ సుశీలాం నైరృతే సతీమ్ ॥ 41**

**శ్లో॥ పశ్చిమే వై శశికళాం పారిజాతాం చ మారుతే ।**
**పద్మావతీముత్తరే చాథైశాన్యాం సుందరీం తథా ॥ 42**

**శ్లో॥ యూథికామాలతీపద్మమాలాం దద్యాద్ వ్రతే వ్రతీ ।**
**పరీహారం చ కురుతే సామవేదోక్తమేవ చ ॥ 43**

పై విధముగా రాధాదేవిని షోడశోపచారములచే పూజించి ఆ దేవికి మూడుమార్లు పుష్పాంజలిని సమర్పింపవలెను. ఇట్లు రాధాదేవిని పూజించి అటుపిమ్మట దేవికి మిక్కిలి సన్నిహితులైన పరిచారికలను తూర్పుదిశనుండి కుడివైపు అన్ని దిక్కులలోనుంచి పంచోపచారపూజ సల్పవలయును.

తూర్పుదిక్కున మాలావతిని, ఆగ్నేయదిశనుండి మాధవిని, దక్షిణదిశయందు రత్నమాలను, నైరృతిదిక్కున సుశీలను, పడమరదిక్కున శశికళను, వాయవ్యమున పారిజాతను, ఉత్తరమున పద్మావతిని, ఈశాన్యదిశయందు సుందరిని నిలిపి మల్లెలు, మాలతీపుష్పములు, పద్మముల మాలలను వారికి సమర్పించుకొని సామవేదమున కనిపించు పరీహారమును ఈవిధముగా కోరుకొనవలెను.

**- రాధాస్తోత్రమ్ -**

శ్లో॥ త్వం దేవి! జగతాం మాతా విష్ణుమాయా సనాతనీ ।
కృష్ణప్రాణాధిదేవీ చ కృష్ణప్రాణాధికా శుభా ॥ 44

శ్లో॥ కృష్ణప్రేమమయీ శక్తిః కృష్ణే! సౌభాగ్యరూపిణీ ।
కృష్ణభక్తిప్రదే! రాధే! నమస్తే మంగళప్రదే! ॥ 45

శ్లో॥ అద్య మే సఫలం జన్మ జీవనం సార్థకం మమ ।
పూజితాఽసి మయా సా చ యా శ్రీకృష్ణేన పూజితా ॥ 46

శ్లో॥ కృష్ణవక్షసి సా రాధా సర్వసౌభాగ్యసంయుతా ।
రాసే రాసేశ్వరీరూపా బృందా బృందావనే వనే ॥ 47

శ్లో॥ కృష్ణప్రియా చ గోలోకే తులసీకాననే తు యా ।
చంపావతీ కృష్ణసంగే క్రీడా చంపకకాననే ॥ 48

శ్లో॥ చంద్రావలీ చంద్రవనే శతశృంగే సతీతి చ ।
విరజాదర్పహంత్రీ చ విరజాతటకాననే ॥ 49

శ్లో॥ పద్మావతీ పద్మవనే కృష్ణా కృష్ణసరోవరే ।
భద్రా కుంజకుటీరే చ కామ్యా వై కామ్యకే వనే ॥ 50

శ్లో॥ వైకుంఠే చ మహాలక్ష్మీర్వాణీ నారాయణోరసి ।
క్షీరోదే సింధుకన్యా చ మర్త్యే లక్ష్మీః హరిప్రియా ॥ 51

శ్లో॥ సర్వస్వర్గే స్వర్గలక్ష్మీర్దేవదుఃఖవినాశినీ ।
సనాతనీ విష్ణుమాయా దుర్గా శంకరవక్షసి ॥ 52

శ్లో॥ సావిత్రీ వేదమాతా చ కలయా బ్రహ్మవక్షసి ।
కలయా ధర్మపత్నీ త్వం నరనారాయణప్రభోః ॥ 53

శ్లో॥ కలయా తులసీ త్వం చ గంగా భువనపావనీ ।
లోమకూపోద్భవా గోప్యః కలాంశా రోహిణీ రతిః ॥ 54

శ్లో॥ కలాకలాంశరూపా చ శతరూపా శచీ దితిః ।
అదితిర్దేవమాతా చ త్వత్కలాంశా హరిప్రియా ॥ 55

శ్లో॥ దేవ్యశ్చ మునిపత్న్యశ్చ త్వత్కలాకలయా శుభే ।
కృష్ణభక్తిం కృష్ణదాస్యం దేహి మే కృష్ణపూజితే ॥ 56

శ్లో॥ ఏవం కృత్వా పరీహారం స్తుత్వా చ కవచం పఠేత్ ।
పురా కృతం స్తోత్రమేతద్భక్తిదాస్యప్రదం శుభమ్ ॥ 57

ఓ తల్లీ! నీవు జగన్మాతవు. విష్ణుమాయవు. సనాతనివి, శ్రీకృష్ణునకు ప్రాణాధికురాలవు. కృష్ణప్రేమస్వరూపిణివి, శక్తివి, కృష్ణసౌభాగ్య రూపిణివి, మంగళప్రదురాలవు, శ్రీకృష్ణభక్తిని కలిగించు నీకు నమస్కారము.

శ్రీకృష్ణపరమాత్మ పూజించిన నిన్ను నేను పూజించుట నా అదృష్టమువలన జరిగినది. దీనివలన నా జన్మకు సార్థక్యమేర్పడినది. నాజన్మ సఫలమైనది.

సమస్తసౌభాగ్యములు కల నీవు శ్రీకృష్ణుని సమీపమున రాధగాను, రాసమండలమున రాసేశ్వరిగాను, బృందావనమున బృందాదేవిగాను, గోలోకమున కృష్ణప్రియగాను, తులసీవనమున తులసిగాను, శ్రీకృష్ణుని సమీపమున చంపావతిగాను, చంపకావనమున క్రీడగాను, చంద్రవనమున చంద్రావళిగాను, శతశృంగపర్వతమున సతిగాను, విరజానదియొక్క తీరముననున్న వనమున విరజాదేవిగాను, పద్మవనమున పద్మావతిగాను, కృష్ణసరోవరమున కృష్ణగా, కుంజకుటీరమున భద్రగా, కామ్యకవనమున కామ్యగా, వైకుంఠమున మహాలక్ష్మిగా, నారాయణుని సమీపమున సరస్వతిగా, గంగగా, పాలసముద్రమున సింధుకన్యగా, భూలోకమున శ్రీహరి ప్రియురాలగు లక్ష్మీదేవిగా, స్వర్గమున దేవతల దుఃఖములను బాపు స్వర్గలక్ష్మిగా, శంకరుని సమీపమున సనాతని, విష్ణుమాయయగు దుర్గగా, బ్రహ్మదేవుని సమీపమున నీ అంశరూపము వేదమాతయగు సావిత్రిగా, అట్లే ధర్ముని సమీపమున అంశరూపిణియైన ధర్మపత్నిగా, నరనారాయణులకు మాతగా, నీ కళయైన తులసిగా, గంగగా, పరమాత్మయొక్క రోమకూపములనుండి జన్మించిన గోపికలుగా, నీ అంశాంశాలైన శతరూప, దితి, శచి, అదితి, మొదలగు రూపములతో నున్నావు. దేవతాస్త్రీలు, మునిపత్నులు నీ అంశాంశ స్వరూపాలే.

అట్టి నీవు నాకు కృష్ణభక్తిని శ్రీకృష్ణునకు సేవచేయు పరమ సౌభాగ్యమును కలిగింపుము.

ఈ విధముగా పరీహారమును చేసికొని రాధాదేవిని స్తుతించి ఆమె కవచమును చదువవలెను.

పూర్వమున చేయబడిన ఈ రాధాస్తోత్రము శ్రీకృష్ణభక్తిని, శ్రీకృష్ణ దాస్యమును, కలిగించును.

శ్లో॥ ఏవం నిత్యం పూజయేద్యో విష్ణుతుల్యః స భారతే ।
జీవన్ముక్తశ్చ పూతశ్చ గోలోకం యాతి నిశ్చితమ్ ॥ 58

ఈవిధముగా ప్రతిదినము రాధాదేవిని పూజించువాడు విష్ణుమూర్తితో సమానుడగును. ఆతడు జీవన్ముక్తుడై పవిత్రుడై మరణించిన తరువాత గోలోకమునకు పోవును.

శ్లో॥ కార్తికే పూర్ణిమాయాం చ రాధాం యః పూజయేత్ శివే ।
ఏవం క్రమేణ ప్రత్యబ్దం రాజసూయఫలం లభేత్ ॥ 59

శ్లో॥ పరమైశ్వర్యయుక్తః స్యాదిహ లోకే స పుణ్యవాన్ ।
సర్వపాపాద్వినిర్ముక్తో యాత్యంతే విష్ణుమందిరమ్ ॥ 60

శ్లో॥ ఆదావేవం క్రమేణైవ రాసే బృందావనే వనే ।
స్తుతా సా పూజితా రాధా శ్రీకృష్ణేన పురా సతీ ॥ 61

శ్లో॥ సంపూజితా ద్వితీయే చ ధాత్రా త్వేవం క్రమేణ చ ।
త్వద్వరేణ చ సంప్రాప్య విధాతా వేదమాతరమ్ ॥ 62

శ్లో॥ నారాయణో మహాలక్ష్మీం ప్రాప సంపూజ్య భారతీమ్ ।
గంగాం చ తులసీం చైవ పరాం భువనపావనీమ్ ॥ 63

శ్లో॥ విష్ణుః క్షీరోదశాయీ చ ప్రాప సింధుసుతాం తథా ।
మృతాయాం దక్షకన్యాయాం మయా కృష్ణాజ్ఞయా పురా ॥ 64

శ్లో॥ త్వమేవ దుర్గా సంప్రాప్తా పూజితా పుష్కరే చ సా ।
అదితిం కశ్యపః ప్రాప చంద్రః సంప్రాప రోహిణీమ్ ॥ 65

శ్లో॥ కామో రతిం చ సంప్రాప ధర్మో మూర్తిం పతివ్రతామ్ ।
దేవాశ్చ మునయశ్చైవ యాం సంపూజ్య పతివ్రతామ్ ॥ 66

శ్లో॥ సంప్రాపుర్యద్వరేణైవ ధర్మకామార్థమోక్షకమ్ ।
ఏవం పూజావిధానం చ కథితం చ స్తవం శృణు ॥ 67

కార్తికమాసమున పూర్ణిమనాడు రాధాదేవిని పూజింపవలెను. ఈ విధముగా ప్రతి సంవత్సరము ఆ దేవిని పూజించినచో రాజసూయయాగఫలము కలుగును. ఈ లోకమున అంతులేని సంపదను పొంది పుణ్యవంతుడై పాపములు పోగా విష్ణుమూర్తి సమీపమునకు పోవును.

ఆ రాధాదేవిని ఈ విధముగా కార్తికపూర్ణిమనాడు బృందావనమున శ్రీకృష్ణుడు పూజించెను. అటుపిమ్మట బ్రహ్మదేవుడు ఈ దేవిని శ్రీకృష్ణదేవుడు పూజించినట్లే పూజించి ఆ దేవియొక్క అనుగ్రహమువలన వేదములకు తల్లియైన సావిత్రీదేవిని భార్యగా పొందెను. అటుపిమ్మట నారాయణుడా మాతను పూజించి ఆమెయొక్క అనుగ్రహమువలన మహాలక్ష్మిని, సరస్వతీదేవిని, గంగాదేవిని, తులసీదేవిని భార్యలుగా పొందగలిగెను.

క్షీరసముద్రమున పవళించియున్న శ్రీమహావిష్ణువు సింధుసుతను భార్యగా పొందగా నేను శ్రీకృష్ణునియొక్క ఆజ్ఞవలన ఆ మహాదేవిని పూజించి దక్షయజ్ఞమున దక్షుని కూతురైన సతీదేవి మృతిచెందిన తరువాత నిన్ను భార్యగా పొందితిని. అట్లే కశ్యపముని అదితిని, చంద్రుడు రోహిణిని, మన్మథుడు రతిని, ధర్ముడు మూర్తీదేవిని, దేవతలు మునులు కూడా ఆ దేవిని పూజించి ధర్మార్థకామమోక్షములను పొందగలిగిరి.

ఓ భవానీ! రాధాదేవి పూజావిధానమిట్లుండును,

శ్లో॥ ఏకదా మానినీ రాధా బభూవాగోచరా ప్రభోః ।
సంసక్తస్య తులస్యాం చ గోప్యాం చ తులసీవనే ॥ 68

శ్లో॥ సా సంహృత్య స్వమూర్తీశ్చ కలాః సర్వాశ్చ లీలయా ।
సర్వే బభూవుర్దేవాశ్చ బ్రహ్మవిష్ణుశివాదయః ॥ 69

శ్లో॥ భ్రష్టైశ్వర్యాశ్చ నిశ్శ్రీకా భార్యాహీనా హ్యుపద్రుతాః ।
తే చ సర్వే సమాలోచ్య శ్రీకృష్ణం శరణం యయుః ॥ 70

శ్లో॥ **తేషాం స్తోత్రేణ సంతుష్టః స్నాత్వా సంపూజ్య తాం శుచిః ।**
**తుష్టావ పరమాత్మా స సర్వేషాం రాధికాం సతీమ్ ॥** **71**

శ్రీకృష్ణుడు తులసీవనములో తులసియను గోపికతో తిరుగుచుండగా రాధాదేవి చూచి అభిమానవతిగావున, తాను తనయొక్క అంశలు అంశాంశలగు దేవతా స్త్రీలందరితో కలిసి మాయమయ్యెను. అందువలన బ్రహ్మవిష్ణుశివాది దేవతలు తమతమ ఐశ్వర్యములను కోల్పోయి భార్యావిహీనులైరి. అందువలన వారందరు కలిసి ఆలోచించి శ్రీకృష్ణపరమాత్మను శరణువేడుకొనిరి. దేవతలందరు తన్ను స్తోత్రము చేయగా సంతోషపడిన శ్రీకృష్ణపరమాత్మ వారి బాధలు పోగొట్టుటకై తాను స్నానము చేసి శుచియై రాధాదేవిని పూజించి ఆమెతో ఇట్లనెను.

శ్రీకృష్ణ ఉవాచ – శ్రీకృష్ణుడు ఇట్లనెను –

శ్లో॥ ఏవమేవ ప్రియోఽహం తే ప్రమోదశ్చైవ తే మయి ।
సువ్యక్తమద్య కాపట్యవచనం తే వరాననే ॥ **72**

శ్లో॥ హే కృష్ణ! త్వం మమ ప్రాణా జీవాత్మేతి చ సంతతమ్ ।
యద్బ్రూహి నిత్యం ప్రేమ్ణా త్వం సాంప్రతం తద్గతం ద్రుతమ్ ॥ **73**

శ్లో॥ అస్మాకం వచనం సత్యం యద్బ్రవీమి చ తత్ ధ్రువమ్ ।
పంచప్రాణాధిదేవీ త్వం రాధా ప్రాణాధికేతి మే ॥ **74**

శ్లో॥ శక్తో న రక్షితుం త్వాం చ యాంతి ప్రాణాస్త్వయా వినా ।
వినాఽధిష్ఠాతృదేవీ చ కో వా కుత్ర చ జీవతి ॥ **75**

శ్లో॥ తస్మాత్సర్వమలీకం తే వచనం జగదంబికే ।
క్షురధారం చ హృదయం స్త్రీజాతీనాం చ సర్వతః ॥ **76**

శ్లో॥ మహావిష్ణోశ్చ మాతా త్వం మూలప్రకృతిరీశ్వరీ ।
సగుణా త్వం చ కలయా నిర్గుణా స్వయమేవ తు ॥ **77**

శ్లో॥ జ్యోతీరూపా నిరాకారా భక్తానుగ్రహవిగ్రహా ।
భక్తానాం రుచివైచిత్ర్యాన్నానామూర్తీశ్చ బిభ్రతీ ॥ **78**

శ్లో॥ మహాలక్ష్మీశ్చ వైకుంఠే భారతీ చ సతాం ప్రసూః ।
పుణ్యక్షేత్రే భారతే చ సతీ త్వం పార్వతీ తథా ॥ **79**

శ్లో॥ తులసీ పుణ్యరూపా చ గంగా భువనపావనీ ।
బ్రహ్మలోకే చ సావిత్రీ కలయా త్వం వసుంధరా ॥ **80**

శ్లో॥ గోలోకే రాధికా త్వం చ సర్వగోపాలకేశ్వరీ ।
త్వయా వినాఽహం నిర్జీవో హ్యశక్తః సర్వకర్మసు ॥ **81**

శ్లో॥ శివః శక్తస్త్వయా శక్త్యా శవాకారస్త్వయా వినా ।
వేదకర్తా స్వయం బ్రహ్మా వేదమాత్రా త్వయా సహ ॥ **82**

శ్లో॥ నారాయణస్త్వయా లక్ష్మ్యా జగత్పాతా జగత్పతిః ।
ఫలం దదాతి యజ్ఞశ్చ త్వయా దక్షిణయా సహ ॥ 83

శ్లో॥ బిభర్తి సృష్టిం శేషశ్చ త్వాం కృత్వా మస్తకే భువమ్ ।
బిభర్తి గంగారూపాం త్వాం మూర్ధ్ని గంగాధరః శివః ॥ 84

శ్లో॥ శక్తిమచ్చ జగత్సర్వం శవరూపం త్వయా వినా ।
వక్తా సర్వస్త్వయా వాణ్యా సూతో మూకస్త్వయా వినా ॥ 85

'నేను నీకు చాలా ఇష్టమైనవాడను. నీకు నాపై చాలా ప్రేమకలదు' అని నీవెప్పుడు నాతో అనుచుంటివి. ప్రస్తుతము నీవు చేసిన పనివలన నీ మాటలు కల్లలని నాకు తోచుచున్నవి. అట్లే "ఓ కృష్ణుడా! నీవు నా ప్రాణములవంటివాడవు, జీవాత్మవు" అని ఎల్లప్పుడు చెప్పుచుంటివి. అవన్ని అబద్ధములుగా కన్పించుచున్నవి. ఓ రాధాదేవి! స్త్రీల మనస్సు కత్తి అంచువలె ఇతరులను బాధపెట్టునను నా మాట ఎల్లప్పుడు సత్యమైనదే.

నీవు నాకు ప్రాణములకన్నను మిన్నయైన దానవు. నా పంచప్రాణములకు అధిదేవతవు. నీవు లేక నా ప్రాణము లెగిరిపోవుచున్నవి. ప్రాణములకు అధిష్ఠానదేవత లేక ప్రపంచమున ఎవ్వరుకూడ జీవించరు. అట్లే నా ప్రాణాధిష్ఠానదేవతవగు నీవు లేక నేను బ్రతుకుట దుర్లభము.

నీవు మూలప్రకృతి స్వరూపిణివి, ఈశ్వరివి, శ్రీమహావిష్ణువునకు తల్లివి. నీవు స్వయముగా నిర్గుణురాలవైనను నీ అంశస్వరూపముచే సగుణవుగా కన్పించుచున్నావు. నీవు జ్యోతిస్స్వరూపమున నున్నావు. నిరాకారమైనను భక్తులనెల్లప్పుడు అనుగ్రహించుటకు ఆకారమును ధరించితివి. నీవు భక్తుల అభిరుచులనుబట్టి అనేక రూపములను ధరించితివి.

నీవు వైకుంఠమున మహాలక్ష్మిగా, మహాసరస్వతిగా కన్పించుచున్నావు. పుణ్యభూమియగు భారతక్షేత్రమున నీవు సతీదేవిగా, పార్వతీదేవిగా, పుణ్యమూర్తియైన తులసిగా, సమస్తలోకములను పవిత్రముచేయు గంగగా మారితివి. నీవు బ్రహ్మలోకమున సావిత్రిగాను, నీ అంశరూపముతో భూమిగాను, గోలోకమున సమస్తగోపాలురకు ఈశ్వరివగు రాధగా నున్నావు.

నీవు లేనిచో నేను ప్రాణములు లేనివాడను. ఏపని చేయుటకైనను అసమర్థుడను. అట్లే శివుడు శక్తిస్వరూపిణివగు నీవలననే శక్తిమంతుడగుచున్నాడు. నీవు లేనిచో అతడు శవమువలె సర్వశక్తులను కోల్పోవును. నీవలననే బ్రహ్మదేవుడు వేదములను దర్శింపగలిగెను.

నీవలననే నారాయణుడు మహాలక్ష్మీసమేతుడై సమస్తలోకములను రక్షించుచు జగత్పతియైనాడు. ఆదిశేషుడు నీవలన సమస్తలోకములను తన శిరస్సుపై ధరించ గలుగుచున్నాడు. అట్లే శివుడు గంగను ధరించి గంగాధరుడాయెను. నీవుండినచో ప్రపంచమంతయు శక్తి కలిగియుండును. నీవు లేనిచో ఇది శవమువలె సర్వశక్తులను కోల్పోగలదు. అట్లే నీవలననే అందరు వక్తలగుచున్నారు. నీవు లేనిచో అందరు మూగవా రగుదురు.

శ్లో॥ యథా మృదా ఘటం కర్తుం కులాలః శక్తిమాన్ సదా ।
సృష్టిం స్రష్టుం తథాఽహం చ ప్రకృత్యా చ త్వయా సహ ॥ 86

శ్లో॥ త్వయా వినా జడశ్చాహం సర్వత్ర చ న శక్తిమాన్ ।
సర్వశక్తిస్వరూపా త్వం త్వమాగచ్ఛ మమాంతికమ్ ॥ 87

శ్లో॥ వహ్నౌ త్వం దాహికా శక్తిః నాగ్నిశ్శక్తస్త్వయా వినా ।
శోభాస్వరూపా చంద్రే త్వం త్వాం వినా న స సుందరః ॥ 88

శ్లో॥ ప్రభారూపా హి సూర్యే త్వం త్వాం వినా న స భానుమాన్ ।
న కామః కామినీబంధుస్త్వయా రత్యా వినా ప్రియే ॥ 89

శ్లో॥ ఇత్యేవం స్తవనం కృత్వా తాం సంప్రాప జగత్ప్రభుః ।
దేవా బభూవుః సశ్రీకాః సభార్యాః శక్తిసంయుతాః ॥ 90

శ్లో॥ సస్త్రీకం చ జగత్సర్వం సమభూచ్ఛైలకన్యకే ।
గోపీపూర్ణశ్చ గోలోకో హ్యభవత్తత్ప్రసాదతః ॥ 91

కుమ్మరివాడు మట్టితో కుండలు చేయునట్లే ప్రకృతిరూపిణివగు నీ వలన నేను సమస్తసృష్టిని చేయగలుగుతున్నాను. నీవు లేనిచో జడునివలె శక్తినంతయు కోల్పోవుదును. అందువలన సర్వశక్తి స్వరూపిణివగు నీవు నా దగ్గరకు రమ్ము. దాహికాశక్తి లేక అగ్నిదేవుడు కాల్చలేడు. ఆ దాహికాశక్తివి నీవే. అట్లే శోభాస్వరూపిణివి అగు నీవులేనిచో చంద్రుడు సుందరుడుగా కన్పించడు. కాంతిరూపిణివైన నీవు లేనిచో సూర్యుడు కిరణములను కోల్పోవును. అదేవిధముగా రతీస్వరూపిణివగు నీవులేక మన్మథుడు కామినీబంధువు కాజాలడు.

ఈ విధముగా శ్రీకృష్ణపరమాత్మ రాధాదేవిని స్తుతించి ఆమెను తిరిగి పొందెను. రాధాదేవి కన్పించగానే అంతవరకు అదృశ్యముగా నున్న దేవతాస్త్రీలందరు కన్పించిరి. అందువలన దేవతలందరు శోభతో శక్తితో భార్యలతో కలిసియుండిరి. ప్రపంచమున స్త్రీలందరు దర్శనమొసగిరి. ఇట్లు గోలోకము గోపికాస్త్రీలచే నిండిపోయినది.

శ్లో॥ రాజా జగామ గోలోకమితి స్తుత్వా హరిప్రియామ్ ।
శ్రీకృష్ణేన కృతం స్తోత్రం రాధాయా యః పఠేన్నరః ॥ 92

శ్లో॥ కృష్ణభక్తిం చ తద్దాస్యం సంప్రాప్నోతి న సంశయః ।
స్త్రీవిచ్ఛేదే యః శృణోతి మాసమేకమిదం శుచిః ॥ 93

శ్లో॥ అచిరాల్లభతే భార్యాం సుశీలాం సుందరీం సతీమ్ ।
భార్యాహీనో భాగ్యహీనో వర్షమేకం శృణోతి యః ॥ 94

శ్లో॥ అచిరాల్లభతే భార్యాం సుశీలాం సుందరీం సతీమ్ ।
పురా మయా చ త్వం ప్రాప్తా స్తోత్రేణానేన పార్వతి! ॥ 95

శ్లో॥ మృతాయాం దక్షకన్యాయామాజ్ఞయా పరమాత్మనః ।
స్తోత్రేణానేన సంప్రాప్తా సావిత్రీ బ్రహ్మణా పురా ॥ 96

శ్లో॥ పురా దుర్వాససః శాపాత్ నిఃశ్రీకే దేవతాగణే ।
స్తోత్రేణానేన దేవైస్తైః సంప్రాప్తా శ్రీః సుదుర్లభా ॥ 97

శ్లో॥ శృణోతి వర్షమేకం చ పుత్రార్థో లభతే సుతమ్ ।
మహావ్యాధీ రోగముక్తో భవేత్ స్తోత్రప్రసాదతః ॥ 98

శ్లో॥ కార్తికే పూర్ణిమాయాం తు తాం సంపూజ్య పఠేత్తు యః ।
అచలాం శ్రియమాప్నోతి రాజసూయఫలం లభేత్ ॥ 99

శ్లో॥ నారీ శృణోతి చేత్ స్తోత్రం స్వామిసౌభాగ్యసంయుతా ।
భక్త్యా శృణోతి యః స్తోత్రం బంధనాన్ముచ్యతే ధ్రువమ్ ॥ 100

శ్లో॥ నిత్యం పఠతి యో భక్త్యా రాధాం సంపూజ్య భక్తితః ।
స ప్రయాతి చ గోలోకం నిర్ముక్తో భవబంధనాత్ ॥ 101

రాజైన సుయజ్ఞుడు రాధాదేవిని ఈ విధముగా స్తుతించి గోలోకమునకు పోయెను.

శ్రీకృష్ణుడు స్తుతించిన ఈ రాధాస్తోత్రమును ఎవరు పఠింతురో అతనికి తప్పక శ్రీకృష్ణభక్తి, శ్రీకృష్ణదాస్యము లభింపగలదు. భార్యవియోగసమయమున ఈ స్తోత్రమును ఒక నెలవరకు వినినచో (చదివినచో) అట్లే భార్యారహితుడు, భాగ్యములేనివాడు దీనిని సంవత్సరమువరకు విన్నచో (చదివినచో) త్వరగా భార్యను పొందును. నేనుకూడ దక్షయజ్ఞమున సతీస్వరూపిణివగు నీవు చనిపోయినపుడు శ్రీకృష్ణపరమాత్మయొక్క ఆజ్ఞవలన ఈ స్తోత్రము పఠించి నిన్ను పొందితిని. అదేవిధముగా దుర్వాసమహర్షి శాపమువలన దేవతలు లక్ష్మిని కోల్పోవగా ఈ స్తోత్రమువలన తిరిగి శ్రీని పొందిరి. పుత్రులు కావలెనని అనుకొనువాడు, మహారోగముతో బాధపడువాడు ఈ స్తోత్రమును సంవత్సరమువరకు నియమముతో విన్నచో సంతానమును పొందును. మహావ్యాధి నిర్ముక్తుడు కూడా అగును.

కార్తికమాసమున పూర్ణిమనాడు రాధాదేవిని పూజించి ఈ స్తోత్రమును చదివినచో అంతులేని సంపదను, రాజసూయయాగమువలన లభించు ఫలితము లభించును.

స్త్రీలు ఈ స్తోత్రమును విన్నచో భర్తవలన సకలసౌఖ్యములు పొందుదురు. సంసార బంధమునుండి విముక్తులగుదురు.

ఈ స్తోత్రమును ప్రతిదినము రాధాదేవిని పూజించి చదువువారు భవబంధమును ఛేదించుకొని గోలోకమును చేరుకొనెదరు.

ఇతి శ్రీబ్రహ్మవైవర్తే మహాపురాణే ద్వితీయే ప్రకృతిఖండే నారద నారాయణ సంవాదాంతర్గత హరగౌరీ సంవాదే శ్రీరాధికోపాఖ్యానే రాధాపూజాస్తోత్రాదికథనం నామ పంచపంచాశత్తమోఽధ్యాయః ॥



శ్రీః

## షట్పంచాశత్తమోఽధ్యాయః - రాధాకవచము

శ్రీపార్వత్యువాచ - పార్వతీదేవి (మహేశునితో) నిట్లు పలికెను-

శ్లో॥ పూజావిధానం స్తోత్రం చ శ్రుతమత్యద్భుతం మయా ।
అధునా కవచం బ్రూహి శ్రోష్యామి త్వత్ప్రసాదతః ॥ 1

మహేశ్వరా! రాధాదేవియొక్క పూజావిధానమును ఆ దేవియొక్క స్తోత్రమును చక్కగా తెలిపితిరి. నాకు ఇప్పుడు రాధాదేవియొక్క కవచమును తెలుపగలరు.

మహేశ్వర ఉవాచ – మహేశ్వరుడు పార్వతితో ఇట్లనెను–

శ్లో॥ శృణు వక్ష్యామి హే దుర్గే! కవచం పరమాద్భుతమ్ ।
పురా మహ్యాం నిగదితం గోలోకే పరమాత్మనా ॥ 2

శ్లో॥ అతిగుహ్యం పరం తత్త్వం సర్వమంత్రౌఘవిగ్రహమ్ ।
యద్ధృత్వా పఠనాద్బ్రహ్మా సంప్రాప్తో వేదమాతరమ్ ॥ 3

శ్లో॥ యద్ధృత్వాఽహం తవ స్వామీ సర్వమాతా సురేశ్వరీ ।
నారాయణశ్చ యద్ధృత్వా మహాలక్ష్మీమవాప సః ॥ 4

శ్లో॥ యద్ధృత్వా పరమాత్మా చ నిర్గుణః ప్రకృతేః పరః ।
బభూవ శక్తిమాన్ కృష్ణః సృష్టిం కర్తుం పురా విభుః ॥ 5

శ్లో॥ విష్ణుః పాతా చ యద్ధృత్వా సంప్రాప్తస్సింధుకన్యకామ్ ।
శేషో బిభర్తి బ్రహ్మాండం మూర్ధ్ని సర్షపవద్యతః ॥ 6

శ్లో॥ ప్రత్యేకం లోమకూపేషు బ్రహ్మాండాని మహాన్విరాట్ ।
బిభర్తి ధారణాద్యస్య సర్వాధారో బభూవ సః ॥ 7

శ్లో॥ యద్ధారణాచ్చ పఠనాద్ధర్మః సాక్షీ చ సర్వతః ।
యద్ధారణాత్కుబేరశ్చ ధనాధ్యక్షశ్చ భారతే ॥ 8

శ్లో॥ ఇంద్రః సురాణామీశశ్చ పఠనాద్ధారణాద్విభుః ।
నృపాణాం మనురీశశ్చ పఠనాద్ధారణాద్విభుః ॥ 9

శ్లో॥ శ్రీమాంశ్చంద్రశ్చ యద్ధృత్వా రాజసూయం చకార సః ।
స్వయం సూర్యస్త్రిలోకేశః పఠనాద్ధారణాద్ధరిః ॥ 10

శ్లో॥ యద్ధృత్వా పఠనాదగ్నిః జగత్పూతం కరోతి చ ।
యద్ధృత్వా వాతి వాతోఽయం పునాతి భువనత్రయమ్ ॥ 11

శ్లో॥ యద్ధృత్వా చ స్వతంత్రో హి మృత్యుశ్చరతి జంతుషు ।
త్రిఃసప్తకృత్వో నిఃక్షత్రాం చకార చ వసుంధరామ్ ॥ 12

శ్లో॥ జామదగ్న్యశ్చ రామశ్చ పఠనాద్ధారణాత్ప్రభుః ।
యయౌ సముద్రం యద్ధృత్వా రాజసూయం చకార సః ।
పపౌ సముద్రం యద్ధృత్వా పఠనాత్కుంభసంభవః ॥ 13

శ్లో॥ సనత్కుమారో భగవాన్ యద్ధృత్వా జ్ఞానినాం గురుః ।
జీవన్ముక్తౌ చ సిద్ధౌ చ నరనారాయణావృషీ ॥ 14

శ్లో॥ యద్ధృత్వా పఠనాత్సిద్ధో వసిష్ఠో బ్రహ్మపుత్రకః ।
సిద్ధేశః కపిలో యస్మాత్ యస్మాద్దక్షః ప్రజాపతిః ॥ 15

శ్లో॥ యస్మాద్భృగుశ్చ మాం ద్వేష్టి కూర్మః శేషం బిభర్తి చ ।
సర్వాధారో యతో వాయుర్ వరుణః పవనో యతః ॥ 16

శ్లో॥ ఈశానో దిక్పతిశ్చైవ యమః శాస్తా యతః శివే ।
కాలః కాలాగ్నిరుద్రశ్చ సంహర్తా జగతాం యతః ॥ 17

శ్లో॥ యద్ధృత్వా గౌతమః సిద్ధః కశ్యపశ్చ ప్రజాపతిః ।
వసుదేవసుతాం ప్రాప చైకాంశేన తు తత్కలామ్ ॥ 18

శ్లో॥ పురా స్వజాయావిచ్ఛేదే దుర్వాసా మునిపుంగవః ।
సంప్రాప రామః సీతాం చ రావణేన హృతాం పురా ॥ 19

శ్లో॥ పురా నలశ్చ సంప్రాప దమయంతీం యతః సతీమ్ ।
శంఖచూడో మహావీరో దైత్యానామీశ్వరో యతః ॥ 20

ఓ దుర్గాదేవి! పూర్వము నాకు శ్రీకృష్ణపరమాత్మ తెలిపిన రాధా కవచమును నీకు చెప్పెదను. అది పరమాద్భుతమైనది. మిక్కిలి రహస్యమైనది. సమస్తమంత్రములే మూర్తీభవించినట్లున్నది. పరతత్త్వరూపమైనది.

ఈ రాధాదేవి కవచమును పఠించుచు బాహుమూలమున దానిని ధరించుట వలననే బ్రహ్మదేవుడు వేదములకన్నిటికి తల్లియగు సావిత్రీదేవిని పొందెను. నేను నీకు భర్తనైతిని. నారాయణుడు మహాలక్ష్మీదేవికి భర్త అయ్యెను. రాధాకవచమును ధరించి పఠించుచున్నందువలననే పరమాత్మ. నిర్గుణరూపుడు, ప్రకృతికంటె శ్రేష్ఠుడగు శ్రీకృష్ణుడు సృష్టిరచన చేయుచున్నాడు. విష్ణుమూర్తి సర్వజన రక్షకుడు సింధుకన్యకాపతి యయ్యెను. ఆదిశేషుడు ఈ బ్రహ్మాండమునంతయు తన శిరస్సుపై ఆవగింజను మోయుచున్నట్లు అవలీలగా మోయుచున్నాడు. మహావిరాట్స్వరూపుడగు శ్రీమహావిష్ణువు తన రోమ కూపములందు బ్రహ్మాండములన్నిటిని ధరించి సర్వాధారుడు కాగలిగెను. ధర్మదేవతసైతము ఈ కవచమును ధరించినందువలన పఠించుచున్నందువలన సర్వసాక్షిగా అయ్యెను. ఈ కవచముయొక్క మహిమవల్లనే కుబేరుడు ధనపతిగాను, ఇంద్రుడు దేవతాపతిగాను, మనువు మానవులందరకు అధిపతిగాను, సూర్యుడు ముల్లోకములయందు పూజితుడుగాను, అగ్నిదేవుడు పరమపవిత్రుడుగానున్నారు. వాయుదేవుడు ఈ కవచముయొక్క మహిమవలన ముల్లోకములను పవిత్రము చేయగల్గుచున్నాడు. మృత్యువు అందరను సమానముగా చూచుచున్నాడు. జమదగ్ని మహర్షి పుత్రుడైన పరశురాముడు ఇరువదియొక్కమారులు ఈ భూమండలమంతయు తిరిగి దీనిని క్షత్రియరహితముగా చేయగలిగెను. సనత్కుమారముని మిక్కిలి జ్ఞానవంతు డాయెను. నరనారాయణ ఋషులు జీవన్ముక్తులు, సిద్ధులైనారు. వసిష్ఠుడు బ్రహ్మదేవుని పుత్రుడయ్యెను. దీనివలననే కపిలమహర్షి సిద్ధేశుడుగను, దక్షుడు ప్రజాపతిగాను, భృగుమహర్షి నన్ను ద్వేషించునంతవాడుగాను, ఆదికూర్మము ఆదిశేషుని భరించువాడు గనునైరి. వాయుదేవుడు సర్వాధారుడయ్యెను. ఈశ్వరుడు దిక్పాలకుడయ్యెను. యమధర్మరాజు సమస్తమును శాసించగలుగుచున్నాడు. కాలుడు, కాలాగ్ని రుద్రుడు సమస్తజగములను సంహరింపగల్గిరి. ఈ కవచము యొక్క ప్రభావము వలన గౌతముడు, సిద్ధుడుగాను, కశ్యపముని ప్రజాపతిగాను కాగలిగిరి. దుర్వాసమహాముని తన భార్య గతించినపుడు రాధాదేవి అంశగల స్త్రీని భార్యగా పొందెను. అట్లే రామచంద్రుడు రావణాసురునిచే అపహరింపబడిన సీతాదేవిని పొందగలిగెను. కలిదోషమువలన దూరమైన తన భార్యను నలుడు పొందగలిగెను. ఈ కవచముయొక్క గొప్పతనము వలన శంఖచూడుడను మహావీరుడు దానవవీరుడు కాగలిగెను.

శ్లో॥ వృషో వహతి మాం దుర్గే యతో హి గరుడో హరిమ్ ।
ఏవం సంప్రాప్య సంసిద్ధిం సిద్ధాశ్చ మునయః పురా ॥ 21

శ్లో॥ యద్ధృత్వా చ మహాలక్ష్మీః ప్రదాత్రీ సర్వసంపదామ్ ।
సరస్వతీ సతాం శ్రేష్ఠా యతః క్రీడావతీ రతిః ॥ 22

శ్లో॥ సావిత్రీ వేదమాతా చ యతః సిద్ధిమవాప్నుయాత్ ।
సింధుకన్యా మర్త్యలక్ష్మీర్యతో విష్ణుమవాప సా ॥ 23

శ్లో॥ యద్ధృత్వా తులసీ పూతా గంగా భువనపావనీ ।
యద్ధృత్వా సర్వసస్యాఢ్యా సర్వాధారా వసుంధరా ॥ 24

శ్లో॥ యద్ధృత్వా మనసా దేవీ సిద్ధా వై విశ్వపూజితా ।
యద్ధృత్వా దేవమాతా చ విష్ణుం పుత్రమవాప సా ॥ 25

శ్లో॥ పతివ్రతా చ యద్ధృత్వా లోపాముద్రాఽప్యరుంధతీ ।
లేభే చ కపిలం పుత్రం దేవహూతీ యతః సతీ ॥ 26

శ్లో॥ ప్రియవ్రతోత్తానపాదౌ సుతౌ ప్రాప చ తత్ప్రసూః ।
త్వన్మాతో చాపి సంప్రాప త్వాం దేవీం గిరిజాం యతః ॥ 27

శ్లో॥ ఏవం సర్వే సిద్ధగణాః సర్వైశ్వర్యమవాప్నుయుః ।

శ్రీరాధాదేవియొక్క కవచమాహాత్మ్యము వలన నందీశ్వరుడు నన్ను, గరుత్మంతుడు శ్రీహరిని మోయగలుగుచున్నారు. ఇట్లే మునులు సిద్ధులు ఆ కవచము వలన సిద్ధిని పొందిరి. ఆ కవచమహిమవలన మహాలక్ష్మీదేవి సమస్తసంపదల నొసగగలిగినది. అట్లే సరస్వతీదేవి పరమపూజ్యురాలైనది. రతీదేవి క్రీడాపతియయెను. అదేవిధముగా సావిత్రీదేవి వేదములకు మాతయై సిద్ధిని పొందెను. మర్త్యలక్ష్మియగు సింధుసుత శ్రీమహావిష్ణువును భర్తగా పొందినది. ఆ కవచమహిమవలననే తులసీదేవి పరమపవిత్రమైనది. గంగాదేవి ముల్లోకములను పవిత్రము చేయగలిగినది. అట్లే మనసాదేవి సిద్ధురాలై ప్రపంచమునందంతట పూజలను అందుకొన్నది. దేవమాతయగు అదితీదేవి శ్రీమహావిష్ణువును ఉపేంద్రరూపమున పుత్రునిగా పొందగలిగినది. ఈ కవచమువలననే అరుంధతి మరియు లోపాముద్రలు పతివ్రతలైరి. దేవహూతీదేవి మహావిష్ణురూపుడైన కపిలుని పుత్రునిగా పడసినది. నీ తల్లియగు మేనాదేవి నిన్ను పొందినది.

ఇట్లు రాధాదేవియొక్క కవచమహిమవలన సిద్ధులందరు సమస్తైశ్వర్యములు పొందగలిగిరి.

**- కవచమ్ -**

శ్రీజగన్మంగళస్యాస్య కవచస్య ప్రజాపతిః ॥ 28

శ్లో॥ ఋషిశ్ఛందోఽస్య గాయత్రీ దేవీ రాసేశ్వరీ స్వయమ్ ।
శ్రీకృష్ణభక్తిసంప్రాప్తౌ వినియోగః ప్రకీర్తితః ॥ 29

శ్లో॥ శిష్యాయ కృష్ణభక్తాయ బ్రాహ్మణాయ ప్రకాశయేత్ ।
శఠాయ పరశిష్యాయ దత్త్వా మృత్యుమవాప్నుయాత్ ॥ 30

శ్లో॥ రాజ్యం దేయం శిరో దేయం న దేయం కవచం ప్రియే! ।
కంఠే ధృతమిదం భక్త్యా కృష్ణేన పరమాత్మనా ॥ 31

శ్లో॥ మయా దృష్టం చ గోలోకే బ్రహ్మణా విష్ణునా పురా ।
ఓం రాధేతి చతుర్థ్యంతం వహ్నిజాయాంతమేవ చ ॥ 32

శ్లో॥ కృష్ణేనోపాసితో మంత్రః కల్పవృక్షః శిరోఽవతు ।
ఓం హ్రీం శ్రీం రాధికాం ఙేంతం వహ్నిజాయాంతమేవ చ ॥ 33

శ్లో॥ కపాలం నేత్రయుగ్మం చ శ్రోత్రయుగ్మం సదాఽవతు ।
ఓం ఐం హ్రీం శ్రీం రాధికాయై వహ్నిజాయాంతమేవ చ ॥ 34

శ్లో॥ మస్తకం కేశసంఘాంశ్చ మంత్రరాజః సదాఽవతు ।
ఓం రాం రాధా చతుర్థ్యంతం వహ్నిజాయాంతమేవ చ ॥ 35

శ్లో॥ సర్వసిద్ధిప్రదః పాతు కపోలం నాసికాం ముఖమ్ ।
క్లీం హ్రీం కృష్ణప్రియాం ఙేంతం కంఠం పాతు నమోఽంతకమ్ ॥ 36

శ్లో॥ ఓం రాం రాసేశ్వరీం ఙేంతం స్కంధం పాతు నమోంతకమ్ ।
ఓం రాం రాసవిలాసిన్యై స్వాహా పృష్ఠం సదాఽవతు ॥ 37

శ్లో॥ బృందావనవిలాసిన్యై స్వాహా వక్షః సదాఽవతు ।
తులసీవనవాసిన్యై స్వాహా పాతు నితంబకమ్ ॥ 38

శ్లో॥ కృష్ణప్రాణాధికా ఙేంతం స్వాహాంతం ప్రణవాదికమ్ ।
పాదయుగ్మం చ సర్వాంగం సంతతం పాతు సర్వతః ॥ 39

శ్లో॥ ప్రాచ్యాం రక్షతు సా రాధా వహ్నౌ కృష్ణప్రియాఽవతు ।
దక్షే రాసేశ్వరీ పాతు గోపీశా నైరృతేఽవతు ॥ 40

శ్లో॥ పశ్చిమే నిర్గుణా పాతు వాయవ్యే కృష్ణపూజితా ।
ఉత్తరే సంతతం పాతు మూలప్రకృతిరీశ్వరీ ॥ 41

శ్లో॥ సర్వేశ్వరీ సదైశాన్యాం పాతు మాం సర్వపూజితా ।
జలే స్థలే చాంతరిక్షే స్వప్నే జాగరణే తథా ॥ 42

శ్లో॥ మహావిష్ణోశ్చ జననీ సర్వతః పాతు సంతతమ్ ।

శ్రీజగన్మంగళాకారకమైన ఈ కవచమునకు బ్రహ్మదేవుడు ఋషి, గాయత్రి ఛందస్సు, రాసేశ్వరియగు రాధాదేవి దేవత. శ్రీకృష్ణునియందు భక్తి కలుగుటకై ఈ కవచమును ఉపయోగింపవలెను. దీనిని శ్రీకృష్ణభక్తునకు మాత్రము ఉపదేశము చేయవలెను. దుష్టుడైన ఇతర దేవతాభక్తునకు దీనిని ఉపదేశించినచో ఆ గురువు వెంటనే చనిపోవును. రాజ్యమివ్వవచ్చును. తన ప్రాణమునైన ఇవ్వవచ్చును. కాని అయోగ్యుడగువానికి ఈ కవచమును ఎట్టి పరిస్థితిలోను ఉపదేశింపరాదు.

ఈ కవచమును శ్రీకృష్ణపరమాత్మ తన కంఠమున ధరించెను. నేను, బ్రహ్మ, విష్ణువు కూడ ఈ కవచమును ధరించుచున్నాము.

**ఓం రాధాయై స్వాహా** అను కల్పవృక్షమువంటి మంత్రమును శ్రీకృష్ణుడు ఉపాసన చేసెను. ఈ మంత్రము నా శిరస్సును కాపాడుగాక.

**ఓం హ్రీం శ్రీం రాధికాయై స్వాహా** అను మంత్రము నా శిరస్సును, వెంట్రుకలను ఎల్లప్పుడు రక్షించుగాక.

**ఓం ఐం హ్రీం శ్రీం రాధికాయై స్వాహా** అను మంత్రము నేత్రములను, చెవులను, కపాలమును రక్షించును.

**ఓం రాం రాధాయై స్వాహా** అను మంత్రము నా చెక్కిళ్ళను నాసికను ముఖమును రక్షించుగాక.

**ఓం క్లీం హ్రీం కృష్ణప్రియాయై నమః** అను మంత్రము నా కంఠమును రక్షించుగాక.

**ఓం రాం రాసేశ్వర్యై నమః** అనునది నా భుజములను రక్షించుగాక.

**ఓం రాం రాసవిలాసిన్యై స్వాహా** అను మంత్రము నా వీపును కాపాడుగాక.

**ఓం బృందావనవిలాసిన్యై స్వాహా** అను మంత్రము నా రొమ్మును రక్షించుగాక.

**ఓం తులసీవనవాసిన్యై స్వాహా** అనునది నా నితంబముల రక్షించుగాక.

**ఓం కృష్ణప్రాణాధికాయై స్వాహా** అనునది నా పాదములను సమస్త అవయవములను ఎల్లప్పుడు రక్షించుగాక.

రాధాదేవి నా తూర్పుదిక్కున, కృష్ణప్రియ ఆగ్నేయదిశలో, రాసేశ్వరి దక్షిణ దిశలో, గోపీశ నైరృతిదిశలో, నిర్గుణ పశ్చిమదిశలో, కృష్ణపూజిత వాయవ్యదిశలో, మూలప్రకృతి ఈశ్వరి ఉత్తరదిశలో, సర్వేశ్వరి ఈశాన్యమున, సర్వపూజిత జలమున, స్థలమున, నిద్రించు సమయమున జాగ్రదవస్థలోను నన్ను ఎల్లప్పుడు రక్షించుగాక. శ్రీమహావిష్ణువునకు జననియగు రాధాదేవి నన్ను అన్నివైపులనుండి ఎల్లప్పుడు రక్షించు చుండుగాక.

**కవచం కథితం దుర్గే! శ్రీజగన్మంగలం పరమ్ ॥ 43**



**శ్లో॥ యస్మై కస్మై న దాతవ్యం గుహ్యాద్గుహ్యతరం పరమ్ ।**
**తవ స్నేహాన్మయాఽఽఖ్యాతం ప్రవక్తవ్యం న కస్యచిత్ ॥ 44**

**శ్లో॥ గురుమభ్యర్చ్య విధివద్వస్త్రాలంకారచందనైః ।**
**కంఠే వా దక్షిణే బాహౌ ధృత్వా విష్ణుసమో భవేత్ ॥ 45**

**శ్లో॥ మహోత్సవవిశేషే చ పర్వన్నితి సుకీర్తితా ।**
**తస్యాధిదేవీ యా సా చ పార్వతీ పరికీర్తితా ॥ 46**

**శ్లో॥ పర్వతస్య సుతా దేవీ సాఽఽవిర్భూతా చ పర్వతే ।**
**పర్వతాధిష్ఠాతృదేవీ పార్వతీ తేన కీర్తితా ॥ 47**

**శ్లో॥ సర్వకాలే సనా ప్రోక్తో విస్తృతే చ తనీతి చ ।**
**సర్వత్ర సర్వకాలే చ విద్యమానా సనాతనీ ॥ 48**

శ్లో॥ శతలక్షజపేనైవ సిద్ధం చ కవచం భవేత్ ।
యది స్యాత్ సిద్ధకవచో న దగ్ధో వహ్నినా భవేత్ ॥ 49

శ్లో॥ ఏతస్మాత్కవచాద్దుర్గే రాజా దుర్యోధనః పురా ।
విశారదో జలస్తంభే వహ్నిస్తంభే చ నిశ్చితమ్ ॥ 50

శ్లో॥ మయా సనత్కుమారాయ పురా దత్తం చ పుష్కరే ।
సూర్యపర్వణి మేరౌ చ స సాందీపనయే దదౌ ॥ 51

శ్లో॥ బల్లాయ తేన దత్తం చ దదౌ దుర్యోధనాయ సః ।
కవచస్య ప్రసాదేన జీవన్ముక్తో భవేన్నరః ॥ 52

శ్లో॥ నిత్యం పఠతి భక్త్యేదం తన్మంత్రోపాసకశ్చ యః ।
విష్ణుతుల్యో భవేన్నిత్యం రాజసూయఫలం లభేత్ ॥ 53

శ్లో॥ స్నానేన సర్వతీర్థానాం సర్వదానేన యత్ఫలమ్ ।
సర్వవ్రతోపవాసేన పృథివ్యాశ్చ ప్రదక్షిణైః ॥ 54

శ్లో॥ సర్వయజ్ఞేషు దీక్షాయాం నిత్యం వై సత్యరక్షణే ।
నిత్యం శ్రీకృష్ణసేవాయాం కృష్ణనైవేద్యభక్షణే ॥ 55

శ్లో॥ పాఠే చతుర్ణాం వేదానాం యత్ఫలం చ లభేన్నరః ।
తత్ఫలం లభతే నూనం పఠనాత్కవచస్య చ ॥ 56

శ్లో॥ రాజద్వారే శ్మశానే చ సింహవ్యాఘ్రాన్వితే వనే ।
దావాగ్నౌ సంకటే చైవ దస్యుచౌరాన్వితే భయే ॥ 57

శ్లో॥ కారాగారే విపద్గ్రస్తే ఘోరే చ దృఢబంధనే ।
వ్యాధియుక్తో భవేన్ముక్తో ధారణాత్కవచస్య చ ॥ 58

పార్వతీ! లోకములకు మంగళమును కలిగించు రాధాదేవి కవచమును నీపై గల ప్రేమచే చెప్పితిని. కాని దీనిని అందరకు చెప్పరాదు.

మంత్రోపదేశము చేయుచున్న గురువును శాస్త్రోక్తముగా వస్త్రములు, అలంకారములు చందనము మొదలగు వాటిచే గౌరవించి అతనిచే ఉపదేశించబడిన ఈ కవచమును కుడిచేతితో లేక కంఠమునకో కట్టుకొనవలెను. అట్లు చేసినచో అతడు విష్ణుమూర్తితో సమానుడు అగును...

ఈ కవచము కోటినూర్లు జపించినచో అది సిద్ధించును. కవచము సిద్ధించినచో అతనిని నిప్పు కాల్చలేదు. ఈ కవచముయొక్క సిద్ధి పొందినందువలననే దుర్యోధనుడు జలస్తంభ, వహ్నిస్తంభవిద్యలలో నిష్ణాతుడయ్యెను.

దీనిని నేను పుష్కరక్షేత్రమున సనత్కుమారున కుపదేశింపగా అతడు సూర్యసంక్రమణ సమయమున మేరుపర్వతమున సాందీపనికి ఉపదేశించెను. సాందీపని బల్లున కుపదేశింపగా బల్లుడు దుర్యోధనున కుపదేశించెను.

ఈ కవచముయొక్క మహిమవలన మానవుడు జీవన్ముక్తుడగును. దీనిని ప్రతిదినము చదువుచు

రాధామంత్రమును ఉపాసన చేసినచో అతడు విష్ణుమూర్తితో సమానుడగును. రాజసూయయాగ ఫలితమును కూడ పొందును. సమస్తపుణ్యతీర్థములలో స్నానముచేసినచో, సమస్తదానములు చేసినచో, అన్ని వ్రతములను అనుష్ఠించినచో, భూప్రదక్షిణలు చేసినచో, సమస్తయజ్ఞములు చేసినచో, సత్యధర్మమును చక్కగా పరిపాలించినచో, ప్రతిదినము శ్రీకృష్ణుని అర్చించినచో, శ్రీకృష్ణునకు నివేదితమైన అన్నమును భుజించినచో, నాలుగు వేదములను పఠించినచో కలుగు పుణ్యము ఈ రాధాదేవి కవచమును శ్రద్ధగా పఠించినచో కలుగును.

రాజసన్నిధిలోను, శ్మశానములోను, సింహములు, పులులు మొదలైన క్రూర మృగములున్న అడవిలోను, దావాగ్నియందును, కష్టములందును, దస్యులు చోరులవల్లను, కారాగారమునను, శత్రువులు పైనబడినప్పుడు, దృఢముగా బంధించినపుడు, వ్యాధిగ్రస్తుడైనప్పుడు కలుగు భయమంతయు ఈ కవచమును చదివినంత మాత్రముననే లేక ఈ కవచమును కంఠముననో లేక కుడిచేతికి కట్టుకున్నంతమాత్రమున నశించి పోవును. అతడు జీవన్ముక్తుడు కూడ అగుచున్నాడు.

**శ్లో॥ ఇత్యేతత్కథితం దుర్గే! తవైవేదం మహేశ్వరి! ।**
**త్వమేవ సర్వరూపా మాం మాయా పృచ్ఛసి మాయయా ॥ 59**

ఓ దుర్గా! ఈ విధముగా నీకు శ్రీ రాధాకవచమును తెల్పితిని. నీవు సమస్తము తెలిసినదానవు. సమస్తభూతరూపిణివి. ఐనను నన్ను కావలెనని అడుగుచున్నావని మహేశ్వరుడనెను.

శ్రీనారాయణ ఉవాచ – శ్రీనారాయణముని (నారదునితో) నిట్లనెను –

**శ్లో॥ ఇత్యుక్త్వా రాధికాఖ్యానం స్మారం స్మారం చ మాధవమ్ ।**
**పులకాంకితసర్వాంగః సాశ్రునేత్రో బభూవ సః ॥ 60**

**శ్లో॥ న కృష్ణసదృశో దేవో న గంగా సదృశీ సరిత్ ।**
**న పుష్కరాత్పరం తీర్థం న వర్ణో బ్రాహ్మణాత్పరః ॥ 61**

**శ్లో॥ పరమాణోః పరం సూక్ష్మం మహావిష్ణోః పరో మహాన్ ।**
**నభః పరం చ విస్తీర్ణం యథా నాస్త్యేవ నారద ॥ 62**

**శ్లో॥ తథా న వైష్ణవాత్ జ్ఞానీ యోగీంద్రః శంకరాత్పరః ।**
**కామక్రోధలోభమోహా జితాస్తేనైవ నారద ॥ 63**

**శ్లో॥ స్వప్నే జాగరణే శశ్వత్ కృష్ణధ్యానరతః శివః ।**
**యథా కృష్ణస్తథా శంభుర్న భేదో మాధవేశయోః ॥ 64**

**శ్లో॥ యథా శంభుర్వైష్ణవేషు యథా దేవేషు మాధవః ।**
**తథేఽదం కవచం వత్స కవచేషు ప్రశస్తకమ్ ॥ 65**

మహేశ్వరుడు ఈ విధముగా పార్వతీదేవికి రాధాదేవియొక్క ఉపాఖ్యానమును చెప్పుచు మాటిమాటికి రాధాపతియగు మాధవుని తలచుకొని అవయవములన్నియు పులకించిపోగా, ఆనందబాష్పములు రాలుచుండగా ఇట్లు చెప్పెను.

శ్రీకృష్ణపరమాత్మవంటి దేవుడు, గంగానదివంటి పవిత్రమైననది, పుష్కర కాలమున పవిత్రమైయున్న తీర్థము, బ్రాహ్మణునివంటి జాతి, పరమాణువునకంటె చిన్నదైన వస్తువు, మహావిష్ణువుకన్న

గొప్పవాడు, ఆకాశముకంటె విశాలమైన వస్తువు. వైష్ణవున కన్న గొప్పజ్ఞాని, శంకరుని మించిన యోగి ఏవిధముగా లేడో అట్లే రాధా కవచముకంటె గొప్ప కవచమేది లేదు.

పరమశివుడు నిద్రలోను, జాగ్రదావస్థలోను ఎల్లప్పుడు శ్రీకృష్ణునే ధ్యానించు చుండును. శివకేశవులమధ్య లేశమైనను భేదములేదు.

విష్ణుభక్తులలో శంకరుడు, దేవతలలో శ్రీమహావిష్ణువు ఏవిధముగా ఉత్తములో అట్లే కవచములన్నిటిలోను **రాధికాకవచమును** సర్వోత్తమమైనది.

**శ్లో॥ శి శబ్దో మంగళార్థశ్చ వ కారో దాతృవాచకః ।**
**మంగళానాం ప్రదాతా యః స శివః పరికీర్తితః ॥ 66**

**శ్లో॥ నరాణాం సంతతం విశ్వే శం కల్యాణం కరోతి యః ।**
**కల్యాణం మోక్ష ఇత్యుక్తం స ఏవ శంకరః స్మృతః ॥ 67**

**శ్లో॥ బ్రహ్మాదీనాం సురాణాం చ మునీనాం వేదవాదినామ్ ।**
**తేషాం చ మహతాం దేవో మహాదేవః ప్రకీర్తితః ॥ 68**

**శ్లో॥ మహతీ పూజితా విశ్వే మూలప్రకృతిరీశ్వరీ ।**
**తస్యా దేవః పూజితశ్చ మహాదేవః స చ స్మృతః ॥ 69**

**శ్లో॥ విశ్వస్థానాం చ సర్వేషాం మహతామీశ్వరః స్వయమ్ ।**
**మహేశ్వరం చ తేనేమం ప్రవదంతి మనీషిణః ॥ 70**

**శ్లో॥ హే బ్రహ్మపుత్ర! ధన్యోఽసి యద్గురుశ్చ మహేశ్వరః ।**
**శ్రీకృష్ణభక్తిదాతా యో భవాన్ పృచ్ఛతి మాం చ కిమ్ ॥ 71**

**'శి'** అను శబ్దము మంగళమను అర్థమునిచ్చును. **'వ'** అను శబ్దము దాత అను అర్థమునిచ్చును. మంగళప్రదాత కావున అతనిని శివుడని పిలుచుచున్నారు. అట్లే మానవులందరకు 'శం' అనగా కల్యాణము లేక మోక్షమునిచ్చువాడు కావున అతడు శంకరుడయ్యెను. బ్రహ్మాది దేవతలకు మునులందరిలోను మహాత్ములైన వారందరకు దేవుడు కావున మహాదేవుడయ్యెను. అట్లే ప్రపంచముననున్న మహాత్ములందరకు ఈశ్వరుడు కావున మహేశ్వరుడని పిలువబడుచున్నాడు.

ఓ నారదా! నీవు చాలా ధన్యుడవు. నీ గురువు శ్రీకృష్ణభక్తిని కలిగించు సాక్షాత్ మహేశ్వరుడు. ఐనను నీవు నన్ను శ్రీకృష్ణసంబంధములైన విషయములను తెల్పుమని అడుగుచున్నందువలన నేను కూడ ధన్యుడనైతిని.

ఇతి శ్రీబ్రహ్మవైవర్తే ద్వితీయే ప్రకృతిఖండే నారదనారాయణ సంవాదే రాధికోపాఖ్యానే తన్మంత్రాది కథనం నామ షట్పంచాశత్తమోఽధ్యాయః ఇతి రాధోపాఖ్యానమ్ ॥



# కృష్ణం వందే జగద్గురుమ్

శ్రీః

శ్రీ వేదాంతదేశిక ప్రణీతమ్

# రఘువీరగద్యమ్

(మహావీర వైభవమ్)

శ్లో॥ శ్రీమాన్ వేంకటనాథార్యః కవితార్కికకేసరీ।
వేదాంతాచార్యవర్యో మే సన్నిధత్తాం సదా హృది॥

శ్లో॥ జయత్యాశ్రితసంత్రాసధ్వాంతవిధ్వంసనోదయః।
ప్రభావాన్ సీతయా దేవ్యా పరమవ్యోమభాస్కరః॥

1) జయ జయ మహావీర!

2) మహాధీరధౌరేయ!

## బాలకాండము

3) దేవాసుర సమర సమయ సముదిత నిఖిల నిర్జర నిర్ధారిత నిరవధిక మాహాత్మ్య!

4) దశవదన దమిత దైవత పరిషదభ్యర్థిత దాశరథిభావ!

5) దినకర కుల కమల దివాకర!

6) దివిషదధిపతి రణ సహచరణ చతుర దశరథ చరమ ఋణ విమోచన!

7) కోసలసుతా కుమారభావ కంచుకిత కారణాకార!

8) కౌమారకేళి గోపాయిత కౌశికాధ్వర!

9) రణాధ్వర ధుర్య భవ్య దివ్యాస్త్రబృంద వందిత!

10) ప్రణతజన విమత విమథన దుర్లలిత దోర్లలిత!

11) తనుతర విశిఖ వితాడన విఘటిత విశరారు శరారు తాటకా తాటకేయ!

12) జడకిరణ శకల ధర జటిల నటపతి మకుటతట నటనపటు విబుధసరి దతిబహుళ మధుగళన లలిత పదనళినరజ ఉపమృదిత నిజవృజిన జహదుపలతను రుచిర పరమ మునివర యువతి నుత!

13) కుశికసుత కథిత విదిత నవ వివిధ కథ!

14) మైథిల నగర సులోచనా లోచన చకోర చంద్ర!

15) ఖండపరశు కోదండ ప్రకాండ ఖండన శౌండ భుజదండ!

16) చండకర కిరణ మండల బోధిత పుండరీకవన రుచి లుంఠాక లోచన!
17) మోచిత జనక హృదయ శంకాతంక!
18) పరిహృత నిఖిల నరపతి వరణ జనకదుహితృ కుచతట విహరణ సముచిత కరతల!
19) శతకోటి శతగుణ కఠిన పరశుధర మునివర కరధృత దురవనమతమ నిజ ధనురాకర్షణ ప్రకాశిత పారమేష్ఠ్య!
20) క్రతుహర శిఖరి కంతుక విహృత్యున్ముఖ జగదరుంతుద జిత హరిదంతి దంత దంతురదశవదన దమన కుశల దశశతభుజ ముఖనృపతికుల రుధిర ఝురభరిత పృథుతర తటాక తర్పిత పితృక భృగుపతి సుగతి విహతికరనతపరుడిషుపరిఘ!

## అయోధ్యాకాండము

21) అనృతభయ ముషిత హృదయ పితృ వచనపాలన ప్రతిజ్ఞావజ్ఞాత యౌవ రాజ్య!
22) నిషాదరాజ సౌహృద సూచిత సౌశీల్యసాగర!
23) భరద్వాజ శాసన పరిగృహీత విచిత్ర చిత్రకూటగిరి కటకతట రమ్యావసథ!
24) అనన్యశాసనీయ!
25) ప్రణత భరత మకుటతట సుఘటిత పాదుకాగ్ర్యాభిషేక నిర్వర్తిత సర్వలోక యోగక్షేమ!
26) పిశిత రుచి విహితదురిత వలమథనతనయ బలిభుగనుగతి సరభస శయనతృణశకల పరిపతన భయచకిత సకల సురమునివర బహుమత మహాస్త్రసామర్థ్య!
27) ద్రుహిణ హర వలమథన దురాలక్ష్య శరలక్ష్య!

## ఆరణ్యకాండము

28) దండకా తపోవన జంగమ పారిజాత!
29) విరాధ హరిణ శార్దూల!

30) విలులిత బహుఫల మఖకలమ రజనిచర మృగ మృగయారంభ సంభృత చీరభృదనురోధ!

31) త్రిశిరః శిరస్త్రితయ తిమిర నిరాసవాసరకర!

32) దూషణ జలనిధి శోషణ తోషిత ఋషిగణ ఘోషిత విజయఘోషణ!

33) ఖరతర ఖర తరు ఖండన చండ పవన!

34) ద్విసప్త రక్షః సహస్ర నలవన విలోలన మహాకలభ!

35) అసహాయశూర!

36) అనపాయసాహస!

37) మహిత మహామృథ దర్శన ముదిత మైథిలీ దృఢతర పరిరంభణ విభవ విరోపిత వికట వీరవ్రణ!

38) మారీచ మాయామృగ చర్మ పరికర్మిత నిర్భర దర్భాస్తరణ!

39) విక్రమ యశోలాభ విక్రీత జీవిత గృధ్రరాజ దేహ దిధక్షా లక్షిత భక్త జన దాక్షిణ్య!

40) కల్పిత విబుధభావ కబంధాభినందిత!

41) అవంధ్య మహిమ మునిజన భజన ముషిత హృదయ కలుష శబరీ మోక్ష సాక్షిభూత!

## కిష్కింధాకాండము

42) ప్రభంజనతనయ భావుక భాషిత రంజిత హృదయ!

43) తరణిసుత శరణాగతి పరతంత్రీకృత స్వాతంత్ర్య!

44) దృఢ ఘటిత కైలాసకోటి వికట దుందుభి కంకాళకూట దూరవిక్షేప దక్ష దక్షిణేతర పాదాంగుష్ఠ దరచలన విశ్వస్త సుహృదాశయ!

45) అతిపృథుల బహువిటపి గిరి ధరణి వివర యుగపదుదయ వివృత చిత్రపుంఖ వైచిత్ర్య!

46) విపుల భుజశైలమూల నిబిడ నిపీడిత రావణ రణ రణక జనక చతురుదధి విహరణ చతుర కపి కులపతి హృదయ విశాల శిలాతల దారణ దారుణ శిలీముఖ!

## సుందరకాండము

47) అపార పారావార పరిఖా పరివృత పరపుర పరిసృత దవదహన జవన పవనభవ కపివర పరిష్వంగ భావిత సర్వస్వదాన!

## యుద్ధకాండము

48) అహిత సహోదర రక్షః పరిగ్రహ విసంవాది వివిధ సచివ విస్రంభణ సమయ సంరంభ సముజ్జృంభిత సర్వేశ్వరభావ!

49) సకృత్ ప్రపన్నజన సంరక్షణ దీక్షిత!

50) వీర!

51) సత్యవ్రత!

52) ప్రతిశయన భూమికా భూషిత పయోధిపులిన!

53) ప్రళయ శిఖి పరుష విశిఖ శిఖా శోషితాకూపార వారిపూర!

54) ప్రబల రిపు కలహ కుతుక చటుల కపికుల కరతల తూలిత హృత గిరి నికర సాధిత సేతుపథసీమా సీమంతిత సముద్ర!

55) ద్రుతగతి తరుమృగ వరూథినీ నిరుద్ధ లంకావరోధ వేపథు లాస్యలీలోప దేశ దేశిక ధనుర్జ్యాఘోష!

56) గగనచర కనకగిరి గరిమధర నిగమమయ నిజగరుడ గరుదనిల లవ గళిత విషవదన శరకదన!

57) అకృతచర వనచర రణకరణ వైలక్ష్య కూణితాక్ష బహువిధ రక్షోబలాధ్యక్ష వక్షఃకవాట పాటన పటిమ సాటోప కోపావలేప!

58) కటు రటద్ అటని టంకృతి చటుల కఠోర కార్ముక వినిర్గత విశంకట విశిఖ వితాడన విఘటిత మకుట విహ్వల విశ్రవస్తనయ విశ్రమసమయ విశ్రాణన విఖ్యాత విక్రమ!

59) కుంభకర్ణ కులగిరి విదళన దంభోళిభూత నిఃశంక కంకపత్ర!

60) అభిచరణ హుతవహ పరిచరణ విఘటన సరభస పరిపత దపరిమిత కపిబల జలధిలహరి కలకలరవ కుపిత మఘవజిదభిహననకృదనుజ సాక్షిక రాక్షస ద్వంద్వయుద్ధ!

61) అప్రతిద్వంద్వ పౌరుష!

62) త్ర్యంబక సమధిక ఘోరాస్త్రాడంబర!
63) సారథి హృత రథ సత్రప శాత్రవ సత్యాపిత ప్రతాప!
64) శిత శర కృతలవన దశముఖ ముఖదశక నిపతన పునరుదయ దరగళిత జనిత దర తరళ హరిహయ నయన నళినవన రుచి ఖచిత ఖతల నిపతిత సురతరు కుసుమ వితతి సురభిత రథపథ!
65) అఖిలజగ దధిక భుజబల వరబల దశలపన లపనదశక లవన జనిత కదన పరవశ రజనికరయువతి విలపన వచన సమవిషయ నిగమ శిఖర నికర ముఖరముఖ మునివర పరిపణిత!
66) అభిగత శతమఖ హుతవహ పితృపతి నిర్ఋతి వరుణ పవన ధనద గిరిశముఖ సురపతి నుతి ముదిత!
67) అమిత మతి విధి విదిత కథిత నిజ విభవ జలధి పృషత లవ!
68) విగతభయ విబుధ పరివృఢ విబోధిత వీరశయన శాయిత వానర పృతనౌఘ!
69) స్వసమయ విఘటిత సుఘటిత సహృదయ సహధర్మచారిణీక!
70) విభీషణ వశంవదీకృత లంకైశ్వర్య!
71) నిష్పన్నకృత్య!
72) ఖపుష్పిత రిపుపక్ష!
73) పుష్పక రభసగతి గోష్పదీకృత గగనార్ణవ!
74) ప్రతిజ్ఞార్ణవ తరణ కృతక్షణ భరత మనోరథ సంహిత సింహాసనాధిరూఢ!
75) స్వామిన్!
76) రాఘవసింహ!

## ఉత్తరకాండము

77) హాటకగిరి కటక లడహ పాదపీఠ నికటతట పరిలుఠిత నిఖిల నృపతి కిరీట కోటి వివిధ మణిగణ కిరణ నికర నీరాజిత చరణరాజీవ!
78) దివ్య భౌమాయోధ్యాధిదైవత!
79) పితృవధ కుపిత పరశుధరముని విహిత నృపహనన కదన పూర్వకాల ప్రభవ శతగుణ ప్రతిష్ఠాపిత ధార్మిక రాజవంశ!
80) శుభచరిత రత భరత ఖర్విత గర్వ గంధర్వ యూథ గీత విజయగాథాశత!

81) శాసిత మధుసుత శత్రుఘ్నసేవిత!
82) కుశలవ పరిగృహీత కులగాథావిశేష!
83) విధివశ పరిణమ దమరభణితి కవివర రచిత నిజచరిత నిబంధన నిశమన నిర్వృత!
84) సర్వజన సమ్మానిత!
85) పునరుపస్థాపిత విమానవర విశ్రాణన ప్రీణిత వైశ్రవణ విశ్రావిత యశః ప్రపంచ!
86) పంచతాపన్న మునికుమార సంజీవనామృత!
87) త్రేతాయుగ ప్రవర్తిత కార్తయుగ వృత్తాంత!
88) అవికల బహుసువర్ణ హయమఖ సహస్ర నిర్వహణ నిర్వర్తిత నిజవర్ణాశ్రమధర్మ!
89) సర్వకర్మ సమారాధ్య!
90) సనాతనధర్మ!
91) సాకేతజనపద జనిధనిక జంగమ తదితర జంతుజాత దివ్యగతి దాన దర్శిత నిత్య నిస్సీమ వైభవ!
92) భవ తపన తాపిత భక్తజన భద్రారామ!
93) శ్రీరామభద్ర!
94) నమస్తే పునస్తే నమః!
95) చతుర్ముఖేశ్వరముఖైః పుత్రపౌత్రాదిశాలినే।
నమః సీతాసమేతాయ రామాయ గృహమేధినే॥

శ్లో॥ కవి కథక సింహ కథితం కఠోర సుకుమార గుంభ గంభీరమ్।
భవ భయ భేషజమేతత్ పఠత మహావీరవైభవం సుధియః॥

శ్లో॥ కవితార్కికసింహాయ కల్యాణగుణశాలినే।
శ్రీమతే వేంకటేశాయ వేదాంతగురవే నమః॥

---

**హరే రామ హరే రామ రామ రామ హరే హరే।**
**హరే కృష్ణ హరే కృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే॥**

# గరుడ దండకః - వేదాంత దేశిక ప్రణీతమ్

శ్రీమాన్ వేంకటనాథార్యః కవితార్కికకేసరీ।
వేదాంతాచార్యవర్యో మే సన్నిధత్తాం సదా హృది॥

నమః పన్నగనద్ధాయ వైకుంఠవశవర్తినే।
శ్రుతిసింధుసుధోత్పాద మందరాయ గరుత్మతే॥

గరుడమఖిలవేదనీడాధిరూఢం ద్విషత్పీడనోత్కంఠితాకుంఠ వైకుంఠ పీఠీకృత స్కంధ మీడే స్వనీడాగతి ప్రీత రుద్రా సుకీర్తి స్తనాభోగ గాఢోప గూఢం స్ఫుర త్కంటకవ్రాత వేధవ్యథా వేపమాన ద్విజిహ్వాధిపా కల్ప విష్ఫార్య మాణ స్ఫటావాటికా రత్న రోచిశ్ఛటారాజి నీరాజితం కాంతి కల్లోలినీ రాజితమ్।

జయ గరుడ సుపర్ణ దర్వీకరాహార దేవాధిపాహారహారిన్ దివౌకస్పతిక్షిప్త దంభోళి ధారా కిణాకల్ప కల్పాంతవాతూలకల్పోదయానల్ప వీరాయి తోద్య చ్చమత్కార దైత్యారి జైత్రధ్వజారోహ నిర్ధారి తోత్కర్ష సంకర్షణాత్మన్ గరుత్మన్ మరుత్పంచ కాధీశ సత్యాదిమూర్తే న కశ్చిత్ సమ స్తే నమ స్తే పున స్తే నమః।

నమ ఇద మజహత్సపర్యాయ పర్యాయనిర్యాత పక్షానిలాస్ఫాలనోద్వేల పాథోధివీచీ చపేటాహతాగాధపాతాళ భాంకార సంక్రుద్ధ నాగేంద్ర - పీడాసృణీభావ - భాస్వ న్నఖశ్రేణయే, చండతుండాయ, నృత్యద్భుజంగభ్రువే వజ్రిణే దంష్ట్రయా తుభ్య మధ్యాత్మవిద్యా విధేయా విధేయా భవద్దాస్య మాపాదయేథాః దయేథాశ్చ మే।

మను రనుగత పక్షివక్త్ర స్ఫురత్తారక స్తావక శ్చిత్రభానుప్రియా శేఖర స్త్రాయతాం న స్త్రివర్గాపవర్గప్రసూతిః పరవ్యోమధామన్ బలద్వేషి దర్పజ్వల ద్వాలఖిల్య ప్రతిజ్ఞావతీర్ణ స్థిరాం తత్త్వబుద్ధిం పరాం భక్తిధేనుం జగన్మూలకందే ముకుందే మహానందదోగ్ధ్రీం దధీథా ముధా కామహీనా మహీనా మహీనాంతక।

షట్త్రింశత్ గణచరణో నరపరిపాటీ నవీనగుంభగుణః।
విష్ణురథదండకో2సౌ విఘటయతు విపక్షవాహినీ వ్యూహమ్॥

విచిత్రసిద్ధిత స్సో2యం వేంకటేశవిపశ్చితా।
గరుడధ్వజతోషాయ గీతో గరుడదండకః॥

# ఓం ద్రాం దత్తాత్రేయాయ స్వాహా

## శ్రీదత్తస్తోత్రమ్

శ్లో॥ వజ్రాఙ్కుశధ్వజాబ్జాఙ్కయుగ్రక్తాబ్జాభపత్తలమ్ ।
నఖమాణిక్యభాధ్వస్తభక్తహార్దతమస్తతిమ్ ॥

శ్లో॥ గూఢగుల్ఫం కూర్మపృష్ఠోల్లసత్పాదోపరిస్థలమ్ ।
పరిపుష్టసుజఙ్ఘోరుం విశాలజఘనస్థలమ్ ॥

శ్లో॥ పృథుశ్రోణిం చ కాకుత్స్థం చారునాభిం దలోదరమ్ ।
కపాటవక్షసం దీర్ఘమాంసలోరగవద్భుజమ్ ॥



శ్లో॥ సుచిహ్నచిహ్నితకరం కమ్బుకణ్ఠం స్మితాననమ్ ।
స్నైగ్ధ్యధావల్యయుక్తాక్షం చలత్పిఙ్గజటాధరమ్ ॥

శ్లో॥ చన్ద్రకాన్తం ప్రభం కృష్ణభ్రూరశ్మశ్రుకనీనికమ్ ।
భావశుద్ధద్విజాకీర్ణం ప్రసన్నముఖపఙ్కజమ్ ॥

శ్లో॥ సిద్ధాసనసమాసీనం వరాభయదసత్కరమ్ ।
క్షణేక్షణేఽపి సద్భక్తస్మృతిగామినమీశ్వరమ్ ॥

శ్లో॥ అనుగ్రహాఖ్యహృత్స్థేన్దుజ్ఞాపితస్మితచన్ద్రికమ్ ।
సదాఽఖణ్డసమాధిస్థం దత్తాత్రేయం దిగమ్బరమ్ ॥

శ్లో॥ ఆసేచనకమూర్తిం తం సదాఽఽపాదాద్భుదాముఖమ్ ।
ధ్యాయేత్సమాహితో యోగీ నివృత్తాఖిలవృత్తికః ॥

**(ప.ప. శ్రీ వాసుదేవానందసరస్వతీవిరచితదత్తపురాణమ్ 1-8)**

**ప్ర:** వజ్ర+అంకుశ+ధ్వజ+అబ్జ+అంకయుక్ = వజ్రాయుధము, అంకుశము, ధ్వజము, పద్మము, ఈ గుర్తులతో కూడిన, రక్త+అబ్జాభ = ఎఱ్ఱతామరకాంతిగల, పద్+తలమ్ = పాదముల ప్రదేశము గల, నఖమాణిక్యభా = కాలిగోళ్ళమాణిక్యకాంతితో, ధ్వస్త = తొలగించబడిన, భక్తహార్దతమః+తతిమ్ = భక్తుల హృదయమందలి తమోగుణసమూహము గలవానిని, గూఢగుల్ఫమ్ = దాచి యుంచిన మడమలు గలవానిని, కూర్మపృష్ఠ+ఉల్లసత్ = తాబేలు మూపువలె ప్రకాశించు, పాదోపరిస్థలమ్ = పాదపు పై ప్రదేశముగలవానిని, పరిపుష్ట = బొద్దుగా బలముగా గల, సుజంఘ+ఊరుమ్ = చక్కని క్రీగాళ్ళును, తొడలును గలవానిని, విశాలజఘనస్థలమ్ = విశాలమైన కటిప్రదేశము గలవానిని, పృథుశ్రోణిమ్ = విశాలమైన నడుముప్రదేశము గలవానిని, చ = మరియు, కాకుత్స్థమ్ = సూర్యవంశపువాడును, చారునాభిమ్

= అందమైన నాభిగలవానిని, దల+ఉదరమ్ = పలుచని పొట్టగలవాడును, కపాటవక్షసమ్ = కపాటమువలె విశాలమైన వక్షముగలవానిని, దీర్ఘమాంసల+ ఉరగవత్+భుజమ్ = పొడవైన, బలిసిన, పామువలె నున్న భుజములు గలవానిని, సుచిహ్నాచిహ్నితకరమ్ = మంచి సాముద్రికచిహ్నములు గల అరచేతులు గలవానిని, కంబుకంఠమ్ = శంఖమును బోలిన మెడగలవానిని, స్మితాననమ్ = నగుమోము గలవానిని, స్నైగ్ధ్యధావల్యయుక్త+ అక్షమ్ = నిర్మలమైన తెల్లనికన్నులుగలవానిని, చలత్ పింగజటాధరమ్ = కదలుచున్న పసుపుడాలు ఎఱుపురంగుగల జడలను ధరించిన వానిని, చన్ద్రకాన్తమ్ = చంద్రునివలె ఆకర్షణగల, ప్రభమ్ = కాంతిగల వానిని, కృష్ణభ్రూః = నల్లని కనుబొమలు గలవాడును, అశ్మశ్రు = మసకగాని, కనీనికమ్ = కనుగ్రుడ్డు గలవానిని, భావశుద్ధద్విజాకీర్ణమ్ = హృదయమువలె మాలిన్యములేని పలువరుసను చిక్కగా గలవానిని, ప్రసన్నముఖపంకజమ్ = ప్రశాంతమైన పద్మమువలె శోభగల ముఖముగలవానిని, సిద్ధాసనసమాసీనమ్ = సిద్ధాసనమున సుఖముగ కూర్చున్నవానిని, వర+అభయద = వరములను అభయమును ప్రసాదించు, సత్ కరమ్ = శుభమైన చేయి గలవానిని, క్షణే క్షణే అపి = ప్రతిక్షణమును, సత్ + భక్తస్మృతిగామినమ్ = నిజమైన భక్తుల మనస్సులలో నిల్చియుండువానిని, ఈశ్వరమ్ = ప్రభువైన వానిని, అనుగ్రహ+ఆఖ్య = అనుగ్రహము అని పేరుగల, హృత్స్థ = హృదయమందున్న, ఇందుజ్ఞాపిత = చంద్రుని తలపించు, స్మితచన్ద్రికమ్ = నవ్వు వెన్నెల గురియు వానిని, సదా = ఎల్లప్పుడు, అఖణ్డసమాధిస్థమ్ = చెదరని (నిర్వికల్ప) సమాధియందుండు వానిని, దత్తాత్రేయం దిగంబరమ్ = దిగంబరుడైన దత్తాత్రేయుని, నిత్యతృప్తుని, సదా = ఎల్లప్పుడును, తమ్ = వానిని, ఆ ప్రభువును, ఆపాదాద్మూర్ధాముఖమ్ = పాదముల నుండి శీర్షము వరకును గల, ఆసేచనకమూర్తిమ్ = నిత్యతృప్తుడైన ఆనందమూర్తిగలవానిని, నివృత్త+అఖిల వృత్తికః = తొలగింపబడిన సమస్తవ్యాపారములుగలవాడైన, యోగీ = యోగి, సమాహితః = ఏకాగ్రత గలవాడై, ధ్యాయేత్ = ధ్యానింపదగును.

**తా:** శ్రీదత్తప్రభువు నిత్యతృప్తుడు, దిగంబరుడు, నగుమోముతో ప్రసన్నరూపము గలవాడు. మడమలు కనరాకుండ సిద్ధాసనమును కూర్చున్నవాడు. వాని పాదములపైభాగము తాబేలుమూపువలె నుండగా, వాని పిక్కలు తొడలు పుష్టిగా నుండును. వాని నడుము, విశాలమైనది. వాని నాభి అందమైనది, పొట్ట పలుచనైనది, ఱొమ్ము విశాలమైనది, వాని భుజములు పొడవుగా బలిసిన పాములవలె నున్నవి. వాని అరచేతులలో మహాపురుష సాముద్రిక చిహ్నములున్నవి. అందమైన వాని మెడ శంఖము వంటిది. వాని కన్నులు తెల్లగా నిర్మలమై యున్నవి. కదులుచున్న పసుపు ఎఱుపు కలిసిన రంగుతో నున్న జడలు గట్టి శిరోజములు గలవాడు. వెన్నెలవలె తెల్లనివాడు. నల్లని కనుబొమలు, తెల్లని కనుగ్రుడ్లు, మలినములేని పలువరుసతో, ప్రసన్నమైన ముఖవర్చస్సుతో, వరదముద్రను, అభయముద్రను పట్టిన హస్తములు గలవాడు. భక్తుల మనస్సులలో అనుక్షణము నిల్చియుండువాడు. ఈ ప్రసన్నప్రభుమూర్తిని సర్వసంగపరిత్యాగియైన యోగి ఏకాగ్రతతో ధ్యానింపదగును.



